# ముళ్ళపూడి వెంకటరమణ

## సాహితీ సర్వస్వం

### ఆరవ సంపుటం

## సినీరమణీయం - 1



# ముళ్లపూడి వెంకటరమణ

## సాహితీ సర్వస్వం

ఆరవ సంపుటం

# సినీరమణీయం - 1

సంపాదకుడు: ఎమ్బీయస్ ప్రసాద్



**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

**Mullapudi Venkata Ramana Saahithee Sarvaswam–6**
**CINERAMANEEYAM-1 - *Editor: M.B.S. Prasad***

ప్రచురణ నెం. : 2350/39

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : డిశంబరు, 2004



ముఖపత్రం, లోపలి బొమ్మలు: బాపు

**వెల: రూ. 150/-**
**విదేశాల్లో వెల: $ 15**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



అక్షరాలంకారం: ట్వంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 24066986
ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్,** హిమాయత్‌నగర్, హైదరాబాద్.



హాస్యం రాసుకునే కుర్రాడి చేత 'హైడ్రామా' వున్న 'రక్తసంబంధం' ఎలా రాయిస్తారయ్యా
అంటూ నాటి నిర్మాతలూ మేటి రచయితలూ పెచ్చెరుకలు చెలుతూంటే-
హాస్యం రాయగలవాడికే హైడ్రామా హైట్సూ డెప్త్సూ ఎరుకపడతాయనే
అని జవాబు విసిరి - ప్రేమతో, ఓర్పుతో, నేర్పుతో నన్ను భరించి నా చేత
రాయించి జయించిన ~ ఎందరో కొత్త ఆర్టిస్టులనూ టెక్నీషియన్లనూ
ప్రోత్సహించి ముందుకు నడిపించిన జయప్రయోక్త

శ్రీ డూండీ గారికి
గౌరవాభిమానంతో

ముళ్ళపూడి వెంకటరమణ - జూన్ 2004

# రమణ ధర్మక్షేత్రం సినిమా రంగమే!

రమణ నిస్సందేహంగా సాహిత్యకారులే! కథకుడుగా, విమర్శకుడుగా, వ్యాసకర్తగా, అనువాదకర్తగా చేవ చూపినవారే! కానీ ఆయన పేరు జనాల నోళ్లలో ఇప్పటికీ నానుతోందంటే దానికి కారణం - సినీరంగమే! సినిమాలలోకి వచ్చి 'రాయని భాస్కరుడై' రమణ కథారంగానికి అన్యాయం చేశారని వేలాది సాహితీప్రియులు వాపోవచ్చుకాక! కానీ కోట్లాది ప్రజలకు రమణను చేరువ చేసింది చిత్రపరిశ్రమే! ఓ మాదిరి చదువుకున్నవారిలో ఎంతమందికి 'కానుక' తెలుసు? ఎంతమందికి 'రాజకీయ బేతాళ పంచవింశతి' తెలుసు? అదే దారిలో కొనసాగివుంటే రమణ పేరు డ్రాయింగ్‌రూమ్స్‌లో మాత్రం వినబడుతూ ఉండేదేమో! ఈనాడు జనాభాలో ఎంత శాతం మందికి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మల్లాది రామకృష్ణశాస్త్రి, బుచ్చిబాబు, కుటుంబరావు వంటి గొప్ప కథకుల పేర్లు తెలుసు?

కానీ చదువుకోనివారుసైతం రమణ పేరు గుర్తుపెట్టుకునేట్లా చేసినవి - ఓ 'బుద్ధిమంతుడు', ఓ 'ముత్యాలముగ్గు', ఓ 'సంపూర్ణ రామాయణం', ఓ 'పెళ్లిపుస్తకం'! 'బాపు సినిమా' అనే ఓ శైలి, ఓ స్కూలు ఆఫ్ థాట్, ఏర్పడిపోయింది. ఎంతో గహనమైన విషయాన్ని కూడా సులభమైన సరళిలో చెప్పడం, సున్నితమైన చమత్కారం, ఆరోగ్యకరమైన హాస్యం, కళను ఉద్ధరిస్తున్నామన్నట్టు హంగామా చేయకుండా కళాత్మకమైన చిత్రీకరణ, సహజత్వానికి దగ్గరగా ఉంటూనే కుటుంబసమేతంగా చూడగల కమ్మర్షియల్ సినిమా తీయగలగడం, సంగీత సాహిత్యాలకు ప్రాధాన్యత నివ్వడం - ఇవన్నీ బాపు - రమణ సినిమాల హాల్‌మార్క్ అయిపోయాయి. ఇప్పుడు బుల్లితెరపై వస్తున్న 'భాగవతం' ధర్మమాని ఇంటింటా బాపు - రమణల పేర్లు మారుమ్రోగుతున్నాయి. అందువల్ల సినిమారచనే రమణ స్వధర్మం అనవచ్చు.

సినిమా రచన చేయడం మాటలు కాదు. నాటకీయత ఉండాలి, కానీ సంభాషణలు నాటకీయంగా ఉండకూడదు. సంభాషణలు పదునుగా ఉండాలి, కానీ దృశ్యానికి ప్రాధాన్యత ఇవ్వాలి. ఫోటోగ్రాఫర్ రచయితను డామినేట్ చేసినా, రచయిత డైరెక్టరును డామినేట్ చేసినా సరైన సినిమా రూపొందదు. విషయం పాతదే అయినా కొత్తగా చెప్పగలగాలి, అదే సమయంలో సామాన్య ప్రేక్షకుడిని విస్మరించి నేల విడిచి సాము చేయకూడదు. నాటకాల ప్రేక్షకులు, సినిమా ప్రేక్షకులు ఇంచుమించు ఒకలాటివారేనన్న అభిప్రాయంతో తొలిదశలో నాటకాలను సినిమాలుగా మలచడం జరిగింది. నాటక రచయితలే సినిమా రచయితలుగా మారారు.


రమణ రాసిన తొలి వెండితెర నవల - వెలుగునీడలు

పింగళి, సుంకర - వాసిరెడ్డి, ఆత్రేయ, భమిడిపాటి రాధాకృష్ణ, బొల్లిముంత, గణేష్‌పాత్రో, జంధ్యాల, భరణి - ఇలా ఎందరో సినిమా రచయితలకు నాటకరచనానుభవం ఉపకరించింది. కానీ రమణకు ఆ ఎడ్వాంటేజి లేదు. కనీసం నవల రాసిన అనుభవమైనా లేదు. ఆయనకున్న పెట్టుబడల్లా దేశవిదేశాల సినిమాలు విమర్శనాత్మకంగా చూసిన అనుభవం మాత్రమే! ఏ సబ్జక్ట్‌నైనా అందరికీ అర్థమయ్యే తీరులో చెప్పగల నేర్పు ఎలాగూ వుంది. నాలుగు దశాబ్దాల క్రితం అక్షరాస్యుల సంఖ్య, అందునా వారపత్రికలు చదివేవారి సంఖ్య పెద్దగా ఉండివుండదని గుర్తుంచుకుంటే ఆయన పేరు ఎక్కువమంది నోళ్లలో నాని వుండదని ఊహించవచ్చు. మరి ఏ ధైర్యంతో ఆయన సినిమారంగంవైపు మళ్లారు? ఏ ధైర్యంతో నిర్మాతలు ఆయనను ప్రోత్సహించారు?

1960లో రమణ ఆంధ్రపత్రిక ఉద్యోగానికి రాజీనామా చేయడం, సినిమాలలో రాసే అవకాశం వస్తుందన్న ధీమాతో కాదు! రెండువందల రూపాయల జీతమిచ్చే ఉద్యోగం వదిలిపెట్టి వచ్చి ఏం చేయాలో అప్పటికి ఆయనకూ తెలియదు. అందుకే ఆంధ్రపత్రిక అధినేత శంభుప్రసాద్‌గారు ఉద్యోగం మానవద్దని వారించారు. 'నచ్చకుండా ఉద్యోగంలో కొనసాగేకంటే ఫ్రీ లాన్సర్‌గా ఉండి ఆర్టికల్స్ రాస్తాను సార్' అని వెలుపలికి నడిచారు రమణ. 1961, 62 లలో ఫ్రీ లాన్సర్‌గా జీతానికి మూడురెట్లు ఎక్కువ సంపాదించారు. ఎల్. ఐ. సి. మాన్యువల్ ఆంధ్రీకరించే పని ఒకటి వచ్చింది. మాటకు అణా ఇస్తానంటే బేడ ఇమ్మని డిమాండ్ చేసి మరీ పుచ్చుకున్నారు రమణ. అలాగే పిటి 109 (సాహితీసర్వస్వం 8 వ సంపుటంలో వస్తోంది) అనువాదం పని వచ్చింది. అప్పుడు బాపు పబ్లిసిటీ రంగంలో పనిచేస్తూండేవారు. యాడ్స్‌కు కాపీరైటింగ్ పని వస్తే రమణను రికమెండ్ చేసేవారు. మాటకు రెండణాలు ఇచ్చేవారు. ఓసారి నాగేశ్వరరావుగారి అన్నపూర్ణా పల్వరైజింగ్ మిల్స్‌కు కాప్షన్‌రాసే పని వచ్చింది -

'దంచేస్తాం, పొడి చేస్తాం' అని చెప్పడం వినయవంతుల లక్షణం కాదు
కానీ మేం చేసేది అదే మరి!

రాళ్లను దంచి కొట్టడం, బొగ్గును పొడిచేయడం!

చెప్పుకోపోతే ఎలా?'

అని రాసి యిచ్చారు రమణ!



భార్యాభర్తలు

ఆంధ్రపత్రిక వీక్లీలో ఉండగా సినిమా పేజీలు చూస్తూండేవారు కాబట్టి రమణకు సినీరంగ ప్రముఖులతో పరిచయాలు బాగానే వుండేవి. అప్పట్లో సినిమాలకు వెండితెరనవలలు వెలువరించే సంప్రదాయం ఉండేది. ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వంలో అక్కినేని నాగేశ్వరరావు, దుక్కిపాటి మధుసూదనరావులు నిర్మించిన 'వెలుగునీడలు' సినిమా వెండితెర నవల రాసే అవకాశం వచ్చింది. రూపాయి ధర ఉన్న ఆ నవల ఒక వారంలోనే పదివేల కాపీలు అమ్ముడుపోయి రికార్డు సృష్టించింది. దాని తర్వాత 'భార్యాభర్తలు' అవకాశం. వెండితెరనవల చదివి దర్శకుడు ప్రత్యగాత్మ 'ఈ నవల గాని నేను ముందు చదివివుంటే సినిమా ఇంకా బాగా తీద్దును' అన్నారట. రమణ పరిశీలనాశక్తి, భావప్రకటనాశక్తి అంత గొప్పవి. తదుపరి అవకాశం 'ఇద్దరుమిత్రులు'. ముచ్చటగా మూడే రాసినా వెండితెరనవలలు రాయడంలో తనదంటూ ఒక ముద్ర వేసి, తరువాతివారు ఆయనను అనుకరించేటంత గొప్పగా రాశారు రమణ.





ఆత్మవిశ్వాసంతో ఇలా ముందుకుసాగిపోతున్న రమణను సినిమా అవకాశం డి.బి. నారాయణ రూపంలో వెతుక్కుంటూ వచ్చింది. డి.బి. నారాయణగా పేరు కెక్కిన దినవహి భాస్కర నారాయణ మంచి అభిరుచిగల నిర్మాత, ఎవియమ్‌లో జనరల్ మేనేజరుగా చేశారు. ఎస్ భావనారాయణ అనే మరో నిర్మాతతో కలిసి 'అమరసందేశం' అనే సినిమాతీసి ఆదుర్తి సుబ్బారావును దర్శకుడిగా పరిచయం చేశారు. బండరాముడు, పెంకిపెళ్లాం ఇత్యాది సినిమాలు తీశారు. కాస్త పేరు,






దాగుడుమూతలు - ఫ్రాంక్ కాప్రా సినిమా ఆధారంగా తయారైన రమణ తొలి రచన.

మరికాస్త డబ్బు మూటగట్టుకుని స్వంతంగా డి.బి.ఎన్. ప్రొడక్షన్స్ స్థాపించి పెండ్లిపిలుపు తీశారు. ఇంకో సినిమా తీద్దామనుకున్నారు.

అప్పటిదాకా నాగేశ్వరరావుతోనే ఎక్కువగా సినిమాలు తీస్తున్న ఆనాటి మేటి దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు దర్శకత్వంలో తొలిసారిగా ఎన్.టి. రామారావు కథానాయకుడుగా సినిమా తీద్దామని ఆయన ప్రయత్నం. మంచికథ కావాలి. కామెడీ ఉండాలి. సెంటిమెంటూ ఉండాలి. ఆదుర్తిని సంప్రదిస్తే గారీ కూపర్ నటించిన 1936 నాటి సినిమా 'మిస్టర్ డీడ్స్ గోస్ టు టౌన్' సినిమా ఆధారంగా కథ రాయించమన్నారు. సి.బి. కెల్లండ్ రాసిన 'ఒపేరా హ్యాట్' కథ ఆధారంగా సుప్రసిద్ధ దర్శకుడు ఫ్రాంక్ కాప్రా తీసిన ఆ కామెడీ సినిమాలో ఓ పల్లెటూరి కుర్రాడికి ఓ ధనవంతుని ఆస్తి ముదనష్టంగా కలిసివస్తే పడే పాట్లూ అవీ హాస్యస్ఫోరకంగా చూపించారు.ఆ డబ్బుతో అతను మంచిపనులు చేయబోతే ఆ ధనవంతుడి బంధువులు అతన్ని పిచ్చివాడని ముద్ర వేసి గెంటేస్తారు. ఈ కథను మన వాతావరణంలోకి తీసుకొచ్చి మెప్పించాలి.

అప్పటికే డి.బి. నారాయణ రమణ చిత్రసమీక్షలూ అవీ చదివివున్నారు. జనతా ఎక్స్‌ప్రెస్ కథా చదివివున్నారు. ఆ డబ్బున్నాయన బంధుగణంలో జనతా ఎక్స్‌ప్రెస్ కారెక్టర్లు అవీ జోడిస్తే బాగుంటుందనుకున్నారు. రమణను పిలిపించి 'మా సినిమాకి కథ రాయి' అన్నారు. రమణ సందేహిస్తూంటే ధైర్యం చెప్పారు. రమణ రాయడం పూర్తయాక ఆదుర్తి సుబ్బారావుగారికి కథ చెప్పమన్నారు.

సినిమా కథ ఆసక్తికరంగా దర్శకనిర్మాతలకు చెప్పడం అనేది ఒక ప్రత్యేకమైన కళ. కథరాసి పాఠకులను మెప్పించడం వేరు, ఇది వేరు. కథను కళ్లకట్టినట్టు చెప్పగలగాలి. అది తెరపై ఎలా ఉంటుందో దర్శకుడు ఊహించుకని ఓహో అనే తీరులో చెప్పగలగాలి. అప్పటికింకా ఆ విద్య రమణకు పట్టుబడలేదు. తను టెక్నికలర్లో ఊహించుకున్నదంతా వివరంగా ఏ స్తంభం చాటున ఏ పాత్ర నక్కివుండాలో కూడా వివరించి చెప్పడం మొదలుపెట్టారు. వింటున్న ఆదుర్తి సుబ్బారావుకు విసుగొచ్చింది. అసలే కొత్త రచయిత. పైగా సెట్టింగులతో సహా చెప్పేస్తున్నాడు. 'ప్రతీవాడు వచ్చి కథ చెప్పడమే!' అని విసుక్కుంటూ బయటకు వెళ్లిపోయారు.

రమణకు బాధ వేసింది. సినీరంగానికి తను పనికిరానన్న భయం వేసింది. 'తనకు వచ్చిన పని చేసుకోక ఎందు కొచ్చిన అవస్త ఇది' అనుకున్నాడు. 'వెళ్లొస్తా సార్' అన్నాడు. 'వెళిపోతే తంతా' అన్నారు డిబి కోపంగా. 'నువ్వు ఈ రంగానికి సంబంధించినవాడివే! నీ ధర్మక్షేత్రం, కర్మక్షేత్రం ఇదే! నీపై నాకు గట్టినమ్మకం ఉంది. ఈ పాటి కామెంట్స్‌కే బెదిరిపోతే ఎలా, నువ్వు సినిమారంగంలో ఫెయిల్ అయితే నా జడ్జిమెంటుకు ఇన్సల్టు' అన్నారు ధాటీగా. ఆయన తనపై చూపిన నమ్మకాన్ని, వాత్సల్యాన్ని రమణ ఎన్నటికీ విస్మరించలేదు.



**రక్తసంబంధం - రమణ తొలి చిత్రం**

రమణ ప్రతిభను తొలిరోజుల్లోనే గుర్తుపట్టి, నమ్మకం పెట్టుకుని ప్రోత్సహించిన మరొక నిర్మాత డూండీ. ప్రముఖ ఎగ్జిబిటర్ పోతిన శ్రీనివాసరావుగారి తనయులు. ప్రఖ్యాత డిస్ట్రిబ్యూటర్ సుందర్‌లాల్ నహతాతో కలిసి 'రక్తసంబంధం' (1962) సినిమాను నిర్మిస్తూ సంభాషణల రచయితగా రమణను నియమించారు. 'రక్తసంబంధం'కు మూలం 'పాశమలర్'. అన్నా చెల్లెళ్ల సెంటిమెంటుతో సాగే హెవీ మెలోడ్రామా తమిళచిత్రం. రామారావు, సావిత్రి, కాంతారావుల భారీ తారాగణం.



రక్తసంబంధం - ఎమోషనల్ డ్రామా

'అటువంటి సినిమాకు కామెడీరైటర్స్‌ను పెట్టుకోవడమా, హవ్వ! దూండీకి మతిపోయింది' అన్న విమర్శను పట్టించుకోకుండా ఛాన్సిచ్చారు. అందుకే రమణ ఆయనకు ఈ సంపుటాన్ని అంకితమిస్తున్నారు.

'రక్తసంబంధం' సినిమాలో రమణ, 'నువ్వు నీ జీవితానికి పునాదులూ వాళ్ల పతనానికి గోతులూ

యజమాని కార్మిక నాయకుడితో) వంటి హెవీ డైలాగులూ రాశారు. అప్పారావు, రెండుజెళ్ల సీతను తెరమీదకు తీసుకొచ్చి హాస్యం పండించారు. తన కలానికి రెండువైపులా పదునని నిరూపించారు. 'రక్తసంబంధం' హిట్ అయింది. 'రక్తసంబంధం' డైరక్టరు వి. మధుసూదనరావు ఆదుర్తి వద్ద అసిస్టెంటుగా పనిచేసి వెళ్లినవారే! ఆయన డైరక్షన్‌లోనే దూండీ మరో రీమేక్ చిత్రం 'గుడిగంటలు' తీశారు. అదీ భారీ తారాగణంతో ఉన్న సీరియస్ చిత్రమే! దానికీ రచన రమణే! మచ్చుకు ఓ డైలాగు – 'పెదవులమీది చిరునవ్వు అల్పమైన సుఖానికి, సంతోషానికి పుడుతుంది. ఇట్టే చెరిగిపోతుంది. ఈనాడు మనసారా మీకు సేవ చేయటం వల్ల కలిగే ఆనందం గాఢమైనది. అది హృదయంలో పుడుతుంది. అక్కడే ఉంటుంది. పెదవులదాకా రాదు.' ఆ సినిమా కూడా సక్సెసే!

డి.బి.యన్.వారి 'దాగుడుమూతలు' కథతో దాగుడుమూతలు ఆడుతూండగానే 'రక్తసంబంధం' రిలీజవ్వడం, విజయవంతం కావడం జరిగింది. దాంతో ఆదుర్తి సుబ్బారావుకు రమణపై గురి కుదిరింది. 'నువ్వు చెప్పే కథ



సైకలాజికల్ డ్రామా గుడిగంటలులో కృష్ణకుమారి, రామారావు.

గురించి బాగా డిస్కస్ చేద్దాం, నేను సేలంలో ఓ తమిళ సినిమా షూట్ చేస్తున్నాను. నాతో-రా' అని పిల్చుకెళ్లారు. అక్కడికి వెళ్లాక 'దీని సంగతి తర్వాత చూద్దాం కానీ, నా స్వంతబేనర్ బాబూమూవీస్ పతాకం క్రింద రెండో సినిమా తీద్దామని ఉద్దేశ్యం. నా దగ్గరో కథ ఐడియా వుంది. ఓ పడవవాడు, ఓ ధనికురాలైన చదువుకునే యువతి, వాళ్ల మధ్య ప్రేమ ఉందన్న సంగతి వాళ్లకే తెలియదు. దీనిమీద కథ రాయమని ఆత్రేయకిస్తే ఆర్నెల్లు పెట్టుకుని ఇది సినిమాకి పనికిరాదని వెనక్కి ఇచ్చేశాడు. నువ్వేమైనా చేయగలవేమో చూడు.' అని 'మూగమనసులు' మూలకథ అప్పగించారు.


మూగమనసులులో జమున, రమణ ప్రవేశపెట్టిన పాత్ర.

రమణకు స్టోరీ ఐడియా నచ్చింది. దాన్ని బాగా డ్రమటైజ్ చేయడానికి జమున పాత్రను ప్రవేశపెట్టారు. ఎక్కడికీ కదలకుండా హోటల్ రూములోనే కూచుని కథ, మాటలు, పాటలకు పల్లవులతో సహా మూడు రోజుల్లో పూర్తిచేసేసి ఆదుర్తికి ఇచ్చేశారు. ఆదుర్తి థ్రిల్ అయిపోయారు. అయినా వేరెవరికైనా చూపిస్తే మంచిదనిపించింది. ఎంతైనా కొత్తవాడు, పైగా ఇది స్వంతసినిమా. మెరుగులు దిద్దమని ఆత్రేయ కిచ్చి హైదరాబాదు పంపారు. ఎవరో ఆత్రేయ నడిగారట-

అబ్బాయిగారు అమ్మాయిగారు

ఆస్తులు అంతస్తులు

రమణ రచించిన కొన్ని సినిమాలు

'ఆదుర్తిగారి సినిమా పని ఏం చేస్తున్నారని'. 'సాధారణంగా నేను రాసినది నా అసిస్టెంట్లు ఫెయిర్‌కాపీ చేస్తూంటారు. కానీ ఈ సినిమా విషయంలో ఈ కొత్తకుర్రాడు రమణ రాసినది నేను ఫెయిర్‌కాపీ చేస్తున్నాను.' అన్నారట ఆత్రేయ. 'మూగమనసులు' క్రెడిట్స్‌లో రచన: ఆత్రేయ, ముళ్లపూడి వెంకటరమణ అని కనబడుతుంది.

ఈ సరికే రమణ ఆర్థికపరిస్థితి బాగుపడింది. ఆయన రాసిన సినిమాలన్నీ సక్సెసే! అలా అని వచ్చిన సినిమాలన్నీ ఒప్పుకునేవారు కారు. చేతిలో 2,3 సినిమాలుండేవి. సినిమాకి నాలుగైదు వేలు వస్తే ఆర్నెల్ల గ్రాసం చూసుకోనక్కరలేదు. విజయవాడలో 'జ్యోతి' మాసపత్రిక ప్రారంభమయింది. బాపు విజయవాడకు కాపురం మార్చి పత్రికమీద ఫుల్‌టైమ్ పనిచేసేవారు. అప్పుడప్పుడు ఆర్టికల్స్ రాయడం, మద్రాసులో ఉంటూ సినిమాయాడ్స్ తేవడం రమణ పని.

నాగేశ్వరరావుకు జీవితచరిత్రరాసి ఆయనకు ఎంతో ఆత్మీయుడిగా పేరుబడ్డ రమణ కెరియర్ మాత్రం ఎన్.టి.ఆర్.తో ప్రారంభమయింది. మొదటి నాలుగు సినిమాలలో – 'రక్తసంబంధం' (1962), 'మూగమనసులు (1963), దాగుడుమూతలు (1964), 'గుడిగంటలు' (1964) మూడు ఆయన నటించినవే. మూడూ సక్సెసే! ప్రజలపక్షాన పోరాడే వ్యక్తిగా రామారావు గొప్ప ఇమేజి చేకూర్చిన సాంఘిక సినిమా 'కథానాయకుడు' (1969) రమణ రచనే! తర్వాత అది ఎన్నో రామారావు మార్కు సినిమాలకు ఒరవడి అయింది. 'కథానాయకుడు' కథకు స్ఫూర్తి 'రాజకీయ బేతాళ పంచవింశతిక'లోని 'మంచివాడు కథ'. ఆ కథ తమిళంలో ఎం.జి.ఆర్.తోను, హిందీలో రాజేష్‌ఖన్నాతో కూడా విజయభేరి మ్రోగించింది. రామారావు చివరి చిత్రమైన 'శ్రీనాథ కవిసార్వభౌముడు' రచన రమణదే!

అంతా సవ్యంగా సాగుతున్న సమయంలో రమణకు తనను తొలిలో ఆదరించిన దర్శకుడితో పేచీ వచ్చింది. ఆయన పైసా ముట్టచెప్పకుండా తనతో పనిచేయించుకోవడం రుచించలేదీయనకు. కోపం వచ్చి 'విజయవాడ వెళ్లి జ్యోతి నిర్వహణ చూసుకుంటాను.' అంటూ చేతిలో ఉన్న ఆరు సినిమాలు వదిలేసుకుని విజయవాడ రైలెక్కేశారు. 'అటువంటి పెద్దవాడితో గొడవపడుతున్నావు. 'యూ విల్ గోటూ గట్టర్స్' అని శ్రేయోభిలాషి డి.బి.ఎన్. తిట్టిపోశారు. రమణ విజయవాడలో రైలు దిగగానే కనబడ్డవి డ్రైనేజికై తవ్విన గోతులే! 'గట్టర్స్ ఆర్ రెడీ, బట్ ఐ యామ్ నాట్' అని డిబియన్‌కు టెలిగ్రాం



**ప్రేమించిచూడు - రమణ, పి. పుల్లయ్యల తొలి కాంబినేషన్**




ఇచ్చారు రమణ. పొగరుగా పొరబడే అవకాశం ఉన్న ఆత్మవిశ్వాసం అది! ఇటీవలే గోదారిపుష్కరాల సందర్భంగా రమణ ఓ వ్యాసం రాస్తూ– 'ఈత నేర్చిన గజ ఈతగాళ్లు గోదారిని ఈ దరి నుంచి అద్దరికి అడ్డంగా (ఆవల గట్టుకు) అవలీలగా ఈదుతారు. నాకు మాత్రం అడ్డంగా కాదు. నిలువుగా - ఏటికి ఎదురీదే పొలసచేపలా - ధవళగిరి నించి భద్రగిరి వరకూ, నూట ఇరవై కిలోమీటర్లు - బారీత కొట్టాలని సరదా. కొట్టగలనని నమ్మకం. పొగరు. ధీమా' అని రాసుకున్నారు.

వద్దుపొమ్మని వదలిపెట్టేసినా సినీరంగం రమణను వదిలిపెట్టలేదు. పి. పుల్లయ్యగారు వెతుక్కుంటూ విజయవాడ వచ్చారు. 'నాకో మంచి కథ చెప్పు. సినిమా తీస్తాను' అన్నారు. 'రెట్టింపు రేటు ఇస్తేనే...' అన్నారు రమణ. 'హారి అసాధ్యుడా!' అని నివ్వెరపోయి 'సరే కానీయ్' అని ఒప్పుకున్నారు పుల్లయ్య. అప్పుడు పుట్టినదే 'ప్రాణమిత్రులు.' (1967). ఈ కథ రాయడానికి రమణ ప్రేరణ పొందినది 'బెకెట్ (1964) అనే సినిమా. అది ఒక చారిత్రాత్మక నాటకంపై ఆధారపడింది. థామస్ బెకెట్ అనే వ్యక్తి 1118లో పుట్టాడు. కాంటర్‌బరీ ఆర్చ్‌బిషప్ థియోబోల్డ్ వద్ద ఆశ్రితుడుగా చేరాడు. అతని ద్వారానే కొత్తగా రాజైన హెన్రీII కు పరిచయమయ్యాడు. రాజుకు బాగా ఆత్మీయుడయ్యాడు.

అవి రాజరికానికి, మతాధికారానికి అధికారం కోసం పోరాటం జరిగే రోజులు. చర్చ్‌పురోహితులు రోమ్‌కు విధేయులయి వుండేవారు చర్చ్‌కు ఆస్తులు, విస్తృతమైన అధికారాలు ఉండేవి. కొత్తరాజుకు చర్చ్‌ను తన అధీనంలోకి తీసుకోవాలని కోరిక ఉండేది. 1161లో థియోబోల్డ్ మరణించగానే హెన్రీ II తన మిత్రుడైన బెకెట్‌ను ఆర్చ్‌బిషప్ ఆఫ్ కాంటర్‌బరీగా నియమించాడు. ఇక్కడ వరకు బాగానే జరిగింది కానీ చర్చ్‌లోకి అడుగుపెట్టాక బెకెట్‌కు మతపరమైన భక్తిశ్రద్ధలు పెరిగాయి. రాజు అధికారానికి అడ్డుకట్ట వేశాడు...

క్రమంగా బెకెట్‌కు రాజుకు విభేదాలు పెరిగాయి. రాజుచేసే ఆరోపణలు తట్టుకోలేక బెకెట్ ఫ్రాన్సుకి పారిపోయి ఆరేళ్లపాటు అజ్ఞాతవాసం గడిపాడు. చివరికి



మూలచిత్రంలోని చర్చ్ రాజకీయాలు కార్మిక రాజకీయాలుగా మలచిన ప్రాణమిత్రులులో సావిత్రి, జగ్గయ్య

సంధి కుదిరింది కానీ బెకెట్ రాజాజ్ఞకు పూర్తిగా లోబడలేదు. దాంతో ఒళ్లుమండిన రాజు 'ఈ తగవులమారిని నా దారినుండి ఎవరైనా తప్పిస్తే బాగుండును' అని వాపోయాడు. అది విన్న ఓ నలుగురు సైన్యాధికారులు అత్యుత్సాహంతో రాజుకు చెప్పకుండా వెళ్లి బెకెట్‌ను చర్చిలోనే కత్తులతో పొడిచి చంపేశారు. దానితో ప్రజలు నివ్వెరపోయారు. చర్చ్‌కై స్నేహాన్ని వదులుకున్న బెకెట్‌కు దైవత్వం ఆపాదించారు. ఇది రాజును చలింపజేసింది. నాలుగేళ్ల తర్వాత రాజు ప్రాయశ్చిత్తం చేసుకుని బెకెట్‌ను ఆరాధించాడు.

ఈ యధార్థగాథను జీన్ అనూయిల్ అనే ఫ్రెంచి రచయిత మరొక ఇద్దరితో కలిసి ఒక నాటకంగా మలిచాడు. అది ఇంగ్లీషులో అనువదింపబడి నాటకంగా ప్రదర్శింపబడి, దరిమిలా తెరకెక్కింది. రాజుగా పీటర్ ఓ టూల్, బెకెట్‌గా రిచర్డ్ బర్టన్ అమోఘంగా నటించి సినిమాను జయప్రదం చేశారు. అయితే ఈ క్రిస్టియన్ కథను కార్మికవిజయగాధగా మలచడంలోనే ఉంది రమణ ప్రతిభ అంతా! ఒక షిప్‌యార్డ్ కంట్రాక్టర్ (జగ్గయ్య) విషయలోలుడు. తన క్రింద పనిచేసే కార్మికులను లోబరచుకోడానికి తన అనుచరుణ్ని (నాగేశ్వరరావు) ఒక కార్మికుడిగా వారిలోకి పంపుతాడు. కార్మికుల కడగండ్లు ప్రత్యక్షంగా చూసిన ఆ నాగేశ్వరరావు కార్మిక పక్షపాతిగా మారి జగ్గయ్యకు ఎదురు తిరుగుతాడు. అనేక ఘర్షణల తర్వాత జగ్గయ్య నాగేశ్వరరావుపై తుపాకి ఎక్కుపెడతాడు. అదే అదనుగా, విలన్, నాగేశ్వరరావుపై తుపాకి పేల్చి చంపేస్తాడు. జగ్గయ్య పశ్చాత్తాపంతో కుమిలిపోతాడు. ఈ కథనంతా దండవేసిన నాగేశ్వరరావు ఫోటోముందు నిలబడి జగ్గయ్య ఫ్లాష్‌బ్యాక్‌లో చెప్పాలని రమణ ప్లాను చేశారు.




ఈ కథ పుల్లయ్యగారికి బాగా నచ్చింది. అయితే నాగేశ్వరరావు చచ్చిపోతాడని ముందే చెపితే సస్పెన్స్ పోతుందని భయపడ్డారు. 'ఎంత సస్పెన్సయినా మొదటి ఆట వరకే కదండీ, బెకెట్‌లో కూడా కథ ఫ్లాష్‌బ్యాక్‌లోనే చెప్పారుగా' అని రమణ వాదించినా లాభంలేకపోయింది. ఆయన భయపడ్డట్టుగానే సినిమా రిలీజవ్వగానే నాగేశ్వరరావు పాత్ర

చచ్చిపోతుందన్నమాట గుప్పుమంది. ప్రజలకు ఆసక్తి చచ్చిపోయింది. సినిమా బాగా ఆడలేదు. తమాషా ఏమిటంటే పదేళ్లు పోయాక ఇదే కథను కాస్త మార్చి ('ప్రాణమిత్రులు' మా కథకు ఇన్స్పిరేషన్ అని హిందీ నిర్మాతలు ఎక్కడా చెప్పలేదు) హృషీకేశ్ ముఖర్జీ దర్శకత్వంలో 'నమక్‌హరామ్' రిలీజయింది. కార్మికనాయకుడి పాత్ర వేసిన రాజేష్‌ఖన్నా మరణించినట్టుగా ఫస్ట్‌సీన్లలోనే చూపించేశారు. సినిమా సూపర్‌హిట్ అయింది. 'ప్రాణమిత్రులు'లో నాగేశ్వరరావుకు జోడీగా నటించిన సావిత్రి పాత్రను రమణ వ్యక్తిత్వం ఉన్న మహిళగా అద్భుతంగా మలిచారు. హిందీలో ఆ పాత్రను శృంగారపరంగానే వాడుకున్నారు.

తమిళ రీమేక్ సినిమాలకు సంభాషణలు రాసినపుడు మూలాన్ని అనుసరించాలి కాబట్టి, కాస్త ఎక్కువగా రాయాల్సి వచ్చినా తన స్వంతకథలతో తయారయిన సినిమాల సంభాషణల విషయంలో మాత్రం రమణ చాలా పొదుపు పాటించారు. సినిమా మీడియంకు తగ్గట్టు విజువల్ కథనానికే ప్రాధాన్యత ఇస్తూ, క్లుప్తంగా, పదునుగా సంభాషణలు ఉండేలా జాగ్రత్తపడ్డారు. సినిమాకు డైలాగులు ఇలా రాయాలి అని కొలబద్దలా నిలిచేవిధంగా రాయగలిగారు. దీనికి కొన్ని ఉదాహరణలు, సీతాకల్యాణం, త్యాగయ్య! దానికి ఆయనకు ఉపకరించినది దేశ, విదేశ సినిమాలపై ఆయనకున్న అభినివేశం. ఆంధ్రపత్రిక వీక్లీలో పనిచేసేటప్పుడు సినిమాపేజీ చూసే అవకాశం.

సినిమా పేజీ చూసేందుకు ముందు కూడా రమణ సినిమాల గురించి రాసేవారు. సినిమా వార్తలు, విదేశీచిత్రాల కథలు, ప్రముఖులతో ఇంటర్వ్యూలు, వారిపై కథనాలు, వ్యాసాలు, సినిమాపోకడలపై వ్యంగ్యశీర్షికలు, దేశ, విదేశ చిత్రాల సమీక్షలు - ఆయన స్పృశించని అంశం లేదు. సమీక్షకుడిగా ఆయనదంటూ ఒక బ్రాండ్ ఏర్పడింది. తీసినవాళ్లెంత గొప్పవాళ్లయినా నిర్భయంగా విమర్శిస్తూ, తమాషా చురకలు వేస్తూ రాయడం వల్ల పాఠకులకు చేరువయ్యారు. విమర్శలో నిజాయితీ చూసి నిర్మాతలు సహించడం నేర్చుకున్నారు. కొంతమంది ఆదరించారు కూడా. సినీజర్నలిస్టుగా రమణ కృషి అనన్యసామాన్యమైనది. అప్పట్లో ఇన్ని సమాచార సాధనాలు అందుబాటులో లేవు. సినిమాహాలు చీకట్లో సంచీ ఒత్తుగా పెట్టుకుని పేపరు, పెన్సిలుతో కథ రాసుకుని వచ్చేవారు.



ఐదారేళ్లు మాత్రమే ఆ వృత్తిలో ఉన్నా ప్రముఖులందరూ ఈనాటికీ తలచుకునేలా సినీపాత్రికేయవృత్తిని నిర్వహించిన రమణ సినీప్రతిభను చూపించడానికి కొన్ని రచనలు, కొన్ని సమీక్షలూ ఈ సంకలనానికై ఎంచుకోవడం జరిగింది. పత్రికలో పనిచేస్తూ ఆయన రాసిన కొన్ని సమీక్షలు 'బాపూరమణీయం' (1990)లో ప్రచురించబడ్డాయి. మరికొన్ని ఆంధ్రజ్యోతి వీక్లీలో 1996 అక్టోబరు నుండి 30వారాలపాటు పునర్ముద్రించబడ్డాయి. ఏవో కొన్ని లైబ్రరీలకే పరిమిత మయిపోయివున్న సమీక్షలింకా ఉన్నాయి.

రమణ సినీరచనలలో కొన్నిటిని మాత్రమే ఈ సంకలనాలలో చేర్చడం జరుగుతోంది. తెలుగు, హిందీ, విదేశీ సినిమాలకు ప్రాతినిధ్యం వహించేట్లు, వీడియోలద్వారా ఇప్పటికీ అందుబాటులో ఉన్న సినిమాల గురించి రాసిన సమీక్షలు. ఇప్పటికీ తెలిసిన వ్యక్తుల గురించి రచనలు మాత్రమే ఎంచుకోవడం జరిగింది. సినీరమణీయం-2 లో కూడా ఇదేవిధంగా మరికొన్ని కనబడతాయి. వాటితోబాటు నాలుగుదశాబ్దాలుగా మార్కెట్లో లభించని రమణ రచన, 'కథానాయకుని కథ' కూడా! తెలుగు చలనచిత్ర కథానాయకుడు అక్కినేని నాగేశ్వరరావు జీవితగాథ 'సినీరమణీయం'లో వెలువడడం సమంజసమే కదా! ఈ సంపుటంలో చివర కనబడేది సినిమా మోజున్న ఓ యువకుడి గాథ!

విక్రమార్కుని మార్కు సింహాసనం కథలు

ఆంధ్రపత్రిక వీక్లీలో పనిచేసే రోజుల్లోనే 1958లో రమణ రాసిన ఈ కథామాలిక ఒక అనామకుడి సినీరంగ ప్రవేశం గురించిన పెద్దకథ. భోజరాజును మెట్టుమెట్టుకూ హెచ్చరించిన విక్రమార్కుడి సింహాసనం తాలూకు సాలభంజికల లాగానే మన నాయకుడు రాజుకు అడుగడుగునా అడ్డుపడ్డవాళ్లందరూ కథలు చెబుతారు. సాలభంజికలకు ప్రత్యేకమైన ఐడెంటిటీ లేదు. అన్నీ ఒక్కలాటివే! అయితే ఇక్కడ మాత్రం వేర్వేరు రకరకాలవారు కథలు చెబుతారు – నరసన్న, రైల్వే బైరాగి, రామనాథం, కుబేరబాబు, కొలంబస్ – ఇలా ఒక్కోరూ నాలుగు కాలాలపాటు గుర్తుండే పాత్రలు!


రమణ రచించిన శ్రీమంతుడు

చివరికి ఈ భోజ 'రాజు' సింహాసనం అధిష్టిస్తాడు. కానీ ఆ రూటే వేరు. అది ఓ సినిమాకు పనికొచ్చేటంత మలుపుల కథ. దాన్ని చెప్పడంలో కూడా అనేక మలుపులు, వింతవింత పోకడలు. నడుస్తూ నడుస్తూ హఠాత్తుగా కథ లాంగ్‌జంప్

చేస్తుంది. (సినీ పరిభాషలో ఫ్లాష్‌ఫార్వర్డ్ అంటారు). సాలభంజికలు మాయమయిపోయి కథ నడుస్తుంది. కాస్సేపుపోయాక మళ్లీ సాలభంజికలు వస్తాయి. ఇంతలో రచయిత జొరబడి రాజుకి బోల్డు డబ్బుందని ప్రకటించి తప్పుకుంటాడు. దానిమీద ఆశలు, అపోహలు, అపార్థాలు, ఆ పై పశ్చాత్తాపాలు. ఆ తర్వాత ఎప్పుడో తీరిగ్గా మధ్యలో జరిగిన కథ చెబుతారు.

కథ చదువుతూంటే 'ఇది సీరియల్‌గా పత్రికలో వచ్చినట్టుంది, రచయిత అక్కడే పనిచేస్తూండడం వల్ల అప్పటికప్పుడు కొన్ని జోకులు పుట్టుకువచ్చాయి' అనిపిస్తుంది... ('నవ్వకూడదని ముందరి పేరాలో అనుకున్నాడు కాబట్టి గూర్ఖా నవ్వలేదు', 'మీరు తొరగా తెమల్చాలి. ఇక్కడ చోటు అయిపోతోంది. నలిగిపోతున్నాను.' 'చోటైపోతే పక్క పేజీలో కథ రాసిన మేష్టార్ని కాస్త అడుగుదాం', 'మీరే ఏదో చెప్తానన్నారు మరోకథని', 'ఆ ముక్క నేననందే! రమణ కాబోలు. వాడేనా పొరబాటున మరోసారి పై కథ అనబోయి, పై మరోకథ అన్నాడు గావును.') సీరియల్ రాస్తూ రాస్తూ ఓ రెండు నెలలు ఆపేసినట్టున్నారు. ఓ పాత్ర ద్వారా అదీ చెప్పించారు. ('నేను అసిస్టెంటు డైరక్టర్ని.' పైవారం మరోకథలో' వాణ్ని. రెణ్ణెల్లనుంచి మీకోసం చూసి, చూసి, ఇవతలికి వచ్చేశాను మిమ్మల్ని తీసుకు వెళ్దామని. తమరి కథ కదలటం లేదు.') ఓ చోట తన మీద తనే జోకు వేసుకున్నట్టు 'వట్టి కాకిగోల' అని పాఠకుడు అన్నట్టు రాసేశారు. కథకుడు కూడా ఇన్వాల్వ్ అయి రాసిన సందర్భాలు మచ్చుకు కొన్ని చూడండి...

'మనం విక్రమార్కుడి మార్కు కథల్లో మనుషులం – సిందుబాదూ, హిందుబాదూ ఇందులో రాకూడదు. ఇంకో బుక్కులో శాల్తీలు కాబోలు.'

'కథరాస్తున్నవాడు కొలంబస్ అంటున్నాడుగా. వాడిమాటే కానీ–'

'తన్నడానికి రాజన్, సుబ్బణ్ణ బయల్దేరి వచ్చారని చదువరికీ, రమణ (రచయిత)కీ తెలుసుగాని రాజుకీ, రాయుడికీ తెలియదు. 'ఏదో ఒకటి తేల్చుకోండి...' అన్నాడు రమణ నేపథ్యంలోంచి.'

రమణ రచన

డి.బి.ఎస్. దేగా ఫిలింస్

దర్శకత్వం . వి. రామచంద్ర రావు

అన్నదమ్ములు

నిర్మాతలు : డి.బి. నారాయణ, డి. రామగోపాల్ రెడ్డి

హీరోయిన్ . విజయనిర్మల

ఇలా ఎవరూ రాయరు. ఈ కన్‌ఫ్యూజన్ చాలనట్టు మనసు చేసే గారడీలు కూడా రామనాథన్ కథలో, రైల్వేగేటును స్టూడియోగేటు అనుకోవడంలో చూపారు. ఇంత క్లిష్టమైన కథాసంవిధానం నాలుగున్నర దశాబ్దాల క్రితమే చేపట్టడానికి రమణ ఎలా సాహసించారా అనిపిస్తుంది. పాఠకుల పరిణతి మీద ఆయనకున్న అపారమైన నమ్మకానికి జోహార్లు. అప్పట్లో వచ్చే తక్కిన కథలు చూస్తే అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్టు ఉంటాయి. మరి ఈ కథ అందరికీ అర్థమయ్యిందా, లేక హాస్యంగా ఉంది కదాని చదువుకుపోయారా అన్న అనుమానం వస్తుంది. ఎందుకంటే ఈ పుస్తకం ఎన్నిసార్లు చదివినా రైల్వే బైరాగి వద్దా (అతని తిట్లలో టాప్‌మోస్ట్ తిట్టు టిక్కెటు కలక్టర్, అతని బీడీ థీమ్ వదలడు), సినిమాపేర్లు అప్పచెప్పడం వద్దా, కొలంబస్ - రాజు సంభాషణ వద్దా, చాలా ప్రకరణాల వరకు సాగే పాతన్యూస్‌పేపర్ల థీమ్ తలచుకున్నప్పుడల్లా పట్టరాని నవ్వు వస్తుంది.

ఈ సీరియల్ అమితంగా ప్రజాదరణ పొందడంతో నవలారూపంలో వెలువడింది. సీరియల్‌గా వెలువడినప్పుడు లోగో తప్ప బొమ్మలు లేవు. పుస్తకరూపంలో ప్రతి అధ్యాయానికి బొమ్మలు వేసి బాపు అందం తెచ్చారు. సీరియల్‌ను రమణ ఎస్. పార్థసారథి అన్న కలంపేరుతో రాశారు. అందుకే కథలో రచయిత గురించి ప్రస్తావన వచ్చినప్పుడు 'పాసార్ధి (పార్థసారథి) చెప్పాడు, పాసార్ధి అన్నాడు' అని రాయడం జరిగింది. పుస్తకంగా వేసినప్పుడు రచన – ముళ్లపూడి వెంకటరమణ అని ఉంటుంది. మారుపేరుతో రాసిన వైనం ఎక్కడా పేర్కొనలేదు. లోపల కథలో పాసార్ధి అని పేరు వచ్చినప్పుడు వీడెవడ్రా? అన్న కన్‌ఫ్యూజన్ వచ్చేది. పుస్తకం పలు పునర్ముద్రణలు పొందినా అదే పరిస్థితి కొనసాగింది. ఈ తికమక తొలగించడానికి ఈ సంకలనంలో 'పాసార్ధి' అనే చోట 'రమణ' అని మార్చడం జరిగింది.




ఇక పుస్తకం గురించి చెప్పవలసివస్తే అక్షరమక్షరం చదివి తరించవలసినదే! సినిమాపిచ్చివాళ్లు అప్పటికీ ఇప్పటికీ ఎప్పటికీ ఉంటారు. అందువల్ల ఈ సబ్జక్టు పాతబడదు. పొద్దున్న లేవగానే తలుచుకునేది ఆనాడు రాజ్‌కపూర్, దిలీప్‌కుమార్ అయితే ఈనాడు షారుఖ్‌ఖాన్, సల్మాన్‌ఖాన్! అప్పుడు గమ్యస్థానం మద్రాసయితే ఇప్పుడు హైదరాబాదు. పేర్లు మారవచ్చు కానీ పద్ధతంతా అదే! సినిమామీద మోజుతో మోసగించబడడం ఎప్పుడూ సాగేదే! అర్హతలు లేకపోయినా రాత్రికిరాత్రి తెరకెక్కేద్దామని

తాపత్రయపడేవాళ్లు ఎప్పుడూ ఒకలాగే ఉంటారు. వాళ్లలో వాళ్లు గొప్పగా ఊహించేసుకుంటారు. 'ముత్యం చేసే త్యాగం (వానపాములో హీరోపాత్ర)' గట్టుమీద ఉన్నవాళ్లకు వింతగా తోచవచ్చు. కానీ ఆ సినిమాయలోకంలో విహరించేవాళ్లను చూసినవాళ్లకు అది అర్థరహితంగా అనిపించదు.

అసలు కథాప్రారంభమే వింతగా వుంటుంది. తెరమీద నుండి నటుడు జనంలోకి జారిపడడం గొప్ప వూహ! కథకు సంబంధం లేకుండా కేవలం పాఠకుడిని థ్రిల్ చేయడానికి ప్రవేశపెట్టే సర్రియలిస్టిక్ ఓపెనింగ్స్ లాటిది కాదది. క్లయిమాక్స్‌లో దాన్ని వాడుకోవడం జరిగింది. మొదటిపేరాలో సినిమాలోకంలో ఉన్న అతుకుల బొంతతనం, అబద్ధపు వాతావరణం కనబడుతుంది. మాళవరాజకుమారుడు వేసిన బాణం అమెరికా పులికి తగిలి ఆఫ్రికా సింహంగర్జిస్తుంది. రాజు, ముత్యంలలాగే ఇప్పటికీ అనేకమంది తప్పులు పట్టేస్తూనే ఉంటారు. హడావుడిగా మిత్రులమధ్య ఎనౌన్స్ చేసేస్తూనే వుంటారు. ఆ హడావుడిని అక్షరాలా చూపించారు రమణ –

'సింహం మేహంలా అరచింది.', 'తెలుసు, మింఘం సేహంలా అర్చింది.'

ఇలా మాటల్లో తొట్రుపాటు, తెలుగు, ఇంగ్లీషు భాషల్లో అజ్ఞానం చూపడానికి అనేక ఉదాహరణలున్నాయి–

అర్ధాంతరన్యాసం (అర్థాంతరన్యాసం అనబోయి) మసిపూసిన మాణిక్యం (మసిపూసిన పాతర, మట్టిలో మాణిక్యం రెండూ కలగలిపి) తివిరి కుందేటి (తివిరి ఇసుమమున, వెదకి కుందేటి పాదాలు రెండూ కలిపేసి) 'నాను మొయ్యరే. నేనే మోస్తాంలే' (తమిళం, తెలుగు కలగలుపు), వడ్లగింజలో ఆవగింజ (బియ్యం గింజ అనబోయి), నవయువకులు, యువనవకులు, గ్రీటింగు కార్డు (విజిటింగు కార్డు అనబోయి), హ్యూమరికల్‌గా, ఫైటికల్ సినిమాలు (మ్యూజికల్ అన్నట్టుగానే)

గుర్ఖా ఈజె రుపీ సార్. అయామే గేట్ సార్..ది..దిసీజె బోల్తాసార్.. వీరికి డౌరీ ఇచ్చానండి... అదే బ్రైబు..




అయామే స్టూడియో సార్... యువారె బాక్స్ యందు మై బాగ్ సార్... యస్టర్డే అయామే బీటింగ్....

అయామే గేట్ ఈజ్ బోర్డు... ఊరికినే బోర్డుని గేటేస్తున్నా... గార్డుని బేటేస్తున్నానండీ అదికాదు మూటిని గేసేస్తున్నా.

అయామే మిస్టేక్.... బట్ హౌకెనై పాసిబుల్ హియర్....?

పురాణాల గురించి తెలియనివాళ్లుకూడా ఎడాపెడా మాట్లాడేసి తమ అజ్ఞానం బయటపెట్టుకుంటారు–

శిలీముఖం (అగ్నిపర్వతం అని అర్థం) అదే... శిలీమొహం అంటే శిలి (శిబి అని పొరబడ్డాడు) అనేవాడి మొహం అన్నమాట...

వీడూ దళీచీ (దధీచి అనాలి) ఇంకోడూ కలిసి బాగా దానాలూ అవీ చేశారు. శిలి అనేవాడి ముహంతో ఓ శ్ట్యాట్యూట్ (స్టాట్యూ అనబోయి) కట్టారు.

ఉప్పుడైలాగు రాసినది పోతన్న, ఆయన ఓ పిక్చర్‌లో వేశాడు.

మీరా అంటే ఎం. ఎస్. సుబ్బలక్ష్మి.

రామాయణం ఎండింగేమిటని హఠాత్తుగా అడిగితే ఏం చెప్పగలమండి? స్క్రిప్టునుబట్టి వుంటుంది

వాల్మీకి వాళ్లు ఫిలిం కథలకన్న డ్రామెటిక్‌గా ఎలా రాస్తారండి? అసలు వాళ్లకి సైకాలజీ, ట్రీట్‌మెంటూ అదీ ఎలా తెలుస్తుందండి? అప్పటికి ఫ్రాయిడే పుట్టలేదు!

కథలు రాసేవాళ్ల మీద బోల్డు చెణుకులు ఉన్నాయి–

మన కథకు సదుపాయంగా ఉంటుందని సెకండు క్లాసులోనే ఎక్కారు

'హాలీవుడ్‌లో హరనాథ్ బాబా ఉండడా? యతికోసం చచ్చినట్టు పుచ్చిన కుక్కలా వుంటాడు'

'తెల్లకాయితాలు అమ్మాలంటే కష్టంకదా, గవర్నమెంటు వాళ్లు ముందర లైసెన్సు అదీ పుచ్చుకోమంటారు. వాటిమీద ఏదో ఒకటి రాసిపడేస్తే ఆ బెడదలుండవు. కథలు రాసి వీశెల్లెక్కన అమ్ముకోవచ్చు.'

'నాలుగొందల యాభై కథలా!? అయ్యబాబోయ్! వీసెల్లో తూచలేం; అడుగుల్లో కొలవలేం. ఉజ్జాయింపుని వీసెడు కథ మూడుమైళ్ల పొడుగుంటుంది గద. ఆ లెక్కన నీ దగ్గిర ఓ పదిపుట్ల కథలుంటే ఎన్నిమైళ్లు? చెప్పు. ఖమాన్. వీశకి మూడుమైళ్లు. పుట్టికెన్ని?... ముందర పుట్టికెన్ని వీశలో చెప్పు... మైలు కెన్ని వీశలు, వీశె కెన్ని గంటలు?'

ఇక సినీఫీల్డ్‌పై విసురు గురించి చెప్పనే అక్కరలేదు –




ముందర వేషం వేద్దామని వచ్చాడు, అది కుదరక, డైరక్షన్ చేస్తానన్నాడు, పోనీ ఫోటోగ్రఫీ అన్నాడు. ఆఖరికి కథలూ, డైలాగులూ రాయ సిద్ధపడ్డాడు.

'క' అన్నాను. – థలూ, సినేరియాలూ సాంగులూ గుర్రా రిక్షాలమీద వచ్చేశాయి.

సినిమాకి పనికిరావాలంటే 'రాదు' అనరాదు. గుర్తులేదు అనాలి.

డైరక్టరు కావాలంటే ఇంకొంచెం ఒడ్డు పొడుగూ ఉండాలి

నిజంగా గొప్పవాణ్ణనుకుంటే సినిమాల్లో బుక్ చేయరు

వారి దవడలు పొంగివుండడం చూసి వాళ్లిద్దరూ గ్లాక్సోబేబీలకి ఎన్‌లార్జ్‌డ్ ఎడిషన్స్ అన్న ఊహ కొద్దీ వీళ్లు దేశవాళీ సినిమాలో హీరోవేషాలకి ఠంగున సరిపోతారనుకోదలచుకున్నా...

పిక్చరు సగమన్నా కాకుండా కథ ఏమిటో ఎవరుమాత్రం చెప్పగలరు?

సినిమాకథలు వారఫలాల వంటివి. గ్రహబలాలను బట్టి మారుతాయి.

సినిమారైటరుగా చేరి ఏడాది దాటినా వీడికింత స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ఎలా ఉండిపోయాయి?

సినిమాలో అసహజత్వంపై చమత్కారాలు కొన్ని-

బైరాగి 'బాధను అణచుకొనుట' అభినయించి, 'విషయమును మార్చి ప్రయత్నించుట'ను నటించి డ్యూయట్‌సీనులో 'హీరోయిన్ పాట వినుట'ను నటిస్తున్న హీరో లాటి మొహం.

ఏదో ఒకచూరుకింద పడుకున్నాననుకున్నాకనే 'ఎక్కడున్నాను?' అనే ప్రశ్న వేయడం.

బీదరైతు వాడి అంతస్తుకి తగని మూడంతస్తుల మేడ సెట్‌మీద కాపురం ఉంటున్నాడు గదా చూడండి ఎంత దుబారా మనిషో!

'డబ్బిత్తే వద్దంటానికి మనవేం సినిమాలో యేసాలం అనుకున్నావా?'

మన సినిమాలలో చీకటిగా ఉండాల్సిన సీనులో వెలుగుకిరణాలలా నిరాశతో నిండాల్సిన అతని మనసులో చాలా ఆశలు మిలమిల్లాడాయి.

వీటితోబాటు ఫీల్డులో మూఢనమ్మకాలపై కలియుగ కుబేరుడి కథ ద్వారా పెద్ద సెటైర్ రాశారు రమణ. అంతేకాదు ప్రీవ్యూలో ఎలక పరిగెడితే సక్సెస్ అనే నమ్మకం గురించి దేవుణ్ణి కోప్పడే సన్నివేశంలో నటించినందుకు హీరో గుంజీలు తీయడం గురించి చెబుతూంటే కొంపదీసి ఇవి అతిశయోక్తులు కావేమో, వాస్తవాలేమో అనిపిస్తుంది. 'అర్నవము' మాట గురించి తెరవెనుక మెలోడ్రామా, స్క్రిప్టు రాయడంలో అయోమయాన్ని చూపే యద్రివ్నగ్జ...కథ - ఇవన్నీ కడుపుబ్బ నవ్విస్తాయి.




అరవసినిమాలను రమణ బ్రహ్మాండంగా ఆటపట్టించారు-

రామచామిది భారీవిగ్రహం. తెలుగుసినిమా అంత - ఆ మాటకొస్తే దాదాపు అరవసినిమా డైలాగంత పొడుగ్గా ఉండేవారు.

నువ్వు ఈ సినిమాఫీల్డులో ఎన్ని కష్టమైన పనులైనా సాధించవచ్చు. కొత్తనటులచేత ఓవరాక్షన్ మాన్పింపవచ్చు, ... శివాజీగణేశన్ చేత చిన్న చిన్న డైలాగులే అనిపించవచ్చు.

నాకు పోర్షన్ ఇవ్వకుండా శివాజీగణేశనంత డైలాగు మాట్లాడారు.

వాళ్లిద్దర్నీ తాళ్లతో కట్టేసి, హైపవర్ దీపాల కింద పడుకోబెట్టి స్విచ్చి నొక్కేసి, రెండుమూడు గజాల తమిళడైలాగును వాళ్ల చెవిదగ్గర చదివింపించడం...

చివర్లో కనబడే సుబ్బన్న వద్ద ఉండే శివాజీగణేశన్ భక్తులు అప్పచెప్పే డైలాగులు అరవం అర్థం కాకపోయినా చదువుకుచూసుకున్నా అవి చేసే 'రవం' వల్ల నవ్వు తెప్పిస్తాయి...

మొత్తమంతా సినిమాల గురించిన రచనే కాబట్టి ఉపమానాలలో కూడా సినిమాలపై వ్యంగ్యం డామినేట్ చేసింది-

ఆయన మొహం, హీరోయిను పాట అయిపోయినపుడు వెలిగే హీరో వదనంలా ప్రకాశించింది. ఆమె చీరమీద జరీపోగులు సినీమాపాటలలో భావంలా, అస్తినాస్తి సందేహం కలిగిస్తూ మెరుస్తున్నాయి; 'గురూ' అన్నాడు రాజు ఆపాదమస్తకం ఊటీలో తలత్‌మహమ్మద్ కంఠంలా వణికిపోతూ; పోర్షన్ లేని వాళ్లా దిక్కులు చూస్తున్నాడు .

రమణ తెలుగుభాషతో చేసే సర్కస్ ఈ పుస్తకంలోనూ కనబడుతుంది. బోల్డన్ని మాటలు 'కాయిన్' చేశారు. మచ్చుకు - జనాంతికంగారుగా, హాహాకారాలూ - మిరియాలు, నటీమణి - అదనీమణి, నటయిత, నిష్కళులు, కొసతారదు, టెలిగ్రామ్యభాష, పౌరాంఫిక (పౌరాణిక ప్లస్ సాంఘిక), 'షాఫరు'ద్దీన్, దిల్రుబాల, కథబలీయనం, శాన్స్‌క్రిటీక, కలకంఠస్వరాలు, హీరోళ్లు, కాడిలాకియర్ ('కాడిలాక్' ఖరీదైన కారు)

అలాగే కొన్ని పన్‌లు బీడి నాకివ్వమంటే, 'నాకి' ఇవ్వడం, సరే కనిమ్మంటే కానీ నాణెం ఇవ్వడం.

అంతేకాదు రమణమార్కు లిటరల్లీ స్పీకింగ్‌లు కూడా ఉన్నాయి - పెట్టే, బేడా అంటే నిజంగా పెట్టెలో ఓ బేడ (రెండణాల నాణెం) వుంటుంది. దువ్వడం (కాకాపట్టడం) అంటే క్రాపు నిజంగా దువ్వబడిపోతుంది, సుబ్బన్న భగ్గుమన్నాడు, వేడి ఆరాక..; ఆశ్చర్యపోయి, వచ్చాక; నడుచుకుంటుకుంటూ;




అంతేకాదు, ఆయన చమత్కారాలు పుష్కలంగా కనబడతాయి.

'నాకు భయం వేస్తోంది. నీకు సాయం ఉండనా' అన్నాడు రాయుడు పనిపిల్లను చూసి వాడిపేరు 'సశేషగిరి'. ఉద్యోగం ప్రొడక్షన్ మేనేజరు గిరీ. ఎలాటి ఖర్చులోనైనా డబ్బు కాస్తో, కూస్తో 'శేషం' వేస్తాడని వినికిడి. 'ఎలాగేనా డైరెక్టరంటే డైరక్టరే!' 'కాపోతే డైరక్టరంటే ప్రొద్యూసరెలా అవుతుంది?'; 'ఆర్టంటే పడిచచ్చే వాళ్లలో నేనొకణ్ని' 'బావుందండి, మీరు ఒక్కరు కాకపోతే ఇద్దరెలా అవుతారు?'; 'అయామే జీనియస్ అని నా అసిస్టెంట్లూ, బంట్లూ అంతా అంటారు. నా వెనకేకాదు, ఎదటకూడా ఆ ముక్కే నిర్భయంగా చెప్పేస్తారు. ఎండ్ ఐ లైక్ ఫ్రాంక్‌నెస్.'; 'మొహం వాచిపోయిందేం?' 'చివాట్లేసింది';

వీటన్నిటితో బాటు రమణ మాత్రమే రాయగల ఎన్నో గొప్ప భావవ్యక్తీకరణలు ఉన్నాయి.

నీకు నాలుగు చేతులున్నాయిస్మీ అంటూ భక్తుడు చెబుతూంటే వింటూ నిల్చున్న విష్ణుమూర్తిలా నవ్వాడు; రైల్వేబైరాగి నవ్వాడు రైల్వే బైరాగిలా; అతని బుర్రలో ఇందాకటి రైలు పరుగెడుతోంది. మూడ్రోలు క్రితం చూసిన సినిమా, ఇంకోమూల మ్యాటనీలా ఆడుతోంది; రాజూ రాయుడూ కల్లోగూడా అనుకోలేదు; కునికిపాట్లు పడుతున్నప్పటికిన్నీ; కల్తీలేని జీనియసు; రాజు గుండె చిన్న పిల్లిమొగ్గేసింది; ఆ ఇరుకులోనే చోటు చేసుకుని; సినిమాకధ, పానుపుసీనుమీద నుంచి కానుపుసీనుమీదకి 'కరిగి' (డిసాల్వ్) పోయినంత చప్పున; ఎలక్షన్ పొలిటీషియన్‌లా ఎండ కుడీ ఎడమా లేకుండా పేల్తోంది; ఐశ్వర్యానికి ఔదార్యంలా ఉన్న నల్లంచు తెల్లచీర కట్టుకుంది; వందిమాగధులు అన్నాడు; 'ఐమామే గ్రేట్ షోమన్' అన్నాడు ఇద్దరు ముగ్గురు; 'సైలెన్స్' అని గావుకేక పెట్టాడు డైరెక్టరుగారు. సైలెన్స్ చక్కావచ్చి చేతులు కట్టుకు నిల్చుంది; డైరక్టరుగారు రాజు మీదకి అభిమానం రంగేసిన నవ్వు విసిరారు. రాజు దానికి కృతజ్ఞత పులిమి ఆయనకి మళ్లీ యిచ్చేశాడు. రాయుడు



కబుర్లతో కల పన్ని అందులో బంగళా కట్టి అందులో రాజును పడుకోబెట్టి, తను దాని తాలూకు గెస్ట్‌హౌస్‌లోకి వెళ్లి తలుపేసుకు పడుకున్నాడు.




**పుస్తకంలో ప్రస్తావించబడిన కొన్నిటికి వివరణలు –**

నంబియారు తమిళసినిమాలలో విలన్. కె.వి.రెడ్డి బియస్సీ ఆనర్స్ చదివారు. తన పేరు పక్కన బి.యస్.సి (Hons.) అని వేసుకునేవారు. జి ఎన్ బి, సెమ్మంగుడి కర్ణాటక శాస్త్రీయవిద్వాంసులు, లాకేత్వం ఇవ్వడమంటే లేదనడం, ఆర్సన్ వెల్స్ నటుడు, దర్శకుడు, నిర్మాత, గో॥ సుబ్బారావు అంటే గోవిందరాజుల సుబ్బారావు, బాలనాగమ్మలో మాంత్రికుడి వేషం వేశారు, ఫ్రెడ్ ఆస్టెయిర్ బక్కగా ఉండే డాన్సింగ్ స్టార్, రిపబ్లిక్ ఫిలింస్ వారు సీరియల్‌గా స్టంటు సినిమాలు తీసేవారు. 'ప్యాసా' సినిమాలో గురుదత్ ఓ పేదకవి. అతని రచనలను ఓ పత్రికా సంపాదకుడు తూకానికి అమ్మేస్తే అనుకోకుండా వహీదారెహమాన్ అవి చదివి అతని అభిమానిగా మారుతుంది. గ్రంథసాంగుడు అంటే రసికుడు. సిడ్నీ కార్టన్ 'టేల్ ఆఫ్ టూ సిటీస్' నవలలో త్యాగమూర్తి పాత్ర. ఎమ్. ఎస్. రామారావు, ఘంటసాల రంగంపై వచ్చేందుకు ముందున్న నేపథ్యగాయకుడు. కల్పనాకార్తిక్ నటీమణి, దేవ్ ఆనంద్‌ను పెళ్లాడి సినిమాలనుండి రిటరయిపోయింది. ఎ.వి.ఎమ్. వారు 'జీవితం' అనే సినిమా తీశారు., స్టుడీబేకర్ అనేది కారు పేరు. వీశె అంటే 1400 గ్రాములు. 8 వీశెలు ఒక మణుగు, 12 మణుగులు ఒక పుట్టి లేక బారువ, గేరా జుత్తు అంటే గిరజాల జుత్తు.

అతిశయోక్తులున్న హాస్యంతోబాటు వాస్తవం కూడా ఉంది కాబట్టి గొప్పరచన అయింది. దిగ్రుబాల కథ చదువుతుంటే 'కృతజ్ఞత' కథ గుర్తుకువస్తుంది. అక్కడ కుక్కయితే ఇక్కడ అందాలభామ! కాపలా కాసేవాళ్లకు మాత్రం చచ్చే చావు... అన్ని రసవత్తర భాగం. సినీప్రపంచంపై రాసిన దాదాపు అన్ని కథలూ, నవలలూ ఆ


రమణ, ఆదుర్తిల చివరి కాంబినేషన్ - పూలరంగడు

రంగం కుళ్లిపోయినట్లు చూపించాయి. కానీ రమణ ఆ రంగంపై ఆత్మీయతతో, అభిమానంతో, ప్రేమతో చేసిన అసలు సిసలైన వ్యాఖ్యానం అనిపిస్తుంది - 'ఇది బొత్తిగా కళాకాదు. ఉత్తి డబ్బు కాదు... జీవితం... దానికి బెల్జియం అద్దం.. పెద్ద అబద్ధం... గొప్ప నిజం... లక్ష పొరలు కమ్మిన నిజం.' అనే సాటిలేని నిర్వచనం ఇచ్చారు రమణ. 'నిజం మీద అబద్ధం చరిస్తే కల్చరు అవుతుంది. అసూయమీద ప్రేమ అలికితే బిజినెస్... బాధకి చాలీచాలని రీవిని కప్పితే దైన్యం. ఎదటివాడి దైన్యం మీద హేళన ఒంపితే హైన్యం. విషాదం మీద చిరునవ్వు తెరవేస్తే కరుణ.' అన్న వాక్యాలు ఒక తత్త్వవేత్త మాత్రమే అనగలడు.

నిజానికి సినిమాలోకం మామూలులోకానికి మీనియేచరే! అందరూ చెడ్డవారు కారు, అందరూ మంచివారు కారు, అందరూ ఫెయిలయి రైల్వే బైరాగులు కారు, అందరూ ముత్యంలా ఇన్‌స్టెంట్ సక్సెస్‌లు కారు, అందరికీ రాజులా అద్దదారులు దొరకవు. అయితే మామూలు లోకానికి సినీలోకానికి ఉన్న తేడా ఏమిటంటే కళ్లు బైర్లు కమ్మించే గ్లామరు. పైగా రమణ చెప్పినట్టు 'ఇక్కడ జీవననాడి ఉధృతంగా స్పందిస్తుంది.' అందుకే అందరినీ తనవైపు ఆకర్షిస్తుంది. అంతేకాక ఫలితాలు ఇక్కడ తీవ్రస్థాయిలో, త్వరితంగా లభిస్తాయి. కోటిరూపాయలను రెండుకోట్లు చేయాలన్నా, లేదా ఖర్చు చేయాలన్నా బయటిప్రపంచంలో కొన్నేళ్లు పడుతుంది. ఓ సినిమా తీస్తే అది మూడునెలల్లో సాధ్యపడుతుంది. సినిమా అన్నది జూదం వంటి వ్యాపారం. కథారచయితగా సినీరంగాన్ని ఇంత బాగా విశ్లేషించిన రమణ కూడా దరిమిలా సినీరచయితగా, నిర్మాతగా మారి ఆ రంగంలో మంచీ, చెడూ, జయం, అపజయం అన్నీ అనుభవించారు.

వాటి కథ సినీరమణీయంIIలో! రమణ సినిమాల గురించి, వ్యక్తుల గురించి చేసిన వ్యాఖ్యలను బేరీజు వేసేందుకు ఆయా రచనల చివర్న చేర్చిన బాక్స్ఐటమ్స్ ఈ సంపాదకుడు చేర్చినవి. వాటి తప్పొప్పుల బాధ్యత అతడిదే! ఈ సంపుటిపై తమ అభిప్రాయాలు తెలుపదలచేవారు రచయిత (అడ్రసు - No. 9, Greenways Road Extn. Raja Annamalaipuram, Chennai - 600 028, Ph: 044—24937109) లేదా సంపాదకుడు (అడ్రసు - E-101, Satyanarayana Enclave, Madinaguda, Hyderabad-500 049. Ph 23047638)కు రాయగోర్తాను.

**- ఎమ్బీయస్ ప్రసాద్**

# అనుబంధం

ఇతరులకై రమణ రచించిన సినిమాలు. (*గుర్తు కలవి రీమేక్ చిత్రాలు)

| సినిమా | విడుదల | నటీనటులు | డైరక్టరు | |
|---|---|---|---|---|
| *రక్తసంబంధం | 1962 | రామారావు, సావిత్రి, కాంతారావు | వి. మధుసూదనరావు | సంభాషణలు |
| మూగమనసులు | 1962 | నాగేశ్వరరావు, సావిత్రి, జమున | ఆదుర్తి సుబ్బారావు | సంభాషణలు (ఆత్రేయతో కలిసి) |
| దాగుడుమూతలు | 1964 | రామారావు, బి. సరోజాదేవి | ఆదుర్తి సుబ్బారావు | కథ, సంభాషణలు |
| *గుడిగంటలు | 1964 | రామారావు, కృష్ణకుమారి, జగ్గయ్య | వి. మధుసూదనరావు | సంభాషణలు |
| ఇల్లాలు | 1965 | కె.వి. నాగేశ్వరరావు, గీతాంజలి | సంజీవి | సంభాషణలు |
| జమీందార్ | 1965 | నాగేశ్వరరావు, కృష్ణకుమారి | వి. మధుసూదనరావు | కథ, సంభాషణలు |
| తేనెమనసులు | 1965 | రామ్మోహన్, కృష్ణ, సుకన్య | ఆదుర్తి సుబ్బారావు | సంభాషణలు |
| *ప్రేమించిచూడు | 1965 | నాగేశ్వరరావు, రాజశ్రీ, జగ్గయ్య | పి. పుల్లయ్య | సంభాషణలు |
| *నవరాత్రి | 1966 | నాగేశ్వరరావు, సావిత్రి | టి. రామారావు | సంభాషణలు |
| కన్నెమనసులు | 1966 | రామ్మోహన్, కృష్ణ, సుకన్య | ఆదుర్తి సుబ్బారావు | కథ, సంభాషణలు |
| ప్రాణమిత్రులు | 1967 | నాగేశ్వరరావు, జగ్గయ్య, సావిత్రి | పి. పుల్లయ్య | కథ,సంభాషణలు |
| పూలరంగడు | 1967 | నాగేశ్వరరావు, జమున | ఆదుర్తి సుబ్బారావు | కథ |

| | | | | |
|---|---|---|---|---|
| ప్రైవేట్‌మాస్టారు | 1967 | కృష్ణ, కాంచన | కె. విశ్వనాథ్ | కథ, సంభాషణలు |
| చిన్నారిపాపలు | 1968 | జగ్గయ్య, సావిత్రి | సావిత్రి | సంభాషణలు |
| కథానాయకుడు | 1969 | రామారావు, జయలలిత | హేమాంబరధరరావు | కథ |
| భలేరంగడు | 1969 | నాగేశ్వరరావు, వాణిశ్రీ | తాతినేని రామారావు | సంభాషణలు |
| ముహూర్తబలం | 1969 | కృష్ణ, జమున | ఎం. మల్లికార్జునరావు | సంభాషణలు |
| *ఆస్తులు–అంతస్తులు | 1969 | కృష్ణ, వాణిశ్రీ | వి. రామచంద్రరావు | సంభాషణలు |
| అన్నదమ్ములు | 1969 | రామ్మోహన్, కృష్ణ | వి. రామచంద్రరావు | కథ, సంభాషణలు |
| శ్రీమంతుడు | 1970 | నాగేశ్వరరావు, జమున | ప్రత్యగాత్మ | సంభాషణలు |
| సుపుత్రుడు | 1971 | నాగేశ్వరరావు, లక్ష్మి | టి. రామారావు | సంభాషణలు |
| అబ్బాయిగారు–అమ్మాయిగారు | (1971) | కృష్ణ, వాణిశ్రీ | వి. రామచంద్రరావు | కథ, సంభాషణలు |
| *వింతకథ | (1973) | కృష్ణ, వాణిశ్రీ | వి.యస్. బోసు | సంభాషణలు |
| చీకటి వెలుగులు | (1974) | కృష్ణ, వాణిశ్రీ | కె.యస్. ప్రకాశరావు | కథ, సంభాషణలు |
| జేబుదొంగ | (1975) | శోభన్‌బాబు, మంజుల | వి. మధుసూదనరావు | సంభాషణలు |
| కొత్తల్లుడు | (1979) | కృష్ణ, జయప్రద | పి. సాంబశివరావు | కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే |
| జూదగాడు | (1979) | శోభన్‌బాబు, జయసుధ | కోదండరామిరెడ్డి | కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే |
| కొత్తపేట రౌడీ | (1980) | కృష్ణ, జయప్రద | పి. సాంబశివరావు | కథ, సంభాషణలు, స్క్రీన్‌ప్లే |
| లాయర్ సుహాసిని | (1987) | సుహాసిని, భానుచందర్ | వంశీ | కథ, స్క్రీన్‌ప్లే |

# ఇందులో...

* * *

## సినీవ్యాస రమణీయం (నటీనటులు)

# సమర్థుడైన నటుడు గుమ్మడి వెంకటేశ్వరరావు



పదహారేళ్ళనాడు, గుమ్మడి వెంకటేశ్వరరావు చాలా మంచి నటుడని, తెలుగుదేశంలో ఓహో అనిపించుకుంటాడనీ ఎవరికీ తెలీదు; అతనికీ తెలీదు. అవుతాడని ఎవరన్నా చెబితే అతన్ని ఎరిగినవాళ్లంతా నవ్వి ఊరుకునేవారు; అతనూ నవ్వి ఊరుకునేవాడే.

కాని, 1942లో ఒకరోజున మిత్రులు అతనిచేత ఒక నాటకంలో వేషం వేయించారు. తీరా స్టేజిమీదకి వచ్చాక అతనికి వణుకుపుట్టింది. ముచ్చెమటలూ పోశాయి. అయితే, తెరలోకి పారిపోకుండా, నిలబడి, దీని అంతు 'కనుక్కోవాలి' అనుకుని, తన వంతు మాటలు చెప్పేశాడు. ప్రేక్షకులంతా శెబాష్ అన్నారు; వాళ్ళ ప్రతినిధులు గుమ్మడి వెంకటేశ్వరరావుకు ప్రధమ బహుమతి ఇచ్చి భుజం తట్టారు. అప్పటికి అతనికి వణుకు తగ్గింది. అలాటివాడికి బహుమతి ఎలా వచ్చినట్టు అంటే ఆ జవాబు ఒకటే! ఆరోజు అతను వేసింది 90 ఏళ్ల ముసలివాడి వేషం...

❀ ❀ ❀ ❀

సోవియట్ ప్రజానటుడు చెర్కసోవ్ ఆత్మకథలో దాదాపు ఇలాటిదొక సంఘటన కన్పిస్తుంది. నాటకాలు వేస్తూ ఒకసారి పద్యపఠనం చేస్తూ ఉండగా ఒకరోజున చెర్కసోవ్‌కు గొంతు బొంగురుపోయింది. తప్పనిసరి కాబట్టి, అలాగే రంగం మీదకు వెళ్ళాడు. ఆరోజు అతడు అందుకొన్న ప్రశంసలు ఇన్ని అన్ని కావు.

'సంభాషణలు ఏమి అద్భుతంగా చెప్పాడు! అని మెచ్చుకున్నారట. అక్కడినించి, చెర్కసోవ్, ఆ నాటకం ప్రదర్శనలు జరిగినపుడల్లా, గొంతుబాగున్నా, తెచ్చిపెట్టుకుని బొంగురుపోయినవాడి స్వరంతో ఆ స్థాయిలో మాట్లాడేవాడట.

❀ ❀ ❀ ❀

కాబట్టి ఫలానా నటుడి విజయం అదృష్టం బాపతు... అని సిద్ధాంతాన్ని స్థాపించలేరు. ఒక్కొక్కరిలో ఉన్న అజ్ఞాతప్రజ్ఞకు ఒక్కొక్కసారి ఒక్కొక్క విధంగా దోహదం లభిస్తుంది. అప్పుడది ప్రకాశిస్తుంది. అంతే.

ఈనాడు వెండితెరమీద గుమ్మడి నటనలో, మాటలలో చేతలలో కనబడే ధీమాకు, స్థైర్యానికీ ఆనాటి బహుమతి పునాదిరాయి. అయితే, గుమ్మడి అలా వరుసగా నాటకాలు వేసి పునాదిరాళ్లు పేర్చుకుంటూ రాలేదు. చూసి నేర్చుకుంటూ వచ్చాడేమో. అంతే. అందువల్ల, "రంగస్థలంమీద అపారమైన అనుభవం గడించడం చలనచిత్ర నటనకు అవసరం" అన్న సూత్రం గుమ్మడికి వర్తించదు.

❀ ❀ ❀ ❀

సినిమాలో చేరడానికి ముందు, గుమ్మడి తెనాలిలో రేడియో, ఎలక్ట్రికల్ సామానుల వ్యాపారం చేస్తూవుండేవాడు. సినిమాల్లో చేరకపోతే, అందులోనే ఉండేవాడని అనుకోడానికీ వీలులేదు. ఆ వ్యాపారంలో నష్టం వచ్చింది. అందుకని అతడు చెన్నపట్నం చేరాడు. కాని 'ఛాన్సు' రాలేదు. గుమ్మడి మళ్ళీ ఇంటికొచ్చేశాడు. 'నేను కనుక్కుంటానులే' అన్నాడు గుమ్మడి అభిమాని డి.ఎల్! ఓ ఏడాది తరువాత టి.ఎన్.టి వారి 'అదృష్టదీపుడు'లో ఒక వేషానికి కొత్తనటుడు కావాలని దర్శక నిర్మాత సౌందరరాజన్ డి.ఎల్.ను అడిగారు. తనదగ్గిర ఉన్న బొమ్మలు చూపించి "ఇతను సమర్థుడు" అని చెప్పారు. డి.ఎల్

మూడోనాటికల్లా మళ్లీ మెద్రాసు వచ్చాడు గుమ్మడి. 'అదృష్టదీపుడు'లో నటనకు వెయ్యిన్నూటపదహార్లిచ్చి సత్కరించారు నిర్మాత.

కాని, ఆ తరువాత మళ్ళీ ఇంకో ఛాన్సు ఎంతకీ రాలేదు. వెళ్ళిపోవడం మంచిదనుకున్నాడు ఒకరోజున.

ఆ రోజున గుమ్మడిని ఆపినవాడు ఎన్.టి. రామారావు. ఎన్.టి.ఆర్. సోదరులు ఎన్.ఎ.టి. పేరిట నిర్మించిన 'పిచ్చిపుల్లయ్య'లో ఎస్టేటు మేనేజరు వేషం వేశాడు గుమ్మడి. ఆ చిత్రం ఆర్థికంగా సముచిత విజయం సాధించకపోయినా, గుమ్మడికి మంచిపేరు వచ్చింది. ఎన్.ఎ.టి. వారి తరువాతి చిత్రం, 'తోడుదొంగలు'లోను, రాగిణీవారి 'అర్ధాంగి'లోను మంచి భూమికలు లభించాయి.

గుమ్మడి వెంకటేశ్వరరావుకు విలన్ వేషాలు వెయ్యడం జీవిత లక్ష్యం కాదు. అయితే జీవితంలో కోరుకున్నది గబుక్కున రాదు. గుమ్మడి, అప్పటికి 'ఛాన్సు' కాదని, నచ్చిన వేషాలు ఎంచుకునే స్థితిలో లేనూ లేదు. అప్పుడు 'ఛాన్సు' విలన్ వేషాలే

ఇచ్చింది. గాలి అటే వీచింది. తొలిరోజు నాటకంలో వేషం కట్టినట్లే, ఇందుకూ ఒప్పుకున్నాడు గుమ్మడి. ఈసారి మటుకు అప్పటిలా అప్పనంగాకాక 'ఛాన్సుగా' అతనికి మంచిపేరు వచ్చింది. ఎవరూ ఆపలేకపోయారు. ఇతను సమర్థుడు, మితి తెలిసిన నటుడు అనుకున్నారు. 'విలన్'కు బెస్టు అని కొందరు అనేశారు. ఆ తరువాత తమిళ చిత్రసీమలో 'విలన్' వీరప్పకు తెలుగు ప్రతిగా గుమ్మడి నిలబడ్డాడు. గాలివాలుని బట్టి వచ్చిన అవకాశాలని తెలిసినటప్పటికీ 'తోడుదొంగలు', 'జయసింహ', 'ఏది నిజం' వంటి చిత్రాలలో గుమ్మడి నటనను చూచినవారు అతని ప్రజ్ఞను మెచ్చుకోకుండా ఉండలేరు. గుమ్మడి చిత్రించే దుర్మార్గులు యాబ్రాసిరకం వాళ్లు కారు. నిత్యజీవితంలో తటస్థపడే గోముఖవ్యాఘ్రాలకు బాగా దగ్గిరగా ఉంటారు. ఎటొచ్చి ఆయా చిత్రాలలో 'ఒక్కొక్క సీను' డిసాల్వు అయినపుడు, అతడు దుర్మార్గుడని పునరుద్ఘాటించడానికి దర్శకుడు పులితలలు, పాములూ, వెలుగునీడలూ వంటి హంగులతో ఆర్భాటం చేయడంవల్ల ఆ క్షణాలలో 'సినిమా దుర్మార్గుడు' అని ప్రేక్షకుడికి అనిపించవచ్చు. అది నటుడి తప్పు కాదు. గుమ్మడి మితిమీరి నటించడు. తొణుకు బెణుకు లేకుండా దుర్మార్గాలు చేసేవాడి ధీమాని అడుగడుగునా స్ఫురింపచేస్తాడు. క్షణంలో ముఖ కవళికలు మార్చి, మహాకోపాన్ని మందహాసంలోకి తర్జుమాచేసే దుర్మార్గుల గుణగణాలనూ లక్షణాలను ఎక్కడా పొల్లుపోకుండా ప్రదర్శిస్తాడు. అయినా, కరుణాన్వితమైవ పాత్రలు నిర్వహించడం గుమ్మడి అభీష్టం. ప్రేక్షక హృదయాలను కదిలించి, అపారమైన సానుభూతిని సంపాదించుకొన్న వాటిలో 'దాంపత్యం,' 'దొంగల్లోదొర', 'ఇలవేల్పు' చిత్రాలలో గుమ్మడి ధరించిన పాత్రలు ఎన్న తగ్గవి. రీవికి, నిండుతనానికి ఇవి రూపకల్పనలు. చాలా పెద్దవాళ్ళు,



కృష్ణలీలలులో రంగారావు తో

గౌరవాస్పదులైనవాళ్ళు జీవితానికోసారి ఎప్పుడో బేలలైపోయి బోరున ఏడిస్తే మనం చూడలేం. చూస్తే మరచిపోలేము. గుమ్మడి నిర్వహిస్తున్న పాత్ర కంట తడిపెడితే, అటువంటివి జ్ఞాపకం వస్తాయి. ప్రేక్షకుడి సానుభూతికి ఆ పాత్ర పాత్రత గడించుకొంటుంది. సినిమా అయిపోయాక గుమ్మడి గౌరవం గడించుకొంటాడు.

ఈ విధంగా ప్రేక్షకుడిని పూర్తిగా వశపరచుకొని అతడి, గౌరవాభిమానాలకు పాత్రం కావాలంటే, పాత్రను అద్భుతంగా ఒప్పించాలి. పాత్రను అద్భుతంగా ఒప్పించడానికి నటుడు ఏం చెయ్యాలి? పాత్రలో లీనమైపోవాలా?

"అక్కర్లేదు. ఆమాట కొస్తే, అది తగదు. అలా లీనమైపోతే ఇంక నటుడికి తనేం చేస్తున్నాడో కూడా తనకే తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. ఒక్కొక్క సన్నివేశంలో దగ్గరవుండి చూస్తున్నవారికీ, నటుడికీ అది అద్భుతంగా కనబడవచ్చు. కాని, ఆ పాత్ర పూర్వాపరాలు, కథ స్వరూప స్వభావాలు సమన్వయించవలసి వచ్చినపుడు అదే, వెగటుగా జుగుప్సాకరంగా కనిపించవచ్చు కూడా. అందువల్ల, నటుడు తనపాత్ర మంచిచెడ్డలు తెలుసుకుని, తను పక్కన ఉండి దాన్ని నడిపిస్తున్నట్టు వ్యవహరించాలి. అప్పుడే ఆయా పాత్రల ప్రవర్తన ఎబ్బెట్టు అనిపించకుండా, జీవితంలో కనబడే మనుషుల తరహాకు దగ్గరగా ఉందని అనిపిస్తుంది." అంటాడు; 'ఇంతవరకూ ఎన్నడూ మితిమీరకుండా గతి తప్పకుండా పాత్రలు నిర్వహించి మంచి నటుడనిపించుకొంటున్న గుమ్మడి వెంకటేశ్వరరావు! ఇంతవరకూ అతడు నటించినవి 85 చిత్రాలు ఇపుడు 15 చిత్రాలలో పనిచేస్తున్నారు.

**(ఆంధ్ర-వారపత్రిక - 1958)**

గుమ్మడి కెరియర్ నాలుగుదశాబ్దాలకు పైగా సాగింది. వివిధరకాలైన పాత్రలను అవలీలగా పోషించినా, సాత్త్విక పాత్రలకు పెట్టింది పేరుగా నిలిచారు. తన అభినయానికి వన్నె తెచ్చిన కంఠస్వరం దెబ్బతినడంతో అయిదారేళ్ళుగా సినిమాల నుండి విరమించుకున్నారు. పలు బాపు, రమణల సినిమాలలో నటించడమే కాక వారికి వీరాభిమానినని గర్వంగా చెప్పుకుంటారు.

# ప్రజ్ఞాశాలి రంగారావు



వెండితెరకు రాకుండా ఉంటే, ఎస్.వి. రంగారావు ఏం చేసేవాడు? ఎప్పుడో అప్పుడు ఝామ్మని వచ్చేసేవాడు. అందుకేం సందేహం లేదు.

"అసలా ప్రశ్నే లేదు. 'నటన' మీద నాకు గురి గౌరవం ఉన్నాయి. నేర్చుకున్నాను. అయినపుడు ఇంక, నటుడు కాకపోవడమేమిటి. అబ్సర్డ్..." అంటాడు, తెలుగు తమిళ చిత్రసీమల అగ్రశ్రేణి నటుడు ఎస్.వి. రంగారావు నవ్వుతూ.

ఇవాళ అతడు ఇంతవాడు అయ్యాడు కాబట్టి, అనుకున్నది సాధించాడు కాబట్టి ఈ మాటలు ధీమాగా చెబుతున్నాడు. ఈ ధీమామటుకు మొదట్నించీ ఉండేది. ఆత్మవిశ్వాసం విలువ తెలిసిన వాళ్ళెవరూ దీన్ని గర్వం అని అపార్థం చేసుకోరు. అలా చేసుకునేదల్లా, ఒక మనిషి తను సాధించబోయే వాటి గురించి ముందర చెప్పుకున్నప్పుడే.

తలపెట్టిన లక్ష్యం తప్పకుండా సాధించేవాళ్ళకు జీవితంలో బలం ఇచ్చేది క్రమశిక్షణ అని చెబుతారు. అదే రంగారావు జీవితానికి సూటిబాట వేసి పెట్టింది. వాళ్ళ నాన్నగారు ధవళేశ్వరంలో ఎక్సైజు ఇన్‌స్పెక్టరు చేసేవారు. రంగారావు ఆ ఊళ్ళోనే పుట్టాడు. అన్నదమ్ములూ **అక్కచెల్లెళ్ళు** మొత్తం 11 మంది. అలాంటి ఇళ్ళలో గారానికి ఆస్కారాలుండవు సాధారణ**ంగా. ఆ** యింటి పెద్ద, తన పుత్రవాత్సల్యాన్ని క్రమశిక్షణమాటున దాచిపెట్టి పిల్లలందర్నీ **భయభక్తుల్లో** పెంచాడు. పిల్లలు అల్లరి చిల్లరిగా తిరుగుతూ ఒకరినొకరు తరచు కలుసుకోక పోవడంవల్ల కొన్ని పెద్ద కుటుంబాలలో, 'అబ్బాయీ! వీడు మీ అన్నయ్య, ఇది మీ చెల్లాయి' అని ఎవరో వాళ్ళని పరిచయం చేయాల్సివస్తూ ఉంటుంది. ఇక్కడ ఆ ప్రమాదం లేదు. ఖచ్చితంగా భోజనాలవేళ అందరూ డైనింగ్ టేబుల్ దగ్గర హాజరు కావలసిందే. నాటకాల రిహార్సలువల్ల అప్పుడపుడు గైరు హాజరయే రంగారావు చివాట్లు, పొడన్నం కలిపి భోంచేసేవాడు.

రాజమండ్రి ఆర్ట్స్ కాలేజీలో చేరాక, నాటకాల సరదా, అనుభవం, పేరూ, తద్వారా ఆత్మవిశ్వాసం పెరిగాయి.




షేక్స్పియర్ నాటకాలలో చాలా పాత్రలు నిర్వహించి ప్రశంసలూ, బహుమతులూ, విమర్శలూ, సంపాదించుకున్నాడు. బి.ఎస్.సి. పూర్తి అయింది. తొలిడిగ్రీ కొంతమంది చదువుకి కామా, కొందొకచో సెమికోలన్; రంగారావు, కళాశాల చదువుకి ఫుల్‌స్టాప్ పెట్టేసి నాటక కళాశాలారాధన కొనసాగించాడు. ఆనాడు ఉభయగోదావరి జిల్లాలలో పేర్గాంచిన 'యంగ్‌మన్స్ హాపీక్లబ్' రంగారావు ఒక ముఖ్యుడు. రేలంగి, అంజలీదేవి మొదలగువాళ్ళు అపుడూ సహనటులే.

ఫైర్ బ్రిగేడ్‌లో ఉద్యోగం వచ్చి, కొన్నాళ్ళు మసులాలోను, కొంతకాలం విజయనగరంలోను ఉన్నాడు రంగారావు. అపుడే తొలి సినిమా ఛాన్సు వచ్చింది. కీ.శే. బి.వి. రామానందం ఆహ్వానంపై, 'వరూధిని' చిత్రంలో నటించాడు రంగారావు. ఆ చిత్రం విజయవంతం కాలేదు. కొత్త ఛాన్సులు రాలేదు. ఆ ఘట్టంలోనే ఇబ్బందులు, సమస్యలూ రంగారావు జీవితంలోకి తొంగిచూశాయి. తండ్రి చనిపోయారు. తనే చెల్లెళ్లకు పెళ్లిళ్లు చెయ్యాలి. ఇల్లు నడపాలి. 'ఇంటి పెద్దవి నువ్వు నాటకాలవాళ్లతోటీ సినిమాలవాళ్లతోటీ తిరుగుతూ ఉంటే ఇల్లేం చక్కబెడతావు" అని చుట్టపక్కాలు అన్నారు.

"తొలిసారిగా నేను భయపడిన సందర్భం అదే" అంటాడు రంగారావు. అంతవరకు తండ్రిపట్ల చూపిన భయం గౌరవానికి రూపాంతరం.

తాత్కాలికంగా ఆ పరిస్థితులకు లొంగి తాతానగర్‌లో ఉద్యోగం సంపాదించాడు రంగారావు.

1948 ఏప్రిల్‌లో బి.ఎ. సుబ్బారావు పిలిచి, 'పల్లెటూరిపిల్ల'లో వేషం ఇవ్వడం జరిగింది.

రంగారావును సినిమారంగంమీద నిలిపి వృద్ధికి తెచ్చిన చిత్రం విజయావారి షావుకారు (1950). తెలుగుచిత్రాల కథలో 'షావుకారు' ఒక మైలురాయి; అందులో రౌడీ పాత్ర (రంగారావు) కీర్తికిరీటానికి, నాటికీ నేటికీ కూడా తురాయి.

ఆ చిత్రంలో మూడురోజులు పనిచేసేసరికల్లా ఆ చిత్రం దర్శకుడు ప్రసాద్, నిర్మాతలు నాగిరెడ్డి, చక్రపాణి అతని నటనకు ఎక్సలెంట్ అనే విశేషణాన్ని

ఉపయోగించారు. ఆ రోజునే నాగిరెడ్డిగారు రంగారావుకు 'విజయాస్థాన'నటుడిగా మూడేళ్లకు బుక్ చేసి కాంట్రాక్టు వ్రాసుకున్నారు! ఆ రోజున చూపిన ఉత్సాహాన్నే మూడేళ్లూ ప్రదర్శించి రంగారావు సామర్థ్యాన్ని అద్భుతంగా ఉపయోగించారు. ఆ మూడేళ్లలోనే రంగారావు 'బహుముఖ ప్రజ్ఞావంతుడన్న' దాగిన సత్యం వెల్లడి అయింది. షావుకారులో రంగారావుది పల్లెటూరి రౌడీపాత్ర. అంత సమగ్రమైన పాత్ర, అంత నిర్దుష్టమైన నటన అరుదుగా కనబడతాయని అంతా మెచ్చుకున్నారు. తరువాత చిత్రం 'పాతాళభైరవి' ఇందులో 'మాంత్రికుడి' పాత్ర ఇప్పటికీ ఎవరూ మర్చిపోయి ఉండరు. మూడో చిత్రం 'పెళ్ళిచేసిచూడు'లో ధూపాటి వియ్యన్నపంతులు వేషాన్ని 'పాతాళభైరవి' మాంత్రికుడే వేశాడంటే– వేశాడు కాబట్టి నమ్మాలి అన్నారు, రంగారావు ప్రదర్శించిన కవళికలూ, కదలికలూ చూచినవారు. తరువాతి చిత్రం 'చంద్రహారం'లో పాత్ర తిరిగి దీనికి పూర్తిగా భిన్నమయినది. రంగారావు అందులో రాకుమారుడికి తండ్రి కాదు - బంటు. అయినా, అతడు రూపుధరించిన పితృవాత్సల్యంగా మనకు కనిపిస్తాడు...తరువాత రంగారావు నటించిన అనేక పాత్రలపై చాలావరకు పై నాలుగింటి క్రీనీడలూ పడుతూ వచ్చాయి.

వాహినీవారి 'బంగారుపాప' రంగారావు చలనచిత్ర యాత్రలో మరొక మైలురాయి. అందులో పంచప్రాణాలూ ఉన్న ఒక మనిషి నిండుజీవితాన్ని అతడు జీవించాడు. పొగరు, తిక్క, పోనుపోను నిగ్రహం, అనక అనురాగం, వార్ధక్యపు లక్షణాలు, అప్పటి చాదస్తం, ఎక్కడికక్కడ ప్రదర్శిస్తూనే ఆద్యంతం ఆ వ్యక్తి జీవితానికి ప్రధాన లక్షణంగా భావించిన పౌరుషాన్ని ఎక్కడా విస్మరించకుండా పోషించాడు.

అనేకమంది నటుల కళాజీవితంలో కన్న, ఈ నటుడి కధలో వైవిధ్యం చైతన్యం ఎక్కువగా కనిపిస్తాయి. కళ దృష్ట్యా, ఎంతో నిండయిన జీవితాన్ని నిత్యకల్యాణం పచ్చతోరణంగా సాగిస్తున్నాడు.


బంగారు పాపలో రంగారావు

అనేక కారణాలవల్ల, ఒకవ్యక్తి తనశక్తికి అతీతమైన నేటి పరిస్థితులవల్ల, కొన్నికొన్ని సందర్భాలలో, అసమగ్రము, రసహీనమూ అయిన పాత్రలను కూడా ఒప్పుకొని నిర్వహించవలసి వచ్చినప్పుడు ఎక్కడికక్కడ, తన వ్యక్తిగతముద్రను ఆ పాత్రల మీద వేస్తూ శాయశక్తులా దాన్ని పైకి లేవనెత్తుతూ ఉన్నంతలో వీలైనంత

రాణింప చేయడానికే రంగారావు కృషి చేస్తాడు. సాధారణంగా ఏ పాత్ర తీసుకున్నా దాని ప్రవర్తనగురించి, స్వరూపస్వభావాల గురించి చర్చిస్తాడు. "కొంత పోట్లాటలాడి తీవ్రచర్చ జరిగితేగాని, విలువైన విషయాలు బయటకురావు. ఆయా పాత్రలను అవగతం చేసుకొని, నిర్వచనం ఇచ్చేవిధానం నిర్ధారణ చేసుకోవడంలో నాకు ఎంతో తోడ్పడ్డవారిలో చక్రపాణిగారు ముఖ్యులు. గంటలతరబడి చర్చలు జరిపేవాళ్ళం" అంటాడు రంగారావు.

మూడేళ్ళపాటు 'విజయా' సంస్థలో ఉన్న తరువాత, బయట చిత్రాలలో పాత్రలు తీసుకోవడం మొదలుపెట్టాడు. ఆహ్వానాలు పుష్కలంగా వచ్చాయి. తరువాతి ఆరేడేళ్ళలోను రంగారావు 60 చిత్రాలలో నటించాడు. తమిళనాడులో కూడా మేటి నటుడయాడు. ఇంత తక్కువ కాలంలో ఇన్ని చిత్రాలలో నటించేవాడు ప్రతి చిత్రానికీ, ప్రశంసలందుకోవడం మాటలు కాదు. అయినా రోజూ ఒక అడుగు ముందుకు పెట్టగలగడానికి కారణం, కళారాధకుడుగా అతనిలో గల అసంతృప్తే. అన్నిటికన్న ఆత్మవిమర్శనకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తాడు రంగారావు. అందుకనే అపుడపుడు తన పాత చిత్రాలు తెప్పించి వేసుకు చూస్తూ ఉంటాడు.

"పొగరెత్తకుండా, కొమ్ములు మొలవకుండా ఉండదలచుకుంటే, మనం నిన్న చేసిన కృషిని ఇవాళ ఓసారి చూడడం ఉత్తమం. మన శక్తిసామర్థ్యాలమీద అదే అతినిశితమైన విమర్శ చేస్తుంది. దానికింక మొహమాటంలేదు" అంటాడు రంగారావు.


మాయాబజార్‌లో ఘటోత్కచుడిగా రంగారావు

పై రెండూ కాక, ఇతర దేశాల చిత్రాలు, ఇతర నటుల సాధన ఎలా ఉన్నాయో తెలుసుకుంటాడు. అవన్నీ చూస్తే, తెలుసుకుంటే, ఎవరికీ అతిశయం అతిశయించదు అని అతని సిద్ధాంతం. పరిపూర్ణత ప్రతివారికీ ధ్యేయమే కాని, సాధ్యం అవునని ఎవరూ గుండెమీద చేయివేసుకు చెప్పలేరు. ప్రతి వ్యక్తిలోను మహాప్రపంచం ఉంటుంది. అలా కోట్లాది వ్యక్తులున్నారు. ఇంతమందిని అర్థం చేసుకొని, అన్ని రకాల పాత్రలు ధరించి, అందరి హృదయాలను మనవి చేసుకుంటే, నటనలో పరాకాష్ఠ నందుకోగలం. కాని అది సాధించడానికి ఒక జీవితం కూడా ఏ మూలకీ చాలదు అంటాడు రంగారావు సమర్థుడి వినమ్రతతో.

రంగారావు నిర్వహించే ఏ పాత్ర అయినా అత్యంత చైతన్యవంతంగా, హుషారుగా జీవిస్తుంది. తను సంతోషంగా ఉండి ఎదటివాళ్ళని సంతోషపెడుతుంది. అది అతని ముద్ర. 'మాయాబజార్'లో ఘటోత్కచుడి పాత్రకు రంగారావు నిర్వచనం ఇదే. సారంగధరలో రాజరాజు పాత్రకూ ఈ సూత్రాన్ని పాటించాడు. రాజఠీవికి భంగం వాటిల్లదా అనే ప్రశ్నకు అతని జవాబు: రాజులూ మనుష్యులే గదా!

రంగారావు నిత్యజీవితంలో కూడా ఆడుతూ పాడుతూ హుషారుగా ఉంటాడు. సెట్ మీదా నవ్వుతూ, నవ్విస్తూ.

"ఇన్ని చిత్రాలలో నటిస్తున్నారు. మీకు విశ్రాంతి అవసరం లేదా?" అన్న ప్రశ్నకు జవాబు.

"నాలాటి వాళ్ళకు పనే విశ్రాంతి కాదా?"

**(ఆంధ్ర-వారపత్రిక - 1958)**

యస్.వి. రంగారావు (1918-74) ఆయన నటనాప్రభ చివరివరకూ వెలుగుతూనే ఉంది. 'విశ్వవిఖ్యాత నటసార్వభౌమ' బిరుదు పొందారు. 'నర్తనశాల'లో కీచకుని పాత్రకు జకార్తాలో అవార్డు గెలుచుకున్నారు. తమిళంలో కూడా పేరెన్నిక గలిగిన నటుడయ్యారు. పలుభాషలలో 300 సినిమాలు నటించి నిర్మాతగా, దర్శకుడుగా ఎదిగారు. అయన దర్శకత్వం వహించిన 'చదరంగం' రాష్ట్రప్రభుత్వ బహుమతి పొందింది. బాపురమణల 'సంపూర్ణరామాయణం'లో రావణుడి పాత్ర పోషించి వారి అభిమాని అయ్యారు కూడా!



# రేలంగి - వెంకటరామయ్య

రెండు పుష్కరాల చిల్లర ముందర కాకినాడ యంగ్‌మన్స్ హాపీక్లబ్‌లో చిల్లరవేషం వేస్తున్న ఒక పిల్లాడిని చూసి, ఒక నటుడు పుట్టాడు అన్నాడు క్లబ్ డైరెక్టరు. ఆ పిల్లడి పేరు రేలంగి.

ఆంధ్రదేశంలో నవ్వుకి పుట్టిల్లుగా హాస్యానికి మారుపేరుగా మారుమోగవలసి ఉన్న ఈ పేరు రెండోభాగం పేరు వెంకటరామయ్య. నాటికి రెండు పుంజీల సంవత్సరాల క్రితం ఓ హరికథకుడి ఇంట పుట్టాడు వెంకటరామయ్య అనే పేరుతో. కులదీపకుడు వెలిశాడు అనుకున్నారాయన. హరికి నమస్కరించారు.

❀ ❀ ❀ ❀

యంగ్‌మన్స్ హాపీక్లబ్ వారి రంగస్థలంమీద పుట్టాడు ఓ బాలనటుడు. వచ్చీరానిలేత రెక్కలతో పసి ఊహలతో ఎనిమిదో ఏటనే జీవితంమీద స్వయంగా ఎగరడం ఆరంభించి, పడ్డాడు. దెబ్బతగిలి ఏడుపొస్తే "ఫర్వాలేదు దెబ్బ నీకు కాదు బ్రదర్. నీకు తగిలింది దెబ్బకాదుగురూ" అని తనను తనే ఓదార్చుకున్నాడు. అంతలోనే తన చమత్కారానికి తనే నవ్వేసుకుని, ఆకలేస్తే మంచినీళ్ళు తాగచ్చుట. చాలామంది ఈ రకంగా కడుపులో కాముడికి టోకరా యిస్తారు అని చుట్టూ

ఉన్నవారిమీద చదువుకుని ప్రయోగించి నవ్వుకోడం, నవ్వడం, నవ్వించడం అలవాటు చేసుకున్నాడు.

ఈ 'స్వయంపాకానికి' కారణం వాళ్ళ నాన్న రేలంగిలో నటుడి పరిమళాన్ని హర్షింప లేకపోవడమే.

ఆయన హరికథలు చెబుతూ ఉండేవారు. ఒక షాపు ఉండేది. రేలంగి ఆయనవెంట ఉంటూ, వింటూ, ప్రసాదాలూ, అపుడపుడు అల్లరికి తిట్లు తింటూ ఉండేవాడు.

ఒకరోజున "నాన్నా నాటకం చూదుగాని రా' అని తీసుకెళ్ళారు నాన్నగారు. శ్రీకృష్ణుడి నాటకం అది. యోగమాయావాళ్లూ ఆకాశంలో ఎత్తుగా ఉండి మాట్లాడారు.

"నాన్నా వాడు అంతపైన ఎలా ఉన్నాడూ!" అడిగాడు రేలంగి.

'వైర్ వర్క్' అన్నారు తండ్రి. తరువాత, తీసుకెళ్ళి అదంతా చూపించాడు. గ్రీన్‌రూమ్‌లో దేవతలూ, కృష్ణుడూ వాళ్ళు హడావుడిగా ఉన్నారు. ధగధగమని కిరీటాలూ, రంగులూ, అవీ చూసి 'గుమ్మెపోయాడు" రేలంగి.

❀ ❀ ❀ ❀

"ఛఛ నువ్వు నాటకాలు వెయ్యకూడదు. వాళ్ళు మర్యాదస్తులు కారు. వాళ్ళతో కలిస్తే, నీకెవరూ పిల్లనివ్వరు తెలిసిందా" అన్నారు రామదాసుగారు.

రేలంగికి తెలియలేదు. ఊరుకోలేదు. సరాసరి కంపెనీవాళ్ల దగ్గరకెళ్లి వేషం ఇమ్మని అడిగాడు. పాడి వినిపించాడు. రిహార్సలు గదిలో ఆరోజు రేలంగిపాట విని ప్రొడ్యూసరుగాని ఇతర నటీనటులుగాని తన్మయులై మైమరచి పోలేదు. ఆమాటకొస్తే రేలంగి కూడా తనపాట విని ఏమంత పరవశించినట్లు చారిత్రకాధారాలు లేవు.

రాత్రి పొద్దుపోయినా పిల్లాడు ఇంటికి రాకపోయేసరికి రామదాసుగారు కంగారుపడి వెతికారు. రేలంగిలో ప్రజ్ఞని పదిహేనేళ్ల క్రితంవరకూ గట్టిగా పసిగట్టలేకపోయిన సినిమా నిర్మాతలలాగే రేలంగి ఫలానా డ్రామాకంపెనీలో సైడ్‌వింగ్సు చాటున వుండి చక్రాల్లాంటి కళ్ళు విప్పార్చి చూస్తూ ఆ రాత్రివేళ నిజంకాబోయే పగటికలలు కంటున్నాడని రామదాసుగారు ఊహించలేకపోయారు. మర్నాడు పొద్దుట కబురు తెలియగానే ఆయన పరుగుపరుగున కంపెనీకి వెళ్ళి "ఏడీ వాడు" అని గర్జించారు.

'వాడు' దగ్గిరికివచ్చి భోరున ఏడవలేదు. చేసింది తప్పే కాని, రైటులా కనిపిస్తోంది అంది అతడి వాలకం.

'నేను రాను నాన్నా నాటకాల్లో వేషాలు వేస్తాను' అన్నాడు రేలంగి.

"పోన్లెండి ఉణ్ణీండి. పిల్లలతో ఇక్కడేవుండి చదువుకుంటూ నాటకాలు వేస్తూ వుంటాడు" అన్నాడు క్లబ్ పెద్ద...

ఆ క్లబ్బులో వుండి పనిచేసిన ఐదేళ్ళూ రేలంగి నిరాఘాటంగా సెకండుఫారం చదువుకున్నారు.

అతని మాటలలోనే... "నేనక్కడ చేరినపుడు సెకండుఫారంలో ఉన్నాను; ఐదేళ్ల తరువాత మానేసినపుడూ సెకండుఫారంలోనే ఉన్నాను."

మానేశాక, కొన్నేళ్ళపాటు సెకండుఫారం చదువుకు ఆటంకాలొచ్చాయి- తర్డుఫారం, ఫోర్తుఫారంలాటివి. ఆ సమయంలోనే తొలిసారి కంపెనీతో టూర్ వెళ్ళివచ్చాడు. కంపెనీవారు వందరూపాయ లిచ్చారు. మొదటి సంపాదనను భక్తి పూర్వకంగా పట్టికెళ్ళి తండ్రికి ఇచ్చాడు రేలంగి. ఆయన పొంగిపోయారు. దీవించారు- విద్యావంతుడవు కమ్మని.

తరువాత జీవితంమీద లాటరీ ఆరంభమైంది. నాట'కాళ్ల'మీద నడచిపోతున్న రేలంగికి ఒకసారి నాలుగు డబ్బులు గిట్టేవి. ఒకసారి వాటికి బొత్తిగా ఇతగాడి పొడగిట్టేది కాదు. ఈ స్థితి దాదాపు 1947 దాకా సాగుతూనే వచ్చింది. అయినా తెరమీద రేలంగి లాగే తెరవెనుక రేలంగి కష్టాలు పడ్డాడే తప్ప విచారపడలేదు. ఒకపుడు ఆయన తండ్రిగారికి సుస్తీచేసి ఆస్పత్రిలో చేరారు. భార్య ప్రసూతి ఆస్పత్రిలో ఉంది. అర్జెంటుగా 50 రూపాయిలు కావాల్సి వచ్చాయి. తెలిసినవాళ్ళని, తనవల్ల ఉపకారాలు పొందినవాళ్ళనీ అడిగిచూడబోయాడు రేలంగి.

అప్పిచ్చువాడు కనబడలేదు; కనబడ్డవాడు అప్పివ్వలేదు. ఉన్నంతలోనే ఉపకారం చేయడం చాలా మామూలు విషయం అనుకుంటూ యధాశక్తిన ఆ మేరకు తోచింది చేస్తూ ఉండే రేలంగికి, తను ఇలాటి ఇబ్బందిలో ఉన్నపుడు ఎవరూ ఎందుకు ఉపకారం చేయడంలేదో మొదట బోధపడింది కాదు.

"తరువాత పడిందనుకోండి... ఆ ట్రిక్కంతా ఉపకారికి నుపకారము పద్యంలో ఉందనుకుంటా." అన్నాడు రేలంగి నవ్వుతూ.

'ఉపకారి' పద్యకారుడు ఏమన్నాడుట? ఉపకారికి నుపకారము చెయ్యడం ఏమంత ఘనమైన పనికాదుట. చేస్తే గీస్తే అపకారికి చెయ్యమన్నాడు ఉపకారం. రేలంగికి ఎవడూ అప్పిచ్చి ఉపకారం చెయ్యలేదు కాబట్టి బహుశా అతను ఎవరికీ అపకారం చేసి ఉండడు.

   

"నిజమే బ్రదర్!" అన్నాడు అతని సహచరుడు బి.ఎ. సుబ్బారావు.

మనం కష్టాల్లో ఉన్నపుడు, మనం ఒకపుడు సాయంచేసిన వాళ్ళ దగ్గిరికి వెళ్ళకూడదు కాబోలు అన్నాడు.

చివరికి రేలంగికి ఒక నటి సహాయపడింది. ఆమెకు రేలంగి ఉపకారాలు ఏమీ చెయ్యలేదు కాని, తను కలకత్తాలో ఫిలింకంపెనీ ప్రొడక్షన్ మేనేజరుగా ఉండగా ఆమె అక్కడ వేషంవేసి వెళ్ళినపుడు ఆదరించి మర్యాదచేసి, చీర రవికెలగుడ్డ పసుపుకుంకం పెట్టి తోబుట్టువును పంపినట్టు సాగనంపాడు. అలా మరిద్దరికికూడా చేసాడు. కాని కాస్తంత పరిచయం పురస్కరించుకుని ఆడకూతుళ్ళను వెళ్ళి అప్పు అడగడం తగునా అని తటపటాయించాడు.


పాతాళభైరవిలో రేలంగి

చివరకు తప్పనిసరి అని, పుష్పవల్లి ఇంటికి వెళ్ళాడు.

ఆమె గుర్తించి, ఆదరించి మాట్లాడింది. "అమ్మా ఇదీ సంగతి" అన్నాడు రేలంగి.

ఆమె అతనికి కావలసిన డబ్బు ఇచ్చి పంపింది. 15 రోజుల తరువాత అతను కొత్త ఫిలింలో బుక్ అయ్యాడు. డబ్బు కొంత చేతికందింది. తక్షణం వెళ్లి ఆమెకు డబ్బు, రెండు బుట్టల పళ్ళూ అందచేశాడు.

"అమ్మా నువ్వు చేసిన ఉపకారంలో డబ్బుని మాత్రం తిరిగి ఇవ్వగలుగుతున్నాను. తప్ప బాకీ తీర్చానని అనుకోటం లేదు" అన్నాడు.

❀ ❀ ❀ ❀

ఆనాడు రేలంగి, తన పొందిన ఉపకారాలు చాలావాటికి యిలాగే చెప్పాడు. డబ్బులాంటివి తిరిగి చెల్లించినా, ఆనాడు వాళ్లు చూపిన ఆదరానికి, అభిమానానికి వడ్డీలు చక్రవడ్డీలూ కట్టి, వాళ్ళకి తన అవసరం వచ్చినప్పుడు ప్రత్యుపకారం రూపేణా బదులు తీరుస్తూ ఉన్నాడు. ఈ రాసుకోని పద్దులకు రేలంగి కాతాలో కాలదోషం పట్టడం లేదని ఆయనను ఎరిగినవారంతా అంటారు. అలా చెల్లించిన "బాకీ వడ్డీ"లలో డబ్బు సాయం దగ్గర్నించి చదువులు చెప్పించడం, పెళ్ళిళ్ళు చేయించడం, పదిహేను ఇరవైవేలు తీసుకునే వేషాలను ఊరికే వేసిపెట్టడంలాంటివి ఎన్నో ఉన్నాయి. ఉపకారికి నుపకారం ఏమంత ఘనంకాదని పద్యంలో ఉన్నా, రేలంగి ఆ పని మరిచిపోలేదు. నిజానికి హాస్యరసజ్ఞుడు రేలంగి ఏదీ మరచిపోలేదు.

పడ్డ కష్టాలన్నీ మరిచిపోయి కులాసాగా ఉండగలిగిన రోజులువచ్చి చాలారోజులు అయినా కష్టాలను మరిచిపోలేదు. దిగుళ్ళను తీసిపారేసి, కష్టాలను తన ప్రవృత్తులను, జనప్రవృత్తులను మటుకే తీసిచూసి ఆనందించడం అపుడూ యిపుడూ కూడా రేలంగికి అలవాటే. అదే హాస్యగాడిని తయారుచేస్తుంది. అదే వెంకట్రామయ్యలోంచి 'రేలంగి'ని తయారుచేసి యిచ్చింది.

"అదేకాదు, సి. పుల్లయ్యగారూ, కె.వి. రెడ్డిగారూ కూడా –" అంటాడు రేలంగి.



సి. పుల్లయ్యగారు రేలంగి పైకి రావడానికి మొదటినుంచీ తోడ్పడ్డవారిలో ముఖ్యులు. దాదాపు 15 ఏళ్ళపాటూ, ఆయనకి ఎక్కడ పనివుంటే ఈయనకి అక్కడ పని ఉండేది. ఇద్దరూ ఎక్కడ వుంటే అక్కడ పనీ వుండేది. 'కె.వీ', రేలంగినిచూసి "దుమ్ము దులిపి", సానబట్టి 'గుణసుందరి'లో రేలంగిని వెలిగించారు. కాని, నాటకరంగస్థలం మీద తిరుగుతున్న రేలంగిని సినిమాలో మొదట ప్రవేశపెట్టినవారు దూసి శాస్త్రి అన్న ఆయన. రేలంగి మొట్టమొదటి చిత్రం 'తులాభారం'. అది కలకత్తాలో తయారయింది. దూసి శాస్త్రిగారు, చురుకయిన కుర్రవాడు కావాలని, రేలంగిని తీసుకువెళ్ళి అక్కడ వేయించారు. జీతం 70 రూపాయలు. వేషంవెయ్యడం, ప్రొడక్షన్ పనులు చూడడం వగైరా బాధ్యతలు చాలా ఉండేవి.

'తులాభారంలో' సంఘటన ఇప్పటికీ రేలంగి మరచిపోలేదు. కుర్రతనపు వేడి అలాటిది అంటాడాయన విచారంగా.

అక్కడ ఒక రోజున డైరెక్టరుకీ రేలంగికీ కంపెనీ కారు గురించి చిన్న తగాయిదా వచ్చింది. మాటా మాటా పెరిగింది. 'కారు' కూతలుదాకా కథముదిరేవరకు రేలంగి ఒకమాట మీదకి చెయ్యి విసిరాడు దూకుడుగా. ఆ దెబ్బకి కంపెనీ రెండైపోయింది. రేలంగి తిరిగి ఈలపాట పాడుకుంటూ (అప్పటికి ఆయన పాటలు పాడడం బాగా నేర్చేసుకున్నాడు. ఆ క్రితం సంవత్సరమే బెంగుళూరు వెళ్లి చింతామణి నాటకానికి రికార్డులుకూడా ఇచ్చాడు.) తెనాలి వచ్చేశాడు. రంగస్థలంమీద ఆయనను వెంటతిప్పుకోవాలని ఉబలాటపడిన స్వజనులూ (జొన్నవిత్తుల, కపిలవాయి రామనాథశాస్త్రి ప్రభృతి హేమాహేమీలు) ఉన్నారు; రేలంగి నటించే స్త్రీ పాత్రలకు హర్షిస్తూనే, అప్పట్లో అప్పుడప్పుడు వేస్తూ అప్పుడే పుంజుకుంటున్న హాస్యనటనమీద ఆశలు పెట్టుకున్న సుజనులూ ఉన్నారు. ఆ సినిమాల జోలికి పోకులే అన్నారు ఆత్మీయులు. ఏడాది తిరిగేలోగా మళ్లీ కబురువచ్చింది కలకత్తానించి. వందకి తక్కువైతే రాను అన్నాడు రేలంగి బింకంగా. రైరో అంది తిరుగుటపాలో జాబు.

రేలంగి కలకత్తావెళ్లి సి. పుల్లయ్యగారి జంటచిత్రాలు ధ్రువ, మార్కండేయలలో పనిచేశాడు. తరవాత జీవనం కొన్నాళ్లు ఉత్తర దక్షిణాల మధ్య షటిల్ సర్వీసులా

చకచక సాగిపోయింది. తెలుగులోనూ పరిశ్రమ చెన్నపట్నంలో స్థిరపడిన వేళకు రేలంగి షటిల్ సర్వీసు ఆగిపోయింది.

సినిమా తీయడం ఇంకా పూర్తిగా వ్యాపారం కాని రోజులు అవి. సినిమాచుట్టూ ఒక విధమైన రొమాన్సు ఉండేది. డబ్బు తిరిగినా ఇంత భారీ ఎత్తున తిరిగేది కాదు. శోభనాచల స్టుడియోని అంతా ఆంధ్రా హాలివుడ్ అని అభిమానంగా పిలుచుకునేవారు. హాలీవుడ్ మధ్యన ఉండే ఆ స్టుడియో, ఆ మనుషులూ అప్పటి మనసులూ వాతావరణం అంతా ఈనాడు తలచుకుంటే స్వప్నసీమలో దృశ్యంలా కనిపిస్తుంది. మీర్జాపూర్ రాజాగారు అక్కడ 'కీలుగుర్రం' తీస్తున్నారు. నాగేశ్వరరావు హీరో! కామెరా అంటే ఇంకా జంకుతో, సిగ్గుపడుతూ ఉన్న రోజులు. ఆ చిత్రంలో రేలంగికి చిన్న ఛాన్సు దొరికింది. నటి, నిర్మాత కృష్ణవేణి ఆనాడు అవకాశం యిప్పించి ఆదుకుందని రేలంగి ఇప్పటికీ గొప్పగా చెపుతాడు. అందులో రేలంగికి ఒక హీరోయినునుకూడా ఇచ్చారు. ఇద్దరూ ఒక డ్యూయెట్ (ప్లేబ్యాకుకాదు) పాడారు. బాగుందన్నారు నలుగురూ.



మాయాబజార్‌లో రేలంగి

నలుగురూ ఆ మాట గట్టిగా అనుకోడానికి రేలంగి 'వింధ్య రాణి' వరకూ ఆగాల్సి వచ్చింది. ఆలోగా అతడు బాగా శెట్టి, వసంతకుడు వగైరా పాత్రలలో - స్థిరపడిపోయాడు. 'వింధ్యరాణి'లో నటన, అంతవరకు ఉన్న పేరుకుతోడై, పైకి ఓ తోపుతోసింది. రాకెట్ గ్రౌండువదలి ఎగరడం మొదలుపెట్టింది. జీవితం సెకండ్ గేర్‌లో నడుస్తోంది.

'పల్లెటూరి పిల్ల'లో వేషంకూడా బాగుందన్నారు. పుల్లయ్య గారి చిత్రాలు - వరవిక్రయం, మాలతీమాధవం వగైరాలు జీవికకు తోడ్పడుతున్నాయి.

'గుణసుందరికథ"కి, కె.వి. రెడ్డిగారు రేలంగిని తీసుకోవడంతో కథ పుంజుకుంది. అది విడుదల కావడంతో రాకెట్, తొలి రాకెట్‌ను వదలివేసి పైకి తన్నింది. జీవితం తర్డ్‌గేరులోపడి ఝామ్మని ముందుకు సాగింది. నాటికి నేటికీ

రేలంగి ఎక్కడా ఆగడం జరగలేదు. ఆగబోయిన వేళలో సంసారం, స్త్రీసాహసం, పాతాళభైరవి వంటి చిత్రాలు పేరులో పెట్రోలు పోశాయి.

❀ ❀ ❀ ❀

ఇంతదూరం 'రేలంగిని' నడిపించుకువచ్చి 'వెంకటరామయ్య', ఈ ఘట్టంలో పేచీలు పెడుతూ ఉండేవాడు.

"ఇలా గురూ" అంటాడు రేలంగి; "కాదు అలా బ్రదర్!" అంటాడు వెంకటరామయ్య. ఇలా వాళ్ళిద్దరు తరుచు మాట్లాడుకునేవారట.

"అబ్బాయి! నీకు పేరు వస్తోంది. జాగర్త" అని హెచ్చరించేవాడు వెంకటరామయ్య.

❀ ❀ ❀ ❀

నిజంగానే రేలంగి జీవితంలో అందరిలాగే, పేరు వాడుకుని ప్రజ్ఞను వదలిపెట్టే ఘట్టం వచ్చిపడే ప్రమాదం ఏర్పడింది. 'బాక్సాఫీస్ హిట్' అన్న మాటకి సినీవర్గాలవారు ఆర్ ఇ ఎల్ ఎ ఎన్ జి ఐ అని స్పెల్లింగు చెబుతున్నారు. రేలంగి నటించిన నూరుచిత్రాలలో కొన్ని ఈ కోవకు చెందేవే. వ్యాపారార్థులకు పేరు తప్ప ప్రజ్ఞతో పని ఉండదు. ఇది కూడా వాడుకోవయ్యా అన్నా 'ఎందుకు? అందుకు తీరుబాటులేదు. పేరు చాల్లే" అంటారు. అన్ని రంగాలలోనూ చాలామంది కళాకారులు ఈ వ్యాపారంవల్లనే దెబ్బతిన్నారు. రేలంగి లొంగినంతవరకు లొంగినా, మరోవంక బిగించి తన పాత్ర రూపకల్పన, దాని కమామిషూ వేషభాషలూ వగైరాలగురించి బేరాలు చేసుకోవలసి వచ్చింది. ఆత్మరక్షణకోసం చేసే ఆ పనికూడా పొగరు అనీ, కొమ్ములు మొలిచాయనడానికి నిదర్శనమనీ అనుకోవడం సహజం. ఆ స్థితిలోని కళాకారుడి చర్యలలో పైతరహా వ్యాఖ్యలు కొంత నిజం అయినా కావచ్చు. మొత్తానికి 'అతిగా నటించకూడదు' అన్న నియమం రేలంగి పాటించ ప్రయత్నించాడు. అయినా కొన్ని చిత్రాలలో అతని పాత్రకు కథలో చుట్టరికం లేకపోవడం, 'గ్రాండ్ డబుల్ ప్రోగ్రాం'లో రెండో కథలా సాగిపోవడం కూడా జరిగింది. మిగతా వాటిలోమటుకు చాలా మంచిపాత్రలూ వచ్చాయి. వాటిని రేలంగి చాలా సమర్థంగానూ పోషించాడు. అతడు దాదాపు అన్ని రకాలపాత్రలూ ధరించాడు. 'పక్కింటి అమ్మాయి'లో హీరో, 'పల్లెటూరు'లో విలన్, 'పాతాళభైరవి'లో హాస్యగాడు, 'పెంకిపెళ్ళాం'లో తండ్రి, 'ఇలవేల్పు' 'మాంగల్యబలం' వంటి వాటిలో విద్యార్థి...

'పెద్దమనుషులు' చిత్రంలో అతను నటించిన 'తిక్కశంకరం' తెలుగు సినిమా కథలో ఒక మైలురాయి. పాత్రస్వరూప స్వభావాలే చాలా గొప్పగా తీర్చిదిద్దినవి. సులభంగా ప్రేక్షకుల హృదయాలకు హత్తుకునేవి. అలాటిది దొరికినపుడు, నటుడు ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోయి వాటిని ధ్వంసం చేయగల స్థితిలో ఉంటాడనీ, అందువల్ల వాటిని నటించడం దాదాపు తలాతోకాలేని పాత్రలకు ప్రాణం పొయ్యడం అంత కష్టమూననీ నటులకు బాగా తెలుసు. తిక్క శంకరం నటనలో తిక్క వేషాలు

వెయ్యకుండా, అతిగాపోకుండా కె. వీ. గారు, వెంకట్రామయ్య కలిసి రేలంగికి కళ్ళెంవేసి నడిపారు.

ఇలాగే స్మరణీయమైన మరొక పాత్ర 'పెంకిపెళ్లాం'లో తండ్రివేషం. మామూలుగా అదేమంత క్లిష్టమైనపని కాకపోయినా, హాస్యగాడుగా అందరికీ తెలిసిన రేలంగి ఆ వేషంవేసి ఒప్పించడంమటుకు చాలా కష్టమైనపని అని అతడూ, మిగతావారుకూడా భయపడ్డారు. అతడు ఏంచేసినా నవ్వేజనం, పతాక సన్నివేశంలో కూతురుకు లెంపకాయకొట్టి ఆమె జీవితాన్ని మార్చివేయవలసి ఉన్న నీతివాక్యం చెప్పినప్పుడుకూడా నవ్వేసే ప్రమాదం ఉంది. అందుకోసం రేలంగి చిత్రం ఆరంభంనుండీ కృషిచేసి, ప్రేక్షకులను ఆ సన్నివేశానికి ఆయత్తపరచాడు.

సంతానం, శోభ, దొంగల్లోదొర చిత్రాలలో రేలంగి ధరించిన తండ్రి పాత్రలూ పల్లెటూరు, రోజులుమారాయి చిత్రాలలో దుష్టపాత్రలూ, విప్రనారాయణలో శిష్యుడు, ఎత్తుకుపైయెత్తులో బిచ్చాలు పాత్ర భలే అమ్మాయిలువంటి వాటిలో పోకిరీవేషాలూ రేలంగి బహుముఖ ప్రజ్ఞకు నిదర్శనాలు. పక్కింటిఅమ్మాయిలో రేలంగి సర్వజనరంజకంగా నటించాడు. సీమచిత్రాలులాగే, ఇక్కడా రేలంగి హీరోగా హాస్యప్రధాన చిత్రాలు తీస్తే అందరికీ నచ్చుతాయని ఋజువు చేశాడు. దొంగరాముడులో ఉత్తభద్రయ్య వీరభద్రయ్యల గురించి హాస్యంమాట వచ్చినపుడల్లా అందరూ ఇప్పటికీ చెప్పుకుంటారు. ఇవన్నీ ఒక ఎత్తుకాగా, అనేక చిత్రాలలో మూసపోసిన వేషాలను (పాత డైలాగులు సహా) కూడా ఆ సమయానికి అందరినీ నవ్వించగల తరహాలో నటించగలిగినందుకు రేలంగి ప్రజ్ఞకు గొప్ప నిదర్శనాలు. ఒక నటుడు అన్నట్టు, ఈ విధంగా అనేక సాధకబాధకాలను, బాక్సాఫీసు సూత్రాల బంధాలను నిగ్రహించుకుని "తెరమీద రేలంగి నూరు చిత్రాలు మన్నగలిగాడంటే, వెయ్యి చిత్రాలలో నటించేందుకు అర్హత సామర్థ్యం గల ఒక నటుడు తెలుగు సినిమాకి దొరికాడన్నమాట. ఎటొచ్చి చలనచిత్రకారులు, "ఇంకా తొమ్మిదివందలున్నాయి కాబట్టి ప్రజ్ఞని తీరుబాటుగా వాడుకోవచ్చు, షేర్ వాల్యూని స్టార్ వాల్యూని వాడుకుందాం" అన్న తరహాలో కాకుండా వ్యవహరించడం శ్రేయస్కరం. ఈ బాధ్యతలో తనకీభాగం ఉందని రేలంగికీ తెలుసు.

❀ ❀ ❀ ❀

తెలుగు సినిమామీద రేలంగి హాస్యం చెప్పుకోదగ్గ ప్రభావాన్ని చూపించింది. ఆ మధ్యవరకు రెండర్థాల, మెండర్థాల మాటలు బోలెడుండేవి సినిమాలలో, "సెన్సార తాపత్రయం"లో మదిర, మదవతి, తరువాత పెద్ద సమస్యను తెచ్చి పెడుతూ వచ్చినవి ఈ డైలాగులే. ఎవరైనా పెళ్లాంబిడ్డలతో సినిమాకి వెళ్తే చాలా అవస్థపెట్టేవి ఇవే.

రేలంగి పలుకుబడి కొంచెం పెరగడంలో అతడు చేసిన మొదటి పని, యీ తరహా 'పలుకుబడి'ని తగ్గించి తొలగించ ప్రయత్నించడమే. హాస్యం మామూలు



మాయాబజార్‌లో సావిత్రితో రేలంగి

మాటల్లోకూడా పలుకుతుందని కొందరు మిత్రులతోపాటు వాదించి, చూపించాడు. అది ఎక్కడో ఆమడ దూరాన వుండదనీ, ప్రతివాడి జీవితంలోను కష్టాలతో దిగుళ్ళతో కలిసిపోయి ఉంటుందనీ, ఇళ్లలో ఆడా మొగా పిల్లలూ, నీతికాని మాటలు వాడకుండానే నవ్వుకుంటూ, ఒకళ్ళనొకళ్ళు నవ్వించుకోగలుగుతున్నారనీ నమ్మి నమ్మించాడు. ఎలా నవ్వించాడూ అన్నది, తెరమీద రేలంగి ప్రదర్శించే చిన్నచిన్న హావభావాలూ, వాటిలో రకాల రంగులూ చూసి ఇన్నాళ్ళూ నవ్వుతున్న వాళ్లందరికీ తెలుసు.

❀ ❀ ❀ ❀

రేలంగికి ఒక్కగానొక్క కొడుకు. ఆ అబ్బాయి చదువుకుంటున్నాడు. కొంతకాలం క్రితం ఒక సినిమాలో వేషంకూడా వేశాడుగాని, ఇపుడు తండ్రి మాట ప్రకారం ఆ జోలికి పోవడం లేదు.

'నేను ఎలాగా చదువుకోలేదు. నువ్వు బాగా చదవాలి నాయనా" అన్నాడాయన.

❀ ❀ ❀ ❀

చదువుకోవాలని మనసుండి సదుపాయంలేని వాళ్ళందరికి, శక్తివంచన లేకుండా సాయం చేస్తూనే ఉన్నాడు. గత సంవత్సరం తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి పాతిక వేలు విరాళం ఇచ్చాడు. మొన్న కేసరీ పాఠశాలలో ఒక తరగతి కట్టించడానికి విరాళం ప్రకటించాడు. ఇవి కాక గుప్తదానాలు చాలా చేశాడాయన. పెళ్ళిళ్ళు చేయించడం ఆయనకో హాబీలా అయింది.

తెరమీద రేలంగి పదిమందినీ సంతోష పెట్టినట్టే, తెరవెనుక రేలంగి కూడా సదా అదే ప్రయత్నంలో ఉంటాడు. ఇంకోవేషం ఉంది. సాధారణంగా హాస్యగాడి ముఖంమీద నవ్వు తెర తొలగిస్తే విషాదవదనం కనిపిస్తుందంటారు.

రేలంగి దగ్గరకు వెళ్ళి నవ్వు మాస్కు తీసిచూస్తే ఆ వెనకే "వెంకటరామయ్య" కూడా రేలంగి అంత కులాసాగానూ బేఖాతరుగానూ హాయిగానూ నవ్వుతూ ఉంటాడు. ఇద్దరూ కష్టాలూ చిక్కులూ తప్ప దిగులు ఎరగరు. అతడు సృష్టించే హాస్యం గురించి మధనపడడు. జీవితంలో విషాదాన్ని పరిశీలించే అసలు రేలంగి మూడో పొరలా ఉంటాడు. ఉన్నా ఆయనను రేలంగి మనకు కనబడనీయడు. అంతమాత్రాన రేలంగిది లోతులేని హాస్యం అని ఈరోజున ఎవడూ అనలేడు, అతనిలోని తపస్సూ, ఎప్పుడూ ఎదటివాళ్ళను సంతోషపెట్టాలన్న ప్రగాఢమైన ఆకాంక్ష, నిన్నటి విట్టు రేపు వెయ్యకూడదన్న నియమం- ఇవే రేలంగి నూరు చిత్రాలు మనడానికి కారణాలు ఇంకో నూరు చిత్రాలలో జయప్రదంగా వెలగడానికి కూడా కారణం కాగలవు.



రేలంగి తొలిచిత్రం తులాభారం. 100వ చిత్రం 'రేచుక్క పగటిచుక్క' ఈ నూరులోనూ పది తమిళంలోనూ, ఒకటి (పాతాళభైరవి) హిందీలోనూ కూడా విడుదల అయ్యాయి. మొత్తంమీద సాంఘికాలదే అగ్రస్థానం. అవి 50 కాగా, జానపదాలు 34, పౌరాణికాలు 16 ఉన్నాయి. వాటి వివరాలు:

## సాంఘికాలు

అన్నా తమ్ముడు, ఆడపెత్తనం, అప్పుచేసి పప్పుకూడు, అమ్మలక్కలు, ఆడబిడ్డ, ఇంటిగుట్టు, ఇలవేల్పు, ఇల్లరికం, ఎత్తుకుపైయెత్తు, కోడరికం, భలేరాముడు, భాగ్యరేఖ, భలే అమ్మాయిలు, బ్రతుకు తెరువు, చరణదాసి, చెరపకురా చెడేవు, దాసి, దాంపత్యం, దొంగల్లో దొర, దొంగరాముడు, మనదేశం, మాలతీ మాధవం, మంచి మనసుకు మంచిరోజులు, మాంగల్యబలం, మిస్సమ్మ, మేనరికం, మా గోపి, పక్కింటి అమ్మాయి, పరదేశి, పరోపకారం, పెద్దమనుషులు, పెద్దరికాలు, ప్రేమ, రాజేశ్వరి, రేపునీదే, రోజులు మారాయి, లక్ష్మి, వదిన, వరవిక్రయం, శోభ, షావుకారు, సంసారం, సంతానం, సంకల్పం, సంతోషం.

## జానపదాలు

అగ్గిరాముడు, అగ్నిపరీక్ష, అల్లావుద్దీన్ అద్భుతదీపం, అమరసందేశం, బాలనాగమ్మ (రాజరాజేశ్వరీ), బాలసన్యాసమ్మ, చంద్రహారం, చండీరాణి, చింతామణి, జయభేరి, ధర్మదేవత, గొల్లభామ, గుణసుందరి కథ, జయసింహ, జయంమనదే, కీలుగుర్రం, రాజనందిని, రాజూపేద, సదారమ, సారంగధర, సువర్ణసుందరి, సౌదామిని, స్త్రీసాహసం, టింగురంగా, ఉమాసుందరి, విజయగౌరి, మదాలస,

మానవతి, పరమానందయ్య శిష్యులు, పాతాళభైరవి, వీరభాస్కరుడు, రేచుక్క పగటిచుక్క.

## పౌరాణికాలు

అనసూయ - ధ్రువవిజయం, సతీ అనసూయ, సతీ సావిత్రి, చెంచులక్ష్మి, శ్రీ గౌరీమహత్యము, భూలోకరంభ, హరిశ్చంద్ర, తులాభారం, శ్రీకృష్ణతులాభారం, వాలిసుగ్రీవ, విప్రనారాయణ, మాయాబజార్, నలదమయంతి.

(ఆంధ్ర-వారపత్రిక - 1958)

తెలుగుతెరపై హాస్యానికి మారుపేరుగా రేలంగి నిలిచిపోయారు. ఎన్నో పాత్రలు ప్రేక్షకుల మనసుల్లో నిలిచిపోయేట్లా నటించి ,అనేక సన్మానాలు పొందడమే కాక ప్రభుత్వం తరఫున 'పద్మశ్రీ' బిరుదు పొందారు. ఆ బిరుదు పొందిన తొలి హాస్యనటుడాయనే! 'సమాజం' అనే సినిమా నిర్మించారు. అనారోగ్యానికి గురయి కాళ్లు కదవలేని స్థితిలో కూడా ముఖకవళికలతోనే నవ్వించగలిగిన 'హాస్యనట చక్రవర్తి' 56 వ యేట 1975 లో మరణించారు.



# సినీవ్యాస రమణీయం (సాంకేతిక నిపుణులు)



## నాగిరెడ్డి

అసాధ్యాలూ, అనితర సాధ్యాలూ సాధించాలన్న సరదా, ఉత్సాహం, ఆ పని మొదలుపెట్టాక వదలిపెట్టనివ్వని మొండితనంలాంటి పట్టుదల, నెగ్గుకువచ్చే శక్తి సామర్థ్యాలూ, నేర్పూ, ఈలోగా కావలసిన ఓర్పూ మొదలైన గుణాలకూ 'హెడ్డాఫీసు' ఒక మనిషిలో ఏర్పాటైతే, అతనికి ఏ శక్తీ ఎదురొడ్డి నిలవదు. తలపెట్టిన ప్రతికార్యం ఫలప్రదం కావడం ఖరారు. విజయం సాధించిన వారందరి జీవిత కథల సారాంశం స్థూలంగా ఇదే.

విజయా ప్రొడక్షన్స్ అధిపతి నాగిరెడ్డిగారు సాధించే చిన్నా పెద్దా కార్యాలను కన్న, విన్నవారు, ఈయనదంతా 'మాజిక్ కార్పెట్ టెక్నిక్' (మాయా తివాచీ) అంటారు. అవి చాలా చిత్రంగానూ, ఆశ్చర్యకరంగానూ ఉంటాయి.

'ఈ మట్టిలో యూకలిప్టస్ బతకదండీ' అన్నాడొకాయన - నాగిరెడ్డిగారు ఆ ఆలోచన పెట్టుకున్నపుడు.

'ఇక్కడ సిల్వర్ ఓక్ చెట్లు పెరగవు' అని ఇంకో ఆయన చెప్పారు.

పెరుగుతాయని నాగిరెడ్డిగారి నమ్మకం. ఈ రోజున ఆయన పాలనలో ఉన్న 60 ఎకరాల పారిశ్రామిక రాజ్యంలో బోలెడన్ని యూకలిప్టస్ చెట్లు, సిల్వర్ ఓక్ చెట్లు నిక్షేపంలా పెరుగుతున్నాయి; అదే విధమైన విధేయతతో వాహినీ విజయా స్టుడియోల సాధన సంపత్తి, చిత్ర నిర్మాణ పరిశ్రమ, ఆ సంస్థలకీర్తి, స్టుడియోపక్క ఆవరణలో ప్రసాద్ ప్రాసెస్, 'చందమామ' మొదలైన వ్యాపారాలూ, వాహినీ ఎదురుగా విజయా గార్డెన్స్‌లో అందమైన నందనవనాలూ పెరుగుతున్నాయి.

ఈ ప్రగతికి తొలి ప్రయత్నం 1949 ఆగస్టులో జరిగింది. అప్పుడు నాగిరెడ్డి, చక్రపాణి కలసి వాహినీ ప్రొడక్షన్స్‌ను కౌలుకు తీసుకొని చిత్రనిర్మాణం ఆరంభించారు.

చేపట్టిన పని ప్రతీది చెప్పినట్టు వినేలా చేయగల నాగిరెడ్డిగారికి సరియైనదారి చూపే గుర్తు ముందుకు నడిపేశక్తీ ఏవిటి అంటే ఆత్మవిశ్వాసం అనే చెప్పుకోవాలి.

❀ ❀ ❀ ❀

"చాలా రోజులక్రితం, నేనొక చక్కని కథ చదివాను" అన్నారాయన మాటల సందర్భంలో.

ఒక రైతు తన పొలానికి నీరుకోసం బావి త్రవ్వబోయాడు చేరువనే. 20 అడుగులు త్రవ్వితే వస్తుంది అన్నాడు స్థలనిర్ణయం చేసిన ఆసామి. తీరా, అంతా తవ్వితే జల పడలేదు. దారేపోయే దానయ్య అతన్ని పిలిచి, "ఇదుగో ఇక్కడగాదు, కాస్త ఎగువన 15 అడుగులు తవ్వితే చాలు – నీరు కొల్లలు" అని చెప్పిపోయాడు. సరేనని ఆ రైతు అక్కడ తవ్వాడు. 15 అడుగులు తవ్వినా నీరు లేదు. "వెర్రిబాగులవాడా! ఇక్కడెందుకోయ్. ఇంకో పదిగజాలు అవతలగా, ఐదంటే ఐదుఅడుగులు తవ్విచూడు– కొబ్బరి నీళ్ళలాంటి నీరు పడుతుంది" అని సలహా యిచ్చాడు ఇంకొకడు. అక్కడా కలిసిరాలేదు రైతుకి. ఇంతకీ, అతనికి బావి కావలసింది తన పొలం దగ్గరగా. అక్కడ ఎలాగా 20 అడుగులు తవ్వాడు. సలహాలువిని, ఇంకో రెండుచోట్ల 20 అడుగులు తవ్వడానికి పడ్డ శ్రమలో అరసగం కనక మొదటి ప్రయత్నం కొనసాగించడానికే వినియోగిస్తే– తన పొలానికి గగ్గరలోనే నీరు పడేది, అన్నది ఆ కథలో నీతి.

నాగిరెడ్డిగారి ప్రగతిరీతికి ఇదే కారణం.

"జీవితంలో నేను పెద్దపనులు తలపెట్టినపుడు, సమస్యలు ఎదుర్కొని అటూఇటూ అని తేల్చుకోలేక సతమతమైనపుడు– ఈ కథాంశం ఎందుకో గుర్తుకు వచ్చేది. అపుడు మళ్ళీ ఓసారి ఆలోచించి మనసుకు తోచినట్లు చేసేవాణ్ణి" అంటారు నాగిరెడ్డి.

❀ ❀ ❀ ❀

నాగిరెడ్డిగారి తండ్రి బొమ్మిరెడ్డి నరసింహారెడ్డిగారు. నలుగురన్నదమ్ములలో నాగిరెడ్డి తృతీయులు. పెద్దాయన రామలింగారెడ్డి. ఆయన ఇపుడు తండ్రిగారు ఆరంభించిన ఎగుమతి దిగుమతి వ్యాపారం నిర్వహిస్తున్నారు. రెండవ కుమారుడు ప్రముఖ చలనచిత్ర దర్శకుడు బి.ఎన్. రెడ్డిగారు. నాగిరెడ్డి తరువాతి వారు బి.ఎన్.కొండారెడ్డి. ఈయన ఛాయాగ్రహణ దర్శకుడుగా పేరు తెచ్చుకున్నారు. ఇపుడు వాహినీ చిత్రాలకు ఛాయాగ్రహణం నిర్వహిస్తున్నారు.

ఉల్లిపాయల ఎగుమతి దిగుమతి వ్యాపారసంస్థను, ఒక ఘట్టంలో, నాగిరెడ్డిగారి నిర్వహణకు ఒప్పగించారు తండ్రిగారు. వ్యాపారంలో పోటీ విపరీతంగా ఉంటున్న ఆ సమయంలో కొత్తగా బాధ్యత స్వీకరించిన యువకుడు నాగిరెడ్డి. తండ్రి నమ్మకం వమ్ముచేయకుండా, కంపెనీ కాతాలు పోటీదారుల ధాటికి పడిపోయే

సమయంలో నాగిరెడ్డి స్వతస్సిద్ధమైన నేర్పుతో, కాతాదారులందరికీ, ఇంకా తమ వ్యాపారంతో సంబంధం ఉన్న ఇతరులందరికీ పేరు పేరునా ఉత్తరాలు వ్రాసేవారు. పరిస్థితులు వివరించి ప్రత్యేకంగా ప్రతి ఒక్కరి సహకారం అవసరమని లేఖలు వ్రాసేవారు. వ్యక్తిగతమైన శ్రద్ధ, ఆపేక్ష ఉట్టిపడుతున్న ఈ ఉత్తరాలు ఇంద్రజాలంలా పనిచేశాయి. వ్యాపారం పుంజుకొంది. వ్యాపార దక్షతతో తొలిపారం సుఖంగా నేర్చుకున్న నాగిరెడ్డికి ఆదర్శ విశ్వాసం ఇనుమడించింది.

తరువాత తండ్రిగారి పనుపున, కంపెనీ ప్రతినిధిగా బర్మావెళ్లారు. అది యుద్ధకాలం. జపాన్ సైన్యంధాటికి అక్కడ పరిస్థితులు అల్లకల్లోలం అయ్యాయి. ఆ మేరకు అక్కడ నష్టం వాటిల్లింది. చీకాకుపడ్డ మనసుతో నాగిరెడ్డి మద్రాసు వచ్చివేశారు. ఆ స్థితిలో కొన్నాళ్ళు ఊరికే కాలక్షేపం చేశారు. ఆ రోజుల్లోనే ఆధ్యాత్మిక గ్రంథాలు ఆయన చాలా చదవడం జరిగింది.

❀ ❀ ❀ ❀

బర్మాలో ఉండగా ఒకరోజున ఒక మనిషి ఈయన దగ్గరకు వచ్చి, ఆకలిగా ఉందన్నాడు. అతన్ని హోటలుకు తీసుకువెళ్లి పుష్కలంగా తినుబండారాలు తెప్పించి తినమన్నాడు. అతను తినలేదు. పార్కుదగ్గర తన పెళ్లాం బిడ్డలు, తిరగలేని ఇంకో కుటుంబం ఉన్నారనీ, వాళ్లూ తింటే సంతోషంగా ఉంటుందనీ అన్నాడు.

"కొంచెం డబ్బుతో రెండు కుటుంబాలను ఒకపూట సంతోష పెట్టానన్న తృప్తీ, ఒక విధమైన ఆనందమూ కలిగాయి. ఒకళ్ళు మనవల్ల సంతోషిస్తున్నపుడు కలిగే సంతోషం ఎంతటిదో తెలిసింది" అన్నారు నాగిరెడ్డి.



ఆహ్లాదం ఆనందం కలిగించడమే
విజయ సినిమాల బ్రాండ్

మద్రాసువచ్చి కొన్నాళ్ళు పనిలేకుండా ఉన్నపుడు ఇదే ఆలోచన వచ్చింది.

"పెద్ద వ్యాపారం చేయాలి. బాగా డబ్బుగడించి సుఖపడాలి; పెట్టాలి." అని.

మద్రాసు ఆచారప్పన్ వీధిలో బి.ఎన్.కొండారెడ్డి అండ్ కంపెనీ పేరుతో ఒక ప్రెస్ ఉండేది. 1913లో అది నెలకొంది. 1936లో బి.ఎన్. రెడ్డిగారు దానికి యాజమాన్యం

వహించి వృద్ధిచేశారు. అందులో 'ప్రజామిత్ర' అచ్చు అయేది. '45 నాటికి బి.ఎన్. చిత్రనిర్మాణంలో నిమగ్నులై ఉన్నారు. రామలింగారెడ్డిగారు ఇంపోర్ట్ ఎక్స్‌పోర్ట్ వ్యాపారం చూసుకుంటున్నారు. తమ్ముడు కొండారెడ్డి చలనచిత్ర ఛాయాగ్రహణం నేర్చుకుంటున్నారు. అప్పుడు నాగిరెడ్డి ఆ ప్రెస్ తీసుకొన్నారు. యువప్రచురణల సందర్భంగా చక్రపాణిగారికీ ఆయనకు పరిచయం అయి దృఢస్నేహంగా 'విజయ' ధ్వజ దిగ్విజయానికి నాందిగా రూపొందింది. అక్కడే 'ఆంధ్రజ్యోతి', 'చందమామ' పత్రికలు ఆరంభించారు.

అన్నగారు బి.ఎన్. ద్వారా నాగిరెడ్డిగారికి చిత్రనిర్మాణంతో సంబంధం ఉంటూ వచ్చింది. 1949 ఆగస్టులో పరిస్థితులు అనుకూలించాయని తోచగానే నాగిరెడ్డి, చక్రపాణి వాహినీని కౌలుకు తీసుకొని, చిత్రనిర్మాణం ఆరంభించారు. 'వీరహనుమాన్' పతాకంతో 'విజయ' ధ్వజ మెత్తారు...

వాహినీ, విజయా, ప్రసాద్ ప్రాసెస్, చందమామలలో మొత్తం 2000 మంది పని చేస్తున్నారు. ప్రసాద్ ప్రాసెస్‌ను నాగిరెడ్డి పెద్ద కుమారుడు లక్ష్మీనరసింహప్రసాద్, చక్రపాణిగారి కుమారుడు తిరుపతిరాయుడు నిర్వహిస్తున్నారు.

**(ఆంధ్ర-వారపత్రిక - 1959)**

అప్పటికే ప్రముఖ నిర్మాతగా పేర్గాంచిన నాగిరెడ్డి ఆ తరువాత కూడా అనేక విజయవంతమైన సినిమాలు నిర్మించారు. 'రామ్ ఔర్ శ్యామ్' సినిమాతో హిందీ చిత్రరంగానికి కూడా వెళ్లి అనేక సినిమాలు తీశారు. చక్రపాణి మరణం తర్వాత కూడా సినిమా నిర్మాణం కొనసాగించారు. చలనచిత్ర రంగానికి సంబంధించిన అనేక పదవులు అధిష్ఠించారు. దాదాసాహెబ్ ఫాల్కే ఎవార్డు పొందారు. విజయా హాస్పటల్స్ నిర్మించి నిర్వహించారు. ఇటీవలే మరణించారు.

"పోతన" దగ్గరినుంచి "మాయాబజారు" వరకు శ్రీ కె.వి. రెడ్డిగారు తీసిన ఆరున్నొక్క చిత్రాలలోనూ దృక్పథం, శిల్పప్రకారం ఒక పద్ధతిలో కనిపిస్తాయి. చెప్పదలచుకున్న సంగతేమిటో ముందు స్పష్టంగా తేల్చుకోవడం, అంత స్పష్టంగానూ చెప్పడం, చెప్పేదాంట్లో కలుపు చేరనీకపోవడం రెడ్డిగారి చలనచిత్ర చిత్రణా శిల్పానికి ముఖ్యావృతం. గడచిన రెండు దశాబ్దాలలో తీసిన ఈ ఏడు చిత్రాలూ ఆయనకు దర్శకుల శ్రేణిలో అగ్రస్థానాన్ని సంపాదించి పెట్టాయి. ప్రజాబాహుళ్యాన్ని ఆకర్షించి సంతోషపెట్టాయి. ఆ తరహా చిత్రాలు తీయడానికి పాఠ్యపుస్తకాలై నిలబడ్డాయి.



కె.వి. ముక్కుకు సూటిగా పోయే మనిషి. అయితే కె.వి. గడుసువాడు కాబట్టి బయల్దేరే ముందు ముక్కును బాక్సాఫీసుకు గురి చేసిపెట్టి అప్పుడు దాన్ని పట్టుకొని తీసి తన సూటిగా వెళ్ళిపోతాడు. దారిలో జోడుగుర్రాల సవారి చెయ్యడు. కళతో



కె.వి. రెడ్డి తన సత్తా చూపిన చిత్రం - యోగి వేమన

కసరత్తు చెయ్యడు. సినిమాటిక్ ఇంద్రజాలానికి వడిగట్టడు. పేరూ డబ్బూ తెచ్చుకోవడం ఇంద్రజాలం అయితే కె.వి. మహేంద్రజాలి అని చెప్పుకోవాలి.



మరో బాక్సాఫీసు హిట్ - గుణసుందరి కథ

కె.వి. గల్లాపెట్టెలు నింపే డైరెక్టరనిపించుకోటానికి ముందు గల్లాపెట్టె దగ్గరే ఉండేవాడు. వాహినీలో ప్రొడక్షన్ మానేజరుగా ఉండి పరిస్థితులూ, గతులూ అర్థం చేసుకున్నారు. మన జనం ఎందరు, ఎలాటివారు, ధనం ఎంత, ఎలా వస్తుంది, ఎంతలో తీస్తే విధిగా లాభం వస్తుంది, ఎవరికోసం తీస్తే వస్తుంది అనే విషయాలను ఆయన అప్పట్లోనే తెల్సుకున్నారు. తెలుగు సినిమా మహారాజ పోషకులు మెద్రాసులోను బెజవాడలోను లేరనీ, వాళ్లు పల్లెపట్టుల్లో ఉన్నారనీ, రెండెడ్ల బళ్ళమీద వస్తారనీ, బైస్కోపు మూడు గంటలకు తక్కువైతే మళ్ళీ అటురారనీ ఆయన నమ్మకం. ఇది మరచి, సీమ సినిమాలను చూసి పత్రికల, పట్టు చొక్కాలవాళ్ళ మాటలు నమ్మి, అలా చేయబోవడం నేల విడిచి సాముచేయడమేనని ఆయన అంటారు. అందువల్ల ఆయన ప్రయాణించేది 'జానపద పథం'లోనే.

ఆయన చిత్రాలన్నీ 'సగం సత్యం, సగం స్వప్నం' వాటిలో పాత్రలన్నీ అనగనగా మార్కు మనుషులలానే తిరుగుతాయి. దొంగరాముడు వంటి సాంఘికానికీ, మాయాబజారువంటి పౌరాణికానికీ ఒకే స్థాపత్య సూత్రం.

కె.వి. క్రమశిక్షణ, కార్యదక్షత ఈ కాలపు సినిమా లోకంలో విడ్డూరాలుగా, చాదస్తాలుగా కనిపిస్తాయి కొందరికి. అయినా 17,331 అడుగుల పొడుగైన పొట్టి చిత్రాన్ని తీయాలనుకుంటే, సరిగ్గా అంతే తీయగలిగే సామర్థ్యంగల ఏకైక దర్శకుడు

ఆయనే! మరోచోట అయితే కథ, డైలాగులూ మార్చేసే వాళ్ళంతా కూడా రెడ్డిగారి సెట్‌మీద ఆయన మాటను మన్నిస్తారు. ఆయన శ్రద్ధగా కథ గురించి ఆలోచించుకువచ్చాడని అందరికీ తెలుసు. ఆయన దగ్గర పనిచేయడం అందరూ గౌరవంగా భావిస్తారు.

దేశం వెళ్ళి తెలుగు జీవితపు నుడికారాన్ని, మారుతున్నదాన్ని ఆకళించుకునే అవకాశం తగ్గిపోయింది. నగరంలో స్థిరపడ్డ చాలామంది కవులూ, రచయితలూ, కళాకారులలాగే, వార్తల ద్వారా తెలిసే పరిస్థితులను ఊహాపోహలతో గుణించి తెలుగుతనాన్ని లెక్కగట్టడం సర్వత్రా పరిపాటి అయిపోతోంది. అందుకే ఈనాడు చాలా రచనలు, చిత్రాలు చలనచిత్ర లోకానికి మాత్రమే సహజమైనవిగా ఉంటున్నాయి. ఇదే పరిస్థితిలో రెడ్డిగారు సాంఘికం చేపట్టడం జరిగింది. అది 'తెలుగు నేల విడిచిన సామే' అయింది.

ఒక తరహా బాగా వంటబట్టిపోయిన వ్యక్తి మరోదాన్ని అవలంబిస్తే ఒకొక్కసారి రాణించదన్న దానికి నిదర్శనంగా 'పెళ్ళినాటి ప్రమాణాలు' నిలబడుతుంది.

కృతకమైన సాంఘికంకన్న సహజమైన జానపదం లక్షరెట్లు మెరుగు. కె.వి. దగ్గర ఉంటే పది లక్షలు మెరుగు. దైవమిచ్చిన జానపదానికి మకుటంలేని రాజు కె.వి.

(ఆంధ్ర-వారపత్రిక - 1959)

కె.వి.రెడ్డి (1912-72) విజయా సినిమాలను ఆర్థికంగా నిలబెట్టిన సినిమాలు తీయడంతో బాటు అన్నపూర్ణా వారికై 'దొంగరాముడు' తీసిపెట్టారు. జయంతి బ్యానర్‌పై 'పెళ్లినాటి ప్రమాణాలు', 'శ్రీ కృష్ణార్జునయుద్ధం' సినిమాలు తీసి హిట్ చేశారు. 'జగదేకవీరుని కథ' తర్వాత నుండి సక్సెస్ ఫార్ములాకు దూరమయ్యారు. 'సత్య హరిశ్చంద్ర', 'ఉమాచండీ గౌరీశంకరుల కథ', 'భాగ్యచక్రం' ఎన్.టి.ఆర్.కై దర్శకత్వం వహించిన 'శ్రీకృష్ణసత్య' అనుకున్నంత విజయాలను సాధించలేదు.

# మళ్లీస్వరం



తీసిన కాసిని సినిమాలూ గంగిగోవుపాలు. చిత్రశుద్ధి, చిత్తశుద్ధిగల కళాకారుడు. ఒకొక్క చిత్రం, ఒకొక్క సన్నివేశం. అందులో ఒకొక్క దృశ్యం, ఒకొక్క యజ్ఞం. తావలచిన ఊహకు కావలసిన బొమ్మ, రావలసిన చందం కుదిరేపర్యంతం బి.ఎన్. పడే తపన, తన యాగంలో పాల్గొనే నటులను రచయితలను పెట్టే యాగీ అమితమైనవి. 'సానుభూతి' లేని వారికి చిరాకు కలిగించేవి, ఆర్థిక లాభసూత్ర భాష్యకారులు నిశితంగా ఖండించేవి. చలనచిత్ర నిర్మాణంలోని సర్వాంగోపాంగాలూ తన ఈ "ఊహాచిత్రం"లో అందమైన రేఖలుగా, తను వినిపించే పాటలో స్వరాక్షరాలుగా ఇమిడే వరకూ, ఆకుమాటు పిందెలా, తల్లిచాటు బిడ్డలా, కృష్ణునితో మురళిలా అమరేవరకూ, స్వరానుస్వరాలలా వాగర్థాలలా ఏకమయేవరకూ బి.ఎన్. అహోరాత్రాలూ పడే క్షోభను తపస్సే అనాలి. అందుకే ఆయనతో పనిచేసిన వారంతా ఈ మాట ఆయన 'రాయించు' కున్నారు, ఈ పాట ఆయన 'చేయించు' కున్నారు; పాడించుకున్నారు అనే అంటారు గౌరవ పురస్సరంగా.

చిత్తశుద్ధితో పనిచేయడం అనేది కనీస ధర్మంగా, ఆ దరిమేనా గొప్ప విషయంగా చెల్లి చివరకు చాదస్తంగా కనిపించి స్వర్ణయుగం అనే మాటకు రూఢ్యర్థంపోయి 'పదార్థమే' ఖంగున మోగే ఈనాటి వరకూ పరిమాణాలు పెరిగి ప్రమాణాలు పడిపోయే సన్నివేశాన్ని చూస్తూ అప్రతిభులైపోయిన వారిలో, తేరుకొని బాధపడిన వారిలో బి.ఎన్. ఒకరు. చాలాకాలం గట్టిగా నిలబడ్డవారూ ఆయన ఒకరే.


వందేమాతరం

స్నేహం సాప్తపదీపం అన్నారు. బి.ఎన్. రెడ్డి, తెలుగు సినిమా కలసి ఏడు చిత్రాలు


సినిమాపాటను నిర్వచించిన మల్లీశ్వరిలో రామారావు, భానుమతి

నడవడం జరిగింది. కాబట్టి, వారు వీరో వీరు వారో కావాలి.

ఉద్దండాలు పదిలంగా దాచుకోడానికే తప్ప చదువుకోడానికి కాదన్న నానుడిని బి.ఎన్. ఉత్తమ చిత్రాలకూ ముడి పెట్టవలసి వచ్చింది ఆర్థికంగా చూసిన వారికి. అందువల్ల, ధైర్య స్థైర్యాలు గల బి.ఎన్. కూడా పరిస్థితిగతుల వత్తిడిని మన్నించవలసి వచ్చింది. ఒక ఘట్టంలో - ఇటీవలిది - ఒక వంక లాభసాటి సూత్రం ఉపయోగించుకుంటూనే మరొకవంక ఉత్తమాభిరుచి, సంస్కారంగల కళాకారుడుగా వాటిని తనే గర్హిస్తూ ఏకకాలంలో ఉభయతారక మంత్రం పఠించి జోడుగుఱ్ఱాల సవారీ సాధించబోయారు...

జనబాహుళ్యం పోషించని సత్కార్యాలను ఆచరిస్తూ ఒక వ్యక్తి అవస్థపడాలనీ, సభలలో పత్రికలలో చప్పట్లు కొడుతూ కొందరు సగర్వంగా ఉపన్యాసాలు ఇవ్వడానికి వీలుగా ఒక వ్యక్తి కష్టనష్టాలు భరించాలనీ ఒకరిని ఆజ్ఞాపించే అధికారం, హక్కూ ఏ వొకరికీ లేని మాట నిజమే; కాని కొన్ని మంచిపనులు చేయగల ప్రతిభా వ్యుత్పత్తులు గలవారికి మాత్రం ఈ మంచి పనులు చేయడం బాధ్యత, విధీ అవుతుంది.

ఈ దృష్టితోనే సదాశయాలు, అవి సాధించాలన్న సంకల్పం, తగిన సంస్కారం, వాటికి దీటైన సామర్థ్యం కూడబలుక్కు గూడుపుఠాణీ చేసుకుని బహుకొద్దిమందిని మాత్రమే కలసి కట్టుగా వరిస్తాయి మరి.

**(ఆంధ్ర-వారపత్రిక - 1959)**

బి.యన్.రెడ్డి (1908-77) 'మల్లీశ్వరి' తర్వాత బియన్ తీసిన జానపద చిత్రం 'రాజమకుటం' సినిమా బాగున్నా ఆర్థికంగా విజయం సాధించలేదు. ఇతరులకై తీసిన 'భాగ్యరేఖ', 'పూజాఫలం' విజయం సాధించాయి. దాదాపు కొత్తతారలతో తీసిన 'రంగులరాట్నం' కీర్తిని, కనకాన్ని సాధించిపెట్టింది. 'బంగారుపంజరం' తర్వాత తన మార్కు సినిమాలు ప్రజలు ఆదరించరేమోనని సందేహానికి లోనయ్యారు. పద్మభూషణ్ పొందారు.

# ఆదుర్తి - సుబ్బారావు



సెట్ మీద సందడి జోరుగా ఉంది. అంతా హుషారుగా నవ్వుతున్నారు. ఎవరో జోక్ చేస్తున్నారు. ఇంకెవరో సన్నగా . ఈల కూడా వేస్తున్నారు. మళ్ళా అంతా నవ్వుతున్నారు. "ఇంకా మానీటర్ రాలేదల్లే ఉందే" అన్నారు అప్పుడే సెట్ చూడవచ్చిన ఒక పెద్దమనిషి. "మానీటరు కాదండి, డైరెక్టరంటారు. వచ్చారండి. యాక్టర్లు ప్రొడ్యూసరూ అంతా ఇక్కడే ఉన్నారు. అదుగో ఆ సన్నగా బక్కపలచగా ఉన్నాయన మానీటరు. అదే డైరెక్టరు." అన్నాడు ఆయనను తీసుకొచ్చిన జర్నలిస్టు.

"ఏదీ ఏదీ ఆ పసుప్పచ్చ బట్టలేసుకున్నాడు. అతనా అతనూ..."

"అవి పసుపు బట్టలు కావండి. ఓ గంట క్రితం ఆయన వచ్చినపుడు అవి తెల్లటివేలెండి."

"సర్లేవయ్యా... ఇంతకీ ఆ పిల్లాడు మన చిట్టిబాబు కాదూ మన రాజమండ్రీ తాసిల్దారు గారబ్బాయి."

"ఆ చిట్టిబాబు కావడానికి నా అభ్యంతరం లేదండి. ఇక్కడాయన్నంతా ముద్దుగా ఆదుర్తి సుబ్బారావని పిలుచుకుంటారు."

"అందుకే నన్నమాట ఇట్టా అల్లరిగా ఉంది మీ స్టుడియో. మా తాసిల్దారుగారబ్బాయిని చేరనిస్తే ఎక్కడేనా యింతే... ఎంతల్లరనీ ఎంతల్లరనీ..."

నిజమే. తాసిల్దారుగారి చిట్టిబాబుకు ఆ పేరు ఈనాడూ ఉంది. కాదు ఈ పేరు అనాడే వుంది.

చాలామంది గొప్పవాళ్ళు, పెద్దవాళ్ళు సెట్‌మీద కొస్తే అంతా నిశ్శబ్దం అయిపోతుంది. గాంభీర్యం మీసం మెలేసుక్కూర్చుంటుంది. ఆదుర్తి సుబ్బారావు సెట్‌మీదికొస్తే సెట్ జనులకు ప్రాణం లేచొస్తుంది. వస్తూనే ఆ గాంభీర్యం మీసాలను గిలిగింతలు పెట్టి పకాల్న నవ్విస్తాడాయన. ఆయనతో పని నవ్వులాట కాదు. కాని, అంతా నవ్వుతూ ఆడుతూ పాడుతూ సంతోషంగా శ్రమ తెలీకుండా పనిచేస్తారు.

సెట్ మీద కొచ్చిన గంటలో ఆయన పసుపురంగు బట్టల్లో హాయిగా, స్వేచ్ఛగా పెళ్ళికొడుకులా కళకళ్లాడుతూ ఉంటాడు. కావాలని మట్టి పూసుకుంటాడని కాదు. పని అంటూ వస్తే ఆయనకి అక్కర్లేనిది, గౌరవానికి తక్కువనుకునేదీ లేదు. అన్నిటికీ పూసుకు తిరుగుతాడు. శ్రామికుడి నుదుట చెమటబొట్టులా, చంద్రుడి మధ్య కళంకంలా, చిట్టిబాబుకి బట్టల మీద దుమ్ము, రంగులూ అలంకారప్రాయాలు. అవే శోభ. కాని తహసిల్దారు సత్తెన్న పంతులుగారుగాని, చిట్టిబాబు మేష్టర్లుగాని ఇలా భావించడానికి సావకాశం ఆనాడు లేకపోయింది.

అల్లరివాడనేవారు. చిన్ననాడే పేరు, ఏదో ఒకటి తెచ్చుకోవడం గొప్ప, దాన్ని ఇలా నిలబెట్టుకోవడం మరీ గొప్ప. అతను అల్లరి చేసిన కొద్దీ ఆయన ముద్దు చేసేవారు. ఇద్దరాడపిల్లల తరువాత కలిగిన కొడుకు, కులదీపకుడు, వంశోద్ధారకుడు, వారసుడు, కాబోయే కరణం అని ఆయన చాలా వుప్పొంగి పోయేవారు. చదువులో– ముఖ్యంగా లెక్కలలో చురుకుదనం చూసి గర్వపడ్డారు. ఆటల్లో, గోదారి షికార్లలో, సైకిలు విహారాలలో చురుకుదనం చూసి కొంచెం కంగారుపడ్డారు. కుర్రాడికి బాట్‌మింటన్ మీద సరదా అని బాట్‌లు, బంతి కొనిచ్చారు. ఫోటోగ్రఫి మీద మోజని కెమెరా ఫిలింకొనిచ్చారు. కాని ఆటలు ఎక్కువ కావడంతో బ్యాటు విరగ్గొట్టి పారేశారు. (మళ్ళీ ఒకటి కొన్నారనుకోండి). ఫోటోల మోజు చూసి చీవాట్లేశారు–

"ఏమిట్రా అది కూడు బెట్టనా గుడ్డ పెట్టనా చదువుకునేదు" అని.

కాని ఒకనాడు అదే చిట్టిబాబు భవిష్యత్తుకు శ్రీకారం అవుతుందనీ అదే, తమ యింటికి, ఈ వూరికి కూడా పేరు తెచ్చిపెడుతుందనీ ఆయన వూహించలేదంటే, అది ఆయన తప్పు కాదు.

సుబ్బారావు చదువులో ఎన్నడూ వెనకబడలేదు. పధ్నాలుగో యేటికే స్కూలుఫైనల్ పాసై కూర్చున్నాడు. సత్తెన్నగారు ఎగ్జంప్షన్ తెప్పించి కాకినాడ పి.ఆర్. కాలేజిలో వేశారు. రెండోయేడు ఇంటరు చదువుతుండగా సుస్తీచేసి ఇంటికి వచ్చాడు సుబ్బారావు. మూడో యేదాది సెకండియర్ రాజమండ్రిలోనే చదవబోయాడు. కాని సాహిత్య గ్రంధాల మీద పడింది బుద్ధి. ఫోటోగ్రఫీ మీదికి పోయింది మనసు. తమ్ముళ్ళను కూర్చోబెట్టి ప్రబంధాలను చదివి బోధపరుస్తూ ఉండేవాడు. వాళ్ళనే కూర్చోబెట్టి ఫోటోగ్రఫీలో రకరకాల ప్రయోగాలూ చేసేవాడు. సినిమాలు చూసి తనూ కెమెరామెన్ కావాలని కలలు కనేవాడు. తాసీల్దారుగారు రెండిటినీ ఆమోదించలేదు. పాఠాలు చదూ అన్నారు. కుర్రవాడు అది ఆమోదించలేదు. "ఆ చదువు ఇంకొద్దు, బొంబాయి వెళ్తాను" అన్నాడు ధైర్యంగా.

బొంబాయిలో సినిమాటోగ్రఫీ కోర్సు చదివితే సినిమాలు తియ్యవచ్చునని ఎవరో చెప్పారు.

"నీకేం మతి పోయిందా" అన్నాడు తండ్రి. "ఒద్దు నాయనా..." అన్నారు తల్లి రాజలక్ష్మమ్మగారు.

సుబ్బారావులో "ఆదుర్తి" సై అన్నాడు. సుబ్బారావు తండ్రి మాట కాదన్నాడు.

"నేను వెళతానండి. నాకు దాని మీదనే నమ్మకం వుంది. మీరింకోటి చెప్పించినా రాదు" అన్నాడు ఖచ్చితంగా.

తాసిల్దారుగారిది అంతా ఖచ్చితమైన పద్ధతి.

"ఈ జిల్లాలో అందరూ నా మాట మన్నిస్తారు. ఇన్నాళ్ళకి నువ్వు కాదన్నావు. సరే వెళ్ళు..." అంటూ ఆయన ఆస్తి వాటా వేశారు.

స్వార్జితం అలా వుంచి, పిత్రార్జితంలో అతని వాటా మాత్రమే ఇచ్చారు. "ఇంట్లో ఇంకా ఏడుగురు పిల్లలున్నారు. వాళ్ళ భవిష్యత్తు నేను చూసుకోవాలి. నీ భవిష్యం నీ చేతుల్లోకి తీసుకున్నావు వెళ్లు" అన్నారాయన.

'ఆదుర్తి'- సుబ్బారావుని వెంటబెట్టుకొని బొంబాయి వెళ్ళిపోయాడు.

అతని వాటా ఆస్తిని మళ్ళీ ఎక్కడో అయినకాడికి తెగనమ్ముకుండా, అది తన దగ్గరే తాకట్టేసుకుని, రెండువేల నగదు యిచ్చి పంపారు. సుబ్బారావు బొంబాయి వెళ్ళి సెంట్ జేవియర్ కాలేజ్ అఫ్ సినిమాటోగ్రఫీలో చేరాడు. మూడేళ్లు కోర్సు అన్నారు. ఊహలో సినిమా వ్యాకరణం దాకా వెళ్ళిన బుర్రకి ఈ బళ్ళో ఓనమాలు దగ్గర ఆరంభించడం, ఇది మూడేళ్లు సాగడం నచ్చలేదు.

"ఇక్కడొద్దులేవోయ్ ఏదేనా స్టుడియోలోకి పోదాం" అన్నాడు ఆదుర్తి.

"సరే పద" అన్నాడు శిష్యుడు సుబ్బారావు.

ఆ తరువాత నిజమైన విద్యాభ్యాసం ఆరంభమైంది. జీవితం ఆరంభమైంది. సంగ్రామం ఆరంభమైంది. సుఖజీవితంలో కష్టాల పోపు వేస్తే వుండే మజా తెలిసింది. ఆకలి తెలిసింది. అవమానం తెలిసింది. ఆశల అంచులు కనిపించాయి. నిరాశల ఆటంకాలు తగిలాయి.

"సారీ బ్రదర్" అన్నాడు ఆదుర్తి.

"ఇట్సాల్ రైట్" అన్నాడు సుబ్బారావు నీరసాన్ని చిరునవ్వుగా పరిమార్చి.

"ఇంకొంచెం గట్టిగా నవ్వు. ఎవడో వస్తున్నాడు. ఈలపాట పాడు. నమస్కారం చెయ్యి" అన్నాడు ఆదుర్తి.

"నాకా డ్రిల్లు మాత్రం చెప్పకు. చిరాకు. నీకేం-ఆశలు భోంచేస్తావు. ఇక్కడ నాకు శోషొస్తోంది." అన్నాడు సుబ్బారావు.

"ఆదుర్తి"కిది వినబడలేదు. దీనానార్వేకర్‌గారు, ఎడిటింగ్ గురించి ఏదో సూత్రాలు చెప్తూంటే వింటున్నాడు.

ఎడిటింగ్ టేబుల్ దగ్గరకు చేరడానికి ముందు కొన్నాళ్ళపాటు ఆదుర్తి కెమెరా డిపార్టుమెంటులో అసిస్టెంటుగా పనిచేశాడు. "రామరాజ్య"లో కొన్నాళ్ళు పని చేశాడు. కెమెరా కాదు; ట్రాలీని ముట్టుకున్నా, పెద్దలు కోంబడే రోజులు. ఆదుర్తికి బోరు కొట్టింది. "ఇక్కడసల్లాభం లేదు" అన్నాడు.

"సుబ్బరంగా నాన్నగారి మాట విని యింటి దగ్గరుండిపోతే..." అని గొణుక్కున్నాడు సుబ్బారావు.

"ఛ ఛ! వొద్దు..." అన్నాడు ఆదుర్తి.

తిరిగి ప్రాసెసింగ్, ప్రింటింగ్ చాలా గొప్ప విద్యలని ఎవరో చెప్పారు. బాంబే ఫిలిం లాబ్‌లో చేరాడు ఆదుర్తి.

కొన్నాళ్ళ తరువాత, ఒక శ్రేయోభిలాషి హితవు చెప్పాడు. 'ఇక్కడెందుగ్గాని, ఎడిటింగ్ నేర్చుకో. వృద్ధి కొస్తావు" అని.

నెలకి పాతిక రూపాయలు జీతం మీద, ఎడిటింగ్ శాఖలో దీనానార్వేకర్‌గారి దగ్గర అసిస్టెంటుగా చేరి పని నేర్చుకున్నాడు ఆదుర్తి.

ఇంతకాలమూ, అతనికోసం సుబ్బారావు చాలా అవస్థలు పడ్డాడు. 'ఆదుర్తి' విద్య నేర్చుకోవాలంటే సుబ్బారావు ఎలాగో అలా తిని తిరిగే శక్తి గడించుకోవాలి. చపాతీలు, బటాణీలు, వేరుశెనక్కాయలు, ప్రశస్తమైన మంచి నీళ్ళు...

ఇంటికి డబ్బుకోసం రాసేవాడు అప్పుడప్పుడు.

ప్రామిసరి నోటు ఒకటి వచ్చేది. అందు మీద దస్కతు చేసి పంపితే అప్పుడు మనియార్డరు పంపేవారు సత్తెన్నగారు.

ఇది తెలిసినవాళ్ళు ముక్కున వేలేసుకున్నారు - కుర్రాడి కన్న తండ్రిదే మంకుపట్టులా వుందని.

చాలా యేళ్ళ తరువాతగాని ఆయన మనసు అందరికీ విశదంగా అర్థం కాలేదు.

మరణోన్ముఖులై వున్న వేళ, ఆయన ఇన్నాళ్ళూ కొడుకు దగ్గర రాయించుకున్న ప్రామిసరీనోట్లు చించివేశారు. అతని వాటా ఆస్తిమీద రాయించుకున్న తాకట్టు పత్రాలు చింపేశారు. తన ఆస్తిలో అతని కివ్వవలసిన వాటా కూడా స్పష్టపరిచారు.

"వాడిమీద నాకు కోపం అన్న భ్రమ కొద్దీ ఎవరన్నా వాడికి అన్యాయం చేశారంటే జాగర్త" అని హెచ్చరించి కన్ను మూశారు.

❀ ❀ ❀ ❀

తండ్రి కన్ను మూసేనాటికి ఆదుర్తి సుబ్బారావు - ఆయన తృప్తిగా ఆమోదించ తగిన స్థాయి అందుకున్నాడు. మద్రాసులో ఉదయశంకర్ తీస్తున్న "కల్పన" చిత్రానికి ఎడిటర్‌గా, సహాయ దర్శకుడుగా 175 రూ॥లు జీతంపై చేరాడు.

ఆదుర్తి చురుకుదనం, సంస్కారం, సౌందర్యాభిరుచి, విలువలు నిర్ణయించే శక్తి చూసి, ఉదయశంకర్ అతన్ని ఆంధ్రదేశంలో నర్తకులను ఎన్నిక చేసే బృందంలో ఒకరుగా వేసి, పంపారు. కెమెరామన్ కోట్నిస్, ఎడిటర్ ఆదుర్తి, సంగీత దర్శకుడు విష్ణుదాస్ షిరాలీ, ఆయన సహాయకుడు కేల్కర్ టూర్ చేస్తున్నారు.

తండ్రి పోయాడన్న తంతివార్త మద్రాసు రాగానే, తెనాలికి పంపాడు ఉదయశంకర్. అది తెనాలి వచ్చేసరికి, ఆదుర్తి గుంటూరులో నృత్య పరీక్షలు

చూస్తున్నాడు. టెలిగ్రాం గుంటూరు చేరేసరికి ఆయన బెజవాడ చేరాడు. అది బెజవాడ వచ్చేసరికి..



ఉదయశంకర్‌కి ఆదుర్తి సహాయకుడిగా పనిచేసిన 'కల్పన'

ఆదుర్తి, తన మిత్రబృందాన్ని వెంటబెట్టుకుని బాగుపడి తండ్రి ఎదుట నిలుస్తున్నానన్న ఆనందంతో, అమ్మ సంతోషించి, "చూశారా?" అని నాన్నగారికేసి చూసి నవ్వగా చూడాలన్న ఆశతో, అమ్మకి నాన్నకి ఇంట్లో అందరికీ బట్టలుకొని, పువ్వులు మిఠాయిలు కొని, జట్కా దిగి ఇంట్లోకి వెళ్ళాడు...

గుండెనీరై గోదావరై ప్రవహించింది. ఒక్క రోజు ఆలస్యంగా చేరిన ఆదుర్తి సుబ్బారావుకు, అశ్రుతర్పణం చేసే అదృష్టమే మిగిలింది...

❀ ❀ ❀ ❀

"కల్పన" ముగిసేనాటికి ఆదుర్తికి సినిమా ప్రపంచంలో చెప్పుకోతగ్గ పేరు గౌరవం వచ్చాయి. మనిషయ్యాడు.

"థాంక్యూ సుబ్బారావ్" అన్నాడు ఆదుర్తి.

"ఇట్సాల్ రైట్ బ్రదర్" అన్నాడు సుబ్బారావు.

సుబ్బారావు కష్టపడబట్టి 'ఆదుర్తి' విద్య నేర్చుకొని వృద్ధికొచ్చాడు. ఇవాళ ఆదుర్తి వృద్ధికి రాబట్టి సుబ్బారావు. ..కాదు... ఇపుడూ ఆయన సుఖం అనుభవిస్తున్నా పూర్వంలాగే, అంతకు పదింతలుగా కష్టపడి పని చేస్తున్నాడు. అహోరాత్రులు పని చేస్తున్నాడు.

బొంబాయిలో ఆయనకు నిద్ర రాకపోతే అది ఆకలివల్ల, బెంగవల్ల. అక్కడ ఆకలి వేస్తే అది డబ్బులేక.

ఇవాళ, పని గురించిన ఆలోచనతో నిద్రపోరు. తీరికలేక భోజనం వేళకు తినరు.

అందుకే ఇవాళ కార్యదీక్షకీ, దక్షతకీ అర్థం ఆదుర్తి అని టూకీగా చెబుతారు. 'కల్పన'లో పనిచేస్తూ వుండగానే 1947లో డాక్టర్ మద్రిపాటి హనుమంతరావుగారి కుమార్తె కామేశ్వరీ బాలను ఆదుర్తి వివాహం చేసుకున్నారు.

"మీరు ఒకరి కిద్దరయ్యారు. నీ జీతం రెట్టింపు చేస్తున్నాను" అన్నారు ఉదయశంకర్. అదే ఆయన పెళ్ళికానుక.

శంకర్‌కు సుబ్బారావుగారిమీద గౌరవం వాత్సల్యం సమానంగా వుండేవి. "కల్పన"లో ప్రతిభావంతమైన దృశ్య కల్పన లెన్నిటికో ఆదుర్తి సూచనలు తీసుకునేవాడాయన. "కల్పన"ను విదేశాలలో ప్రదర్శనకు యోగ్యంగా కుదించి కూర్చే బాధ్యత సంపూర్ణ విశ్వాసంతో ఆయన ఆదుర్తికి ఒప్పగించాడు. ఆ విశ్వాసంవల్లనే ఆదుర్తి అది సమర్థంగా నిర్వహించాడు.

ఇవాళ ఆయన, తన సహచరుల వృద్ధికి వేసే మంత్రం కూడా అదే. వారిని నమ్మి బాధ్యత గల పని ఒప్పగించడం, వారి మాట గౌరవించడం.

ఎడిటర్‌గా ఆదుర్తి స్వతంత్రంగా పనిచేసిన తొలి చిత్రం– "పారిజాతాపహరణం" తమిళం. "కల్పన"లో అసిస్టెంట్ డైరెక్టరుగా చేరి, తరువాత ఎడిటర్ అయ్యాడు. భావి దర్శకుడుగా ఆయనకు అదే నిజమైన 'కళాశాల' అయి తీర్చిదిద్దింది. అన్నిటికీ ఓనమాలు బొంబాయిలో నేర్చుకున్నాడు. అక్కడాయన కెమెరా అసిస్టెంటు. ఎడిటింగ్ అసిస్టెంటు. అసిస్టెంటు డైరెక్టరు నాళం నాగేశ్వరరావుగారితో కలిసివున్న రోజుల్లో ఆయన రచనకు ప్రోత్సహించారు. మాటలు, పాటలు, ఛందోబద్ధంగా పద్యాలు రాసేవాడు. అచ్చం సూర్యంగారి వనరాణి, మంగళసూత్రం, ఒక రోజు రాజు, సర్కస్ రాజు చిత్రాలకు చాలా రాశాడు.

జి. వరలక్ష్మి పాడిన హిట్‌సాంగ్ – రాజువు నీవైతే, నీతో రాణిని నేనౌతా అన్నది "ఆ. సు." కవిత్వమే.

తర్వాత మద్రాసు వచ్చి కల్పనలో సంగీతం, నృత్యం శ్రద్ధగా వినీ కనీ ఆకళింపు చేసుకున్నాడు. ప్రకాష్ స్టుడియోలో 'దీక్ష' చిత్రానికి – అసిస్టెంట్ డైరెక్టరుగా చేరినా, మిగత పనులన్నీ చేసేవాడు. నేర్చుకునేవాడు. ప్రకాశరావుగారు కూడా విశాల హృదయుడు. ఆదుర్తికి తరచు డైరెక్షన్ ఛాన్సు ఇచ్చి పని చేయించేవారు. ఆ రోజుల్లోనే ఆదుర్తి సుందర్లాల్‌గారి "సంక్రాంతి"కి, ప్రకాశరావుగారి "కన్నతల్లి"కీ ఎడిటర్‌గా పని చేశాడు. ప్రకాష్‌వారి బాలానందం చిత్రాలలో కొన్ని భాగాలు, ఆయన చేతనే తీయించారు. పిల్లలతో సీను తియ్యగలిగినవాడు ఎక్కడికెళ్ళినా నెగ్గుకొస్తాడు అన్నారంతా.

ప్రకాష్ స్టుడియో జనరల్ మేనేజరు దినవహి భాస్కర నారాయణగారూ, ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ ఎస్.భావనారాయణగారూ ఆదుర్తికి మంచి మిత్రులయ్యారు.

ముగ్గురిదీ రాజమండ్రియే. అందులో డి.బి. నారాయణగారిదీ ఈయనదీ పుట్టినరోజు ఒకటే - డిసెంబరు 16.

దూకుడులో, చొరవలో, హుషారులో ఇద్దరి కిద్దరే.

"పిక్చరిస్తా డైరెక్షను చేస్తావా?" అన్నాడు డి.బి.ఎన్. ఒకనాడు.

"ఓ. యస్. పులొచ్చినా జడవను కూడా" అన్నాడు ఆదుర్తి నవ్వి.

"అదే కావాలి" అన్నాడు భావనారాయణగారు.

త్రీ మస్కిటియర్స్ ఆఫ్ రాజమండ్రీ 1954లో ఒకనాడు సాహిణీపిక్చర్స్ నెలకొల్పారు. "కల్పన"లోని నృత్య సంగీతాలింకా గుండెలో ఉరకలు వేస్తున్న ఆదుర్తికి, తొలిచిత్రం సంగీత ప్రధానమైనదే లభించింది. అదే "అమర సందేశం"

"ఏది ఏది ఆ కుర్రాడా డైరెక్టరు.." అన్నవాళ్ళంతా ఆ కుర్రాడు పట్టుదలతో తీర్చిదిద్దిన చిత్రం చూచి మనసారా అభినందించారు. గొప్పవాడివవుతావు అని దీవించారు. ఆ విజయాన్ని పురస్కరించుకొని వుత్సాహంతో "పాండురంగ మహత్మ్యం" తీయాలని సంకల్పించారు.

ఇంతలో ఎన్.ఎ.టి.వారు అదే కథను ఎన్నుకున్నారు.

ఈ లోపల అన్నపూర్ణా మధుసూదనరావుగారూ, నటుడు నాగేశ్వరరావుగారూ "అమరసందేశం" చూశారు.

కొత్త సంస్థే. తొలిచిత్రం 'దొంగరాముడు' విజయవంతంగా నడిచింది. 'తోడికోడళ్ళు' నిర్మాణం తలబెడుతున్నారు.

"మా రెండో చిత్రం, దర్శకుడుగా మీ రెండో చిత్రం ఒకటే కావాలని మా అభిమతం. అక్కడినుంచి చెట్టాపట్టాలు వేసుకుని చాలా దూరం వెళ్ళచ్చు" అన్నారు మధుసూదనరావుగారు.


మంజక్ మహిమైలో రాజసులోచన, తంగవేలు

ఆదుర్తి అన్నపూర్ణా దర్శకుడయ్యాడు. తోడికోడళ్ళు తెలుగు, ఎంగళ్‌వీట్టు మహాలక్ష్మి తమిళం తీశాడు. రెండూ శతదినోత్సవాలు చేసుకున్నాయి. సంస్థకీ, దర్శకుడికీ కూడా పేరొచ్చింది.

తరువాతి కథ వెండితెరమీద చూస్తున్నదే.

ఎంగళ్‌వీట్టు మహాలక్ష్మితో ఆదుర్తికి తమిళనాడులో కూడా ఆహ్వానాలు రాసాగాయి, మాంగల్యబలం, మంజళ్‌మహిమై తీసిన తరువాత ప్రతిష్ఠ మరింత పెరిగింది.

తమిళంలో ఆయన తీసిన చిత్రాలు ఎంగళ్ కులదేవి, ఎల్లాం ఉనక్కాగ, అన్నపూర్ణవారికి తూయవుళ్ళం (వెలుగునీడలు తమిళం), కుముదం, కాట్టురోజా.

మాంగల్యబలం తరువాత, తెలుగులో కూడా బయటి చిత్రాలు ఒప్పుకున్నారు. శంభుఫిలింస్‌వారి నమ్మినబంటు, ప్రభావారి ఆడపెత్తనం ఆ కోవలోవే.

ఆడపెత్తనం నిర్మాత రామదాసుగారితో భాగం కలిపి, మహేంద్రా ఫిలింస్ "కృష్ణప్రేమ" తీశారు. అది అనుకున్నట్లు విజయవంతం కాలేదు.

"అవును అందులో ఓడిపోయాను." అంటాడాయన ధైర్యంగా ముక్తసరిగా.

అదే ఆయన గొప్ప. జయాపజయాలకు ఆయన అతీతుడు. ఉషారు ఆయన ఊపిరి

ఎల్లాం వునక్కాగ తీస్తున్న రోజులలోనే శరవణభవ యూనిట్ నిర్మాత సుందరంగారితో పరిచయం కలిసింది.

"కుముదం" చిత్రం తీస్తున్నపుడే ఆ కథ బాగుంటుందని తోచి, హక్కులు తీసుకున్నారు ఆదుర్తి.

సుందరంగారు వచ్చి మనం పిక్చరు తీద్దాం అనగానే ఈ కథ చెప్పారు.

బాబూమూవీస్ సంస్థ రూపొందింది. ఆంధ్ర దేశాన్ని ఊపివేసిన "మంచిమనసులు" చిత్రం పుట్టింది.

ఆ విజయోత్సాహంలోంచే ఆంధ్రులు ఈనాడు సగర్వంగా "మాది" అని చెప్పకుంటున్న "మూగమనసులు" జన్మించింది. అందులోంచే, రేపు ప్రేక్షకులు, పరిశ్రమ సుహృదయపూర్వకంగా స్వీకరించనున్న బాబూమూవీస్ బహుమతి– "తేనెమనసులు" నటబృందం రూపొందబోతున్నది.



మంచిమనసులులో నాగేశ్వరరావు, సావిత్రి

ఈ బృహత్కార్యాలన్నీ చేస్తున్నది "ఆదుర్తి", చేయిస్తున్నది సుబ్బారావు. ఆ యిద్దరు మిత్రులూ ఎప్పుడూ తీవ్రంగా చర్చించుకుంటూ వుంటారు. ఎంతమంది

మధ్యవున్నా వాళ్ళు మట్లాడుకుంటూనే వుంటారు. వారికి నచ్చిన పని ఇతరులు ఎంత కాదన్నా ధైర్యంగా మొండిగా చేసుకుపోతూనే వుంటారు.

నమ్మినబంటు చిత్రానికి ఎడ్లపందాలు తీస్తున్నవేళ ప్రాణాలకు తెగించి ఆ మధ్య చొరబడ్డపుడు ఆదుర్తికి సుబ్బారావే తోడు.

'మూగమనసులు' షూటింగుకు పాపికొండల సుడిగుండాల మధ్యకు పడవ మీద వెళ్ళిపోతున్న సుబ్బారావుకు చుక్కాని ఆదుర్తే. వాళ్ళకి గురి కుదిరితే, మరొకళ్ళ మాటవినరు. అసలు వాళ్ళిద్దరికీ భయం లేదు. యే భయం లేదు. ప్రాణభయం, ఆరోగ్య భయం, డబ్బు భయం లేవు. ఉన్నదల్లా పని గురించిన భయం. పేరు గురించిన భయం. ఒకళ్ళను నొప్పిస్తామన్న భయం. ఇవాళ అర్థబలం అంగబలం, దండిగా ఉండగా ఆయనకెంత ధైర్యసాహసాలున్నాయో, అవి రెండూ లేనినాడూ అంతే ఉండేవి.

ఆదుర్తినీ సుబ్బారావునీ వేరుచేసి మాట్లాడడం, పాలూ నీరూ వేరు చెయ్యడంకన్న కష్టం. వ్యక్తిగా ఆయన జీవించే ప్రతి క్షణానికీ దర్శకుడుగా ఆయన చిత్రించే చిత్రం ప్రతి అంగుళం మీద ప్రభావం వుంటుంది.

చైతన్యం, వేగం, ఉత్సాహం, ఆనందం వ్యక్తి లక్షణాలు. ఆయన చిత్రాలు కూడా అంత చైతన్యవంతంగా వుంటాయి. గంటకి గంటన్నర వేగంతో పరిగెడతాయి. ఆ చైతన్యం ఆ ఉత్సాహం నీరసంగా కూర్చున్న ప్రేక్షకుడిని కూడా లేపి నిటారుగా కూర్చోబెడుతాయి. జీవితంలో ఆయన ఎన్నో కష్టాలుపడ్డా ఎప్పుడూ ఆనందంగా తిరిగాడు జిడ్డు, తోముడూ ఎరగడు. అందుకే ఆయన చిత్రంలో విషాద సన్నివేశాలు విసుగెత్తకుండా ఉంటాయి.

అసలు చలన చిత్రాలు ప్రధానంగా ప్రజల వినోదం కోసమేనని ఆయన నమ్మకం. జీవితానికి కూడా అందంగా ఫ్రేము కడితే చూడడానికి అందంగా ఉంటుందని, అలాగే ఉండాలని ఆయన వాదం. సినిమా కళ కాదని వాదం. 'కాదుసుమా కళ కాదు సుమా' అంటాడు ఆయన నవ్వి. కాదన్నంత మాత్రాన కాదని కాదు. నిజమైన కళ అనేది చాలా వ్యక్తిగతమైనది. కొద్దిమందికే అందుతుంది. అందరూ చూసి ఆనందించేది పై అర్థం ప్రకారం ఐతే కళకాదు. ఇదీ ఓ కళే అని ఒప్పుకుంటే, చాలా గొప్ప కళ అంటారు. అందుకే అన్ని వర్గాల స్థాయిల అభిరుచులవారూ ఆనందించదగిన సర్వజనరంజన శృతిలో మేళవించి ప్రస్తరిస్తారాయన.

"చిత్రంలో ఏది చూపాలి అన్నది అన్నపూర్ణా సంస్థలో మధుసూదనరావుగారి దగ్గర నేర్చుకున్నాను. ఎలా చూపాలీ అన్నది ఉదయశంకర్ దగ్గర నేర్చుకున్నాను. ఆ యిద్దరికీ నేను సర్వదా కృతజ్ఞుడిని." అంటారు ఆదుర్తి సుబ్బారావుగారు.

జీవితంలో విశ్వం అంతటా ప్రతిదీ లయప్రకారం నడుస్తుంది. అన్నం తినడం, నడవడం, మెట్లు దిగడం, పరుగెత్తడం, మాట్లాడడం అన్నిటా లయ ఉంది.

సూర్యచంద్రులందరికీ లయ ఉంది. ఆ శక్తిని ప్రతిష్ఠిస్తేనే చలన చిత్రాలలో జీవం స్పందిస్తుంది అంటారు సుబ్బారావుగారు. ఈ జ్ఞానానికి, సంస్కారానికి జీవితంలో తను కన్నవీ విన్నవీ జోడించి చిత్రసృష్టి చేస్తాడాయన. ఎప్పుడో చిన్ననాడు తను చదువుమాని, బాట్మింటన్ ఆడే రోజులలో తండ్రికి కోపంవస్తే ఆయన సరాసరి కోర్టుకువచ్చి బాటు విరక్కొట్టి పడేసి మాట్లాడకుండా వెళ్ళిపోయేవాడు. కోపగించిన కొడుకు మర్నాడు సాయంత్రము ఆటకు బయల్దేరేసరికి, అయనే కొత్త బాటు సిద్ధంగా ఉంచేవాడు. ఈ అందమైన కోపాన్ని ఇవాళ తేనెమనసులు చిత్రంలో మనోహరమైన సన్నివేశంగా అనువదించి పొందుపరుస్తున్నారు ఆదుర్తి.

ఆదుర్తికి దర్శకులందరికీ వుండవలసిన ఒక గొప్ప అర్హత ఉంది – రసికత! చిత్రం కథ మాటలు పాటలు నృత్యాలు ఆయా కళాకారులు తయారుచేసే వేళ దర్శకుడు వాటిని ప్రేక్షకుల ప్రతినిధిగా రసికుడుగా ఆస్వాదించి ఆనందించాలి. ఆ శక్తి ఆయనలో అపారం. ఆయనలో కవి, సంగీతకుడు, నర్తకుడు, ఛాయాగ్రాహకుడు అందరూ వున్నారు. రసాస్వాదన తరువాత ఆయా శక్తులతో అన్నిటినీ తనకు కావలసిన రూపులో దిద్దుకుంటాడు. ప్రతిపాటకు అందులో విషయం ఏదో ఒకటి అర్థవంతంగా ఏర్పరచి రాయించుకుంటాడు. సంగీతానికి కొలతలు చూపిస్తాడు. నృత్య దర్శకుడితో తాళం వేస్తాడు. ఈ బహుముఖ ప్రజ్ఞాశాలిలో ఈ అన్నిటితోపాటు అద్భుతమైనది మరొకటి వుంది. మంచిమనసు. ఆయన గడించిన గౌరవానికి, అందరి ప్రేమను జోడించి అద్వితీయుణ్ని చేసింది. ఆయన పరిధిలోకి వచ్చేవారంతా డబ్బు కన్న మిన్నగా ఆయన ప్రతిభ మీద భక్తి గౌరవాలతో ఆయన ప్రేమాదరాల ఆనందంతో దాసులై పని చేస్తారు.

అయినా ఆయన ఎవరిచేతా పని చేయించడు. వారితో కలసి చేస్తాడు. అందరం కలిసి చేస్తున్నామన్న భావం కలిగిస్తాడు.

అదే ఆదుర్తి విజయ రహస్యం. అది సుబ్బారావుకు తెలుసు. అయితే అతనికి వినయం మహలావు.

"అబ్బే..." అని సిగ్గు పడతాడు.

దొంగ. **(జ్యోతి 1964)**

ఆదుర్తి సుబ్బారావు – 'అమర సందేశం'తో మొదలైన ఆయన కెరియర్ అన్నపూర్ణా వారికి 'తోడికోడళ్లు', 'మాంగల్యబలం'తో ఊపందుకుంది. సి. సుందరంతో కలిసి బాబూమూవీస్ స్థాపించి 'మంచిమనసులు', 'మూగమనసులు' తీసి, విజయం సాధించాక అందరూ కొత్తతారలతో తొలిసారిగా కలర్‌లో సాంఘిక చిత్రం 'తేనె మనసులు' తీశారు. అక్కినేని నాగేశ్వరరావుతో కలిసి చక్రవర్తి చిత్ర పేర 'సుడిగుండాలు', 'మరోప్రపంచం' వంటి ప్రయోగాత్మక సినిమాలు, స్వంతంగా 'మాయదారి మల్లిగాడు' 'గాజుల కిష్టయ్య' తీశారు. 'మూగమనసులు'లను 'మిలన్'గా తీయడానికి హిందీ రంగానికి వెళ్లి తన తెలుగు సినిమాలను హిందీలో పునర్నిర్మించి అక్కడా జయకేతనాన్ని ఎగురవేశారు. 'క్షేత్రయ్య' సినిమా డైరక్టు చేస్తూండగానే 1975లో అకాలమరణం చెందారు. రమణ ప్రతిభను గుర్తించి తొలిరోజుల్లో ప్రోత్సహించిన దర్శకుడాయన!

# కథా శివబ్రహ్మం



తలా తోకా చటుక్కున పోల్చుకుందుకు వీల్లేనివాటిలో నిత్యశంకితుని భావాలూ, నూలుపోగూ, వానపామూ, రెండు జడలపిల్లా, కొత్తకార్లూ వగైరా చరాచర పదార్థాలతోపాటు చెప్పుకోతగ్గ మరో జడపదార్థం తెలుగు సినిమా కథ అంటారు. అలాగే మిథ్యావాదాన్ని బలపరిచే ఉదాహరణలలో ప్రబంధ నాయికల నడుమూ, ఎన్నికల వాగ్దానాలలో నిజాయితీ, అవకాశవాది నిశ్చితాభిప్రాయం, తెలుగు సినిమాలో కథ చెప్పుకోతగ్గవంటారు.

ఇటువంటి తెలుగు సినిమా కథను వెనకేసుకొచ్చి నిలబెట్టగల వారిలో, ఇదీ కథేను అని కథగా చెప్పగల గొప్పగలవారిలో శ్రీ వెంపటి సదాశివబ్రహ్మం ముఖ్యులు. తెలుగు సినిమా చిన్నతనం రోజులలో (అవే గొప్పతనం రోజులూను) ప్రవేశించి నేటివరకూ, 'ఇదిగో సినిమా కొక కథ చెబుతా విను' అని చెప్పి, 'కథా రచయితగా' (చాలామంది మాటల పాటల రచయితలే) నిలబడి నెగ్గుకొస్తున్న ఒకే ఒక్క వ్యక్తి ఈయనే. కాలంనాడు హిందీలోనూ బెంగాలీలోనూ సినిమాకి గురి అయి చనిపోయిన కథల్ని తవ్వి తీసి బ్రతికించి తెలుగు ప్రాణం పోస్తాడని విమర్శించే గిట్టని వాళ్ళు ఉన్నా నేటి సినిమాల కథల విలువ తెలిసినవారూ, ఆయన వాగ్ధాటిని ఎరిగినవారూ సగౌరవంగా 'కథాశివ బ్రహ్మం' అంటారు.

సదాశివబ్రహ్మంగారు ఒక రకంగా ఆశుకవి. ఒకే ఒక కథావస్తువు దొరక బుచ్చుకుని ఒకరోజు పొద్దుటనుంచి సాయంకాలం లోపల పద్దెనమండుగురు నిర్మాతలకు నలభయ్యేడు కథలు- చెప్పింది చెప్పకుండా చెప్పుకుపోగలడు. గుడ్లు తిప్పుకుంటూ, పొడుగుపాటి సిగరెట్లు పీల్చేస్తూ చేతు లెగరేస్తూ 'విశాపట్నం' యాసలో 'ఆయనలాఘ కథ లల్లీసుకుపోతూ, వాటిలో సన్నివేశాలు కళ్ళక్కట్టీలా', ఉద్వేగంతో ఉత్సాహంతో చెప్పుకుపోతూ ఉంటే నిర్మాతలు దర్శకులు కూడా ముగ్ధులైపోయి వింటూ ఉండిపోతారు. అంతా విన్నాక వారు ఆ విన్నదేమిటో చెప్పుకోలేరన్నది వేరు విషయం. ఇంద్రజాలికుడు సదాశివబ్రహ్మం చెప్పినపుడు కళ్ళక్కట్టినట్లు అద్భుతంగా కనిపించిన సన్నివేశాలు తీరా తెర కెక్కాక తలా తోకా

తెలియకుండా తయారైతే అది ఆయన తప్పుకాదు. అసూర్యంపశ్యలలో అతిలోక సౌందర్యవతులున్నారని ఒప్పుకుంటే ప్రేక్షకుల దాకా సాగిరాని ప్రతిభగల వారిలో (కథకీ తెరకీ మధ్య లక్షగండాలు) సదాశివబ్రహ్మం ఘనుడనే చెప్పుకోవాలి. పద్యంలో ఆశుకవిత ఘనమైతే గద్యంలో జీవితం మీద అనర్గళంగా ఆశువు చెప్పగలగడం ఈయన ప్రజ్ఞ (పద్యాలు కూడా బాగా చెప్పగలడు). ఎటొచ్చీ ఆశుకవులు ఒక మూసలో వర్ణననే తిరగామరగావేసి రకరకాలుగా చెప్పినట్టు ఈ 'ఆశుకథకుడు' కూడా ఒకే కథను ఒక్కపూటలో ఇరవై నాలుగు మోస్తర్లలో అల్లుకుపోతాడు. మధ్యలో అతుకులూ, టంకాలూ, పాత్రలూ, తీరులూ సవ్యంగా కుదరకపోయినా, అప్పుడు తెలియవు. తెలిసేసరికి కాలాతీతం అయిపోతుంది. అందుకే సినిమాలైన ఆయన కథలు కొన్నిటిలో ఏనుగుతల పాముకీ, చీమతల ఏనుక్కీ దాని తోక పిచిక్కీ ఉన్నట్టు కనబడతాయి.




ఇరవయ్యేళ్ళ సినీ జీవితంలో సదాశివబ్రహ్మంగారి కథలతో సినిమాలై కండపుష్టితో రూపొంది బ్రహ్మాండమైన విజయం సాధించిన చిత్రాలలో ఘరానాదొంగ, సంసారం, చరణదాసి, భలేరాముడు, ఇంటిగుట్టు, ఇల్లరికం, అన్నపూర్ణ మొదలైనవెన్నో ఉన్నాయి. వీటిలో కొన్నిటి కాయన మాటలు పాటలు కూడా వ్రాశాడు. ఇవేకాక ఆ మధ్య నటనలోను దర్శకత్వంలోను కూడా తేలిగ్గా చేయి కాల్చుకుని మళ్ళీ తన 'కథాస్థలానికి' వెళ్ళిపోయొచ్చేశాడు. ఇప్పటికీ చిన్న నటులతో కొత్తవాళ్ళతో అద్భుతమైన చిత్రం తీసి స్టార్‌వాల్యూ అనేది అపోహ అని నిరూపించాలని దర్శకుడుగా మంచి కథలు చిత్రించాలని ఆయనకు చాలా మోజు ఉంది.

హెచ్.ఎం. రెడ్డిగారి 'తెనాలిరామకృష్ణ' నుంచి నేటివరకు సినిమా కథలతో కలిసి అడుగులు వేస్తున్నవాడు కాబట్టి, తన అనుభవం, పలుకుబడి ఉపయోగించి కథను కొత్తదారులు పట్టించడం బాధ్యతగా స్వీకరించగల హక్కు, అధికారం ఈయనకు ఉన్నవి. ప్రేక్షకుల తరఫున నిర్మాతలకు మంచి కథలను, కొత్తవాటిని సిఫార్సుచేసి ఒప్పించగల సామర్థ్యమూ ఉంది. మంచివాడన్న మంచి పేరూ ఉంది. వీటన్నిటినీ మంచి లక్ష్యాలు సాధించడానికీ ప్రయోగించి సాధించిననాడు ఆయనకు తెలుగు సినిమాకథ కథలో కథాశివబ్రహ్మం అన్న పేరు స్థిరపడితీరుతుంది.

**(ఆంధ్ర-వారపత్రిక-1959)**

సదాశివబ్రహ్మం (1905-68) సదాశివబ్రహ్మం కెరియర్ చివరివరకూ ఉజ్జ్వలంగానే సాగింది. 'లవకుశ' 'పరమానందయ్య శిష్యుల కథ', 'భువనసుందరి కథ' 'భామావిజయం' 'రణభేరి' - ఇలా అనేక హిట్ సినిమాలకు కథ అందించారు. 'కణవన్ కన్‌కండ దైవం' (తమిళం) సినిమాకు కూడా కథ అయనదే! 'రాధిక' (1947) సినిమాకు దర్శకత్వం వహించారు. అయన తలపెట్టిన 'గుడ్ మార్నింగు', 'గుడ్ ఈవెనింగు' నిర్మాణదశలోనే ఆగిపోయాయి.

# సినీవ్యాస రమణీయం (సంగీతకారులు)

# సముద్రాల రాఘవాచార్యులు



"ఏదీ చూదాం, వైన్ అండ్ వుమన్‌కు తెలుగు చెప్పండి కవిగారూ."

తములపాకు ఈనె తీయడం మొదలుపెట్టిన కవిగారు ఆ పని సాంతం ముగించి, తల పైకెత్తి "ఏముందీ మదిరా, మదవతీను" అంటూ ఆకు చిలకచుట్టి నోట్లో వేసుకున్నారు.

కష్టావధానానికి మారుపేరైన సినీరచనా వ్యాసంగంలో పాతికేళ్ళుగా పోరాడి పోరాడి నెగ్గుకొస్తున్న శతావధాని సముద్రాల రాఘవాచార్యులుగారి ప్రజ్ఞా ప్రాభవాలకు, పైన పెద్దక్షరాలలో అచ్చుపడిన మాటలాట మచ్చుతునక అని ఈ వాక్యకారుడి తాత్పర్యం కాదుగాని సినిమాలో రచయితకు ఉండవలసిన వెయిన్నొక్క హంగులలో ముఖ్యమైనది సమయస్ఫూర్తి అనీ, ఇది సముద్రాల సీనియర్‌లో సమృద్ధిగా ఉందనీ అది చెబుతుంది.

సముద్రాలది కవికులం.

"మా తాత కవిత్వం చెప్పాడు. మా నాన్న చెప్పాడు. నాదాకా వచ్చేసరికి, 'నాయనా, ఈ కవిత్వాలు అన్నంపెట్టే రోజులు అయిపోవచ్చాయి. నువ్వు దీని జోలికి పోవద్దు' అన్నాడు మా నాయన" అంటారు ఆయన.

సముద్రాల కవిత్వం జోలికి పోవడానికి గల కారణాలలో ఇది ఒకటి కావచ్చు. ఒక తెలుగు పండితుడి బలవంతంవల్ల, పద్నాలుగోయేట ఒక పెద్దమనిషి మీద పద్యం చెప్పిన రాఘవాచార్యులు, ఆ యేడాదే తోటికుర్రాళ్ళు పురికొల్పి మేష్టరుగారు ప్రోత్సహిస్తే, యతిప్రాసల గణగుణాల గురించిన బెంగ లేకుండా వందపద్యాలు గుణించి ఏవి ఎవరెవరివో గుర్తుంచుకు శతావధానం చేసేశారు. ఆ తరువాత చాలా యేళ్ళపాటు (1932 దాకా) ఇలా సరదాగా అవధానాలు చేశారు.

ఈ అవధాన సాధనే, తరువాత తరువాత జీవితంలో శతావధానాలు చేయడానికి రూపాంతరం ధరించి దోహదం చేసిందనిపిస్తుంది. ఇలా గ్రాంధిక భాషలో పుట్టి పెరిగిన సముద్రాలకు చిన్ననాడు తండ్రిగారు చెప్పిన మాట మళ్ళీ ఒక మంచిరోజున గుర్తుకొచ్చింది. రచనా వ్యాసంగానికి ఇక 'గ్రాంధికం' తగదన్న వాదం బాగా నిలబడి బలపడుతున్న ఆ రోజులలో 'నేటి గ్రాంధికభాష' వ్యావహారికమేనని ఈయనా ఒక కేక వేసి చెన్నపట్నం వచ్చారు. తరువాత ఆశ్రమంలో సముద్రాల జర్నలిస్టు 'ప్రజామిత్ర' బృందంలో ఒకరుగా ఉత్సాహంగా పనిచేస్తూ ఉండగా, సినిమావాళ్ళతో పోట్లాడుదుగాని రమ్మని రామబ్రహ్మంగారు బలవంతాన తీసికెళ్ళి 'కనకతార'లో రచయితగా కుదిర్చారు. (రుసుము రు.250. ఆనాటి స్టార్ రైటర్ తాపీ ధర్మారావుగారి రేటు రూ.400.) ఒక సెట్టుకు గ్రాంధికం వ్రాసి, ఎదురుతిరిగారు సముద్రాల. రెండో చిత్రం 'గృహలక్ష్మి'కి రాసే నాటికి స్థిరపడ్డారు. `You can not go' అని మొదట ఇంగ్లీషులో పుట్టే డైలాగు లెక్క ప్రకారం నాలుగు తెలుగు మాటలూ కవిగాడు రాసితీరాలనే రోజులు అవి. 'వెళ్ళడానికి వీల్లేదు' అన్న ఒక్క ముక్క కన్నా రాయడానికి వీల్లేదు" అని యువకుడు సముద్రాల పోరాడిన రోజులు అవి.

ఈ పోరాటం, రూపాంతరంలో ఈనాటికీ ఉంది. సినిమాలో సాధారణంగా ఎవరికేది తెలిసినా మానినా, రచన దగ్గరకు వచ్చేసరికి అందరూ ప్రవీణులే అయి ఉండడం, అవి ఆ ప్రకారమే జరగడం, ఆనక జనం నవ్విపోవడం పరిపాటే.

అందువల్ల నాటికీ నేటికీ గూడా కవి అనే శాల్తీ, బయట మాట దక్కించుకోవాలంటే, స్టుడియోలో 'మాట' నిలబెట్టుకోవాలి – నయానా భయానా, బ్రతిమాలీ బామాలీ, బుజ్జగించీను. లోవిలువ పైవిలువ కూడా గొప్పవనిపించుకొన్న పాటలు రాసి సర్వత్రా గౌరవాభిమానాలు గడించుకొన్న సముద్రాల ఈనాడు 'మాట'కు పోరాడేస్థితిని దాటిపోయారు. పెద్దవాళ్ల 'మాట'ని కాదనే వాళ్ళు తగ్గుతూనూ ఉన్నారు.


సముద్రాల దర్శకత్వం వహించిన వినాయక చవితిలో రామారావు

ఇలా పోరాటాల మధ్య నెగ్గుకొస్తూన్న సముద్రాల ఇపుడు దర్శకుడుగా కొత్త

భూమికను చేపట్టారు. రచయిత దర్శకత్వం తీసుకున్నప్పుడు ప్రేక్షకులకు కొత్త ఆశలు కలగడం సహజం. సముద్రాల తొలిచిత్రం 'వినాయకచవితి' వాలుగాలిలోనే సాగిపోయింది.

సినిమాకు కథలు కల్పించడం ఆయన పని కాకపోయినా, ఉన్న కథని మాటలమీద, తెరమీదా కూడా చిత్రించే ప్రముఖపాత్రను నిర్వహిస్తున్నారు. కాబట్టి, సినీభవంలో పాతికేళ్ళ పడుచువాడుగా, అనుభవశాలిగా, బాధ్యతగల రచయితగా సముద్రాల రాఘవాచార్యులుగారు కూడా ఆనాడు సినిమాలోకి వ్యావహారికం తీసుకురాబోయినట్టే,- సమకాలిక జీవితాన్ని ప్రతిబింబించే సారస్వతాన్ని కూడా ప్రవేశపెట్టి ఇపుడున్న గాడి మార్చడానికి సాటివారితో తోటివారితో పాటుపడతారని ఆయన పట్టుదల, సామర్థ్యం ఎరిగినవారు ఆశిస్తారు.

**(ఆంధ్ర-వారపత్రిక - 1959)**

సముద్రాల రాఘవాచార్యులు (1902-68) తెలుగు సినిమా రచనకు ఒకవడి ప్రసాదించిన సముద్రాల మాటలూ, పాటలూ ఈనాటికీ ప్రసిద్ధాలే! పౌరాణికచిత్రాలలో నాటకీయత రంగరించడంలో ఈయన ప్రజ్ఞ అనుపమానమైనది. 'భూకైలాస్', 'పాండవవనవాసం', 'నర్తనశాల' ఇలా ఎన్నో ఉదాహరణలు దొరుకుతాయి. 'వినాయకచవితి', 'భక్త రఘునాధ్' 'బభ్రువాహన' సినిమాలకు దర్శకత్వం వహించారు. సుమారు వంద చిత్రాలకు రచన చేసి, వేయికి పైగా పాటలు రాసారు. ఈయన కుమారుడు రామానుజాచార్యులు సినిమారంగంలో ప్రవేశించి సముద్రాల(జూనియర్)గా పేరుబడసారు.



# బహుముఖ ప్రజ్ఞావతి

చలనచిత్ర ధరిత్రి చరిత్ర ముఖపత్రాన్ని గర్వకారణాల తోరణాలతో అలంకరించడానికి అక్షర క్రమాన పేర్లు ఎన్నికచేస్తే 'బి' శీర్షిక క్రింద బహుముఖ ప్రజ్ఞావతి భానుమతి పేరు చేరుతుందని సినీజనులూ, సినీ జనాభిమానులూ కూడా అంగీకరిస్తారు.

నేటి సినీతారకు ముఖ్యమైన అంద చందాలతో పాటు, స్వతంత్రమైన నటనాశిల్పం, నటనలో అనుభవాన్ని ప్రజ్ఞలోకి తర్జుమా చేసుకోగల ప్రజ్ఞ, ఎవరేమన్నా అనుకున్నా, అనకున్నా, తలపెట్టిన ప్రతికొత్తపనీ ఆసాంతం చేసే సాహసం, చేసి ఆ పైన పర్యవసానాలకు తట్టుకోగల బలం ఆమె సొత్తు.

ఆయాసం లేకుండా హాయిగా, పట్టుదారంమీద మంచి ముత్యంలా సాఫీగా, కొండమీద వాగులా చలాకీగా ప్రవహించే మధురగానం ఆమెకు అమూల్యమైన కంఠాభరణం. భానుమతికి - తమిళదేశంలో కూడా ప్రసిద్ధికెక్కిన అగ్రశేణి తెలుగు నటీమణులలో ప్రథమస్థానం ఉంది. అందుకు ఆమె సంగీతం కూడా ఒక కారణం.

కర్ణాటక సంగీతం మీద ఆమెకు గల అభిమానానికి నిదర్శనం - తను తీసే ప్రతి చిత్రంలోనూ విధిగా ఒక త్యాగరాయ కీర్తనగాని, వర్ణంగాని వినిపించడం. భానుమతి నటననూ, గాత్రమాధుర్యాన్నీ కీర్తిస్తూ అనర్గళంగా ఉపన్యసించగల వాటిలో మల్లీశ్వరి, విప్రనారాయణ చిత్రాలు ఎన్నతగ్గవి. ఆమెకు సంగీత రచనలో కూడా అభినివేశం ఉంది. చలనచిత్ర దర్శకత్వానికి సాహసించిన తొలి ఆంధ్ర మహిళ కూడా ఆవిడే. రచయిత్రిగా కూడా భానుమతి ఇటీవల కృషిచేసి, హాస్య రచనలతో అలరించింది. ఆమె కట్టే వాక్యాలు, ఆమెలాగే ధాటీగా, చురుకుగా నడుస్తాయని ఆమెను ఎరిగిన వారంటారు.



**రత్నమాల లో భానుమతి**

ఆత్మవిశ్వాసానికీ అహంకారానికి మధ్య సరిహద్దును జరపడానికి సంకోచించనివారు, ఒక్కొక్కసారి భానుమతి ధైర్యాన్ని ఆత్మవిశ్వాసాన్ని గర్వం అని అహంకారమనీ నిర్వచిస్తారు.

వినమ్రత మంచిదే గాని, అనవసరంగా లేనిపోని వినయం, నమ్రత అభినయించడం తనకు గిట్టదని ఆమె అంటుంది. ఈ వైఖరితోనే, తనకు 'గిట్టని' పరిస్థితులలో ఆమె తెలుగు పరిశ్రమకు అంటకుండా ఎక్కువగా తమిళ చిత్రాలలో నటించడం జరుగుతోందని స్థితిగతుల నెరిగినవారు అంటారు.


నటిగా, గాయనిగా అత్యుత్తమ శిఖరాలధిరోహించిన మల్లీశ్వరిలో రామారావు.

ఒకసారి ఒక ఫిలిం అభిమానుల సంఘంవారు ఆమెను ఉత్తమనటిగా ఎన్నుకుని, ఆమె దగ్గరకు వెళ్ళి ఆ సంగతి చెప్పారు. ఆమె థాంక్యూ అనలేదు. 'వెరీగుడ్ మీకు మంచి టేస్టుంది' అంది.

నిజానికి అంశాల నిజానిజాలూ సాధక బాధకాలూ సినిమా ప్రేక్షకులకూ, సంగీత ప్రియులకూ సంబంధించినవి కావు; అయినా ఏవి ఏమయినా, భానుమతి అతి సమర్థులైన తెలుగు కళాకారులలో అగ్రగణ్య అనీ, ఆమె తెలుగు చిత్రాలలో ఇతోధికంగా కనుపించడం వాంఛనీయమనీ సినీ పరిశ్రమ లోపలా ఇవతలా ఉన్న కళాభిమానులు కాంక్షిస్తున్నారనడం సత్యదూరం కాదు.

**(ఆంధ్ర-వారపత్రిక - 1959)**

బహుముఖప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన భానుమతి రచయిత్రి, గాయని, సంగీత దర్శకురాలు, నటీమణి, దర్శకురాలు, స్టూడియో అధినేత్రి, 1990ల వరకు నటిస్తూనే ఉన్నారు. సినిమాలు నిర్మిస్తూనే ఉన్నారు. ఎన్నో బిరుదుల, పదవులు ఆమెను వరించాయి. 'అత్తగారి కథలు'తో సాహితీ లోకంలో ప్రాచుర్యం పొందారు.

# మధురగాయకుడు సంగీత దర్శకుడు రాజేశ్వరరావు



పువ్వులూ, వెన్నెల, సంగీతం, పొరుగింటివారి పాపాయి, స్నేహం, సంగీతం, కాలేజికి వెళ్తున్న అమ్మాయి, మంచి పుస్తకం, సంగీతం, డబ్బు, ప్రశంసావాక్యం, శ్రీ కృష్ణుడికథలూ, సంగీతం, రాజేశ్వరరావు పాట ఎల్లప్పుడూ, ఎప్పటికప్పుడూ మనసుకు హాయినిచ్చే తీయని వస్తువుల కోవలోవి. వయసుకు, వార్థక్యానికీ లొంగనివి.

నిఘంటువులో 'శ్రావ్యసంగీతం' అనే మాటకి అర్థం రాయటానికి మాటలు వెతికి చేర్చేబదులు రాజేశ్వరరావు అని టూకిగా రాస్తే చాలు అని చాలామంది నమ్మకం.

అల్లవారివీధిలో చివరింటి మేడమీదనో, మైలున్నర దూరానఉన్న బస్సుస్టాండు దగ్గర కాఫీక్లబ్బులోనో రాజేశ్వరరావు రికార్డు పెడుతున్నారుట అని విని, "అంతదూరము పరుగెత్తుకెళ్ళి పాటవిని పొంగిపోతూ పరుగెత్తుకెళ్లి పోయేవాడిని" అని చిన్ననాటి ముచ్చటలు చెప్పేవారిలో ఈనాడు లాయర్లూ, డాక్టర్లూ, యాక్టర్లూ, గాయకులూ, సంగీతకారులూ ఎందరో ఉన్నారు. లలిత సంగీతాభిమానులకు, గాయకులలో రాజేశ్వరరావు దేవతలలో కృష్ణుడి వంటివాడు. భక్తిగౌరవాలేకాక, ప్రేమను సంపాదించుకొన్న కంఠం ఆయనది. మధురస్వరసరోవరంలో రాజహంసలా సొగసుగా ఠీవిగా, పూదోటలో తేటిలా ఊహకి అందనంత వేగంగా విహరిస్తుంది రాజేశ్వరరావు కంఠం.

అన్యులకూ ఆయనకూ గల ఒక ముఖ్య భేదం, రాజేశ్వరరావు సంగీత రచనా ప్రతిభ. ఓహో విభావరి, కలగంటి కలగంటి, కోపమేల రాధా, హాయిగా పాడుదునా,

ఒంటిగా నుయ్యాల లూగితివా, పొదరింటిలోనుండి మొదలైనవి రాజేశ్వరరావు సంగీత రచనా నైపుణికి కూడా ఎప్పుడూ పచ్చని నిదర్శనాలుగా నిలిచే మచ్చుతునకలు. ఈ పాటలలో ఏది అన్నిటికన్న బాగుండేది అని నలుగుర్నీ కనుక్కుంటే, అన్నిటికీ అన్ని ఓట్లూ వచ్చేస్తాయి.

చలనచిత్రాలలో సంగీత దర్శకుడుగా రాజేశ్వరరావు ఏనాడో ఎన్నో కొత్తకొత్త పోకడలుపోయి ఎన్నో మనోహర విన్యాసాలు చేశాడు. అధునాతనం అనబడే నేటి బొంబాయి సినిమా సంగీతంలో ఆర్కెస్ట్రయ్‌జేషన్ శిల్పాన్ని రాజేశ్వరరావు అలనాటి రికార్డులలోనే ప్రయోగించి అద్భుతమైన ఫలితాలు సాధించాడు. ఈ నాటికీ వివిధ వాద్యాలకి స్నేహంకలిపి, అవి ఒకదానినొకటి వెక్కిరించుకోకుండా మేళవించేవారిలో రాజేశ్వరరావుకు విశిష్టస్థానం ఉంది.

ఏ వాద్యానికి, ఏ స్వరానికి ఎక్కడ యతివెయ్యాలో, ఎక్కడ 'ప్రతి' (కౌంటర్) వెయ్యాలో చెప్పగల ఛందస్సు రాజేశ్వరరావు కాంపోజిషన్. పాటకి వాద్యం వాద్యానికి వాద్యం దేనికి ఏది ఎక్కడ పరమైనచో సంధి నిత్యమో, శ్రోతకి సంతోషం తథ్యమో చెప్పగల వ్యాకరణాలు అవి. వాటికి మధురాతి మధురాలైన దృష్టాంతాలు ఆయనా బాలసరస్వతీ జతగాపాడిన పాటలు "... రహిపుట్టజంత్ర గాత్రముల రాల్గరగించు విమల గాంధర్వంబు విద్యమాకు" అని ఘోషిస్తాయి ఆ యుగళ గీతగీతాలు.



అయినప్పటికీ ఈ రోజున చాలామంది (ఆయన అభిమానులుసహా) రాజేశ్వరరావు చేస్తున్న సినిమా పాటలు విని నిరుత్సాహపడుతున్నారు. కొందరు నిస్పృహతో "ఇతను గొప్ప గాయకుడే కాని, గొప్ప మ్యూజిక్ డైరెక్టరు కాడేమో" అనుకునే స్థితికి వస్తున్నారు. 'మల్లీశ్వరి' "మిస్సమ్మ" వంటి చిత్రాలలో సంగీతం గుర్తుకు వచ్చినపుడు మాత్రం నాలిక్కరచుకొని, "రోజుల మహత్యం" అనుకుంటున్నారు. సినిమా పరిశ్రమలో ఉండే సాధక బాధకాలు తెలిసినవారు ఈ మాటతో ఏకీభవిస్తారు. ఈనాడు బాక్సాఫీసు సూత్రాలు అందరు కళాకారులనూ బంధించి వేసినట్లే రాజేశ్వరరావునూ చుట్టుముట్టాయి. ఇతరులనేకులవలెనే, ఆయననూ బొంబాయి హిట్ రికార్డులను "రీ రికార్డు" చేయమని బాక్సాఫీస్ సూత్రధారులు శాసిస్తున్నారు.

అయితే బాధ్యతగల కళాకారుడు గట్టిగా తలచుకుంటే ఈ సినీ భవబంధాలను ఇట్టే తెంచుకు లేచి నిలవగలడు. రాజేశ్వరరావుకు ఆ శక్తి లేదనలేము కాని ఆసక్తి లేదేమోనని పరిశ్రమ నెరిగిన వారంటారు. అతనికి సంగీత ప్రపంచం వేరే ఉంది. అందులో కులాసాగా తిరుగుతాడు.

ఒకసారి టాక్సీమీద ఒక మిత్రుడింటికి వస్తానని, టాక్సీ దొరకక ఆటోరిక్షా ఎక్కి గంటసేపు టాక్సీకోసం తిరిగిన మనిషి రాజేశ్వరరావు. అందుకే, అతన్ని అపురూప సంగీత సమ్మోహనాస్త్రంగా ఎరిగిన బి.ఎన్. రెడ్డి, వాసన్ వంటివారు, లాలించి, బుజ్జగించి మంచిపాటలు చేయించారు. ఈనాటి పరిస్థితులు అలాటివి కావు.

కవులూ గాయకులూ దుస్థితిలో ఉన్నట్లయితే, ఆ దుస్థితి వారున్న సీమను ఏలే రాజుదే తప్పు వారికి అంటదని ఒక మనీషి అన్నాడు...

అంటే అన్నాడుగాని, ఇటు రాజేశ్వరరావూ, అటు ఆయనను బుక్ చేసుకునే దర్శక నిర్మాతలూ కూడా ఈ పరిస్థితులను మార్చడానికి ప్రయత్నిస్తే, తెలుగువారంతా ఆనందంతో ఉప్పొంగిపోతారు.

***(ఆంధ్ర-వారపత్రిక - 1959)***



బాపు, రమణల అభిమాన గాయకుడయిన రాజేశ్వరరావు చివరివరకూ 'ఫార్మ్'లోనే ఉన్నారు. అనేక సినిమాలకు సంగీతాన్ని అందించి రసజ్ఞుల మనసులలో కలకాలం నిలిచిపోయారు. వారి కుమారులు కోటి, వాసూ సినిమా సంగీతదర్శకులయ్యారు.

# సంగీత దర్శకుడు రమేష్ నాయుడు



"మోజుకొద్దీ పాశ్చాత్య సంగీతాన్ని గాని మరే పరాయి సంగీతాన్ని గాని ఎరువు తెచ్చుకుంటే తెచ్చుకోవచ్చు. కాని, "మనది అయిన" మంచి సంగీతం కరువయినదని కారణం చెప్పుకోడానికి ఆస్కారం లేదు. మనకి సజీవమైన జానపద సంగీతం అపారంగా వుంది. ఈ సజీవ స్వరార్ణవాన్ని మనవారు చాలామంది పట్టించుకొనక పోవడం శోచనీయం."

తెలుగు వారికి త్వరలోనే సుపరిచితుడు కాబోతున్న యువ సంగీత దర్శకుడు శ్రీ రమేష్ నాయుడు వెలిబుచ్చిన అభిప్రాయం ఇది. తెలుగునాట కాకపోయినా, మహారాష్ట్ర, గుజరాతీ, కర్ణాటక సీమలలో, ఈ మాటలు అక్షరాలా నిజమని ఋజువుచేశాడు రమేశ్ నాయుడు.

సన్నగా, బక్కపలచగా, చామంచాయతో ఉండే రమేష్, ఎనిమిదేళ్లనాడు (పదహారేళ్ల ఈడు), ఒకరోజున కొండపల్లి ఊరు శివారుకొచ్చి "చలో బొంబాయ్" అనుకున్నాడు. స్వగతంవంటి నినాదానికి గొంతు కలిపి సై అన్న వాళ్లెవరూ అప్పుడు లేరు. గట్టిగా ఒద్దనగల తండ్రి పూల నరసింహారావుగారు, రమేష్ ఆర్నెలల పసివాడుగా ఉన్నవుడే గతించారు. రమేష్ తన 16వ యేట తల్లినిగూడా

అందుకని, చల్లగా ఊరుదాటి వచ్చిన రమేష్ మెల్లిగానే అయినా, ధైర్యంగా "చలో బొంబాయ్" అనుకుని బయల్దేరాడు. కంటకాల బాటన కష్టపడుతూ, ఆటంకాలను ఒంటరిగానే ఎదుర్కొంటూ బొంబాయిలో కాలికి బలపంపట్టుకుని తిరిగిన రమేశ్ రెండేళ్లలోనే స్థిమితపడి, కాలు నిలద్రొక్కుకొన గలిగాడు.

మొదట్లో, అందరికీ జరిగినట్లే, అతనికి గూడా 'నహీ' జవాబే వినబడేది. కొన్ని సందర్భాలలో, "తుం ఆంధ్రావాలా, మదరాస్ చలో" అంటూ సలహాలు మిళాయించిన జవాబులు ఎదురయేవి.

సంగీతం మనకెందుకు, ఇంజనీరువవుదుగాని అంటూ లాలించి, మందలించి, కోప్పడి, శతవిధాల చెప్పిన తల్లిమాటే వినలేకపోయిన రమేష్ ఈ సలహాలు పట్టించుకోలేదు. చేతనైతే నవ్వేవాడు లేకపోతే నవ్వుకునేవాడు. మళ్ళా ఇంకో చోటుకూ మరో ప్రయత్నానికీ.

"అసలు చిన్నపుడు కొండపల్లిలో, బడి ఎగేసి అస్తమానం సంగీతంకోసం పరుగులెత్తేవాణ్ని. మా అమ్మగారు కొట్టేవారు. అంతలో హార్మనీ నేర్చుకున్నాను. ఆ పెట్టెముట్టుకుంటే వేళ్లు విరగ్గొడతా అనేవారు మా అమ్మగారు. అని కొట్టేవారు కూడా. ఐనా నాకు సంగీతం నేర్చుకోవాలన్న ఆశ, పట్టుదల తగ్గేవికావు. ఒకసారి ఇంట్లో చెప్పకుండా పూనా పారిపోయాను. నాకోసం వెతికించారు. కొన్నాళ్లకు నేనే తిరిగి వెళ్లాను. మా అమ్మగారు అస్వస్థతతో తీసుకుంటున్నారు. కొద్దిమాసాల తరువాత ఆమె గతించారు. అక్కడితో నన్ను కోప్పడేవాళ్ళు నాకోసం బెంగపెట్టుకునేవాళ్లూ ఎవరూ లేకపోయారు. నాకు అన్నతమ్ముళ్లూ అక్కచెల్లెళ్లు ఎవరూ లేరు." అంటారు రమేష్.

ఒక్కడే కాబట్టి ఈసారి మరింత పట్టుదలతో తెగింపుతో బొంబాయి ప్రయాణమై వెళ్లాడు.



గాయకుడు తలత్ మహమ్మద్‌తో

ఎక్కడికి వెళ్లినా లాకేత్వం ఎదురవుతున్న ఆ రోజుల్లో బొంబాయి ఆలిండియా రేడియోలో మరాఠీ సంగీతశాఖ అధిపతిగా ఉన్న శ్రీబాలకుర్తడ్‌కర్, సన్నటి మెత్తటి కంఠంతో శ్రావ్యంగా పాడుతున్న ఈ తెలుగు యువకుణ్ణి ఆదరించి, రేడియోలో పాడే అవకాశం ఇప్పించారు. పాటలు బాగున్నాయని పదిమందీ మెచ్చుకున్నారు.

హెచ్.ఎం.వి. కంపెనీకి ఒకసారి వెళ్లవోయ్ అని సలహా ఇచ్చారు రమేష్ శ్రేయోభిలాషి.

"దానికి వరసా పాటా కూడా మీరే రాసుకు తెచ్చుకోవాలి" అన్నారు హెచ్.ఎం.వి. వారు.

రెండు రోజులు తరువాత రమేష్ స్వయంగా రెండు హిందీపాటలకు వరసలు కూర్చుకుని వెళ్ళి వినిపించాడు.

అక్కడ రికార్డింగ్ వ్యవహారాలు చూస్తున్న శ్రీ జి.ఎన్. జోషి ఆరోజున ఒక సలహా ఇచ్చారు.

"ఆయన అలా చెప్పి ఉండకపోతే, నేను ప్లేబాక్ గాయకుడుగానే కృషిచేసి ఉందును" అంటాడు రమేష్.

ఉచ్చారణ ఓ మోస్తరుగా ఉందికాని, రమేష్ ఆ పాటలకు పెట్టిన సంగీతం చాలా బాగుందని శ్రీ జోషి అభిప్రాయపడ్డారు. "అందుకని సంగీత దర్శకుడుగా పైకి రావడానికి ఇప్పటినుండీ కృషి చెయ్యి" అని ఆయన హితవు చెప్పారు.

ఆ తరువాత రమేష్ రోజూ అక్కడ నౌషాద్ ప్రభృతి సంగీతదర్శకులు, ఆర్కెస్ట్రా నిర్వహించే పద్ధతులూ తీరుతెన్నులూ శ్రద్ధగా పరిశీలిస్తూ వచ్చాడు.

రమేష్ సంగీతం కూర్చిన రెండు పాటలను షంషాద్ బేగంకు చూపించారు. చాలా బాగున్నాయనీ, వాటికి రికార్డు ఇవ్వడం తనకు ఇష్టమేననీ షంషాద్ అంది. కాని అంతలోనే కథ తారుమారైంది. హిందీ ట్యూన్‌లు అక్కర్లేదనీ, కావలిస్తే మరాఠీ పాటలకు సంగీతం ఇవ్వవచ్చుననీ రమేష్‌కు కబురందింది. అదే చేశాడు రమేష్. అతడు సంగీతం కూర్చిన ఆరు మరాఠీ గీతాలు "హిట్స్" అయ్యాయి.

కొద్ది రోజుల్లోనే "ఛందవల్ పాహీజ్" అనే మహారాష్ట్ర చిత్రానికి సంగీత దర్శకుడుగా పనిచేసే అవకాశం లభించింది. అందులో పాటలన్నీ బహుళ జనాదరణ పొందాయి.

దరిమిలా రమేష్ ఐదు మరాఠీ చిత్రాలకు సంగీత దర్శకత్వం నిర్వహించాడు.

రమేష్‌గుప్త దర్శకత్వాన తయారైన "చేతన్" అనే హిందీ చిత్రానికి కూడా రమేష్ సంగీతం సమకూర్చాడు.

మరొకవంక ఇతరప్రాంతాల సంగీతంలో కృషి చేశారు. కన్నడ, గుజరాతీ, హిందీ భాషలలో పాటలకు సంగీతం పెట్టాడు. ఆ రికార్డులు బహుళ జనాదరణకు పాత్రమయ్యాయి.

కొంతకాలంపాటు రమేష్, 'రేడియో సిలోన్'లో కొన్ని సంగీత కార్యక్రమాలు నిర్వహించాడు.



రమేష్‌నాయుడు సంగీతం సమకూర్చిన మనోరమలో కృష్ణకుమారి, బాలయ్య

సునీల్‌దత్ (బల్‌రాజ్)తో అప్పట్లోనే పరిచయం కలిగింది. ఈనాడు వారిద్దరూ ఆప్తమిత్రులు.

1950లో కిశోర్‌సాహు "హామ్లెట్" చిత్రానికి సంగీత దర్శకత్వంకోసం పోటీ జరిగింది. అందులో తనతో పోటీ చేసిన ఐదుగురికన్న మిన్న అనిపించుకొని, రమేష్ ఆ పదవి సాధించాడు.

"హామ్లెట్"తో రమేష్‌కు సర్వత్రా మంచి పేరు వచ్చింది. హిందుస్తాన్ చిత్రపర్‌వారు నిర్మించే నాలుగు చిత్రాలకు రమేష్‌కు కాంట్రాక్టు ఇచ్చారు. బి.ఆర్. (ఏక్ హీ రాస్తా) చోప్రా మూడవ చిత్రానికి, దర్శక నిర్మాత నక్షబ్ కొత్త చిత్రానికి, మినర్వామూవిటోన్‌వారు నిర్మించనున్న మరో చిత్రానికీ కూడా రమేష్ సంగీత దర్శకుడు.

మదరాసులో భాస్కర ప్రొడక్షన్స్‌వారి నాలుగవ చిత్రానికీ, సెల్వకోటీ పిక్చర్స్‌వారి "స్వయంప్రభ"కూ రమేష్ సంగీతం కూర్చారు.

"నాకు స్వతహా కర్ణాటక శాస్త్రీయ సంగీతం అంటే అభిమానం; మన జానపద సంగీతం అంటే చాలా ఇష్టం" అంటారు రమేష్‌నాయుడు.

"ఏ పద్ధతిలో అయితే నేం, సినిమాలకి సంబంధించినంత వరకూ, సంగీతం అనేది, ఆబాలగోపాలం ఆపాత మధురంగా, మనసులో పదిసార్లు మెదలేదిగా ఉండడం అవసరం." అంటారాయన. మోజుకొద్దీ చేస్తే చెయ్యాలితప్ప, మనకున్న సంగీతాన్ని కాదని, మరో దేశం నుండి మట్లు దిగుమతి చేసుకోవలసిన అవసరం ఏమీలేదని ఆయన అభిప్రాయం. అసలు మనదేశంలో ఏ ప్రాంతపు జానపద సంగీతమైనా చైతన్యవంతంగా హాయిగా, ఉత్తేజకరంగా ఉంటుందంటారు.

"ఉన్న వాటన్నిటిలోకీ మన తెలుగు జానపద సంగీతం అంటే, నాకు చాలా ఇష్టం. నాకు ఆరు ప్రాంతాల జానపదగీతాలు వచ్చును" అన్నాడు రమేష్ సగర్వంగా.

ఇక్కడ తెలుగు చిత్రాలకు కూర్చిన పాటలు జానపద గేయచ్ఛాయలలో కొత్త బాణీలలో శ్రుతిపేయంగా ఉన్నాయి.

"తెలుగుదేశంవచ్చి, తెలుగు చిత్రాలకు సంగీత దర్శకుడుగా పనిచేయాలని నా చిరవాంఛితం. దర్శకుడు శ్రీ యోగానంద్, కెమెరామన్ శ్రీ ఎం.ఎ. రహమాన్‌లు ఈ విషయంలో నన్ను ప్రోత్సహించి ఇది సిద్ధించడానికి దోహదం చేశారు" అన్నారు రమేష్‌నాయుడు కృతజ్ఞతా పూర్వకంగా.

**(ఆంధ్ర-వారపత్రిక - 1959)**

హిందీరంగాన్నుండి వెనుకకు వచ్చేశాక రమేష్ నాయుడు తెలుగురంగంలో బాగా పుంజుకున్నారు. 'చిల్లరకొట్టు చిట్టెమ్మ', 'శివరంజని', 'మేఘసందేశం' వంటి పలు దాసరి నారాయణరావు సినిమాలకు, ఇంకా ఎన్నో సినిమాలకు సంగీతం అందించి అగ్రశ్రేణి క్లాస్ మ్యూజిక్ డైరక్టరుగా పేరు తెచ్చుకుని డిమాండ్‌లో ఉండగానే మరణించారు.

# నౌషాద్



ఆధునిక భారతీయ చలనచిత్ర సంగీత చరిత్రలో దాదాపు ప్రతి అధ్యాయానికీ మొదటి వాక్యంలో ఉండదగ్గ పేరు నౌషాద్ అనడం అతిశయోక్తి కాదు.

నౌషాద్ చేసిన పాట, అచ్చు నౌషద్ చేసిన పాటలాగే నిండుగా, రీవిగా, లోతుగా ఉంటుంది. అందులో మధుర శిల్పాల నైపుణ్యం, నైగనిగ్యం ఉంటాయి. మహాకవి వాక్యంలా అర్థపుష్టి ఉంటుంది. ప్రబంధనాయిక అంగసౌష్టవం ఉంటుంది. త్రికాలాలలో త్రిలోకాలలో విహరించివచ్చే ఖాన్‌సాహెబ్ కంఠస్వరవిన్యాసాల రీవి, సొగసు, లతా స్పృశించగల స్వరదిగంతాల దూరం, సైగల్ పాట మార్దవం నౌషద్ సంగీత రచనాశిల్పంలో స్ఫురిస్తాయి.

గాయకుల పరిభాష ప్రకారం ప్లానింగ్ కమీషన్ వారికి పదింతలైనా "ప్లానింగ్" ఉంటుంది.

ఈనాటి సంగీత రచనా రీతులలో, స్వరకల్పనాశిల్పంలో వాద్య సమ్మేళనంలో, ప్రయోగంలో నౌషాద్ చేసిన వాటిలో ఏదో ఒకటి ఎక్కడో అక్కడ కనబడితే కనబడవచ్చుగాని, ఆయన చేయనిది కనబడదు. ఒక చిత్రంలో అన్ని పాటలూ జనరంజకాలు కావటం ఆయనతోనే ఆరంభమైంది. ఫ్లూటూ క్లారినెట్ కలిపీ, సితార్ మాండలిన్‌లు కలిపీ అందమైన బహువ్రీహి సమాసాలు సృష్టించినది ఆయనే. ఆకార్డియన్, వైబ్రాఫోన్ మొదలైన పాశ్చాత్య వాద్యాలను సినిమాలో ప్రవేశపెట్టినవాడాయనే. సింఫనీ సంగీతాన్ని భారతీయ సంగీత భాషలోకి గొప్పగా, అందరికీ హాయి



దీదార్‌లో నర్గీస్, దిలీప్‌కుమార్

గొలిపేటంత నిండుగా అనువదించినవాడు ఆయనే. ఎప్పుడూ మార్పులుచేసేవాడు ఆయనే. శాస్త్రీయ రాగాలను కల్తీ లేకుండా శుద్ధ స్వరాలలోనే సులభశైలిలో వరసలు కట్టి మధుర స్వరసరోవరం నిర్మించినవాడు ఆయనే. అందులో ఇంగ్లీషు కెరటాలు లేపినవాడూ ఆయనే. ఇన్ని పనులు చేసిన నౌషాద్ సీమ బాణీలను అనుసరించడంలో కూడా వెనకబడలేదు. అయితే ఈ విద్యలో రామచంద్రాలు, నయ్యర్‌లు మొదలైన వారితో పోటీచేసి ప్రథమ బహుమతి అందుకోలేదు.


గులాం హైదర్ చేసిన పాటలతో ప్రజల మనసులు, జేబులు దోచిన ఖజాంచీ

కాని సినిమా సంగీతానికి ఒక స్థాయిని గౌరవస్థానాన్ని కల్పించడానికి కృషి చేసిన పెద్దలలో నౌషాద్‌కు సర్వదా గౌరవనీయమయిన ప్రముఖ స్థానం ఉండి తీరుతుంది.

నౌషాద్ శకానికి పూర్వం ఉజ్జ్వలంగా వెలిగి నేటికీ పూజనీయమయిన స్థానంలో నిలిచినవారిలో ఘులాం హైదర్, ఖేమ్‌చంద్ ప్రకాష్, శ్యామ్‌సుందర్‌లను చెప్పుకోవాలి. ఖజాంచీ, హుమాయూన్ వంటి చిత్రాలలో ఘులాం హైదర్ చేసిన పాటలు ఇప్పుడూ ఎప్పుడూ కూడా బాగుంటూనే ఉంటాయి. సినిమా సంగీతంలో, (ఇటీవల బాగా ప్రచారంలోకి వచ్చిన) పంజాబీ జానపదగీత రీతులను ప్రవేశపెట్టినవాడు ఈయనే. డోలక్ ఈయన కానుకే.

నౌషాద్ ఈయనంతటివాడై సినిమా సంగీతాన్ని నవరాగ తాళాలతో అలంకరించాడు.

బేరీజులు వేస్తే, నిజానికి, నౌషాద్ పనిచేసిన చిత్రాలు మిగతావారి కన్న తక్కువ ఉంటాయి. ఘులాం హైదర్, ఖేమ్‌చంద్‌జీ, రామచంద్రలు పదినిముషాలలో ఒక పాటకి వరస కడితే, పాటకు నౌషాద్ పదిహేనురోజులు తీసుకుంటాడు. అందుకే అందరూ సాలుకు పది చిత్రాలకు పనిచేస్తే నౌషాద్ ఒకటి రెండింటికి మాత్రం చేస్తాడు. అలా చప్పున పని చెయ్యడం చాలా తప్పు అనటం లేదు కాని, ఇలా స్థిమితంగా, ప్రతి స్వరాన్నీ ప్రతి స్వరం ముందూ వెనకా ఉంచి పరీక్షించి నిగ్గు తేల్చి, జాగ్రత్తగా కాశ్మీరీశిల్పిలా నగిషీలు చెక్కడం ఒక ప్రత్యేకత. అందుకే ఉపమానాలు వెతికితేవడం కష్టమైన వాటిలో నౌషాద్ పాట చేరుతుందనిపించుకుంది.

"నౌషాద్ శిల్పం, ఆయన పాటల స్నిగ్ధత్వం నిరుపమానమైనవి" అని ఒక సందర్భంలో లతామంగేష్కర్ జోహార్లు అర్పించింది.

సత్యాన్వేషికి సమాధానం ఏమిటని గణితశాస్త్రజ్ఞుడిని అడిగితే "స్క్వేర్ రూట్ ఆఫ్ మైనస్ వన్" అంటాడు. నౌషాద్‌ను అడిగితే సప్తస్వరాలను అడగమంటాడు. అది ఆయన తపస్సు.

కష్టపడి చిత్తశుద్ధితో చేసిన పని నిష్ఫలం కాదన్న నినాదానికి బలం చేకూర్చింది నౌషాద్ కథ. అంతవరకూ సినిమాలలో ఒకటి అరాపాటలు జనంనోట వినబడేవి. నౌషాద్, 'రతన్' చిత్రంతో భారతీయ ప్రేక్షకుల శ్రోతల హృదయాలను సంగీతంతో నింపి వేశాడు. నాటి నుండి ఒక చిత్రంలోని పాటలన్నీ ప్రజాదరణ పొంది చిత్రవిజయానికి కూడా దోహదం చేయడం ఆరంభమయింది. అదే, చిత్రాలలో సంగీతం ప్రాముఖ్యాన్ని పెంచింది. 'రతన్'లో పాటలు, పాట రానివాళ్ళకి కూడా పాడాలనిపించేటంత సులభంగానూ సుఖంగానూ, పాట వచ్చినవాళ్ళు మెచ్చుకునేటంత అందంగానూ కూడా వుంటాయి. ఆ పద్ధతిలో కొంతకాలం పాటలు చేశాక నౌషాద్ మళ్ళీ కొత్త పద్ధతి, కొత్త వరవడి దిద్దుకున్నాడు. పద్ధతి మార్చడం నౌషాద్ పద్ధతులలో ముఖ్యమైనదని ఆయనను ఎరిగినవారంతా కూడా అంటారు. అయినా సంగీతాన్నిబట్టే ఆయనను అర్థం చేసుకునేవారికి కాలాన్ని శ్రోతల అభిరుచినిబట్టి నౌషాద్ కొత్త పద్ధతులు ఆరంభిస్తాడా, ఆయన కొత్తపద్ధతి ఆరంభించడంతో కొత్తకాలం, కొత్త అభిరుచి ఆరంభమవుతాయా అన్నది సమస్య.



అన్‌మోల్ ఘడీలో సురేంద్ర, నూర్జహాన్

ఈ మార్పులు క్రమంగా సినిమాలో ఫేడింగ్ షాట్‌లలా, ఒకదానిలో ఒకటి కరిగిపోతాయి. వీణమీద స్వరాలలా పాతపద్ధతి కొత్తదానిమీదకి సాగిపోతుంది. 'శారద' 'స్టేషన్ మాస్టర్' చిత్రాల నుండి 'రతన్' వరకూ స్థూలంగా ఒక ఘట్టం. ఆ తర్వాత కొద్దిగా మార్పులు వచ్చాయి. ఆనోఖీ అదా తరవాత పద్ధతి పూర్తిగా మారిపోయింది.

రతన్‌లో పాటలరూపం అప్పటికి చాలా కొత్తది. పల్లవి, దానికి సరిపడే బరువుతో ఆర్కెస్ట్రా, ఆ తరువాత చరణం, మళ్ళీ అంత పొడుగునా ఆర్కెస్ట్రా, తిరిగి మాట వరసమారి (పాటవరస అంతే,) చరణం ఇలా వచ్చేవి. ఈ పాటలు సంచలనం కలిగించాయి. మిగతావాళ్ళు చాలామంది నౌషాద్ పద్ధతిని హత మార్చేశారు. పల్లవి నౌషాద్ పెట్టినంత పొడుగుగా పెట్టేవాళ్ళు అరుదు. అన్మోల్‌ఘడీలో సురయా పాడిన 'సోచాథా క్యా' దిల్లగీలో శ్యామ్, సురయాలు కలసి పాడిన 'తూ మేరాచాంద్, మై తేరీ చాందినీ', షాజహాన్‌లో సైగల్ మధురస్వరం వినిపించిన 'గమ్‌దియే ముస్తకిల్...' నజీం అక్తర్ పాడిన 'ఆగ్ లగీ' ఈ కోవకి

చెందినవి. ఈ పాటలు వింటున్నపుడు ఉవ్వెత్తున లేచిన కెరటంమీద కూర్చొని అది ఎక్కడ ఆగుతుందో కూడా తెలియకుండా వెళ్ళిపోతున్నట్టనిపిస్తుంది. 'గమ్‌దియే'లో కొద్దిపాటి మంద్రస్వరాలతో వరసను కట్టి వరించాడు నౌషద్. 'ఆన్'లో పాటల రచనాశిల్పం ప్రత్యేకించి చెప్పుకోవలసినది. రెండుమూడు స్వరాలనే కలియబోసి విసుగెత్తకుండా వరసలు కట్టి దాదాపు సూటిబాట మీద - పొడుగుపాటి పల్లవులు కట్టాడాయన.

స్వరవిన్యాసానికి చెప్పుకోవలసినది అందాజ్ చిత్రంలో లత పాడిన 'తోడ్‌దియా దిల్ మెరా...' ఇందులో స్వరాలూ అనుస్వరాలూ మొత్తం పదహారింటినీ రచయిత స్పృశించాడు. కేవలం ముట్టుకుని చక్కారావడమేకాక, వాటిలో ప్రతి స్వరాన్నీ సార్థకంగా ప్రయోగించాడు. అన్ని విధాలా ఉత్తమం అనదగ్గ పాట ఇది (ఆల్ రౌండ్ మాస్టర్ పీస్) అని లతా దీనిని అభివర్ణించి మెచ్చుకుంది. ఇదీ ఇలాటివీ వింటూన్న కొద్దీ కొత్త అందాలు స్ఫురిస్తాయి. కొత్తరంగులు కనిపిస్తాయి.


అందాజ్‌లో రాజ్‌కపూర్, నర్గీస్

అనోఖి ఆదావరకూ - నాటక్, దిల్లగీ, దాస్తాన్, అందాజ్, దర్ద్ వంటి చిత్రాలలో అనేకరకాల ప్రయోగాలు చేస్తూ త్రిస్థాయిలా షెంషాద్, ముఖేష్, రఫీ, లతాల కంఠాలతో విహరిస్తూ సినిమా సంగీతానికి అపూర్వమైన ప్రజాదరణను సంపాదించి పెట్టాడు.

దీదార్‌లో రఫీపాట 'మేరీకహానీ', దులారీలో రఫీ పాడిన 'సుహానీరాత్', జాదూలోని 'ప్యార్ కె సాగర్ సే' (రఫీ), బైజూబావ్‌రా 'భూల్‌గయా సావరియా' (లతా) ఎవరూ మరచిపోలేరు. సంగీతప్రియులకు ఈ పాటలలో వాద్యాల ఉపశ్రుతులు కూడా కంఠతా వచ్చు. అసలు ఏ సంగీత దర్శకుడికైనా, ఆర్కెస్ట్రాలో అపారమైన ప్రతిభచూపే అవకాశం ఉంటుంది. పాటకి యతులు, ప్రతులు,

ఉపశ్రుతులు, 'సమానాంతరాలంకారాలు', రూపకాలు, విశేషణాలు, అర్థవివరణలూ, కారికలూ అన్నీ ఈ వాద్యాలలో పొందుపరచవచ్చు. పాటలో సాహిత్యాన్ని, అందులోని భావాన్ని రాగరేఖలలో చిత్రించవచ్చు. వర్ణచిత్రాలు స్ఫురింపచేయవచ్చు. ఇవి, ఇంకా మరెన్నో ఇలా చేయవచ్చునని నౌషాద్ కాంపోజిషన్‌లు విన్న మీదటనే బాగా తెలియవచ్చింది.

ఆయన ఆర్కెస్ట్రాలో 60 వాద్యాలనుంచి (కొత్త చిత్రం 'మొగలే ఆజమ్' కోసం) 200 వాద్యాల వరకూ ఉంటూ ఉంటాయి. ఇరవై వయొలిన్‌లు చెప్పగల సంగతిని ఆరు వయొలిన్లతో చెప్పించడం ఆయనకు గిట్టదు. 19తో సరిపెట్ట వచ్చునేమో అని అనుమానించేందుకు


అమర్ లో దిలీప్‌కుమార్, మధుబాల

కూడా వీలులేనంతగా ఆయన వాటిని ప్రయో గిస్తాడు. పాశ్చాత్య వాద్యాలన్నిటి గురించి నౌషాద్ తెలుసు కున్నాడు.

సింఫనీని చాలా సమర్ధంగా కల్పించినడవడం అభ్యసించాడు. 'నాటక్' చిత్రంలో ఉమాదేవి (ఇప్పటి హాస్యనటి తున్‌తున్) పాడిన 'దిల్ వాలే' ఆంగ్లేయ విధానంలో చేసిన పాటల్లో చాలా మంచిది.

కేవలం వాద్యసంగీతం (పాటలేకాకుండా) కూడా నౌషాద్ మాజిక్ వాండ్‌లోంచి వస్తే శ్రోతలను మంత్రముగ్ధుల్ని చేయగలదు. దాస్తాన్, వాద్య సంగీతం రికార్డులు విశేష ప్రజాదరణ పొందాయి. మేలాలో 'ధర్తికో ఆకాష్ పుకారే' అన్న వాక్యాన్ని ఆయన వాద్యసంగీతంలోకి అనువదించినపుడు అంత పనీ జరుగుతుందనిపించి గుండె ఝల్లుమంటుంది. ఏ పాటచేసినా ముందర అదంతా విని అందులోని ఈ పాటవచ్చే సన్నివేశం అక్కడి పాత్రల స్థితిగతులూ క్షుణ్ణంగా తెలుసుకుని, ఆ పైననే ఆయన రచనకి ఉపక్రమిస్తారు. అందువల్లనే ఆలస్యం, అద్భుతమైన సంగీతం సంభవిస్తాయి. అందువల్లనే ఆయన పాటలు కొన్ని ఆపాతమధురాలు కాకపోయినా, అన్నీ విధిగా 'ఆలోచనామృతం' అనిపిస్తాయి. అయితే ఇంత ఆలోచించి పనిచేసి, ఆ సందర్భం పాటకు యోగ్యమని తనకు అనిపిస్తేనే పాటనుకూర్చే స్వాతంత్ర్యం సంపాదించి, ఇంత ఆలోచించి పనిచేసే నౌషాద్, 'మదరిండియా' చిత్రంలో "నగరీ నగరీ ద్వారే ద్వారే" అనే పాటను సందర్భశుద్ధిని వెయ్యికళ్లతో పరిశీలించి మరీ పెట్టారని అనుకోము. ఇది చిన్న అపశ్రుతి. మదరిండియాలో పాటలన్నీ నిండుగా, అర్థంచేసుకున్న కొద్దీ చవులూరేవిగా ఉన్నాయి. ఆర్కెస్ట్రా పేరు చెప్పి, చెప్పుకోవలసిన చిత్రం, మరొకటి ఉంది. ఉరన్ కతోలా. 'నదియా ధీరే బహో' అనే పాటలో స్వరకల్పన, నది ఎంత

మెల్లిగా నిండుగా ప్రవహిస్తోందో వర్ణించింది. దానికి నేపథ్యంలో వాద్యాలుగా మానవ కంఠస్వరాలనే ఉపయోగించి ఒక మంచి ప్రయోగం చేశారు. ఈ చిత్రంలోనే, టైటిల్ మ్యూజిక్‌కు ఆయన చేసిన ఆర్కెస్ట్రేషన్ (ఇది నౌషాద్ స్వంతంగా నిర్మించిన చిత్రం) ఆయన అభిమానులకు కూడా బాధ కలిగించింది.


బైజు బావరా

ఇది సన్మాన పత్రాలలో పేర్కొనవలసిన అంశం ఎంత మాత్రం కాదు.

ఈ ఉరన్ కరోలా చిత్రంలోనే శాస్త్రీయమైన సంగీతం కూడా వినిపించారు. మొహబత్ కీ రాహోమే (రఫీ) అనే ఆ పాట నౌషాద్ రచనలలో చాలా గొప్పది. సినిమా సంగీత రచయితలు సాధారణంగా రెండేసి మూడేసి రాగాలను కలిపి పాటలు చేస్తారు. కొందరు ప్రజ్ఞానిధులు ఒక రాగం అనుకుని చేస్తూ ఉంటే, వాళ్ళకి తెలీకుండానే అది ఇంకోదాంట్లోకి జారిపోవడం వేరే సంగతి. రాగాలను మేళవించి ఎన్నో పాటలు చేసిన నౌషాద్, కొన్ని చిత్రాలలో శుద్ధమైన రాగాలను యథాతథంగానే వాడి, ప్రయోగం తెలిస్తే దేనినైనా ప్రజలాదరిస్తారన్న మాటను ఋజువు చేశారు. బైజుబావ్రాలో పాటలన్నీ అలాటివే. (అందులో 'హరిఓం' ను మొదట అమీర్‌ఖాన్ సాహెబ్ చేత పాడించాలనుకున్నారు.) లతా, రఫీ పాడిన 'ఝూలేమే పవన్‌కీ ఆయా బహార్' మరొకటి. ఇది పీలూ రాగంలో చేసినది. సాధారణంగా ఈ రాగాన్ని బాధ పలకడానికి ఉపయోగిస్తారు. నౌషాద్ దీనిని ప్రేమగీతానికి మనోహరంగా తొడిగాడు. షబాబ్‌లో రఫీ 'అయేన బాలమ్' జయజయవంతి రాగానికి లలితానువాదం. షబాబ్‌లో పాటలన్నీ ఈ శ్రేణిలోనివే. లతా పాడిన 'మర్ నా తెరీ గలీమే' మరపురాని పాట. ఇటీవలి 'సోనీ మహివాల్' చిత్రంలో కూడా అన్నీ శాస్త్రీయమైన వరసలే చేశారు. ఇందులో మహేంద్రకపూర్ అనే కొత్త గాయకుడిని నౌషాద్ పరిచయం చేశారు.


యువకుడు నౌషాద్

నౌషాద్ సృజనాత్మక ప్రతిభగల విద్వాంసుడు. కళ పరిణామశీలమైనదని గుర్తించి, వ్యాపారపు వత్తిడినిబట్టి వ్యవహరించకుండా ఉండగల వివేకి. సంగీతం ఆయనకి సర్వమూ అని నమ్మి అందులోంచి తీసి ఇవ్వదగ్గ సర్వస్వాన్నీ

తీసుకోడానికి నిరంతరం కృషిచేసే కళారాధకుడు. ఈ ప్రయత్నంలో ఆయన భారతీయ చలనచిత్ర సంగీతాన్ని ఎన్నో కొత్త మార్గాలలో నడిపారు. ఎన్నో పరవడులు పెట్టారు. అందుచేతనే ఆధునిక చలనచిత్ర సంగీత చరిత్రలో ప్రతి అధ్యాయానికి మొదటి వాక్యంలో నౌషాద్ పేరు కనబడుతుంది.

(ఆంధ్ర-వారపత్రిక - 1959)

నౌషాద్ ప్రభ, ప్రతిభ ఇప్పటికీ తగ్గలేదు. 'గంగా జమునా', 'మేరే మెహబూబ్', 'లీడర్' 'పాల్కీ' 'రామ్‌ఔర్ శ్యామ్' 'ఆద్మీ' ఇలా ఎన్నో హిట్స్ ఇస్తూ పోయి తన స్థానాన్ని పదిలంగా ఉంచుకున్నారు. 1960 నాటి 'మొగలే ఆజమ్' ను రంగులద్ది 2004లో విడుదల చేస్తున్నప్పుడు ఆధునిక పద్ధతుల్లో రీరికార్డింగ్‌ని అప్‌టుడేట్ చేసిన దిట్ట ఆయన. 'పాకీజా' (1971) నిర్మాణంలో ఉండగా సంగీతదర్శకుడు గులాం మొహమ్మద్ మరణించినపుడు గురుభావంతో తక్కిన పని నౌషాద్ పూర్తి చేశారు.

# సినీవస్తు రమణీయం

## కథావస్తువు

సౌలుకు కొన్ని వేలు తీసుకుని సినిమాకి పనికొచ్చే ఒక్క చిన్న ఊహ చెప్పిపోయే ఆసామి గురించి గతంలో ప్రస్తావించడం జరిగింది. ఇలా నికరంగా ఒక, 'మాట' అనుకున్న మీదట, స్టూడియో రచయితలలో ఒకరో యిద్దరో ఆ ఊహ చుట్టూరా అందమైన కథ అల్లుతారు. ఒకటో రెండో (మాత్రమే) చక్కని పాత్రలను సృజిస్తారు. ఒక్కొక్కసారి, కథావస్తువు సూచించిన వ్యక్తే ముఖ్యపాత్రల రూపురేఖలను కూడా చూచాయగా సూచించడం కద్దు. అతనికి కథలు రాయడం ఉద్యోగం కాదు. వేరేపని చూసుకుంటూ, దేశంలో అక్కడికీ ఇక్కడికీ తిరుగుతూ ఉంటాడు. అలా తిరగడంలో అతనికి ఏ 'సత్రం'లోనో 'మఠం'లోనో రైలులోనో విమానంలోనో విచిత్రమైన వ్యక్తి ఎవడో తటస్థపడచ్చు. లేదా తమాషా దెబ్బలాట లేదా ఒక గమ్మత్తు అయిన టోకరా లేదా గుండె నీరయిపోయే సంఘటన అతనికి కనబడవచ్చు. వినబడవచ్చు.

అవి అతనికి ఆశ్చర్యమో, ఏడుపో, నవ్వో కలిగించగలిగితే, మరి పదిమందికీ అలాగే కలిగించగలదు. అతనికి అలా తోస్తే, ఆ కథని, ఆ విశేషాన్ని స్టూడియోకి చెబుతాడు - తన భాషలో, ఇలా కన్నవీ విన్నవీ, ఒక్కోసారి వార్తాపత్రికలో కనబడే నీలివార్తలూ, అఘాయిత్యాలు, అసందర్భాలూ కూడా కథలకు ముడిసరకులు అవుతాయి.

కెనడాలో సుమారు పదిసెంట్ల భూమిని హాలెండ్ (నెదర్లాండ్స్)కు దత్తం చేయడానికి రెండో ప్రపంచయుద్ధ కాలంలో ఆ దేశ ప్రభుత్వం పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టింది. అందులో మడత పేచీ ఇది: డచ్‌రాణి జూలియానా (అప్పుడు యువరాణి) ఆ సమయానికి కెనడాలో నివసిస్తోంది. అప్పుడామె నిండు చూలాలు. అమె కనక కొడుకునుకంటే, రాచరికానికి ఉపద్రవంలాటిది వచ్చిపడే పరిస్థితి ఏర్పడింది. డచ్ రాజ్యాంగం ప్రకారం, హాలెండ్‌కు రాజు కావలసినవాడు నెదర్లాండ్స్ గడ్డమీదనే (ఒకే శాల్తీకి ఇన్నేసి పేర్లుండి కంగారు పెట్టడం పాశ్చాత్య ప్రపంచంలో కూడా ఉంది!) పుట్టి తీరాలి! రాణిగారేమో కెనడాలో ఉంది. నెలలు నిండాయి. గత్యంతరం కనబడక, ఆవిడ నివసిస్తున్న ఇల్లు ఉన్నంత మేరా నెదర్లాండ్స్ దేశానికి తాత్కాలికంగా దత్తం చేయడానికి ప్రభుత్వం పార్లమెంటులో బిల్లు పెట్టవలసి వచ్చింది. ఈ వార్తను ఒక సినీరచయిత చదివాడు. ఏనాడో గతించిన ప్రభుత్వాలు

చేసిన పాత ఘట్టాలలో, రద్దు కాకుండా అవి ఉన్నాయని కూడా చాలామందికి తెలియకుండా మూలపడ్డ విచిత్రమైన ఇలాంటి చట్టంతో, సమకాలిక సమాజంలో ఒక పెద్ద సైజు అసందర్భం, ఉపద్రవం లేవదీస్తే ఏమవుతుందీ అని అతనికి ఊహపోయింది.

ఇలాటి పాతచట్టం ఫలితంగా తెలుగు దేశంలోని చిలకలపూడి లేక కొటికిలపాడు గ్రామం ఒక్కటీ ఒక రోజు పొద్దుట నుండి హఠాత్తుగా హిమాచలప్రదేశ్ ప్రభుత్వం హయాంలోకి వెళ్లిపోతే (అమంగళము అప్రతిహత మగుగాక), లేదా మద్రాసు జార్జిటౌన్‌లో ఒకటిన్నర వీధి ఆంధ్ర ప్రభుత్వానికి వచ్చేస్తే- అంతకన్నా (పైన చెప్పినవి బాగులేవూ) బొంబాయి పట్నంలో ఒక పేట ఢిల్లీ హయాంలోకి వెళ్తే తమాషాగా ఉంటుంది. కొన్ని కొన్ని సందర్భాలలో, ముఖ్యంగా మద్యనిషేధం చట్టం అమలు మరీ వింతగా ఉంటుంది. ఇప్పుడు బెంగుళూరు మద్రాసుల మధ్య మద్యరేఖలా! అలాగ ఆంధ్రప్రదేశ్‌లో కొంతభాగం మద్యనిషిద్ధ ప్రాంతం. మిగతాది ఇందుకు శుద్ధవిరుద్ధం. ఈ శాఖ మంత్రిగారు సర్కారు జిల్లాలు వస్తే "త్రాగుట తప్పు" అనాలి.



పాస్‌పోర్ట్ టు పిమ్లికోలో స్టాన్లీ హాలోవే, మార్గరేట్ రూథర్‌ఫర్డ్

'ఆ ప్రాంతంలో' ఐతే, ఇప్పుడప్పుడే తప్పు కాదు అనాలి. (ఆయన అలాటి మాటలు అనటం లేదనుకోండి.) కాని, విచిత్రపరిస్థితులు ఇలా ఉంటాయి.

ఇంతకీ కెనడాలో వచ్చిన ఆ వింతశాసనం చూచి, ఒక ఇంగ్లీషు రచయిత ఇంగ్లాండ్‌లోని ఒక గ్రామానికి ఆ పరిస్థితినీ, అందులో మడత పేచీనీ పట్టించి చక్కనికథ అల్లాడు. 'పాస్‌పోర్ట్ టు సిమ్లికో' అనే పేరిట ఒక చిత్రం తీశారు.

❀ ❀ ❀ ❀

ఇలా చిన్న చిన్న ఊహలతో, పరిస్థితులతో అల్లిన కథలు అనేకం చిత్రాలుగా వచ్చాయి. జీవనపరిస్థితుల ఆమ్లంలో మానవుడనే లిట్మస్ పేపరు మునిగి ఎలా రంగులు మారుతుందో చూసితెలుసుకోడానికి ఈ చిన్నకథల చిత్రాలే ఎంతో దోహదం చేస్తాయి. అసలు సినిమాకి పెద్ద పెద్ద కథలను కుదించడం, అవి తెమలక నానా అవస్థాపడడంకన్న, చిన్న కథను తీసుకొని, కావలసిన యోగ్యమైన మంచి వాటిని పెంచి చక్కని కథ అల్లితే మనోహరమైన దృశ్య కావ్యాలు ఆవిర్భవిస్తాయి. చాప్లిన్ చిత్రాలు చాలావాటికి - అలాగే ఇతర గొప్ప చిత్రాలు ఎన్నిటికో ఇవే


రోమన్ హాలిడేలో ఆడ్రీ హెప్‌బర్న్, గ్రెగరీపెక్

ప్రాతిపదికలు అయ్యాయి. ఇటీవల వచ్చిన కొన్ని ఇంగ్లీషు, అమెరికన్ ఇటాలియన్ చిత్రాలలో ఈ కోవకు చెందిన కథలుగా చెప్పుకోతగవి: రోమన్ హాలిడే, సబ్రీనా, ఫెయిర్ చైల్డ్, ఫాదర్ ఆఫ్ ది బ్రైడ్ (పెళ్ళి చేసి చూడు' లాటి మధ్యతరగతి అమెరికన్ కుటుంబం కథ) కెప్టెన్స్ పారడైజ్, మాంటికార్లో స్టోరీ మొదలైనవి. వీటిలో మొదటి రెండు మూడూ నవలలుగా వచ్చాయి. రోమన్ హాలిడేలో ఒక యువరాణి ఒక సామాన్య పత్రికా రచయితతో కలసి జనసామాన్యంలో తిరిగి నిజమైన హుషారైన జీవితం చవిచూడడం వస్తువు. 'సబ్రీనా'లో ఒక బీదవాడి కూతురు అమెరికన్ కోటీశ్వరుడి కొడుకును ప్రేమించి పెళ్లాడబోవడం, వ్యాపారమే జీవిత వ్యాపారంగా జీవిస్తున్న ఇంటి పెద్దలో (హీరో అన్నగారు) ప్రేమోదయం కావడం కథాంశం, మూడో చిత్రంలో మధ్యతరగతి మానవుడు కూతురుకు పెళ్ళి చెయ్యబోవడం వస్తువు. ఖర్చులన్నీ అంచనా వేశాక గుండె గుభేలుమంటుంది అతనికి. కూతుర్ని చాటుకుపిలిచి "చూడు తల్లీ నీకో మూడొందల డాలర్లిస్తాగాని, నువ్వూ అల్లుడూ నాతో చెప్పకుండా లేచిపోరాదూ. ఎక్కడన్నా పెళ్ళాడి మెల్లిగా చక్కారండి." అనేదాకా వస్తుంది అతని స్థితి. ఈ చిత్రం విజయం పురస్కరించుకొని ఇతగాడు మనమడిని ప్రసవించడం ఇతివృత్తంగా మరోచిత్రం తీశాడు.

'మార్టీ' సామాన్యుడు హీరోగాగల మనోహరమైన ప్రేమాయణం. ఇందులో అమ్మాయి సాక్షాత్తు రతీదేవి కాదు. అబ్బాయి నవమన్మధుడూ కాదు. ఇద్దరూ వయసు ముదిరిన బ్రహ్మచారులే! అతడు కసాయివాడు. ఆమె పంతులమ్మ. తమకు జీవన జీవితయాత్రలలో సహచరులు కావాలన్న ఆకాంక్షను వారు సాహసించి పరస్పరం తెలియ చెప్పుకోవడం ఇందులో వృత్తాంతం.

'కాప్టెన్స్ పారడైజ్' అనేది ఆలెక్ గినెస్ చిత్రం. దాదాపు అతని కోసం తయారైన గాథ అనిపిస్తుంది. ఆ మనిషిలో మనందరినీ ఆనందపరిచే తరహాకు తగిన విధంగా ఇది సాగి ఆగింది. ఇందులో గినెస్, జిబ్రాల్టర్ జలసంధిలో తిరిగే

ఫెర్రీ (ఓడ)కి కెప్టెన్. యూనిఫారం, దానిమీద పెద్దమనిషి తరహా తొడుక్కు తిరుగుతున్నా, మామూలు మనుషులలో ముఖ్యంగా సాధుస్వభావులుగా కనిపించే మంచివాళ్ళలో పొంచి ఉండే ఊహలూ ఆశలూ ఇవతలికి తొంగిచూస్తూ ఉంటాయి. అందుకని అతడు ఇవతలి

ఒడ్డున పెళ్ళాంతో, స్వర్గసీమలాటి ఇంట్లో పెద్ద మనిషిలా సాక్షాత్తు 'దేవుడంటి వాడులా' కాపరం చేస్తూ, అవతలిగట్టున ఒక ఖులాసా యువతితో ఇంకోరకం వెలిగిస్తూ ఉంటాడు. అక్కడ అతడు తాగుతాడు. గట్టిగా నవ్వుతాడు. వంటావార్పుల బెడద లేకుండా హోటల్లో తింటూ తాగుతూ డాన్సులు చేస్తూ హుషారుగా ఉంటాడు. ఇవతలి గట్టున మళ్లీ ప్రశాంతమైన పెద్దమనిషి జీవితం.


సబ్రినాలో హంఫ్రీ బొగార్ట్, ఆడ్రీ హెప్‌బర్న్

ఇలా జోడు గుఱ్ఱాల సవారీచేస్తూ, జీవితంలో నిజమైన తృప్తికీ, పరిపూర్ణమైన ఆనందానుభూతికీ మార్గం తెలుసుకున్నాననుకున్న ఆ కెప్టెన్ జీవితంలో ఒక రీలులో కథ అడ్డం తిరగడం మొదలెడుతుంది. అడవి చిలకలాటి హుషారైన అవతలిగట్టు డాన్సరు పిల్లకి హఠాత్తుగా, 'గృహమే కదా స్వర్గసీమా' అనిపిస్తుంది. ఇల్లూ వాకిలీ పిల్లా జెల్లా ఉండాలనీ, పతిదేవుడి పాదధూళి నెత్తిన జల్లుకుని ప్రశాంతమైన కుటుంబ జీవనం సాగించాలనీ కాంక్ష ఎక్కువవుతుంది. ఇటు ఇవతలిగట్టున ఉన్న కట్టుకున్న భార్యకు కట్టుతప్పి తిరగాలనీ వంటా గింటా అవతలకి నెట్టి హోటల్లో తింటూ తిరుగుతూ బేఖాతరీగా ఉండాలనీ మనసుపోతుంది. మొగుడు తనని పంజరంలో చిలకలా పెంచుతున్నాడని నమ్మకం కలుగుతుంది. ఈ పరిస్థితి మీద ఆహ్లాదకరమైన చిత్రణే కాప్టెన్స్ పారడైజ్. అప్రస్తుతం అయినా గినెస్ ఇందులో అద్భుతంగా నటించాడని చెప్పుకోవలసి ఉంది.

ఇంతటి ఉద్దండుడూ అయిన వేరొక నటుడు, ప్రపంచ శ్రేణిదర్శకులలో సుప్రసిద్ధుడు అయిన విటోరియాడిసికా నటించిన చిత్రం మాంటి కార్లోస్టోరీ! అతడు దివాళా తీసిన ఇటాలియన్ కౌంట్. ప్రసిద్ధద్యూత కేంద్రం మాంటికార్లోలో ఇలాటివాళ్లు అర్ధణాకి ముగ్గురు దొరుకుతారు. డబ్బున్న కౌంటెస్ దొరికితే పెళ్లాడడానికి అతడి, అతని మీద అభిమానం ఉన్న హోటలు బట్లర్‌ల ముచ్చట. చివరకి ఒకామె కనబడుతుంది (మెర్లిన్ డీట్రిచ్). అతడు ఈమెని మంచి




చేసుకోబోతాడు - కోటీశ్వరుడిలా అభినయించి. అవిడా ఇతనితో జతకడుతుంది నిజమేనని భ్రమించి. చివరకి డబ్బు ఖర్చుపెట్టాల్సిన వేళకు ఇద్దరూ దివాలా జమిందారులేనన్న నిజం బయటపడుతుంది. జీవనలీలలో తమాషానీ ఖేలనీ సరదాగా చెబుతూ హృదయాన్ని స్పందింప చేస్తుంది ఈ చిత్రం.

మనదేశంలో ఇలాటికథలు బొత్తిగా లేవనలేము. చక్కని ఊహచుట్టు అల్లిన కథలు ఎన్నో నేటిచిత్రాలలో లీలగా కనిపిస్తాయి. అనవసరపు నిడివి కోసం వీటిని మెలితిప్పి సాగదీసి బాక్సాఫీసు పగ్గాలు వేసి తెగలాగుతున్నారు. తెగినచోట్ల అతుకులు వేస్తున్నారు. ఈ అతుకుల గతుకుల కథమీద మనం సాగి, అడంగు చేరేసరికి, అక్కడ చిత్రం పొడుగునా చెప్పినట్లు చెప్పకుండా చెప్పాల్సిన నీతులను డైలాగులలో బిగించి వర్ణించడంతో మనకి చిరాకేస్తుంది. ఇంగ్లీషు వచ్చినవాళ్ళు సిల్లీ అనుకుంటారు. ఫిలిం పేలవంగా ఉందనీ, కుర్రతనంగా ఉందనీ అనుకుంటారు. వీటిలో పెద్దవాళ్లు చూసి నేర్చుకోతగ్గవి, ఆలోచించతగ్గవీ అట్టే ఉండవు. ఇవి బాలవాచకాలలా వయోజన విద్యాప్రణాళికలలా తయారవుతున్నాయి. వీటిలో పరిణతి చెందిన దృష్టి, ఆలోచన మృగ్యం అయిపోతున్నాది.

(ఆంధ్ర-వారపత్రిక - 1958)

# వన్స్‌మోర్ చిత్రాలు

ఇటు డబ్బూ, అటు ఎన్నతగ్గ కళాప్రమాణాలూ కూడా అందుకునే చిత్రాలు అరుదంటారు కొందరు.

అసలవి ఎండమావులూ, కుందేటి కొమ్ములూ, సినిమా పాటలలో భావాలూ బాక్సాఫీస్ నటుల తీరుబాటూ, వణిజుడి తృప్తి, ప్రబంధకన్యల నడుమూ వగైరాలవతుగా ఉండీలేనట్టూ, లేక ఉన్నట్టూ భ్రమకలిగిస్తాయిగాని, అందుకోబోతే లేవనే తేలుతుంది అంటారు కొందరు. అలాటివి అప్పుడప్పుడు రాకపోలేకపోలేదని వాదించే వారుమటుకు కొన్ని చిత్రాలను ఉదాహరణలుగా చూపిస్తారు. డబ్బు బాగా వచ్చిందా అన్న విషయమై, అభిప్రాయభేదాలకు ఆస్కారం ఎలాగా ఉండదు. ఎటొచ్చి, ఆ చిత్రంబాగుందా అన్న దానిమీద కొందరు అటూ ఇటూ కావచ్చు. అలా అయినా కొన్ని చిత్రాలు ఈ ఉభయతారక మంత్రాలకు ఉదాహరణలుగా నిలుస్తూనే ఉంటాయి. అందరూ తేలిగ్గా హేళనచేసి కోప్పడే హాలివుడ్‌లో కూడా చాలా ఉత్తమ చిత్రాలు పుట్టాయి. ఇటీవలి వాటిలో హైనూన్, షేన్, మార్టీ, ఫ్రెండ్లీ పెర్సువేషన్, ట్వెల్వ్ యాంగ్రీమెన్ చిత్రాలను చెప్పుకోవచ్చు. వీటిలో ఒకటి రెండు ఈ దేశంలో ఆర్థిక విజయం సాధించకపోయినా, స్వదేశంలో పుష్కలంగా డబ్బు గడించాయి.







ఇంతవరకూ బాగానే ఉంది. తక్షణమే హాలీవుడ్ నిర్మాతలు ఎగిరి గంతువేసి 'ఇదిగో కీలకం. ఇంకోమార్టీ, ఇంకో హైనూన్ రాయమని రచయితలను పురికొల్పారు. లేదా వాళ్ళే అల్లేశారు. 'హైనూన్' తరవాత దాదాపు అదేఫక్కీలో 'హోండూ' అనే చిత్రం వచ్చింది. అందులో 'సిద్ధహస్తుడు' రాండాల్ఫ్‌స్కాట్, తొలిసారిగా 25 ఏళ్ల టెక్నిక్ మార్చేసి, తుపాకి తియ్యడానికి జంకేవాడుగా, ప్రాణానికి భయపడేవాడుగా అనగా దాదాపు


గేరీ కూపర్

మనిషిగా నటించాడు. గారీకూపర్‌లాగే నడిచాడు, నవ్వాడు, భయపడ్డాడు. అయినా ఆ చిత్రం మాట దక్కించలేదు.

అలాగే ఇటీవల 'టిన్‌స్టార్' అనే చిత్రం వచ్చింది. 'హైనూన్' 'షేన్'ల ఫక్కీలో తీసినది అని పోస్టర్లు గావుకేకలు పెట్టాయి. 'టిన్‌స్టార్' బంగారు నక్షత్రంలా ప్రకాశించిందని సిసిల్ డిమిల్ మెచ్చుకున్నాడు. ఆయన అబద్ధాలు చెబుతాడని కాదు. ఈ చిత్రాన్ని తొలిసారి చూస్తే బాగానే ఉంటుంది. కాని దీని తండ్రి తాతలైన 'హైనూన్' 'షేన్'లు చూస్తే, పేరూ స్టారూ మార్చి మళ్ళీ వాటినే తీశారని తెలుస్తుంది. దాదాపు అదే కథ. మొదటినుంచి చివరదాకా, అలాంటి షాట్‌లే ఇందులోను పొందుపరచారు. ఇందులో హీరో హెన్రీ ఫాండా, తరువాతివాడు టోనీ పెర్కిన్స్, మామూలు సినీ హీరోలలా కాకుండా, ప్రాణాలకు భయపడే వాళ్ళుగా కనబడతారు. వాళ్ళిద్దరు అద్భుతంగా నటించారన్నదీ, సంభాషణలూ సంగీతం అనవసరం అనిపించేటంత శక్తివంతంగా ఫోటోగ్రఫీ కథను చెప్పిందన్నదీ వేరే సంగతి. అది ఏమీ చెప్పిందీ అంటే, పాతకథ అనే అనాలి. ఇందులో అదనంగా ఉన్నవి 'టిన్‌స్టారు' ధారి అయిన షరీఫ్ ది పవిత్రమైన బాధ్యత అనీ, ప్రాణాలకు జంకకుండా, అతడు దానిని ధరించవలెను అనీ చివర నీతిపాఠాలు వల్లించడం.

మొత్తంమీద, ప్రేక్షకులను మోసగించడం. వాళ్ల ఊహ మంచిదేకావచ్చు. ఫలితం చిరాకేసేదిగా ఉంది... మానవహృదయ దర్పణాలుగా భాసించిన చిత్రాలనూ వాటితోపాటు వ్యక్తి గౌరవాన్నీ కూడా ఇది బజార్లో పెట్టి, అతిక్రూరంగా పావలా అర్ధణాకి అమ్మడానికి ఒడికడుతున్నదన్న సత్యం కొరడా దెబ్బలా ఛెళ్లుమంటూంది. డబ్బు గడించడం మహాపాపం అనటం లేదు. ఒక మనిషి హృదయగత క్షోభను చెప్పి, లక్షలాది ప్రజల మనసులు కరిగించి కరుణరసాన్ని చిప్పిలచేసిన తొలి కళాకారుడిలో ఏ పవిత్రభావం, మానవుడి పట్ల గౌరవం ఉంటాయని మనం అనుకుంటామో, ఆ భావాలను నిర్దాక్షిణ్యంగా వీరు బజారున పెట్టి బజారుచూపు చూసి అవమానిస్తున్నారని అనిపిస్తుంది. ఇంతటి హేయకార్యం ఇదే.హాలీవుడ్‌లో భారీఎత్తున జరిగే ఈ మూసపోత వ్యాపారం మనదేశంలోనూ పెద్దఎత్తునే జరుగుతోంది. ఎటొచ్చి హాలీవుడ్‌కి పెద్ద మార్కెట్ ఉండబట్టీ, వాళ్లకి కొంతలోకొంత చెల్లుతోంది. మన నిర్మాతలు తీసిన కథనే మళ్ళీ తియ్యడం, చూపిన డాన్సునే మళ్ళీ చూపడం, వినిపించిన పాటనే మళ్లీ వినిపించడం ఎక్కువ అయిపోతోంది. ఇది

ప్రేక్షకులకు ఎంత విసుగనిపిస్తుందో ఎప్పటికప్పుడు బాక్సాఫీసు ఫలితాలు చెబుతూనే ఉన్నా, అలవాటు అలాగే ఉంది ఏ చిత్రంలోనైనా ఒకరకం పాటో, డాన్సో బాగుందనిపించుకోవడం భయం. అదే వరసతో, అదే లయతో అనేకం వచ్చేస్తున్నాయి. కాని అన్నీ హాస్యాస్పదం అవుతున్నాయి. మాజిక్‌లో లాగే, ఈ సినిమాలోనూ 'ట్రిక్కు' ఒకసారే చెల్లుతుంది. మళ్ళీ చేస్తే బయటపడిపోతుంది.

(ఆంధ్ర-వారపత్రిక - 1960)

# శీర్షికా రమణీయం

# చలనచిత్ర సోపాన పటము

## ఈ గేం(బ్లింగ్) ఆడే పద్ధతి.

జీవితంలో వెలుగునీడలను చూపించేవాటిలో వెలుగునీడల సాధనం అయిన చలనచిత్రాన్ని నిర్మించడంలో కనబడే వెలుగు నీడలను పురస్కరించుకుని రూపొందించిన చలనచిత్ర సోపాన పటము (మధ్యపుటలు చూడండి) కేవలం వినోదం కోసం తయారైనది. 'సినిమా' తియ్యడం చాలా హుషారైనపని అనీ, సులభంగా డబ్బు గడించే సాధనమనీ అనుకునేవారు ఒకసారి ఆడిచూడవచ్చు. ఏమీ తోచనివారుకూడా కులాసాగా ఆడుకోవచ్చు. ఆటకి కనీసం ఇద్దరుండాలి. చెరొకపావునూ పెట్టుకోవాలి. పందెం ఒకటినుండి 85వరకు. దీనికి గవ్వలుగాని సొగటాలకు వేసే పాచికలుగాని ఉంటే మంచిదే! లేకపోతే ఈ పుటలో ఉన్న 'అంకెలబొమ్మ' పనికొస్తుంది. ఒక చీపురుపుల్లనో పెన్సిలునో పట్టుకుని కళ్లుమూసుకుని, ఇందులో దాన్ని మోపండి. ఏ అంకెమీద పడితే, అన్ని గళ్లు మీ పావుని నడపండి. గడిమీద పావు, ముందుకెళ్లాలో వెనక్కెళ్లాలో చెప్పే వివరాలు షరతులూ ఈ దిగువన ఉన్నాయి.

## నిబంధనలు:

మొదట ఆరు పందెంపడితే తప్ప ఆటలోకి దిగకూడదు. ఆ తరువాత ఆరు పందెం పడినపుడల్లా రెండో ఛాన్సు తీసుకోండి:

1. సెబాష్! పదివేలు రొక్కం చేతికందింది. చలో చెన్నపట్నం (6వ గడికి వెళ్ళండి)
6. చెన్నపట్నంలో దిగారు (ఇంకో ఛాన్సు) 4 నుండి ఇక్కడికి వస్తే ఇంకో ఛాన్సు లేదు.
8. మీరు సినీ నేస్తాలతో కథమీద కూర్చున్నారు. మూడు వేలు ఖర్చు. బెంగెట్టుకోడానికి ఓ ఛాన్సు వదులుకోండి.
10. పేకాటలో పద్దారు డబ్బు పోయింది కాబట్టి ఇంటికి టెలిగ్రాం ఇచ్చి ఈలోగా ఓ ఛాన్సు వదిలి శాడ్ సాంగు పాడుకోండి.

11. నాగేశ్వరరావు మీరు తీసే పిక్చరులో వేస్తాడని పుకారు. రెండుగళ్లు అంటే 13లోకి జరగండి.
14. డిస్ట్రిబ్యూషన్ కుదిరిపోయిందని ఇంకో పుకారు! ఒకగడి జరగండి.
16. లక్కీ! అంజలీదేవితో ఇంటర్వ్యూ దొరికింది. ఇంకో ఛాన్సు తీసుకోండి.
18. ఎన్.టి.రామారావు దగ్గరకి సిఫార్సు. అదృష్టం ముందడుగు వెయ్యండి (19కి)
20. రేలంగి మీ పిక్చరులో వెయ్యడానికి ఒప్పుకున్నాడు. ఇంకో ఛాన్సు తీసుకోండి.

ఇక్కడ పందెం ఒకటి పడాలి 21 వ గడిలో అడుగువేస్తేనే 22 కు వెళ్లి ముందుకుపోతారు. 21 వ గడిని దాటించే పందెంపడితే 21-A లో వచ్చి మళ్ళీ తారల ఇళ్లచుట్టు ప్రదక్షిణాలు చెయ్యాలి.

21. గడిలో పడేదాకా అదే పద్ధతి.
23. మీరు కవిని మన్నించి, కథ విషయంలో స్వాతంత్ర్యం ఇచ్చారు. కాబట్టి ఝూమ్మని 41 వ గడికి వెళ్ళిపోవచ్చు.
24. రచయితని శాసించి మీకు తోచినట్టు రాయించారు. ఏదో తయారైంది అందువల్ల 5వ గడికి వెళ్ళిపోండి.
29. ఈ చదరం డిస్ట్రిబ్యూషన్ ఆఫీసుకు ప్రదక్షిణం. ఇక్కడ డిస్ట్రిబ్యూటరు కథ మార్చమన్నాడు కాబట్టి 8వ గడికి తిరిగి వెళ్లండి.
30. తక్షణం 31లోకి వెళ్ళండి (30 లో పడేలా పందెం పడకపోతే 30-A లోకి వస్తారు. 30లోకి పావు వచ్చేదాకా తిరుగుతూ ఉండడమే.)
31. డిస్ట్రిబ్యూటురు మొదటివాయిదా డబ్బు ఇచ్చాడు. ఇంకో ఛాన్సు.
33. మీ పిక్చరుకి కావలసిన ఏడు పాటలూ స్పెన్సరులో దొరికాయి. ఏడూ హిట్‌లవుతాయి తెలుగులో రికార్డు చెయ్యండి. మ్యూజిక్ డైరెక్టరు అక్కర్లేదు (ఇంకో ఛాన్సు)
35. సారీ మీరు కాపీ కొట్టదలచికొన్న ఏడు రికార్డులలో మూడింటిని ఇంకో కంపెనీ వాళ్లు కూడా కొని మీకన్న ముందు రికార్డు చేశారు. కాపీకి కాపీరైటు ఉండాలి! ఏం చేస్తాం. మళ్ళీ 33కి వెళ్లండి. ఇంకో ఛాన్సుమటుకు వద్దు.
37. మల్లాది రామకృష్ణశాస్త్రిగారు మీకోపాట రాసిస్తానన్నారు: (ఇంకో ఛాన్సు).
39. ప్లేబాక్ గాయకుడికి జలుబుచేసింది. (ఒక ఛాన్సు వదులుకోండి).
40. మీ డైలాగు రైటరుకి గిరాకీ పెరిగింది. అండర్ గ్రౌండులోకి వెళ్ళిపోయాడు. (ఒక ఛాన్సు వదులుకోండి).
42. రాజేశ్వరరావు శాస్త్రీయమైన బాణీలో అద్భుతమైన పాటచేసి ఇచ్చారు. (44కు ముందడుగు).

45. 45 నుండి 53 దాకా స్టుడియోలో చోటు కోటాకోసం యజ్ఞం! 53 వ గడిలో పావు ఆగితేనే బయటపడతారు. లేదా చక్కర్లు కొడుతూ ఉండడమే పని.

51. తీరా సెట్ వేసుకొన్నాక, డిస్ట్రిబ్యూషన్ అఫీసునించి డబ్బు రాలేదు! 32 కు తిరిగిపోండి.

55. డ్యూయెట్ సీనులో కూయవలసిన కోకిలకి, ప్లేబాక్ రికార్డు చెయ్యాలి. లతామంగేష్కర్ వాయిస్ తప్ప మరోటి పనికిరాదంది కోకిల. ఒక ఛాన్సు వదిలి ఆగండి.

58. హీరోకి ఒక సీను, కొంత డైలాగూ నచ్చలేదు. తీసి పారెయ్యమన్నాడు. పని తగ్గింది కాబట్టి రెండు గళ్లు ముందుకు పోవాలి.

61. గిరాకీ ఉన్న ఒక అర్టిస్టు మధ్యాహ్నం రెండు గంటల కాల్షీటుకు సాయంత్రం ఆరున్నరకల్లా వచ్చేసింది. ఎనిమిది దాకా పనిచేసి తీరతానని ధైర్యం చెప్పింది. (ఒక ఛాన్సు వదలండి)

63. ఒక సకుటుంబరావుగారు పరివార సమేతంగా చూడవచ్చారు. మర్యాదలకి అరకాల్షీటు ఖర్చు, ఒక ఛాన్స్ వదులుకోండి.

65. రాఫిలిం కోటా కోసం ఘోరతపస్సు! రెండు ఛాన్సులు వదులుకోండి.

66. సెబాష్. రామారావు, రంగారావు రేలంగి, రాఘవయ్య గారలంతా మీ సెట్టు మీద ఒకే ముహూర్తంలో వచ్చేందుకు ఒప్పుకొన్నారు. ఇందర్ని ఐరిమీదకు తెచ్చినందుకు ప్రమోషన్. 72 కు వెళ్లండి.

71. ఫిలింకోటా వచ్చేసింది ఇంకోఛాన్స్. 71లోకి సరిగ్గా రాకపోతే 71-A లో పడిగాపులు, ప్రదక్షిణం.

76. ఇంతవరకూ తీసిన పిక్చరులో కథ ఏమిటో స్టూడియోబాయ్ కొంతవరకు పసిగట్టి చెప్పగలుగుతున్నాడు! ఆనందంతో ఇంకో ఛాన్సు.

76. సెన్సార్‌దినం. తాడిచెట్టుకింద పాలుతాగారు అంటారు. కాబట్టి, తాడినీడన తల్లి పిల్లడికి పాలిచ్చేట్టు మళ్ళీ తియ్యాలి కాబట్టి 60 వ గడికి వెళ్ళండి.

79. ఇంకోపాటని మరమ్మతు చేయమన్నారు సెన్సారువాళ్లు. మళ్లీ రికార్డింగు. ఓ ఛాన్సు వదులుకోండి.

80. ఒక సీనులో కొత్త చిక్కు. నగ్నసత్యం అనేమాటగాని, ఆ మాట వినబడేటపుడు కనబడే సీనుగాని కట్‌చేయాలి. 57కు వెళ్ళండి.

84. రిలీజుకి హాళ్లరద్దీ. 81 కి వెళ్లండి.

**(ఆంధ్ర-వారపత్రిక - 1959)**

# సినీవార్తలూ - అతిశయోక్తులూ

తెలుగు సినిమా కథలో ఇటు పై కారు ప్రమాదాలు ఉండకుండా చేయాలని నిర్మాతల సంఘం గుట్టుగా ఒక తీర్మానం చేసినట్లు తెలుస్తోంది.

* ఇది గనక జరిగితే ఇక కదలడం, ఆగడం, సాగడం చాలా కష్టమైపోతుందని సినిమా కథలన్నీ హోరున దుఃఖిస్తూ (గ్లిసరిన్ లేకుండా) ఒక ఎదురు తీర్మానం చేశాయి.

* యాక్సిడెంట్లు లేకపోతే మా గతేమిటని అడుగుతూ, తారల ముఖాలను అలంకరించే ప్లస్ మార్క్ ఫోటోజెనిక్ పలాస్ట్రీలు మరో తీర్మానం చేశాయి.

* ఐకమత్యం లోపించినందువల్లనే ఫిలిం పరిశ్రమ సర్కారు వారికి లోకువ అయిపోతోంది. అందువల్ల మనం ఐకమత్యంగా వుండాలి, అని బొంబాయి నిర్మాతలు తీర్మానించుకున్నారు. ఆ ప్రకారం ఫిలిం ఫెడరేషన్‌ను తాము ఐక్యంగా ప్రతిఘటించాలని చీలికను బలంగా బలపరచాలనీ నిర్ణయించారు.

* ఫిలిం స్టూడియోలలో పనివారు వారానికో రోజు సెలవు తీసుకోవాలని దురాశపడుతున్నారు. ఇపుడు ఇస్తున్న సెలవులు నోటీస్ బోర్డు మీద వేళాడుతున్న మాట నిజమే కానీ అనుభవానికి రాలేదంటున్నారు.

* 'జగమేమాయ. సినిమా అందులో మరోమాయ. అందులో సెలవు అనేది అంతకన్న మాయ. తెరమీద సినిమా చూసి ఆనందించే జనం నోటీసు బోర్డుమీద సెలవును చూసి అనుభవించలేరా ఏవిఁటి అన్నారు గిరీశం.

సిలోన్ రేడియోలో పెట్టడానికి హిందీ రికార్డులు ఇవ్వమంటే, బొంబాయి మ్యూజిక్ దర్శకులు ఇవ్వమంటే ఇవ్వమంటున్నారు. అవే వరసలు మదరాసీ చిత్రాలలో వస్తున్నందువల్ల జనం, హిందీ రికార్డులన్నీ పచ్చి కాపీలని పసిగడతారని భయపడుతున్నారు.

"గిట్టని వాళ్లంతా మనని చిత్తం వచ్చినట్లు ఆడిపోసుకుంటున్నారు. పెద్ద స్టార్లు డైలాగులు మారుస్తున్నారనీ, డైరెక్టర్లకి ఐడియాలిచ్చి వాళ్లనే డైరెక్టు చేసేస్తున్నారనీ విమర్శిస్తున్నారు. అదేదో పెద్ద తప్పయినట్లు.... అందువల్ల ఇక నుంచి మనం అలాంటి సహాయం చెయ్యడం మానెయ్యాలి. అప్పుడు బైటపడుతుంది ఈ రైటరూ డైరెక్టరుగాళ్ల పస" అని ఆలిండియా బాక్సాఫీస్టార్ల సమితి ఒక దశగ్రీవ నిర్ణయం చేసింది.

* 'కాస్ట్యూములూ హెయిర్ స్టయిల్సూ మనం నిర్ణయించడంవల్ల కారెక్టరు దెబ్బతింటుందని జనం వాపోతున్నట్టున్నారు. ఆ ఉపకారం గూడా మానేదాం.

అప్పుడు తెలుస్తుంది మన విలువ' అని హీరోయినుల సమితి ఒక జోడించినట్లు తెలిసింది.

❀ ❀ ❀

దిలీప్‌కుమార్ క్రాప్‌ను ఎడిట్ చేయిస్తున్నట్లు పుకారు.

❀



దిలీప్‌కుమార్

సినిమామీద బోలెడంత పన్ను వసూలు చేయవలసి వచ్చినందుకు శ్రీ ప్రభుత్వం వారు కటుకు కటుక్కు నాలిక్కరచుకొని యలాగైనా ఆ ఋణం తీర్చుకోవాలని సంకల్పించారట.

అందుకోసం గోల్డుమెడల్ పిక్చర్‌కి వేలకివేలు రొఖ్ఖం ముట్టచెప్పినట్టే సిల్వర్ మెడల్ పిక్చర్‌కి కూడా కొంత నగదు రూపేణా ఇద్దామని ఆలోచిస్తున్నట్లు నికార్సైన నీలివార్త తెలియవచ్చింది

ఐతే, ఇందువల్ల ప్రాంతీయభాషాచిత్రాలు బాగుపడిపోయి మరీ కానంత డబ్బు సంపాదించేస్తే అప్పుడు మళ్ళీ కొంత నగదు బహుమతులు రద్దుచేస్తూ ఉత్తర్వులు జారీ చేయాలనీ వాటికోసం కాగితాలు సిరా ఇలా వృధాచేయడం శుద్ధ దండుగ అనీ మొరార్జీగారు అంటున్నారుట.

ఇలాటి పనులుచూసే ఆడిటరు జనరల్ మన శాఖలని మందలిస్తున్నారు. సిగ్గు అనుభవిస్తూకూడా మళ్ళీ ఇలాంటి పనులు చెయ్యడం తగదు అని ఆయన కోప్పడ్డారు.

❀ ❀ ❀ ❀

మద్రాసులో ఒక కొత్తరకం ఫిలిం కంపెనీ వస్తోంది. గత పదేళ్ళలో ఈ సినిమా ఫిలిములలో భాగాలు ముక్కలయినా సరే – వీరు కొంటారు. ప్రాసెసింగు ప్రింటింగుచేసే లేబరేటరీలో పారేసే ఫిలింకూడా కొంటారు. వీటన్నిటిలోను నాగేశ్వరరావు పాడేవి, కోప్పడేవి, అంజలీదేవి ఏడిచేవి,జిక్కి పాడేవి, రేలంగి జోకులు వేసేవి, రాజసులోచన, సాయి సుబ్బులక్ష్మి డాన్సులు ఈ ముక్కలన్నీ కొని వాటితోటీ ముప్పై కొత్తచిత్రాలు తయారుచేస్తే కథ మాటలు పాటలూ అన్నీ కొత్తనిపిస్తాయి.

ఈ పదేళ్లలోను వచ్చిన సినిమా కథలూ, సీనులూ, డైలాగులూ కొన్ని పాట వరసలు, మాటవరసలూ యావత్తు సినీకుటుంబమునకు చెందినవన్న భావంతో వీరు ఈ కంపెనీ పెట్టారు.

(ఆంధ్ర-వారపత్రిక - 1959)

# వ్యంగ్య రమణీయం

# కొత్త 'ముఖాలు'




మన నటీనటుల కేశాలంకరణ శిల్పం కొద్దిగా మారినట్లయితే, చలనచిత్రకళ ఎవరెస్టు శిఖరాన్ని కాకపోయినా, కాంచన్‌జంగా శిఖరం అంత ఎత్తుకైనా పెరుగుతుందని ఈ మధ్య ఒక తమిళ చిత్రాభిమాని అన్నారు. ఆయన పేరుగుర్తులేదు. మాటవరసకి జగదలప్పిరదాబన్ అనుకుందాం.

సదరు జగదలప్రతాపన్‌గారు, ఏ సినిమాకి వెళ్ళినా హీరోల జుట్టు చాలా ఎబ్బెట్టుగా కనిపిస్తోందట. జానపద హీరో అయితే చెంపల మీదకి దిగిన తమ్మెలు, గిరజాలూ వగైరాలున్నూ సోషల్‌హీరో అయితే అప్పుడే తలంటి పోసుకున్నట్టు చింపిరి జుట్టున్నూ ఉంటాయిట. వాటి అడుగున, తొంగిచూస్తున్నట్టుగా ముఖాలు కనిపిస్తాయి. ఒకసారి అయితే అనుకోవచ్చు. ఏళ్లతరబడి ఇలాగే ఉంటుంది. సుబ్బరంగా పాపిటతీసి నున్నగా తలదువ్వుకునే వాడి కథలు రావేల అని ఆయనబాధ. హీరోయిన్‌ల స్థితి కూడా ఇదే. అబూర్వ సిందామణి దగ్గర్నుంచి అంట్లుతోమే సెందామరై దాకా అందరూ మేరీ ఆంటోనెట్ మార్కు హెయిర్ స్టయిల్ (వీలైతేజోసఫైన్ చేత చేయించుకోవడం)కు ససేమిరా తగ్గనివారే. సినిమా కెళ్ళేవాడు నోరుమూసుకు కథ చూసి ఆనందించి, కరిగిన గుండెతోనో, బరువెక్కిన గుండెతోనో ఇంటికి పోకుండా ఇలా జుట్టు పట్టుకు బెంగెట్టుకు ఇదవడం ఏమిటి మరీ ఇది

కాకపోతే అని మనం ఇది కావచ్చు. కాని ఏం చేస్తాం జగదలప్రదాపన్‌గారి రసాస్వాదనకి ఈ జుట్టు ఎబ్బెట్టుగాతోచి అడ్డు తగులుతోంది కాబోలు. బహుశా నటుల భావాలు దీనిచాటున మరుగైపోతున్నాయి కాబోలు లేదా వారే అన్నట్టు విసుగేసి ఉండనూ వచ్చు. లోకో భిన్నరుచిః. అందులో తమిళ చిత్ర ప్రేక్షకుల అభిరుచులు మనకేల అనుకుందాం. అయితే ఒక చిక్కు. బోలెడు తమిళ చిత్రాలు తర్జుమా అయి మనకు వస్తున్నాయి. పోనీ అనుకున్నా, తెలుగు చిత్రాలంటే మోజుగల ఒక వెంకటేశ్వర్రావుగారు కూడా ఇలాటి ఫిర్యాదే చేస్తున్నారు! నాగేశ్వరరావు దగ్గరనించి నయనప్పన్ దాకా పాతికేళ్ల కుర్రాడివేషం వస్తే ఒకే తరహా క్రాపింగు అని!

ఈ దృష్ట్యా ఇటీవల ఒక ఫిలిం ప్రముఖుడు కొత్త 'ముఖాల' కోసం చేసిన ప్రకటన గమనార్హమైనది.

హీరో హీరోయిన్ పాత్రలు భరించడానికి కొత్త నటులు కావాలని ఆ కంపెనీ ఒక హెచ్చరిక వేసింది.

ఇందుకు ఆశించే యువతీ యువకులకు సినిమామీద దారుణమైన మోజు ఉండడం, హీనపక్షం మెట్రిక్ దాకా చదువు ఉండడం, కాస్తో కూస్తో రంగస్థల, లేక నటనానుభవం (ఉండితీరాలని లేదని ధైర్యం చెప్పారు) ఉండడం వగైరా షరతులు పెట్టారు. అన్నిటికన్న ముఖ్యమైనది నేటి మేటి నటుల పోలికలు మాత్రం ఉండకూడదు అన్నది!



"నాది అచ్చు దిలీప్‌కుమార్ జుట్టు! ఒట్టు" అనో, "వీడి ప్రొఫైల్‌లో దేవానంద్ పోలికలున్నట్టు అనుమానంగా ఉంది స్మీ" అనో, "నేను వైజయంతిలా డాన్సు చేయగలను" అనో, "ఎడిటర్జీ, నేను అశోక్‌కుమార్‌లా ఉంటానని నేనూ, నాగేశ్వరరావులా ఉంటానని నా మిత్రుడూ వాదించుకుంటున్నాము. నేను మద్రాసు బొంబాయి వస్తే ఛాన్సులుంటయా" అనో పోలికలు చెప్పుకుని, అవే అర్హతలనుకుని సినిమాలో చేరబోయే వారికి ఇది వార్నింగు కావచ్చు. దీంతోపాటు నేటి మేటి నటుల మీద విమర్శకూడా వినిపిస్తోంది అని కొందరు గిట్టని వాళ్ళ – కు–శంక. అంటే, ఇప్పుడు చెలామణీలో ఉన్న నటీనటుల ముఖాలు బాగులేవనిగాని, భావాలు బట్వాడా చేసేందుకు వాటిలో సదుపాయాలు లేవనిగాని, విసుగెత్తిస్తున్నాయని గాని అనలేము. ఎందుకంటే, వారిలో చాలామంది తమ ఉన్నత స్థాయికి అర్హత ఉన్నదని రుజువు చేసుకొన్నారు. ఫేస్ వాల్యూ ఎక్కువే అని వేరే చెప్పనక్కరలేదు.

అయితే ఈ విమర్శకుల భావం ఏమిటీ అంటే, ఈ పాతముఖాలలోనే కొత్తదనం కనిపిస్తే బావుంటుంది అని.

మన హీరోలు హెయిర్ స్టయిల్ (అనగా క్రాపింగులు) గనక మారిస్తే, హామింగ్ అనబడే 'డిటో' నటన మారుతుందనీ, జుట్టువల్ల తప్పనిసరిగా పెట్టవలసివచ్చే స్టాక్ ఫోజులు మారుతాయనీ, ఇవి గనకమారితే మెల్లిగా ఫోటోగ్రఫీ ప్రేమఘట్టాలూ, చందమామా సాంగ్సు, ఆపైన కథా కమామిషూ, ఆ ధరిమేనా చలనచిత్ర స్వరూప స్వభావాలే మారి కొత్త మార్గంలో ముందుకు సాగగలవనీ ఈ వర్గం అతివాదం.

ఈ పరిస్థితికి ఎవరు ఎంతవరకు బాధ్యులు, ఏది ఎంతవరకు కారణం?

ఏది అయినా, మిగతా బాక్సాఫీస్ సూత్రాల పేరిట "డాన్సు లేకపోతే జనం రారు నీకు తెలీదుపో" అన్నట్టుగా. దీనికి కారణాన్ని కూడా ప్రజల నెత్తిన రుద్దడం మటుకు సరికాదు. ఫాషన్‌లకు వరవడి దిద్దగల సినీతారల అలంకరణలో జనం దేన్ని అనుకరించినా మానినా, రింగుల క్రాపింగుల మీద మాత్రం మోజుతో విరగబడి అనుకరించడంలేదు. అందువల్ల మూడు కారణాలు ఉండవచ్చు.

ఒకటి: ఎవరూ దాన్ని గురించి పట్టించుకోక మామూలుగానే పని సాగించడం.

రెండు: పెద్దనటులకు చెబితే బాగుండదనో, చెప్పినా వినరనో దర్శక నిర్మాతలు అనుకోవడం.

మూడు: ఈ పెద్దనటులు సవరణ ప్రతిపాదనలకు అంగీకరించకపోవడం.

ఈ మూటిలో ఏదో ఒకటి కావచ్చు అనుకోలేము. పరిశ్రమ స్థితిగతులు చూస్తే కేవలం ఈ క్రాపింగు వంటి వాటి విషయాల్లోనే కాక, అన్నిటా ఈ మూడు లక్షణాలూ ధగధగ మెరిసిపోతున్నాయని పరిశ్రమలో ఉన్నవారే అంటున్నారు.

పనిమనిషి వేషం వేసిన ఒక పెద్ద నటి షిఫాన్ చీరెకట్టి మరీ అంట్లు తోముతానని పట్టుబట్టిందిట. చీర చిరిగినట్లు చూపాలంటే, దానిమీద ఇంకో నైలాన్‌గుడ్డతో మాసికలు వేసుకోవాలిట. పోస్టుమానో పోలీసో వెయ్యాల్సిన ఒక పెద్దనటుడు గాబర్డిన్ యూనిఫారం తప్ప తొడగననీ దరిద్రగొట్టు ఖాకీ సరుకు ధరించడం పరువు తక్కువనీ ప్రకటించాడట.

కళ పవిత్రమైనదనీ, దానికోసం జీవితాన్ని అంకితంగట్రా ఇస్తామనీ ఫోటోజెనిక్‌గా మాట్లాడేవారూ. వాస్తవికతను పోషించి అడుగడుగునా జీవితం ప్రతిబింబింపచేసెయ్యడం తమ లక్ష్యమని ఉద్ఘాటించేవారూ ఇలాంటి అద్భుతాలు చేస్తూ ఉంటే, పైన చెప్పిన జగదలప్రతాపన్ జుట్టు గురించి అంతగా పట్టించుకోవడం, ఈ వాక్యకారుడు ఇన్ని అక్షరాలు వ్రాయడం అద్భుతం అనిపించుకోదు.

నిజానికి క్రాపింగులకథ హాస్యాస్పదమైన చిన్న సమస్యగా సరదాగా తేలికగా కబుర్లు చెప్పుకోడానికి సరిపోయే సంగతిగా కనిపించినా నేటి చలనచిత్ర పరిశ్రమకు సంబంధించిన అన్ని శాఖలలోనూ ఉన్న పెద్ద సమస్యలన్నిటికీ ఇది చిహ్నం.

**(ఆంధ్ర-వారపత్రిక - 1959)**

# చెత్తేర్ చెదారేర్



అనగనగా ఒక మదరాసీ నిర్మాత. అందువల్ల అతను బెంగాలీ కథ కావాలనుకున్నాడు. అందువల్ల కలకత్తా వెళ్లాడు బోలెడు డబ్బు పెట్టుకుని జోలెడు కథలు కొనాలని. టెలుగూ మదరాసీ అంటే బావుండదని బెంగాలీబాబు డాబు తొడుక్కుని ఆషోబోషో అంటూ, మద్రాసీ కథలు చెత్తేర్ చెదారేర్ అనుకుంటూ వెళ్లాడు. ఒక హోటలుకెళ్లి బసకి రేటెంత అన్నాడు. 'ఏవుంది సార్ మీ ఫీల్డులో తెలుగుకథ కిచ్చేటంత' అన్నాడు మానేజర్. ఓస్ ఇంతేనా అయితే గొప్ప హోటలు కెళ్తానన్నాడు నిర్మాత. అంతలోనే ఆశ్చర్యపడి లేచి మొహం కడుక్కుని టీ తాగి తందనాలాడి పాడి, సార్ మీరు గొడ్డుతెలుగు మాట్లాడుతున్నారే. మీరు టెలుగూసా! అన్నాడు. యస్సార్. అవునుగాని ఏవిటి సార్ వాళ్ళంతా కలకటామీద పడుతున్నారు. ఈపాటి మనవాళ్ళు రాయలేరండీ అన్నాడు. ఆ మనవాళ్ళుట్టి వెధవాయలోయ్ అన్నాడు నిర్మాత. ఈ మాట నిర్మాతలనే అన్నాడని అపోహ పడబోయి ఆపుకుని బహుశా కథకులనే అయివుంటుందని సమాధానపరుచుకుని వూరుకున్నాడు మానేజరు.

ఆ తర్వాత నిర్మాత ఎక్కడికి వెళ్ళినా ఇదే వరస అయింది. కొంపతీసి కలకటా అనుకుని విశాఖపట్నంలోనో, విజినారంలోనో దింపెయ్యలేదుకదా రైలువాడు అని భయపడ్డాడు. కారణం ఊరంతా మదరాసీలే. బెంగాలీలు ఒకటీ, అరా తగుల్తున్నారు. అలా తగిలిన వాళ్ళలో ఒక చక్కని చిన్నది గిరుక్కున వెనుదిరిగి చురుకున చూసి ఇడియట్! కళ్ళు కనబళ్ళేదా? అంది. అరె, మీరు కూడా

టెలుగూనేనా? అన్నాడు నిర్మాత కళ్ళు విప్పార్చి. ఆఫ్‌కోర్సు కాదు. మా నాన్న బెంగాలీ ప్రొడ్యూసరు. మా యింట్కి కథలకోసం మదరాసీలు వస్తారు. వాళ్ళమాటలు వినగా వినగా టెలుగు తగులుకుంది. బట్ ఇటీజ్ స్వీట్ లాంగ్వేజ్. ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అంటారుటగా. దేశభాషలందు తెలుగు లెస్సంటారుగా. తెలుగు చాలా తియ్యనిభాష అందా చిన్నది తియ్యగా. ఆ అమ్మాయి డైలాగులో మొదటివాక్యం విని నిశ్చేష్టుడైపోయిన నిర్మాత చేష్టుడై సిగ్గుపడి, మా మొహం, మీ ముందు మా యిదెంత, అసలు మా వాళ్ళందరికీ బెంగాలీ అంటేనే యిష్టం టెలుక్కన్న. ఐ లవ్ శరత్ ఐ లవ్ ఆల్ బెంగాలీ హిట్ పిక్చర్స్. ఐ లవ్ బెంగాలీస్, ఐ లవ్ యు. మీ కళ్ళు బెంగాలీ హిట్‌లో డైలాగుల్లా మెరుస్తున్నాయి. మీ యవ్వనం బెంగాలీ హిట్ కథలా బింకంగా వుంది. మీ జుట్టు బెంగాలీ హిట్ కథలా పొట్టిగా వుంది. దీనికి తెలుగుసవరం కలిపి సరోజాదేవి జఘనాల వరకూ జడల్లి అరవపూలు తురిమితే అయ్యబాబోయ్ నే చెప్పలేను అన్నాడు నిర్మాత. ఈ ముఖస్తుతితో ఆ చిన్నదాని గుండె ఝల్లుమంది. హఠాత్తుగా ఆ యువకుడికి హృదయం సమర్పించింది. ఆయంది తనంది పుచ్చుకుందామనేవరకూ సదరు హృదయం తనలోనే ఉన్నట్లు గమనించి సిగ్గుపడి పైట సవరించుకుని, చాలు కొంచెం అసింటా కూర్చోండి నాన్నొస్తున్నాడు అంది. నాన్నగారొస్తూనే ముక్కు పుటాలెగరేస్తూ, "ఎవరక్కడ, ఇక్కడ టెలుగు ప్రొడ్యూసరు ఉన్నాడు ఎవరూ?" అన్నాడు.

"నేను కాదు నాన్నా" అంది అమ్మాయి. తండ్రి, నిర్మాత వంక చూశాడు. "ఆయన కూడా కాదు. ఆయన మనవాడే. భేంకటరావు. టెలుగువాళ్ళు మన కథలతో పిక్చరుల్తీసి బాగుపడిపోతున్నారన్న దీనితో ఆయనే అక్కడకెళ్ళి తీదామని చూస్తున్నారు" అంది అమ్మాయి.

భేంకటరావు సిగ్గుపడి ముడుచుకుపోయాడు.

అయితే రండి అని గర్భగుడిలోకి తీసుకెళ్ళి ఐదారు హిట్‌లు చూపించాడాయన.

ఐదారూ నాకిచ్చెయ్యండి అన్నాడు నిర్మాత. అన్నీ మీకెందుకు ఒకటేగా తీస్తారు అన్నాడు బూషోబాబు. చిత్తం, సాయంత్రం మెయిలుకి మళ్ళీ ఓ బోగీడు జనం వస్తున్నారు. కాంపిటీషను, నాలుగు నా కంట్రోల్లో వుంటే....

ఆ మాటొద్దు. ఇక్కడ కంట్రోలయ్యే ఒకాయన ఉన్నాడు. మదరాసీయే. ఎవరిక్కావలసినా ఆయన ద్వారా రావాలి. ఆయన ఇక్కడ టోకు రాక్షసుడు. అసలు మీకివి చూపించడమే నేరం. ఆయనకి తెలిస్తే కొంప మునుగుతుంది. అమ్మడం అసలు వల్లకాదు...

నిర్మాత, ప్రియురాలి వంక దీనంగా చూచాడు. ఆమెలో ఉన్న అతని హృదయం గొల్లున ఘోషించింది.

పితాజీ అంది బెంగాలీలో.

యే ఖాన్‌దాన్ కీ ఇజ్జత్ అని నాలిక కరచుకొని, క్యామేరీ బేటీ అన్నాడాయన. అమ్మాయి సిగ్గుతో నవ్వి, నిర్మాత పాణిని గ్రహించింది. ఇయం సీతా మమసుతా అనుకుని తండ్రి పొంగిపోయాడు. నీ మనసుని కాదంటానామ్మా. తప్పకుండా. నువ్వతన్ని పెళ్ళాడితే ఒకటేమిటి ఐదారు పిక్చర్లూ అతనికే అమ్మేస్తాను అన్నాడు తండ్రి ఉదారంగా.

నిర్మాత ఎగిరి గంతువేశాడు.

మర్నాడు కలకత్తాలోని తెలుగు నిర్మాతలందరికీ పార్టీ ఇచ్చాడు. వాళ్ళు సన్మాన సభ జరిపారు.

నాదే అదృష్టమంటే, జన్మ ధన్యమైంది. ఏక్‌దమ్‌న ఐదారు హిట్ పిక్చర్లు దొరికాయి అన్నాడు నిర్మాత, ఉత్సాహంగా, గర్వంగా.

ఆ మాట వినగానే అమ్మాయి గుండె గుభేలుమంది. ప్రాణం నీరుగారిపోయింది. అయితే... అయితే.... నువ్వు నన్ను ప్రేమించడంలేదు. మా నాన్న దగ్గిరున్న పిక్చర్ల కథలకోసం నాకు మనసిచ్చి పెళ్ళాడతానన్నావు అంతే అంది కిటికీలోంచి బయటికి చూస్తూ. కిటికీ తలుపు మూసివున్నందువల్ల, గొళ్ళాలు ఓ పట్టాన ఊడిరానందువల్ల వెనక్కి తిరిగింది కోపంగా.

నిర్మాత కిటికీ మీద కోపంకూడా తనమీదే అనుకుని ఆమెకెంతో నచ్చచెప్పాడు. నేను నిన్ను నిజంగా ప్రేమిస్తున్నాను. కథల రైట్సు కోసం కాక నీకోసం కూడా నిన్ను ప్రేమిస్తున్నాను అని పరిపరి విధాల చెప్పాడు. ఆమె వినలేదు.

ఇక్కడిలా ఆలస్యం చేస్తే, ఈ పిక్చర్ల నింతకుముందు చూచి వుండగల ఇతర మదరాసీ కథాధరులు వీటిలో అయిడియాలు, క్లైమాక్సు, ట్విస్టులు కొట్టేసి మదరాసీ కథల్లో కలిపేసి పిచ్చర్లు తీసేస్తారని భయపడి హడావుడిగా పరిగెత్తాడు నిర్మాత. ఆర్నెల్లు తిరిగేసరికి అతను రెండు పిక్చర్లు తీశాడు.

ఈలోపల ఆ అమ్మాయికి ఎన్నో వుత్తరాలు రాశాడు మీ పిక్చర్ల కోసం కాదు; నీ కోసం నిన్ను ప్రేమించాను అంటూ.

ఒకనాడు ఆ పిల్ల బొంబాయి కెళ్లేసరికి ఆమెను చూసి బొంబాయి బాలిక అనుకుని ఒక మద్రాసు నిర్మాత హిందీ పిచ్చరులో మద్రాసీ యువతి వేషానికి బుక్ చేయడంతో ఆమె బంధుమిత్ర సపరివారంగా విమానం ఎక్కి మద్రాసువచ్చి విడిసింది. అనుకోకుండా తన మాజీ మనోహరుడు తీసిన చిత్రాలు రెండూ ఒక స్టూడియోలో చూసింది.

ఒక్కసారిగా ఆమె కళ్ళు తెరుచుకున్నాయి. అపోహ చెరిగిపోయింది. నిర్మాతకి నిజంగా తనతండ్రి కథల మీద మోజులేదని రుజువైపోయింది. ఎందుకంటే అతను కొని తీసుకొని వచ్చిన కథలు ఆధారంగా అని చెప్పి మరీ, ఈ పిచ్చర్లు తీసినా, వాటికీ వీటికీ ఏ కోశానా పోలికలేదు. అంత పూర్తిగా పరిమార్చి మదరాసీ పిచ్చరు తీశాడు! అనుకుంది. ఎంత నిర్మల హృదయం అనికూడా అనుకుంది.

పక్కఫ్లోర్‌లో రీ రికార్డింగు ఆర్కెస్ట్రా గొల్లుమంది. ప్రాణనాథ్ నిన్ను అపార్థం చేసుకున్నాను అంటూ నిర్మాత కాళ్ళమీద పడి లేచి కౌగిలించుకోబోయింది ఆ అమ్మాయి.

నిర్మాత ఆమెవంక ఎగాదిగా చూశాడు. ఆమె మద్రాసీ పిక్చరుకు కావలిసిన సౌతిండియన్ వేషంలో ఉంది.

"నువ్వు నా మనసు హరించిన బెంగాలీ పిల్లవికావు. నువ్వు ఎవరో మదరాసీవి, నువ్వు నా కక్కరలేదు..." అంటూ హెవీప్రొజెక్షన్ బిల్లు పట్టుకుని బరువుగా అడుగు వేసుకుంటూ వెళ్ళిపోయాడు నిర్మాత....

**(జ్యోతి 1963)**



# ఎక్స్ ఫిలింస్ వారి
# నెక్స్ట్ పిక్చర్

గురూ! గురూ! గుండె కరిగిపోతోంది. కరిగి నీరైపోతోంది, అంటూ గురువులు పరుగు పరుగునవచ్చి గురువు పాదాలమ్రోల వాలాడు.

గురువు పెద్దసైజు కారక్టర్ యాక్టరు. వాళ్ల ఊళ్లోవాళ్లు చాలా సార్లు అతనికి నచ్చచెప్పగా, ఆయన చెన్నాపట్నం చక్కా వచ్చి, చాలామందికి, చాలాచాలా నచ్చ చెప్పజూశాడు.

అతని నటన చూచేవాళ్ళు దొరకలేదు. దొరికినవారు సొంతం శాంతంగా చూడలేరు. స్టుడియో గేటు అవతల కాస్త అసింటా క్యారక్టరాక్షను చేస్తానంటే ససేమిరా వద్దన్నారు. అందుకని గేటుకి ఆవతలగా కాస్త ఇసింటా ఆ పని చేస్తూ కూర్చుంటాడాయన. అలా ఉండి ఉండి బోలెడు అనుభవం గడించి, గడ్డంపెంచి కొంత గొప్పవాడయ్యాడు. చిన్నసైజు శిష్యుల గాంగుని సంపాదించాడు. మెల్లిగా ఓ ఆఫీసు తెరిచి, పుకార్లు ఉత్పత్తి చేసి పోపులో వేసి పాండీబజారులో అమ్మి సొమ్ము చేసుకునేవాడు కాస్తాకూస్తో. ఈ విధంగా సర్వజ్ఞ బిరుదాంకితుడనిపించుకున్నాడు శిష్యబృందంలో.

"గురూ. గుండె కరిగిపోయె" అంటూ గురువులు గురువుగారి కాలిమోల వాలిన వేళకు ఆయన కాస్త హడావుడిగా ఉన్నా, గురువులు ఊపిరి సలుపనివ్వనందువల్ల వాడి గోడు వినక తప్పిందికాదు.

"వత్సా! వెధవ పీనుగా, నీ సిగతరగా! అఘోరించు నీ గోడు" అన్నాడు వాత్స.

"గురూ. మరీ, మరేమోనూ - ఓ కుర్రాడు ఇందాకా, చెట్టుకింది కంపిణీలోకెల్లీ, మల్లీ యాడత్తా లగెత్తుకెల్లి పోతన్నాడు. ఎందుకో తెలిసిందికాదు. అంతట్లోకి ఒవుడో అణ్ణాపి ఏదోసెప్పి, మల్లీ లోపలికి తీసుకెల్లాడు! ఇంకోనిమిషం అయేతలికి యంతాచ్చరం! ఆ బుల్లోడు నవ్వుతా పేలుతా ఇవటాల కొచ్చాడు. ఏంటి గురూ! ఈ సోద్దానికర్ధం? ఇంతట్లోకే, ఆ పొర్దూసరు ఫశ్యాస్తాపడి పటుదల ఒగ్గేసి శానుసు ఇత్తాం బుల్లోడా అన్నాడా?" అన్నాడు గురువులు గురుతర కుతూహలా యత్తచిత్తుడై.

గురూజీ ఒక క్షణం కళ్లు మూసుకుని ఆలోచించి, బీడిముట్టించి, ఆ చోద్యం ఏమిటో అవగతం చేసుకుని ఇలా చెప్పాడు:

"నాయనా గురువులూ, నిన్ను చూస్తే నాకు సిగ్గేస్తున్నది. నీ దుంపతెగ. ఎందుకు పనికొస్తావు. అందులో వింతేముంది. ఆ ప్రొడ్యూసరు మొదటిసారి ఆ కుర్రాడికి ఛాన్సు ఇవ్వనన్నమాటనిజమే. రెండోసారి ఇస్తానన్నమాట నిజమే. కాని ఎందుకు ఇస్తానన్నాడు? ఏమిటిస్తానన్నాడు?

విను. రెండోసారి ఆ కుర్రాడిని లోపలికి తీసుకెళ్ళినవాడు డిస్ట్రిబ్యూటరుగారి బావమరిది. వాడూ వీడూ చిన్నపుడు గోటీ ఆడుకుని ఉంటారు. అందుకని వాడు సిపార్సు చెయ్యడంతో, ప్రొడ్యూసరు బావుండదని ఛాన్సు ఇస్తానన్నాడు. అయితే ఎందులో?

నెక్స్ట్ పిక్చర్‌లో... అది వాడు తీసిన్నాడుమాట; వీడు వేసినపుడుమాట. సంగతి వాడికి తెలుసుగాని వీడికి తెలీదుగా అయినా వీడూ వాడూ ఇప్పటికి ఆనందపడ్డారు గదా. వెయ్యేళ్ళకీ అదే కావలసింది.

అయినా ఈ "నెక్స్ట పిక్చర్" అనేదాంట్లో గొప్ప మహత్యం ఉందిలే. మాజిక్కు అది. నొప్పించక తానొవ్వక తప్పించక తిరగమని ఓ పద్యంలేదూ దాని తాలూకు ట్రిక్కు ఇదన్నమాట.

ఎవరేమడిగినా సరే నెస్ట్ పిక్చర్లో తప్పకుండా ఛాన్సు ఇస్తానంటే సరిపోతుంది. ఇప్పుడు నే నున్నానా, ఇదివరకు ఇలా లేను. ఇదివరకు నేను పది 'నెస్ట్‌పిక్చర్ల'లో మరో రోల్సు, ఇంకో పదింటిలో లీడ్‌రోల్సూ, ఇంకో మూడు నెస్ట్ పిక్చర్లలో హీరో రోల్సూ వేసేవాణ్ణి. అప్పుడు నాతో ఒక అమ్మాయి కూడా ఉండేది. అది ఎనిమిది నెస్ట్ పిక్చర్లతో హీరోయినుగా ఉండేది. .తరువాత మానేసి, 'పాండీబజారునపడి', చివరకి ఇంటికెళ్ళి పోయిందనుకో. తలుచుకుంటే నా హృదయం కంపిస్తుంది. గొంతు గద్గదస్వరంతో మాట్లాడుచున్నది. అవెందుకులేగాని, అదీ కథ.

నేను నెస్ట్‌పిశ్చర్లలో వేసేటప్పుడు ఎంతమందికి కాఫీ సిగరెట్లు తెచ్చానో చెప్పలేను. ఇంకో నెస్ట్ పిచ్చరు కవి కూడా ఉండేవాడు పాపం. రాత్తిరి తెల్లవార్లూ కూచుని, ఆ పిక్చరు అసలు కవి రాసేవన్నీ వాడే రాసేసి, ఫెయిరు కాపీరాసి అడవాచాకిరీ చేసేవాడులే.

వాడు నెలకు వంద నెస్ట్‌పిశ్చర్లలో ఉండేవాడు - వాడూ, ఇంకో సొంగులవాడూను. ఇంకోటి. ఇపుడు మామూలు మనుషులున్నారు. వాళ్ళు హోర్టిష్టులు కారుగదా. మామూలు గుమాస్తాలూ వాళ్ళూను.

డబ్బు చాలదుగా.

అందుకని వాళ్లూ ఓ ట్రిక్కు కనిపెట్టారు. చాలా రోజులయిందనుకో. ఆ ట్రిక్కే 'నెస్ట్‌మంతు', తెలుగులో వచ్చేనెల అంటారు. వాళ్ళ పెళ్ళాం పిల్లలు ఒక్కటే అనుకో- 'వచ్చేనెల' బోల్డు కొత్తబట్టలు కొనుక్కుంటారు. బోల్డేసి మందులూ కూడా కొనుక్కుంటూ ఉంటారులే.

ఈ నెస్టు పిశ్చరూ, నెస్టుమంతూ మన వాళ్ళనే కాకుండా, దుర్మార్గుల్నీ టోకరాకొట్టడాని క్కూడా పనికొస్తాయి.

అప్పులవాడు వస్తాడా. నెస్టుమంతు నీ మొహాన తగలేస్తాననచ్చుగదా! నెస్టుమంతు వాడెవరో మనమెవరో.

నెస్టు పిశ్చరూ అంతే. పెద్దరికమెండషను వాడొచ్చాడనుకో. అన్నీ ఫిలప్పయి పోయాయిసార్ నెస్ట్ పిశ్చరులో తప్పకుండా ఛాన్సు ఇస్తానని ఒట్టు వెయ్యొచ్చు. వాడు జిద్దురకం అయి వదలకుండా మళ్ళీ ఎప్పుడో తగులుకుంటాడని భయంవేస్తే, మా బావమరిది నెస్టు పిశ్చరులో ఛాన్సు ఇప్పిస్తానండి అని ముందరే చెప్పెయ్యొచ్చు.

"మాది చాలా గొడవల కంపెనీ, మీకు ముందర చాలామంది ఉన్నారు. షేరుహోల్డర్లు పేచీకోర్లూ. అందుకని మా బావమరిది కొత్త కంపెనీ పెట్టి నెస్టుపిశ్చరు తీస్తాడూ. అందులో మీకు హీరోరోలు గారంటీ" అని గారంటీ యిచ్చెయ్యొచ్చు.

అందులో కూడా ఇవ్వడం ఇష్టంలేకపోతే, ఆ కంపెనీ పేరు చెప్పరు. వాడు మళ్లావస్తే, ఇది మా బావమరిదిది కాదు, ఇంకోడిదీ అనవచ్చు. అందుకని మా బావమరిది పెట్టబోయే కంపెనీ పేరు:

"ఎక్స్ ఫిలింస్"

వారు తియ్యబోయే చిత్రం పేరు,

"నెస్ట్ పిశ్చర్"

అని చెప్పాలి అది చాలా బెష్టు; లేపోతే నానారొష్టూను.

(ఆంధ్ర-వారపత్రిక - 1958)



# ఇంతకింతే అను - సత్తుబేడ

ఎక్స్ ఫిలింస్‌వారి 'నెక్స్ట్' చిత్రానికి పెద్దఎత్తున ట్రేడ్‌షో జరుగుతోంది.

చలనచిత్రకారులు యావన్మందీ విచ్చేశారు. ఇంటర్‌వెల్ వేళకి సినిమా వరండా చాలా సందడిగా ఉంది. నమస్కార బాణాలు రివ్వు రివ్వున ఎగురుతున్నాయి.

ఒకవారగా చిత్ర నిర్మాత నిలబడి ఉన్నాడు. తనకి పరిచయం ఉన్న పెద్దలను ఒక్కొక్కరినే సైగచేసి పిలుస్తున్నాడాయన.

"సార్!/బ్రదర్!/ఏమండీ!/ అంతకింత్తైంది; ఇంత కెంతవుతుంది?" అని ఒక్కొక్కరినే అడుగుతున్నాడు చేతులు పట్టుకుని.

చాలామందికి తెలియలేదు. ఆయన ప్రశ్న.

ఏది నువ్వడిగేది? పిచ్చురా. పిచ్చురు భ్రమ్మాండంగా ఉంది పొమ్మన్నారు కొందరు.

నిర్మాణానికి ఖర్చెంతయిందో ఊహించాలి కాబోలని, ఐదారు లక్షల యుంటుంది రైటేనా అన్నారు ఒకరు.

ప్రశ్న అడుగుతున్న నిర్మాతకి ఈ జవాబులు నచ్చుటంలేదు. పెదిమ చప్పరించి మరో మిత్రుడిని పిలుస్తున్నాడు.

చివరికో పెద్దమనిషి వచ్చాడు. ఆయన చేతిలో ఓ కుండ కూడా వుంది.

"మీరైనా చెప్పండి. అంతకింత్తైంది; ఇంత కెంతవుతుంది?" అన్నాడు నిర్మాత అదుర్దాగా.

ఈసారి ఈ పెద్దమనిషి తెల్లమొహం వెయ్యలేదు మిగతా వాళ్ళలా. చేతిలో వున్న కుండ నేలమీద పడేసి బద్దలుకొట్టి "గురూజీ! అంతకింతైతే అయిందిగాని, ఇంతకింతే, కుండ బద్దలుకొట్టి మాటాడ్డం నా తత్త్వం" అన్నాడు.

నిర్మాతకి ముచ్చెమటలు పోశాయి.

"అయ్యా! తమరెవరో ఫాన్సీడ్రెస్‌లో వచ్చిన మహాపురుషులు! నన్నెదిరించ గలిగిన శూరాగ్రేసరా! నీ వెవరు? నిజం చెప్పేటట్టున్న ఓ సాహసీ! నీ పేరేమి? నా పిచ్చురు మీద జోస్యం చెప్పిన ఓ శకునపక్షీ! నీ వూరెయ్యది?

"ఓ పరేంగితజ్ఞుడా! నేను అడిగిన ప్రశ్నలో నీకేమి అర్థమైంది? నీ జవాబు నేనెలా అర్థం చేసుకోవాలి?" అన్నాడు.

పెద్దమనిషి మందహాసం చేశాడు. గొంతు సవరించుకొని, వినండి అన్నాడు. అయ్యా అంతకింతైంది. ఇంతకెంత - అని మీరు ప్రశ్న వేశారు. అందులో మొదటి భాగానికి అర్థం. రెండేళ్ల క్రితం మీరు నవయువకులు. మంచి ఉద్దేశ్యాలతో, ఉత్సాహంతో పట్టుదలతో ఈ ఊరువచ్చి ఫిలిం తీశారు. చక్కని కథ తెచ్చుకున్నారు. అందరికన్న మంచి చిత్రం తీయాలని, జాగ్రత్తగా ఆలోచించి కథకి అనుగుణమైన కమామిషు ఏర్పాటుచేసి అందంగా, ఆకర్షించగల సత్తాతో ఆ చిత్రం తీశారు. అందులో అంతా చిన్న నటులే. చిన్న ఊహలే. చిన్న కథే. అయితేనేం అన్నీ కొత్తవే. అందులో బాక్సాఫీ సూత్రాళ్లు మోకాళ్ళకి బందాలుగా అడ్డుపడలేదు. బాగుండేలాతీస్తే డబ్బురాకపోదని మీ నమ్మకం. అది బాగుంది. బాగా డబ్బువచ్చింది. అంతకి నూరింతలు వచ్చింది. ఆనాటి ఇంతవారు మీరు, ఈ నాటికి యిలా ఇంత పెద్దవారయ్యారు. ఇపుడు మీ దృక్పథమే వేరు. ఆ ఫిలింకి డబ్బొచ్చిందని, ఆ ఫిలిం కథ, అందులో కమామిషు, నటులూ, పాటలూ డాన్సులూ అన్నీ యథాప్రకారం మళ్ళీ ఈ ఫిలింలో పెట్టారు ఆఖరికి ఇంటర్వెల్ కూడా అందులోలాగే సరిగా అలాటి సీను దగ్గిరే పెట్టారు. ఇవన్నీ అందులో ఉన్నందువల్ల డబ్బొచ్చింది కాబట్టి ఇవన్నీ ఎందులో ఉన్నా ఎన్నిసార్లున్నా డబ్బొస్తుందని మీ దురభిప్రాయం. ఫిలిం బాగాతీస్తే డబ్బు వస్తుందన్న మీ పాతసూత్రాన్ని తిరగేసి, డబ్బొచ్చేలాతీస్తే బాగా ఉంటుందన్న సత్యాన్ని స్థాపించుకున్నారు. ఇది సత్తు బేడకాసులాటి సత్యం. చెల్లదు. అందువల్ల నేను చెప్పే జవాబులో తాత్పర్యం ఇదే! అంతకింతైంది కాని, ఇంత కింకెంతో అవదు, ఇంత 'కింత' కూడా అవకపోవచ్చు. పాడిందే పాటరా అన్నట్లు మీరు పాతట్రిక్కులే, జనం వన్స్‌మోర్ అనకపోయినా మళ్ళీ ప్రయోగించారు గనక - ముఖ్యంగా ఈసారి మీ ఊహ సుబ్బరమైంది కాదు గనక, మొదటిసారి వూహవల్ల అంతకి యింత వచ్చినా, ఈసారిమటుకు మహా అయితే ఇంతకింతే వస్తుంది. మీరు దీనివల్ల ఎవరెస్టు శిఖరాలను అందుకోలేరు" అని గంభీరోపన్యాసం చేసేశాడు ఆ పెద్దమనిషి.

ఇది బొత్తిగా పచ్చి నిజంలా కనిపించినందువల్ల నిర్మాత భయపడి ఫక్కున నవ్వి "తమబొంద తమరికేం తెలీదు ఈ పిచ్చరు హిట్టవుతుందండి. పెద్ద హిట్టవుతుంది" అంటూ అతన్ని తిట్టేవరకూ కంట నీరు తిరిగింది.

నిజం చెప్పిన చిన్న పెద్దమనిషి చిన్న బుచ్చుకున్నాడు. తనకి అబద్ధం చెప్పే పాటి కల్చరు లేనందుకు చుట్టూ ఉన్నవాళ్ళు కూడా అతన్ని చూసి జాలిపడ్డారు.

వారం తరువాత చూడగా ఆ పిక్చరు బ్రహ్మాండమైన బాక్సాఫీస్ హిట్టయింది.

'చూశారా' అన్నాడు నిర్మాత తన పాతమిత్రుడిని బజారులో నిలేసి.

"విన్నా. సత్తుబేడలు కూడా అప్పుడప్పుడు చెల్లుతాయని నాకు తెలిసిందికాదు" అన్నాడాయన తేలికగా నాలిక కరుచుకుని.....

(ఆంధ్ర-వారపత్రిక - 1958)

## సినీచారిత్రక రమణీయం

# అమెరికన్ చలనచిత్రకళ పరిణామాల కథ

చలనచిత్రాలను ప్రప్రథమంగా కనిపెట్టిన ఖ్యాతి వివిధ దేశాలకు చెందిన పలువురు విజ్ఞానవేత్తలకు చెందుతుంది. 1824లో పీటర్ మార్క్రాగెట్ "దృష్టి నిలకడ" అనే విషయం కనిపెట్టి, ఆ విషయమై ఉపన్యసించటం ప్రారంభించాడు. దానినే పరిభాషలో "పెర్సిస్టెన్స్ ఆఫ్ విజన్" అంటారు. ఆ సిద్ధాంతంతో చలనచిత్రకళా సృష్టికి అంకురార్పణ జరిగింది. అటుపిమ్మట కొన్ని సంవత్సరాలకే బెల్జియం దేశస్థుడు జోసెఫ్ప్లాటో, ఆస్ట్రియా దేశస్థుడు సైమన్ రిటర్ వాన్స్టాంఫెర్ ఒక పళ్లానికి బొమ్మలు అతికించి, దానిని గుండ్రంగా తిప్పుతూ, బొమ్మ కదలుతున్న భ్రమ (చలనచిత్రపు "ఇల్యూజన్") కలిగించారు. ఫ్రెంచి ఖగోళ శాస్త్రవేత్త శుక్రగతిని పరిశీలించేటందుకుగాను 1874లో ఒక మోషన్ పిక్చర్ కెమెరా తయారుచేశాడు. రాగిరేకుపై వెండిపూత పూసిన ఒక గుండ్రటి పళ్లాన్ని (డాగురో టైప్) ఆ కెమెరాలో అమర్చాడు. అదే మొటమొదటగా తయారైన మోషన్ పిక్చర్ కెమెరా. 1889లో జార్జి ఈస్ట్మన్ 'ఫ్లెక్సిబుల్' ఫిల్మ్ తయారుచేశాడు. బాగా పనిచేసే మోషన్ పిక్చర్ కెమేరా అప్పటివరకూ, తయారుకాలేదనే చెప్పాలి. ముడిఫిల్మ్ తయారవటానికి పూర్వం 30 సంవత్సరాల నుంచీ ఫోటోగ్రాఫిక్ ప్లేట్ల మీదా, చివరకు 'డాగురోటైప్' యొక్క వెండిపూతమీదా చలనచిత్రం ఫోటోగ్రాఫ్ తీయటానికి ఎన్నో ప్రయత్నాలు జరిగాయి. అమెరికా దేశస్థుడు కాల్మన్ సెల్లర్స్ 1860, 1861వ సంవత్సరాల్లో తన భార్యా పిల్లల ఫోటోగ్రాఫులు వరసగా తీసి, వాటి కాపీలను ఒక చక్రానికి చుట్టూ అంటించి స్టీరియోస్కోప్ లెన్సస్ వెనుక ప్రక్కగా ఆ చక్రం తిప్పాడు. ప్రతి దృశ్యాన్ని రెండు లెన్సులు ఉపయోగించి ఒకే సమయంలో ఫోటోతీసి, మూడు కొల్తలలో చలనచిత్రం (పొడుగు, వెడల్పు, లోతు) చూపించే (త్రీ డైమెన్షనల్ ఫిలిం) విధానానికి ఆయన మార్గదర్శకుడయాడు. పది సంవత్సరాలైన తర్వాత ఫిలడెల్ఫియా నగరనివాసి హెన్రిరెనో హేల్ గాజుపళ్లానికి ఫోటోలు అంటించి, 1600 మంది ప్రేక్షకులకు తొలిసారిగా 'చలన చిత్రాన్ని' ప్రదర్శించాడు.

గాజు పళ్లాలపై బొమ్మలు అంటించి చలనచిత్రంగా ప్రదర్శించటంలో ప్రఖ్యాతిగాంచిన వ్యక్తి ఎడ్వర్డ్ మూబ్రిడ్జి. గుర్రం స్వారి చేస్తున్నప్పుడు నాలుగు కాళ్లు


మూబ్రిడ్జ్

ఒకేసారి ఎత్తి పరిగెడుతుందని లీలాండ్ స్టాన్‌ఫోర్ తన స్నేహితుల్లో ఒకరితో పందెం వేశాడు. స్టాన్ ఫోర్డ్ విశ్వవిద్యాలయం స్థాపించిన వ్యక్తి ఆయనే. పందెం వేశాడన్న మాటేగాని దానిని నిరూపించడమెలాగా అన్న విషమ సమస్యలో పడ్డాడు. మూబ్రిడ్జిని ఆశ్రయించి తన పందెం సంగతి వివరించి, "నిరూపించగలవా?" అని అడిగాడు. "ఓ, భేషుగ్గా" అని మూబ్రిడ్జి స్టాన్‌ఫోర్డ్‌కు సమాధానమిచ్చాడు.

గుర్రం స్వారిచేసే బాటప్రక్కను అక్కడక్కడ కెమెరాలు ఏర్పాటుచేసి ఫోటోలు తీసి, మొత్తం మీద స్టాన్‌ఫోర్డ్ చెప్పినది నిజమని నిరూపించాడు. స్టాన్‌ఫోర్డ్ సంతోషానికి అంతులేదు. కెమెరాల ద్వారా జంతువుల పరుగును బాగా కనిపెట్టవచ్చుననే ఆ భావాన్ని, ఉపాయాన్ని మూబ్రిడ్జి కొంత పైకానికి విక్రయించాడు. మూబ్రిడ్జి ఉపాయం ఇది: గుర్రం పరిగెత్తుతున్న బాటప్రక్కన సమానదూరంలో 24 కెమెరాలు ఉంచి, గుర్రం ఒక్కొక్క కెమెరా ముందు పరిగెత్తేటప్పుడు, వాటి షటర్లు యాంత్రికంగా తెరచుకొని తిరిగి మూసుకొనే ఏర్పాటు చేశాడు. 1880వ సంవత్సరంలో ఆయన గాజుపళ్లెం పద్ధతిలో ఆ ఫోటోగ్రాఫులన్నిటిని శాన్ ఫ్రాన్సిస్కోలో చలనచిత్రంగా ప్రదర్శించాడు.

మూబ్రిడ్జికీ, థామస్ ఎ. ఎడిసన్‌కీ మధ్య గడిచిన కాలంలో ఎంతో మంది పరిశోధకులు వివిధ రకాలైన ప్రయోగాలు చేసి పరిశోధనలు జరుపుతూనే వచ్చారు. వారిలో చాలామంది ఫ్రెంచివారూ ఇంగ్లీషువారూను. శాస్త్రవేత్తల నుంచి, చలనచిత్ర ప్రదర్శకుల వరకూ ఆ పరిశోధనలు జరుపుతూనే వచ్చారు.

ఫోనోగ్రాఫ్‌ను, ఎలెక్ట్రిక్ బల్బును కనిపెట్టి జగత్ప్రసిద్ధుడైన ఎడిసన్, 1887లోనే సినిమా విషయమై పరిశోధనలు ప్రారంభించాడు. తాను కనిపెట్టిన ఫోనోగ్రాఫ్‌ను (గ్రామఫోను) చలనచిత్రాల ద్వారా వివరించి చెప్పాలనే లక్ష్యంతో ఆయన ఆ పరిశోధనలకు పూనుకొన్నాడు.

## మొదటి టాకీచిత్రం

ఆయన 1889లో యూరప్ పర్యటన ముగించుకొని తిరిగి వచ్చేసరికి ఆయన అసిస్టెంట్ డబ్ల్యు. ఎల్. కె. డిక్సన్ మొట్టమొదటి టాకీచిత్రాన్ని తెరపై చూపించాడు.

1891 నుంచి 1895 వరకూ ఎడిసన్ యాభైఅడుగుల నిడివిగల చిన్న చిన్న చిత్రాలు తయారుచేశాడు. కళ్లకు దగ్గరగా పెట్టుకొని చూచే 'కైనెటోస్కోప్' ద్వారానే వాటిని చూడటానికి వీలయింది. 1895లో అన్ని హంగులు కలిగిన కెమెరాను ఎడిసన్ నిర్మించాడు. ఆ చలనచిత్ర నిర్మాణ విధానాలను విదేశాల్లో డబ్బు ఖర్చుపెట్టి పేటెంట్ చేయించటం కేవలం వృథాశ్రమ అని ఊరుకొన్నాడు. "అమెరికాలో మహా అయితే పది ప్రొజెక్టర్ల కంటే అవసరం ఉండదు" అనే ఉద్దేశ్యంతో, ప్రొజెక్టర్లు భారీఎత్తున నిర్మించటానికి ఎడిసన్ పూనుకోలేదు.


డబ్ల్యు.ఎల్.కె. డిక్సన్

1894వ సంవత్సరం ఏప్రిల్ 14వ తారీకున న్యూయార్క్‌లో తొలిసారిగా కైనెటోస్కోపుల ద్వారా చలనచిత్రం ప్రదర్శించాడు - ఎడిసన్. అలాగాక, తెరమీద చలనచిత్రాలను ప్రొజెక్టు చేయటం లాభసాటిగా ఉంటుందని, ఎడిసన్ భాగస్వాములందరూ అభిప్రాయపడ్డారు.

సరిగ్గా రెండు సంవత్సరాలైన తర్వాత కోసర్ అండ్ బైల్ మ్యూజిక్ హాలులో "ఎడిసన్ విటాస్కోప్" ద్వారా వెండి తెరమీద చలనచిత్రాలు ప్రదర్శింపబడ్డాయి. న్యాయంగా ఆలోచిస్తే ఆ ప్రొజెక్టరును కనిపెట్టింది థామస్ ఆర్మాట్. ఆయన వాషింగ్టన్ నగరంలో పరిశోధనలు చేస్తూండేవాడు. కైనెటోస్కోప్ యొక్క డిస్ట్రిబ్యూటర్ల కృషినీ, వాటి ద్వారా ప్రదర్శితమౌతున్న చలనచిత్రాలను ఆర్మాట్ చూసి ముగ్ధుడై, తాను కనిపెట్టిన ప్రొజెక్టరుపై ఎడిసన్ పేరు వేసుకొని నిర్మించుకొనేటందుకు అనుమతినిచ్చాడు.

## ప్రొజెక్టర్లు

ఆలోపుగా అమెరికాలోని పరిశోధకుల్లో మరికొందరు కూడా ప్రొజెక్టర్లు కనిపెట్టారు. ఉదాహరణకు ఒకరి సంగతి చెబుతాను. 1894వ సంవత్సరం ఫిబ్రవరిలో న్యూయార్క్ నగరంలో జీనీ అక్మీలీరాయ్ కొంతమంది ముఖ్యులకు ప్రయోగపూర్వకంగా ఒక ప్రొజెక్టరును ప్రదర్శించాడు. ఒక సంవత్సరం గడిచిన తర్వాత అమెరికాలో అనేక నగరాల్లో బహిరంగ ప్రదర్శనలు ఇచ్చాడు. అమెరికాలోనూ, యూరప్‌లోనూ చాలామంది కెమెరాలనూ, ప్రొజెక్టర్లనూ నిర్మించారు కానీ ఎడిసన్, ఆర్మాట్, లూమీర్ తయారుచేసినవాటి అంతస్తు అందుకోలేకపోయారు.



థామస్ ఆల్వా ఎడిసన్, లూమీర్ బ్రదర్స్

## ముడిఫిల్మ్

ఎడిసన్ అన్ని విధాలా గొప్పదైన కెమెరా నిర్మించటమేగాక, అందరూ అనుసరించే రీతిగా వెడల్పు నిర్ణయించి ముడిఫిలిం తయారుచేశాడు. ఫిలిం వెడల్పు 35 మిల్లీమీటర్లు ఉంటే బాగుంటుందని, దాని ప్రకారం కెమెరాలు, ప్రొజెక్టర్లూ, ఎడిటింగ్ పరికరాలు తయారుచేయడం మంచిదని ఆయన ప్రకటించాడు. అదే కొలత 60 సంవత్సరాల నుంచీ అమలులో ఉన్నది. ఆ విధంగా ఎడిసన్ ఫిల్మ్ రంగానికి అపారమైన సేవ చేశారని చెప్పవచ్చును. న్యూయార్క్‌కు కొన్ని మైళ్ళ దూరాన ఎడిసన్ ఒక స్టూడియో తయారుచేశాడు. దానికి చక్రాలు తగిలించాడు. వర్తులాకారంలో రైలుపట్టాలు వేసి, వాటి మీద ఆ స్టూడియోను ఎక్కించి నటీనటుల ముఖాన సూర్యరశ్మి అన్ని వేళలాపడేటట్టు దానిని పట్టాల మీద గుండ్రంగా త్రిప్పుతూండేవాడు. దానిని నల్లతారు పూత పూసిన కాగితంతో కప్పేసి "బ్లాక్ మేరియా" అని పేరు పెట్టాడు. కళ్లకు దగ్గరగా పెట్టుకొని చూచే కైనెటోస్కోపుల ద్వారా, తాను వందలాదిగా తయారుచేసిన చిన్న చిన్న చిత్రాలను ప్రదర్శించాడు.




35 మిల్లీమీటర్లు వెడల్పు గల ఫిల్మ్ యొక్క ప్రతి 'ఫ్రేము'కు నాలుగు స్ప్రాకెట్ కంతలను (చక్రాలమీద పట్టు తప్పకుండా నడవడానికి గాడి) ఏర్పాటుచేసింది కూడా ఎడిసనే. అందుచేత ఆయన నిర్మించిన చిత్రాలు ప్రదర్శించేటందుకు తగిన ప్రొజెక్టరను, అమెరికాలో యూరప్‌లో చాలామంది తయారుచేశారు. ఎడిసిన్


జాక్ వార్నర్, స్టూడియో ఇన్‌చార్జి

నిర్ణయించిన ఫిల్మ్ వెడల్పునే - అంటే 35 మిల్లీమీటర్లనే, లూమీర్ కూడా అనుసరించాడు. కాని ఒక్కొక్క ఫ్రేమ్‌కూ ఒక్కొక్క స్ప్రాకెట్ కంతచొప్పున ఉంటే చాలుననుకొన్నాడు. కాని కొన్నాళ్లకు ఎడిసన్ పద్ధతిని నాలుగు కంతలుంటేనే ఎక్కువ సుళువని గ్రహించి, దానినే అనుసరించాడు.

## వార్నర్ బ్రదర్సు

ఇరవయ్యో శతాబ్దం ఉదయించింది. యంత్రాల్లో ఏమీ మార్పులు కనిపించలేదు, చివరకు 1926వ సంవత్సరంలో వార్నర్ బ్రదర్స్ టాకీయుగ వైతాళికులయారు. ఫిలిం ప్రొజెక్టరునూ, ఫోనోగ్రాఫ్ రికార్డింగ్‌ను ముడిపెట్టి "ఇంటర్ - లాక్" విధానంలో టాకీ చిత్రాలు ప్రదర్శించారు. అది మూవీ, టాకీ యుగాల సంధికాలం. విటాఫోన్ పద్ధతి పాతదనే చెప్పొచ్చు. ఎందుకంటే 1889-1914 సంవత్సరాల మధ్య ఎడిసన్, టాకీ విషయమై అనేక ప్రయోగాలు చేశాడు. 1900 సంవత్సరంలో పారిస్‌లో మూడు ప్రదర్శనలు కూడా ఇచ్చాడు. పెద్ద పెద్ద థియేటర్లలో టాకీ ప్రదర్శనలు ఇవ్వటానికి శబ్దం యొక్క శ్రవ్యత హెచ్చించాలి. అది ఎలక్ట్రానిక్ పరికరాలద్వారా గాని సాధ్యంకాదు. అవి 1906వ సంవత్సరంలో


గ్రేట్ ట్రైన్ రాబరీ

లీ.డి.ఫారెస్ట్ కనిపెట్టిన వాక్యూమ్ ట్యూబ్ విధానం మీద ఆధారపడి ఉన్నాయి. కాని వాటి విషయమై 15 సంవత్సరాలవరకూ తగిన అభివృద్ధి జరగలేదు. రికాడర్లకంటే, ఫిల్మ్ మీదనే శబ్దాన్ని రికార్డు చేసి ప్రదర్శిస్తే అత్యుత్తమంగా ఉంటుందని నిరూపింపబడింది. అంతటితో 'విటాఫోన్' పూర్తిగా పాతబడి, ప్రొజెక్షన్ కాబిన్ల దగ్గర సెలవు తీసుకున్నది.

"గ్రేట్ ట్రెయిన్ రాబరీ"లోని కథా విధానంతో ఎడ్విన్ ఎస్. పోర్టర్‌కు ప్రపంచ ఖ్యాతి వచ్చింది. అలాంటి ఖ్యాతి సంపాదించిన ప్రప్రథమ అమెరికన్ ఆయనే. ఆ రోజుల్లో అమెరికన్ పోలీసు, కౌబాయ్, ఫ్యాక్టరీ వర్కర్, వ్యవసాయదారుడు, పల్లెటూరి పిల్ల, దొంగ, దుకాణదారు – పాత్రలు ప్రాధాన్యం వహించే చిత్రాలు తీసేవారు.


ఎడ్విన్ ఎస్. పోర్టర్

## సీరియల్ చిత్రం!

1909లో అమెరికాలో ఒక గంటసేపు ప్రదర్శించేటందుకు వీలైన "ది లైఫ్ ఆఫ్ మోజెస్" అనే చిత్రం నిర్మించారు. అంతనిడివిగల చిత్రం అప్పటివరకూ ఏ ఇతర దేశంలోనూ నిర్మింపబడకపోవడంచేత, ఆ ఖ్యాతి అమెరికాకు దక్కింది. కాని ఆ చిత్రం ఒక్కసారి కూడా ప్రదర్శింపబడలేదు. ఎందుచేతనంటే ఆ చిత్రం డిస్ట్రిబ్యూట్ చేసే వ్యక్తి చాలా పిరికివాడవటంవల్ల, ఆ పిక్చర్‌ను ప్రజలు ఆదరిస్తారో లేదో అన్న భయంతో, వారానికి ఒక్క రీలు చొప్పున, సీరియల్‌గా విడుదల చేశాడు. 1912లో ఫ్రాన్స్‌లోనూ, ఇటలీలోనూ పూర్తి నిడివిగల చిత్రాలను ప్రజలందరూ ఒకేసారి చూచేటందుకు వీలుగా విడుదల చేయసాగారు. ఆ రోజుల్లో అది సాహసకృత్యమే అనాలి. ఆ చిత్రాలు:–

సారా బెరన్‌హార్ట్ నటించిన 4 రీళ్ళ చిత్రం – "క్వీన్ ఎలిజబెత్"; బ్రహ్మాండమైన సెట్టింగులూ, వందలాది నటీనటులతో తయారుచేయబడిన "ది లాస్ట్ డేస్ ఆఫ్ పాంపె", "కోవాడిస్."

'ఫేమస్ ప్లేయర్స్' సంస్థను నెలకొల్పిన అడాల్ఫ్ జూకర్, 1913వ సంవత్సరంలో "క్వీన్ ఎలిజబెత్" చిత్రం దిగుమతిచేసి అమెరికాలో తొలిసారిగా ఫీచర్ ఫిల్ములు ప్రదర్శనం ఆరంభించాడు. ఆయనే తర్వాత పారమౌంట్ పిక్చర్స్‌కు ప్రెసిడెంట్ పదవి నిర్వహించాడు. అదే సంవత్సరంలో ఆయన "ది ప్రిజనర్ ఆఫ్ జెండా" అనే చిత్రం నిర్మించారు. అది కూడా 4 రీళ్ళ చిత్రమే. ఆరు రీళ్ళ చిత్రమైన "ది ట్రాఫిక్ ఇన్ సోల్స్"ను జార్జిలోన్స్ టూకర్ డైరెక్ట్ చేశాడు. ఏడురీళ్లలో నిర్మింపబడిన "ది సీ వుల్ఫ్" అనే చిత్రాన్ని హొబర్ట్ బాస్వర్త్ నిర్మించి, దానిలో

ప్రధానభూమిక ధరించాడు కూడాను. 1914 నాటికి చాలామంది ఫీచర్ చిత్రాలను నిర్మించటంలో నిమగ్నులైనారు. మూడువేలమంది ప్రేక్షకులకు తావుగల న్యూయార్క్‌లోని స్ట్రాండ్ థియేటర్ ఫిల్మ్ థియేటర్‌గా మారిపోయింది, ప్రతి ఆటకు ఆ థియేటర్ ప్రేక్షకులతో క్రిక్కిరిసిపోయేది. డి. డబ్ల్యు, గ్రిఫిత్, థామస్ ఇన్స్ ప్రథమశ్రేణి దర్శకులుగా పేరి ప్రఖ్యాతులు సంపాదించారు. ఇన్స్ డైరెక్టు చేసిన ఉత్తమ చిత్రాలు "సివిలైజేషన్" "ది రాత్ ఆఫ్ ది గాడ్స్," "ది కవర్డ్" మొదలైనవి.

కొన్నింటిలో డబ్ల్యు. ఎస్. హార్ట్ నటన అద్వితీయంగా ఉంది. డైరెక్టర్లు, రచయితలు చేసే పనిమీద "పర్యవేక్షణ" విధానాన్ని ఆయనే తొలిసారిగా ప్రవేశపెట్టింది. కథా విధానం, ఎడిటింగ్‌ల పట్ల ఆయన అత్యంత శ్రద్ధాసక్తులతో పనిచేసేవాడు. హాలీవుడ్‌లో టాకీయుగం ప్రారంభమైన తర్వాత, సంభాషణల ద్వారా వివిధ పాత్రలను అత్యద్భుతంగా పోషించటానికి ఇంకా వీలుకలిగింది. శబ్దం అంటూ లేకపోయినట్లయితే "గాన్ విత్ ది విండ్," "ఆల్ క్వయిట్ ఆన్ ది వెస్ట్రన్ ఫ్రంట్," "సిటిజన్ కేన్," "ది బెస్ట్ ఇయర్స్ ఆఫ్ అవర్ లైవ్స్," "ది గ్లాస్ మానేజరీ," "జూలియస్ సీజర్," "మార్టీ", "జయింట్" మొదలైన కళాఖండాలు వచ్చి ఉండేవికావు.

## హాలీవుడ్ ఆర్థికమాంద్యం

1952-53లో హాలివుడ్‌లో ఆర్థికమాంద్యంవల్ల కెమెరాల్లో, ప్రొజెక్టర్లలో మాత్రమే మార్పులు తేగలిగారు. టెలివిజన్ పోటీమూలంగా థియేటర్ల వ్యాపారం కొంతవరకు కుంటుపడింది. అలాంటి పరిస్థితుల్లో "దిస్ ఈజ్ సినేరమా" "బ్వానాడెవిల్" చిత్రాలు బ్రహ్మాండంగా జయప్రదమైనాయి. దానితో విశాలమైన 'సినేరమా' 'విస్టావిజన్' 'వైడ్ స్క్రీన్', 'సినిమాస్కోప్', తెరల వైపు, త్రీ - డైమన్షన్ చిత్రాల వైపూ హాలీవుడ్ నిర్మాతలందరూ మొగ్గుచూపారు. టెలివిజన్‌లో 'చిన్న తెర' ద్వారా చూచే ప్రేక్షకులకు, ఈ నూతన చిత్రాలు కన్నుల పండువుగా తోచాయి. "ట్వెంటియత్ - సెంచరీ ఫాక్స్" సంస్థ తమ చిత్రాలనన్నింటినీ 'సినిమాస్కోప్'లో నిర్మింపసాగారు. అదే విధంగా పారమౌంట్ సంస్థ 'విస్టావిజన్'లో - అంటే అంతకుముందు నిర్మించిన చిత్రాలకంటే ఎత్తుగానూ వెడల్పుగానూ కనిపించేలాగ - చిత్రాలు నిర్మింపసాగారు.

నిజానికి ఈ నూతన విధానం 15 నుంచి 58 సంవత్సరాలకు పూర్వమే కనిపెట్టబడినదని చెప్పొచ్చు. సినేరమా మూలసూత్రాన్ని 1938లోనే ఫ్రెవ్యాలర్ కనిపెట్టాడు. 1900లో పారిస్ నగరంలో జరిగిన ఒక సంతలో రెండు 'సినేరమా' తెరలు ఎదురు బొదురుగా నిలబెట్టితే ఎలా ఉంటుందో- అంటే వర్తులాకారంగా ఉండే తెరమీద "సినియోరమా" అనే పేరుతో చలనచిత్రం ప్రదర్శించారు. 1920లో ఎనాగ్లి విధానంలో త్రీడైమన్షన్ చిత్రాలు నిర్మించబడ్డాయి. 1935లో చౌకరకం ఫిల్టర్లు ఉపయోగించి ఎమ్. హెచ్. ల్యాండ్ అమెరికాలో బహుప్రఖ్యాతమైన 3-డి

చిత్రాలను ప్రదర్శించారు. ఫ్రెంచి శాస్త్రవేత్త క్రేషియన్, అమెరికన్ శాస్త్రవేత్త సిడ్నీ న్యూకమర్ హాలీవుడ్‌లో సినిమాస్కోప్ తొలిసారిగా ప్రవేశపెట్టారు. 1920లోనే విస్తావిజన్ కనిపెట్టబడింది. కెమెరాలో ఫిల్మ్‌ను అడ్డంగా పరుగెత్తించి సాధారణంగా 33 మిల్లిమీటర్ల ఛాయా చిత్రానికి రెట్టింపు పెద్దదిగాపడే చిత్రాన్ని తయారుచేసే విధానాన్ని అమెరికన్ పరిశోధకుడు ఇ. డబ్ల్యు. క్లార్క్ పేటెంట్ చేయించాడు.

1929, 1930లో అమెరికన్ ఆప్టికల్ పరికరాలు వినియోగించి, మామూలు తెరలకంటె రెట్టింపు వైశాల్యం గల తెరలపై ప్రదర్శించేటందుకు తగిన చిత్రాలు నిర్మించ ప్రారంభించారు. కాని 1929లో కలిగిన ఆర్థికమాంద్యం మూలంగా ఫాక్స్, తదితర నిర్మాతలూ ప్రారంభించిన భారీచిత్రాల నిర్మాణం నిలుపుదల చేయవలసి వచ్చింది. అలా కాకపోయిన పక్షంలో, అమెరికాలో వైడ్‌స్క్రీన్ చిత్రాల నిర్మాణం పాతికేళ్ళ క్రితమే ఆరంభమై ఉండేది.

ఎడిసన్ కనిపెట్టిన 'పీప్‌షో', పోర్టర్ నిర్మించిన "ది గ్రేట్ ట్రెయిన్ రాబరీ" రోజుల నుంచీ, హాలీవుడ్ చిత్రాలు సాంకేతికంగానూ, కళాత్మకంగానూ, పురోగమిస్తూ వచ్చాయి. టెక్నికలర్ ప్రాసెస్‌తో బహు వర్ణచిత్రాలు మనం తిలకించగలుగుతున్నాము. ఈస్టమన్, అన్స్కో (జర్మన్ ఆగ్ఫానుంచి ఉత్పన్నమైంది) నెగటివ్ ప్రాసెస్ విధానంవల్ల కూడా టెక్నికలర్ చిత్రాలు తయారవుతున్నాయి. 1945 నుంచి ఇంగ్లండ్, ఫ్రాన్సు, ఇటలీ దేశాలు నిర్మిస్తున్న కళాఖండాలవల్ల హాలీవుడ్ నిర్మాతలు ఉత్తేజితులై నవలలు, నాటకాలు మొదలైనవాటి అనువృత్తాలనూ, సరిక్రొత్త కల్పనాసాహిత్యాన్నీ తెరమీదకు మహత్తర చిత్రాల రూపంలో ఎక్కించసాగారు.

హాలీవుడ్ నిర్మాతలు వారి యూనిట్లలో కొన్నింటిని ఇతర దేశాలకు పంపి అక్కడి వాతావరణంలో చిత్రాలు షూట్ చేయటంవల్ల అవి అందంగానూ, వాస్తవికంగానూ కనిపిస్తాయి.

ప్రస్తుతం హాలీవుడ్‌లో తయారవుతున్న చిత్రాల్లో సైలంట్ ఫిల్ముల్లోని నటన, వేగమూ; టాకీల్లోని సంభాషణలు, సంగీత కృషీ సమ్మిళతమై ప్రేక్షకులకు విజ్ఞానం, వినోదం వెదచల్లే కళాఖండాలుగా జగద్విఖ్యాతి గాంచుతున్నాయి.

(ఆంధ్ర-వారపత్రిక - 1959)

# సమీక్షా రమణీయం (తెలుగు)

# బాలనాగమ్మ



కాలం నాడు జనం విరగబడి చూసిన చిత్రాలను మళ్ళీ కొన్నాళ్ళకి తీసినపుడు- ఉత్తరాదినా ఇందమ్మటా కూడా సెన్సారు సర్టిఫికెట్టు మీద తారీకు తప్ప విడిచి కొత్తదేదీ ఉండదనీ, ప్రొడక్షన్స్ ఖర్చు తప్పవిడచి పెరిగేదేదీ ఉండదనీ ఈ తరహా చిత్రాలు చూచినపుడు తరుచుగా అనిపి స్తుందన్న మాట – తరుచు వినిపిస్తూనే ఉంటుంది. శ్రీ వెంకటరమణా వారి కొత్త 'బాలనాగమ్మ' చిత్రంలో మొదటి అరగంటా ఇంచుమించు ఈ మాటే అనిపిస్తుంది. పాత బాలనాగమ్మకన్నా ఇదేం బావుందని కూడా అనిపిస్తుంది – పాతవాటి మీద అభిమానం ఎక్కువ వుండేవారికి. ఇలా అనుకుంటున్న వారందరూ ఆ అరగంట తరవాతా, తెరమీద మాయల మరాటీ కనబడ్డ ఐదు నిమిషాలకల్లా అభిప్రాయం మార్చుకుంటారు – ఇన్నాళ్ళకి ఇంకొకళ్ళు తిరిగి ఈ కథను తీసినందుకు. ఈ కృషిని సమర్థించి హర్షించతగ్గ విధంగా మిగతా చిత్రాన్ని దర్శకుడు రాఘవయ్య, రచయిత సముద్రాల జూనియర్, నటుడు రంగారావు తీర్చిదిద్దారు.

జెమినీ వారి 'బాలనాగమ్మ', అందులో మరాటి డా॥ గోవిందరాజు సుబ్బారావు, ఆనాడు ప్రేక్షకుడి గుండె ఝల్లుమనిపింపచేయడం జరిగింది. ఈ రోజున అందుకు భిన్నమైన రీతిన సరికొత్త శిల్పంగా మలచిన కొత్త మరాటీ పది నిముషాలలో మనకి ఆహ్లాదం కలిగించి, గౌరవాభిమానాలు చూరగొంటాడు. ఈ మరాటీ విద్వాంసుడు సంగీత ప్రియుడు, రసికుడు, బహుసరసుడు, లోకంలో అందాలన్నింటినీ కనీవినీ అనుభవించి ఆనందించడం అతని మతం. మానవుడిలోని

సౌందర్యాభిరుచికీ మోహానికీ అతడు రూపకల్పన. సిద్ధులు గడించి ఇంచుమించు చిరంజీవి అయి శతాబ్దాల మీదుగా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ జరా మృత్యువులకు అతీతుడై నిత్యయౌవనుడై ప్రవర్తిస్తున్నాడు. అజేయుడైన ఆ సిద్ధుడికి అపజయం కలిగించినది పతివ్రతల జోలికి పోవాలన్న బుద్ధి. అంత యోగ్యుడికి మద్యంవల్ల దేహానికీ మోహంవల్ల బుద్ధికీ మైకం కమ్మి అతడు పతనం చెందడం అనేది హృద్యంగా కట్టుదిట్టంగా చిత్రించడంవల్ల ఈ చిత్రానికి ఒక విశిష్టత, కొత్తదనం అమరాయి.



పాపానికి వడిగట్టినా మరాటీమీద మనకు కోపంకన్న జాలి, సానుభూతి కలుగుతాయి. మరాటీ చనిపోవడం కూడా హుందాగా దర్జాగా ఒప్పింది. ఈ విధంగా ఇంత నిండుగా ఎత్తుగా నిర్మించిన పాత్ర పక్కన నటుడు రంగారావు అంత దర్జాగానూ నిలబడి దానిని సమర్థుడి సౌలభ్యంతో, చాతుర్యంతో నడిపాడు. రచయిత సముద్రాల జూనియర్ అందుకు తగ్గస్థాయిలో చక్కని సంభాషణలు సమకూర్చగలిగాడు. చాలా కాలానికి తొలిసారిగా ఒక జానపద చిత్రంలో అర్థం, అందం సమకూరిన ఒక పాత్ర దర్శనం ఇచ్చింది.

మిగతా బాలనాగమ్మ కథా కమామిషూ, పాతివ్రత్యమహాత్మ్యమూ, సవతితల్లి పిల్లల్ని బాధించుట, సీయస్సార్ రాజుగా నటించుట, కుటుంబరావు చాకలి తిప్పడుగానూ పూర్వం తిప్పడి వేషం వేసిన లంక సత్యం ఆనాటి ముచ్చటలు నెమరువేసుకుంటూ రాజుగానూ అభినయించుటా ఉన్నాయి. తలారి రాముడుగా రేలంగి హుషారుగా నటించాడు. మాటలతోటీ మనుషులతోటీ కూడా ఆయన హాయిగా ఆడుకుని మనని ఆనందపరచాడు.

చిత్రాన్ని ఎన్. టి. రామారావు, రాజసులోచన ప్రభృతులతో అలంకరించారు. రామారావుకు అంతకుమించిన అవకాశం ఇందులో లేదు. సంగుగా నటించిన రాజసులోచన ఏ కాశ్మీరీనో అనుకుంటే, ఆమె తెలుగు మనని బాధించదు, సరికదా అలరిస్తుంది. బాలనాగమ్మగా అంజలీదేవి పాత్ర, పాతకథా ప్రకారంగానే ఉంది. యధాప్రకారం ఆమె యథోచితంగా నటించింది.

సెట్‌లు చాలా పెద్దవీ, అందమైనవీ, కానివీ, మరాటీ గుహలో భయంకరమైనవీ చాలా ఉన్నాయి. మరాటీ విలాసమందిరం రమణీయంగా ఉంది. ఛాయాగ్రహణం; మాయాఛాయాగ్రహణం కూడా బాగున్నాయి.

అందరికీ తెలిసిన కధ. కాబట్టి కథనశిల్పం మరికొంత కట్టుదిట్టంగా ఉంటే బాగుండుననిపించింది. క్రూరంగారావును మించి రాణించిన శృంగారంగారావు తరవాత, అంతబాగున్న మరో అంశం సంగీతం. ఒకటి పాత బాలనాగమ్మలోదే (రాజేశ్వరరావు చేసినది) వినిపించారు. మిగతావి కొత్తవి. దాదాపు అన్నీ బాగున్నాయి. కొత్తగానూ ఉన్నాయి, హిందూస్థానీ బాణీలో రాజసులోచన చక్కని నృత్యానికి ఆలంబనంగా సుశీల పాడిన ఆనందము ఆనందమూ అనే పాట మనోహరంగా ఉంది. ఆ పాట చిత్రణ కూడా పాట అంత అందంగా నేత్రపర్వంగా ఉంది. మరి రెండు జోలపాటలు కూడా హాయిగా ఉన్నాయి. సంగీత దర్శకుడు టి.వి. రాజు కొత్త బాణీలను చక్కని వాద్యసమ్మేళనంతో వినిపించినందుకు అభినందనీయుడు.

మొత్తంమీద ఆరంభంలోనూ మధ్యన ఒకటి రెండు చోట్లా ఓ మోస్తరుగా నేలబారుగా ఉన్నా చాలవరకు కొత్తగా వినోదకరంగా ఉన్న ఈ చిత్రం సకుటుంబంగా చూడతగినది.

*(ఆంధ్ర-వారపత్రిక - 1959)*

బాలనాగమ్మ సినిమా బాగా హిట్ అయింది హీరో హీరోయిన్లతో బాటు రంగారావు పాత్రకూ మంచి పేరు వచ్చింది.

# భాగ్యరేఖ



"

మంచం పట్టిన రవి మ మామూలు మనిషి ఎలా అయ్యాడు?"

ఎలాగ అయినా మళ్ళీ మామూలు మనిషే అవుతాడు. అవడానికేం సందేహం లేదు.

అసలు తెలుగు చిత్రాలలో నాయకుడు చిరంజీవి రవికి ఎప్పుడూ ఢోకా ఉండదు.

మతిపోవడం వంటివి జరిగినపుడు, ఊచిపుచ్చుకు చెంపకాయ కొడితే స్మృతి రావచ్చు. అతగాడు నిలుచున్న చోటుకు కాస్త అసింటా పిడుగుపడితే రావచ్చు, లేదా బుడగ పేలినా రావచ్చు. ఇంకేదేనా కారణం కావచ్చు.

పొన్నలూరి వారి "భాగ్యరేఖ" చిత్రంలో ఇక వ్యవధి లేకపోవడం ఒక కారణం అయింది. మరో కారణం, ప్రియురాలు దూకుడుగా వచ్చి పక్క గదిలో ఉన్న తిరుపతి వెంకటేశ్వరస్వామిని నిలవేసి, "ఏమయ్యా స్వామీ నువ్విపుడైనా (18 రీళ్ళు అయ్యాక) ఆదుకునేట్టా లేనట్టా?" అంటూ ఉరిమిచూసి దులిపెయ్యడం.

మొత్తానికి రవి మేలుకున్నాడు. తరవాత కోలుకున్నాడట.

అసలు అతడు మరో విధంగా ప్రవర్తించడానికి వీలులేదు. ఎందుకంటే, అతగాడి ప్రియురాలు లక్ష్మికి అరచేతిలో జెర్రిపోతులాటి భాగ్యరేఖ ఉందిట. దాని ప్రకారం ఆమె కోటికి పడగెత్తిన ఇంటి కోడలు కావలసి ఉంది. ఈ ఏర్పాట్లు సక్రమంగా జరగడానికి మతిభ్రమించిన రవి బతికి బట్టకట్టక తప్పదు.

"భాగ్యరేఖ" చిత్రకథ అంతా ఈ సూత్రం అడుగుజాడలలో నడచింది.

తల్లీ, తండ్రీ, ఐశ్వర్యం, ఆఖరికి నోట్లో నాలికా కూడా లేని అనాథ బాలిక లక్ష్మి, పినతల్లి ఇంట నానా అవస్థలూ పడుతూ పెరుగుతుంది.

అది తెలిసిన తరవాత అమె ముసలి తాత ముసలయ్యే ఆమెను వెంట తీసుకుపోయి పెళ్లీడు వచ్చేదాకా పెంచి, పెళ్లి చెయ్యకుండా హరీమంటాడు.

లక్ష్మి మళ్ళీ పినతల్లి ఇంటికి వచ్చి, కొన్నాళ్ళవస్థలుపడి, ఒక రోజున తన బట్టా పాతా ఓ కాన్వాస్ సంచిలో వేసుకుని తిరుపతి వెళ్తుంది. అక్కడ జీవిత రేఖని చెరిపి వేయబోయిన వేళ, భాగ్యరేఖ కలగచేసుకుని అడ్డుపడుతుంది.

తరవాత లక్ష్మి, తను కోడలు కావలసిన కోటీశ్వరుడి ఇంట ఆశ్రయం సంపాదిస్తుంది. ఆ యింటి బిడ్డడు రవి ఆమెను వరిస్తాడు. సిరి కూడా వరించేలోగా, కథ అడ్డం తిరిగింది. జలతారు చీరగట్టి వారం పది రోజులు కారు షికారు కూడా చేసిన లక్ష్మి, మళ్ళీ ఒక రోజున తన పాత కాన్వాసు సంచీ (కంటిన్యుటీ అద్భుతంగా పాటించారిక్కడ) తీసుకుని మళ్ళీ - వెళ్ళిపోయింది అలవాటు ప్రకారం.

ఇలా పరిపరి విధాల పరుగెత్తిన ఈ కథా, కథానాయకీ, 18 రీళ్ళు పై చిలుకు తిరుగంగా, తిరుగంగా గమ్యస్థానం చేరుకోవడం జరుగుతుంది.

ఈలోగా, దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి నవరసాలూ చిప్పిల్లే విధంగా కథలో అనేక ఘట్టాలను ప్రవేశపెట్టారు. పాటలు పది పన్నెండూ, తెలుగులోకీ తర్జుమా చేసిన బొంబాయివాళీ వీధి నృత్యాలు రెండు మూడూ కూడా చొప్పించారు.

అయితే ఈ నృత్యాలు బాక్సాఫీసు హంగులని మనం అనుకొనరాదు. "ఇలాటివి నేటి చిత్రాలలో ఉంటున్నాయి సుమండీ" అని విమర్శను ధ్వనిస్తూ హేళన చేయించారు.

ఇది ఒకరకంగా ఉభయతారకంగా ఉంది.

మొత్తం మీద చిత్రంలో ప్రత్యేక ఘట్టాలు చిత్రించడంలోనే రెడ్డిగారి ప్రతిభ, శిల్పనైపుణి ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

ఆయా ఘట్టాలను రక్తి కట్టించడంలో శ్రీ పాలగుమ్మి పద్మరాజు మాటలూ, ప్రతిభావంతులైన నటీనటుల కృషి కూడా చాలా దోహదం చేశాయి. సునిశితమైన విమర్శ, అతి సున్నితమైన హాస్యం మేళవించి పద్మరాజుగారు వ్రాసిన సంభాషణలో చక్కని చమత్కారధార ఆద్యంతం ప్రవర్తిల్లింది. పాత్రౌచితి చెడకుండా ఆయన వీటిని ప్రశంసనీయంగా సాధించారు.

కృష్ణశాస్త్రిగారి పాటలు ఈ చిత్రానికి విశిష్టతను సమకూర్చాయి. సంగీత దర్శకుడు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు కూర్చిన వరసలు కొన్ని బొంబాయి బాణీలు, అనుకరణలూ అయినా, తెలుగు రాగాలలో కూర్చినవి శ్రుతిపేయంగా ఉన్నాయి. ఉన్నవాటిలో "కన్నీటి కడలి లోన - చుక్కానిలేని నావ", "నీ వుండే దా కొండపై నా స్వామి నేనుండేదీ నేలపై, ఏ లీల సేవింతునో" వంటి పాటలు రెండు మూడు అత్యుత్తమంగా ఉన్నాయి.

మధురంగా, మనోహరంగా ఉన్న "నీ వుండేదా కొండపై" అనే గేయసాహిత్యం, దానిని రాణింపచేయగలిగిన స్థాయి సంగీతం, దేవుడి మీద పువ్వులు


పి. సుశీల

వేసినంత మెత్తగా, హాయిగా సుశీల వాటిని పాడిన విధం, ఆ గేయాన్ని చిత్రించిన ఘట్టాలకు, ఈ చిత్రానికీ, కూడా విశిష్టతను ఘనతను చేకూర్చాయి.

కథా, కథానాయకీ కూడా తరచుగా దారివిడిచి కొండలూ గుట్టలూ పర్యటించడం ద్వారా కలిగిన అవకాశాలను ఛాయాగ్రహణ దర్శకుడు శ్రీ బి. ఎన్. కొండారెడ్డి అద్భుతంగా వినియోగించుకుని రమణీయమయిన దృశ్యాలను ఇందులో పొందుపరిచారు.

జమున, రామారావు, జానకి, రేలంగి, సి. ఎస్. ఆర్, సూర్యకాంతం, డా॥ గోవిందరాజు సుబ్బారావు, రమణారెడ్డి, పి. హేమలత, కె. వి. యస్. శర్మ, సి. నాగభూషణం, అల్లురామలింగయ్య, డా॥ శివరామకృష్ణయ్య, సీతాబాయమ్మ, బలరాం, మాష్టర్ వర్మ, కుమారి శశికళ, భారతి, సీతారత్నం ఇందులో పాల్గొన్నారు.

నటీనటులందరూ పాత్రోచితమయిన నటనను ప్రదర్శించారు. లక్ష్మి భూమిక నిర్వహించిన జమున, ఇన్నాళ్ళూ ఈ తరహా పాత్రలే నటించినా, ఈ చిత్రంలో గత అనుభవాలను సద్వినియోగం చేసుకొని కొత్త స్థాయిని అందుకొంది. నిండైన విగ్రహం, చక్కని నటన ఈ పాత్రకు నిండుతనం చేకూర్చాయి.

మాస్టర్ పులిగా రేలంగి ఇందులో హుషారైన వేషం వేశాడు. ఈసారి సినిమా లోకంలో టోకరా శాస్త్రాన్ని, శాస్త్రజ్ఞులను, "ఏకి" వదలిపెట్టడానికి ఈ భూమికను చక్కగా వినియోగించారు. ఈ వేషానికిగల బలం, రేలంగి నటనతో ఇనుమడించింది.

పదహారణాల తెలుగుతనం ఉట్టిపడే సాంబయ్యగా రమణారెడ్డి అద్భుతమైన నటనాకౌశలం ప్రదర్శించాడు. ఎక్కడా ఎబ్బెట్టు అనిపించకుండా మితిమీరకుండా ఇతడు నటించాడు. అరక్షణం వ్యవధి, అంగుళంచోటూ ఇస్తే, చక్కని హాస్యాన్ని చవి చూపించగల బాలకృష్ణ ఈ చిత్రంలో "అతిథి"గా ఒకే ఒక్క నిముషం కనిపించినా చక్కని హాస్యనటన ప్రదర్శించాడు.

*(ఆంధ్ర-వారపత్రిక - **1957**)*

భాగ్యరేఖ సినిమా బాగా హిట్ అయింది, 'నీవుండేదా కొండపై' పాట ఇప్పటికీ ప్రజలు మరవలేకుండా ఉన్నారు.

# కృష్ణలీలలు



కృష్ణుడు చాలా అల్లరి పిల్లవాడు. చూట్టానికి అలా వుంటాడుగాని చాలా గట్టివాడని, దేవుడే అలా మారువేషంలో వచ్చాడనీ, అతను అల్లరి చేస్తున్న రోజుల్లోనే కొందరికి తెలుసు. తెలుసుకున్న వాళ్ళల్లో కూడా కొందరికి తెలిసినట్టే కనిపించి తెలీకుండా తప్పించుకుపోతూ వచ్చాడు. కొందరికి అసలతని సంగతి కొరుకుడు పడిందికాదు. దానాదీనా నాటికీ నేటికీ ఈ విషయం 'తుదీ మొదలూ' పసిగట్టాలని చాలా మంది తిప్పలుపడుతూనే ఉన్నారు - ఆ రెండూ ఉండవని తెలిసే!

ఏమాట కామాటే చెప్పుకోవాలి; ఋషుల తరవాత, ఈ విషయమై గట్టిగా ప్రయత్నం చేసింది సినిమావాళ్ళే. ఏదో ఓ ఘట్టంలోనో, మొత్తం సినిమా అంతటి మీదనో నాటకంలోనో కృష్ణుడిని బిగించి నిలబెట్టాలని అన్ని ప్రాంతాలవారూ ప్రయత్నిస్తూనే వచ్చారు. సినిమావారికి మటుకు విశ్వరూప సాక్షాత్కారం బాక్సాఫీసు వసూళ్ళలో కనబడాలి. అదే దాఖలా. సి. పుల్లయ్యగారు కాలంనాడు తీసిన 'కృష్ణలీలలు' ఈ దాఖలా చూపించింది. మళ్ళీ ఇపుడు రాజ్యం పిక్చర్స్ వారి చిత్రానికి ఆయనే దాదాపు అదే సినీ కథను వ్రాసిపెట్టారు. దేవకీ వసుదేవుల పెళ్ళితో ఆరంభమయే కథా ప్రకారం పాత సినీకథా ప్రకారంగానే ఉన్నా - రాజ్యం పిక్చర్స్‌వారి ఈ కొత్త "కృష్ణలీలలు" చిత్రంలో కొన్ని కొత్త అంశాలూ వున్నాయి. సాంకేతికంగా సాధించిన ప్రగతి 'ఛాయ'లూ, సినీమాయలూ, ఇ. వి. సరోజ, సాయి సుబ్బులక్ష్మి మొదలగువారి నాట్యాలూ, 'ధిక్కారమును సైతునా' అనే పాట పల్లవికి 'ధిక్కారమును చేయుడీ' అనే మార్పు మొదలగునవి. పోతే కథను కొత్తగా చెప్పడం, కృష్ణుని మోహనరూపా న్నావిష్కరించడం వంటి విషయాలలో - అది మహా మహా మహర్షులకే ఓ పట్టాన కుదరని వ్యవహారం అని, దర్శకరచయితలు ఏమంత పట్టింపులు పెట్టుకోకుండా సూటిగా సాఫీగా చిత్రించారు. నటులు లక్ష్మీరాజ్యం, శ్రీరంజని, గుమ్మడి, రేలంగి, పద్మనాభం, సూరిబాబు (అక్రూరుడు)

మొదలగువారంతా సినీకథోచితంగా వ్యవహరించారు. కృష్ణుడు వేసిన అమ్మాయి హాయిగా ఆడుకుంది. చూడముచ్చటగా వుంది.

చిత్రం అంతటి మీదా, విశ్వరూపం ధరించిన (విశ్వరూపం అంటే లావుగా ఎత్తుగా కనబడడం) కృష్ణుడిలా ఎత్తుగా నిలబడినవాడు నటుడు రంగారావు. కృష్ణుడు మధురానగరికి వచ్చేసరికే కంసుడు మృత ప్రాయుడైపోయే సన్నివేశాన్ని రంగారావు చాలా సమర్థంగా ఆవిష్కరించాడు. ఒకటి రెండు చిన్న దృశ్యాలలో ఆయనకు చేసిన మేకప్, ముఖ్యంగా గుబురుమీసం ఏర్పాటు, నటనకు ఆటంకం కలిగించింది. ఆయనమీద విశేషమైన గౌరవాభిమానాలూ, కృష్ణుడిమీద భక్తిప్రపత్తులూ ఉన్నవాడికి కూడా కంసుడు హోరుగాలితో అల్లకల్లోలంగా ఉన్న రాజమందిరంలో మరణవేదన పడుతున్నాడా, గాలి బాగాలేక జలుబుచేసి, తుమ్ములు నిభాయించుకుంటున్నాడా అనే భయంకరమైన, క్షమించరాని ఆలోచన కలుగుతుంది... ఈ రెండు ఇలా చిన్న కళంకాలలా మిగిలినా, మొత్తం మీద కంసుడు, రంగారావు ప్రశంసనీయంగా నడిపిన పాత్రలలో ఒకటి అనడానికి సందేహం లేదు. సందేహం లేకుండా ఉత్సాహంగా చెప్పుకు మెచ్చుకోవలసిన వాటిలో కృష్ణుడి జతగాళ్లుగా బాలకృష్ణ, నల్లరామ్మూర్తి చేసిన హాస్యం ముఖ్యం. ఇంత చక్కని, ముద్దొచ్చే హాస్యాన్ని ఈ మధ్య తెలుగు సినిమాలో చూసి ఉండము.

సంగీతం పూర్తిగా కథోచితం కాకపోయినా యథోచితంగా ఉంది. దక్షిణామూర్తిగారు రెండు మూడు చక్కని పాటలు చేశారు. ఎం. ఎల్ వసంతకుమారి పాడిన జావళి ఒకటి, సుశీల పాడిన 'అందాలగని బృందావని' (ఆరుద్ర) చాల హాయిగా ఉన్నాయి. దానికి రూపకల్పన మైసూరు బృందావన్ గార్డెన్స్‌కు తీసుకొచ్చెయ్యడం అద్భుతం అనిపించదు. అలాగే మాయా ఛాయాగ్రహణం ఇంతగా అభివృద్ధి పొందిన ఈనాడు, యమునానది వసుదేవుడికి దారి ఇచ్చిన సన్నివేశాన్ని చాలా బాగా సహజంగా (నది అడుగున ఉంటాయని తోచేవన్నీ చూపించారు.) తీసిన ఈ చిత్రంలో మన్ను తిన్న కృష్ణుడి నోట్లో యశోదకీ, మనకీ మళ్లీ "భూగోళం మార్కు నశ్యం మార్కు" భూగోళమే కనిపించడం, (అసలిది ఛాయామాయావి బాబూభాయ్‌మిస్త్రీ పేటెంటుట) అసలైన అద్భుతం. అదో కృష్ణలీల.

మొత్తం మీద మిగతా లీలలూ ఆటపాటలు హాయిగానే ఉన్నాయి కాబట్టి పిల్లలతో ఓసారి వెళ్లి చూడవచ్చు. అప్పుడేనా కృష్ణుడి నోట్లో భూగోళం (ఆస్ట్రేలియా ఇండియా వగైరా మ్యాపులతో ఉండును) కనబడే దృశ్యం వచ్చినపుడు పిల్లల దృష్టి అట్నించి మళ్ళించడం మంచిది.

*(ఆంధ్ర-వారప్రతిక - **1959**)*

కృష్ణలీలలు సినిమా హిట్ అయింది. దరిమిలా రాజ్యం పిక్చర్స్ వారు 'నర్తనశాల' వంటి సినిమా తీసి బాగా పేరు తెచ్చుకున్నారు.

# శభాష్ రాముడు



పేరు వాలకం చూసి, 'శభాష్ రాముడు' అనేది డబ్బింగు సినిమా అనుకునేవారు పందెం కడితే చిత్తుగా ఓడిపోతారు. నిజానికిది డబ్బింగ్ చిత్రం కాకపోవడమేకాక, ఉత్సాహకరమైన, కాలక్షేపానికి యోగ్యమైన తెలుగు చిత్రం. మీకు అభిలాష ఉంటే, కాయకష్టంపట్ల గౌరవం గట్రా పెంచుకోడానికి వీలు కలిగించే చిత్రం. ఇందులో రిక్షారాముడు నిజంగా రిక్షారాముడు కాదు. పూర్వాశ్రమంలో లాల్చీ పంచె కట్టుకుని తిరిగిన సోషల్ హీరో. గోదావరి వరదలవల్ల ఆస్తి పోగొట్టుకుని, పెళ్ళాంబిడ్డలతో హైదరాబాద్ చేరి, గౌరవప్రదమైన జీవనోపాధికి సైకిలు రిక్షా తోలడం అంత మంచి మార్గాంతరం లేదని ఆ పని చేస్తాడు. అందులో మిగిల్చిన డబ్బుతోనే తమ్ముడికి చదువు.... (రైటే మీరు ఊహించినట్లు ఫ్లాష్‌బాక్‌లో వాళ్ళమ్మకి ఒట్టేసి చెప్పాడు తమ్ముణ్ణి చదివిస్తానని)కు, టెన్నిస్ ఆటకూ సదుపాయం చేస్తాడు.

భూపతి అనే దొంగలదొర, హాలీవుడ్ అపరాధ చిత్రాలు చూసి అవన్నీ కల్తీలేని నిజాలని పొరబడి లక్కీస్టార్ కార్నివల్ అని ఒకటి ఏర్పాటు చేస్తాడు. దానిచాటున ఉంటూ ఘరానా దొంగతనాలుచేస్తూ ఒక గుహలో భూగర్భమందిరాలూ మీట నొక్కితే ద్వారాలు తెరుచుకోడాలూ వగైరాలతో ఆధునిక బాలనాగమ్మలో మాయలఫకీరు సెట్టు కట్టుకుని ఉండగా, ఒకానొక రీలులో రిక్షారాముడు భూపతికి సవారీ కట్టి అతని ఆటపట్టు సంగతి తెలుసుకోవడం జరుగుతుంది. భూపతి ముఠావాళ్ళు అతన్ని గాయపరచి, తమ గుట్టు బయటపెడితే 'నీ పెళ్ళాం బిడ్డల్ని ఖర్చు రాయిస్తాం' అని భయపెట్టి తప్పుకుంటారు.

రిక్షారాముడి తమ్ముడు ఆ వూరి పోలీసు కమీషనర్‌గారి అమ్మడుతో టెన్నిస్ ఆడి, డూయెట్‌లు పాడి అన్నగారు అస్పత్రిలో ఉన్నపుడు రిక్షాలాగి డబ్బు గడించబోయి కమిషనర్‌గారి అనుగ్రహాన్ని, గౌరవాన్ని, వారి అమ్మాయి అనురాగాన్ని సంపాదించుకుంటాడు. ఈలోగా అతని పరీక్షకి డబ్బు కట్టడంకోసం, రిక్షారాముడు

డాక్టరు మాట వినకుండా, రక్తం కారుతున్న కాలుతో, సైకిలు రిక్షా పందెంలో పాల్గొని రెండువందలు బహుమానం గడించి....

...చూడగా ఇదంతా పచ్చి సినిమా కథలా ఉందని మీరు అనుకుంటే, రైటేనని దర్శక నిర్మాతలు కూడా ఠంగున ఒప్పేసుకుంటారు. పూర్వాశ్రమంలో ఇది 'బడాభాయ్' అను హిందీ సినీకథ...

...తరవాత తమ్ముడు మోహన్, బియ్యే పరీక్ష ఇచ్చి యూనివర్శిటీ మొత్తం మీద ఫస్టున వచ్చేస్తాడు. ఇటు ఈ సంఘటనా, మరోవంక తన కుమారుడు కుమార్ బుద్ధిగా దొంగల్ని పట్టుకొచ్చి ఖైదులో వెయ్యడానికిమారు, వాళ్ళతో కలిసి తిరుగుతున్న వైనం తెలియరావడం, ఇవన్నీ చూసి అసలే సబిన్‌స్పెక్టర్లు కూర్చునే ఇరుగ్గదిలో చికాకుగా ఉన్న కమీషనరుగారి ప్రాణం ఖంగారై 'మోహన్‌బియ్యే'కు గబుక్కున ఇన్‌స్పెక్టరు ఉద్యోగం ఇచ్చేసి ఖూనీ దోపిడీ నేరాల కేసులన్నీ అతనికి ఒప్పగించేస్తాడు! ఎవర్నడిగిచ్చావు అని గవర్నమెంటువాళ్లు గట్టిగా అడిగితే, "నా బిడ్డనే ఇచ్చాను నీ ఉద్యోగం ఇవ్వడానికేం?" అని జవాబిచ్చేందుకు వీలుగా కూతుర్ని అతనికిచ్చి పెళ్ళి చెయ్యడానికి ఏర్పాటు చేస్తాడు.

ఈలోగా దొంగల ముఠావాళ్ళకి పోర్షను వచ్చినప్పుడు వాళ్లు ఒక ఖూనీ నేరం, ఒక చోరీ నేరం చేసి ఆ రెండూ రిక్షారాముడికి అంటగట్టే ఏర్పాటు చేసిపెడతారు. ఎదురుగా ఉన్న సాక్ష్యాన్ని బట్టి ఇన్‌స్పెక్టర్ మోహన్, అన్నగారి చేతికి బేడీలు వేసి ఖైదుకు తీసుకువెళ్తాడు.

చూట్టానికి సినిమాకథే అయినా, ప్రతివాడికి కంటనీరు తిరిగేలా ఉద్వేగభరితంగా ఈ సన్నివేశాన్ని దర్శకుడు చిత్రించాడు. ఎన్. టి. రామారావు, రమణమూర్తి, గుమ్మడి ఇందులో అతి సమర్థంగా నటించారు. ముఖ్యంగా రామారావు నటన విశేషించి మెచ్చుకోవలసి ఉంది.

తరువాత కథ మీరు ఊహించుకోగలిగినా వెండితెరమీద కూడా ఒకసారి చూడదగిన విధంగా అందమైన సినీ మెలికలతో వచ్చింది. తమ్ముడు దొంగల ముఠా ఉచ్చులో చిక్కుకున్నాడని విని, అంతవరకు దొంగల ఉనికిపట్టు గుట్టుగా దాచిన రిక్షారాముడు, (పోలీసుల సహాయంతో) ఖైదు నుండి పారిపోయి సరాసరి గుహకు వెళ్తాడు. ఉత్సాహకరమైన యుద్ధం జరిగిన పిమ్మట దొంగలు దొరికిపోతారు. చివర్న సన్మానసభ, పెళ్లి, గ్రూపు ఫోటో ఉన్నాయి. ఖైదు నించి పారిపోయినా, దొంగల్ని పట్టుకున్నందుకుగాను రిక్షారాముడిని అభినందించిన కమీషనరుగారిని, సెన్సార్ వారినీ అభినందిస్తూ మనము ఇంటికి వెళ్తాం. దారిలో పదేపదే చెప్పుకునే అంశాలలో రిక్షారాముడుగా రామారావు ఉత్సాహభరితమైన నటన, అతనికి ప్రతిగా రమణమూర్తి పాత్ర నిర్వహణ, పాకెట్‌మార్‌గా రేలంగి పాత్రచిత్రణ, అందులో అయనా దర్శకుడూ కలసి చేసిన సున్నితమైన నగిషీలూ మరీమరీ చెప్పుకుంటాం. తొణుకూ బెణుకూ లేకుండా నిండుగా స్థిమితంగా నటించిన ప్రమీల అను

దేవికనుకూడా ప్రశంసిస్తాం. కనిపించిన కాస్సేపూ అతి సహజంగా కనిపించి అతను దొంగల్లో చేరుతాడో, పట్టుకుంటాడో తెలీకుండా నటించిన కాంతారావును కూడా మెచ్చుకుంటాం. కె. వి. యస్ శర్మ, లోగడ తన వేషాలు బాగాచేశాడు కాబట్టి, మనకి అతనిమీద గౌరవం కాబట్టి ఇందులో అతన్ని గురించి అట్టే మాటాడుకోము.

దొంగలముఠాలో కీ.శే. అర్.నాగేశ్వరరావు, విగ్రహంతోనూ, నటనలో నిగ్రహంతోనూ కూడా రాణించాడు. నైట్‌క్లబ్ ఏర్పాట్లు డాన్సులూ లేకపోతే అతనిపాత్ర ఇంకాస్త బాగుండేదనిపించింది.

పాత్ర మాటలలో చేతలలో దర్శకులు దాచిపెట్టిన లోపాలు లేకుండాపోతే గుమ్మడి, పాత్రకు గల హోదాకు, తరహాకూ సముచితమైన పద్ధతిలో సాఫీగా హాయిగా, సౌలభ్యం తెలిసినవాడిలా నటించాడన్న సంగతి బాగా తెలిసేది.

ఈ కథలో అస్పత్రివాళ్ళుకూడా, పోలీసువాళ్లలాగే చాలా మంచివాళ్ళు. సుశీల కంఠం ఎరువు తెచ్చుకుంటే, 'రేయిమించెనోయి రాజా' అనే పాటను ఆస్పత్రిలో పాడనిస్తారుట. చాలా మంచిపాట. హాయిగా ఉంది. ఇదీ, 'కలకల విరిసి జగాలే పులకించెనే' అనే పాటా (సంగీతం ఘంటసాల) రమణమూర్తి మాలినీలతో ఆ పాట చిత్రణా కూడా ఆహ్లాదకరంగా ఉన్నాయి. మరొకటి, ఒక అరవపాటకు అనుకరణ అయితే అయిందిగాని వినడానికి బాగుంది. కాలక్షేపానికి కావలసిన అన్ని హంగులూ ఉన్న చిత్రం.

**(ఆంధ్రవార-పత్రిక - 1959)**

'బడా భాయ్' అనే హిందీ సినిమా ఆధారంగా తయారయిన ఈ సినిమా బాగా హిట్ అయింది. నిర్మాతలలో ఒకరయిన డూండీకీ రమణ పై ఎంతో గురి. రమణ ఉద్యోగంలో నుండి బయటకు వచ్చాక ఇదే బ్యానర్‌పై తయారయిన 'రక్తసంబంధం' అనే తమిళ రీమేక్ చిత్రానికి డైలాగ్స్ రాసే బాధ్యతను అప్పగించారు. 'గుడిగంటలు', 'ఇంటిగౌరవం' కూడా అటువంటివే!

# రేచుక్క పగటిచుక్క



సగం స్వప్నం సగం సత్యం అయిన జానపద కథా ప్రపంచంలో, తండ్రీ కొడుకు లిద్దరు యుద్ధానికి సిద్ధపడే అసాధారణ సన్నివేశాన్ని నిర్మించి చూపే వృత్తాంతం 'రేచుక్క – పగటిచుక్క' (స్వస్తిశ్రీ ప్రొడక్షన్స్) చిత్రం. సగం కదనం సగం కథనంగా, ఆద్యంతం బ్రహ్మాండమైన సెట్‌లమీద డాన్సుచేస్తూ సాగిపోతుంది.

రేచుక్క విజయరాయలు, 'దొంగ' వేషం వేసుకోడానికి ముందు దొర. సి. ఎస్. ఆర్. ఒక్కడే ఒప్పించి నప్పించగల తరహా వెర్రిబాగుల చక్రవర్తి వీరరాఘవులు దగ్గిర సామంతుడు. చక్రవర్తి సోదరుడు విక్రముడు (సినీ విలన్ ఆర్. నాగేశ్వరరావు) భిల్లగూడెంలో కన్నెపిల్ల (ఎస్. వరలక్ష్మి)ను చెరచి దొంగచాటుగా తప్పించుకుపోవడం, తన కొడుకు ముగ్గురు బిడ్డల తండ్రి సైజుకి పెరిగినా తను విగ్గుకీ సినీమీసాలకీ రంగేసుకోవడంవంటి కుర్రకారు చేష్టల దగ్గర నుంచి, రాజ్యాధిపత్యం కోసం వేసిన తన ఇరవైరీళ్ళ ప్రణాళికకు ఒకటో రీలునించి అడ్డు తగులుతున్న విజయరాయలును అక్రమంగా బంధించి, అతని దేవిని, కులదీపకుడిని, దేవిడీలో ఉండగా తగలబెట్టించబోవడంవంటి పెద్ద పెద్ద ఓఘాయిత్యాలదాకా చేస్తాడు. విజయరాయలు చెరనుండి తప్పించుకుపోయి భిల్లులలో కలిసి అడవిలో పెద్ద సైన్యం కట్టుకుని అక్రముడి విక్రమానికి సవాలుగా 'రేచుక్క' పేరిట నిలుస్తాడు. విక్రముడు, యువరాణిని ఖర్చు రాయించబోయే వరకు రేచుక్క ఆ పిల్లని ఎత్తుకపోయి తన దగ్గిర పెంచుతూ ఉంటాడు. విక్రముడు తన కొడుక్కి పట్టాభిషేకం చేయించబోయేసరికి అతన్నీ ఎత్తుకపోయి ఖైదులో కాపాడుతూ ఉంటాడు. దానికితోడు విజయరాయలు కొడుకు, చిన్ననాటి ప్రమాదంవల్ల అడవుల పడి తిరిగి, ఈ రాజ్యపు సేనానికే దొరికి అతని కొడుకుగా పెరుగుతూ ఉంటాడు. యువరాజమాత 'కన్నాంబ', దాది వేషంలో అతన్ని సాకుతూ ఉంటుంది; సినీధర్మము కడపట జయించునన్న నమ్మికతో తన ప్రయత్నాలన్నిటికి (రే) చుక్కెదురు కావడంతో విక్రముడు సేనాపతిని బెదిరించి, రేచుక్కని పట్టితెమ్మంటాడు. సేనాని కుమారుడు విజయకుమార్, రేలంగి వెంట రాగా సరాగా లాడుతూ పాడుతూ ఫోటోజెనిక్ అడవులలో కొంత దూరంపోయి ఒక చిన్నదాన్ని (స్వయానా రాజుగారే కన్నదాన్ని)

చూసి ప్రేమకథలో జారిపడతాడు. కాగల కార్యం కధకులే తీరుస్తారన్న ధీమాతో శ్రుతిమధురమైన యుగళగీతాలు కూడా పాడుతాడు. ఆ పిల్లే వెదకపోయిన తీగ కాబట్టి అతని చుట్టూ అల్లుకుంటుంది. ఆమె ద్వారా విజయకుమార్ అద్భుతమైన రేచుక్క శిబిరం సెట్‌ల మీదకు వెళ్తాడు. తరువాత మెల్లిగా తనకి కావలసిన బందీ విక్రముడి కొడుకుని విడిపిస్తాడు. రాకుమారిని అతన్ని రాజ్యానికి పంపివేస్తాడు. ఇలా రేచుక్కకి కూడా చుక్కెదురుచేసిన తాను పగటిచుక్కననీ ఫలానా చోట భేటీ దొరుకుతుందనీ కబురు పెడతాడు. చుక్క లిద్దరికీ, యుద్ధం జరుగుతుంది. పగటిచుక్క తను కన్నకుమారుడే అని రేచుక్క గుర్తించి కొడుక్కి చేజిక్కిపోతాడు. ఆపై పగటిచుక్క విజయకుమార్ అసహాయశూరుడై అధర్మాన్ని జయించడం దర్శకుడు కె. కామేశ్వరరావు యీ చిత్రం పతాకసన్నివేశాలలో చిత్రించారు.

చిక్కటి కథ అయినా రెండు తరాల వృత్తాంతాలను సమన్వయించడం, సముద్రాలజూనియర్ వ్రాసిన జాను, టార్జాను తెలుగుల లాగే జరగతగినంత కట్టుదిట్టంగా జరిగినట్లు కనిపించదు. అనేక సన్నివేశాలు విడిగా చాలా బాగున్నాయి. వాటిలో సంభాషణలూ కథోచితమైన రీతిన చక్కగా నడిచాయి. పుష్కలంగా కత్తియుద్ధాలు, తెలుగునాటి మల్లయుద్ధప్రవీణుల విద్యా ప్రదర్శనలూ, రీలు రీలునా నృత్యాలూ, పాటలూ మొదలయిన వాటివల్ల చిత్రం విసుగెత్తకుండా కాలక్షేపంగా ఉంది. తండ్రిని బంధించి చెరలో వేసిన పుత్రుడుగా రామారావు, దొరగానూ దొంగగానూ కూడా నిండైన దొరతనాన్ని చూపిన రేచుక్కగా రంగారావు, కన్నాంబ పతాకసన్నివేశాలలో మంచి నటన ప్రదర్శించారు. యుద్ధాలు అన్నీ ఉత్సాహభరితంగా ఉన్నాయి. ముఖ్యంగా రామారావు, ఆర్. నాగేశ్వరరావుల ద్వంద్వ యుద్ధం చాలా బాగుంది. భిల్లుల దొరగా మహంకాళి వెంకయ్య, విక్రముడుగా ఆర్. నాగేశ్వరరావు, అతని కుమారుడుగా రాజనాల, యువరాణిగా జానకి యథోచితంగా నటించారు. హాస్యనటులు నలుగురూ ఇందులో సమృద్ధిగా వినోదం సమకూర్చారు. పేకేటి దుష్టుడి పాత్ర భరించినా దాన్ని అహ్లాదకరంగా ధరించాడు. బాలకృష్ణ, పద్మనాభం చిత్రం ఆరంభంలో చేసిన శ్లాప్‌స్టిక్ మనోహరంగా ఉంది. ఈ చిత్రం మొత్తం మీద కొట్టొచ్చినట్టు కనిపించేవి తోట వెంకటేశ్వరరావు వేసిన సెట్‌లు, వాటిని నేత్రపర్వంగా చూపిన రెహమాన్ ఛాయాగ్రహణం. పాటలకు రూపకల్పన కూడా కొత్తదనంతో ఒప్పింది. 'కాదా ఔనా' అనే యుగళగీతం, 'మనవి సేయవే' అనే పాట చాలా బాగున్నాయి. వాటికీ, మరి రెండు పాటలకూ టి.వి. రాజు కూర్చిన వరసలు కూడా హాయిగా ఉన్నాయి. ఒకటి రెండు పాటలు మటుకు పాత బాణీలను జ్ఞాపకం చేశాయి. నేపథ్య సంగీతం సెట్‌లాగే భారీ 'ఎత్తున' ఉంది.

***(ఆంధ్ర-వారపత్రిక - 1959)***

రేచుక్క పగటిచుక్క సినిమా బాగా హిట్ అయింది. దర్శకుడు కమలాకర కామేశ్వరరావు తర్వాత ఎన్నో పౌరాణిక చిత్రాలు తీసి రాణించారు.

# అప్పుచేసి పప్పుకూడు



తప్పులో కాలేస్తే నాలిక్కరచుకుని లేవచ్చుగాని, అప్పులో కాలేస్తే ఆ సదుపాయం ఉండదని అపండితుల అపోహ. అయితే ఈ జీవితమే క్రితం జన్మలో కర్మతాలూకు 'బ్రాటోవర్' అనీ, ఇందులో జీవిని కట్టిపడేసి అనురాగ బంధాలలో కొన్ని కేవలం మారువేషం వేసుకున్న ఋణానురాగ బంధాలేస్మీ అనిన్నీ 'హెచ్చెరుక' గలవాడికి, అనుభవమే మార్గదర్శి అను 'భవ తారక' మంత్రం వంటపట్టినవాడికి – అప్పులో కాలెయ్యడం తప్పు కాదు సరిగదా గొప్పకూడాను.

ఈ సత్యాలను బాగా మననం చేసుకొని, "వడ్డీల సంగతి ఇచ్చే వేళ చూసుగుందాం "అసలు"ని అసలు చేతిలోకి రానీ" అంటూ చతుర్విధోపాయాలా అప్పులు గడించే ఋణగుణనిధి రామదాసు అనే ఆసామిని దృష్టాంతంగా చూపిస్తూ, అప్పు ముప్పు తెచ్చిపెడుతుందని నిరూపించి నీతి చెప్పడం 'అప్పుచేసి పప్పుకూడు' (విజయా ప్రొడక్షన్స్)లో ఒక లక్ష్యం; వలువనుబట్టి విలువకట్టి వ్యవహరిస్తూ, ఎలాగైనా ఏదో ఒక 'రాజా' అనిపించుకున్న వాణ్ణి తన మనవరాలికి చేసుకోవాలని ఆరాటపడే ఒక వెర్రిబాగుల ముసలి ముకుందరావు హృదయాన్ని జనరంజకంగా చిత్రించడం రెండవది.

ఈ విధంగా లక్ష్యశుద్ధి ఉంటే, సిద్ధి అసంభవం కాకూడదు. సి. ఎస్. ఆర్. (రామదాసు), రంగారావు (ముకుందరావు), చక్రపాణి, ప్రసాద్, సదాశివబ్రహ్మంవంటి వారు పూనుకొన్నపుడు ఉన్నతప్రమాణాలు సుసాధ్యం అవుతాయని ప్రేక్షకులు ఆశిస్తారు. అయినా, కథ చుట్టూ ముసిరిన అసంఖ్యాక పాత్రలకు పేర్లు పెట్టి, ఎడ్రసులు తొడిగి చుట్టరికాలు కలిపి, తెలపవలసి రావడం ప్రాధాన్యం వహించడంతో, విశ్వజనీనమైన ఋణశాస్త్రం వస్తువుగా గల ఈ కథలో వినాలనిపించేటంత ఋణగుణధ్వని వినబడలేదు; కనాలనుకునేటంత నిండుతనం కనబడలేదు. అయినా, రామదాసూ, ముకుందరావుల పాత్రలు అందరికీ అభిమానపాత్రాలు కాగలవు. ఈ ఇద్దరినీ కలిపి నిలిపే కథలో ఆహ్లాదకరమైన ప్రేమ కథలు కలిసి ఉన్నాయి. వాటిలో రామారావు – సావిత్రి, జగ్గయ్య – జమున, రేలంగి

– గిరిజ – రమణారెడ్డి, దబ్బూ, అప్పులవాళ్ళూ – బాకీ వసూళ్ళూ, నిర్మాతల, నటుల కృషీ – దాని సత్ఫలితాలూ, కలుసుకోవడం వృత్తాంతాలు.

రామదాసుగారికి, ఈ చిత్ర కథలో మెలికలకు మల్లె అప్పులు కుప్పతిప్పలుగా పెరిగిపోవడంతో, పరపతి సగటు సినిమా పాటలో భావంలా పూజ్యం అయిపోయే స్థితికి వస్తుంది. అంతలో 'రావుసాహెబ్' బిరుదువచ్చి ఆదుకుంటుంది. అప్పుడు ఆ ఋణధ్రువానికి 'దాఋణం'గా బుర్ర పనిచేసి, ధనధ్రువమైన దివాన్ బహదూర్ ముకుందరావుగారి ఆస్తిమీదకు మనసు పోతుంది. ఆయన మనుమరాలు మంజరిని తన కొడుక్కి చేసుకుంటే ఆస్తి చేజిక్కుతుందనీ అప్పుడు, అప్పులన్నీ తీర్చిపారెయ్యవచ్చుననీ దురాశపడతాడు. అయితే ఆయనకి కాళీగా ఉన్న కొడుకులు లేక ఉన్న కొడుకు రఘురాం ఒక్కడికీ పెళ్ళి అయిపోయింది. అతను సీమలో ఉన్నాడు. వైవాహికములందు .... బొంకవచ్చు కాబట్టి కోడలు లీల 'ఖర్చ'యిపోయినట్టు కొడుక్కి ఉత్తరం రాసి, అతన్ని మళ్ళీ పెళ్ళికి సిద్ధంచేసి, ఇటు ముకుందరావుగారితో పెళ్ళిబేరాలు మొదలుపెడతాడు. లీల అన్నగారు రాజాకు అది తెలిసి, ఖైదునించి విడుదల (కథానాయకుడు కావడానికి ముందు పూర్వాశ్రమంలో అతడు రాజకీయనాయకుడు) అవుతూనే చెల్లెల్ని వెంటబెట్టుకుని రామదాసు దగ్గరకు వచ్చి ఆయన చేస్తున్న పని తప్పు అని చెబుతాడు. బలవంతాన, చివరకి కోడలు పిల్లని పనిమనిషిగా ఇంట్లో ఉంచుకోడానికి రామదాసుగారు ఒప్పుకుంటాడు – కొడుకు సీమనించి వచ్చేసరికి ఈ పిల్లని చూసినా గుర్తించలేడన్న ధీమాతో! కాని మళ్ళీ ప్రయత్నం మానడు. అందువల్ల రాజా, తన చెల్లెలి కాపరం నిలబెట్టడం కోసం ముకుందరావుగారి మంజరికీ రామదాసు కొడుక్కీ పెళ్ళి కాకుండా జాగ్రత్త పడవలసి వస్తుంది.

దానికితోడు, అతడు ఖైదునించి విడుదల అయినపుడు స్వాగతం ఇచ్చిన ఇద్దరిలో ఒకరు మంజరి అయినందువల్ల (నటులు రామారావు సావిత్రి అయినందువల్ల) వీళ్ళిద్దరూ కథారంభానికి పూర్వమే ప్రేమించుకొన్నట్లు మనం పసిగట్టవచ్చును. మంజరి తాతగారికి హీనపక్షం మాజీ మహారాజా అయినాకాని పెళ్ళికొడుకు కంటికి ఆనడు. రాజా ఒక బొంకులమర్రి మహారాజా వేషం ప్రయత్నించి అఘాయిత్యప్పనులు చేయించి, ఆ 'రాజా' పై వత్తిడి తేవడంతో అతడు వేషం ఫిరాయించి బైరాగిగా తిరిగి ప్రవేశిస్తాడు. రామదాసుగారి కుడిభుజం భజగోవిందం (రేలంగి) బృందం అంతా కూడా రాజా, మంజరి, రఘురాం వగైరాలతో ఏకమై రామదాసుగారి ఎత్తులు సాగకుండా రకరకాల నాటకాలు ఆడుతారు. ఆయన కొన్ని బూటకాలు ఆడిస్తాడు. ఇలా నాట'కాళ్ళ'మీద నడచిపోయి గమ్యస్థానం చేరుకుంటుంది కథ. ఆలోపల అప్పుల వత్తిడి ఎక్కువై, ఆపద్ధర్మంగా రామదాసుగారు గూండాలచేత తన ప్రత్యర్థిని తన్నించబోవడం, కాబోయే వియ్యంకుడి ఆస్తిలోంచి కట్నం బయానాగా రెండు లక్షలు దొంగతనం చేయించడం వంటి అకార్యాలు చేస్తాడు. సృష్టికర్తలాగే కథకుడికీ తను సృజించిన

పాత్రలన్నిటిమీదా సమానమైన ప్రేమ ఉండడంవల్లనూ, ఇందులో పెద్దలకు బుద్ధిచెప్పేది స్వయానా వారి బిడ్డలే కావడంవల్లనూ, పెద్దల మనసులు నొవ్వకుండా సున్నితంగా ఆ పని చేయవలసి వచ్చింది. దండనార్హమైన అకార్యాలకు పాల్పడిన ఋణాన్నభుక్కు రామదాసుగారు, ఈ విధమైన సదుపాయంచేసి తనకు దండనేకాక చివాట్లుకూడా తప్పించినందుకు పిల్లలను అభినందించాడు.


దర్శకుడు ఎల్.వి. ప్రసాద్

ఈ విధంగా ఎక్కడా దిగులులేకుండా ప్రహసనం పద్ధతిలో ఆడుతూ పాడుతూ (రాజేశ్వరరావుగారి వరసలలో), సాగిపోయే ఈ చిత్రంలో నటీనటులందరూ యథోచితంగా తమ పాత్రలు నిర్వహించారు. సంగీతం జనరంజకంగా, పూర్వపు విజయచిత్రాల స్థాయిలో తరహాలో హాయిగా ఉంది.

ఘంటసాల, రాజా, లీల పాడిన 'త్రిగళ గీతం' రచన, సంగీత రచన, ప్రకటన కూడా ఆహ్లాదకరంగా కుదిరాయి. సరోజ గేవాకలర్ నృత్యం ఒకటి ఈ చిత్రంలో విశేషం. ఒక విషాదగాథ ఆలంబనంగా రూపొందించిన ఈ నృత్యానికి సెట్ చాలా బాగుంది. అలాగే రామారావు కన్న పౌరాణిక స్వప్నం 'దమయంతి స్వయంవరం' కూడా బాగుంది. విజయవారి పూర్వ చిత్రాల స్థాయిలో అన్ని విధాలా చేరుతుందనిపించకపోయినా, అనేక విధాల ఈ కొత్త ప్రయత్నం అభినందనీయం.

*(ఆంధ్ర-వారప్రతిక - 1959)*

అప్పుచేసి పప్పుకూడు రిలీజైనప్పటి కంటె తర్వాత తర్వాత ఎంతో సక్సెసయిన సినిమా ఇది. ఈనాటికీ చెప్పుకోదగ్గ హాస్యచిత్రంగా నిలిచింది. అలాగే పాటలూ నిలిచిపోయాయి.

# అత్తా ఒకింటి కోడలే!

ఒకరి నొకరు మించిపోవడానికి ఎవరికెవరూ తీసిపోకుండా అందరూ హుషారుగా పనిచేసి తీసిన హాస్యరస ప్రధాన చిత్రం 'అత్తా ఒకింటి కోడలే' (అనుపమ ఫిలింస్) ఈ యేడాది సాంఘిక చిత్రాలలో అగ్రశ్రేణికి చెందుతుంది. సినిమా రాణించడానికి నవరసాలకన్న మిన్న అనతగ్గ 'పాదరసం' ప్రభావాన్ని పసిగట్టిన దర్శకుడు తిలక్ ఈ చిత్రాన్ని చైతన్యంతో, మనోరంజకమైన స్ఫూర్తితో వేగంగా నడిపించారు. తెలుగువాడి సంసారానికి నాడిలాంటి అత్తా కోడళ్ళ పొత్తు మీద వినబడే నానుడి మీద కట్టిన ప్రహసనం మార్కు కథ దీనికి ఆలంబనం. కథలో చిక్కదనం చక్కదనం ఉన్నా, మంచి నుడికారం, నానుడికారం గల మాటలూ (పినిశెట్టి), వాటిని సజీవంగా పలికి నటించడంలో నటీనటుల సొగసూ కథ ప్రాబల్యాన్ని వెనక్కి నెట్టేశాయి. పదహారణాల తెలుగు ధనం ఉన్న ఈ చిత్రానికి, నిజానికి ప్రాణప్రాయమైన పదహారో అణా తెలుగుదనపు మెరుగులు దిద్దిన ప్రజ్ఞ దర్శక రచయితలకు దక్కుతుంది.

కోడంత్రికం కథలు కనే వినేవారిని ఎంత ఏడిపిస్తాయో అంతా నవ్వించగలవు ఇవి ఈ పని చిరకాలంగా చేస్తున్నాయి (ఎటొచ్చీ రెండోభాగం సినిమాకి ఎక్కలేదు).

సృష్ట్యాది నుండీ వున్న అత్తాకోడళ్ళలో పొత్తుకు మంచి ఉదాహరణగా, ఆదర్శంగా చెప్పుకోగల జంటల పేర్లు లిస్టువేస్తే, శ్రీ మహాలక్ష్మి, సరస్వతి ఫస్టున కనిపించరు. ఈ కథలో తాయారమ్మా పార్వతమ్మా కూడా అంతే. తాయారమ్మకి అత్తగారి పోకడ పడదు. కొడుకు "వఠి సుబ్బారాయుడు" కాబట్టి తల్లి పార్వతమ్మ తన దూరపు చుట్టం రంగయ్య పంచన బ్రతుకుతూ, ఇటు తన కోడలు తాయారునూ, అటు రంగయ్య కూతురు లక్ష్మిని కాపరానికి తీసుకెళ్ళకుండా అవస్థపెడుతున్న సాటి అత్తగారు సుందరమ్మనూ ఆడిపోసుకుంటూ కృష్ణా రామా అనుకుంటూ ఉంటుంది. సుందరమ్మ కొడుకు చంద్రయ్య కూడా సుబ్బారాయుడికి తీసిపోడు. ఎటొచ్చి అతనికి తల్లి దగ్గర భయం. ఆవిడకి ఈ కొడుకుకాక ఆఫీసరు భార్యనని అహంకారం, అది చెల్లేందుకు ఆస్తి, నోటి దురుసుదనం, వీటిని ఎదిరించే సత్తా ఉన్న కూతురూను. ఆ అమ్మాయి పేరు శోభ (గిరిజ) పట్నంలో చదువుతోంది. సెలవలకి ఇంటికి వస్తూండగా, ఆమె సహపాఠీ తాయారమ్మ కొడుకు రఘురాం రైల్లో తారసపడి, హడావుడిగా తన హృదయాన్ని పరటాయిచ్చి, ఆమెది పుచ్చుకుని అందుకు గుర్తుగా తన పెట్టి ఆమె కిచ్చి ఆమెది పట్టుకొచ్చేస్తాడు.

అంచేత ఆ యిద్దరికీ పెళ్ళి చేస్తారు పెద్దలు. పెళ్ళికి, అల్లుడు రఘురాం పెట్టిన షరత్తులు పుణ్యమా అని సుందరమ్మ తన కోడలిని కాపరానికి రానిస్తుంది. కోడంత్రికం పెట్టడంతో ఆవిడ తన 'ప్రజ్ఞ ఎలా పేలుస్తుందో చెప్పగోడానికి సుందరమ్మ పాత్రధారిణి సూర్యకాంతం అంటే సరిపోతుంది. కోడలు (ప్రమీల) సక్కుబాయిలా యాతనలు భరిస్తూనే, మరోవేపు ఎంతసేపూ సంగీత ప్రపంచంలో ఉంటూ ఏదో రాగం ఆలపిస్తూ ఉండే మాలోకం మొగుడు చంద్రానికి మెల్లిగా అనురాగం వినిపించి నేర్పిస్తుంది. (జయజయవంతి రాగంలో సుశీల కంఠంతో పాడిన తియ్యని పాట ద్వారా). అక్కడితో చంద్రానికి మగసిరి అబ్బుతుంది. తన మావగారు రంగయ్య (పెరుమాళ్ళు) బెంగతో తీసుకొని మంచం పట్టి చనిపోవడం, తన తల్లి హింసలు మితి దాటిపోవడం, చెల్లెలు శోభ చివాట్లూ అతనికి తెగించే శక్తినిస్తాయి. ఇల్లువదలి బస్తీపోతాడు జీవనోపాధికోసం. (రమణమూర్తి ఈ పాత్రను సమరసంగా నటించాడు).

ఇక్కడ సుందరమ్మ కూతురు శోభ కూడా అత్తగారింట మరో రకం కోడంత్రికం అనుభవిస్తుంది. తాయారమ్మ, కోడలుపిల్ల కాలుకిందపెడితే, కందిపోతుందన్నంత ప్రేమతో చూసి ఉక్కిరిబిక్కిరిచేసి, ఆనక మనవడికోసం హడావుడిచేసి శోభచేత సవాలక్ష నోములూ వ్రతాలూ పట్టిస్తుంది. కోడలు బొత్తిగా సక్కుబాయి కాదు కాబట్టి, ఒక రోజున ఎదురుతిరుగుతుంది. తను అత్తచేత ఆరళ్ళు పడుతు (న్నాననుకుంటూ) కోడలికి అవే పెడుతున్న తాయారు చెలరేగడంతో ఇటు ఆమె భర్త సుబ్బారాయుడికి కొడుకు రఘురాముడికీ తిక్కరేగుతుంది. ఆ సుందరమ్మకీ, ఈ తాయారమ్మకీ బుద్ధిచెప్పి నాలుకలు కటుక్కున కొరుక్కునేలా చెయ్యాలని తండ్రీ కొడుకూ కూడబలుక్కుని మనకు చూడముచ్చటవేసే పథకం వేస్తారు.


దేవిక - రమణమూర్తి

ప్రేక్షకులకి సంతోషం, సంతృప్తి కూడా కలిగేవిధంగా జగ్గయ్య. రమణారెడ్డి, లక్ష్మీకాంతమ్మ, దర్శకుడు తిలక్ ఆ పథకాన్ని హాస్యరస భరితంగా ప్రయోగించి సమస్య పరిష్కరించారు. నీతిని ఆవిష్కరించారు.

అత్తగారిని హడలగొట్టి ఇల్లు వెడలగొట్టడానికి తాగి తందనాలాడిన అల్లుడుగా జగ్గయ్య, కోడల్ని హడలగొట్టి వెడలగొట్టడానికి దెయ్యం పట్టినట్లు నటించిన అత్తగారుగా లక్ష్మీకాంతం (కొత్తనటి) సూత్రధారుడుగా రమణారెడ్డి ఈ సన్నివేశాలలో అద్భుతంగా నటించారు. జగ్గయ్య తందనాలాడే సన్నివేశంలో 'జోడుగుళ్ళ పిస్తోలు' అనే పాట (ఘంటసాల) ఈ రకం పాటలలో మేలిరకంగా, సర్వజన మనోహరంగా ఉంది. సంగీత దర్శకుడు పెండ్యాల ఈ చిత్రంలో వినిపించిన తొమ్మిది పాటలూ విశిష్టంగా వీనులవిందుగా ఉన్నాయి. ఆరుద్ర బడి పలుకుబడిగల పాటల మాటలు అందంగా హాయిగా తిరిగాయి. 'అశోకవనమున సీత', 'అమ్మాయిలూ-అబ్బాయిలూ' (శ్రీనివాస్, జిక్కీ హాయిగా పాడినది) 'నీదయరాదా' (సుశీల), అత్తలకు నీతిచెప్పే పాటవరసలూ, మాటవరసలూ కూడా చాలామందికి చాలా రోజులు జ్ఞాపకం ఉంటాయి.

ఇవికాక చాలా బాగున్న మరోపాట 'తడిక రాయబారం' చదలవాడ కుటుంబరావూ, సీతా (పిఠాపురం నాగేశ్వరరావు, జిక్కీ కంఠాలతో) ఆ పాటను సోగ్గా నటించారు.

మొత్తం మీద సృజనాత్మకమైన ప్రతిభ, స్వతంత్ర కథనాశిల్పంగల దర్శకుల శ్రేణిలో తిలక్‌ను ఈ చిత్రం నిలబెట్టింది. ఆయనకిది మూడవ చిత్రం.

సకుటుంబంగా వెళ్లి చూస్తే మామూలు కన్న చాలా బాగుండే చిత్రం; అలాచేస్తే నిత్యజీవితంలోని మన పోకడలూ ఛలోక్తులూ ఎన్నెన్ని ఇందులో ఉన్నాయో బాగా బోధపడుతుంది.

(ఆంధ్ర-వారపత్రిక - 1958)

దర్శకనిర్మాత తిలక్ ఈ సినిమా తర్వాత మరి కొన్ని లైట్ రొమాంటిక్ కామెడీలు, సెంటిమెంటల్ సినిమాలు తీశారు. హిందీ చిత్రరంగానికి వెళ్లి తన తెలుగు సినిమాలను హిందీలో రీమేక్ చేసి అక్కడా విజయం సాధించారు. ఈ సినిమా 'సాస్ భీ కభీ బహూ థీ'గా హిందీలో రూపుదాల్చి విజయమైంది. కెరియర్ చివరిలో తిలక్ 'భూమికోసం', 'కొల్లేటి కాపురం', 'ధర్మవడ్డీ' వంటి అభ్యుదయ చిత్రాలు తీశారు.

# చింతామణి


భరణీవారి చింతామణి

బాగా ఆలస్యం అయిపోయిన తరువాత కళ్ళు తెరచిన బిల్వమంగళుడి కధను భరణీవారు తెర కెక్కించారు. జ్ఞానచక్షువు తెరచుకున్న వేళకు, అతడు చర్మచక్షువులను ధ్వంసం చేసుకుంటాడు. తన సౌందర్యతృష్ణను, అపార ప్రేమపూరితమైన హృదయాన్ని భగవంతుని దెసకు మళ్ళిస్తాడు. మధురకవి అవుతాడు, తరిస్తాడు. ఈ బిల్వమంగళుడు సామాన్యుడు, కేవలం కామాంధుడు కాడు. చదువుకున్నవాడు. సంస్కారం గలవాడు, సచ్ఛీలుడు, ఏకపత్నీ వ్రతుడు. అయితే తెలుపు నలుపుల తేడా తెలిసికూడా, తన వైఖరి, లోకం దృష్టిలో, చెడ్డదని ఎరిగికూడా, పణ్యాంగన వెంటబడ్డవాడు. లోకంలో సౌందర్యం ఉన్నది కాబట్టి, దాన్ని ఆస్వాదించడానికి తనకి అవకాశం ఉన్నది కాబట్టి, వెనుకాడనేల? విడనాడ నేల? అని భావించిన వ్యక్తి. తన ఈ భావనను తగనిదనే లోకాన్ని, ఆప్తులను, వెలివేసినవాడు. వెలివేసి ఆ సంగతిని స్పష్టంగా, నిష్కర్షగా, చెప్పగలిగాడు. అలా చెబుతూనే, "తాళి కట్టుకోవడమే నువ్వు చేసిన తప్పు" అని భార్యను అంటూ తనలోని దౌర్బల్యచ్ఛాయను గూడా అంగీకరించగలిగిన వ్యక్తి చివరకి, తన చేతల దుష్పర్యవసానాల భీకరస్వరూపాన్ని చూచినమీదట తను ప్రగాఢంగా వాంఛించిన ఐహిక సౌందర్యం, తను ఊహించకున్న స్వర్గం బొత్తిగా క్షణభంగురాలని గ్రహించిన మీదట, అతనికి జ్ఞానోదయం అవుతుంది. బిల్వమంగళుడి జీవితాన్ని నడపినది వేశ్య చింతామణి. అశాశ్వతమైన ఆమె భౌతిక సౌందర్యం అతణ్ణి దాసుణ్ణి చేసుకుంటుంది. ఆమె భక్తిభావన పరిణతి చెందిన తరువాత ఆమె బిల్వమంగళుని ముక్తిమార్గాన మళ్ళించ గలుగుతుంది.

వేశ్యావృత్తి ప్రబలంగా ఉన్న రోజులలో, కీ.శే కాళ్ళకూరి నారాయణరావుగారు ఆ దురాచార నిర్మూలన లక్ష్యంగా ఈ రెండు పాత్రలతో 'నాటకం' వ్రాశారు. ఇది ఆనాడు బహుళ జనాదరణ పొందింది. 1933లో దీన్ని చలనచిత్రంగా కూడా నిర్మించారు.

సాంఘిక ప్రయోజనం దృష్ట్యా అయితే ఈనాడు ఈ నాటకానికి ఆ రోజుల్లో ఉన్న విలువ, ప్రాధాన్యం లేకపోవచ్చు. ఉద్దేశ్యం మంచిదికదా అన్న భావంతో భరణీవారు చలనచిత్రం నిర్మించినట్లయితే ఆ ఛాయలు మాత్రం ఈ చిత్రంలో

కనబడవు. నాటకం ఆదరణ పొందింది కాబట్టి, ఆ పంథాలోనే సినిమాకూడా రూపొందించారనిపిస్తుంది. చింతామణిని, మంచిమనసుగల వేశ్యగానే కాక, మొదటి నుంచి భక్తురాలుగ చిత్రించడానికి ప్రయత్నించారు. ఈ భరవసాతోనే, దీన్ని ఆ పెట్టుకునే, - బిల్వమంగళుడిని పిలుచుకురావడానికి భవానీశంకరుడిని పంపిన సందర్భంలో, రుక్మిణీ కల్యాణంలోని "ఘనుడా భూసురుడేగెనో" అన్న పద్యాన్ని చదివించారనిపిస్తుంది. సందర్భశుద్ధిరహితంగా, ద్వంద్వార్థరస్ఫోరకంగా ఈ పద్యాన్ని చదివించినందువల్ల చింతామణిని భక్తురాలుగా చిత్రించడానికే చేసిన ప్రయత్నం దెబ్బతింది.

ఉన్నంతలో, ఈ చిత్రాన్ని దర్శకుడు శ్రీ రామకృష్ణ, రక్తి కట్టించగలిగారు. దర్శకత్వంతోపాటు ఎడిటింగ్ కూడా ఆయనే నిర్వహించారు. బరితెగించిన బిల్వమంగళుడు భార్య రాధకు నిష్కర్షగా తన భావాలను విశదపరచిన సన్నివేశాన్ని, ఏటి ఒడ్డున బిల్వమంగళుడికి జ్ఞానోదయం అయిన సన్నివేశం, అద్భుతంగా చిత్రించారు. అయితే మొత్తం మీద, ఈ చిత్రంలోకన్న "విప్రనారాయణ" చిత్రంలోనే శ్రీ రామకృష్ణగారి ప్రతిభ ఎన్నోరెట్లు రాణించిందనిపిస్తుంది.

చింతామణి భూమికకు భానుమతి కొత్తదనం ఇచ్చి, ప్రశంసనీయంగా నిర్వహించింది. బిల్వమంగళుడుగా రామారావు నటన కూడా బాగా ఒప్పింది. ధర్మచక్షువులూ, జ్ఞాననేత్రం ఈ పాత్రకి పునాదిరాళ్ళే అయినప్పటికీ, నటనలో కనుబొమలకి ఎక్కువగా పనిచెప్పడం కొన్ని సందర్భాలలో భాసించలేదు. పతనానికి ఉద్యమిస్తున్న సందర్భంలోనూ, పశ్చాత్తప్తుడై విరాగి అయిన పతాక సన్నివేశంలోనూ మాత్రం నటన బాగున్నది.

అన్ని విధాల దెబ్బతిని, ఆ పైన కళ్లు తెరచిన భవానీశంకరుడి భూమికను రంగారావు చాలా బాగా ఒప్పించాడు. అద్యంతం ఒకే స్థాయిలో సాగిపోనివ్వకుండా, భ్రష్టుడైన భవానీ దైన్యస్థితిని జాలితోపాటు నవ్వుపుట్టేట్టు రంగారావు ఈ భూమికను పోషించాడు. సుబ్బిసెట్టి పాత్ర నిర్వహించిన రేలంగి ఉన్న మేరకు అద్భుతంగా ఒప్పించాడుగాని, స్వతస్సిద్ధమైన ప్రతిభ ముద్ర కనబడదు. బిల్వమంగళుడి భార్య 'రాధగా' జమున నటించింది. ఈ తరహాభూమికలను స్వతస్సిద్ధంగా ఒప్పే నిగ్రహంగల కొద్దిమందిలో ఆమె ఒకరు.

*(ఆంధ్ర-వారపత్రిక - 1959)*

తక్కిన భరణీవారి సినిమాలకు వచ్చినంత పేరు దీనికి రాలేదు. పెద్దగా విజయవంతం కాలేదు.

# సమీక్షా రమణీయం (హిందీ)

# మదరిండియా



రంగులూ, సెట్టింగులూ మొదలైన హంగులు ఎక్కువగా వున్న చిత్రంలో కథ, కథనం అఖండంగా వుండవన్నది కొందరికి కొండగుర్తు. ఈ హంగుల భరోసా చూసుకుని, అసలు విషయాల గురించి అట్టే గట్టిగా పట్టించుకోరన్నది ఈ సూత్రంలో తాత్పర్యం.

ఇది నిజమని నమ్మేవారిని, కాదని ఒప్పించగల గొప్ప చిత్రం "మదరిండియా" (మహబూబ్ ప్రొడక్షన్స్). ఎందుకంటే ఇందులో రెండూ ఉత్తమమైన స్థాయిని అందుకుని నిలబడ్డాయి (చాలా సేపు).

జీవితం అంత నిజంగా, సహజంగా వున్న కథను దర్శకనిర్మాత మహబూబ్ ఇందులో చెప్పారు. ఇది పదిహేనేళ్ళ క్రితం ఒకసారి చెప్పినదే. ఈసారి టెక్నికలర్‌లో మళ్ళీ చెప్పారు. అప్పుడది చాలా బాగుందనిపించుకుంది. ఇప్పుడిది ఇంకా బాగుందనిపించుకుంటుంది. ఎందుకంటే ఇపుడు అందుబాటులో వున్న సాంకేతిక సదుపాయాలన్నిటిని మహబూబ్ సద్వినియోగం చేసుకున్నారు. స్టార్ వాల్యూకు రెట్టింపు శక్తి గల ముఖ్య నటి నర్గిస్ తన ప్రతిభ నంతటినీ ఇందులో చూపించింది ఛాయాగ్రహణ దర్శకుడు ఫర్దూన్ ఇరానీ తన చాకచక్యాన్ని, తన విద్యలో శిల్పాన్ని అనల్పంగా ప్రదర్శించారు.

అన్ని విధాలా అన్యాయం చేస్తున్న విధిని, శాయశక్తులా ఎదురుతిరిగిన జీవితాన్ని ధైర్యంగా ఎదిరించి, కష్టాలను ఓర్పుతో భరించి, వానలకూ వరదలకూ నిభాయించుకుని నెగ్గుకొచ్చిన రైతుస్త్రీ రాధ బాధల గాధను నటి నర్గీస్ మరువరాని విధంగా చెప్పింది. చిత్రం ఆరంభంలో, ఆ 90 యేళ్ళ ముసలిపట్ల గ్రామస్తులు చూపిన పూజ్యభావం, గౌరవం అక్షరాలా రాధ కష్టపడి సంపాదించుకున్నవే తప్ప పి.జి. జోషి అమోఘంగా మేకప్ చేయడం గాని, ఇరానీ అద్భుతంగా ఫోటో తీయడం వల్ల గాని, పత్రికలలో వార్త పడుతుందన్న ఆశ వల్ల గాని కాదని నర్గీస్ నిరూపించింది. ప్రేక్షకుడికి ఆ నమ్మకం, గౌరవభావం కలిగించింది.


దర్శకుడు మహబూబ్‌ఖాన్

దర్శకుడు మహబూబ్ కథను తెరమీద చిత్రీకరించిన విధం అత్యంత మనోహరంగా వుంది. అత్తాకోడళ్ళ కథ, ఆలుమగల ప్రేమ కథ, తను పెద్దదై తన పిల్లలు చేతుల్లో పెరిగిన కథ - ఇలా ఒక్కొక్క సన్నివేశం ఒక్కొక్క మనోహరమైన మరపురాని కథ. ఆనందంలాంటి సుధ. అన్నీ కలిసి ఇంకో మంచి కథ. తల్లిగా రాధ పడ్డ కష్టాల కథను చెబుతున్నప్పుడు మధ్యలో ఆమె సుఖంగా వున్ననాటి సంఘటనలను అతినేర్పుగా చొప్పించాడు దర్శకుడు. పెళ్ళి అయిన కొత్తల్లో చూపదగు కొన్ని సన్నివేశాలను ఇందుకోసం తాయలంలా అట్టేపెట్టి వుంచారు. ఈ తాయలం రుచి గతజీవితస్మృతుల మాధుర్యం ఎరిగినవారికి, కష్టపడుతున్నప్పుడు సుఖపడ్డ రోజులకు గుర్తుకుతెచ్చుకుని సంతోషపడి ఉత్సాహం, ఆత్మవిశ్వాసం తెచ్చుకునేవారికీ బాగా తెలుస్తుంది. వీటిని వాడడంలో కూడా దర్శకుడు మెచ్చదగ్గ మితి, పొదుపు చూపాడు. ఈ ఘట్టాలకు బరువు చేకూర్చింది ఛాయాగ్రహణం. సంభాషణలు లేనిచోట్ల, వాటికి అందని చోట్ల ఇదే వ్యాఖ్యానంగా భాసించింది. ఒక మంచి వాక్యం కాని, ఒక పెద్ద కావ్యం గాని వర్ణించి చెప్పగల అందమైన దృశ్యాలను చూపించింది. కొన్ని ఘట్టాలకు ఇరానీ చిత్రవ్యాఖ్య, నేపథ్యసంగీతంగా వినిపిస్తుంది కూడా. అందుకే కొన్నిచోట్ల నౌషాద్ వాద్యసంగీతం వినిపించలేదనిపించింది.



అలాగే అత్యంత మనోహరంగా వున్నవి రాధ భర్త పాత్ర ధరించిన రాజ్‌కుమార్ విగ్రహం, నటన. అలాగే రాధ చిన్నకొడుకు చిన్నప్పటి వేషం వేసిన మాస్టర్ సజీత్ ఈ పిల్లాడు చూట్టానికి ముద్దొస్తాడు. పిల్లలందరూ అంతే. ఎటొచ్చీ సినిమాలలో పిల్లలు, దర్శకుల పుణ్యమా అని అట్టేసేపు మనోహరంగా వుండరు - ముదర డైలాగులు అనవలసిరావడం వలన. ఈ చిత్ర దర్శకుడు అలాంటి పాపానికి ఒడిగట్టలేదు. వాడి ఈడుకి తగ్గట్టే ఆడించారు. ఏడిపించారు. వాడి ఊహలనే అనువదించారు. 'వెళ్లి చూడండి' అని మీరు మీ పక్కింటివాళ్లకి చెప్పినపుడు, అందుకో ఇదో కారణం అవుతుంది.

ఈ చిన్నకొడుకు పెంకెఘటం. అందుకే వుండుండి ఇంటర్వెల్‌కి కాస్త అటూ ఇటూగా గబుక్కున సునీల్‌దత్ అంత పెరిగిపోయాడు.

మహబూబ్ పాత చిత్రం 'ఆన్'లో నాయకుడు దిలీప్‌కుమార్. ఇందులో దిలీప్ లేని కొరతను సునీల్ కొంత భర్తీ చేయదలిచాడు. అదీకాక, మార్లన్ బ్రాండోని ఎపుడైనా బుక్ చేయాలని దర్శక నిర్మాత అనుకున్నారేమో తెలియదు. అదీకాక, అమెరికన్ పల్లెటూరి కుర్రాడి తరహాలను బ్రహ్మాండంగా చిత్రిస్తాడని కొందరిచే అనిపించుకున్న కీ.శే. జేమ్స్ డీన్ నటన (ఈస్ట్ ఈడెన్, జైంట్) కూడా ఆయనకు బాగుండి వుండవచ్చు.

బహుశా అందువల్లనే భారతీయ గ్రామీణ యువకుడుగా సునీల్‌దత్ ఈ చిత్రంలో నటించడంలో దిలీప్‌కుమార్ సంభాషణలు చెప్పే పద్ధతిని, బ్రాండో బ్రాండ్ నటనను, పుణికి పుచ్చుకుని అపహరించాడనిపిస్తుంది. కారణాలూ, నిజాలు ఏవి



అయినా మానినా, ఈ మనిషి ప్రవర్తన, నటన చూస్తూ వుంటే మదరిండియా మీద గలిగిన గౌరవాభిమానాలు బ్రదరిండియా మీద కలగవు.

అలాగే ఈ చిత్రం ఉత్తరార్ధంలో కథా కమామిషూ కూడా మొదట కలిగించిన ఉత్సాహాన్నీ, తృప్తినీ కలిగించదు. ఆరంభశూరత్వంతో ఆరంభించిన కార్యక్రమంలో ఇంటర్వెల్ తరువాత ఏర్పడే పరిస్థితే ఈ సినిమా ఇంటర్వెల్ తరువాత కూడా వచ్చిందనిపించింది.

'మా కీ కంగన్' మూలంగా బరితెగించిన చిన్నకొడుకు హఠాత్తుగా మార్క్ అఫ్ జోరో ఫక్కీలో బోలెడు తుపాకీలు, గుర్రాలు సైన్యం తెచ్చుకుని అఘాయిత్యాలు చేయడం, మిగతా కథలో సరిగా కలవదు. అయినా అతనివల్లనే త్యాగబుద్ధి, ఆదర్శ కార్యాచరణ అగత్యం అవుతాయి కాబట్టి ఈ ప్రశ్నలు తలచుకోరాదు.

అలాగే అంత చక్కని అవుట్‌డోర్ దృశ్యాలు తీసిన ఇరానీ కొన్ని చోట్ల పెయింటింగ్‌లతో ఎందుకు సర్దుకున్నారన్నది కూడా ఆలోచించడం అనవసరం. అవాంఛనీయం కూడా. సంగీత దర్శకుడు నౌషాద్ కూడా ఈ చిత్రం పూర్వార్థం బాగుందనే కాబోలు, అక్కడే రెండు మూడు మంచి పాటలు వినిపించారు.

*(ఆంధ్ర-వారపత్రిక –1957)*

'మదరిండియా' (1957) దర్శక నిర్మాత మహబూబ్‌ఖాన్‌కు, కథానాయిక నర్గీస్‌కు ఫిలింఫేర్ అవార్డులు తెచ్చిపెట్టింది. నర్గీస్‌కు 'పద్మశ్రీ'ని, భర్తనూ కూడా తెచ్చిపెట్టింది. రాజ్‌కపూర్ ప్రియురాలిగా పేరుపడ్డ నర్గీస్ ఈ చిత్రం షూటింగ్‌లో జరిగిన అగ్నిప్రమాదంలో తనను కాపాడిన సునీల్‌దత్‌ను వివాహమాడింది. అతడు అన్య మతస్థుడు, ఒక సంవత్సరం చిన్నవాడు (27 సం.లు). ఈ చిత్రం తర్వాత నర్గీస్ సినిమారంగంనుంచి వైదొలగింది కానీ, సోదరుడు అన్వర్ హుస్సేన్‌కై 'రాత్ ఔర్ దిన్' (1967)లో నటించి ఊర్వశి అవార్డు గెలుచుకుంది.

మహబూబ్‌ఖాన్ గొప్ప దర్శక నిర్మాత. 'మదరిండియా' మాతృకయైన 'ఔరత్' (1940),అందాజ్ (1949), ఆన్ (1952), అమర్ (1954), వంటి ఎన్నో ఉత్తమ చిత్రాలు తీశారు. ఈ చిత్రంలోని ఇతర నటులు రాజేంద్రకుమార్, రాజ్‌కుమార్ దరిమిలా ప్రఖ్యాతులయ్యారు. ఈ సినిమా తర్వాత 'సన్ ఆఫ్ ఇండియా' (1962) తీసినా అంత పెద్దగా ఆడలేదు.

మదరిండియాను తెలుగులో 'బంగారుతల్లి' పేరుతో జమున ముఖ్య పాత్రధారిణిగా పునర్నిర్మించారు.



# కాగజ్ కె ఫూల్

గురుదత్ సినిమాస్కోపు చిత్రం 'కాగజ్ కే ఫూల్' ఎంత బావుంటానని ఆశ పెట్టిందో అంతా నిరాశ కలిగించగలిగింది. ఒక సమర్థుడి ప్రజ్ఞ, విలువైనకాలం, బోలెడంత డబ్బు, రెండు మూడు మైళ్లు సెల్యులాయిడ్ ఫిలిం అన్నీ వృధా అనిపించింది. పేరులాగ ఈ చిత్రం కూడా రంగూ రుచీ వాసనాలేని పువ్వు. సాంకేతికమైన హంగులవల్ల, గురుదత్‌కు గల ప్రతిభవల్ల రూపురేఖలు మాత్రం అందంగా కుదిరిన చిత్రం చక్కని పువ్వులా తయారైంది. అంతే. ఇది ఇలా జరగడానికి కారణం కథలోని ముఖ్యపాత్ర దిగులుగా, మెతకగా ఉండడం కథకి లక్ష్యశుద్ధి లేకపోవడం.

ఇది ఒక ఫిలిండైరెక్టరు వ్యథ. అతని సినీజాతకం విజ్ఞానికి ఏమంత అద్భుతమైనదిగా కూడా తోచదు. ఓ మోస్తరు దర్శకుడు. అతడు ఒక కలవారింటిపిల్లని పెళ్ళిచేసుకుంటాడు. ఆమెకీ, ఆమె కన్నవారికీ, సినిమావాళ్ళంటే చిన్నచూపు, చులకన. అందుకని ఆమె అతన్ని సినిమాపని వదలివెయ్యమంటుంది. అతను వినకపోయేసరికి తనే అతన్ని వదిలేసి పుట్టినింటికి వెళ్ళిపోతుంది. డైరెక్టరు కుప్పకూలిపోతాడు. ఆ విచారంలో అతడు ఎలాగో 'వహీదా రెహమాన్'ను చేరదీసి కొత్తతారగా తన చిత్రంలో పరిచయంచేస్తాడు. ఆమె తీరా తారాపథాని కెక్కాక, కథ



కాగజ్ కేఫూల్ పోస్టర్

బలీయం కావడంవల్ల కొన్ని సినీ కారణాలు పట్టుకుని అతనికి దూరంగా పోతుంది. అందుకోసమే ఆగినట్లు అతను హడావుడిగా దుఃఖసముద్రంలో మునిగి మదిరాసముద్రంలో తేలుతాడు. ఇలా కొన్ని రీళ్ళు తిరిగాక అర్థరహితమైన మరణం– ఎటొచ్చి ఫోటోజెనిక్‌గా – పొందుతాడు. అతను ఏ కాస్త ప్రయత్నించినా ఇంత జరిగేది కాదని మనకు అనిపిస్తుంది. కాబట్టి చివర్న అతని మీద సానుభూతి కలగదు. సినిమా వారిమీదా కలుగదు.



కాని, గురుదత్‌వంటివాడు చిత్రం తీసినపుడు సినిమామీద ప్రజలకు గల దురభిప్రాయాలను పోగొడతాడని అనుకుంటాం. అతనలా చేయకపోతే బాధపడతాం. పోనీ అలాంటి పనులు కాకపోతే పోయె, హృదయంగమమైన కథను చెప్పాడా? హృదయాన్ని బద్దలు చేసేటంత దుః ఖస్థితిని, అందులో ఒక మానవుడి క్షుభితహృదయాన్ని ఆవిష్కరించాడా – అదీ జరగలేదు. గుండె బద్దలుకావడం కాదు గదా, బీటకూడా వెయ్యదు – ఎంత జాలిగుండె ప్రేక్షకుడికైనా. ఈ విధంగా గురుదత్ చేసిన ఈ ప్రయత్నం బాధ, నిరాశ కలిగించింది.

గురుదత్ స్వంత జీవితాన్ని ప్రతిబింబించిన 'కాగజ్‌కే ఫూల్' ఉత్తరోత్రా క్లాసిక్‌గా పేరుబడ్డా విడుదలయినప్పుడు కమ్మర్షియల్‌గా ఫెయిలయింది. ఛాయాగ్రహణానికి పేరు తెచ్చుకున్నా సంగీతం విషయంలో 'ప్యాసా' స్థాయిని అందుకోలేకపోయింది. గురుదత్, వహీదా స్నేహం సినిమాలోలాగే అతని వైవాహికజీవితాన్ని ఛిద్రం చేసింది. ఈ చిత్రకథానాయకుడిలాగే గురుదత్ కూడా తాగుడుకి బానిసై, నిరాశతో 39 వ యేట ఆత్మహత్య చేసుకున్నాడు. 'కాగజ్ కేఫూల్' పరాజయం తన దర్శకత్వ వైఫల్యంగా భావించిన గురుదత్ ఆ తర్వాత విజయవంతమైన సినిమాలు ఎన్నో తీసినా దర్శకత్వం వేరేవారికి అప్పగించాడు.

ఇక సాంకేతికంగా ఈ చిత్రం మెచ్చుకు తీరవలసినదే. చక్కని ఛాయాగ్రహణం – మనదేశానికి తొలిసారిగా సినిమాస్కోప్‌లో కథను నేత్రపర్వంగా చూపించింది. గురుదత్ దర్శకత్వశిల్పం ఆయా సన్నివేశాలను ఎంతో అందంగా సున్నితంగా చెక్కి మరీ చూపింది. సంగీతం యథాశక్తి తోడ్పడింది. ఆయా పాత్రలకు ఉన్న అవధులలో దర్శకుడుగా గురుదత్ ఎంత జాగ్రత్తగా నటించినా అది

రాణింపుకు రాలేదు. అతనికి స్నేహితురాలై మనశ్శాంతిని కల్గించిన తారగా వహీదా ప్రశంసనీయంగా నటించింది. జానీవాకర్ మామూలుగా చేసే అల్లరి ఈ దిగులు కథలో ఏమూలా ఆనలేదు. అందరికన్న మిన్నగా తన పాత్రను ధరించినవాడు - దర్శకుడి మామగారుగా నటించిన మహేష్‌కౌల్. బర్మన్ సంగీతం బాగుంది. కాని, లక్ష్యహీనమైన ఈ కథనుమటుకు అరంగుళం కూడా ఉద్ధరించలేకపోయింది.

*(ఆంధ్ర-వారపత్రిక - 1959)*

# జాగ్తే రహో

పెద్ద మనుషులు సంచరించే జనారణ్యంలో, మంచినీళ్ల కోసం ప్రవేశించి నానా అవస్థలూ పడిన లేడిపిల్లవంటి పల్లెటూరి చిన్నమనిషి కధను రాజ్‌కపూర్ ఉత్తమం అని మెచ్చుతగ్గ, కొత్త (మనదేశంలో) పద్ధతిలో చలనచిత్రంగా నిర్మించారు. చిత్రం పేరు 'జాగ్‌తే రహో' (పారా హుషార్). శంభుమిత్ర, అమిత్ మైత్ర, అనే బెంగాలీ యువకులిద్దరు ఈ కథను వ్రాశారు. దర్శకత్వం కూడా వారే నిర్వహించారు. ఇది వారి ప్రధమ ప్రయత్నం. సంభాషణలు క్వాజా అహమ్మద్ అబ్బాస్ వ్రాశారు.

బొంబాయి కలకత్తా వంటి నగరాలలో వంద, వందయాభై కుటుంబాలుండే పెద్దసైజు జనతా నివాస్ ఈ చిత్రానికి కధాస్థలం. ఆ మేడకి పది పన్నెండు అంతస్తులుంటాయి. అందులో కాపురం వుండేవారి సౌజన్యం, సహృదయతలతో, అంతస్తుల తేడా ఎలా ఉన్నా, ఆర్థికంగా మధ్యతరగతి, ఎగువ మధ్యతరగతి అని రెండే అంతస్తులు. ఒకరోజు రాత్రి ఒంటిగంటవేళ బస్తీ వచ్చిన ఒక పల్లెటూరి ఆసామికి దాహం వేస్తుంది. వీధి కుళాయి నీరు త్రాగబోయేవేళ పహరావాడు హడలగొడతాడు. ఊరూ పేరు లేని ఆ మనిషి, ఈ పెద్దభవంతి ఆవరణలోకి వెళ్ళి అక్కడ నీరు త్రాగబోతాడు. ఈసారి పహరావాడికి బాగా అనుమానం వేస్తుంది. దొంగ అని కేకలువేస్తాడు. దొంగకాని దొంగ, బెదిరిపోయి, అడవిలాంటి ఆ మేడ లోపలికి, పెద్దమనుషుల మధ్యకి పారిపోతాడు. అక్కడనించి, సంఘం రెండువందల మంది సభ్యుల కూపంలో అతణ్ణి తరిమితరిమి కొడుతుంది. ఈ వాటానించి, ఆ వాటాకి, ఆ గదినించి ఈ గదికి, క్షణం నిలకడలేకుండా పరుగులు పెడతాడు ఆ మనిషి. అలా పారిపోతున్న అతడికి తెరవెనుక భాగోతాలూ, నిజాలవెనక నిజాలు, గోచరిస్తాయి. దొంగలూ, దొరలూ, వంచకులు, వంచితులూ పరిచితులవుతారు పరిస్థితులు ఎటు పొమ్మంటే అటు, ఎండుటాకులా ఎగిరిపోతూ, లేస్తూ పడుతూ, ఆపదల నీడలోనే పరుగులు పెడుతున్న ఆ ఆసామి ఇవన్నీ చూసి విస్తుపోగలిగేటంత అమాయకుడు. తన పీకెమీది కత్తిని క్షణంసేపు మర్చిపోయి, ఆపదలో వున్న ఎదటి మనిషిమీద జాలిపడగల మంచిమనసువాడు. సరే ఈ దొంగ కోసం ఇల్లంతా గాలించి పెంకులు తిరగేసేసరికి అక్కడున్న సిసలైనతేళ్లూ పాములూ చీడపురుగులూ బయటపడిపోతాయి. తెల్లవారే సరికి చీకటిజీవులన్నీ తలవంచుకుని సర్కారువారి చీకటిగదుల్లోకి వెళ్తాయి. ఇదే కథ.

దర్శకులు ఈ కథలో విశిష్టమైన ఈ పాత్రను ప్రశంసనీయంగా చిత్రీకరించారు. నోరూ వాయిలేని మనిషి కాబట్టి, మొదటినించీ చివరివరకూ కనపడుతూనే వుండే ఈ పాత్రకు సంభాషణలు పెట్టలేదు. ముంధు ఒకసారి, చివర

ఒకటి రెండుసార్లు మాత్రం మాట్లాడిస్తారు. కథను నడిపేవి, కథలోని మిగతా పాత్రల పట్ల ప్రేక్షకులకు అనురాగం, ద్వేషం కలిగించేవీ, సంఘ దురాచారాలను దుయ్యపట్టేవీ, హేళన చేసేవీ ఈ పాత్ర నిర్వహించిన రాజకపూర్ ప్రదర్శించిన హావభావాలే. గురుతరమైన ఈ బాధ్యతను రాజ్‌కపూర్ ఎక్కడా 'అతి' అనిపించకుండా, సమర్థంగా నిర్వహించాడు.

కొత్తరకాల కత్తియుద్ధాలు, హాలివుడ్ హాట్ నంబర్ బాణీలు, విదేశీవాళీ డాన్సులూ, మొదలైన బాక్సాఫీసు 'సూత్రాలు' ఈ చిత్రంలో పారిపోతున్న 'దొంగ' కాళ్ళకి అడ్డంపడి, అతన్నీ, కథనీ, అట్టే నిలబెట్టడానికి దర్శకులు ఆస్కారం ఇవ్వలేదు ఈ చిత్రంలో. ఐదు పాటలూ, రెండు నృత్యాలూ ఉన్నవి అవి కథాగమనానికి అడ్డురాకుండా చూపించారు. సలిల్‌చౌధురి వాటికి కూర్చిన సంగీతం చాలా బాగుంది. ఇందులో పురుషులు పాల్గొనే ఒక పంజాబీ జానపద నృత్యం అత్యంత ఆకర్షణీయంగా ఉంది.

మోతీలాల్, నీమో, పహాడీ సన్యాల్, ప్రదీప్‌కుమార్ వంటి పెద్ద నటులందరివీ కూడా చిన్న చిన్న వేషాలే అయినా గొప్పగా నిర్వహించారు. సుమిత్రాదేవి, స్మృతి బిశ్వాస్ కూడా చక్కగా నటించారు. చిత్రంలో ప్రతి సన్నివేశంలో చక్కని హాస్యం, విమర్శ, హేళన మిళితమై ఉన్నాయి. అనేక సందర్భాలలో ఉత్కంఠ చక్కగా పోషించబడింది. మోతీలాల్, సుమిత్రాదేవి పాల్గొన్న ఘట్టంలో మాత్రం పతివ్రతా ధర్మంపై కొంత విజ్ఞాన గోష్ఠి జరిపించారు కానీ, మోతీలాల్ ప్ర భ వల్ల అది బాగానే ఒప్పింది.



మొత్తంమీద కథాచిత్రణలోనూ, ప్రధానపాత్ర చిత్రణలోనూ కూడా రాజ్‌కపూర్‌కు, చార్లీచాప్లిన్ పద్ధతి పట్ల గల గురుభావం, 'సిల్లీ'గా కనపడే, స్టాన్ లారెల్, ఆలివర్ హార్డీల శిల్పం పట్లగల అభిమానం గోచరిస్తాయి. శ్లాప్‌స్టిక్ కామెడీ శిల్పాన్ని కూడా దర్శకులు ఎక్కడా వికటించకుండా సద్వినియోగం చేసుకున్నారు.

'జాగ్‌తే రహో' చిత్రం, అందులో రాజ్‌కపూర్ నిర్వహించిన పాత్ర చలనచిత్రాల కథలో ఒక విశిష్ట సొగసు సంపాదించుకుంటాయి.

ఈ చిత్రం బొంబాయి నగరంలో తయారవడం గొప్ప విశేషం. ఈ ప్రయత్నానికి పూనుకుని మంచి ఫలితం సాధించిన రాజ్‌కపూర్ అభినందనీయుడు.

'జాగ్‌తే రహో' బెంగాలీ ప్రతి 'ఏక్‌దిన్ రాత్రే' (ఒకరోజు రాత్రి) అన్న పేరుతో బెంగాల్‌లో విడుదల అయి బహుళ జనాదరణ పొందింది.

'జాగ్‌తే రహో' ఒకసారి తప్పక చూడదగిన చిత్రం.

*(ఆంధ్ర-వారపత్రిక - 1956)*

'జాగ్‌తే రహో' సినిమా ఆర్థికంగా విజయవంతం కాకపోయినా, రాజ్‌కపూర్‌కు ఎనలేని ఖ్యాతి గడించిపెట్టింది. దీని తర్వాత 'అబ్ దిల్లీ దూర్ నహీ' అనే బజెట్ సినిమా తీసిన రాజ్‌కపూర్ ఆ తర్వాత ఫక్తు కమ్మర్షియల్ సినిమాలే తీశాడు. తెలుగులో 'తిరుపతి' అనే సినిమా జాగ్‌తే రహో ఆధారంగా తయారయింది.



# ప్యాసా

'చచ్చినవాడి కళ్ళు చారెడేసి' అన్నవాళ్లు, కేవలం యతి షోగ్గా కుదిరింది గదా అనే ఆమాటను అనలేదు. లోకపు తీరును చూచి చూచి, తూచి చూచి మరీ ప్రవచించారు.

లోకోక్తులలో ఎంత సత్యం ఉందో అంతటి సౌందర్యం కూడా ఉంటుంది. ఎంతటి వాడితనం ఉందో అంత పనివాడితనం ఉంటుంది, అనల్పమైన శిల్పం ఉంటుంది. దానివల్లనే ఆ ఉక్తులలో శక్తి స్థిరమై నిలుస్తుంది. అవి ఎన్నాళ్ళయినా మాసిపోవు, మారిపోవూ, చెరిగిపోవు.

వాటిలో కనబడే ఈ శిల్పం, పనివాడితనం తీరి కూర్చుని తీర్చి దిద్దిన వనిపించదు. కృత్రిమత్వం కనిపించదు. అవి స్వచ్ఛమైన పాలు. వాటిలో నీరు కలపలేదు. కలిపితే ఎలా తయారవుతాయో తెలుసుకోవాలంటే, "ప్యాసా" (గురుదత్ ఫిలింస్) చిత్రాన్ని చూడవచ్చు. బొంబాయి బాక్సాఫీస్ తీర్థ మహాత్మ్యం బాగా తెలుసుకోవాలంటే మరోసారి కూడా చూడవచ్చు, (పనిలో పనిగా, "గొప్ప ప్రయత్నం చేసిన ఒక మంచి కళాకారుడి కృషిని" ప్రోత్సహించినట్లవుతుంది.)

చచ్చినవాడి కళ్లు చారెడు. అందుకనే, "నువ్వు అమాంతం గొప్పవాడివి కాదలచుకుంటే హఠాత్తుగా చచ్చిపో" అన్నాడు – మనుషులనూ, వాళ్ల మనసులనూ తూచి చూచి, గుణగణాలను కాచివడబోసి వంటబట్టించుకున్న ఒకాయన; ఊచిపుచ్చుకు చెంపకాయ కొట్టినంత గట్టిగా.

అలా ఎవడేనా హరీమన్నా, అన్నాడని ఖరారుగా తెలిసినా మర్నాడు తెల్లారేసరికల్లా నలుగురూ "ఆ పోయిన ఫలానావాడు చాలా గొప్పవాడేస్మీ! ఆ వైనం వాడు బతికుండగా మనం పసిగట్టలేకపోయాము" అని పబ్లీకున ఒప్పేసుగుని, వాడి కళ్లు చారెడేసి ఉండేవని "తీర్మానాలు పెట్టేస్తారు" శక్తికి మించిన మంచితనంతో.

కాబట్టే, ఆ చచ్చినవాడు మళ్ళీ బతికొచ్చి, నేను చావలేదుస్మండీ అదృష్టవశాత్తూను అంటే, తక్షణం ఆ యొక్క లోకుల దృష్టిలో వాడి చారెడేసి కళ్లు చింతాకులంత చిన్నవై ఊరుకుంటాయి. వాళ్లు వాణ్ని భరించలేరు; వాడు బతికున్నానని నిజం చెబితే సహించలేరు అని చాటి; సత్యాన్ని నిరూపించి స్థాపించడం "ప్యాసా" దర్శకనిర్మాత గురుదత్ లక్ష్యం.

ఈ లక్ష్యం లక్షణం గురుదత్‌కు మన చలనచిత్ర కళాకారులలో అగ్రశ్రేణి స్థానాన్ని ఇస్తుంది. అయితే, దీన్ని ప్రజలకు అందచేయడం కోసం అతడు కల్పించిన

కథను పరికిస్తే, అందులోమటుకు పరిణతినందిన కళాకారుడి ప్రతిభ తాలూకు క్రీనీడలు కూడా కనబడవు.

ఇందులో ఉన్న మంచి ముత్యంలాంటి జీవిత సత్యాన్ని, దాని చుట్టూ కథ పేరిట పూసిన బొంబాయి మసినీ పోల్చిచూసినపుడు, ఆ సత్యాన్ని చూచిన దృష్టికీ, దాన్ని ఈ చిత్రకథలో అమర్చడానికి చోటు వెదకిన దృష్టికీ చాలాదూరం ఉందనిపిస్తుంది. అదెవరిదో ఇదెవరిదో తెలియదుగాని, రెండోదిమటుకు ఏమంత అఖండమైన దనిపించదు. "లోకానికి" గట్టిగా


గురుదత్

మొహంవాచేలా చీవాట్లు పెట్టేసి, సంఘాన్ని కాస్త సంస్కరింపచేసి, వీలైతే దేశాన్ని మరో అరంగుళం ఉద్ధరించెయ్యాలన్న ఉత్సాహం, వేడీ మాత్రం ఇందులో కనిపిస్తాయి. కాని, ఎందుకు కోప్పడుతున్నావు అని ఎవరూ అడిగే అవసరం లేకుండా ముందుజాగ్రత్త ఉండాలన్న ఆలోచన ఉన్నట్లు కనిపించదు.

"ప్యాసా" ఒక కవి కష్టాల కథ. అతను పద్యాలు రాస్తాడు.

అతడు మంచి కవిత్వమే వ్రాస్తాడు అని గురుదత్ ఫిలింస్‌వారు ముందుగా సర్టిఫికేట్ ఇచ్చారు ఆ పద్యాలను లోకం ఆదరించలేదు. అయితే 'లోకానికి', ఫలానా విజయ్ అనే వయోజనుడు కవిత్వం రాస్తున్నాడని పన్నెండు రీళ్ళు ఫిలిం తిరిగేవరకూ తెలీదు. కాబట్టి లోకం అంటే, మొదటి రెండు రీళ్ళలోనూ చెప్పుకోవలసిన అర్థం ఒక చిన్న బస్తీలోని పత్రిక సంపాదకుడు అని. దర్శకుడు గురుదత్ అతన్ని కూడా వఠి వెర్రివెంగళాయిగా, సర్కస్ బఫూన్‌గా, కుడి ఎడమలు తెలియని అవివేకిగా (బొంబాయి ఫిలిం వయోజనుల దృష్టి అంతకుమించి ముందుకుపోలేదు. ఇది మామూలే.) చూపించి నందువల్ల, కథ ప్రకారం కాబోయే మహాకవీ, మనుష్యుల తత్వాలను, జీవిత సత్యాలను చక్కగా ఆకళించుకు మరీ కవిత చెప్పగలిగిన ధీశాలీ అయిన విజయ్, అటువంటి వాడిచుట్టూ తిరగడమే ఒక తప్పు. (ప్రపంచంలో ఇంక పత్రికలే లేనట్టూ, ఆ ఉన్న పత్రికకూడా చిన్నదనీ, కాబట్టి ఈ కవితను అచ్చువేసినా అట్టే ఇచ్చుకోలేదనీ చూస్తే తెలుస్తూనే ఉందీ, ఆ పైన, ఆ జడ్డి సంపాదకుడు తనను ఆదరించనందుకు ఈ కవి సరాసరి పార్కు కెళ్ళి అక్కడ బెంచిమీద పడుకుని బెంగెట్టుకోవడం తప్ప మరోప్రయత్నం చేయకపోవడం మరో తప్పు. బియ్యే గ్రాట్రాపాసైన వాడు, ఉద్యోగంలాంటి ప్రయత్నాలు చేస్తాడని అతన్ని చదివించినవాళ్లు ఆశించడం సహజం. అది చెయ్యకపోతే విసుక్కోడం కూడా సహజమే. అదీ ఒక తప్పుగానే "బొంబాయి సినిమా వైద్యులు" చూపించారు. కాగా ఐదారు రీళ్లయ్యాక 'లోకం' అన్నమాటకు మరో అర్థం ఒక ప్రచురణకర్త. తనభార్య

కాలేజీరోజుల్లో ఈ కవిని ప్రేమించిందని, ఇంకా మథనపడుతున్నదనీ తెలిసినందువల్లా, అతడు ఆ కవిత్వం మీద పేరూ డబ్బూ గడించుకోలేక పోయినందువల్లనే తన భార్య అతని ప్రేమను ఒకప్పుడు త్రోసిరాజన్నదని తెలుసుకునే తెలివితేటలున్నందువల్లా, ఆ ప్రచురణకర్త స్వయంగా ఈ కవి పురోభివృద్ధికి దోహదం చేయకపోవడం సహజం. ఇంతకుమించి కవికి అన్యాయం చేసిన 'లోకం' ఏమిటో ఈ కథ ప్రకారం బోధపడదు. అసలు లోకానికి తెలీదుగదా. ఇతడు బాధపడుతున్నాడని! లోకానికి తెలిసే ప్రయత్నాలు చేసినట్టు సూచనప్రాయంగా చెప్పడం కూడా జరగలేదు.



గీత రచయిత సాహిర్

కాని ఇదే గురుదత్ విన్యాసాలకు ఆధారం. ఆ కవిని చూచి మనం జాలిపడాలని కోరుతూ అతడు చూపిన కారణం. ఈ విధంగా బద్ధకిష్టి అయి ఉండి, పైగా లోకం తనకి అన్యాయం చేసిందని బాధపడి, అందుకోసం తనమీద అందరూ జాలిపడాలనే వాడినిచూస్తే చిరాకు కలుగుతుంది.

అయినా గోరంతలనే గురుదత్ కొండంతలుచేసి చూపించారు. ఒక విషయాన్ని కళాదృష్టితో చూచి చూపించినపుడు, భూతద్దం ఉపయోగించడం, అతిశయోక్తులు విరివిగా వాడడం పరిపాటే. కాని, దానికైనా ప్రాతిపదిక కట్టుదిట్టంగా ఉండాలి. నిజమే అని నమ్మతగ్గదిగా ఉండాలి.

పైకి ఎగిరేవాడు ముందర కాలూనడానికి కాస్త గట్టినేల చూచుకు మరీ ఎగరడం అవసరం. ఊబి నేల మీద ఎలాగో నిలిచి అక్కడినించి ఎగరబోతే అది వీలు కాదు.

అయితే, ఇది సినిమా కాబట్టి, అందులోనూ బొంబాయి సినిమా కాబట్టి, కథకి చికిత్స చేసినవారు బొంబాయి ప్రవీణులు కాబట్టి అసాధ్యాలు సుసాధ్యాలు కావడం అద్భుత విషయంకాదు.



సరే, ఆ కవి ఓ రోజున రైలుకిందపడి చనిపోయాడని పుకారు పుడుతుంది. అతన్ని ప్రేమించిన ఒక పతితస్త్రీ, తన దగ్గిర ఉన్న కొద్ది డబ్బూ పెట్టి, అతని అముద్రిత కావ్యఖండాలను అచ్చువేయిస్తుంది. గురుదత్ కోపానికి గురి అయిన 'లోకమే', తక్షణం

పుస్తకాలు చదివి కవిప్రతిభ గ్రహించి అతన్ని గౌరవిస్తుంది.

తీరా సంతాపసభలు జరిగేవేళకు కవి స్వయంగావచ్చి ఒక పాటపాడి, నేను చనిపోలేదని చెప్పిచూస్తాడు. కాని సహజంగానే అతని పూర్వకథ తెలియని ప్రజలు ముందర నమ్మరు; తెలిసిన ప్రచురణకర్త, అన్నదమ్ములూ స్వార్థపరులై, అతనికి అన్యాయం తలపెడతారు.


గీతాదత్

కవికి లోకంమీద కోపం, ఆ తరువాత ఏవగింపు, కలుగుతాయి. తను చనిపోయాడన్న అబద్ధమే నిజమని ఖాయపరచి, వహీదారహమాన్‌తో కలిసి అలా దిగంతాలవేపు షికారెళ్లిపోతాడు సాయంసంధ్యలోకి.

అక్కడ ఇల్లూ వాకిలీ తిండీ గుడ్డా దొరికాయో లేదో మనకి తెలియదు.

అదీ కథ.

అతిసహజం అయినా అద్భుతంగా గోచరించగల ఈ జగతిరీతి గురించిన సత్యాన్ని తెలియచెప్పడానికి పై విధంగా కట్టిన ఈ కథలో "బొంబాయి నిపుణుల చికిత్స" ఫలితంగా, ఆ రెండు లక్షణాలూ కూడా శూన్యం అయిపోయాయి. అయినా అనేక విధాల "ప్యాసా" చిత్రం ప్రశంసనీయమైన కృషి ఫలితం అనాలి. 1956 బాక్సాఫీసు సూత్రాలూ వెకిలి నృత్యాలూ లేవు. కథ చిత్రణ, నటన, సంగీతం, కథాంశం (కథకాదు) స్థాయికి తగ్గట్టు ఒప్పాయి. ఛాయాగ్రహణం (వి.కె. మూర్తి) కూడా కథ తత్వాన్ని, చూసేవాడికి తెలియచెప్పగలిగే శక్తితో, చైతన్యంతో సాగింది.



కథతో ప్రత్యక్ష సంబంధం లేకపోయినా, చాలారోజులు మనసులో మెదిలి ఆలోచనలు రేకెత్తించి, తోటి మానవుల మీద జాలిపడడానికి కాస్తంత తీరుబాటు చేసుకునే సత్సంకల్పం కలిగించేటంత గొప్ప సన్నివేశాలు ఉన్నాయి. వీటిలో దర్శకుడి ప్రతిభ మెచ్చతగినది.

గురుదత్, దర్శకత్వంతోపాటు ముఖ్య భూమికను కూడా నిర్వహించాడు. అతన్ని ప్రేమించిన పతితగా వహీదారెహమాన్, వంచించిన వనితగా మాలాసిన్హా, ఆమె భర్తగా రెహమాన్ ("రాజ్‌రాణీ") నటించారు. జానీవాకర్, మహమూద్, కుంకుం ప్రభృతులు పాల్గొన్నారు.

నర్తకిగా పేరు గడించుకున్న వహీదా ఈ చిత్రంలో ఉత్తమశ్రేణి నటిగా తన ప్రతిభను నిరూపించింది. నటులలో అత్యుత్తమంగా పాత్రను పోషించినవాడు రెహమాన్.

కృత్రిమంగా, అసహజంగా, కనిపించే కథవల్ల, సానుభూతి బదులు చిరాకు కలిగించే తరహాలో రూపకల్పన చేసిన భూమికవల్ల, కవిగా గురుదత్ ప్రదర్శించిన నటన రాణించలేదు. భ్రుకుటి ముడిచి, దిగులుగా ప్రేక్షకులవంక చూడడం తప్ప అతడు చేసినదాట్టే కనపడదు. పాటలు పాడిన సన్నివేశాలుమటుకు బాగున్నాయి. పాటలకు శచిన్‌దేవ్ బర్మన్ కూర్చిన సంగీతమూ చాలా హాయిగా ఉంది. ఉన్న వాటిలో రఫీ పాడిన 'కహాఁ హై' అనే పాట చాలా బాగుంది.

మొత్తానికి, ఉన్న లోపాలన్నీ లెక్కకు తీసుకున్నా 'ప్యాసా' మంచి చిత్రం; గురుదత్ మంచిదర్శకుడు. ఎటొచ్చి బెంగాలీ, మహారాష్ట్ర, తెలుగు కళాకారుల శక్తిని ఈ సందర్భంలో ప్రస్తావించుకోరాదు. "ప్యాసా" బొంబాయి చిత్రాలలో మహావృక్షం.

**(ఆంధ్రపత్రిక - 1957)**

రమణచే ఘాటు విమర్శకు గురయిన ఈ సినిమా ఇప్పటికీ విమర్శకులచే మన్నన లందుకుంటోంది. సాహిత్య, సంగీతాలకు ఓ మైలురాయిలా నిలిచిపోయింది. కమ్మర్షియల్‌గా బాగా సక్సెయింది. తెలుగులో 'మల్లెపూవు' పేరుతో పునర్నిర్మితమైంది.

# సమీక్షా రమణీయం (విదేశీ)

## ఇన్‌టాలరెన్స్



సినిమాకు 'గ్రామరూ, గ్లామరూ' కూడా సమకూర్చిపెట్టిన అమెరికన్ దర్శకుడు డేవిడ్ వార్క్ గ్రిఫిత్‌ను ప్రపంచావధిన చలనచిత్రకళాకారులంతా 'చలనచిత్రకళకు పితామహుడి'గా ఎంచి గౌరవిస్తారు. హాలీవుడ్‌లోనే కాక, లండన్, బెర్లిన్, మాస్కోలలో కూడా చలన చిత్రాలపై దాదాపు 20 ఏళ్ళు ఆయన ప్రభావం ప్రవర్తిల్లింది. గ్రిఫిత్ చిత్రాలలో ముఖ్యమైన 'బర్త్ ఆఫ్ ఎ నేషన్', 'ఇన్‌టాలరెన్స్'లను నాటికీ నేటికీ కూడా ఉత్తమోత్తమ చిత్రాలుగా పరిగణిస్తారు. 'ఇన్‌టాలరెన్స్' (1916) చిత్రం సోవియట్ రష్యాలో వరసగా పదేళ్ళు ఆడింది.

అంతవరకు సినిమాలంటే చిన్న చూపు గలవారికి, సినిమా చూసినట్టు పబ్లీకున ఒప్పుకోడానికి భయపడేవారికీ కూడా దీనిపై గౌరవం కలిగి పెరిగేటందుకు దోహదం చేసినది 'ఇన్‌టాలరెన్స్' చిత్రమే.

గ్రిఫిత్ 1875లో పుట్టి పెరిగిన వ్యక్తి అయినందువల్ల ఆ శతాబ్దపు సారస్వతం ప్రభావం - మెలోడ్రామా మీద అభిమానం. ఇతనిలో ఎక్కువగా కనిపిస్తుందని విమర్శకులు అంటారు. ఇది మితిమీరి బాగుందని సందర్భాలు కూడా ఆయన తొలిచిత్రాలలో ఉన్నాయంటారు. గ్రిఫిత్ కొంతకాలం నాటకాలలో తిరిగాడు. నటుడు కాబోయి మానేశాడు. రంగస్థలానికి గల పరిమిత అవధులు ఆయనకు సరిపడలేదు. సినిమాలో చేరాక చిన్న చిత్రాలు చాలా తీశాడు. వీటన్నింటిలోనూ కనబడే శిల్పం మీద డికెన్సు నవల రచనా శిల్పప్రభావం ఎక్కువగా కనిపిస్తుందంటారు. డికెన్స్ అంటే గ్రిఫిత్‌కు విపరీతమైన గౌరవం. మాంటేజ్ షాట్‌లను తొలిసారి ప్రవేశపెట్టినపుడు ప్రొడ్యూసర్లతో తగాదా వచ్చినప్పుడు డికెన్స్‌నే అడ్డుపెట్టుకున్నాడు ఈయన.

'ఈనక్ ఆర్డెన్' చిత్రంలో హీరోయిను క్లోజప్‌తీసి, తరవాత షాట్‌లో ఎక్కడో దూరాన ద్వీపవాసం చేస్తున్న ఈనక్‌ను చూపి తద్వారా ఆమె భర్తను తలచుకుందని చెప్పవచ్చును అని గ్రిఫిత్ అన్నాడు. ప్రేక్షకులకు తెలీదన్నారు నిర్మాతలు.

'డికెన్స్ నవలలో ఇలాటి శిల్పం ఉంది గదా. ఆయన ఇలాగే రాశాడు గదా' అన్నాడు గ్రిఫిత్. 'ఆయన డికెన్స్, అది నవల, ఆ సంగతి వేరు' అన్నారు ప్రొడ్యూసర్లు.


దర్శకుడు డి.డబ్ల్యు గ్రిఫిత్

'అదేంకాదు, ఏమంతలేదు. ఇది బొమ్మలకథ! తేడా అట్టే లేదు' అన్నాడు గ్రిఫిత్.

1914లో 'కాబిరాయా' అనే ఇటాలియన్ చిత్రం జనాన్ని వెర్రెత్తించేసింది. అది దాదాపు సవాలుగా తీసుకుని 'బర్త్ ఆఫ్ ఎ నేషన్' తీశాడాయన. రెండేళ్ళ తరువాత 'ఇన్‌టాలరెన్స్' తీశాడు. నాటికీ నేటికీ కూడా 'న భూతో న భవిష్యతి' అంటారు గ్రిఫిత్ అభిమానులే కాక, విమర్శకులు కూడా.

అక్షరాలా బ్రహ్మాండమైన సెట్‌లు వేసి కన్నుచెదిరే గుండెలదిరేటంత గొప్పవిగా ఆయా సన్నివేశాలను తొలిసారిగా తీసి అమెరికన్ చలనచిత్ర కళాకారులకు మార్గదర్శకుడు అయినవాడు ఈయనే.

అంతవరకు లాంగ్‌షాట్, (మహా అయితే ఫుల్‌షాట్)ల మీదుగానే సాగిపోయే చిత్రాలలో మిడ్‌షాట్‌లను, క్లోజప్‌లను అద్భుతంగా వాడినవాడు ఈయనే. కామెరా నాటకం ప్రేక్షకుడి స్థానంలో ఉండాలనీ, సన్నివేశం పూర్తి అయేదాకా కదలరాదని చెప్పే మతాలను ఖండించాడు. ఉత్తిమొగం చూపించే ఆ రోజుల్లో షాట్‌ల విభాగంలో కొత్త శిల్పం ప్రవేశపెట్టడానికి గ్రిఫిత్ చాలా ప్రతిఘటనను ఎదుర్కోవలసి

వచ్చింది. మనం ఒక సంఘటనని చూస్తున్నప్పుడు దృష్టి స్థిరంగా ఉండదు. దూరపు వస్తువుమీంచి దగ్గరదాని మీదకి అక్కడినించి పక్కకి ఇలా తిరుగుతుంది. నిత్యజీవితంలో ఫలానా తరహా సన్నివేశాన్ని ప్రేక్షకులు ఎలా చూస్తారో - దేని తరవాత ఏది అనేది ఊహించుకుని ఆ ప్రకారమే షాట్‌లను విభజించడం గ్రిఫిత్ ప్రత్యేక ప్రజ్ఞ. తరువాతి వారికి ఇది మార్గదర్శకం అయింది. కాగా, ఆయన తొలి చిత్రాలలో తరమడం, ఆఖరు నిమిషంలో హీరో వచ్చి హీరోయినును రక్షించడం ఎక్కువగా ఉంటాయి. సినిమా ప్రేక్షకులను ఆకట్టగల ఈ రెండు హంగులను ఈనాటికీ ఎందరో వాడుతున్నారు. ఈ ఊహ డికెన్సు చదవగా వచ్చిందని గ్రిఫిత్ అంటారు. ఇదీ, మెలోడ్రామా పేరిట చిరాకు కలిగించే తరహా ఏడుపూ, దైన్యం చిత్రించినందుకు ఈయనను కొందరు విమర్శించారు.

'ఇన్‌టాలరెన్స్' (అసహనం) మానవుడి క్రౌర్యాన్ని చాటి శతాబ్దాల తరబడి దారుణాలు చేస్తున్న మానవుడిలోని ఈ దానవాంశను గర్హిస్తుంది. ఈ కార్యాన్ని దర్శకుడిగా గ్రిఫిత్ అత్యంత శక్తివంతంగా నిర్వహించాడు. దీనికి అపూర్వమైన (అప్పటికి) శిల్పాన్ని ప్రయోగించి, చలనచిత్రకళ అవధులను పూర్తిగా వినియోగించాడు ఆయన.

ఇందులో కరుణ రసోద్దీపకాలైన నాలుగు కథలను సమాంతరంగా నడిపారు. మొదటిదీ, ముఖ్యమైనదీ, ఉపమేయ ప్రాయమైనదీ సమకాలిక సంఘటన. ఒక కార్మికుడి మీద ఘోరనేరం ఒకటి ఆరోపింపబడుతుంది. అతడు నిర్దోషి అయినా, న్యాయస్థానం మరణశిక్ష విధిస్తుంది. ఆ స్థితిలో అతని భార్య దేశాధ్యక్షుడి వద్ద క్షమాదానం సంపాదించుకు రాబోతుంది. దీనికి సమాంతరంగా చరిత్రకందని కింద పుటలలో బాబిలోన్ విధ్వంసం, దానికి ఇవతల (1570లో) పారిస్‌లో యూజినాట్‌ల మారణహోమం చిత్రించారు. పతాక సన్నివేశం వచ్చేసరికి ఈ నాలుగు సంఘటనలను ఒక్క వరసన చురుగ్గా కలిపి చూపించారు. సెంట్‌బెర్త్‌లోమియో పర్వదినాన పారిస్‌లో యూజినాట్ల మారణహోమం, బాబిలోన్ విధ్వంసం, క్రీస్తు మరణం జరిగిపోయి మానవజాతికి కళంకాలుగా నిలుస్తాయి. నాలుగో కథలో ఒక అమాయకుడిని భటులు ఉరితీయబోతూ ఉండగా ఆఖరుక్షణంలో అతని భార్య విడుదల పత్రం పట్టుకు పరుగున వస్తుంది. ఆమె ప్రేమ భర్త ప్రాణాన్ని కాపాడుతుంది. ఇందులో బాబిలోన్ విధ్వంసం వంటి సన్నివేశాలను ఎవరూ కనీవినీ ఎరగనంత సెట్‌ల మీద తీశాడు. కెమెరాను బెలూన్‌లో అమర్చి పైనుంచి కొన్ని షాట్‌లు తీశారు.

ఇక ఈ నాలుగు కథలను కలపడంతో గ్రిఫిత్ ప్రయోగించిన ఈ శిల్పమే, తరువాత 1925లో ప్రపంచ ప్రసిద్ధి గాంచిన సోవియట్ మాంటేజ్ శిల్పానికి

ఆధారభూతం, మాతృక అయింది. సోవియట్ దర్శకులు ఐసెన్‌స్టీన్, పుడోవ్‌కిన్ వంటివారికి గ్రిఫిత్ మార్గదర్శకుడు అయినాడు.

(ఆంధ్ర-వారపత్రిక - 1958)

ఇన్‌టాలరెన్స్ (1916, బ్లాక్ అండ్ వైట్, 123 ని॥లు.) దర్శకుడు డి.డబ్ల్యు.గ్రిఫిత్. తారాగణం విలియన్ గిష్, బెస్సీలవ్, రాబర్ట్ హేరన్, మేమార్ష్, బాబిలోన్ ఘట్ట చిత్రీకరణలో ఒక సీన్లో 15,000 మంది మనుష్యులను, 250 రథాలను ఉపయోగించారని అంటారు. ఈ అమెరికన్ ఇతర చిత్రాలు : హోమ్, స్వీట్‌హోమ్ (1914), బర్త్ ఆఫ్ ఎ నేషన్ (1915), బ్రోకెన్ బ్లాసమ్స్ (1919), ట్రూ హార్ట్ సుసీ (1919) వేడౌన్, ఈస్ట్ (1920), డ్రీమ్‌స్ట్రీమ్ (1921), సేలీ ఆఫ్ సాడస్ట్ (1925), ఆయన 'అర్ఫన్స్ ఆఫ్‌ది స్టా(ర్)మ్' (1922), ఫ్రెంచి విప్లవ నేపథ్యంలో ఇద్దరు అక్కాచెల్లెళ్ల పాట్లు వివరించగా, ఆయన 'అబ్రహాం లింకన్' (1930). అమెరికా అధ్యక్షుడు లింకన్ జీవిత గాధను హృద్యంగా తెరకెక్కించాడు. 'లింకన్' ఆయన మొదటి టాకీ చిత్రం.



# బేటిల్‌షిప్ పోటెమ్‌కిన్

1905వ సంవత్సరం... ఒడెస్సా రేవులో పోటెమ్‌కిన్ యుద్ధ నౌక. నౌకలోని సైనికులు తమకు పురుగులతో లుకలుకలాడే తిండి పెడుతున్నారని అధికారుల మీద తిరగబడ్డారు. నౌకమీద ఎర్రజెండా ఎగరేశారు. ఒడెస్సా ప్రజలు పోటెమ్‌కిన్ సైనికులపై సానుభూతితో తిరుగుబాటులో పాల్గొన్నారు. జారిస్టు సైనికులు నిరాయుధులైన వందలాది ప్రజలను కాల్చి చంపారు. రేవులో ఉన్న ఇతర యుద్ధనౌకలు తిరుగుబాటు చేసిన నౌకపై సానుభూతితో తటస్థంగా ఊరుకున్నాయి. పోటెమ్‌కిన్ ప్రభుత్వసైనికుల నుంచి విజయవంతంగా తప్పించుకుని రుమేనియాలో తలదాచుకున్నది. జారిస్టు రష్యాలో జరిగిన మొదటి విప్లవంలో ఈ పోటెమ్‌కిన్ ఉదంతం ఒక భాగం.

ఈ చిన్న సంఘటన, ఇప్పటి దాకా తయారైన ప్రపంచ చలన చిత్రాలన్నిటికీ ఉత్తమోత్తమమైన చిత్రానికి ఇతివృత్తమైనది. సోవియట్ దర్శకుడు ఐసెన్‌స్టీన్ ఈ ఇతివృత్తం తీసుకొని "యుద్ధనౌక పోటెమ్‌కిన్" (బేటిల్‌షిప్ పోటెమ్‌కిన్) అనే చిన్న చిత్రం నిర్మించాడు. అది 1925లో యూరోపియన్ దేశాలలో మొదటిసారిగా విడుదల అయింది. అయీ అవగానే ఈ చలనచిత్రం గొప్ప సంచలనం కలిగించింది. చూసిన ప్రతి ఒక్కరూ నిర్ఘాంతపోయి విభ్రాంతులయ్యారు. ఇప్పటిదాకా ఇంత గొప్ప చిత్రం రాలేదన్నారు. ఆనాడు దాన్ని చూసిన విమర్శకులు, కళాభిమానులు, ప్రేక్షకులు. చిత్రమేమిటంటే, ఆనాడే కాదు, ఈనాడు చూసిన విమర్శకులు, చలనచిత్ర చరిత్రకారులూ కూడా ఇప్పటిదాకా ఇంత గొప్పచిత్రం రాలేదంటున్నారు.

ఐసెన్‌స్టీన్ ఈ చిత్రంలో యదార్థంగా జరిగిన సంఘటననే ఇతివృత్తంగా తీసుకున్నాడు. అందుచేత ఎక్కడా కల్పనలేని డాక్యుమెంటరీ చిత్రంగా కనబడుతూనే, ఏ కాల్పనిక చిత్రమూ సాధించలేని కళారమణీయకాన్ని ఇది సాధించింది. దీని నిర్మాణంలో తనకు కలిగిన అనుభవాలనుంచే ఐసెన్‌స్టీన్ కొన్ని సినిమా సిద్ధాంతాలు తయారుచేశాడు. సినిమాను కేవలం వర్తకంగా కాక కళగా ఆరాధించే వారందరూ ఈ సిద్ధాంతాలను నేటికీ గౌరవిస్తున్నారు.



ఐసెన్‌స్టీన్ సిద్ధాంతాల సారాన్ని ఒక ముక్కలో చెప్పాలంటే సినిమా మిగతా కళలకంటే భిన్నమైనది అని చెప్పాలి. నాటకం, సంగీతం, సాహిత్యం, శిల్పం, చిత్రలేఖనం ఇలాంటి కళల సమూహమని కాక చలనచిత్రం ఈ కళలలోంచి పుట్టిన భిన్నమైన సరికొత్త కళ అని ఆయన సిద్ధాంతీకరించాడు. గొప్పకవి మూడు మాటలను కలిపి నాలుగో మాటను కాక నక్షత్రాన్ని సృష్టించినట్లు, సినిమా దర్శకుడు యధార్థాన్ని తన సృజనశక్తితో కళగా మారుస్తాడని ఆయన సూత్రం. పోటెమ్‌కిన్ చిత్రాన్ని గూర్చి మరొక ప్రముఖ దర్శకుడు పుడోవ్‌కిన్ ఇలా రాశాడు: "ఐసెన్‌స్టీన్ సృష్టిని మాటల్లో వర్ణించటానికిగాని, రంగస్థలంమీద ప్రదర్శించటానికిగాని వీలులేదు. తెరమీద చూపవలసిందే."

పోటెమ్‌కిన్ చిత్రానికి ఎడ్వర్డ్ టిసే అనే అతడు ఫోటోగ్రాఫరు. ఇతడు స్వీడన్‌లో అనుభవం గడించివచ్చి ఐసెన్‌స్టీన్‌కు సహాయకుడుగా కుదిరాడు. అప్పటికి

బేటిల్‌షిప్ పోటెమ్‌కిన్ (1925, బ్లాక్ అండ్ వైట్, 65 నిమిషములు)

దర్శకుడు: సెర్జి ఐ సెన్‌స్టీన్. తారగణం: అలెగ్జాండర్ ఏంటనోవ్, వ్లదిమీర్ బార్‌స్కీ, గ్రిగోరీ అలెగ్జాండ్రోవ్, మైఖేల్ గొరొనారోవ్ నిశ్శబ్ద చిత్రం. ఒడెస్సా మెట్లపై చిత్రీకరించిన దృశ్యం మరపురానిదని విమర్శకులు అంటారు. కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడిన కొత్తల్లో తొలి విప్లవ చిత్రంగా దీన్ని ప్రచార చిత్రంగా ఉపయోగించుకున్నారు. స్టాలిన్ ఆదరాన్ని, ఆగ్రహాన్నీ రెండింటినీ చవిచూసిన ఈ రష్యన్ దర్శకుని ఇతర చిత్రాలు. స్ట్రైక్ (1924), టెన్‌డేస్ దట్ షుక్ ది వ(ర)ల్డ్ (1928), అలెగ్జాండర్ నెవ్‌స్కీ (1938), ఇవాన్ ది టెర్రిబుల్, 1,2 భాగాలు (1945).

ఇన్‌టాలరెన్స్ దర్శకుడు గ్రిఫిత్ అమెరికన్నైనా, బేటిల్‌షిప్ పోటెమ్‌కిన్ దర్శకుడు ఐసెన్‌స్టీన్ రష్యన్ ఐనా వాళ్లిద్దరికి గల బాదరాయణ సంబంధం ! 'మాంటేజ్' శిల్పం! రెండు విభిన్నమైన వస్తువులను చూపించి మూడో వస్తువును స్ఫురింపచేయడమే మాంటేజ్. తలుపూ, చెవీ చూపిస్తే ఎవరో చాటుగా వింటున్నట్టు ప్రేక్షకుడికి తడుతుందనే ఈ సిద్ధాంతానికి రమణ పెట్టిన ముద్దు పేరు 'బహువ్రీహి సమానం'. దీన్ని గ్రిఫిత్ ఆరంభిస్తే ఐసెన్ స్టీన్ దీనిలో ప్రావీణ్యత సంపాదించేవాడు. భారీతనంలో కూడా ఐసెన్‌స్టీన్ గ్రిఫిత్‌కి తీసిపోలేదు.

రష్యాలో స్టూడియోలూ లేవు. సరైన పరికరాలూ లేవు. దాదాపు చిత్రం యావత్తూ ఆరుబయట, ఏ లైట్లూ లేకుండా మామూలు వెలుతురులోనే తీశారు. పొగమంచు తెరల్లోంచి ఒడెస్సా నగరంలో సూర్యోదయమవుతున్న దృశ్యం తీయటానికి కెమెరా లెన్స్ ముందు ఒక జల్లెడగుడ్డ నుంచి తీశారు. ఈ చిత్రం విడుదలైనప్పుడు రష్యన్ ప్రేక్షకులు అంతగా పటించుకోలేదు. జర్మనీలో దానికి బ్రహ్మాండమైన పేరువచ్చింది. ఆ తరువాత చాలా కాలం దాకా మాస్కో థియేటర్లలో పోటెమ్‌కిన్ చిత్రాన్ని "బెర్లిన్‌లో విజయం పొందిన చిత్రం" అని ఎడ్వర్టయిజ్ చేస్తూవచ్చారు.

*(ఆంధ్ర-వారపత్రిక - 1958)*

# గ్రీడ్



అమెరికన్ చిత్రాలు చాలా దిగులుగా, చప్పగా వుంటున్నాయన్న ఊహతో అక్కడి నిర్మాతలు 1920 ప్రాంతాలలో కొందరు విదేశీయ దర్శకులను ఆహ్వానించి సత్తా వున్న చిత్రాలు తీసిపెట్టమన్నారు. అలా వచ్చిన జర్మన్ దర్శకులు ఎర్నెస్ లూబిష్, ఎరిక్ వాన్‌స్ట్రాహీం, జో స్టెర్న్‌బర్. (లూబిష్, రాసిటా, ఫర్‌బిడెన్ పారడైజ్, ది పేట్రియట్, లేడీ విండర్ మియర్స్, ఫాన్, మారేజ్ సర్కిల్, వినోష్కా మొదలైన చిత్రాలు తీశాడు.).

వాన్‌స్ట్రాహీం ఆస్ట్రియన్ చిత్రాలలో నటుడుగా ప్రవేశించి, చూడగానే వళ్ళుమండి కోపం వచ్చే తరహా దుష్టుల పాత్రలు (ఆఫీసర్ విలన్) ధరించి, ఆ రకం పాత్రలకు నేటిదాకా మన దేశం వాళ్ళకి పనికొస్తున్న మూస తయారుచేసి పెట్టాడు. గొప్ప నటుడని పేరు గడించాడు. దర్శకుడైన తరువాత కూడా ఈ రకం పాత్రలు నటించాడు.



వాన్‌స్ట్రాహీం దర్శకుడుగా అమెరికన్ చలనచిత్ర శిల్పంమీద చాలా గట్టి ముద్ర వేశాడు. ఆయన తీసిన చిత్రాలు బ్లైండ్ హస్బెండ్స్, ఫూలిష్ వైవ్స్ అప్పట్లో పెద్ద సంచలనం కలిగించాయి. పశు ప్రవృత్తి, కర్కశత్వం వాటిలో ఉట్టిపడేలా చిత్రించాడు. తరువాత 'మెర్రీ గోరౌండ్' అనే చిత్రం తీస్తూ

వుండగా, నిర్మాత సహించలేక స్ట్రాహీంను తొలగించి మరొక దర్శకుడిని నియమించుకున్నాడు.



'గ్రీడ్'ను అప్పుడే (1923లో) స్ట్రాహీం తీశాడు. ఎం. జి. ఎం. వారు ఈ చిత్రం నిర్మాతలు. ఫ్రాంక్ నారిస్ వ్రాసిన 'మాక్ టీగ్' అనే నవల దీనికి ఆధారం. నిజానికి 'ఆధారం' అన్నమాట తగదంటారు. ఆ నవలని యధాతథంగా, దాదాపు పేజీలవారీగా ఈయన సెల్యులాయిడ్‌మీద దించేశాడు. అప్పటికే ఈయన సిసలైన కళాకారుడని, డబ్బుని ఖాతరుచేయడని ఫిలిం నిర్మాతలకి ఒక అభిప్రాయం ఏర్పడింది. మొదటి షాట్ తీసినప్పటినుంచి ఒక గొప్ప కళాఖండం తయారవుతోందనే అంతా అనుకుంటూ పనిచేశారు.

నిజానికి అలాగే అయింది కూడా. ఎటొచ్చీ ఆ కళాఖండం ఆఫ్రికా ఖండం అంత పెద్దదిగా, భయంకరంగా, అందంగా, ఆకర్షణీయంగా, దుర్భేద్యంగా తయారైంది. కొన్ని లక్షలు ఖర్చయిందన్నారు.

చిత్రం ఎడిటింగ్ పూర్తిచేసి, విడుదలకు సిద్ధమైన ప్రతిని దర్శకుడు ఆమోదించి నిర్మాతలకు అప్పగించినప్పుడు దాని నిడివి 42వేల అడుగులు మాత్రమే! ఆడితే ఏడు గంటలసేపు పడుతుంది.

నిర్మాతలు నివ్వెరబోయారు. మూడు గంటలసేపు ఆడి, జనాన్ని భోజనాలకు వదిలి, తరువాత మిగతా భాగాన్ని మరో మూడు గంటలు ఆడవచ్చునని సలహా ఇచ్చాడు స్ట్రాహీం గంభీరంగా.

తరువాత కంపెనీవారు తమ స్టాఫ్‌లో ఎడిటర్లకి ఒప్పగించి బాగా తగ్గించారు. అంచెలవారీగా ఏడునుంచి నాలుగు గంటలకు, ఆ దరిమిలా రెండు గంటలకూ సరిపడే నిడివికి తగ్గిపోయింది గ్రీడ్. ఈ ఉన్నదాన్నే పెద్ద పెద్ద విమర్శకులు వేనోళ్ళ మెచ్చుకున్నారు.

ఒక్క అడుగు కూడా తగ్గించడానికి వల్లకాదని పట్టుబట్టిన స్ట్రాహీం, ఆ చిత్రానికీ తనకు సంబంధం

లేదని నిరసించాడు కత్తిరింపుల తరువాత. దురాశతో మనుషులు ఎంతటి ఘోరమైన స్థితికి దిగజారిపోతారో, డబ్బు ఎంతటి భయంకరమైన పరిస్థితులను కల్పించగలదో జన్మలో మరిచిపోవడానికి వీలులేని విధంగా స్ట్రాహీం ఈ చిత్రంలో చెప్పాడు. ఈ చిత్రణ వైఖరిలో ఒక మహావిద్వేషం , అక్కసులాంటిది కనబడుతుంది. మనిషి ఎన్ని ఘోర కృత్యాలకు వడిగట్టగలడో, ఎంత క్రూరంగా ప్రవర్తించగలడో

అన్ని రకాల సన్నివేశాలను నలభైరీళ్ల చిత్రంలో స్ట్రాహీం పేర్చాడు. "నాదేంలేదు. అంతా నవలలోదే" అంటాడాయన.

ఈ చిత్రంలో కథాస్థలం శాన్‌ఫ్రాన్సిస్కోలో బీదలవాడ. ఇక్కడి జీవితాన్ని, దారిద్ర్యాన్ని, డబ్బుకి, గుణానికి, సంస్కారానికి కూడా అది ఎంత భయంకరంగా, కనిపించిందో అంత భయంకరంగా, నిజంగా, క్రూరంగా పచ్చిగా చూపించాడు. అసలు చిత్రం ఇంకెంత ఉధృతంగా వుందో అంటారు ఇపుడు మిగిలిన చిన్న చిత్రాన్ని చూసినవాళ్లు.

> మనుషులలోని అవగుణాలను ఎత్తిచూపించడంలో వాన్‌స్ట్రాహీం అందెవేసిన చెయ్యి. 'బ్లైండ్ హస్బెండ్స్' (1919 నాటి నిశ్శబ్ద చిత్రం లో పర్వతారోహణకు వచ్చిన డాక్టరు భార్యను ఆర్మీ ఆఫీసరు వశపరచుకుంటాడు. 'ఫూలిష్ వైవ్స్' (1921 నాటి నిశ్శబ్ద చిత్రం)లో భార్యను ఇతరులకు అప్పగించడం ద్వారా జీవితంలో పైకి వస్తాడొక పెద్దమనిషి. 'ది వెడ్డింగ్ మార్చ్' (1928 నాటి నిశ్శబ్ద చిత్రం)లో బీద ప్రియురాల్ని వదలి డబ్బుకోసం ఒక ధనవంతురాల్ని పెండ్లాడతాడు ఓ ఆస్ట్రియన్ రాకుమారుడు. వీటన్నిటిలో స్ట్రాహీం స్వయంగా దుష్టపాత్రలు నటించాడు. ది 'ఫూలిష్ వైవ్స్'లో అతను డిజైన్ చేసిన 'మాంట్‌కార్లో కేసినో' సెట్ అద్భుతంగా వుందని పేరు పొందింది. ఎడిట్ చేయడానికి ముందు వెడ్డింగ్ మార్చ్ సినిమా నిడివి 39 గంటలు!

డబ్బు విలువ తెలిసి ఆశ పెరిగిన కొద్దీ మనోహరమైన అమాయకత్వాన్ని వదులుకుని గోమాయుతత్వంతో, కౌటిల్యంతో నిండిపోయిన అమాయక నాయిక 'ట్రినా'గా జూసూపిట్స్ అనే నటి అద్భుతంగా నటించింది. మండుటెండ కింద, ఎడారిమీద నిలబడి దాహంతో విలవిల తన్నుకుంటూనే డబ్బుకోసం ఒకళ్ళ నొకళ్ళు చంపుకోజూసిన మాక్ టీగ్ (కథానాయకుడు), మార్కస్ (జీస్ హెరాల్డ్) పాత్రలు మటుకు మితిమీరిన నటన వల్ల దెబ్బతిన్నాయని విమర్శకులు అంటారు. చివరికి ఈ ఇద్దరిలో ఒకడు చనిపోతాడు. రెండోవాడు నీళ్ళకోసం పరిగెత్తబోతాడుగాని, చనిపోయిన వాడి చేతికి తన చేతికీ కలిపి సంకెలలుండడం వల్ల వాణ్ణి మోయలేక, తను పోలేక దిక్కుమాలిన చావుతో చచ్చిపోతాడు. వాళ్ళ పోట్లాటకీ, పతనానికి కారణమైన డాలర్ నోట్లు ఎడారిలో చిందరవందరగా ఎగిరిపోతాయి చూస్తూ వుండగా....


స్ట్రాహీం

'గ్రీడ్' చిత్రంలో వాన్‌స్ట్రోహీం చిత్రణ ఇటీవలి ఇటాలియన్ నియో రియలిజం (నవ్య వాస్తవికత) స్థాయిని 1923 లోనే అందుకుందని కొందరు విమర్శకులు అన్నారు. స్ట్రోహీం కూడా ఆ మాట ధీమాగా అన్నాడు.

మొత్తంమీద, ఎంతగా కత్తిరింపులకు గురి అయినా, (కత్తిరించిన చిత్రాన్ని 'శవం' అని స్ట్రోహీం తిట్టిపోశాడు) గ్రీడ్ చిత్రంలో పరిణతి చెందిన శిల్పం వుంది. హృదయాన్ని కదిల్చివేసే వాస్తవికత దీన్ని చిరస్మరణీయం చేసింది. ఉత్తమ చిత్రంగా నిలబెట్టింది.

*(ఆంధ్ర-వారపత్రిక - 1957)*

# కాబినెట్ ఆఫ్ డా॥ కాలిగరీ



మొదటి ప్రపంచ యుద్ధం అయిపోయిన మొదటి రోజుల్లో ఓడిపోయిన జర్మనీ మీద ఇంగ్లీషు వాళ్లకీ, ఫ్రెంచి వాళ్లకీ, గెలిచిన ఇంగ్లండు మీద, ఫ్రాన్సు మీద జర్మనీ వాళ్లకి మహాకోపంగా ఉండేది. ఈ కోపం రాజకీయ రంగంలోనే కాదు, సినిమా రంగంలో కూడా కనిపించేది. జర్మన్ చిత్రాలను ఏమైనా సరే చూపించగూడదని, చూడగూడదని ఇంగ్లండు, ఫ్రాన్సుల్లో సినిమా ప్రదర్శకులకూ, ప్రజలకూ గట్టిపట్టుదల ఉండేది. అలాగే జర్మనీలో ఇంగ్లండు, ఫ్రాన్సుల మీద కసికొద్దీ రాజకీయంగా వ్యతిరేక ప్రచారం, వేళాకోళం చేస్తూ చిత్రాలు తీసేవారు. కాని కొన్నేళ్ళయ్యేసరికి జర్మనీలో కేవలం ప్రచారచిత్రాలే కాక మంచి మంచి చిత్రాలు కూడా తీస్తున్నార్ట అని ఆ నోటా ఆ నోటా ఇతర దేశాల్లో డిస్ట్రిబ్యూటరు, ఎగ్జిబిటర్లు పసికట్టి అవి తెప్పించి ప్రదర్శించటం మొదలుపెట్టారు. మొదట్లో అవి ఏ దేశానివో చెప్పకుండా చూపించారు. తర్వాత అవి డేనిష్ చిత్రాలనీ, స్కాండినేవియన్ చిత్రాలనీ చెప్పిచూపించారు. నిజానికి అవన్నీ జర్మన్ చిత్రాలే.

ఇలా దొడ్డిదారిన తీసుకొచ్చి చూపించిన చిత్రాల్లో 'కాబినెట్ ఆఫ్ డాక్టర్ కాలిగరీ' అనేదొకటి. సార్వకాలిక ఉత్తమచిత్రాల్లో ఇది ఒకటని విమర్శకులు నిర్ణయించారు.

ఈ చిత్రం 1919లో వెలువడింది. దర్శకుడు రాబర్ట్ వీన్. ఆ రోజుల్లో 'ఎక్స్‌ప్రెషనిజం' జర్మనిలో మంచి ఊపులో ఉంది. ఇది వాస్తవిక వాదానికి విరుద్ధమైనది. దీన్ని విశేషాభివ్యక్తివాదమని అనవచ్చును అంటే వస్తువును యథాతథంగా చూపించటం కాక వస్తువును చూచినప్పుడు కళాకారుడిలో కలిగే ఉద్రేకాలు చూపించాడన్నమాట. ఈ పద్ధతి పిచ్చివాళ్లని గురించిన కథల్ని, దెయ్యాల కథల్ని, జానపద కథల్ని సినిమా తీయటానికి బాగా పనికొస్తుంది. అందుకని ఆ

రోజుల్లో జర్మనీ ఇలాంటి చిత్రాలు కుప్పతెప్పలుగా తయారయ్యేవి. ఇవన్నీ పరమచెత్తగా ఉండేవనటంలో సందేహం లేదు కాని - ఈ చెత్తలోంచే మాణిక్యం లాగా 'డాక్టర్ కాలిగరీ' చిత్రం వచ్చిపడింది.



ఈ చిత్రాన్ని యూరప్‌లో మొదట చూపించినప్పుడు ప్రేక్షకులు నిర్ఘాంతపోయారు. "ఏమిటీ విచిత్రచిత్రం! మన్ని ఎందుకింత బాధపెట్టేసింది" అని మథనపడి రోజులతరబడి మనశ్శాంతి లేకుండా చేసుకున్నారు. దాదాపు పదేళ్లపాటు ఈ చిత్రం యూరప్, అమెరికాలలో నిర్మాతల్నీ, దర్శకుల్ని దయ్యంలాగ వెంటాడింది.

ఇందులో కథ చాలా చిన్నది. డా. కాలిగరీ అనే విచిత్ర వ్యక్తి ఉంటాడు. అతడు నిద్రలో నడిచే అలవాటు గల ఇంకొక వ్యక్తిచేత హత్య చేయించటానికి ప్రయత్నిస్తాడు. సినిమా చివర్లో ఈ కథంతా ఓ పిచ్చివాడి ఊహాగానమని బయటపడుతుంది. పిచ్చివాడి ఊహాగానాన్ని చిత్రించే చిత్రం ఎంత విచిత్రంగా ఉంటుందో చెప్పక్కర్లేదు గదా! పిచ్చివాడి పగటికల అని తెలిసికొని తర్వాత 'అమ్మయ్య' అని ప్రేక్షకులు ఏదో బరువు దిగిపోయినట్లు తేలికపడతారు. కాని ఆ క్షణం దాకా కుర్చీలకు అంటుకుపోయి దిగ్భ్రాంతులై ఊపిరిబిగపట్టి చూస్తుండవలసిందే.

ఈ చిత్రంలో ఉపయోగించిన టెక్నిక్ ఈనాడు ఎవ్వరూ అనుసరించటం లేదు. ఆనాడు కూడా జర్మనీలో తప్ప ఇతర దేశాలలో దీని ప్రభావం అంతగా పడలేదు. సమతలంగా లేని అద్దంలో మొహం చూసుకుంటే ఎంత వికృతంగా ఉంటుందో అంత అస్వాభావికంగా ఉంటుంది చిత్రమంతా. వీధులు దయ్యాల వాడలో విధుల మాదిరిగా చెదిరిపోయి ఉంటాయి. ఎండ పడవలసిన చోట పడదు. ఏ వస్తువూ మామూలు ఆకారంలో ఉండదు. సీనరీలన్నీ చేత్తో వేసినవేనని తెలిసిపోయేటట్టు వేశారు. నిజమైన నటీనటులు (వెర్నర్ క్రాస్, కాన్రాడ్ వేట్ నటిస్తున్నా, వారు నిజంగా మనుషులు కాదనీ, చేత్తో వేసిన బొమ్మలే కదులుతున్నాయనీ భ్రమకలిగేట్టుగా నటించారు.



దీనికి నటులకు చేసిన మేకప్ కొంతవరకూ, నటన కొంతవరకూ, చేతకానివాడు చేసిన బొమ్మలాంటి సెట్టింగులు




కొంతవరకూ, కథ చాలా వరకూ తోడ్పడి, మొత్తం అన్నీ కలిసి ఒక భయానకతరహా చిత్రాన్ని తయారుచేశాయి. ఈ టెక్నిక్ అన్ని కథలకీ పనికిరాదు. అవాస్తవికమైన అభూతకల్పనలకి మాత్రమే పనికొస్తుంది.

ఇలాంటి కల్పనలు ఎప్పుడైనా ఒకటీ అరా వస్తే బాగుంటాయిగాని అన్నీ ఈ తరహావే అయితే తీసేవాళ్లకీ, చూసేవాళ్లకీ కూడా మతిపోతుంది. అందుచేతనే "కాలిగరీ" చిత్రం అపూర్వమైన, ప్రతిభావంతమైన శిల్పాన్ని ఉపయోగించినా, దీని ప్రభావం త్వరలోనే రూపుమాసి పోయింది.

అయితే ఈ చిత్రం ఒక విషయాన్ని సుస్పష్టం చేసింది. చిత్రంలో నటులు ఎంత ముఖ్యమో – సెట్టింగులు – అంటే బ్రహ్మాండమైన 'డి మిలియన్' సెట్టింగులని కాదు. – అర్థవంతమైన, భావస్ఫోరకమైన సెట్టింగులు అంత ముఖ్యమనే విషయాన్ని – అదివరకెవ్వరూ గట్టిగా పట్టించుకోని విషయాన్ని స్పష్టంచేసింది. అందువల్లనే ఈ చిత్రానికి సార్వకాలికత్వం సిద్ధించింది.

***(ఆంధ్ర-వారపత్రిక - 1959)***

కాబినెట్ ఆఫ్ డా. కాలిగరీ (1919) 69 ని.లు నడిచే ఈ జర్మన్ నిశ్శబ్ద చిత్రంలో వెర్నర్ క్రాస్, కాన్రాడ్ వేట్ లిల్ డాగోవర్ నటించారు. దర్శకుడు రాబర్ట్ వీన్. ఈ చిత్రంలో అద్భుతంగా నటించిన వీట్ ఒక అర్ధ శతాబ్దిపాటు నటిస్తూనే ఉన్నాడు. నాజీ మేజర్‌గా అతను నటించిన కేసబ్లాంకా అతని ఆఖరి చిత్రం. కాలిగరీ చిత్రాన్ని 1962లో రోజర్‌కే దర్శకత్వంలో పునర్నిర్మించారు కానీ దానికంతగా పేరు రాలేదు.



# 12 ఏంగ్రీమెన్

అనగా అనగా ఓ కథ. వినగా వినగా ఆ కథలో ఓ గది. వెళ్ళి చూడగా అందులో 12 సమభాగాలు చేసిన ఓ ప్రాణం.

హాలీవుడ్‌లో సినీ మిరకిల్ అనే హంగుతెర తయారుచేశారు ఆ మధ్య. నూరు అడుగుల వెడల్పు, నలభై అడుగుల ఎత్తును. ఈ భూప్రపంచంలో ఇంత పెద్దది ఇదేను అన్నారు. దీంతో సినీరమాను మిరకల్ (అద్భుతం) అనుకోడం మానేశారు.

ఇలాకాక ఎప్పుడూ అద్భుతంగా కనిపించేవీ, అనిపించేవీ కళాంశ, కావ్యాంశ, సుందరమైన శిల్పం, ఎన్నిక చేయతగ్గ ప్రయోజనం ఉన్న మామూలు చలనచిత్రాలే. ఇవన్నీ కావాలనుకొన్నవారు ఎప్పుడూ తెలుపు నలుపులో, పాత వెండితెరమీదకి సరిపోయే చిత్రాలే తీశారు.

❀ ❀ ❀ ❀

ఈ రకం చిత్రాల శ్రేణిలో చిన్నచోటు ఇవ్వతగ్గ చిత్రం - '12 ఏంగ్రీమెన్'. చలనచిత్ర శిల్పకళ దృష్ట్యా ఇది చిన్నసైజు అద్భుతం! కథ అంతా ఒక చిన్న గదిలో జరుగుతుంది. ఈ రకం గారడీ ఉందని దానికి గొప్పతనం అంటగట్టడం లేదు. నిజానికిది కాలంనాడు 'రోప్' చిత్రంలో ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ చేసినదే. అందులోని గదిలో జిమ్మి స్టీవర్ట్, ఫార్లీ గ్రేంజర్ ముఖ్య కథకులు, వారికి వంతగా మరి నలుగురు

బతికి వున్నవాళ్ళు ఉన్నారు. అక్కడే పెట్టెలో ఒక శవం.


హెన్రీఫోండా

అయితే ఈ సినిమాలో గదిలో పన్నెండుగురున్నారు. శవం, హంతకుడు నేపథ్యంలో ఉన్నట్టు లెక్క. ఈ పన్నెండుగురితోపాటు ఉండడమో, ఊడటమో వాళ్ళ తీర్పుమీద తేలవలసిన ఒక కుర్రవాడి ప్రాణం ఉంది. ఆ కుర్రవాడికి 18 ఏళ్ళు. తండ్రిని కత్తితో పొడిచి చంపాడని అతనిమీద అభియోగం. వాడు పుట్టి పెరిగిన వాడ, బీదవాళ్ళుండే మురికిపేట. తండ్రి పోలీసు రాణాలో కాతాదారు. పిల్లాడూ ఆ దారిలోనే తయారవుతున్నాడు.

'నిన్ను చంపుతాను' అని వాడు తండ్రిని తిట్టగా తను విన్నట్లు పొరుగు వాటాలోని సొట్టకాలు ముసలాయన సాక్ష్యం. ఇంకో క్షణం తరువాత ఒక మనిషి దభీమని నేలమీద పడ్డ చప్పుడు విన్నాడట. విని, లేచి గది తలుపు తీసుకు పరుగెత్తి మేడమెట్ల దగ్గరికి వచ్చాడు. ఆ పావునిమిషంలోనూ, ఖూనీచేసిన (అంతకన్నా ఎక్కువసేపు పట్టదుగదా) కుర్రాడు మేడమెట్లు దిగి పరిగెట్టడం చూశాడు. దీనికితోడు అదే సమయంలో ఆ యింటికి ఎదురుగా అరవై అడుగుల దూరాన రెండిళ్ళకీ మధ్య ఎలక్ట్రిక్ రైలు రివ్వున పోతోంది. ఆ రైలు తాలూకు చిట్టచివరి రెండు పెట్టెల కిటికీలలోనించీ ఒకావిడ ఈ ఇంట్లో ఒక భీకర దృశ్యం చూసినట్టు చెప్పింది. దృశ్యం – ఈ కేసులో ముద్దాయి, 18 ఏళ్ళ కుర్రాడు తండ్రిని కత్తితో పొడిచి చంపడం. ఇదీ సాక్ష్యం.

కాగా ఆ కుర్రాడు హత్య జరిగిన రాత్రి (పన్నెండు గంటలకని శవ పంచాయతీ తీర్పు) సినిమాకి వెళ్ళినట్టు చెప్పుకున్నాడు. మూడుగంటలకు ఇంటికి వచ్చేసరికి పోలీసులు అరెస్టు చేశారు. వాడు తండ్రిని పొడిచి కత్తికోసం తిరిగి వచ్చాడనీ, అసలు సినిమాకి వెళ్ళలేదనీ ప్రాసిక్యూషన్ వాదం. అందుకు తగ్గట్టే తనమీద నేరం వున్న సంగతి తెలిసి కొయ్యబారిపోయిన ఆ కుర్రాడు, తను చూసిన సినిమా పేరు కూడా చెప్పలేదు.

ఇదీ కథ.

కోర్టులో విచారణ పూర్తి అయింది. మేజిస్ట్రేటు జూరీ అభిప్రాయం అడిగాడు. 'ఒక మనిషి పోయాడు. ఇంకోడి ప్రాణం ఇప్పుడు ఏం కావలసి ఉందో తేలాలి. కుర్రాడు ఖూనీ చేసినట్టు, ఇచ్ఛాపూర్వకంగా బెదిరించి మరీ చేసినట్టూ గట్టి సాక్ష్యం ఉంది. మీరు జాగ్రత్తగా ఆలోచించుకుని తీర్పు ఇవ్వండి. మీ తీర్పు ఏకగ్రీవంగా ఉండాలి. మీదే తుది నిర్ణయం అవుతుంది" అని వివరించాడు; అక్కడ 11 గురు, కుర్రవాడు దోషేను అని క్షణాలమీద అభిప్రాయపడ్డారు. ఒక్క మనిషి మాత్రం 'నాకు ఆ సంగతి అనుమానంగా ఉంది' అన్నాడు...

ఇది కథలో గది.

ముద్దాయి నిర్దోషి అని అతను అనడు. దోషి కాడేమో, సాక్ష్యాలు సరికావేమో అని అతని అనుమానం. అందరూ నవ్వారు. హేళన చేశారు. దానిమీద 95 నిమిషాలు తర్జన భర్జనలు జరుగుతాయి. ముద్దాయి ప్రాణం ఉండాలా ఊడాలా అనేది వాళ్ల తీర్పు మీద ఆధారపడి వుంది. జూరర్‌లు ఒకరినొక రెరుగరు. కుర్రాణ్ణి అంతకన్నా ఎరుగరు. అందుచేత కొంతసేపటికి క్రమంగా ధర్మయుద్ధం ఆరంభమౌతుంది. ధర్మానికి, అధర్మానికి, ధర్మానికీ కారుణ్యానికీ భీకరసమరం జరుగుతుంది. అందులో వీరులతోపాటు, మొండివాళ్ళు, బద్ధకిష్టులు, భయస్తులు, విదూషకులు, మూర్ఖులు, క్రూరులు, మనకు ఇబ్బంది లేనప్పుడైనా ధర్మం కోసం పోరాడుదామనుకొన్న మంచివాళ్ళు - ఇలా రకరకాల మనుషులు ఆ పన్నెండుగురిలోను సర్దుకొని క్రమక్రమంగా ఇవతలికి తొంగిచూసి మనని భయపెట్టి, సంతోషపెట్టి, కోపం తెప్పించి, చిరాకు కలిగించి తప్పుకుంటూ ఉంటారు.

గదిలో కూర్చోగానే ఒక నవయువకుడు "తాళం వేస్తారని తెలీదే" అంటాడు పిరికిగా నవ్వి! "పిచ్చివాడా.... అంతే, వేస్తారు మరి" అంటాడు ఓ పెద్దాయన తనకి తెలిసినట్టు. నిజానికి 12 గురికీ న్యాయవిచారణ గురించి ఏం తెలీదు. కొందరికి, జూరీలిస్టులో పడే చాలామందిలాగే, ఎందుకొచ్చిన గొడవ అని చిరాకు. కొందరు భమిడిపాటి కామేశ్వరరావుగారి కచటతపలు. 'బోడి పెద్దరికం నువ్వెవడవోయ్ నాకు చెప్పేందుకు?' అనే రకం.

కొందరికి ఏ అభిప్రాయం లేదు. 'వాడు దోషి అంతే' అంటారు. 'అంత సాక్ష్యం ఉంది గదా కాదంటం ఎలా'.... 'బేస్‌బాల్ మాచ్‌కి టిక్కెట్లు కొని ఇందులో ఎరక్క చిక్కడ్డాను. ఏదో ఓటి చప్పుని ఆఘోరించండి. నా ఓటు కావలిస్తే నిర్దోషి అనే వేసుకోండి...' 'ముద్దాయి వట్టి జులాయి వెధవ. మురికిపేటల్లో తిరిగే పెరిగే వాళ్లు సంఘానికి చీడపురుగులు. చాలా ప్రమాదం. వాళ్లని బతకనివ్వకూడదు" 'మీ అందరికీ మతులుపోయాయి. వాడు ఖూనీకోరు కాకపోవడవేమిటి. నాలుగుసార్లు జైలుకెళ్ళొచ్చాడు దొంగతనాలు చేసి. పైపెచ్చు "హీ డోంట్ నో గుడ్ ఇంగ్లీష్".... 'డోంట్ నో అనకండి డజంట్ నో అనాలి'..... 'హు ఇందాకట్నించి చూస్తున్నాను. ఆ ముసలాయన మీద ఒంటికాలుమీద లేస్తున్నావు. ఈసారి మాట మిగిలావో డొక్కచీల్చేస్తా.' 'నీ వాదాల్లో తెలివితేటలు ఓడిపోతున్నాయనుకొంటున్నావు కాబోలు ' 'చెత్త'.... 'మహ బయలుదేరావు మొనగాడివి. బీదవాళ్ళ జాతిని వెనకేసుకొచ్చేందుకు, మాటంటే మళ్ళీ తెగబారెడు కోపం...' 'కొడుకు అంటే నీకేమిటో తెలుసా?' 'ముగ్గురున్నారు నాకు'.... 'వెధవ ఫ్యాను... ఉక్క'.... 'ఇది ఎడ్వర్‌టైజ్‌మెంట్ యుగం. కొత్త టెక్నిక్‌లు.'.. 'నేను బ్రోకర్ని.... నాదోచిన్న కంపెనీ ఉంది.' ...'సిరి, చుక్క'.... 'మధ్యలో ఈ ఆటలేమిటీ....' 'నువ్వెవడని అడిగేందుకు. ఎన్ని గుండెలున్నాయి?' 'నేను మాటంటే మళ్లీ తిరగను. దోషంటే దోషే.'

ఇదీవరస! ఇంత గంద్రగోళంలోనూ, ఈసడింపులూ, చిరాకులూ, పరాకులూ తట్టుకు నిలబడి, ఒక సామాన్య మానవుడు, ముద్దాయి నిర్దోషి కావచ్చు నేమో అన్న అనుమానాన్ని ప్రవేశపెట్టి, నిలబెట్టి, మెల్లిమెల్లిగా మనుషుల మనసుల చుట్టూ ఉన్న తిక్క ఆవేశం, స్వార్థం, పట్టుదల, సొంత బాధల పొరలన్నీ చీల్చి వాళ్ళ హృదయాలను స్పృశిస్తాడు. ఒక్కొక్కరినే ధర్మపధానికి మళ్ళిస్తాడు. ఒక్కొక్క హృదయాన్నే జయిస్తాడు.

మనమందరం తెల్లారి లేచింది లగాయతూ, ధర్మం సత్యం అని వాపోయి ధర్మదేవతకు ఫాన్ లెటర్స్ రాసే వాళ్లం కాకపోయినా, ఇందులో నటుడు హెన్రీ ఫాండా, వినమ్రత ఉట్టిపడే, భయం తొలగిచూపే పట్టుదల పట్టుకు వేళ్లాడే చిరునవ్వు నవ్వుతూ ఒక్కొక్క ఓటు గెలుస్తున్నప్పుడు, మనం కూడా ధర్మాన్ని నిలబెట్టి అధర్మాన్ని జయిస్తున్నామన్న మహదానుభూతి కలుగుతుంది. స్టంటు సినిమాలో హీరో ఒక్కొక్క ఆటంకాన్నే దాటుతూ శత్రువుల్ని జయిస్తున్నప్పుడు సర్వత్రా ఆనందాన్నీ, ఉత్తేజాన్నీ కలిగిస్తుంది. పోట్లాట అందులో హుషారును కలిగిస్తుంది. ఇందులో మాట్లాట.

కిటికీ పక్కనే ఎలక్ట్రిక్ రైలు ఘోషిస్తూ ఉంటే గదిలో పడుకొన్న ముసలాడికి, ఆ చివరి గదిలోని గావుకేకలు వినిపించాయా? మనిషి నేలకూలడం వినిపిస్తుందా? ఆ కుంటివాడు 15 సెకండ్లలో 55 అడుగులు నడవగలడా? అరవై అడుగుల దూరాన ఎదురింట్లో ఉన్న ఆడది, చత్వారపు కళ్ల జోడుది, కళ్ళజోడు లేకుండా ఈ గదిలో ఏమయిందో చూడగలదా? పైగా పరిగెడుతున్న ఎలక్ట్రిక్ రైలు చివరి రెండు పెట్టెలు తాలూకు కిటికీ అద్దాల గుండా చూసినప్పుడు, ఖూనీ చేసింది. ఫలానావాడే అని ఎలా గుర్తిస్తుంది?.... మీకు (అమెరికాలో లెండి) వారం రోజుల క్రితం చూసిన సినిమాలో ఎవరెవరు వేశారో గుర్తుంటుందా?.... పేపర్లో పేరు పడుతుందన్న మోజుతో 75 ఏళ్ళ (అమెరికన్) ముసలాడు అబద్ధాలు (నిజాలే అని నచ్చచెప్పుకుని) చెబుతాడా?

రకారకాల తిక్కలతో, సతమతమవుతూ మెల్లిగా ధర్మంవైపు జరుగుతూ ఈ ప్రశ్నలకు జవాబులు వెతుకుతారు, జూరర్‌లు. ఈ గొడవలో వాద ప్రతివాదనలలో, తిట్లలో ఏడుపులూ పెడబొబ్బలతో, పైన చెప్పిన కథ, హారంలో దారంలా ఉండ, దాని ఉనికిని మనకు హృదయగతం చేస్తుంది. తెరమీద ఈ కథగాని, అందులో ఒక్క భాగంగాని కనబడదు. ఈ పన్నెండుగురి వాదాలలోనే, కథనూ, చివరకూ ఈ ఉదంతంలో సత్యాన్నీ దర్శకుడు ఆవిష్కరించాడు. అదే సత్యమని ముద్దాయి నిర్దోషి అనీ హెన్రీ ఫాండా గాని దర్శకుడుగాని మనకి స్పష్టంగా చెప్పరు.

అయినా అదే నిజమనీ, కథారంభంలో తిరగని, ఎలక్ట్రిక్ పంకా కీలకంగా, ఈ సత్యం అందబట్టే ఉండి కూడా, దోబూచులాడిందని మనికి అనిపిస్తుంది. ముద్దాయి దోషి అన్న భావానికి 11 ఓట్లు అనుకూలంగా, 1 ప్రతికూలంగా ఆరంభమైన అన్వేషణ క్రమంగా ఇటు తిరిగి గంట తరువాత 11 గురు ముద్దాయికి అనుకూలురు, ఒకడు ప్రతికూలుడూ అవుతారు. అతడైనా తిక్కకొద్దీ నిలుస్తాడు.

ముద్దాయి ఈడువాడే అతని కొడుకూను. రెండేళ్ళ క్రితం తండ్రితో పోట్లాడి, లెంపకాయ కొట్టిపోయాడు. అతని కడుపు చిచ్చు, తిక్కగా తయారై ఈ కేసులో తండ్రిని చంపినాడన్న నింద భరిస్తున్న కుర్రాడిమీద కసిగా మారుతుంది. తను ధర్మం కోసమే పోరాడుతున్నాడని అతను అనుకుంటాడుగాని, ధర్మపాలనకు అవసరమైన సత్యం బయల్పడడానికి అడ్డుతగులుతున్నాడని తెలుసుకోడు.

8867 అడుగుల నిడివిగల చిత్రంలో, కథను ఇంత రక్తికట్టేలా, ఇంత కట్టుదిట్టంగా కళ్ళకు నచ్చిన శిల్పి పేరు, రెజినాల్డ్ రోజ్, ఈ స్క్రీన్‌ప్లే చలనచిత్రకారులకు పఠనగ్రంథం అనతగ్గది.

దర్శకుడు సిడ్నీ లూమెట్, ముఖ్యనటుడు హెన్రీ ఫాండా (వార్ అండ్ పీస్‌లో పియర్ వేసిన నటుడు), లీ.జె. కాబ్, మిగతావారు బ్రాడ్వే నాటకరంగ స్థలానికి చెందినవారు. ఈ పన్నెండుగురూ పన్నెండురకాల జీవిత దృక్పథాలకు ప్రతినిధులు. వాళ్ల వేషభాషల దగ్గరనుండి రూపురేఖా విలాసాల వరకూ ఆ యా పాత్రలకు సరిపోయారు. ఆపైన అతి సహజమైన నటన, దగ్గడం, నవ్వడం, నిట్టూర్చడం దగ్గర నుండి ఎంతో జాగ్రత్తగా చూసుకుని అతి సహజంగా ఉందనిపించేలా చేశారు.

కథనం కూడా ఇదే విధమైనది. ఎంత సహజంగా వుందో అంత ప్రయత్నమూ, ఆలోచనా దీని వెనుక వున్నాయని అనిపిస్తుంది. అయినా కృతకత్వం కనపడదు. ఉక్కగా, ఇరుకుగా వున్న ఆ చిన్న గదిలో వాళ్ళే అటూ ఇటూ తిరిగేందుకు చోటుచాలదు. అందులో కెమేరా అతి నైపుణ్యంగా తిరిగింది. అభిమాన నటులు బోలెడుమంది ఉన్నచోట సంభ్రమాశ్చర్యాలతో తిరిగే అభిమానిలా అందరి హావభావాలు కనిపెట్టి చూస్తుంది. వేళాకోళం చేయవచ్చిన విమర్శకుడిలా, కనీకనపడని అవలక్షణాలను పట్టుకు చూపిస్తుంది.

ఇందులో నేపథ్యసంగీతం కూడా ఏమంతలేదు. ఉన్నదల్లా సంభాషణలే. ఒకాయనికి కోపం రెచ్చిపోయి తిక్కరేగితే కెమేరా ఆయనను చూస్తున్నపుడు ఆ తిక్క మరింత రెచ్చకొట్టే సంభాషణ (ఇంకోళ్లది) మనకి వినిపిస్తుంది. ఒక జూరర్ తన తప్పు తెలుసుకుని మనసు మార్చుకోబోతుంటే ఔట్‌ఫీల్డ్‌లో మరొక మనిషి మాటలు అతనికి ఉపశృతిచేసి ప్రోత్సాహాన్నిస్తాయి. జూరర్‌లకి ఉక్కపోస్తే ప్రేక్షకులు గాలి విసురుకునేలా చేసే వాతావరణం, ఇటువంటి ఉపాయాల ద్వారా ప్రవర్తిల్లింది. దీని మూలాన ప్రేక్షకులు తన్మయులైపోతారు. మనలో కూడా దోషికి మరణదండన పడుతుందా అన్న మామూలు కుతూహలం క్రమంగా రంగుమారి పడాలేమో, పడకూడదేమో, ఏమో అని పరిపరివిధాల పరుగులెత్తి చివరికి కథకుడి ఊహ ప్రకారం పడడం న్యాయం కాదేమో అన్నస్థితికి వస్తాం.

***(ఆంధ్ర-వారపత్రిక, 1958)***

ఈ సినిమా బాగా ఆడడమే కాదు, ఈ నాటకం ఇప్పటికీ ప్రదర్శింపబడుతోంది. దీన్ని హిందీలో 'ఏక్ రుకా హువా ఫైసలా' అన్నపేరుతో తీశారు. బాసు ఛటర్జీ దర్శకత్వం వహించాడు.



# కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్

"కాస్త ఏరు దాటిస్తావా కప్పా?" అని అడిగింది ఓ తేలు.

"నీ గుణం చెడ్డది. తీరా ఏరుదాటించాక నన్ను కుట్టి మరీపోతావు" అంది కప్ప. కుట్టబోవడం తేలుగుణం.

ఇలాంటి పిట్టకథలు చెప్పి, చుట్టూ ఉన్నవారిని ముగ్ధుల్ని చేయడం గ్రెగరీ అకార్డీ అనే కోటీశ్వరుడి గుణం. తన నిండా చీకటి నింపుకుని, చీకటి మధ్య తను నిల్చొని ఉండడం కూడా ఒక గుణంగా అబ్బింది. కోటీశ్వరుడు కాబట్టి ఈ గుణాల గురించి ఆ గుణాలవాలుడి గురించి, కొల్లలుగా కట్టుకథలు చెలామణీ అయ్యేవి.

అకార్డీ అసలు కథ మాత్రం ఎవరికీ తెలియదు. తెలుసుకుంటే చాలా కథ ఉందని, డబ్బు పుష్కలంగా దొరుకుతుందని స్ట్రాటన్ అనే అమెరికన్ యువకుడికి తెలిసింది. స్ట్రాటన్ చీకటిజీవుల కోవలోవాడు. డబ్బు అంటే చాలా సరదా. బోలెడు ఆశ. ఒక రోజు రాత్రివేళ, నేపుల్స్ హార్బర్‌లో శవం కాబోతున్న ఒక శాల్తీ అతడికి తటస్థపడింది. స్ట్రాటన్ జాలిపడి సాయపడబోయేడు.... కాని, అది "వీపు మీద చాకు మార్కు" ఖూనీ కేసు. చనిపోయే క్షణాలలో ఆ మనిషి స్ట్రాటన్‌కి అకార్డీ సోఫియా అనే రెండు పేర్లు చెప్పాడు. అవి గుర్తుంచుకుంటే డబ్బు దొరుకుతుందని ఉపదేశించి మరణించాడు.

కోటీశ్వరుడైన అకార్డీ దగ్గిర ఈ తారకమంత్రం చదివితే డబ్బు పలుకుతుందన్న ఆశతో స్ట్రాటన్ ముందర అకార్డీ కుమార్తెతో చెలిమి కలపచూచాడు. మొండికెత్తి, బరితెగించి, వెంటబడుతున్న ఈ స్ట్రాటన్‌ను చూచి ఆ పిల్ల ముచ్చటపడింది.

అకార్డీ చారచక్షువు. అతనికి పాతిక ముప్పై మంది సెక్రటరీలే ఉన్నారు. వాళ్లందరూ తలోపనీ చూసినా, అందరూ చేయవలసిన ఒక పని ప్రతి ఒక్కర్తూ అకార్డీ కుమార్తెని వెయ్యి కళ్లతో కనిపెట్టడం. తన పుట్టుపూర్వాల విషయం కాని

మరే సంగతికాని కుమార్తెకు తెలియడం అకార్డీకి సుతరామూ ఇష్టం లేదు. ఆమె అంటే పంచప్రాణాలూను. ఎంత ప్రేమో, అంత భయంకూడా. తను పువ్వుల్లే ఇంత పదిలంగా పెంచుకుంటున్న తన కుమార్తెని మంచి చేసుకుంటున్న చిన్నవాడి మంచి చెడ్డల గురించి అకార్డీ కూపీ తీయించాడు. స్ట్రాటన్ కథ ఏమంత అమోఘమైనది కాదని తేలింది. ఈ రోమియో తన కుమార్తె నీడ కూడా చూడరానివాడని నిశ్చయించుకున్నాడు.

ఒక రోజున, స్ట్రాటన్‌ను చాటుకి పిలిచి హెచ్చరించాడు. తన కూతురు జోలికి పోవద్దన్నాడు. అంతలోనే రైనా కూడా వచ్చింది. స్ట్రాటన్ తనకు తెలిసిన 'తారక మంత్రం' ఉచ్చరించి అప్పటికి తప్పుకుపోయాడు. మర్నాడు అకార్డీ స్ట్రాటన్‌ను తిరిగి పిలిపించాడు. తారకమంత్రం వైనం తరచి తరచి అడిగాడు. అక్కడితో స్ట్రాటన్ సంగతి తేలిపోయింది.

నన్ను గురించి లేనిపోని రహస్యాలు తయారుచేసి బుకాయింప చూశావు నిన్న. ఇది నికార్సయిన బ్లాక్‌మెయిలింగ్ అని గదమాయించాడు అకార్డీ. తరవాత సముదాయించాడు.

చూడు అబ్బాయ్. నువ్వు డబ్బు కోసం గదా నన్ను దబాయించ సిద్ధపడ్డావు. నీకు సుష్టుగా డబ్బిస్తా, నాకోపని చేసిపెట్టు అన్నాడు.

సై అన్నాడు స్ట్రాటన్.

1927కు పూర్వం నేనెవడినో నా పేరేమిటో ఊరేదో కథ అంతా రహస్యంగా ఆరాతీసి, నాకు రాసి ఇయ్యి అని కోరాడు అకార్డీ.

1927లో తను పరమదరిద్రుడుగా ఉన్న వైనం తప్ప ఇంకేమీ గుర్తులేదట అతడికి. వెనకటి కథంతా కావాలి. దీనికి ఐదు వేలిస్తానన్నాడు.

సై అన్నాడు స్ట్రాటన్.

స్పెయిన్, ఇటలీ, ఫ్రాన్సు, పోలెండ్, జర్మనీ ప్రభృతి యూరప్ దేశాలన్నీ పర్యటించాడు. ప్రముఖ నగరాలలోని చీకటి తావులకు యాత్రలు చేశాడు. దొంగలు, త్రాగుబోతులు బ్లాక్‌మెయిలర్‌లు ఇంకా రకరకాల వాళ్ళు, ఎందరినో సందర్శించాడు. విచ్చలవిడిగా డబ్బు వెదచల్లి చకచక సమాచారం సంపాదించుకుంటూ ఊరూరా తిరగసాగాడు.

చివరికి, కొన్నాళ్ళకి అడంగి చేరాడు. తనకి తెలిసిన తారకమంత్రంలో రెండో పేరుగల మనిషి సోఫియా అక్కడ ఉంది. సోఫియా తన పేరే కాకుండా గ్రెగరీ అకార్డీ కథంతా చెప్పేసింది. 1927 పూర్వం అతడి పేరు చెప్పింది, గడ్డం మీసం లేకుండా, ఉన్న అకార్డీ ఫోటో కూడా చూపించింది.

కాలంనాడు సోఫియా అకార్డీని ప్రగాఢంగా ప్రేమించింది. ఇపుడూ అంతే. అప్పట్లో ఆమె, ఆడపిల్లల్ని చేరదీసి పెద్ద ఎత్తున వ్యభిచార గృహం నిర్వహించి బాగా డబ్బు గడిచింది. అప్పట్లో ఈ అకార్డీ, నేపుల్స్ హార్బర్‌లో హత్యచేయబడ్డ ఆసామి,

సోఫియా రెండో భర్త జాన్ అనే మరొకడూ సోఫియా హంగుదార్లు. హఠాత్తుగా ఒక రోజున అకార్డీ, సోఫియా డబ్బు రెండు లక్షలు అపహరించి పారిపోయాడు. ఆ తరువాత దాంతో బాగా ఆర్జించి కోటీశ్వరుడయ్యాడు. పేరుమార్చుకున్నాడు. గడ్డం పెంచాడు. ఎన్నిచేసినా, ఆ పాత ముఠాలో ఎవరో ఎప్పుడో తన సిరిసంపదల మీద విరుచుకుపడతారని బెంగ. భయం.

సోఫియా చెప్పినదీ తనకి తెలిసినదీ కూడగా వచ్చిన కథ ఇది. స్ట్రాటన్ విస్తుపోయాడు. సోఫియా దగ్గిర సెలవు తీసుకుని ఇవతలకు వచ్చేసరికి అకార్డీ ప్రత్యక్షమయ్యాడు.

స్ట్రాటన్ వేటకి బయలుదేరిననాటి నుండి అకార్డీ అతణ్ణి రహస్యంగా వెన్నంటి వస్తూనే ఉన్నాడు. స్ట్రాటన్ వెళ్లిన ప్రతిచోటుకూ, ఇతడు కూడా చాటుగా వెళ్లి సమాచారం కనుక్కుంటూ వచ్చాడు. స్ట్రాటన్ తను కనుక్కొన్న వివరాలు చెప్పాడు. అయితే నీకు తెలిసినవన్నీ ఋజువు చేయగలవా? అని అడిగాడు.

దర్జాగా! మీ ఫోటో, పుట్టుపూర్వాలూ, యావత్తూ సోఫియా దగ్గర ఉన్నాయి అన్నాడు స్ట్రాటన్.

ఇద్దరూ బయల్దేరి నేపుల్స్ వెళ్లారు. మర్నాటికల్లా సోఫియా, తనకి కొంత సమాచారం చెప్పిన సోఫియా రెండో భర్త, తనతోపాటు నేపుల్స్ హార్బర్‌లో తారకమంత్రం విన్న తన ప్రియురాలు మిల్లీ, హత్య చేయబడ్డట్టు స్ట్రాటన్‌కు తెలిసింది. మూడు వీపుమీద బాకు మార్కు హత్యలే. నేపుల్స్ హార్బర్‌లో జరిగిన హత్య కూడా సరిగ్గా ఇదే పద్ధతిలో జరిగింది.

అక్కడితో గ్రెగరీ అకార్డీ వేసుకున్న పథకం పూర్తిగా అర్థమైపోయింది స్ట్రాటన్‌కు. అకార్డీ తన పాత జీవితపు రహస్యం తెలిసిన వాళ్లందర్నీ వరసపెట్టి చంపించి వేస్తున్నాడన్నమాట. కిరాయికి పనిచేస్తేనేం, మొత్తానికి తనకూ ఇపుడు అకార్డీ జీవితపు రహస్యం తెలుసు. తనూ అతని జాబితాలో ఉన్నట్టే.

ఆత్మరక్షణకు మార్గం ఆలోచించాడు స్ట్రాటన్. అకార్డీ సంగతి తెలిసిన పాత ముఠాలో సోఫియా చెప్పిన ప్రకారం ఇంకా ఒకడు మిగిలి వున్నాడు. అతడు కనక ఇపుడు తనకి దొరికితే, ఆ సాక్ష్యం సహాయంతో పోలీసుల ఎదుటపడి తన ప్రాణం తాను కాపాడుకోవచ్చు. స్ట్రాటన్ ఆ మనిషిని వెతికిపట్టుకున్నాడు. అతణ్ణి తన గదికి తీసుకెళ్ళి రహస్యంగా ఉంచాడు. స్ట్రాటన్ కనుమరుగైన క్షణంలో, అకార్డీ ఆ ఆఖరు సాక్షిని కూడా చంపించివేశాడు. అది కూడా వీపుమీద బాకులతో పొడిచివేసినదే.

ఇంక, తనే తరువాయి గ్రహించిన స్ట్రాటన్ చివరి ప్రయత్నంగా, సరాసరి అకార్డీ కుమార్తెనే శరణు కోరదలచాడు. ఆమెకు తండ్రి కథ తెలియదు. తను చెబితే తన్ను రక్షిస్తుంది అకార్డీ ఇక సాహసించలేడు.

స్ట్రాటన్ విమానాశ్రయానికి వెళ్లేసరికి ఒక్కటే టిక్కట్టు ఉంది. వెంటనే విమానాశ్రయానికి రావలసిందిగా అకార్డీ కుమార్తెకు టెలిగ్రాం ఇచ్చి విమానం ఎక్కాడు స్ట్రాటన్.

వెనకనే తరుముతూ వచ్చిన అకార్డీ, స్ట్రాటన్‌ను విమానం దింపించడానికి శతవిధాల ప్రయత్నించాడు. వాడు నా దగ్గిర కొలువు చేస్తూ పారిపోతున్నాడని ప్రకటించాడు. కాని కలసిరాలేదు. పోనీ తనకి టిక్కెట్టు ఇమ్మన్నాడు. అతను ఆ విమానాల కంపెనీలో వాటాదారు. అయినా పలుకుబడి పనిచెయ్యలేదు. ప్రయాణికులలో ఎవరైనా తమ టిక్కెట్టు అమ్మితే లక్ష డాలర్లకి కొంటానన్నాడు. ఎవరూ నమ్మలేదు. అందుకని అమ్మలేదు. నవ్వుకున్నారు. విమానం వెళ్ళిపోయింది. అకార్డీకి మతిపోతుంది.



కొద్దినిముషాలలో ప్రత్యేక విమానం కుదుర్చుకుని, ఎక్కి నడుపుకుంటూ మాడ్రిడ్ బయల్దేరి వెళ్లాడు. ఆ కొద్ది నిముషాల తేడాలోనే, స్ట్రాటన్ అక్కడ దిగి, రైనాను కలుసుకొని కొంత కథ చెప్పేశాడు.

వెనక విమానంలో వచ్చిన అకార్డీ విమానం నేలకి దించకుండా రేడియో టెలిఫోన్ ద్వారా తన కూతుర్ని పిలిచాడు. ఆమె కంట్రోలు టవర్ ఎక్కి జవాబు చెప్పింది. అమ్మాయ్ ఆ స్ట్రాటన్ మాటలు వినొద్దు అంది విమానంలో తండ్రి కంఠం.

కథంతా తెలిసింది అను అని ప్రోద్భలం చేశాడు, రైనా పక్కనే ఉన్న స్ట్రాటన్.

అంతా తెలిసింది నాన్నా అనేసింది రైనా.

ఆ తరువాత విమానంలో నుండి జవాబు రాలేదు. రైనా గొంతు చించుకున్నా లాభం లేకపోయింది. విమానం ప్రదక్షిణలు మానేసి సూటిగా పోసాగింది. చూడబోయిన మరో విమానంలో వారికి అందుబాటులో అకార్డీ కనబడలేదు. మనిషిలేని ఆ విమానం అలా పోతూనే ఉంది.

అయితే గియితే ఈ కథకు నీతి:

అనగనగా ఒకరాజు కవిని పిలిచి, 'అయ్యా నా సిరిసంపద లెరుగుదురు మీకు కావలసినది అడగండి ఇస్తా' అన్నాడు.

'ప్రభూ మీ చిత్తం వచ్చినది ఏదైనా ఇవ్వండి గానీ, మీ వ్యక్తిగతమైన రహస్యాన్ని దేన్ని మాత్రం నాకు ప్రసాదించబోకండి" అని బదులు చెప్పాడు (విజ్ఞుడైన) కవి.

ఈ కథను వార్నర్ బ్రదర్స్ వారు "కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్" అనే పేరుతో చలనచిత్రంగా నిర్మించారు. కథ, స్క్రీన్‌ప్లే, ప్రసిద్ధ దర్శక నిర్మాత ఆర్సన్ వెల్స్

వ్రాశారు. దర్శకత్వం, ఈ చిత్రంలో అకార్డీ భూమిక కూడా ఆయనే నిర్వహించారు. అక్రం టామిరాఫ్, మైకెల్ రెడ్ గ్రేవ్, పెట్రేషియా మదీనా కూడా ఇందులో పాల్గొన్నారు.

ఆర్సన్ వెల్స్ ఇతర చిత్రాలలో లాగే ఇందులో కూడా ఛాయాగ్రహణం నిర్దుష్టంగా, మామూలు చిత్రాలతో పోలిస్తే విలక్షణంగా ఉంది. కెమెరా విపరీతమైన వేగంతో పరుగెడుతుంది. ఇది సన్నివేశాల స్వభావాన్ని, కథ బిగువును ఇనుమడింపచేస్తుంది. ఒక విధంగా ఇది కథమీద, కథలో ఘట్టం మీద వ్యాఖ్యానంగా భాసిస్తుంది. ఇది ఆర్సన్ వెల్స్ పద్ధతి.

*(ఆంధ్ర-వారపత్రిక - 1956)*

1955 నాటి ఈ సినిమాకి 'మిస్టర్ అర్కాడిన్' అని ఇంకో పేరుంది. అమెరికన్ జీనియస్‌గా పేరుబడ్డ ఆర్సన్ వెల్స్ బహుముఖ ప్రజ్ఞాశాలి. నటుడు, రచయిత, దర్శకుడు, నిర్మాత. చిన్నవయసులోనే 'సిటిజన్ కేన్'లో వయసుమీరిన పాత్ర ధరించి ఆస్కార్ నామినేషన్ గెలుచుకున్నాడు. 'మేక్‌బెత్'(1948), 'ఒథెల్లో' (1952) వంటి బీభత్సప్రధానమైన సినిమాలతో బాటు పలు క్రైమ్ సినిమాలు తీశారు. 'ఒథెల్లో ' కేన్స్ ఫెస్టివల్‌లో ఉత్తమచిత్రంగా ఎన్నికైంది. అతని ఉత్తమ చిత్రాలలో 'సిటిజన్ కేన్ (1941), 'ది స్ట్రేంజర్' (1946), 'ది లేడీ ఫ్రమ్ షాంఘై' (1946), 'ది థర్డ్ మ్యాన్' (1949) 'కాన్ఫిడెన్షియల్ రిపోర్ట్' తరువాత 'టచ్ ఆఫ్ ఈవిల్', 'ది ట్రయల్' (1963) 'ఛైమ్స్ ఎట్ మిడ్‌నైట్' (1966) వంటి అనేక సినిమాలు తీశారు.





# వార్ అండ్ పీస్

ఒక గొప్ప కథను తీసుకొని చిత్రం నిర్మించడానికి డబ్బు చాలా ఉపయోగపడుతుంది. గొప్పకథతో, 'గొప్ప' అని చెప్పుకోతగ్గ చిత్రం నిర్మించడానికి డబ్బు ఒక్కటే చాలదు. గొప్పప్రతిభ, తగ్గ ప్రయత్నం కావాలి.

డబ్బు సమకూర్చగల హంగులన్నీ పూర్తిగానూ, చలనచిత్రానికి గల శక్తులూ అవధులూ సాధ్యమైనంత వరకూనూ వినియోగించుకొని, నిర్మాతలు చేసిన ప్రయత్న ఫలితం "వార్ అండ్ పీస్" చలనచిత్రం.

డినోడి లారెంటిస్, కార్లోపొంటీ అనే ఇటాలియన్‌లు ఇద్దరు. మూడు సంవత్సరాలనాడు, 'సాహసోపేతం' అని చెప్పుకోతగ్గ నిర్ణయం ఒకటి చేసుకున్నారు. ఏడాది తిరిగేసరికి పారమౌంట్ పిక్చర్ అనే అమెరికన్ సంస్థ, ఈ నిర్మాతలూ కలిసి, ఆ నిర్ణయాన్ని కార్యరూపంలో పెట్టారు. యూరప్ దేశాలు - ముఖ్యంగా ఇటలీ - రెండేళ్ళపాటు సంరంభంతో నిండిపోయాయి.

వారు తలపెట్టిన పని టాల్‌స్టాయి నవల "వార్ అండ్ పీస్" (యుద్ధము - శాంతీ)ను సెల్యులాయిడ్ భాషలోకి తర్జుమాచేయడం.

అసలు టాల్‌స్టాయ్ ఈ చెప్పడానికి ఆరేళ్ళు (1863-69) పట్టింది. ఆయన వ్రాసిన ఆరు లక్షల మాటలు, చదివి వంట పట్టించుకోవడానికి నెల, రెండు నెలలూ కూడా పడుతుంది. అంతటి గాథను నిర్మాతలు ఇపుడు మూడున్నర గంటల వ్యవధిలో చెప్పారు.


చిన్నతనంలో టాల్‌స్టాయ్

మహానదిలా ప్రవహించే ఈ గాథను మహామహులు కాకపోయినా, హేమాహేమీలు అనతగ్గ చలనచిత్ర రచయితలు దాదాపు పాతికమంది విడివిడిగా, జంటలుగా, గుంపులుగా ప్రయత్నించి కూడా దాన్ని ఆకట్టలేక, ఆనకట్టలు మటుకు కట్టి, సాధ్యమైనంత తక్కువ భాగాన్ని వడబోసి పదిహేనువేల అడుగుల ఫిలిం మీదకి కుదించారు.

నవలలో ప్రధాన పాత్రలే 23 ఉన్నాయి. తరువాత శ్రేణిచనతగ్గవి 43. ఇవికాక. ఇంకా 5 వందల మంది గుంపులుగా కాక, వ్యక్తులుగా ముఖ్యలుగా కనబడి పలకరించి వెళ్ళారు. చలనచిత్ర నిర్మాణ కార్యక్రమంలో ప్రధాన పాత్రల సంఖ్య 23 నుండి 17కు తగ్గిపోయింది. టాల్‌స్టాయ్ చిత్రించిన యుద్ధాలు పది అయితే, ఇందులో మూడు చూపించడం గగనం అయింది.

అయినా చలనచిత్రం అనేసరికి ఏర్పడే అవధుల దృష్ట్యా, సాధక బాధకాల దృష్ట్యా, ఈ ప్రయత్నం ఈ బృహత్కథకు తగిన స్థాయిలోనే జరిగిందని చెప్పాలి.

50 లక్షల డాలర్ల ఖర్చుతో, అగ్రశ్రేణికి చెందిన అంతర్జాతీయ నటీనటులు 60 మందితో, మరి పదివేల మంది చిన్న నటులతో ఈ గాథకు రూపం ఇచ్చారు.

యుద్ధదృశ్యాలలో ఫ్రెంచి సైనికులుగానూ, రష్యన్ సైనికులుగాను కూడా 5,700 మంది ఇటాలియన్ సైనికులు నటించారు. నెపోలియన్ కాలం నాటి శతఘ్నులు, బండ్లూ, కత్తి కఠార్లూ సైనిక దుస్తులూ తయారుచేయడం, రోం నగరంలో కొంతకాలంపాటు పరిశ్రమగా సాగిపోయింది. దృశ్యాల చిత్రీకరణ ఒక్క ఇటలీలోనే కాక దాదాపు యూరప్ దేశాలన్నిటిలో జరిగింది. యుగోస్లోవియాలోని "వాయ్‌వాడినా" నగరం వద్ద 1812 నాటి మాస్కో నగరాన్ని పూర్తిగా పునర్నిర్మించారు. అయినా నెపోలియన్ దండయాత్రల నాటి రష్యాలోని సాంఘిక జీవితాన్ని సమగ్రంగా చిత్రించిన టాల్‌స్టాయ్ నవలను చదివినవారికి "వార్ అండ్

పీస్" చిత్రంలో కొట్టొచ్చినట్టుగా కనబడే వెలితి ఒకటుంది. నవలలోని అసంఖ్యాక సజీవపాత్రల్లో నాలుగైదు మాత్రమే సమగ్రంగా ఈ చిత్రంలో కనిపిస్తాయి.



50 ఏళ్ళనాడు టాల్‌స్టాయ్ తొలిసారిగా ఒక చలనచిత్రాన్ని చూచి ఈ సాధనం శక్తిని మెచ్చుకున్నాడు. ఈనాడు, మహత్తర శక్తిగల సాధనాలలో చలనచిత్రాలు ముఖ్యమైనవని సర్వత్రా అంగీకరించారు. అయితే "వార్ అండ్ పీస్" వలె వందల కొద్దీ పాత్రలు, వేలకొద్దీ సంఘటనలూ ఉన్న పెద్దకథలు తీసుకున్నపుడు, అవన్నీ ఒక చిత్రంలో ఇముడుతాయా అన్నది ప్రశ్న. ప్రయత్నిస్తే ఎంతవరకూ ఒప్పించవచ్చును?

ఉన్న అవధుల దృష్ట్యా, ఒక చలనచిత్రంలో "ఎంత ఎక్కువ" కథ చూపించారు అన్న దానికన్న, చెప్పినకాస్తా "ఎంత గొప్పగా" చెప్పగలిగారూ అన్నదే ప్రధానం అని చెప్పుకోవాలి. అలా కాకపోతే సెల్యులాయిడ్ పొడుగూ, వెండితెర వెడల్పూ, రంగుల హంగులూ మాత్రమే చలనచిత్రాల "మహత్తరశక్తి"కి కొలబద్దలు అవుతాయి. (హాలీవుడ్ నుంచి వచ్చిన అనేక పౌరాణికాలకు ఇదే కొలమానం అయింది.)

ఇక, ఈ చిత్రానికి సంబంధించిన మిగతా అంశాలు అన్నీ అత్యుత్తమంగా ఉన్నాయి. ఆస్టర్లిట్జ్, బొరోడినో, బెరిజీనా యుద్ధాలూ, మంచులో నెపోలియన్ సేనా వాహిని తిరోగమనయాత్ర మొదలైనవన్నీ చలనచిత్రాలు అందుకోగల ఉత్తమ స్థాయికి నిదర్శనాలు. ఈ యుద్ధాలూ, వాటి పర్యవసానాలూ, జీవిత పరమార్థం ఏమిటని మథనపడే కౌంట్‌పియర్ బెజుహోవ్ దృష్టికి గోచరించిన రీతిన చూపించారు. స్వయంగా చూచి అనుభవించి తెలుసుకోనిదే తృప్తిపడనివాడు పియర్. అతనికి తెలియని సమాధానాలు ఎన్నోవున్నాయి. అవి ఎవరికీ తెలియవు. అయితే అతడు వాటి గురించి పట్టించుకుంటాడు.

తప్పేదో ఒప్పేదో తెలిసి కూడా తప్పుదారినే తానెందుకు నడుస్తున్నట్లు? నడిచే దెక్కడికి? నడిపించేదెవడు? మనుషులు యుద్ధం ఎందుకుచేస్తారు? ఇదీ అతని తపన. పియర్‌గా హెన్రీఫోండా నటించాడు. ప్రతీసారీ తన హృదయం ఇచ్చి పుచ్చుకున్న ప్రియుణ్ణి వెనకేసుకొచ్చే నతాషా పాత్రలో ఆడ్రీ హెప్‌బర్న్ అద్భుతంగా నటించింది. 'రోమన్ హాలీడే', 'సబ్రీనా, ఫెయిర్ చెయిల్డ్'ల తర్వాత ఇది ఆమె

మూడవ చిత్రం. ఆమె భర్త మెల్‌ఫెరర్ ప్రిన్స్ ఆంద్రీగా నటించాడు ఈ భారీ చిత్రానికి దర్శకుడు కింగ్ విడార్.

యుద్ధాలెందుకు జరుగుతాయి? ఒక దేశంలోని జనులు వ్యక్తిగతంగా తామెప్పుడు చూడని, ద్వేషించని మరో దేశపు వేలాది జనుల్ని యుద్ధం పేరిట అమానుషంగా ఎందుకు హత్యచేస్తారు? 19వ శతాబ్దపు తొలి దినాల్లో నెపోలియన్ దిగ్విజయ యాత్రతో యూరప్ అంతా అట్టుడికినట్లుడికిపోయింది. లక్షల కొద్దీ జనం చనిపోయారు. దేశాలకి దేశాలు శ్మశానాలుగా మారిపోయాయి. ఈ దారుణానికి కారణమేమిటి? కారకులెవరు?

ఒక్కొక్క చరిత్రకారుడు ఒక్కొక్క రకంగా కారణాలు చెప్పాడు. నెపోలియన్ విజిగీష కారణమని ఒకడూ, విప్లవం వ్యాపింపచెయ్యాలనే ఫ్రెంచి వారి దురాశ అని మరొకరు, జార్ చక్రవర్తిదే తప్పని మరొకరు ఇలాగ అనేక కారణాలు చెప్పారు. రష్యన్ సాహిత్యకారుడు టాల్‌స్టాయ్ ఆ రోజుల్లో వ్యాప్తిలో వున్న ఈ వాదాలన్నిటినీ ఖండించి అసలు కారణాలను అన్వేషించడానికి ప్రయత్నించాడు. ఈ ప్రయత్నం పదకొండు వందల పేజీలకు పైబడిన పెద్ద నవల (వార్ అండ్‌పీస్) రూపంలో జరిగింది. వేర్వేరు వ్యక్తిత్వం కలిగిన అనేక పాత్రలు, వందల కొలది సంఘటనలు, అసంఖ్యాక సేవావాహినుల సంఘర్షణలు వీటితో క్రిక్కిసి[illegible]న ఈ నవల ప్రపంచ సాహిత్యంలోనే గొప్ప నవల అని అంటారు.

ఈ నవలకు కథానాయకుడని చెప్పదగినవాడు పియర్ బెజుహోవ్. పియర్ యువకుడు, విద్యావంతుడు, అమిత ధనవంతుడు, సరళ [illegible]భావుడు. కాని నడవడిలో నిలకడలేనివాడు. జీవిత పరమార్ధం ఏమిటి? [illegible] [illegible]వితం ఆనందాన్నిస్తుంది? ఇవీ అతన్నెదుర్కొన్న సంశయాలు. తన ధనాన్ని [illegible]డిన భార్య అతనికి దుర్భరంగా తయారవుతుంది. నెపోలియన్ మీద కొండంత గౌరవంతో ప్రారంభించి, యుద్ధబీభత్సాన్ని కళ్లారా చూసిన తరువాత ఆ గౌరవమంతా పోగొట్టుకుని నెపోలియన్‌ను హత్య చేసి పగ తీర్చుకోవాలనుకునేంతదాకా వస్తాడు. చివరి కతనికి ప్లేటన్ అనే ఒక పేదరైతులో తను అన్వేషిస్తున్న జీవిత లక్ష్యం కనిపించినట్లవుతుంది. అతని అన్వేషణ నతాషా అనే యువతి ప్రేమలో సఫలమవుతుంది. ఆమె నతడు వివాహం చేసుకుంటాడు.

మరొక ముఖ్య పాత్ర ప్రిన్స్ ఆంద్రీ. ఇతడు పియర్ స్నేహితుడు. అతని వలెనే విద్యాధికుడు, ధనాఢ్యుడు. తన కీర్తికాంక్షకు యుద్ధం మంచి అవకాశమిచ్చిందని భావిస్తాడు. కాని యుద్ధ విధ్వంసనం చూసి, శారీరకంగా, మానసికంగా యాతనలనుభవించి పరివర్తన చెందుతాడు. నతాషాను ప్రేమించి పెళ్ళి చేసుకోబోతాడు. కాని ఆమె బుద్ధిచాపల్యం వల్ల పెళ్ళి ఆగిపోతుంది. నతాషా మీద, ఆమెకు

తననుంచి వేరు చేసిన అనటోల్ మీద ద్వేషం వహిస్తాడు. కాని యుద్ధం అతనిలో ఒక మహోదాత్తమైన పరివర్తన తీసుకువస్తుంది. మృత్యువు ఎదుర్కొన్నప్పటి లాగానే జీవితం ఎదుర్కొన్నప్పుడు కూడా ద్వేషం, ప్రతీకారభావం మొదలైన



అల్పభావాలన్నీ విఫలమైపోతాయనీ, నిజమైన జీవితానికి త్యాగం, ప్రాణికోటినంతటినీ ఆవరించే విశాల ప్రేమ ఇవే మూల సూత్న సూత్రాలనీ గ్రహిస్తాడు. ఈ సత్యం గ్రహించడంవల్ల కలిగిన నూత్న బలంతో మృత్యువును చిరునవ్వుతో ఎదుర్కొని ప్రియురాలైన నతాషా ఒడిలోనే మరణిస్తాడు.

కథానాయిక నతాషా అతి సుందరమైన పాత్ర. కొండరాళ్ళమీద త్రుళ్ళింతలాడుతూ అపరాని ఉద్వేగంతో ప్రవహించే ఝురి లాటిది నతాషా. దుస్తుల్ని మార్చినంత అవలీలగా ప్రేమికులను మార్చేస్తుంది. కాని ఏ ప్రేమికుడూ ఆమె హృదంతరాన్ని వశపరుచుకోలేక పోతాడు ఒక్క ఆంద్రీ తప్ప. అతడు యుద్ధంలో తగిలిన గాయంవల్ల మరణిస్తాడు. బాల్యం నుంచీ తన్ను కష్టంలో సుఖంలో అనుసరించి వస్తున్న పియర్‌ను వివాహం చేసుకుంటుంది. ఒక దారీ తెన్నూ లేకుండా ప్రవహిస్తున్న ఝురి మైదానంలోకి వచ్చి ప్రశాంతంగా, విశాలంగా ప్రవహించినట్లు ఆమె జీవితం చివరకు ఒక బరువుతో, పరువంతో, నిండుతనంతో మాతృత్వంతో పరిపూర్ణమవుతుంది.

ఈ మూడు ముఖ్య పాత్రలు. "యుద్ధమూ శాంతీ"లో ఇంకా అనేక పాత్రలు సజీవమైనవి వున్నాయి. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రం సాధించడానికి ప్రారంభమైన ఫ్రెంచి విప్లవాన్ని వక్రమార్గాలు పట్టించిన నెపోలియన్‌ను టాల్‌స్టాయ్ ద్వేషంతో కాక, యుద్ధానికి దారితీసిన అనేక వేల కారణాలలో ఒక కారణంగా, అల్ప మానవుడుగా మాత్రమే చిత్రిస్తాడు.

ఈ నవలలో కథ, చరిత్ర రెండూ మిళితమై వున్నాయి. అంచులు, అవధులు లేని జీవితంలాగానే కథ ఫేడిన్ అయి, ఫేడౌట్ అవుతుంది. ఈ మధ్యలో వ్యక్తులు అనేక పరిణామాలకు లోనవుతారు.

**(ఆంధ్ర-వారపత్రిక-1956)**

---

208 నిముషాలపాటు సాగే ఈ 1956 నాటి చిత్రంలో హేమాహేమీలు నటించినా విమర్శకుల ఆదరణకు నోచుకోలేదు. మేరియో సోల్డాటి నిర్వహించిన యుద్ధ సన్నివేశాలను మాత్రం అందరూ పొగిడారు. కింగ్ విండార్‌తో సహా ఆరుగురు రచయితలు కుస్తీపట్టిన స్క్రిప్టు సరిగ్గా లేదని ఆరోపణలు వచ్చాయి.

1968లో రష్యన్లు సెర్జీ బోండర్ చక్ దర్శకత్వంతో ఇంకొక 'వార్ అండ్ పీస్' తీసారు. 434 నిముషాల చిత్రాన్ని తీసి దాన్ని 373 నిముషాలకు కుదించి ఇంగ్లీషులో అనువదించి విడుదల చేస్తే అత్యద్భుతంగా ఉందని ప్రశంసలు కురిసాయి. ఆ సంవత్సరం ఆస్కార్ బహుమతుల్లో ఉత్తమ విదేశీ చిత్రంగా ఎన్నికయింది.

# బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్



బాగా డబ్బు గడించే చిత్రాలన్నీ బాగా వుండవన్నట్టే, బహుమతులు తెచ్చుకున్నవీ బాగుండవని ఒక అపప్రథలాంటిది వినబడుతూ వుంటుంది. ఇది పచ్చి అబద్ధమూ కాదు, అలా అని ఢోకాలేని మహానిజమూ అనుకోరాదు అని మందలించే మంచి చిత్రాలు - డబ్బూ, బహుమతులూ, పేరూ కూడా తెచ్చుకున్నవి - అప్పుడప్పుడు వస్తూనే వున్నాయి. 1957వ సంవత్సరంలో బాక్సాఫీసు హిట్‌గా, అమెరికన్ మోషన్ పిక్చర్స్ అకాడమీ (ఆస్కార్) బహుమతులు ఏడింటిని సంపాదించుకున్న 'ఎవార్డ్ విన్నర్'గా సర్వత్రా విమర్శకుల, చిత్రాభిమానుల ప్రశంసలందుకున్న మంచి చిత్రంగా పేరు గడించినది - 'బ్రిడ్జ్ ఆన్ ది రివర్ క్వాయ్'.

దారుణ మారణహోమం చేసే యుద్ధాన్ని గర్హించి, యుద్ధం చేయించేవారు, చేసేవారు ఉన్మాదులని హృదయవిదారకంగా ఘోషిస్తుందీ చిత్రం. యుద్ధం పట్ల జుగుప్స కలిగిస్తుంది. మామూలు మనుషులే కాక, జీవితంలో యుద్ధాన్ని 'ఆప్షనల్' (అభిమాన విద్య)గా హాబీగా తీసుకున్న బుద్ధిమంతులంతా రేపు ప్రొద్దుటికి మతం మార్చుకుంటారనుకోవడానికి సదుపాయం లేకపోయినా ఈ చిత్రంమటుకు ప్రతివారిలోను ఒక విధమైన నిర్వేదం కలిగిస్తుంది. యుద్ధబుద్ధులలో కూడా, చిత్రం

చూసిన తరువాత కొద్దినిమిషాలపాటైనా స్మశాన వైరాగ్యం లాంటి చలనచిత్ర వైరాగ్యం ప్రవర్తిల్లుతుంది.

అయితే బహుమతులు తెచ్చుకునే కొన్ని చిత్రాలలా దీని గొప్పతనానికి కారణం... ఊహ మంచిదై వుండడమే కాదు, సందేశం గొప్పది కావడమే కాదు, నూటికీ కోటికీ గోచరించే శిల్పనైపుణి, రామణీయకత ఇందులో నిలిచాయి. ఈ చిత్రం ఛాయాగ్రహణ దర్శకుడూ (జాక్ హిల్డ్‌యార్డ్), దర్శకుడు డేవిడ్ లీన్, ఇద్దరూ ఇందులోని 15 వేల అడుగులలోనూ అడుగడుగునా ప్రతి మాటను, చేతను తూచితూచి వాడుకున్నారు.

ఒక్కొక్క దృశ్యాన్ని ఒక్కొక్క ఉత్తమశ్రేణి వర్ణచిత్రానికి వలె తీశారు. ఒక్కొక్క సన్నివేశాన్ని రసభరితమైన గాథగా, కావ్యంగా చిత్రించారు. ఆయా పాత్రల హృదయాలను, దేశ, కాల, స్థితిగతులకు అనుగుణంగానే అయినా, అతీతంగా కనిపించే రీతిన ఆవిష్కరించారు. అచేతనాల చేత, చలనచిత్ర అవధులను హిమగిరి శిఖరాలకు, దిగంతాలకు పెంచగల నిశ్శబ్దం చేతా 'భీతి'కి నిర్వచనం చెప్పారు. భాషకు అందని భావాలు పలికించారు.

ఈ అన్నిటికన్నా ఎత్తుగా ఠీవిగా, శక్తివంతంగా, అందంగా కనిపించి అందరినీ మైమరపించేది- విద్యుక్త ధర్మాలను తూచా తప్పక పాటించి, ఆత్మగౌరవాన్ని, తన జాతి గౌరవాన్ని నిలబెట్టుకున్న బ్రిటిష్ కర్నల్ నికల్సన్‌గా బ్రిటిష్ నటుడు అలెక్ గినెస్ ప్రదర్శించిన నటన. ఈ క్షణం అతడు ఘనీభవించిన ఆత్మగౌరవం. మరుక్షణంలో ఆవరిస్తున్న దైన్యాన్ని ప్రతిఘటిస్తున్న శౌర్యం. ఉత్తర క్షణంలో కాటువేయజూసిన సర్పంలాంటి జపనీస్ కర్నల్‌ను ధిక్కరించిన దర్పం. క్షణార్థంపాటు అనధికార వాత్సల్యం, ఉత్తరార్థంలో అధికారిక కాఠిన్యం. ఇన్ని హావభావాలను ఇంత సహజంగా, విశ్వసనీయంగా, సొగసుగా ప్రదర్శించగలగడం ఒక అలెక్ గినెస్‌కే చెల్లింది.

గినెస్ నటించిన కర్నల్ నికల్సన్ రెండవ ప్రపంచ యుద్ధకాలంలో తన పటాలంతో సహా పై అధికారుల ఉత్తర్వుల ప్రకారం జపాన్ సైనికులకు లొంగిపోతాడు. జపనీస్ కర్నల్ ఈ యుద్ధఖైదీల చేత, జపాన్ దళాలు తిరగవలసిన ఒక ముఖ్య రహదారిలో, ఒక నదిమీద వంతెన కట్టించబోతాడు. "మేము యుద్ధఖైదీలం తప్ప బానిసలం కాము. అంచేత మా సైనికులకు మా అధికారులే ఉత్తర్వులు ఇచ్చి పనిచేయించాలి" అంటాడు కర్నల్ నికల్సన్.

జాపనీస్ అధికారి అందుకు సమ్మతించడు. ఆఫీసర్ హోదా గల దళపతులతో సహా అందరూ కాయకష్టం చేయాలని శాసిస్తాడు. నికల్సన్ అంగీకరించడు. జెనివా ఒప్పందాలు, అంతర్జాతీయ మర్యాదలు మన్నించాలనంటాడు. జాపనీస్ కర్నల్ నికల్సన్‌ను అవమానిస్తాడు. ఆనక దారుణంగా హింసిస్తాడు. అయినా నికల్సన్ శాంతియుతంగా, సహాయనిరాకరణ విధానంతో ప్రతిఘటిస్తాడు క్రౌర్యాన్ని, పశుబలాన్ని.

చివరికి అతని సహనమే జయిస్తుంది. జాపనీస్ కర్నల్‌ను నిస్పృహ ఆవరిస్తుంది. తను నిర్ణీతకాలానికి పూర్తిచేయవలసి వున్న వంతెన నిర్మాణాన్ని నికల్సన్‌కు అప్పగిస్తాడు. నికల్సన్, జాపనీస్ ఇంజనీర్ల పథకం కన్న కట్టుదిట్టమైన పద్ధతిలో వంతెన నిర్మించిపెడతాడు. శత్రువులకు చేతులారా సాయం చేస్తున్నామన్న భావం అతనికి కలగదు. నియమనిబంధనల మధ్య పుట్టిపెరిగిన మనిషిగా అతడు ఈ సమస్యని చూశాడు. ఆ సబబుల ప్రకారం యుద్ధఖైదీలు శత్రువులు చెప్పిన పనిచేయాలి. పోతే నికల్సన్‌కు సంతోషకరమైన మరో విషయం తన పటాలంలో సైనికులు కట్టుతప్పిపోకుండా వాళ్ళకి మళ్ళీ క్రమశిక్షణ అలవరచగలుగుతున్నామని. అంతే.

చివరికి వంతెన పూర్తయిన వేళకు, బ్రిటిష్ సైనిక అధికారులకు ఈ వైనం తెలిసి, దాన్ని ధ్వంసం చేయించడానికి ముగ్గురు ఉద్యోగులను పంపుతారు. నికల్సన్ ఇది భరించలేడు. "యుద్ధం పూర్తయ్యాక, ప్రజలు దీన్ని వాడుకుంటారు. ఫలానా అపుడు ఒక బ్రిటిష్ యుద్ధఖైదీల దళం దీన్ని కట్టిపెట్టింది అని చెప్పుకుంటారు. అది తన జాతికే గర్వకారణం" అని నికల్సన్ తాత్పర్యం. అందుకని తన పక్షం అధికారులే వచ్చి వంతెనను కూల్చబోయినా దానిని ప్రతిఘటించబోతాడు.

అందులో అతడు కృతకృత్యుడు అయితే, అంత మంచివాడూ 'దేశద్రోహి' కావచ్చు; ప్రయత్నించి విఫలుడైనా అంతే కావచ్చు. అందుకని అతిసహజంగా సాగిన ఈ కథలో అతడు ప్రమాదవశాత్తూ చనిపోతూ పోతూ సరాసరి డైనమైట్ పెట్టె మీదనే పడి, ప్రయత్నం, ప్రతిఘటించడం కూడా లేకుండా డైనమైట్ అంటించి వంతెన విధ్వంసానికి నిమిత్తమాత్రుడు అవుతాడు....

గినెస్ తర్వాత ఈ చిత్రంలో జాపనీస్ కర్నల్‌గా నటించిన సెసూ హయకావా నటన చాలా గొప్పగా వుంది. మహా క్రూరుడుగా, వేషం వేసుకున్న ఆత్మవిశ్వాసంలా కనిపించే ఆ అధికారి అంతరాంతరాలలో భీతిని, దౌర్బల్యాన్ని, నిస్సహాయతను ఆ వ్యక్తి గౌరవానికి భంగం కలుగకుండా అతి సున్నితంగా ఆ నటుడు ప్రదర్శించాడు.మరొక బ్రిటిష్ అధికారిగా జాన్ హాకిన్స్, ఈ చిత్రం సందేశాన్ని 'ఉన్మాదం' అన్న ఒక్క ముక్కలో శక్తివంతంగా చెప్పిన మిలిటరీ డాక్టర్‌గా జేమ్స్ డొనాల్డ్, అమెరికన్ నావిక దళాధిపతిగా విలియం హోల్డెన్ నటించారు. ఈ



చిత్రం నిర్మాత శాంస్టీగల్. సినిమా స్కోప్, టెక్నికలర్‌లో తయారయిన ఈ చిత్రం అంతా సింహళ ద్వీపంలో చిక్కటి అడవులలో షూట్ చేశారు.

*(ఆంధ్ర-వారపత్రిక –1956)*



ఈ సినిమా దర్శకుడు డేవిడ్‌లీన్ 'ఆలివర్ ట్విస్ట్' (1948), 'లారెన్స్ ఆఫ్ అరేబియా' (1962), 'డా. జివాగో' (1965) వంటి చిత్రాలు తీసి పేరు ప్రఖ్యాతులు పొందారు. సుమారు 14 సంవత్సరాల తర్వాత 76వ యేట భారతదేశ నేపథ్యంలో ఇ. ఎం. ఫాస్టర్ రాసిన 'ఎ పాసేజ్ టు ఇండియా'ను 1984లో తెరకెక్కించి విక్టర్ బెనర్జీ వంటి భారతీయ నటులకు అంతర్జాతీయ ఖ్యాతి సంపాదించి పెట్టారు.స్క్రీన్‌ప్లే విషయంలో తమాషా జరిగింది. పియరీ బౌల్ నవల ఆధారంగా కార్ల్ ఫోర్మన్, మైకేల్ విల్సన్ స్క్రీన్‌ప్లే రాశారు. కానీ వారిద్దరూ బ్లాక్‌లిస్ట్ చేయబడిన రచయితలు కావడంతో ఇంగ్లీషు రాని పియరీ బౌల్‌యే స్క్రిప్టు రాశారని ప్రకటించారు.

# గోల్డ్ రష్



1958లో బ్రస్సెల్స్‌లో 117 గురు చలనచిత్ర చరిత్రకారులు కలసి చర్చించి అప్పటివరకు వచ్చిన చలనచిత్రాలలో 'బాటిల్‌షిప్ పోటెమ్‌కిన్' అత్యుత్తమ మని నిర్ణయించారు. తరువాత స్థానానికి చార్లీచాప్లిన్ చిత్రం 'గోల్డ్ రష్' ఎన్నికైంది.

అయితే ప్రపంచ చలనచిత్రాలకు 'గోల్డ్ రష్'యే తలమానికమని విశ్వసించి, వాదించి నిర్ణయించిన విమర్శకులు, చలనచిత్రకారులు అనేకమంది వున్నారు.

ఇది కూడా 'పోటెమ్‌కిన్' విడుదలయిన సంవత్సరంలోనే విడుదలైంది. ఇది కూడా దానిలాగానే ప్రపంచ ప్రజలను ముగ్ధుల్ని చేసింది. కాని దానికీ దీనికీ ఎక్కడా పోలిక లేదు. ఐసెన్‌స్టీన్‌కీ, చాప్లిన్‌కీ ఇద్దరూ స్వయంగా చిత్రాలు తీశారనే విషయంలో తప్ప ఎక్కడా పోలికలేదు. అతని శైలి వేరు ఇతని శైలి వేరు.

ఐసెన్‌స్టీన్ కేవలం సినిమా టెక్నిక్‌తో ప్రేక్షకులకు ఊపిరాడనీయకుండా దిగ్భ్రాంతుల్ని చేసి వశపరచుకుంటే చాప్లిన్ టెక్నిక్ ద్వారా కాక కేవలం కథ ద్వారా, తన అసమాన నటన ద్వారా, కారుణిక హాస్యం ద్వారా, మానవత్వం ద్వారా ప్రేక్షకులను తన ప్రజ్ఞతో ముంచెత్తుతాడు.

'గోల్డ్ రష్'లో కొండల మధ్య బంగారు గనుల కోసం వేలంవెర్రిగా ఎగబడడం ఇతివృత్తం. బంగారానికై జరిగిన అన్వేషణను చాప్లిన్ ఇందులో వేళాకోళం చేస్తూ ప్రదర్శించాడు. హాస్యం అంటే కేవలం 'బఫూనరీ'తోనే ఆగిపోకుండా విశాలమైన భావుకత్వంతో మానవులందరినీ ఏకీకరించే ఒక సాధనంగా చాప్లిన్ రూపొందించాడు.

ప్రభవించిన కవిత్వం, బాధకి భాష, వస్తు దర్శనానికి సాధనమైన ఒక కాంతి, మానవ హృదయానికి అర్థం చెప్పగల గ్రంథంలో ఒక ప్రకరణం, సర్వజన మనోహరమైన సార్వజనీన దృశ్యకావ్యం - ఇత్యాది పదసముదాయాలు చాప్లిన్ చిత్రాల గురించి టూకీగా చెప్పుకోవడానికి కొంత పనికొస్తాయంటారు. ఆయన చిత్రాలలో అగ్రగణ్యమైనది ఫలానా అని గట్టిగా చెప్పలేము. వాటిలో ఐదువేల అడుగుల మూకీ చిత్రం ఈ 'గోల్డ్ రష్' ఒకటి అని మాత్రం చెప్పగలం.

'అనితర సాధ్యం' అనిపించుకునే మార్గాలలో చాప్లిన్‌ది ఒకటి. ఆ దారిలో మరికొందరు హాస్యం చేయబోయి అపహాస్యం పాలయ్యేరు. ఎందుకంటే, రసాధిదేవత

అనిపించుకున్న కరుణసాగరానికి దగ్గర దారి అయిన హాస్యం, ఎంత దగ్గరో అంత దుర్గమమార్గం. చాప్లిన్‌కు ఆ దారి బాగా తెలుసు.

'పదిమంది కళాకారుల కృషి ఫలితం' అని అనుకోవడం సినీ లోకధర్మం. అలా అని ఊరుకోకపోవడం చాప్లిన్ చిత్రాల విశిష్ట విలక్షణత. చాప్లిన్ తన చిత్రాలకు తనే కథ రాసుకుంటాడు స్క్రిప్టు రాసుకుంటాడు. మాటలు ఎలాగూ లేవు. దరిమిలా మాటలు వచ్చినా బహు పొదుపుగా రాసుకున్నాడు. సంగీత రచన తనదే. ముఖ్యపాత్ర తనే నిర్వహిస్తాడు. ఆ విధంగా చిత్రం అడుగడుగునా ఆయన ముద్ర కనిపిస్తుంది. అది ఒక కళాకారుడి హృదయాన్ని, లోకావలోకన విధానాన్ని మటుకే ఆవిష్కరిస్తుంది. ఇది అందరికీ అనుసరణ యోగ్యమూ కాదు. ఆచరణసాధ్యమూ కాదు.

***(ఆంధ్ర-వారపత్రిక-1958)***

---

ది గోల్డ్ రష్ (1925) వ్యవధి 82 ని.లు 1942లో చాప్లిన్ రీ - ఎడిట్ చేసిన తర్వాత 72 ని.లు. నిజానికి చిత్రం కథ గురించి అనుకోకముందే కొన్ని దృశ్యాలు తీశాడట చాప్లిన్. కాని అవన్నీ చిత్రంలో చక్కగా ఇమిడిపోయాయి. చిత్రంలో మరుపురాని దృశ్యాలు - క్షుద్బాధతో అలమటించే చాప్లిన్ సహచరుడికి అతడు కోడిపుంజులా అనిపించడం, ఆకలికి తాళలేక చాప్లిన్ తన పాత బూటునే కేక్‌లా ఊహించుకుని ఫోర్క్, స్పూన్‌తో తినడం, రోల్స్‌పై డాన్స్ చేయడం, శిఖరాగ్రాన వున్న కాబిన్ ఈదురుగాలికి అల్లల్లాడి చాప్లిన్, మిత్రుడు పడే అవస్థలు (మైకేల్, మదన్ కామరాజు చిత్రంలో ఈ దృశ్యాన్ని అనుకరించారు) ఇత్యాదిగా ఎన్నో వున్నాయి. దర్శక నిర్మాత చార్లీ చాప్లిన్. ముఖ్యపాత్రధారులు: చాప్లిన్, జార్జియా హేల్, మేక్ స్వైన్, టీమ్ ముర్రే.



# ది టెన్ కమాండ్‌మెంట్స్




భగవల్లీలనూ, అద్భుతాలనూ అద్భుతంగా పునః సృష్టి చేసి చూపగల 'సినిమా సామి' సిసిల్ బి.డిమిల్, 'ది టెన్ కమాండ్‌మెంట్స్' (మూకీ), 'ది క్రూసేడ్స్', 'ది కింగ్ ఆఫ్ కింగ్స్', 'శామ్సన్ అండ్ డిలైలా' వంటి బ్రహ్మాండమైన పౌరాణిక చిత్రాలు తీసి గడించిన సినీభవ అనుభవాన్ని లాభాన్ని అసామాన్యమైన శ్రద్ధాసక్తులతో జోడించి విశేష వ్యయప్రయాసలతో నిర్మించిన విస్టావిజన్ టెక్నికలర్ సంచలన చిత్రం 'ది టెన్ కమాండ్‌మెంట్స్'

తన జాతికి ఒక దేవుణ్ణి పరిచయంచేసి ఆయన దశ ఆదేశాలనూ వారికి అందజేసి నవజీవనానికి తీరూ తెన్నూ చూపిన ప్రవక్త మోసెస్ కథను కళ్ళు చెదరే సెట్‌లమీదా, నిజ కథాస్థలమైన సైనయ్ పర్వతంమీదా, ఈజిప్టు ఎడారి మీదా చిత్రించారు. మోసెస్ క్రీస్తుకు 15 వందల ఏళ్ల క్రితం అవతరించాడు. లెవీ అనే తెగవాడు. ఇప్పటి ఇజ్రేలీల మూలపురుషుల సంతులోవాడు. వాళ్లలో ప్రధానంగా జాకబ్ అనే అతడివల్ల ఇంత కథ జరిగిందట. జాకబ్ చిన్న కొడుకు జోసెఫ్ ఒకప్పుడు ఈజిప్టు వెళ్ళి రాజానుగ్రహం సంపాదించి ముఖ్య పరిపాలకుడు అయ్యాడు. రాజు ఆహ్వానంపైనే జాకబ్‌నీ, తన సోదరులను ఈజిప్టు తీసుకువచ్చాడు. రెండువందల ఏళ్ళయేసరికి ఈ ఇజ్రేలీల జనాభా తామరతంపరగా పెరిగిపోయింది. అక్కడితో ఫేరో (రాజు)కు భయం పట్టుకుని ఈ జాతిని అణగద్రొక్కాలనుకున్నాడు. దేశంలో ఇజ్రేలీలందరి ప్రథమసంతానాన్ని అంతం చెయ్యాలని శాసనం వేశాడు వాళ్ళందరినీ బానిసలు చేశాడు.

ఒక తల్లి తన కుమారుడిని ఎలాగైనా బ్రతికించుకోవాలని ఒక తొట్టిలో పెట్టి నైలునదిలో విడిచిపెట్టింది. తొట్టె సరాసరి, ఫేరో చెల్లెలు స్నానం చేస్తూ వున్న చోటుకు వచ్చి ఆమె కంటపడింది. ఆవిడ, ఈ నైలునదీ సుతుడికీ 'మోసెస్' అని

(నీళ్ళలో దొరికి నందుకు) పేరు పెట్టుకుని, తన కుమారుడనే పెంచి పెద్దచేసింది. ఇదీ, బానిస కడుపున పుట్టి చక్రవర్తి ఇంట పెరిగిన మోసెస్ కథ.



ఇలా మోసెస్ ఆనాటి ఈజిప్టు విద్యలన్నీ నేర్చు కున్నాడు. మంచి వాడుగా తెలివి కలవాడుగా పేరు, చక్రవర్తి ప్రేమ సంపాదించుకున్నాడు. పెద్దవాడైన తరువాత, అతనికి తన జన్మరహస్యం తెలుస్తుంది.

పురాణకథ ప్రకారం తరువాత యావత్తు ఈశ్వరేచ్ఛ! మోసెస్, ఒక బానిసను రక్షించడానికని ఒక ఈజిప్టు పెద్దను వధించి, ఆ కారణంగా పారిపోతాడు.

సినిమాలో కథ ప్రకారం, అతని ప్రజ్ఞాప్రాభవాలమీద అసూయ కొద్దీ, తన కాబోయే భార్య నెఫ్రెటిరీ అతనిని ప్రేమించిందన్న చీకాకుతో యువఫేరో రామ్సెస్ అతన్ని దేశం నుంచి వెళ్ళగొడతాడు. మోసెస్‌కి సైనై పర్వతంమీద ఈశ్వరుడు సాక్షాత్కరించి, ఈజిప్టులోని ఇజ్రేలు బానిసలను విడిపించుకు రావలసినదని ఆదేశిస్తాడు. వాళ్లందరినీ కూడగట్టడానికీ, ఫేరోను హడలకొట్టడానికే పనికొచ్చే అద్భుతాలన్నీ వెనకుండి చేస్తాడు. ఇది పురాణ కథ.

చారిత్రకంగా, ఇది ఆనాటి బానిస విధానపు వ్యవస్థ మీద తిరుగుబాటు. ఆనాడు ఈజిప్టు చక్రవర్తులు దండయాత్ర చేసినపుడు శత్రుపక్షంలో ప్రాణాలతో దొరికిన వారందరినీ బానిసలుగా తెచ్చుకొనేవారు. ఆ బానిసల కాయకష్టంతోనే వారు బ్రహ్మాండమైన భవనాలూ, ఈనాటికీ నిలిచివున్న పిరమిడ్‌లూ కట్టించగలిగారు. మోసెస్ కాలంలో ఈజిప్టులో ఉన్న ఆరులక్షల హిబ్రూలు అలాంటి బానిసలే. మోసెస్ వాళ్ళ చేతనే ఒక మహానగరం కట్టించాడు కూడా.

అయితే మంచివాడు కాబట్టి బానిసలూ మనుషులేనని (పాలకుల దృష్ట్యా) పొరబడ్డాడు. ఒక ప్రమాదంలో తన తల్లినే కాపాడడంతో అతని మనసు కరిగింది. అంతలో తన జన్మరహస్యం తెలిసింది. తన జాతిని బానిసత్వం నుండి విడిపించాలని ప్రయత్నించి రాజు కెదురు తిరిగి శ్రమించాడు వాళ్లకు క్రమశిక్షణ నేర్పి, మంచి పద్ధతులు మప్పి, క్షుద్ర దేవతారాధన మాన్పించి ఈశ్వరోపానకు మార్గం చూపి ఒక జాతిగా నిలబెడతాడు.




దేశంలో అరిష్టాలు కుప్ప తిప్పలుగా కనిపించడం, రాజు ఒకప్పుడు బానిసల ప్రధమ సంతానాన్ని చంపించినందుకు ప్రతిగా, ఇజ్రేలీల దైవం యెహోవా, ఈజిప్షియన్‌ల పిల్లలతో (రాజకుమారుడు సహా) చంపించి వేయడం వంటివి జరగడంతో రాజు ఆందోళన చెందుతాడు. చివరికి బానిసలను వదిలిపెడతాడు. మోసెస్ నాయకత్వాన లక్షలాది ప్రజలు తాము ఆశించిన స్వర్గసీమ వేపు బయల్దేరతారు. ఎడారిదాటి ఎర్ర సముద్రం దరిచేరేవరకూ, రాజు మనసు మారి వాళ్లని తరిమి చంపడానికో తిరిగి తీసుకుపోవడానికో బయల్దేరి వస్తాడు. యెహోవా కటాక్షంవల్ల ఎర్రసముద్రం రెండుగా చీలి బానిసలకు దారియిస్తుంది. ఫేరో సేనలను కొంతదూరం రానిచ్చి వారిమీద విరుచుకుపడి కబళించివేస్తుంది.

దీనికే కొందరు, సముద్రం ఆటుపోట్లు ఈ అద్భుతానికి కారణమని అంటారు.




మొత్తానికి ఇజ్రేలీలంతా సైనయ్ పర్వతం దగ్గరకు వస్తారు. అక్కడ మోసెస్, తమ దైవాన్ని చూచి రావడానికి కొండపైకి వెళ్లి ఎంతకూ తిరిగి రాకపోయేసరికి, ప్రజలు తిరిగి కట్టుతప్పిపోతారు. మోసెస్ సోదరుడు ఆరాన్ ఒక కాంచన విగ్రహం రూపొందించి దాన్ని ఆరాధించమంటాడు. ఇంతలో మోసెస్ పర్వతంపై ఈశ్వరుణ్ణి దర్శించి, ఆయన శిలాఫలకంపై ముద్రించిన దశాదేశాలను పట్టుకొని వస్తాడు. తన వారి పద్ధతి చూచి, వాళ్లని మందలించి నయానా, కొందరిని భయానా దారికి తెస్తాడు.

ఇదీ ఈ చిత్రాలలో చూపించిన



దర్శక నిర్మాత డిమిల్ దీన్ని ప్రధానంగా పౌరాణిక ఇతివృత్తంగానే చిత్రించారు. ముఖ్యపాత్రల రూపకల్పన, చిత్రణమటుకు సమకాలిక సాంఘికానికి సమానంతరంగా అనిపించేలా సాగించి రక్తి కట్టించారు. నాటికీ నేటికీ కూడా కాంతాకనకాల విలువ మారలేదన్న వ్యాఖ్యను ఆద్యంతం ఉపశృతిగా పలికించారు. ఇజ్రేలును విముక్తం చేయడానికి ఎవడో దేవదూత వస్తాడని భయపడ్డ ఈజిప్టు రాజులిద్దరి దృక్పథాలూ, తను నమ్మిన దేవతకన్న "మోసెస్ దేవుడు" గొప్పవాడన్న విషయాన్ని ఒప్పుకోలేక, రామ్సెస్ పడిన వ్యధ, అతని గుండెనిబ్బరం, దానిచాటున పిరికితనం, అసూయ, అహంకారం, గత్యంతరం లేనపుడు "మీరుపొండి మమ్మల్ని బతకనివ్వండి" అన్న దైన్యం, మోసెస్‌ను ప్రేమించి తనను పెళ్ళాడిన నెఫ్రెటిరీతో సంసారం చేస్తూ పడిన అవ్యక్తవేదనని ఈ పాత్ర పట్ల సానుభూతి కలిగిస్తాయి. నెఫ్రెటిరీ మోసెస్‌ను దక్కించుకోవడానికి పడిన క్షోభ, అతని భవిష్యత్తు కోసం బాధపడిన కన్నతల్లి, పెంచినతల్లి పడిన అవస్థలూ ఈ చిత్రకధకు బరువును చేకూర్చాయి.

మోసెస్ అధ్వర్యాన లక్షలాది బానిసల శ్రమతో నిర్మించిన మహానగరం మొదలైన వాటికి వేసిన సెట్‌లు కన్నులపండుగగా ఉన్నాయి. యొహోవా మహిమవల్ల జరిగిన అద్భుతాలు - నైలునది అంతా రక్తం అయిపోవడం, అర్ధరాత్రివేళ రాజవీధులలో మృత్యుధూళి పాకుతూ ఉండడం, దాని ప్రభావంవల్ల అటూ ఇటూ యిళ్ళలో పిల్లలు చనిపోయినప్పుడల్లా ఆ నిశ్శబ్దంలో భీకరంగా హాహాకారాలు వినరావడం మరపురానంత బీభత్సంగా ఉన్నాయి.

ఫేరో రామ్సెస్, బానిసలను తరుమబోయినపుడు, అగ్నిస్తంభం ఏర్పడి వాళ్లని నిలవెయ్యడం, ఇజ్రేలీలు సాగిపోవడానికి వీలుగా ఎర్ర సముద్రం రెండుగా చీలిపోయి దారి ఇవ్వడం, రాజు సేనలు లోపలికి రాగానే విరుచుకు తిరగబడి ఆ సేనానీకాన్ని కబళించి వేయడం ఊహకి కూడా బాగా అందని అద్భుతాలు అయినా, దర్శక నిర్మాత డిమిల్ వాటిని ప్రేక్షకులను సంభ్రమచకితులను చేసేటంత నిర్దుష్టంగా, బ్రహ్మాండంగా చిత్రించారు. సైనై పర్వతంవద్ద ఇజ్రేలీలు ఒక్కసారి బరితెగించి క్షుద్రదేవతారాధన పేరిట తాగి తందనాలు ఆడి విశృంఖలంగా నీతిబాహ్యంగా ప్రవర్తించే సన్నివేశాన్ని అద్భుతమైన బాక్సాఫీసు సీనుగా తీసేశారు.

అపశ్రుతిగా వినిపించి, అలాగే బాధాకరంగా తోచినది మోసెస్‌తో 'ఈశ్వరుడు' మంచీ చెడ్డా మాట్లాడడం. ఈశ్వరవాణి అచ్చు 20వ శతాబ్దపు రెండోరకం నాటకాల బాణీలో వినిపించింది.

ఇంతకీ ఈ కథలో మహత్తరమైన సన్నివేశం ఈశ్వర సాక్షాత్కారం.

భగవంతుడు మాట్లాడుతున్నప్పుడు ఇజ్రేలు ప్రజలంతా ఆయన తేజాన్ని, వాణిని, భరించలేక మోసెస్ ద్వారా వినిపించమని మొక్కుకుంటారు. ఇందులో ఆ సన్నివేశం లేకుండా, పైన చెప్పిన రీతిన తీశారు.


హెస్టన్

ఈ చిత్రంలో మోసెస్‌గా చార్ల్‌టన్ హెస్టన్, ఫేరో రామ్సెస్‌గా యూల్‌బ్రైనర్, అతని తండ్రిగా సర్ సెడరిక్ హార్డ్‌విక్, మోసెస్‌ను ప్రేమించి రామ్సెస్‌ను పెళ్ళాడిన యువరాణి నెఫ్రెటిరీగా ఆన్ బాక్స్టర్, మోసెస్ భార్య సెఫోరగా బైవస్ డికార్లో, అతన్ని కన్నతల్లిగా మార్తాస్కాట్, పెంచిన తల్లి (చక్రవర్తి సోదరి)గా నినాఫోక్, జోషువాగా జాన్ డెరిక్, అతన్ని ప్రేమించి, అతని స్వేచ్ఛ కోసం మరొకడిని పెళ్ళాడిన యువతిగా డెబ్రా పాజెట్ నటించారు. ఇంకా విన్సెంట్ ప్రైస్, ఎడ్వర్డ్ జి. రాబిన్‌సన్, డగ్లస్ డంబ్రిల, జూడిత్ అండర్‌సన్ మొదలగువారు పాల్గొన్నారు. మోసెస్‌గా హెస్టన్ నటన చాల బాగుంది. నిండుగా ఠీవిగా ఉన్న మరొక పాత్ర పెద్దరాజు (సర్ సెడరిక్).

'క్రూసేడ్స్', 'కింగ్ ఆఫ్ కింగ్స్' 'శామ్‌సన్ అండ్ డెలైలా' వంటి అనేక భారీచిత్రాలు తీసిన సిసిల్ బి డిమిల్ ఈ తరానికే కాదు, పై తరానికి కూడా గుర్తుండిపోయే విధంగా 'టెన్ కమాండ్‌మెంట్స్' హిట్ అయింది. మూడున్నర గంటల ఈ సినిమా ఈ నాటికీ వీడియో మార్కెట్‌లో కూడా డిమాండ్‌లో ఉంది. రెడ్ సీ చీలిపోవడం, జనాలు తరలిపోవడం (ఎక్సోడస్) సీన్లని మరపించేలా ఇప్పటికీ ఎవరూ తీయలేకపోయారు. మిమిక్రీకళాకారుల ధర్మమా మ్యూజిక్ కూడా చిరకాలం గుర్తుండిపోయింది. రఘుపతి వెంకయ్య కుమారుడు ప్రకాష్ ఆ సినిమాకై పనిచేసి వచ్చి ఇక్కడ అనేక సినిమాలు తీశాడు. ఈ సినిమాలో మోజెస్‌గా నటించిన చార్ల్‌టన్ హెస్టన్ దరిమిలా 'బెన్‌హర్' వంటి కొన్ని పౌరాణిక సినిమాలలో నటించాడు. విలన్‌గా నటించిన యూల్‌బ్రైనర్ తర్వాత ఎన్ని పాత్రలు ధరించినా ఈ పాత్రకే గుర్తుండిపోయాడు.


డిమిల్

ఈ చిత్రం నిడివి 20 వేల అడుగులకు 5 తక్కువ. 3 గంటల 39 నిమిషాలు పరిగెడుతుందని, ఇంటర్‌వెల్ ఉంటుందని ప్రారంభోపన్యాసంలో దర్శకుడు డిమిల్ చెప్పారు. మోసెస్ పుట్టిన మూడవ నెల నుంచి 30వ ఏడు వచ్చేవరకు జరిగిన కథ ప్రచారంలోకి రాకుండా చేశారనీ తాము ఈ చిత్ర నిర్మాణానికి చేసిన పరిశోధనలో అది చాలావరకు దొరికిందని డిమిల్ ఈ సందర్భంలో వెల్లడించారు. అయితే ఇలా కోప్పడినా, బహుశా చిత్ర నిర్మాణంలో ఇమడని కారణంవల్లనో, మార్పులకు అందని కారణం వల్లనో మరుగుపడిన కథను వారు ఈ చిత్రంలో వెల్లడించినట్లు తోచదు.

*(ఆంధ్ర-వారపత్రిక-1958)*

# ది పేషన్ ఆఫ్ జోన్ ఆఫ్ ఆర్క్



మూకీ చిత్రాల చరిత్రలో స్వర్ణశకం అనతగ్గ ఘట్టంలో - 1924 నుంచి కొంతకాలంపాటు అన్ని దేశాలవారూ కూడా కూడబలుక్కున్నట్టు కొత్త హంగులు కనిపెట్టే ప్రయత్నం మానేసి వున్నవాటితోనే చలనచిత్ర కళ పరమావధులను స్పృశించడానికి ప్రయత్నించారు. అందువల్ల ఆ నాలుగైదేళ్లలో చాలా గొప్ప చిత్రాలు వచ్చాయి.

ఈ విధంగా మూకీ చిత్రాల స్వర్ణశకంలోనే 'బేటిల్‌షిప్ పోటెమ్‌కిన్', 'గోల్డ్‌రష్' వంటి చిత్రాలతో పాటు డేనిష్ దర్శకుడు కారల్ డ్రెయర్ దర్శకత్వాన తయారైన ఫ్రెంచి చిత్రం 'ది పాషన్ ఆఫ్ జోన్ ఆఫ్ ఆర్క్' అవతరించింది. ఆనాడు పేరున్న డేనిష్ దర్శకులు డ్రెయర్, శాండ్‌బర్గ్ అని మరొకరును. శాండ్‌బర్గ్ ఎక్కువగా డికెన్సు నవలలే తీసుకుని మంచి చిత్రాలు తీశాడు.

హృదయ సంక్షోభాన్ని హృదయవిదారకంగా 'జోన్ ఆఫ్ ఆర్క్'లో చిత్రించిన డ్రెయర్ ఆరంభంలో కామెడీ తీశాడు. అప్పట్లో అమెరికన్ కళాకారుల - ముఖ్యంగా 'ఇన్‌టాలరెన్స్' 'బర్త్ ఆఫ్ ఎ నేషన్' వంటి మహత్తరమైన చిత్రాలు తీసి చలన చిత్ర శిల్పంలో పలువురికి మార్గదర్శకుడైన డి. డబ్ల్యు గ్రిఫిత్ శిల్పం ప్రభావం ఇతని చిత్రాలలో కనిపించేదని విమర్శకులు అంటారు.

అయితే 'జోన్ ఆఫ్ ఆర్క్' తీసేనాటికి డ్రెయర్ (ఈ చిత్రాన్ని ఫ్రాన్సులో ఫ్రెంచి నటులతో తీశాడు) శిల్పం పరిణతి చెందింది. నాటికీ నేటికీ కూడా ఎవరూ ప్రయత్నించని మార్గంలో, విశేష శిల్పంతో డ్రెయర్ ఈ చిత్రం తీశాడు. ఈ చిత్రణ శిల్పానికి నటుడి ముఖం అతి ముఖ్యం. భ్రుకుటి చలిస్తే, పెదిమ కదిలితే, కదలకపోతే, ఎంతటి భావాన్ని పలికించవచ్చునో ఈయనకు తెలిసినట్టు బహుకొద్దిమందికి తెలుసునంటారు. ఎటువంటి నటుడైనా ఈయన చేతిలో అద్భుతంగా రాణిస్తాడంటారు.

నిజానికి 'జోన్ ఆఫ్ ఆర్క్'లో ముఖ్య పాత్ర ధరించి ప్రపంచావధిని పేరు గడించిన ఫ్రెంచి నటి ఫాల్కొనెట్టీ, ఆ తరువాత చిత్రాలలో (ఇతర దర్శకులు

తీసినవి) మళ్లీ ఎన్నడూ ఈ స్థాయిని అందుకోలేదని దేశ విదేశాల విమర్శకులు వ్రాశారు. ఈ చిత్రంలో ఆమె నటన యావత్తూ క్లోజప్‌ల మీదుగా సాగిపోయింది. ఆమె భావాలకు డ్రెయర్ కళాంశ ప్రధానమైన 'స్టయిలైజ్డ్' ఫ్రేం కాంపోజిషన్‌లు జోడించాడు. దాదాపు చిత్రం అంతా క్లోజప్‌లతోనే సాగడం వీటి విశిష్టత.



ఈ చిత్రంలో కధ చాలా తక్కువ. నేటి సినిమావసరాల దృష్ట్యా బొత్తిగా లేదని అనాలి. ఉన్నదల్లా ఒక సంఘటన. అందులో కొన్ని ఘట్టాలను చిత్రించారు. దీని లక్ష్యం, గమ్యస్థానం చిత్రణే.

15వ శతాబ్దం పూర్వార్థంలో పుట్టి తను నమ్మిన దేవుడి పేరిట, క్రైస్తవ మత గురువుల రాజకీయ నాయకుల కుట్రలకు గురి అయిన పల్లెపిల్ల జోన్. భగవదాదేశం తనపై పడిందన్న ఆవేశంలో ఆమె ఆనాడు ఫ్రెంచి దళానికి నాయకత్వం వహించి వెళ్లి ఉత్తర ఫ్రాన్సును ఆక్రమించుకుంటున్న ఇంగ్లీషు సేనలను పారద్రోలింది. దరిమిలా బర్గండీ రాష్ట్ర పాలకుడు ఇంగ్లీషు వాళ్ళతో లాలూచీ అయి ఆమెను పట్టి ఒప్పగించాడు. వాళ్ళూ, వీళ్లూ చేరి ఆమెను హింసించి వర్ధి మంత్రగత్తె అని ఆరోపించి చివరికి కాల్చి చంపారు.

జోన్‌కు మహత్తు వున్నట్టు రుజువుకాలేదు. రుజువైన మహత్తుకు వారసులుగా స్థిరపడ్డ మతాచార్యులు ఆమె మాటలను కొట్టివేసి, ధ్వజమెత్తి ధ్వంసం చేయడానికి సిద్ధపడ్డారు. దీనికై విచారణ నెపంతో హింస ఆరంభించారు.

డ్రెయర్ తీసిన చిత్రంలో విచారణదే ప్రాధాన్యం. అంతమంది మనుషులు ఆమెకి ఎలా కనిపించారో, ఆమె ఎంత బాధపడిందో చెప్పడమే డ్రెయర్ లక్ష్యం. కెమేరానూ, నటులనూ, వెలుగునూ చీకటినీ అన్నిటినీ దీని కోసమే వుపయోగించాడు. దేశకాల పరిస్థితులకు అతీతమై, కరుణ రసోద్దీపకం గావడానికి తన శిల్పాన్ని స్టయిలైజ్ చేశాడు. ఈ విధంగా కథలో వాస్తవికతను పోషించడానికి తక్కువ ప్రాముఖ్యం ఇచ్చి, జోన్ పాత్ర ధరించిన ఫాల్కొనెట్టీ అనే నటిని వెనక్కు నెట్టి, జోన్ హృదయ సంక్షోభాన్ని, దైహికంగా ఆమె పడ్డ బాధనూ వాటికి కారణభూతమైన క్రూరశక్తిని మటుకు తెరమీద చిత్రించి దానికి విశ్వజనీనతను సమకూర్చారు.

అందువల్ల ఈ చిత్రం కొంచెం భూతద్దం క్రింద బొమ్మలా కనిపిస్తుంది. అంతే కాదు తెరమీద ముఖాల రూపురేఖలు కూడా, కథా వస్తువుకు, లక్షణానికి తగ్గట్టు ఎంతో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. నటులకు మేకప్ వాడలేదు. పైగా చర్మపు ఛాయలు

పట్టుకోగల సాంక్రోయాటిక్ ఫిలిము వాడాడు. క్షోభను ఇలా మరీ అతిగా చూపడంవల్ల జోన్‌కి ఈశ్వరుడి పట్ల గల విశ్వాసం, ఆయన ఆజ్ఞ నెరవేరుస్తున్నానన్న ధీమా, ఆశాభావం వుండతగినంతగా కనిపించడం లేదని కొందరు విమర్శకులు వ్రాశారు. అయినా వారు కూడా, బాధను పలికించడంలో డ్రెయర్ వాడిన మాంటేజ్ షాట్‌లూ, క్లోజప్‌లూ, కాంపోజిషన్‌లలో చిత్ర విచిత్రాలయిన భావస్ఫోరకాలైన మోస్తర్లూ, వాటిని చూపిన కోణాలూ, అన్నిటిలోనూ కళాత్మకమైన ఐక్యత వున్నాయని, అవన్నీ ఒకే నిర్దిష్టమైన ప్రయోజనం కోసం నిర్దుష్టంగా ప్రయోగింపబడినవనీ ఈ శిల్పమూ, ఆయన దర్శకత్వాన ఫాల్కొనెట్టీ నటనా మహత్తర అనుభూతిని కలిగించాయనీ ప్రశంసించారు.

***(ఆంధ్ర-వారపత్రిక-1958)***

దీ పేషన్ ఆఫ్ జోన్ ఆఫ్ ఆర్క్ (1928, బ్లాక్ అండ్ వైట్, 114 ని.లు) దర్శకుడు: కారల్ డ్రెయర్, తారాగణం: మేరియా ఫాల్కొనెట్టీ, యూజినీ సిల్వియన్, మేరిస్ స్కట్జ్, ఏంటోనిన్ ఆర్టాడ్, నిశ్శబ్ద చిత్రం. ఛాయాగ్రాహకుడు రుడాల్ఫ్ మేట్‌కు ఈ చిత్రం ఎంతో ఖ్యాతిని తెచ్చింది.



**ఫాల్కొనట్టి, కారల్ డ్రెయర్**

డేనిష్ దర్శకుడు డ్రెయర్ ఇతర చిత్రాలు: 'జోన్ ఆఫ్ ఆర్క్'కు ముందు తీసిన సరదా చిత్రం 'మాస్టర్ ఆఫ్ ది హౌస్' (1925), హారర్ చిత్రాలకు తలమానికం అని చెప్పదగిన 'వేంపైర్' (1931), తండ్రిని పెళ్లాడి, కొడుకుని ప్రేమించిన అమ్మాయి గాథ 'డే ఆఫ్ రాత్' (1944).

# మదర్



చలనచిత్ర కళలో శబ్దయుగం ఆరంభమైన రోజులలో నిశ్శబ్దానికి ఉపశృతిగా శబ్దాన్ని ఉపయోగించుకుంటూ అవతరించిన రష్యన్ చిత్రం 'మదర్' (1926). చలన చిత్రకళ విస్తృతావధులను అవగతం చేసుకుని దానిని నిజంగా ఒక కళగా మన్నించి, గౌరవించి దాని స్వరూప స్వభావాలను బట్టి కొన్ని మార్గాలూ, శిల్పాలూ, సిద్ధాంతాలూ ఏర్పరచుకొని అవి ప్రాతిపదికలుగా, కాలచక్రం క్రిందపడినా నలగని ఉత్తమోత్తమ చిత్రాలు నిర్మించిన మేధావులలో అగ్రగణ్యుడు వి. ఐ. పుడోవ్‌కిన్. ఈయనా, రష్యన్ చలనచిత్ర కళానిధి సెర్గీ ఐసెన్‌స్టీన్ తీసినవి కొద్ది చిత్రాలే అయినా ఈ చిత్రాల ద్వారానే విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్నారు.

వారి వారి చిత్రాలను దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే సమకాలికులు, సహచరులు అయిన ఈ యిద్దరి 'చిత్రనిర్మాణ' దృక్పథాలలోను ప్రధానమైన భేదం ఒకటి గోచరిస్తుందని విమర్శకులు అన్నారు. ఐసెన్‌స్టీన్ చిత్రం మేధకు మేత. అందులో వస్తువు కన్న 'వాస్తు' (కథానిర్మాణవిధానం)కు, కథనశిల్పానికి ప్రాధాన్యత హెచ్చు. కళాపిపాస గలవారు ఈ చిత్రాలలో స్వారస్యాన్ని ఎక్కువగా గ్రహించి ఆనందిస్తారు. ఈ ప్రముఖులు ఇద్దరూ ఈ సూత్రాలలో ఇమిడిపోతారు అనడం సబబు కాదుగాని స్థూలంగా ఇది చెప్పుకోవచ్చు.

పుడోవ్‌కిన్ కథనశిల్పం ఇందుకు భిన్నమైనది. హార్దికమైన ఆనందం కలిగించడం దీని లక్ష్యం. ప్రతి సామాన్యమైన ప్రేక్షకుడూ కూడా, ఇందులో సింబాలిజం కోసం, విశేషార్థాల కోసం వెతుక్కొనే పనిలేకుండా, చూస్తూనే సర్వం అవగతం చేసుకోగలడు. వీక్షణ క్షణంలోనే కథ, దాని తత్వం, అందులో తాత్పర్యం ప్రేక్షకుడికి హృదయగతం అవుతాయి. ఈ లక్ష్యాన్ని సాధించడానికి పుడోవ్‌కిన్ కెమెరాకన్న నటనను ప్రధానంగా వినియోగిస్తాడు. ఆపైన ఎడిటింగ్. ఈ రెండు విషయాలపైనా సమగ్రంగా చర్చిస్తూ ఆయన రెండు మంచి గ్రంథాలు కూడా వ్రాశాడు.

నటనలో సహజత్వం ఉట్టిపడాలని పుడోవ్‌కిన్ నమ్మకం. సహజనటన అంటే, కాళ్ళూచేతులా నటించేసి ఆడిపోతూ ఉండకూడదనే కాదు. కళ్ళూ, ముక్కూ, నోరూ,

కంఠం కూడా కాస్త అదుపులో ఉంచుకోవడం అని పెద్దలు చెబుతారు. ఒకపాత్ర మనోగత భావాన్ని వ్యక్తపరచడానికి బొమ్మకింద వివరణ రాసినట్టుగా దానికి కొట్టొచ్చేలా అభినయం పట్టకూడదనీ అవ్యక్తంగా, అరచాటుగా సూచించాలనీ అంటారు. సూచన కూడా లేని, నిర్వికారాల బలవత్తర శక్తిని కూడా గుర్తించి ప్రయోగించినవాడు పుడోవ్‌కిన్. ఈ ప్రయోగాలు రంగస్థలం మీద సులభసాధ్యాలు కాకపోవచ్చు. కొందరి మతం ప్రకారం అసాధ్యాలు అయినా కావచ్చు. కాని తెరమీద మాత్రం ఇవి సుసాధ్యాలే కాక, అత్యవసరమైనది కూడా.

ఇక, ఈ 'నటన' చలన చిత్రాలలో, నిర్మాణ స్వభావాన్ని బట్టి శకలాలుగా వస్తుంది. కాబట్టి వీటన్నిటినీ సంకలనం చేయడంలో (ఎడిటింగ్) శ్రద్ధ వహించడం కూడా నటుడి ముఖ్యవిధులలో ఒకటి అని పుడోవ్‌కిన్ వ్రాశాడు. 'మదర్' చిత్రానికీ ఈ చిత్రంలో పుడోవ్‌కిన్ కథనశిల్పానికీ స్థూలంగా ఈ అంశాలు ప్రాతిపదికలు అనవచ్చును. కథా వస్తువు విప్లవం ... ఐసెన్‌స్టీన్ విప్లవాన్ని చూడడంలో లక్షలాది ప్రజల ఆశలను, ఉద్వేగాలను, బాధలను సామూహిక స్థాయిలో చూపిస్తే, పుడోవ్‌కిన్ ఆ సమూహంలోని వ్యక్తులను యిందుకు పిలిచి వారి గాథలను చెబుతారు. మదర్ చిత్రంలో కథ చిన్నదే. రష్యాలో విప్లవకాలం కథాకాలం. ఒక అమాయిక కథానాయిక. (ఫిల్మ్ హీరోయిన్ కాదని గ్రహించ ప్రార్థన) ఆమె భర్త అభ్యుదయ నిరోధి. విప్లవ విరోధి, తాగుబోతు. కొడుకు, తండ్రి పద్ధతికి వ్యతిరేకి. కొత్తగా వచ్చిన రాజకీయ ఉద్యమం సమ్మె చేయడానికి సాగించిన సన్నాహాలలో ప్రముఖపాత్ర స్వీకరిస్తాడు. అతడు ఇంట్లో దాచిపెట్టిన ఆయుధం గుట్టు బయటపెట్టడం బిడ్డకు మంచిదేనని నచ్చజెప్పి నమ్మించి, తల్లి ద్వారా ఆచూకీ తెలుసుకుని, కొడుకుని అరెస్టు చేస్తారు. కల్లబొల్లి విచారణ ఒకటి జరిపి అతనికి ఖైదు విధిస్తారు. అక్కడితో తల్లికి తనుకూడా విప్లవోద్యమంలో దిగడం అవసరమని తోస్తుంది. ఈలోగా ఉద్యమ నాయకులు తిరగబడి, ఆమె కొడుకుని విడిపిస్తారు.

వేలాది ప్రజల ఊరేగింపులో అతడు వస్తూ, తల్లిని కలుసుకోబోయే ముహూర్తాన సైన్యం తుపాకులు కాల్చి జనాన్ని బెదరగొడతారు. ఆ తొక్కిసలాటలో అతడు ప్రాణాలు కోల్పోయాడు. జారిస్టు సైన్యాలు మీదకు విరుచుకుపడుతుండగా తల్లి పతాకం చేతబట్టుకు నిలబడి, చనిపోతుంది.




ఈ కథను చెప్పడంలో ప్రతి అంశం ప్రతి సన్నివేశం గుండెమీద ఒక చిరముద్ర వేసే విధంగా పుడోవ్‌కిన్ దీనిని చిత్రించాడు. కథలో సంఘటనను తీసుకొని దాన్ని మొదట ఏ భాగానికి ఆ భాగం విడదీసి తిరిగి చలనచిత్ర కథాఘట్టంగా కట్టడంలో ఆయనది ప్రత్యేక ప్రతిభ. ఇలా చేసినపుడు 'సింబాలిజం' తటస్థపడినా, ఇది కొట్టొచ్చేటట్టుకాక, కథలో

భాగంగా ఒదిగిపోయేలా అమర్చుతాడు. సైనిక బలానికి ఎదురై బెదిరి చిన్నాభిన్నమైన అఖండ జనవాహినికి సామ్యంగా, నదిమీద వంతెనకి ఎదురేగి ఢీకొని శకలాలైపోయిన 'ఐస్‌బెర్గ్' (మంచుకొండ)ను చూపించిన సన్నివేశానికి చలనచిత్ర చరిత్రలోనే గొప్పస్థానం ఉంది. ఇది కేవలం సామ్యంగానే కాక, అంతకన్నా శక్తివంతమైన ఉద్ఘోషగా, సువ్యాఖ్యగా భాసిస్తుంది. కథలో తెచ్చిపెట్టుకున్న ఉపమానాలలా ఎబ్బెట్టుగా తోచదు. ఇవేకాక, చిత్రంలో నటన, ఛాయాగ్రహణం, ఎడిటింగ్ మొదలైనవన్నీ కూడా ఆర్కెస్ట్రాలో వాద్యాలలా సమ్మేళనం చెంది, అన్నీ కలిసి ముక్తకంఠంతో కథాంశాన్ని మహాకావ్యపు ఠీవితో నిండుతనంతో చాటుతాయి. ఇదీ పుడోవ్‌కిన్ విశిష్టత.

*(ఆంధ్ర-వారపత్రిక - 1959)*

# లైమ్‌లైట్



కరుణాకరమైన ప్రపంచ చలన చిత్రం 'లైమ్ లైట్'ను కనీ వినీ ఆనందించే మహదవకాశం, సినిమా విడుదలైన ఏడు సంవత్సరాల తరువాత ఇక్కడ లభ్యమైంది.రాజకీయపు రంగు హంగుటద్దాలలోంచి, కరుణాకరుడు చాప్లిన్‌ను 'అరుణా' కరుడుగా చూడబోయిన మెకార్ధీలు అతడిని (అన్ అమెరికన్ కమిటీ) రాజకీయ సంబంధిగా బంధించబోయారు.

ఈ విధంగా స్వదేశంలో రాజకీయ ప్రచారాహుగ్రస్తమైన చిత్రం 'లైమ్ లైట్'లోనే చాప్లిన్‌లో కళాకారుడు విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. దేశదేశాలా విజయయాత్ర చేసిన 'లైమ్ లైట్' సార్వజనీన సార్వకాలిక చిత్రంగా, కరుణ రసోద్దీపిక కళాఖండగా, స్నేహానికి భాష్యంగా జోహారు లందుకొంది. పూర్వం చాప్లిన్ చిత్రాలు విడుదల చేస్తూవచ్చిన కంపెనీ ద్వారా ఈ చిత్రం విడుదలచేసే సదుపాయం లేనందువల్ల ఇది మనదేశం రావడం ఆలస్యం అయింది. 'లైమ్ లైట్' తరువాత చాప్లిన్ తీసిన చిత్రం, 'ఎ కింగ్ ఇన్ న్యూయార్క్' ఈసారి త్వరగానే రాగలదని ఆశించవచ్చును.

'లైమ్‌లైట్' సృష్టిలో చాప్లిన్ ప్రజ్ఞ పరాకాష్ఠను అందుకొంది. దీనికి కథ మాటలూ పాటలూ, సంగీతం మామూలు ప్రకారం ఆయనే వ్రాసుకున్నాడు. ఈసారి విశేషం 'బాలే' (నృత్య నాటికల) కల్పన దర్శకత్వం కూడా నిర్వహించడం. కథ, కథనం చాప్లిన్ చిత్రావళిని గుర్తుకు తెచ్చుకుంటే కొత్తగా కనిపిస్తాయి. పాత చిత్రాలలా ఇందులో పొట్ట చెక్కలయేట్టు నవ్వురాదు. శ్లాపిస్టిక్ పుష్కలంగా లేదు. ఇందులో గోచరించే హాస్యం తరహా వేరు. ఇది కరుణరస 'హాస్యరాగ' రంజితమైన కథ. ఈ రెండింటికీ సరిహద్దు మీద ఠీవిగా నడుస్తుంది. ప్రపంచ ప్రసిద్ధుడైన చిన్న మనిషి 'చార్లీ', అతనిని కన్నతండ్రి చాప్లిన్‌లు కూడబలుక్కుని, కష్టసుఖాలూ,

సన్మానావమానాలూ, వెలుగునీడలూ చూచిన ఒక విదూషకుడి జీవితాన్ని మథించి స్నేహభావాన్ని తీసి పంచిపెట్టారు. ఆరిపోతున్న అతని జీవితంతో ఇంకో జీవితాన్ని వెలిగించి జీవనరాగాన్ని సర్వజన సమ్మోహనకరంగా ప్రస్తరించారు.

జీవితాన్ని పూర్తిగా, నిండుగా, ఎత్తుగా, ఉత్సాహంగా జీవించాలనీ, అందుకు వ్యక్తిలో ప్రగాఢమైన వాంఛ, ఆశాభావం, ఆత్మవిశ్వాసం ఉండాలనీ, జీవితంపట్ల అనురాగ మను రాగప్రస్తారమే దానికి ఇతివృత్తమనీ చాప్లిన్ ఈ చిత్రంలో - నిస్పృహలో మునిగిన విదూషకుడిచేత - తెచ్చిపెట్టుకొన్న ఉత్సాహంతో చెప్పించి ప్రేక్షకులకు ఉత్తేజం కలిగించగలిగాడు. ఇది చెప్పడానికే ఆయన ఇందులో కొత్త పద్ధతి కూడా అవలంబించాడు.

మామూలుగా షేక్స్‌పియర్ నాటకానికి గుడ్డివాడు వెళ్ళినా అతను అంతా తెలుసుకుని ఆనందిస్తాడనీ చాప్లిన్, ఐసెన్‌స్టీన్‌ల చిత్రాలకు చెవిటివాడు వెళ్ళినా అంతా పూర్తిగా బోధపడుతుందనీ అంటారు. అందరూ శబ్దంతో చెప్పేదాన్ని నిశ్శబ్దంతో అంతకన్నా గొప్పగా బలంగా చెప్పగలగడం ఈ దృశ్య కావ్యకారుల ప్రత్యేకత. సినీమాలోకి శబ్దం వచ్చినపుడు చాప్లిన్ కూడా భయపడ్డాడు - దుర్వినియోగం అయితే చలనచిత్ర కళకు ఇది అరిష్టం తెచ్చిపెడుతుందని.

'ముష్యూర్‌వెర్డో'లో ఆయన సంభాషణలను వాడినా బహుపొదుపుగా వాడాడు. అప్పుడు కొంత నొచ్చుకున్న కొందరు అభిమానులు ఈసారి 'లైమ్ లైట్'లో ధారాళమైన ఉపన్యాసాలే వినబడడంతో చాప్లిన్ అంతటివాడు శబ్దం మీద ఇంతగా ఆధారపడడం తగదని భావించారు. అయితే ఒకసారి బాగా రాణించిన ఒక శిల్పాన్ని ఒక సంప్రదాయంగా, ఆచారంగా, వరవడిగా పరిగణించి, ప్రతిసారీ అదే అవధులలో తిరగాలన్న అభిప్రాయం సృజనాత్మకమైన ఏ కళకూ, రోజు రోజుకూ పెరిగే ఏ కళాకారుడికీ సరిపడనిది కాగా, ఈ చిత్రంలో చాప్లిన్ ఇంతగా మాటలాడడం అనేది ఇందులో కథ తత్వాన్నిబట్టి తప్పనిసరి అని ఈ చిత్రం చూచే ఏ ప్రేక్షకుడికైనా తోస్తుంది. పోతే ఈ సుదీర్ఘ సంభాషణలనే పరిహసించి పరిహరించిన పద్ధతి, వాటిమీద పడే ఉద్వేగపు నీడలమీద తెల్లటి యుక్తోక్తుల కాంతులు ప్రసరించి అదృశ్యం చేసిన శిల్పం, ఎవరికి ఏ దురభిప్రాయాలున్నా తొలగించివేస్తాయి. ఆయన తూచిచూచి మరీ అంటున్న ప్రతిమాటా మన మనసులో నాటుకొంటుంది.... విలువగలమాటకీ, కేవలం వలువగల మాటకీ తేడా కూడా తెలుస్తుంది.

బేస్ వయొలిన్ క్రింద షడ్జమంలో ఆగుతున్నపుడు టాప్ వయొలిన్ పైపంచమంలో ఆరంభించి సాగిపోవడం - పిందె పుట్టడంతో పువ్వు వాడిపోయి రాలిపోవడం ఈ చిత్రంలో ముఖ్య సన్నివేశం.

నృత్య నాటికా మందిరాలలో హాస్యంచేసి పేరు తెచ్చుకున్న కాల్వెరో అనే విదూషకుడు ఉచ్ఛదశకు పెరిగి, ఎక్కడో తన వృత్తి మీద పట్టుతప్పి విరిగిపోతాడు. అతడు ఏమి చేసినా హాస్యం రాణించదు. ప్రేక్షకులకు క్రమంగా దూరమై

వెనకబడిపోతాడు. యధాలాపంగా, ఎందుకో తెలియకుండా జీవిస్తూ ఉంటాడు. ఆ స్థితిలో అతనికి టెరిస్సా అనే అమ్మాయి జీవనరేఖ యాదృచ్ఛికంగా దగ్గరపడి సమానాంతరం అవుతుంది. తేడా; ఆమె ఆత్మహత్యకు పాల్పడుతుంది. సకాలంలో కాల్వెరో అడ్డుపడి ఆపుజేస్తాడు. "ఏమిటా హడావుడి?" అని మందలిస్తాడు. పోయే ప్రాణాన్ని అపగలిగానన్న ఉత్సాహంలో జీవితం ఎంత అద్భుతమైన వరమో, బతకాలన్న కోరిక, బాగా బతకాలన్న ఆశ ఎంత ముఖ్యమో ఆమెకు నూరిపోసి బోలెడు వేదాంతం మాట్లాడి ఆమెను పునరుజ్జీవింప చేస్తాడు అతని హితబోధవల్ల, ఉపచారంవల్ల టెరిస్సా కోలుకొని తిరిగి రంగస్థలం మీదకు వెళ్తుంది. అచిరకాలంలోనే గొప్ప నర్తకిగా పేరూ, డబ్బూ కూడా గడిస్తుంది. ఆమెను బ్రతికించడానికి తను తెచ్చుకొన్న ఆవేశాన్ని, ఉత్సాహంగా అనువదించుకొని, "వెనకబడ్డ విదూషకుడు" కాల్వెరో కూడా తిరిగి పైకి రావడానికి ఒక ప్రయత్నం చేస్తాడుగాని, అతని 'పాతకాలపు హాస్యం' ప్రేక్షకులకు నచ్చదు. దెబ్బతిని అవమానంతో తిరిగివస్తాడు. టెరిస్సా వెంట ఉండడానికి అభిమానం అడ్డువస్తుంది. ఆమె అతన్ని పెళ్లి చేసుకుంటానంటుంది. అందుకు అంగీకరించడు. ఆమెను వదలిపోయి ఎక్కడో పాటలు పాడి జీవనం సాగిస్తూ ఉంటాడు.

చివరకు టెరిస్సా, అదృష్టం, మంచిరోజు, నాటకం ప్రొడ్యూసరూ అతన్ని వెతుక్కువచ్చి తిరిగి వేషం కట్టడానికి ప్రోత్సహించి అవకాశం ఇవ్వడం జరుగుతుంది. ఈసారి వెనకబడ్డవాడి పాతకాలపు హాస్యం - ఈ తరం ప్రేక్షకులకు కొత్తగా హుషారుగా కనిపిస్తుంది. దానితోపాటు విదూషకుడు కొత్తగా తయారుచేసుకున్న హాస్య సన్నివేశం కూడా (ఇందులో ఒకపుడు ఉజ్జ్వలంగా వెలిగి వెనకపడిన హాస్య నటుడు బస్టర్‌కీటన్ పాల్గొన్నాడు) జనానికి పడుతుంది. హర్షధ్వానాలు మిన్నంటుతాయి. కాల్వెరో ఒక్కసారిగా గొప్పవాడు అవుతాడు. ఆ సమయంలోనే, చివరి అంకంలో ప్రమాదం జరిగి అతడు స్టేజీమీదనించి జారి, ఆర్కెస్ట్రాలో ఉన్న ఒక డ్రమ్ మీదపడి అందులో ఇరుక్కుపోతాడు. వెన్నెముక విరుగుతుంది. గుండెపోటు వస్తుంది. మృత్యుఘడియలు సమీపించాయని కాల్వెరో గ్రహిస్తాడు. ఆ డ్రమ్‌లో వుండగానే, తనను ఒకసారి స్టేజీమీదకు తీసుకువెళ్ళమంటాడు



అక్కడివారిని. హర్షధ్వానాలు చేస్తున్న ప్రేక్షకులను చూసి తృప్తిపడి, నవ్వి "ఇది ఇంకా ఇలా సాగిద్దామనే ఉంది... కాని, నే నిక్కడ చిక్కడిపోయాను" అని ప్రత్యక్షావస్థ మీద నుండే, ఆసన్న మృత్యువును కూడా స్పృశిస్తూ గుండెలో నాటుకుపోయేలాటి ఈ మాటతో శ్లేష వేస్తాడు. (You see I would like to continue but I am STUCK అని.)

తరవాత అంతే అవుతుంది. టెరిస్సా నృత్యం చేస్తూ ఉండగా రంగస్థలం మీద వింగ్స్ చాటున శయనించి, తాను వెలిగించిన టెరిస్సా రంగస్థలం మీద మూర్తీభవించిన



ఙంలా నర్తిసూ ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూ ఉండగా చూస్తూ, తను ఆరిపోతాడు... జీవన స్రవంతి యథా ప్రకారం కొనసాగుతానే ఉంటుంది. "ఇంక అట్టే టైము లేదు. వెళ్ళిపోయేలాగా సత్యాన్ని దర్శించాలి" అనుకున్న కాల్వెరో యాత్ర ఆగిపోయి, అక్కడనించి టెరిస్సా జీవనయాత్ర కొనసాగుతుంది.

ఈ జీవిత నాటకంలో చాప్లిన్ నిర్వహించినది ఒక్క కాల్వెరోవే కాదు; మిగతా నటీనటులు ధరించిన భూమికలన్నీను. కాల్వెరో కేవలం విదూషకుడేకాదు. హాస్య రసజ్ఞుడికి ఉండగల పరిపక్వత గల నిండు మనిషి. జయం అపజయం కూడా అనుభవించినవాడు. నవ్వడం నవ్వించడం, నవ్వులపాలు కావడంతోపాటు నవ్వుకోవడం కూడా నేర్చుకున్నవాడు. దర్శకుడు నటుడు అయిన చాప్లిన్ ఈ పాత్రలోని ఛాయా భేదాలన్నిటినీ దేనికదిగా, ఎక్కడికక్కడగా మాటలో తీరు, భ్రుకుటి ముడవడంలో, నవ్వడంలో, నవ్వకపోవడంలో చిత్రించాడు. మాటలోనూ మనసులోనూ ఉండే అంతస్తులను చూపించాడు. మనిషిలో ఆశ అంకురించడాన్ని చూపించాడు. నిస్పృహ కమ్ముకురావడం చిత్రించాడు. వెనకబడిన హాస్యగాడి హాస్యాస్పదమైన హాస్యాన్ని అత్యంత హాస్యరసభరితంగా చూపించి ఏకకాలంలో రెండు లక్ష్యాలను సాధించాడు. 'పెర్ఫార్మింగ్ ఫ్లీ' పేరిట తీసిన దృశ్యాలు, వాటిలో చాప్లిన్ నటన చూసినవారు ఎన్నటికీ మరువరు. మేకప్ తీసివేసి రంగస్థలం మీదనుంచి జీవిత రంగస్థలం మీదకు వచ్చిన చాప్లిన్‌ను అంతకన్న మరువలేరు. అక్కడ లైమ్

లైట్‌లో ఉంటే ఇక్కడ సబ్డైమ్ లైట్‌లో కనిపిస్తాడు. ఆ చాప్లిన్‌కు ఈ చాప్లిన్‌కు దూరపు చుట్టరికం కూడా కనిపించదు. క్షణంలో సగంలో చాప్లిన్ హాస్యగాడిని వేదాంతిలా చూపిస్తాడు, అద్దె బెడద లేకుండా లావుపాటి ఇంటావిడతో మోటుసరసాలు ఆడిన పోకిరీ పెద్దమనిషిని అరక్షణం తరవాత గౌరవభాజనుడిగా చూపిస్తాడు. నిత్యజీవన వ్యాసంగంలో ఆ వెకిలిచేష్ట వెనకాల ఉన్న విషాదస్థితిని స్ఫురింపచేస్తాడు. క్షణంలో పసివాడిని పరిణతుడిస్థాయి కెత్తి దింపివేస్తాడు. ఒక ఫోటోజెనిక్ కొటేషన్‌లాటి మాటతో మనని అట్టె నిలబెట్టి, దానిని క్షణార్ధంలో అపహసించి నవ్వించివేస్తాడు. నవ్వు అయేసరికి అతడు గమ్మత్తుగా అన్నమాటలో లోతు మనకి స్ఫురింపచేస్తాడు. ఆ వేళకి అతని ముఖ భంగిమ, విగ్రహం, చుట్టూరా వెలుగు నీడలూ, దూరంగా సంగీత వ్యాఖ్య అన్నీ ఆ భావానికి గాంభీర్యాన్నీ, రీవినీ సమకూర్చుతాయి.

ఈ చిత్రంలో దర్శకుడుగా చాప్లిన్ పనివాడితనం కూడా చిరకాలం నిలిచి ప్రశంసలు అందుకోగలది. టెరిసా చిన్ననాటి ప్రేమ కథ చిత్రణ ఒకటి. ప్రేమకథ లన్నిటి రామణీయకాన్నీ, మాధుర్యాన్నీ సమీకరించి రూపొందించినట్లుంది. ఆయా ఘట్టాలలో ఫ్రేం కాంపోజిషన్‌లు–, ఫ్రేములు లేకుండా ప్రేక్షక హృదయాలలో చిరకాలం నిలిచే చిత్రాలు. అనురాగోదయాన్ని అంత అందంగా చూపి ఆపినవి అరుదు. అలాగే చివరి సన్నివేశాలలో కాల్వెరో మరణశయ్య మీద ఉండగా టెరిస్సా అతని పక్కన కూర్చొని దుఃఖించే దృశ్యం – ఓల్డ్ మాస్టర్స్ వేసిన త్రివర్ణచిత్రాలను వివర్ణం చేసేదిగా ఉంది. ఆ గదిలో నాటకాల సామగ్రి, పాతకాలపు సరంజామా అన్నీ ఆ సన్నివేశానికి తగినట్లు అమరాయి. చిత్రం పొడుగునా, కథా వస్తువును ఉద్ఘోషించే నేపథ్య సంగీతం ఆ ఘట్టాలలో వినవస్తూన్నపుడు ఉత్తమ కళాకారుడు, కరుణాకరుడు చార్లీ చాప్లిన్‌కు జోహార్లు చేస్తాము.

*(ఆంధ్ర-వారపత్రిక - 1959)*


బస్టర్ కీటన్

చార్లీచాప్లిన్ తీసిన సినిమాలలో చిట్టచివరి క్లాసిక్‌గా చెప్పుకోవచ్చు. చాప్లిన్‌ను 'ట్రాంప్'గా చూడడం అలవాటుపడిన ప్రేక్షకులు ఇలా చూడడానికి ఇచ్చగించని కారణంగానో ఏమో ధియేటర్లలో, టీవీలో కూడా ఈ సినిమా పెద్దగా ప్రదర్శితమవదు. నిడివి ఎక్కువగా (145 ని॥లు) ఉందని ఫిర్యాదులు వచ్చాయి. బస్టర్ కీటన్ పాత్రకు ఎక్కువ పేరు వచ్చేస్తోందని ధాన్ని చాప్లిన్ కాస్త కుదించాడని అన్నారు.



# సెవెన్ ఇయర్ ఇచ్

చెలరేగే కోరికలన్నీ తీరనివై పేరుకుపోతే కాస్తంత అవకాశం రాగానే అవి పేట్రేగుతాయి. రంగురంగుల పగటికలలుగా రూపాలు ధరిస్తాయి. వాటిని 'కన్న' ఆసామికి అద్భుతరూపం ఇస్తాయి. ఆత్మనిగ్రహం కల మహానుభావుడుగా, బహు మంచివాడుగా చూపించి ఓదారుస్తాయి.

సిగరెట్ల దగ్గర్నుంచీ పరస్త్రీల వరకూ కాస్త గట్టిగా సలహాలిచ్చి అమలు జరిపించే భార్య దొరికినప్పుడు, భర్త ఈ పంథాలో రూపొందవచ్చు. ఆవిడ దృష్టి మళ్లగానే ఆయన దృష్టి నలువంకలా సారిస్తాడు. అప్పుడది చక్కని చుక్క మీద పడక తప్పదు. రోజులు మారినా పురుషులలో ఈ ధోరణిలో మార్పు రాలేదు.

ట్వంటీయత్ సెంచరీ ఫాక్స్ వారు 'సెవెన్ ఇయర్ ఇచ్' అనే చిత్రంలో ఈ కోవకు చెందిన వ్యక్తిని అద్భుతంగా చిత్రించారు.

కథానాయకుడు, చౌక పుస్తకాల కంపెనీలో ఉద్యోగి. నడికారు వయసువాడు. ఏమంత అందగాడు కాడు. భార్య క్రమశిక్షణలో బంగారుతండ్రిలా బాచాలకొండలా ఉంటూ ఒడిదుడుకులు లేకుండా కాలం గడిపేవాడు. ఒక వేసవిలో భార్యనీ, కొడుకునీ, కాస్త చల్లగా వుండే పల్లెటూరికి పంపిస్తాడు.తాను మాత్రం

ఉద్యోగరీత్యా వెనక దిగబడతాడు. రైలు కదలగానే క్రమశిక్షణ బంధాలు సడలుతాయి. సిగరెట్ల విషయంలోనూ, మద్యం విషయంలోనూ తెగుతాయి కూడా. మనసు మరింత 'స్వేచ్ఛ' కోసం అర్రులు చాస్తుంది. ఒక క్షణం తప్పు, సుమీ అని హెచ్చరించబోతాడు మనసుని. మరో క్షణం కో అనకపోయినా కోటి మంది స్త్రీలు తన కాళ్ల మీద వాలుతారు అని, తనకి తానే చెప్పుకుని తన సమ్మోహశక్తిని, కళ్లు చెదిరే రంగులలో చిత్రించుకుని మురిసిపోతాడు. అయినా తను వాళ్లందరినీ కాలతన్ని తృణీకరించగల ఉద్దండుడుగా ఆత్మనిగ్రహం కలవాడుగా చిత్రించుకుని కోరికలకు పగ్గాలు బిగించబోతాడు. ఈ పగటి కలలు కనడంలో ఉద్యోగరీత్యా అతను చదివే కారు చవకబారు పుస్తకాలు (వెల చవక, సరుకు కారుచవక) చాల దోహదం చేస్తాయి. అణాకానీ పుస్తకాలలోని ప్రణయఘట్టాలన్నీ అతని స్వప్నలోకంలో రూపాలు ధరిస్తాయి.




ఈ అవస్థలో వుండగా ఒక వరారోహ అతనికి తటస్థపడుతుంది. ఇతడు అద్దెకున్న ఇంటి మేడ మీద గది ఆమె బస. వేసవి తాపం భరించలేక, ఇతడి గదిలో ఏయిర్ కండీషనర్ ఉంది గదా అన్న ఊహతోనే ఆ పిల్ల ఒక రాత్రి అక్కడ విశ్రమించడానికి ఉద్యుక్తురాలవుతుంది. అక్కడితో అతని కోరికలూ, ఊహలు చెట్టాపట్టాలేసుకు చెలరేగుతాయి. కథ ఎలా జరుగుతుందో, ఎలా జరగాలో అతను 'టెక్నికలర్ సినిమాస్కోప్‌లో' ఊహిస్తాడు. ఒకానొక ముహూర్తాన ఆ ఊహ బయటపడుతుంది. ఆ పిల్ల విస్తుపోతుంది. తన గదికి వెళ్లిపోతుంది.

అక్కడి ఇతడి ఊహాశక్తి తిరిగి విజృంభిస్తుంది. ఈసారి కొత్త పంథాలో నడుస్తుంది. ఆ పిల్ల తన దుశ్చేష్టను అందరికీ చెప్పి అల్లరిపాలు చేస్తుందని భయం పట్టుకుంటుంది. ఆ భయం ఊతంగా తనకు విశేష ప్రాధాన్యం ఇచ్చుకుని జరగబోయే కథను ఊహించుకుంటాడు. ఈ రెండో అవస్థలో వుండగా అచ్చుకి వచ్చిన ఒక 'సెక్స్' శాస్త్రీయ గ్రంథం చదువుతాడు. ఏడేళ్ల కాపురం చేసిన దంపతులలో భర్తలకు ఏడో ఏడు మనసు చలించి, అన్యకాంతలపైకి పోతుందని, ఈ ప్రవృత్తి అతిసహజమనీ అందులో ఒక సిద్ధాంతం. గత రాత్రి తన చర్యకు దీన్ని అన్వయించుకోగానే అతనికి తెలియకుండానే కోరికలు మళ్లా తలలెత్తుతాయి. దానికితోడు, ఆ పిల్ల అల్లరి పెట్టలేదనే నిర్ధారణ కాగానే మరింత ధీమా వస్తుంది.

తిరిగి ఆహ్వానిస్తాడు. మాటల సందర్భంలో ఆమెకి ఏయిర్ కండిషనర్ యంత్రం గురించి తప్ప మరో ఊహలేదని తెలియగానే తమాయించుకుని పూర్తిగా తగ్గిపోతాడు. ఇదీ స్థూలంగా కథ.

ఈ కథను ఆసరా చేసుకుని మానవుడి దౌర్బల్యాన్ని నవ్వూ, జాలీ కలిగేలా చిత్రించారు.

చవకబారు సారస్వతం పైనా, కృత్రిమంగా జీవితాలను చిత్రించే చలన చిత్రాల పైనా ఈ చిత్రం నిశిత విమర్శ.


చిత్రదర్శకుడు బిల్లీ విల్డర్

మనస్తత్వశాస్త్రం పేరిట నకిలీ శాస్త్రజ్ఞులు లేవతీసే అవకతవక సిద్ధాంతాలను హేళన చేస్తూ సమాజంపై వాటికి ఉండే దుష్టప్రభావాల్ని కూడా ఇందులో చూపించారు. టామ్ ఎవెల్, మేరిలిన్ మన్రో ఇందులో ముఖ్య భూమికలు నిర్వహించారు.

ఈ పాత్రలు రెండూ విరుద్ధ ప్రకృతులు గలవి. అతగాడు స్వతహాగా నయితేనేం, సమాజం పేరిట అయితేనేం కృత్రిమ జీవితానికి అలవాటుపడ్డాడు. తనను కొండంతవాడుగా మహానుభావుడుగా ఊహించుకోవడం నేర్చుకున్నాడు. తప్పు చేయదలిచినప్పుడు ఏదో విధంగా నచ్చజెప్పుకుని సంతృప్తి పడగలవాడు. ఇక అతని జీవితంలోకి ఒకసారి తొంగి చూసి తప్పుకున్న ఆ అమ్మాయి టెలివిజన్‌లలో 'టూత్ పేస్టు'ల వంటి సరుకుల ప్రచారానికి ఉపయోగపడే అందమైన పరికరం. అక్షరాలా అమాయకురాలు. ఊహా, మాటా, చేతా ఒక పంథాలోనే నడుస్తాయి. కృత్రిమ వాతావరణంలో వున్నా, స్ఫటికం వలె స్వచ్ఛమైన మనసు కలది. ఈ తరహా ప్రకృతులు ఒకచోట చేరడంతో రెండు పాత్రలూ అద్భుతంగా రాణించాయి. వాటి స్వరూప స్వభావాలు ప్రస్ఫుటంగా తేలాయి. కథ నడిపిన తీరు కూడా, విశిష్టంగా వుంది. ఆద్యంతం ఏ ఒక్క చోటా విసుగెత్తదు. చిత్రం పొడుగునా చక్కని హాస్యం వుంది. సున్నితమైన విమర్శ, హేళన ఇమిడి వున్నాయి.

ఈ కథ మొదట నాటకంగా రచింపబడింది. అమెరికాలో చాలా రోజులు ప్రదర్శింపబడి బహుళ ప్రజాదరణ పొందింది. కథ స్వభావాన్ని బట్టి ఇందులో స్వగతాలు చాలా వున్నవి. ఉన్నవన్నీ పెద్దవే. నాటకాలలో స్వగతాలు ఎన్నయినా ఉండవచ్చు. కానీ సినిమాలలో వాటికి చోటు లేదనడం పొరపాటని ఈ చిత్రం రుజువు చేస్తుంది. ఎందుకంటే ఈ కథను చలనచిత్రంగా తీయడంలో స్వగతాలు పుష్కలంగా ప్రవేశపెట్టారు. ఏ ఒక్కటీ ఎక్కడా విసుగెత్తకుండా పాత్ర బహిరంగ స్వభావాలను సుస్పష్టంగా చిత్రించారు. దీన్ని బట్టి చూస్తే 'కన్యాశుల్కం' వంటి

మహత్తర నాటకాలను తెరమీద కెక్కించినప్పుడు స్వగతాలు పెద్ద బెడదగా, సినిమాకు అసలు సరిపడనివిగా భావించనవసరం లేదని, స్వగతాలు చేర్చి, అటువంటి నాటకాలను మరింత రమ్యంగా చిత్రించడానికి మంచి మార్గాలూ, మార్గాంతరాలు లేకపోలేదని విశదం అవుతున్నది.

*(ఆంధ్ర-వారపత్రిక - 1956)*

దిసెవెన్ ఇయర్ ఇచ్ (కలర్, 105 ని.లు 1955): మేర్లిన్ మన్రో, టామ్ ఎవెల్ నటించిన హాస్యచిత్రం. మేర్లిన్ మన్రో ఎక్కువ చిత్రాల్లో నటించకపోయినా, నేటికీ శృంగార తారలకు అధిదేవతగా పరిగణింపబడుతుంది. ఈ చిత్రానికి దర్శకత్వం వహించిన బిల్లీ విల్డర్ దర్శకత్వంలోనే మేర్లిన్ మన్రో 'సమ్ లైక్ ఇట్ హాట్' (1959) చిత్రంలో కూడా నటించింది. ఆ సినిమా ఆధారంగా 'రఫూచక్కర్' (1975) హిందీ సినిమా తయారయింది. 'పెళ్లినాటి ప్రమాణాలు'కు 'సెవెన్ ఇయర్ ఇచ్' సినిమా స్ఫూర్తి నిచ్చిందంటారు.

# "ది ప్రిన్స్ అండ్ ద షో గర్ల్"



జాతిరీత్యా అమెరికన్లకీ, యూరోపియన్లకీ తేడా ఏమీ లేకపోయినా, ఆచారాలలో అలవాట్లలో తేడాలున్నాయి. యూరోపియన్లు కొన్ని శతాబ్దాలుగా వస్తున్న ఒక విధమైన జీవితవిధానానికి, అమెరికన్లు అప్పటికప్పుడు, అక్కడికక్కడ కొత్తగా సృష్టించుకున్న మరో రకమైన జీవితవిధానానికి అలవాటు పడ్డారు. 'మాది సరికొత్త నాగరికత' అని అమెరికన్లు గొప్పగా చెప్పుకుంటే, 'మాది ఎంత ప్రాచీన నాగరికతో' అని యూరోపియన్లూ గొప్పగానే చెప్పుకుంటారు. వాళ్ల అలవాట్లని వీళ్లు వేళాకోళం చేస్తే, వీళ్ల అలవాట్లని వాళ్లు వేళాకోళం చేస్తారు.

'అమెరికన్ మార్కు జీవిత విధానమే వాడుడు' అని బుజ్జగింపుగా ప్రచారం చేసే చిత్రాలు లోగడ చాలా వచ్చాయి. అటువంటిదే ఒక చిత్రం (వార్నర్) "ది ప్రిన్స్ అండ్ ద షో గర్ల్".

షేక్స్పిరియన్ నటుడు సర్ లారెన్స్ ఒలీవియర్, హాలీవుడ్ తార మేరిలిన్ మన్రో కలిసి నటించిన ఈ చిత్రం మేరిలిన్ మన్రో ప్రొడక్షన్స్ పేరిట తయారైంది. నిర్మాత, దర్శకుడు లారెన్స్ ఒలీవియర్.

కథాకాలం మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు. అయిదవ జార్జి పట్టాభిషేక సమయంలో పట్టాభిషేకం చూడడానికి లండన్ వచ్చిన ఉత్తర బాల్కన్ రాజ్యపు రాజప్రతినిధి (లారెన్స్) ఒకడు. ఇతగాడు వినోదానికి ఒక నాటకం చూడబోయి, దాంట్లో వేషం వేసిన ఒకానొక అమెరికన్ జఘన సుందరిని (మేరిలిన్) చూసి ముచ్చటపడి, ఆ రాత్రి తనతో భోజనమారగించటానికి రమ్మని ఆహ్వానిస్తాడు. ఆమెతో ఆ రాత్రి విలాసంగా గడుపుదామనుకున్న అతనికి ఆ అమెరికన్ సుందరి పద్ధతులేమీ నచ్చవు. ఆమె అమెరికన్ పద్ధతులతనికి నచ్చనట్లే, అతని యూరోపియన్ రాచరికపు పద్ధతులామెను కొత్త చేస్తాయి.

అయినా వారిద్దరికీ మధ్య ఆత్మీయత ఏర్పడ్డానికి ఇవేమీ అడ్డం రావు. ఈ రాజప్రతినిధి కొడుకు కార్పేతియాకు అసలైన రాజు. అతడింకా మైనరు. మరొక పద్దెనిమిదేళ్లకి గాని ఆ అబ్బాయి చేతికి రాజ్యం రాదు. ఆ అబ్బాయి ఆధునిక భావాలు కలవాడు. మోటారు సైకిలెక్కి ఇష్టం వచ్చినట్టు తిరగాలని, తన రాజ్యంలో ఎన్నికలు జరిపి ప్రజలకి హక్కులివ్వాలనీ అతని సరదా.



అతని సరదా సరాసరి 'కెయిజర్' కౌగిలిలోకి లాక్కెడుతుందని అతని తండ్రియైన రాజప్రతినిధి భయం. ఎన్నికలు జరిపితే ఎవరు నెగ్గుతారో తెలియదు కదా అని అతని అనుమానం. "అదే ఎన్నికల్లో ఉన్న మజా" అని అమెరికన్ పిల్ల నచ్చచెబుతుంది. చివరికామె సలహా అతనికి నచ్చుతుంది. యుద్ధాలూ, విప్లవాలూ తీర్చలేని ఒక జటిల రాజకీయ సమస్యని ఒక మేరిలిన్ మన్రో సునాయాసంగా తీర్చి పారేస్తుంది. ఇప్పటిదాకా జఘనచాలనం మాత్రమే అవసరమైన పాత్రలే ఎక్కువగా

ధరిస్తూ వచ్చిన మేరిలిన్ మన్రో తన ఈ సొంత చిత్రంలో అమెరికన్ జీవిత విధానపు ట్రేడ్ మార్క్‌గా చక్కని నటన కూడా కనబరిచింది. ఠీవి, హాస్యం, వ్యంగ్యం, అన్నీ కలిసిన రాజప్రతినిధిగా ఒలీవియర్ నటించారు. బ్రిటీష్ రాజు పట్టాభిషేక దృశ్యాలు మేరిలిన్ మన్రోలాగానే నిండుగా, నేత్రపర్వంగా వున్నాయి.

*(ఆంధ్ర-వారప్రతిక - 1958)*


నటుడు, దర్శకుడు లారెన్స్ ఒలీవియర్

ది ప్రిన్స్ అండ్ ద షో గర్ల్ (1957) టెక్నికలర్, 117 నిమిషాల నిడివి.

దర్శకత్వం లారెన్స్ ఒలీవియర్ తారాగణం: లారెన్స్ ఒలీవియర్, మేరిలిన్ మన్రో, సిబిల్ థార్న్‌డైజ్, జెరెమీస్పెన్సర్, ఛాయాగ్రహణం జాక్ కార్డిఫ్. లారెన్స్ ఒలీవియర్ దర్శకత్వం వహించిన ఇతర చిత్రాలు హేమ్లెట్ (1948), రిచర్డ్ III (1955) ఆయన ఏజ్ యూ లైకిట్ వంటి షేక్స్పియర్ చిత్రాలతో బాటు 'ఉదరింగ్ హైట్స్', 'ప్రైడ్ అండ్ ప్రెజుడీస్', 'ఎ బ్రిడ్జ్ టూ ఫార్' వంటి క్లాసిక్స్‌లో కూడా నటించేరు. మేరిలిన్ మన్రో తన నటనతో కూడా ప్రేక్షకులను ఆకట్టుకొన్న చిత్రాలలో ఇదొకటి.

# స్టోరీ ఆఫ్ మేన్‌కైండ్



భూమికోసం, భామకోసం సాటి ప్రాణిని చంపగలిగిన మానవుడు పెరిగి పెద్దవాడై బుద్ధిబలం కూడా పెంచుకున్నాక నిఖిల మానవకోటిని క్షణార్థంలో దగ్ధం చేసే 'అస్త్రం' సూపర్ హైడ్రోజన్ బాంబ్‌ను కనిపెట్టాడు. ఇంతటి దిగిపోయిన (నాగరిక ప్రమాణాల ప్రకారం అయితే ఎక్కిపోయిన) ఈ మానవుడి జాతి ఇటుపై వుండాలా? వుండాలా? అని దేవతలకు చర్చ వచ్చింది. విచారణ జరిపి నిర్ణయించడానికి ఒక దివ్య సంఘం కూర్చుంది. కోర్టులో మానవుడిలో మానవత్వం తరపున వకీలుగా (కీర్తిశేషులు) రోనాల్డ్ కోల్మన్, దానవత్వం తరపునవాదిగా సినీ విలన్ విన్సెంట్ ప్రైస్ నిలబడ్డారు.

సాటి మానవులను నిర్దాక్షిణ్యంగా హింసించిన దుష్టులెందరో గొప్పవాళ్లుగా చెలామణి అయి చాలాకాలం రాజ్యాలు యేలి సుఖపడ్డారు. వారి మాట విని వారిని అనుసరించిన సేనలు కోట్లాదిగా వుండేవి. ఇన్ని కోట్లమంది ఒక దుష్టుడిని, వాడి దుర్మార్గాలను మన్నించారు కాబట్టి మానవ జాతికి దౌష్ట్యం సహజ లక్షణం. అందుచేత ఈ జాతిని బూడిద చేయడంలో ఎవరికీ ఆక్షేపణ వుండరాదు అని వాదించాడు దానవుడు.

ఇదే వాదంతో నా మాట నెగ్గుతుంది. ఎందరో మహాపురుషులు సన్మార్గాన నడచి సత్యాహింసలు బోధించారు. కోట్లాది జనం ప్రాణాలకు కూడా తెగించి అచంచల విశ్వాసంతో ఆ పుణ్యపురుషులను అనుసరించారు. కాబట్టి మంచితనం మానవుడికి స్వతస్సిద్ధమైన లక్షణం. అందుచేత మానవుడు చిరంజీవి కావాలి అని ప్రతివాదం చేశాడు మానవుడు.

ప్రధాన న్యాయమూర్తి సర్ ఫెడరిక్ హార్డ్‌నిక్ గంభీరంగా తల తాటించి వాదాలు సాగించమన్నాడు.

.... ఏమున్నది గర్వకారణం? నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం.

తరువాత జరిగిన చర్చలలో కోల్మన్, ప్రైస్ లిద్దరూ 'నరజాతి చరిత్ర సమస్తం' – ఆదిమానవుడి దగ్గరనుంచి శతాబ్దాల వారీగా తడిమి, ఒకరు మంచితనానికి, మరొకరు దానవ లక్షణాలకు నిదర్శనాలు తీసి చూపిస్తారు. కోల్మన్ మొహం చూస్తున్నప్పుడు మనకు ఎంతటి ఆత్మవిశ్వాసం, సంతోషం, కలిగినా, విలన్ మొహం చూడగా ఎంత కోపం, చిరాకు వేసినా, దానవత్వపు దారుణాల సంఖ్య, పరిమాణాలే ఎక్కువగా వున్నందువల్ల 'మన' కథ వింటున్నప్పుడు మనకే సిగ్గేస్తుంది.

దానికి తోడు, విన్సెంట్ ప్రైస్, ఆదిమానవుడి దగ్గరనుంచీ నేటివరకు శతాబ్దాల మీదుగా చిన్న చిన్న అంగలు వేసుకువస్తూ, మానవుల రక్తం ఓడ్పించి పిరమిడ్ కట్టించిన ఈజిప్ట్ రాజు ఖుఫూ, రోమ్ నగరం తగులబడుతూ వుంటే చూసి ఆనందించిన నీరో, హెలెన్ కోసం లక్షలాది జనం ప్రాణాలను హోమం చేసిన గ్రీకు ట్రోజన్ రాజులూ, తమ్ముడినీ, ప్రియుడినీ సైతం చంప వెనుకాడని క్లియోపాత్రా వగైరాల దగ్గర నుంచీ హిట్లర్ దాకా మానవ హంతకుల కథలు కొసికొద్దీ విపులంగా చెబుతూ వుంటే, మానవుడి వకీలు ఎంతసేపూ భూమ్యాకర్షణ సిద్ధాంతం, టెలిస్కోప్, మోటారుబండి, అమెరికా, పొగ ఓడ, విమానం మొదలైనవాటిని కనిపెట్టడమే మానవుని మనుగడకు వాదాలుగా ఉపయోగించాడు.

ఏసుక్రీస్తు గురించి, మోజెస్ గురించి కూడా చెప్పకపోలేదు కాని బాక్సాఫీసు సెట్లలో సెక్స్‌ట్రాలను చూపడానికి నీరో సభామందిరం అంత గ్లామర్ లేక కాబోలు తేలిగ్గా తెమిల్చేశారు. మానవకోటిలో సగానికి పైగా నమ్మి పూజించిన బుద్ధభగవానుడి వంటివారికి పోర్షన్ ఇవ్వలేదు! రంగుజాతివాడు కావడంవల్ల బహుశా కలర్ బార్ కారణం అయి వుండవచ్చునేమో తెలియదు. మెకార్థీగారి బ్లాక్ లిస్ట్‌లో పడ్డదేమో కూడా తెలియదు. మొత్తానికి కోల్మన్, లోకకల్యాణానికై మానవుడు చేసిన కృషికి, భౌతికము, సాంకేతికము అయిన అభివృద్ధినే చూపించడంవల్ల కోర్టువారికి మానవజాతి మనుగడ అంత అవసరం కాదనిపించినట్టు కనిపించింది. అయితే, విలన్ విన్సెంట్ ప్రైస్ పాత శతాబ్దాలలో హీరోలను నీరోలను కూడా కలిపి చెడతిట్టడంతో అలసిపోయినందువల్ల ఇటీవలి సంఘటనను – ఉదాహరణకు ఆటంబాంబు ప్రయోగం వంటి వాటి దగ్గరకు వచ్చేసరికి టూకీగా వాదాలు ముగించేశాడు. పాత శతాబ్దాలలో చిన్న చిన్న అంగలు వేస్తూ, అప్పటి సన్నివేశాలను విపులంగా రకరకాల కోణాలలో చిత్రించడంతో 'రీలాతీతమై' కాబోలు, నిర్మాతలు 19, 20 శతాబ్దాలలో విశేషాలను ఒకటి రెండు షాట్లలో లాగి అవతల పారేశారు. దానాదీనా ఉభయుల వాదాలు చివరకు చప్పబడడంవల్ల కోర్టువారు తీర్పు వాయిదావేయడం జరిగింది.

మానవుడి ఆఖరు ప్రయత్నం: ఒక అయిదేళ్ల బాలుడిని చూసి భావి పౌరుడిని బతకనీయండి అనడం.

దానవుడి జవాబు: ఆ పిల్లాడి చేతిలో ఆటవస్తువును చూడండి. ఒకటి తుపాకి, రెండోది బాకు.


రోనాల్డ్ కోల్మన్

మానవుడి సమర్థన: ఆ బొమ్మ పిస్తోలు నొక్కితే తీయటి సంగీతం వినిపిస్తుంది. బొమ్మ బాకు విప్పితే అందులో పెన్సిళ్ళు కనిపిస్తాయి.

అందుచేత, చిన్నపిల్లలకి, చదువు, సంగీతం పట్ల ఆకర్షణపట్ల కలిగించడానికి మారణాయుధాల రూపాలు ఎరచూపి వాళ్ళ మనసు ఖరాబు చేయాలనేమో తెలీదు.

కాని, ఆ కుర్రాడు దొరల పిల్లాడు కాబట్టి సరిపోయింది. కోర్టు నిర్ణయానికి ఆఖరు వాదమైన ఈ సన్నివేశంలో అక్కడ నీగ్రో బాలుడ్ని భావిపౌరుడిగా కూర్చోబెడితే గవర్నర్ (లిటిల్ రాల్ఫ్) ఫాబస్, కోర్టు వారికి తర్కించే శ్రమలేకుండా అయిదు నిమిషాలలో తీర్పు చెప్పేసే ఏర్పాటు చేసేవాడు.

మొత్తానికి 'స్టోరీ ఆఫ్ మాన్‌కైండ్' చిత్రంలో కథ ఈ విధంగా ఆగింది. వార్నర్ బ్రదర్స్ తీసిన ఈ టెక్నికలర్ చిత్రంలో కోల్మన్, ఫ్రైస్ మార్క్సు బ్రదర్స్, హేడ్‌లమార్, ఆగ్నెస్ మూర్‌హెడ్, పీటర్ లారీ పాల్గొన్నారు. నీరో పాత్రను లారీ అద్భుతంగా పోషించాడు.

ఇటుపై తీర్పు ఎలా రావాలా అన్నది ఈ కేసు విచారించిన ట్రిబ్యునల్ చేతిలో వుండదు. ఈసారి ఒక రాజకీయ విలేకరి అన్నట్టు వాషింగ్టన్, మాస్కో కాలచక్రం మాత్రమే మానవుని భవిష్యత్తును తేల్చాలి.

*(ఆంధ్ర-వారపత్రిక - 1958)*

1957 నాటి ఈ వంద నిమిషాల చిత్రాన్ని విమర్శకులు పెద్దగా ఆదరించలేదు. వార్నర్ బ్రదర్స్ వారు వారి పాత సినిమాలలోని బిట్లు చూపించుకోవడానికి ఈ చిత్రం తీశారన్నారు కొందరు. మార్క్సు సోదరులు ఒక జట్టుగా కనబడనందుకు నొచ్చుకున్నారు కొందరు. అసలు ఐడియాయే సిల్లీగా వుందన్నారు మరికొందరు. టవరింగ్ ఇన్‌ఫెర్నో, బియాండ్ ది పొసైడాన్ ఎడ్వెంచర్, ది స్వార్మ్, వాయేజ్ టు బాటమ్ ఆఫ్ ది సీ, ఫైవ్ వీక్స్ ఇన్ ఎ బెలూన్‌లకు దర్శకత్వం వహించిన ఇర్వింగ్ వాలెస్ ఈ చిత్ర దర్శకుడు. ఈ చిత్రానికి ఆధారం హెన్రిక్ వాన్‌లూన్ రాసిన పుస్తకం. చిత్రం నిండా కనబడే అతిథి పాత్రలలో హార్పోమార్క్సు న్యూటన్‌గా వేశాడు.



# ది మ్యాన్ హూ న్యూ టూమచ్

చెడ్డపని చెయ్యడం చాలా చెడ్డపని. దుష్కార్యంతో ప్రమేయానికి ఆస్కారం ఇవ్వడమే తప్పు. తప్పొప్పుల మాట ఎలా వున్నా ముందు అమాంతం మీదకు విరుచుకు పడేది ముప్పు.

అందువల్ల చెడును కనకు, అనకు, వినకు.

అనగనగా ఒక 'ఇస్తోకుపోడి' రాజు. పేరు మెకెన్నా. వైద్యుడు. భార్య జోసఫైన్. ఒకప్పుడు గాయనిగా ప్రసిద్ధి చెందింది. ఇంక 'పోడి' ఎనిమిదేళ్ల ఈడువాడు. పేరు హాంక్. ఒకసారి పారిస్‌లో వైద్యుల సభకు వెళ్ళిన డా. మెకెన్నా, కుటుంబంతో నాలుగు దేశాలూ చూసి, ఇల్లు చేరబోయాడు. ఫ్రెంచి మొరాకోలోని మరకేష్ నగరం చేరేసరికి, అక్కడ ఫ్రెంచి వర్తకుడినని చెప్పుకున్న బెర్నార్డ్ అనే ఆసామి పరిచితుడయ్యాడు. అతనే వాళ్లకి అక్కడ మంచి హోటల్ చూపించి వెళ్లాడు.

ఆ హోటల్లో బ్రిటిష్ దంపతులిద్దరితో స్నేహం కలిసింది. ఆయన పేరు డ్రేటన్, ఆవిడ పేరు బెట్సీ. మర్నాడు వారూ, వీరూ కలిసి ఊరు చూడబోయారు. అంతలోనే సంతలో సంచలనం రేగింది. వీపు మీద బాకు గుచ్చుకున్న ఒక మనిషి

తూలుతూ అతి ప్రయాసమీద డాక్టర్ మెకెన్నా దగ్గరకు వచ్చి కూలిపోయాడు. అతడు క్రితం రోజే పరిచితుడైన బెర్నార్డ్.

"లండన్‌లో త్వరలోనే ఒక గొప్ప రాజకీయ నాయకుడి హత్య జరగబోతోంది. వివరాలకి అంబ్రోజ్ చాపెల్....' అంటూ రహస్యం చెప్పి బెర్నార్డ్ చనిపోయాడు. ఇదంతా ఏమిటో అంతుపట్టక డా. మెకెన్నా ఆశ్చర్యపడ్డాడు.

పోలీసులు అనుమానపడ్డారు. మెకెన్నాను రాణాకు రమ్మన్నారు. "మీ అబ్బాయిని నా భార్య హోటల్‌కి తీసుకెళ్ళి ఆడిస్తుంది. మీకు నేను సాయం వస్తా పదండి" అన్నాడు కూడా వున్న బ్రిటిష్ మిత్రుడు డ్రేటన్

రాణాలో నానా గొడవా జరిగింది. అంతలో డా. మెకెన్నాను ఎవరో టెలిఫోన్‌లో పిలిచారు. "బెర్నార్డ్ చెప్పిన రహస్యంలో ఒక మాట అయినా సరే పోలీసులకు చెప్పావో నీ కొడుకు నీకు దక్కడు. వాడిప్పుడు మా బందీగా వున్నాడు. జాగ్రత్త" అని హెచ్చరించింది టెలిఫోన్ కంఠం.

మెకెన్నా కొయ్యబారిపోయాడు. ఇదో పెద్ద కుట్ర కాబోలు. ఇందులో తన కొడుకు తురుపు ముక్క!.... ఏమైనాసరే బెర్నార్డ్ చెప్పిన రహస్యం ఎవరికీ చెప్పరాదనుకొన్నాడు. భార్యకు కూడా చెప్పలేదు. బెదిరింపు విషయం మాత్రం డ్రేటన్‌కు చెప్పాడు. "నేను ముందు వెళ్ళి హోటల్లో చూస్తా. మీరు మెల్లిగా రండి" అంటూ డ్రేటన్ హడావుడిగా బయల్దేరాడు.


దర్శక, నిర్మాత హిచ్‌కాక్

మెకెన్నా దంపతులు హోటల్‌కు చేరేసరికి, డ్రేటన్ దంపతులు నలభై నిమిషాలకి ముందే హోటల్ ఖాళీచేసి వెళ్ళినట్టు తెలిసింది.

పిల్లడి విషయం తెలియగానే గొల్లుమంది జోసఫైన్. "ఇక్కడ ఏడ్చి లాభం లేదు. పోలీసులకి చెబితే మరీ ప్రమాదం. లండన్ వెళ్ళి వెతుకుదాంపద" అన్నాడు మెకెన్నా. రాత్రికి రాత్రి విమానంలో వెళ్ళారు. లండన్‌లో వారు పోలీసుల స్వాగతాన్ని అందుకోవలసి వచ్చింది. స్కాట్లాండ్ యార్డ్ సి. ఐ. డి. శాఖ అధికారి

మెకెన్నా దంపతులకు సంగతి వివరించాడు. మరాకేష్‌లో హత్య చేయబడ్డ బెర్నార్డ్ పోలీసు ఉద్యోగి. ఒక కుట్ర విషయమై ఆచూకీ తీయడానికి అక్కడికి వెళ్ళాడు.

చనిపోయిన బెర్నార్డ్ రహస్యం చెప్పినది డా. మెకెన్నాకి కాబట్టి, ఆ రహస్యం కుట్రకు సంబంధించి వుండాలి. అదేదో చెప్పమన్నాడు పోలీసు అధికారి. ఈసారి కూడా మెకెన్నాను టెలిఫోన్లో ఎవరో పిలిచి "చెప్పావంటే నీ బిడ్డడు దక్కడు" అని బెదిరించాడు.

అందుకని మెకెన్నా ఏమీ చెప్పలేదు. వెళ్ళిపోయి తన బిడ్డడిని తనే వెతకదలిచాడు. చనిపోయిన బెర్నార్డ్ "వివరాలకు ఆంబ్రోజ్ చాపెల్" అన్నాడు. అక్కడ కనుక్కుంటే సరి. కొంత అవస్థ పడ్డ తర్వాత ఆంబ్రోజ్ చాపెల్ కనబడింది. ప్రశాంతంగా వున్న వీధిలో ప్రశాంతంగా వున్న ఆ చర్చిలో ప్రశాంతతను ప్రదర్శిస్తూ డ్రేటన్ (మరాకేష్‌లో ఇతని కొడుకును అపహరించినవాడే) మతాచార్యుడి వేషంలో ప్రశాంతత గురించి ఉపన్యసిస్తున్నాడు. ఆ చాపెల్‌లో ఓ గదిలో దారుణ హత్యాకాండకు కుట్ర జరుగుతోంది. మరో గదిలో మెకెన్నా కొడుకు హాంక్ బందీగా వున్నాడు.

మెకెన్నా దంపతులు చర్చిలోకి వెళ్లగానే ఉపన్యసిస్తున్న డ్రేటన్, అతని భార్య బెట్సీ కనబడ్డారు. వెంటనే పోలీసులని టెలిఫోన్ చేసి పిలిపించమని డా. మెకెన్నా భార్యని బయటకు పంపాడు. ఇది గమనించిన డ్రేటన్ జనాలను పంపించి వేశాడు. తలుపు మూయించాడు. లోపలే వున్న మెకెన్నాకు స్పృహతప్పేలా కొట్టించాడు.

ఆ సాయంత్రమే కుట్ర అమలు జరగవలసి వుంది. ఆ సాయంత్రం లండన్‌లో ఒక పెద్ద గానసభ జరుగబోతుంది. ఒక దేశపు ప్రధానమంత్రి అధ్యక్షత వహిస్తారు. ఒక నిర్ణీతమైన పాట పాడాలి. ఆ పాటలో ఒక చరణం తరువాత, వాద్య బృందంలో "సింబాల్స్" (పెద్దకంచు తాళాలు) ఒక్కసారి మోగుతాయి. సరిగ్గా అదే క్షణంలో, ఆ చప్పుడులో కలిసిపోతూ ఒక రివాల్వర్ ప్రేలుతుంది. ప్రధానమంత్రి చనిపోవాలి. ఆ ప్రధానమంత్రిని ఏ దేశీయుడో ఆ దేశపు రాయబారే ఆ కుట్ర ఏర్పాటు చేయించాడు. ప్రధానమంత్రిని చంపవలసి వున్న కిరాయి హంతకుడిని ఆ సభా మందిరంలో వాటమైన చోట బాక్స్ రిజర్వ్ చేయించాడు. సింబాల్స్ మోగేది ఏ క్షణంలోనో ఆ హంతకుడికి తెలియడానికి, ఆ పాట స్వరాలు రాసి వున్న కాగితం ఒక అమ్మాయి చేతికిచ్చి హంతకుడికి పంపించారు.

భర్త పనుపున జోసఫైన్ ప్రయత్నాలు కలిసి రాలేదు. ఆమె సరాసరి ఆల్బర్ట్ మ్యూజిక్ హాల్‌కి వెళ్లింది. భర్త కనబడలేదు కాని మెరాకస్ హోటల్‌లో ఒకసారి కనబడ్డ వికృతమైన మొహం ఒకటి కనబడింది. వాడే హంతకుడన్నమాట. గానసభ ప్రారంభమైంది. జోసఫైన్ నిలిచివున్న చోట నుండి ప్రధానమంత్రి, ఆయనను చంపబోతున్న హంతకుడు కూడా కనబడుతున్నాడు. పోలీసులకి చెప్పేస్తే తన కొడుకుకి ముప్పు. అంతలో భర్త ఎలాగో తప్పించుకొని వచ్చాడు. రాగానే భర్తకి తన అనుమానం తెలియచెప్పింది ఆమె. మెకెన్నా మేడమీదకు పరుగెత్తాడు. ఈలోగా

హంతకుడు రివాల్వర్ గురి చూడడం గమనించి, ఏం తోచక కెవ్వున కేక పెట్టింది జోసఫైన్. హంతకుడి గురి తప్పింది. గుండు ప్రధాని జెబ్బను దూసుకుపోయింది. ప్రధాని జోసఫైన్‌ను అభినందించారు. అన్నీ బాగున్నాయి. కానీ తన కొడుకు ఎక్కడున్నాడో ఏమయ్యాడో...

కొడుకు హాంక్ రాయబారి కార్యాలయంలో బందీగా వున్నాడు. కుట్ర విఫలమైంది కాబట్టి, ఆ కుర్రణ్ని చంపడం అవసరమని ఆజ్ఞాపించాడు రాయబారి...

తన కొడుకు రాయబారి కార్యాలయంలోనే వుంటాడని డా. మెకెన్నాకి అనుమానం. కారణం లేకుండా పోలీసులు విదేశీ రాయబారుల ఇళ్లు సోదాచేయకూడదు. అందుకని తామే వెళ్ళి వెతక నిశ్చయించుకున్నారు మెకెన్నా దంపతులు.

ప్రధానమంత్రి రాయబారి కార్యాలయం విందులో పాల్గొంటున్నారు. జోసఫైన్ వెళ్ళగానే, సాధారణంగా మాట్లాడారు. రెండు పాటలు పాడుతానంది ఆమె. ఈలోగా భర్త ఆ భవనం అంతా వెతకడానికి వీలవుతుందని పథకం. జోసఫైన్ గొంతెత్తి పాడింది. "ఘటన ఎలా వుంటే అలా జరుగుతుంది" అని ఆ పాటకు అర్థం. ఘటన అనుకూలంగానే వుంది. అందుకని, మేడమీద గదిలో బందీగా వున్న ఆమె కుమారుడు 'హాంక్'కు ఆ పాట వినిపించింది. ఉత్సాహంతో ఆ పిల్లవాడు ఆ పాటను ఈలమీద ఆలపించాడు.

క్షణాల తేడాలో డా. మెకెన్నా కొడుకు వున్న గదిని కనుక్కొని తీసుకురాబోయాడు. కుట్ర మురా కిరాయి బొమ్మ, డ్రేటన్ కథని విషాదాంతం చేయడానికి రివాల్వర్ సహాయంతో చివరి ప్రయత్నం చేశాడు.

అయితేనేం,

"కే శారా, శారా" – ఘటన ఎలావుంటే అలా జరుగుతుంది. అందుకని దుర్మార్గుడు ఓడిపోయాడు. అమాయకుడు తన కొడుకును కాపాడుకున్నాడు.

ఈ కథను పారమౌంట్ పిక్చర్స్‌వారు విస్టోవిజన్ వర్ణచిత్రంగా నిర్మించారు. అత్యద్భుతంగా దర్శకత్వం వహించినది ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్. డా. మెకెన్నాగా జిమ్మీ స్టీవర్ట్, అతని భార్యగా డోరిస్ డే నటించారు.

(ఆంధ్ర-వారపత్రిక - **1956**)

21 ఏళ్లక్రితం లెస్లీ బ్యాంక్స్ హీరోగా తను నిర్మించిన సినిమానే ఈ సినిమాగా తీశాడు హిచ్‌కాక్. పేరు మారలేదు కానీ నిడివి మాత్రం 40 ని॥లు పెరిగింది. అయినా ఒరిజినల్ అంత బాగా లేదన్నారు విమర్శకులు. ఈ సినిమాలోని 'కేసెరా, కేసెరా' బాగా హిట్ అయింది. పాట పాడి కిడ్నాప్ అయినవారిని రక్షించుకునే సీను చాలా సినిమాల్లో కాపీ కొట్టారు. ఈ సినిమాపై స్పూఫ్‌గా బిల్ ముర్రే హీరోగా 'ది మాన్ హూ న్యూ టూ లిటిల్' అని 1997లో ఓ సినిమా తయారయి విజయవంతమైంది.

# ఎ కింగ్ ఇన్ న్యూయార్క్

ఈ చిత్రం ప్రేక్షకులను ఆనందంతో, సానుభూతితో, అభిమానంతో కంట నీరు తిరిగే పర్యంతం నవ్వించి నవ్వించి వదిలిపెట్టింది. అంతకు ఏడాది క్రితం చాప్లిన్ ఈ చిత్రం ప్రారంభించినప్పుడు దాన్ని గురించి విలేకరులతో మాట్లాడుతూ "మొదట్నుంచి చివరిదాకా ఆ చిత్రం ప్రేక్షకులను పొట్టచెక్కలయేలా నవ్విస్తుంది" అని హెచ్చరించాడు. అంత పనీ చేసి చూపాడు. కథ, సంగీతం, దర్శకత్వం, ముఖ్య భూమిక కూడా తానే నిర్వహించాడు.

యూరప్‌లోని ఒకానొక చిన్న దేశంలో రాజ్యభ్రష్టుడైన షాడోవ్ విమానం ఎక్కి సరాసరి, అనాథ రాజశరణాలయం అమెరికా దేశానికి పారిపోతాడు. అణుశక్తిని శాంతి ప్రయోజనాలకు వినియోగించే ఒక పథకం ముసాయిదాలు, ఖజానాలో కాస్త డబ్బూ వెంట పట్టుకుని.

న్యూయార్క్‌లో దిగగానే అక్కడి తన రాయబారి, తన ప్రధానమంత్రి కలుసుకుంటారు. అంతలో పత్రికా విలేకరులు ఈ మాజీ రాజును చుట్టుముడతారు.

"రాజుగారు ఇప్పుడే ఓ పెద్ద విప్లవంలోంచి బయటపడ్డాడు. అందుచేత ప్రశ్నలతో అట్టే వేధించకండి" అని మంత్రి చెపుతాడు. విలేఖరులు కూడా అట్టే అడగరు. 'ఖజానాలో డబ్బు తెచ్చారటగా?' అంటారు ముందు. 'అవన్నీ సొంత విషయాలు' అంటాడు షాడోవ్ ప్రభువు (చాప్లిన్) ముసిముసి నవ్వులు నవ్వుతూ. ఆ తరువాత చిల్లర ప్రశ్నలకు జవాబిస్తూ అణుశక్తిని శాంతికి వినియోగించే పథకం ఒకటి అమలు జరుపబోయి ఇలా దెబ్బతిన్నట్టు షాడోవ్ వివరిస్తాడు. గోష్ఠి తరువాత, విమానాశ్రయాధికారులు షాడోవ్ వేలిముద్రలు తీసుకుంటారు (ఇది అక్కడి కట్టుదిట్టాలలో ఒకటి) ఆ ముద్రలు వేస్తున్న ముహూర్తానే, అమెరికా ఆదరణ, ఔదార్యం, స్వేచ్ఛా స్వాతంత్రాలు తనను ఎంత ముగ్ధుణ్ని చేశాయో చెబుతాడు షాడోవ్ గంభీరంగా.

ఆనక ఆ రాజూ, రాయబారీ న్యూయార్క్ నగర సౌందర్యాన్ని చూడబోతారు. కాని వీధులలో రొదలో, గోలలో ఒకళ్ళ మాట ఒకళ్ళకు వినబడదు. పదిలక్షల డాలర్ల మాట స్మరిస్తే కంటనీరు గిరుక్కున తిరుగుతుందని ఎవడో గాయకుడు సంగీత పద్ధతిలో ఘోషిస్తూ వుంటాడు. చెవులు చిల్లులు పడే ఆ ఘోషకి తట్టుకోలేక, సినిమాలో స్థిమితంగా మాట్లాడుకోవచ్చుననుకుని ఒక సినిమాకి వెళ్తారు. అక్కడ రాక్ అండ్ రోల్ డాన్సర్లతో (ప్రేక్షకులే) నానా గోలగానూ వుంటుంది. తరువాత ఆట మొదలవుతుంది.

"రాబోయే ఆకర్షణలు" అని కొత్త చిత్రాల ట్రెయిలర్లు చూపిస్తారు. ఒకడు తుపాకి పట్టుకువస్తాడు. వీడు హంతకుడు, బరితెగించినవాడు. 'కుటుంబ సమేతంగా

వచ్చి చూసి ఆనందించుడు' అని దానిమీద రాత అలాంటివే మరి నాలుగు శాంపిల్స్ చూసి భరించలేక రాజుగారు ఇవతలికి వచ్చేస్తారు. అక్కడ ఉత్సాహంతో నృత్యం చేస్తున్నారు జనం. గోల తప్పలేదు. ఎవడికో ఉత్సాహం కాస్త ఎక్కువై, రాజుగారి నెత్తిన ఓ దెబ్బ వేస్తాడు. ప్రధానామాత్యుడు ఖజానా డబ్బు కాస్తా పట్టుకు పరారైపోయినట్టు తెలుస్తుంది. అంతలో ఇంకేముంది, రాజ్యభ్రష్టుడైన రాజు దివాలా కూడా తీశాడు. అప్పులు ముప్పులుగా తయారవుతాయి.

ఎటూ పాలుపోని పరిస్థితిలో, షాడోవ్, ఒక చిట్టితల్లిని చూసి ముచ్చటపడి, ఆమెతో విందారగించబోతాడు. అక్కడ హామ్లెట్‌లో రెండు పద్యాలు చదివి, చూడముచ్చటగా సిగ్గుపడతాడు రాజాగారు. గోడల వెనుక దాగివున్న టెలివిజన్ కెమెరాల పుణ్యమా అని ఈ సన్నివేశాన్ని దేశంలో అంతా చూస్తారు. తక్షణం బిస్కట్లు, జున్ను, జుట్టు గ(ట్రా అమ్మే కంపెనీల వాళ్ళంతా ప్రచార కార్యక్రమంలో పాల్గొనమని, బోలెడు డబ్బిస్తామని రాజుగారి బలవంతపెడతారు.

అప్పుల బాధ ఎక్కువైనందువల్ల ఇష్టం లేకపోయినా తప్పనిసరిగా ఒప్పుకుంటాడు షాడోవ్. ఫలనా (మాజీ) రాజుగారు ఫలానా జున్నో, జీన్నో బాగుందంటే ఎంత గొప్ప! తరువాత ఇంకో ముందు ప్రచారం కోసం, ప్లాస్టిక్ సర్జరీ చేయించుకుని నవయౌవనుడి ముఖాన్ని ఏర్పాటుచేయించుకుంటాడు. ఆ ముందు పుచ్చుకుంటే, ఇంత బలం వస్తుందని భావం....

తరువాత 'అన్ అమెరికన్'లుగా ముద్రపడ్డ దంపతుల బిడ్డడు ఒకడు దిక్కులేక అల్లాడుతుంటే ఈ రాజు కూడా 'కమ్యూనిస్టు' అన్న ఆరోపణపై చిక్కుల్లో పడతాడు. అతన్ని విచారించబోయిన వాళ్లమీద నీళ్ళపంపుతో నీళ్లు చిమ్మి, వ్యవహారం అంతా నానా గందరగోళంగా, అవకతవకగా తయారుచేస్తాడు. చివరికి నిర్దోషి అనిపించుకుని బయటపడతాడు ఆనక దిగులుగా యూరప్ ప్రయాణం కడతాడు. ఇదీ కథ.

ఒక దేశంలో ప్రజల జీవన విధానాలను, ఒక వ్యవస్థ తీరుతెన్నులను దుయ్యబడుతూ చాప్లిన్ చిత్రం నిర్మించడం ఇది రెండోసారి అని, ముఖ్యంగా ఈ చిత్రం చివరి భాగంలో విమర్శ మరీ బట్టబయలుగా వున్నందువల్ల, ఆ భాగం చాప్లిన్ ప్రతిభకు, స్థాయికీ తగ్గట్టు లేదనిపించిందని లండన్ విమర్శకులు పేర్కొన్నారు.

ఎ కింగ్ ఇన్ న్యూయార్క్ (1957) నిడివి 105 ని.లు డైరెక్టర్: చార్లీచాప్లిన్. తారాగణం: చార్లీచాప్లిన్, డాన్ ఏడమ్స్, మైకేల్ చాప్లిన్

రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికాలో సాగిన కమ్యూనిస్టుల వేట. ప్రతివారినీ అనుమానించడం, మెక్‌కార్థిజమ్‌లను విమర్శిస్తూ తీసిన ఈ చిత్రం 1973 వరకు అమెరికాలో విడుదలకు నోచుకోలేదు. అదీ అమెరికా ప్రజాస్వామ్య ప్రియత్వం! చాప్లిన్ అభిమానులకు ఈ సినిమా నిరాశ కలిగించింది. కొన్ని ఘట్టాలు బాగున్నా, మొత్తంమీద కేంద్రాంశం లేదనిపించింది. చాప్లిన్ కుమారుడు మైకేల్ చక్కని నటనను ప్రదర్శించాడు.

# ది క్రేన్స్ ఆర్ ఫ్లయింగ్



యుద్ధంలోంచి పుట్టుకొచ్చే వాటిలో సంక్షోభం, విధ్వంసం, నైతిక పతనం, కరువు రావడం, ధరలు పెరగడంవంటి చిన్న 'వ్యవస్థ'లే కాక ఇంటర్వెల్‌లో శాంతి, దానిమీద లావుపాటి పుస్తకాలూ, పొడుగుపాటి ఉపన్యాసాలూ కూడా చెప్పుకోవలసినవే.

విడో మారేజెస్ రూపేణా నాగరికతను సజీవంగా వుంచుకోవడానికి బాల్య వివాహాలు చాలా అవసరమన్న గిరీశం సూత్రాన్నే సీమదొరలూ వాళ్ళూ తెలిసో తెలీకో యుద్ధానికి పట్టించి, నిరంతరం శాంతి సాధిస్తూ జీవకోటిలో మానవుడి గొప్పతనాన్ని జ్ఞాపకం చేసుకుంటూ వుండడానికిగా నిరంతరం యుద్ధం సాగుతూ వుండాల్సిందేనని తీర్మానించుకున్నారు.

ఈవిధంగా అందరూ తప్పట్టే ఈ యుద్ధంలోంచి అణ్వస్త్రాలూ, అష్టకష్టాలూ, అబద్ధాలూ మొదలైన వాటితోపాటు కళాఖండాలు కూడా ఆవిర్భవించాయి. ఉత్తమ శ్రేణి కథలు, కావ్యాలు, నాటకాలూ, హాలీవుడ్ నుంచి మంచి సినిమాలు వచ్చాయి.

సినిమాలు ఇతర దేశాల నుంచి కూడా వచ్చాయి. వచ్చిన వాటిలో కొన్ని చాలా గొప్పవి.

కొన్ని యుద్ధం విశ్వరూపాన్ని చూపించబోయాయి. కొన్ని అందులో ఒక భాగాన్ని, ఒకరిద్దరి జీవితాన్ని క్లోజప్‌లో చూపించి కోటి పెట్టి గుణించుకోమన్నాయి. కొన్ని యుద్ధాలవల్ల ఫలానా పిక్చర్‌లో హీరో హీరోయిన్ పన్నెండు రేళ్ళపాటు వేరై పోవలసివచ్చిందని మాత్రం చెప్పగలిగాయి. మరి కొన్ని భయపడి, భయపెట్టాయి. ఎన్ని అవాంతరాలు వచ్చినా జీవితం సాగిపోతూనే వుంటుందని, కృతాన్ని వదిలి రేపు వేపు చూపు సారించి జీవితాన్ని బాగుచేసుకోవాలని వ్యక్తులకు ధైర్యం చెబుతుంది 'క్రేన్స్ ఆర్ ఫ్లయింగ్' అనే సోవియట్ చిత్రం.

ఇది యుద్ధం కారణాలు వెదకదు. ఎవర్నీ కోప్పడదు. కాని యుద్ధం ఎంత ఘోరమైనదో ప్రతివాడికి గుండె ఝల్లుమనేలా చెబుతుంది. వెరోనికా అనే అమ్మాయీ, బోరిస్ అనే అబ్బాయీ యౌవనోత్సాహానికీ, ప్రేమకూ టీకాతాత్పర్యాల మల్లే కులాసాగా తిరుగుతూ రేపోమాపో పెళ్ళి చేసుకుందామనుకుంటారు. అంతలో యుద్ధం వచ్చి బోరిస్‌ను ఎత్తుకుపోతుంది. అలాగ ఎందరో భర్తలను, తండ్రులను, కుమారులనూ ఎత్తుకుపోతుంది. తెలిసి తెలిసి వారందరినీ యుద్ధ రంగానికి సాగనంపుతున్న తల్లుల, భార్యల, పిల్లల శోకసముద్రంలో ఈ అమ్మాయి ఒక్క కన్నీటి చుక్క కూడా వుంది.

ఆ తడి ఆరేలోగానే, విమానాల దాడిలో ఆ పిల్ల తల్లిదండ్రులు మరణిస్తారు. బోరిస్ తల్లిదండ్రులు ఆమెకు ఆశ్రయం ఇస్తారు. బోరిస్ సోదరుడు మార్క్, వెరోనికాను ప్రేమించి, పెళ్ళి చేసుకుంటానంటాడు. బాంబుల వర్షంతో భువీ దివీ దద్దరిల్లిపోతున్నవేళ నీతీ నాతీ వేరవుతున్నవేళ వెరోనికా అతనికి లొంగిపోతుంది. తరువాత తప్పనిసరిగా పెళ్ళి చేసుకుంటుంది. అయినా ఆమె కన్నీటిబొట్టు ఆరదు. బోరిస్ మీద ప్రేమ, భర్త మీద ద్వేషం కూడా పెరుగుతాయి.

చివరికో రోజున యుద్ధం ముగిసి. హతశేషులు ఆలుబిడ్డలను కలుసుకోగల సుముహూర్తం వస్తుంది. వెరోనికా స్టేషన్‌కు వెళ్ళి, రైలు దిగిన సైనికానీకాలలో ప్రియుడికై వెదుకుతుంది. అతడు పోయాడన్న వార్త అంతకుముందే విన్నాకూడా....

"ఎందరో 'వెరోనికా'లకు తమ 'బోరిస్'లు తిరిగి దొరికినందుకు వాళ్ళని అభినందించు. ఒక వెరోనికా కోసం దిగులుపడకు" అంటాడు ఒక సైనికుడు.

వెరోనికా, తన ప్రియుడికోసం తెచ్చిన పూలను అందరికీ పంచిపెట్టి స్టేషన్‌లోంచి మళ్ళీ మెల్లిగా జీవితంలోకి వెళ్ళిపోతుంది. జీవితం యథాప్రకారం సాగిపోతూనే వుంటుంది.

యుద్ధం పూర్తయిన కొంతకాలానికి, పదిహేనేళ్ళ దూరం నుంచి చూసీ 1957లో తీసిన ఈ చిత్రం యుద్ధం భీకర స్వరూపాన్ని, అందువల్ల అప్పట్లో ప్రబలంగా ఏర్పడి నేటికీ రూపాంతరంలో రణశేషంగా మిగిలిన నిరాశా



నిస్పృహలను ఒకేసారి ఖండించిన ఈ చిత్రం సాధారణ చిత్రాలలో అరుదైన నిండుతనాన్నీ, సర్వదేశాలవారి ప్రశంసలనూ, కేన్స్ అంతర్జాతీయ చలనచిత్రోత్సవంలో ప్రథమ బహుమతిని సంపాదించుకుంది.

చలనచిత్రోత్సవంలో బహుమతికి కారణాలు - కథా, ఊహా మంచివి కావడం మాత్రమే కావు. దర్శకుడు, ఛాయాగ్రాహకుడు ఈ కథను ఆవిష్కరించడంలో, చిత్రకళకు గల శక్తిని, అవధులను దాటి ఉత్తమ శిల్పాన్ని ప్రదర్శించారు. దాన్ని ప్రయోగించడంలో వుండవలసిన నిగ్రహాన్ని పాటించారు. అది ఎబ్బెట్టుగా తోచకుండా చాకచక్యంగా ఉపయోగించుకున్నారు.

*(ఆంధ్ర-వారపత్రిక - 1958)*

# బైసికిల్ తీవ్స్



కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా కూడా కవిత కనర్హం కానట్లే, మానవుడి దైనందనీయంలో ప్రతి సన్నివేశం ప్రతి చిన్నఘట్టం మానవ హృదయ దర్శనానికి నిరంతరం కృషి చేసే చలనచిత్రాలకు మంచి వస్తువులే అవుతాయి. దుకాణం మీదికి వెళ్ళి ఒక చెప్పుల జత కొనుక్కోవడం, ఒక వీశ పాత కాగితాలు అమ్ముకురావడం, అమ్మక రావడం, రాకపోవడం, ఇవన్నీ శ్రద్ధగా చూస్తే ఒక్కొక్కటి ఒక్కొక్క మనోహరమైన కథను ఆవిష్కరిస్తుంది. మామూలు మనిషి జీవిత రేఖమీదికి ఆనాడు వచ్చి కలిసి, విడిపోయిన ఇతర జీవితరేఖలతో ఒక అందమైన మోస్తరు కనిపిస్తుంది. ఒక జీవిత సత్యాన్ని చెబుతుంది. ఒక మనిషికి అర్థం చెబుతుంది. ఐతే అది చూడాలన్న ఆసక్తి, చూడగల శక్తి కావాలి.

అలా చూడగలవాళ్ళు తీసే చిత్రాలకూ, మిగతా వాటికి చెట్ల మీద చిలకకీ, పంజరంలో చిలకలకీ వుండేటంత తేడా వుంటుంది. అడవి చిలకను అడవిలోనే చూపడం, ఇటలీలో 'బైసికిల్ తీవ్స్' చిత్రంతో ఆరంభమైన నవ్యవాస్తవిక దృక్పథ పథం.

మామూలు మనిషిని మామూలు జీవితంలో మామూలు సన్నివేశాలలో చూపించడమే మా మతం అంటారు బైసికల్ తీవ్స్ దర్శకుడు విట్టోరియా డీసికా, ఆయన సన్నిహిత మిత్రుడు, సహవాసి, సుప్రసిద్ధ రచయిత అయిన సీజర్ జవాటినీ. ఇందుకు భిన్నంగా 'జీవితం విడిచి సాము' చేసి కృత్రిమ రసాలను ఉత్పాదన చేసి డబ్బు చేసుకో చూసే వైఖరిని వీరు గర్హిస్తారు. ఈ కృత్రిమ జీవితం చూపే చిత్రాల బారినుంచి ప్రేక్షక బాహుళ్యాన్ని కాపాడాలని వీరి మతం. జాలి పడడానికి, కోప్పడడానికి, ఆనందం అనుభవించడానికి, నవ్వడానికి ఏడవడానికి మన చుట్టూరా బోలెడంత నిజమైన జీవితంగా వుండగా,· అబద్ధం, అసహజం, కృత్రిమం అయిన సృష్టి ఎందుకు అని – ఈ వాదం తాత్పర్యం.

సరిగా ఇందుకే డీసికా భావాలను, అవి ప్రాతిపదికగా ఆయన తీసిన చిత్రాలను కొందరు విమర్శించారు. వాస్తవికత బాగానే వుంటుందిగాని, చాలా దిగులు కలిగిస్తుందని జీవితంలో ఆశాభావాన్ని, ఉత్సాహాన్ని చల్లార్చేస్తుందని వీరు

కొన్నాళ్ళు అని, దరిమిలా మానేశారు. అవి దిగులు కలిగించడం నిజమే అయినా కలిగించక పోవడం వంచన అవుతుంది. డీసికా చిత్రాలు మానవులలో పరస్పరం 'స్నేహం' వర్ధిల్లడానికి దోహదం చేస్తాయి.



బేబీ నుంచి ఖూనీకోరు దాకా అందరిలోనూ సృష్ట్యాది నుంచి ఒక మూల వెలుగుతుండే మంచితనం అనే మహత్తర సంస్కారం నేటికి వుందని ధైర్యం చెబుతాయి. మానవత్వం ఉత్కృష్టతను చాటుతాయి. చీకట్లో కూర్చుని సినిమా చూస్తున్నంతసేపు అందరూ జాలి పడగలరు. తెరమీది సాటి మానవుడిని ప్రేమిస్తారు. వాడి కోసం బాధపడతారు. సినిమాలోంచి జీవితంలోనికి వచ్చాక అవి మళ్ళీ సర్దుకుంటాయి - జీవితం వివిధ శక్తుల వత్తిడి వల్ల. అలా కాక ఇవతలికి వచ్చాక కూడా అవతలివాడి కష్టసుఖాల గురించి ఆలోచించి జాలిపడడానికి శక్తిని ఇస్తాయి డీసికా చిత్రాలు.

'బైసికిల్ తీవ్స్' చిత్రం ఆ తరువాత ఆయన తీసిన మరొక మహత్తర చిత్రం 'అంబర్టో - డి' సమకాలిక సమాజంలో సామాన్యుడి నిస్సహాయతను హృదయ విదారకంగా ఘోషిస్తాయి. చివర్ని నీతిగీతి లేదు. భవిష్యత్తు మీద నిండు చంద్రుణ్ణి వెలిగించి ఓదార్చడం లేదు. అయితే ఇవి, మానవుడిలో మృగ్యం అయిపోతుందనిపించే స్నేహధర్మాన్ని మంచితనాన్ని పునరుద్ఘాటిస్తాయి. నిజమైన సానుభూతిని, ప్రేమను ప్రేక్షకునిలో రేకెత్తిస్తాయి.

ప్రపంచ సంగ్రామంవల్ల వచ్చిన సంక్షోభంలో జీవనసంగ్రామ క్షోభ ఎంత భీకరతరమైనదీ ఈ చిత్రం చెబుతుంది. సామాన్యుడు ఎలా నలిగిపోతున్నదీ చూపిస్తుంది. ఇందులో సామాన్యుడు యుద్ధానంతరం తిరిగి చితికిపోయిన ఇటలీలో నిరుద్యోగి. అతనికి వాల్ పోస్టర్లు అంటించే పని దొరుకుతుంది - సైకిల్ వుండే పక్షంలో. నానాతంటాలు పడి తాకట్టులో వున్న పాత సైకిలును తెచ్చుకొని ఉద్యోగం సంపాదిస్తాడు. ఆ స్థితిలో తలమాసిన మరొక మనిషి ఇతగాడి సైకిల్‌ను తన అవసరం కొద్దీ చూస్తూ వుండగా ఎత్తుకు పారిపోతాడు. ఇతడి ఉద్యోగం పోతుంది. సైకిల్ దొరక్కపోతే అది దక్కే అశలేదు. ఇదీ కథా వస్తువు. ఆ మనిషి జీవనోపాధికి చిహ్నం ప్రాణం అయిన ఆ సైకిల్ అతని ప్రపంచంలో విశ్వరూపం ధరిస్తుంది.

అతను ఆశపడడం, బాధపడడం, చిరాకు, పరాకు, ఉచ్ఛ్వాస నిశ్వాస అన్నీ సైకిలే. సైకిలు వుండడం అతని ఆనందానికి పరమావధి ఇవన్నీ మనకు తెరమీద కనిపిస్తాయి యాదాలాపంగా.



చివరికి సూటిగా వుంటూ సూటిగా వుండదలచుకున్న ఆ మనిషి చూసి చూసి తెగించి ఒక సైకిలు దొంగిలించివేస్తాడు, దొరికిపోతాడు. నలుగురూ చివాట్లేసి తన్నబోతారు. పోలీసులకు అప్పగించబోతారు. 'నాన్నా నాన్నా' అని ఏడుస్తున్న చిన్నపిల్లడి మొహం చూసి, సైకిలు యజమాని ఈ 'దొంగ' మీద దయతలచి పొమ్మంటాడు. ఇంకెప్పుడూ ఇలాంటి పనులు చెయ్యక అని, మనం చిన్న చిన్న దొంగల్ని కోప్పడ్డట్టే అంటాడు.


డిసికా

తారాగణం: లేంబర్టో మేగియోరనీ, లయొనెల్లా కారెల్, ఎంజో స్టేయోలా, ఎలీనా ఏల్టియరీ సత్యజిత్ రాయ్‌ను చిత్రనిర్మాణానికి ప్రేరేపించిన ఈ చిత్రం 1949 ఆస్కార్ ప్రత్యేక బహుమతిని గెలుచుకున్నది. ఈ ఇటాలియన్ దర్శకుని ఇతర చిత్రాలు 'ఇన్‌డెస్‌క్రిషన్ ఆఫ్ ఏన్ అమెరికన్ వైఫ్' (1954), 'అంబర్టో డి' (1955), 'బొకాషియా 70' (ఫెడిరికో ఫెలినీ, లూషినో, వికాంటీలతో కలిసి) (1962), 'ఆఫ్టర్ ది ఫాక్స్' (1966), ఫాసిస్ట్ ఇటలీలో యూదు కుటుంబం అవస్థల గురించి తీసిన 'ది గార్డెన్ ఆఫ్ ది ఫింజి కాంటినిస్' (1971)

సామాన్య మానవుడూ, వాడిని తన పాలిట హీరోగా – ఒక్క క్షణం సేపు దొంగగా చూసుకునే కొడుకూ బజారులోని శతసహస్ర సామాన్య మానవులలో కలిసిపోతారు. చివరికి మనకు వాళ్లమీద ఎంతో జాలివేస్తుంది. ఉద్యోగం ఇప్పించాలన్న ఉత్సాహం ఉరకలు వెయ్యకపోయినా దొరికితే బావుణ్ణు అనిపిస్తుంది. పతనుడు అయిన మనిషి మళ్ళీ మాములుగా కనబడ్డందుకు తృప్తి కలుగుతుంది. అతని జీవితంలో – అతనిలాంటి శతకోటి జనుల జీవితాలలో విలన్ అయిన వర్తమాన పరిస్థితుల మీద, వాటిని సృష్టించిన వ్యవస్థమీద చెప్పరాని కోపం

కలుగుతుంది. అతను చేసింది నేరమైనా, అతను దోషిమటుకు కాజాలడని, అతణ్ణి అంత నిస్సహాయుణ్ణి చేసిన పరిస్థితులు వైదొలగితే అతను మామూలుగా మంచివాడుగానే వుండేవాడని మనకు నమ్మకం కలుగుతుంది. ఈ విశ్వాసమే, అభిశప్తమైన ఈ యుగానికి క్రౌర్యం నుంచి దైన్యం నుంచి విముక్తి కలిగించగల శక్తి.

దర్శకుడు డీసికా ఈ కథ ఎంత అందంగా సహజంగా, నిజంగా వుందో అంత నిజంగాను, సూటిగాను చిత్రాన్ని తీశారు. దీనికి ఆయన కొత్త నటులనే తీసుకున్నారు. జీవిత రంగంమీదనే ఆర్భాటం లేకుండా చిత్రం తీశారు. ఇందులో మనకి కనిపించే మిగతా మనుషులూ, వస్తువులూ అన్నీ సైకిలు దొంగ జీవన రేఖను స్పృశించి, ఒక మోస్తరును స్ఫురింపచేసే రేఖోపరేఖలే. డీసికా, రచయిత, కామెరా, ప్రేక్షకులూ అందరికీ ఒకటే గమ్యస్థానం. డీసికా శిల్పంలో విశిష్టత ఆడంబరం, ఆర్భాటం లేకుండా కథ జీవితంలాగే యాదాలాపంగా సాగిపోవడం. ఈ అందమైన చిత్రానికి చట్రం అనేది మనం ఊహించుకోవాలే తప్ప డీసికా కట్టలేదు.

*(ఆంధ్ర-వారపత్రిక - 1958)*



# ది ఓల్డ్‌మాన్ అండ్ ది సీ

చచ్చినాసరే మనిషి ఓడిపోవడం మాత్రం జరగదన్న మహావాక్యాన్ని, సార్వకాలికమైనదాన్ని స్థాపించిన హెమింగ్‌వే నోబెల్ బహుమతి కథ "ది ఓల్డ్‌మాన్ అండ్ ది సీ" చలన చిత్రానువాదంలో - స్పెన్సర్ ట్రేసీ నటించాడు. సంగీత దర్శకుడు డిమిత్రీ (హైనూన్, తర్డ్‌మాన్) టీయోంకిన్ వ్యాఖ్యానించాడు. దర్శకుడు జాన్‌స్టర్జెన్ దృశ్యాలు నిర్మించాడు.

సినిమా అన్న మాటకి చెలామణీలో వున్న అర్థాన్ని బట్టి కొన్ని చలనచిత్రాలను ఆ పేరుతో పిలుచుకోవడం మంచిదికాదు. 'ఓల్డ్‌మాన్ అండ్ ది సీ' సినిమా కాదు; హెమింగ్ వే చిన్న మాటల, చిన్న వాక్యాల కావ్యానువాదం. ఒక్క భావానికి రూపకల్పన. అందువల్ల దర్శకుడు దీనిని కథా ప్రకారంగానే ఆవిష్కరించారు. మనం కథ చదువుతున్నపుడు చక్షురక్షర సంయోగంలోంచి పుట్టే బొమ్మలనే వరసగా పేర్చుకువచ్చారు. ఆరంభంలో పది నిమిషాలుసేపు క్యూబన్ పల్లెటూరిలో తెల్లవారుఝాము దృశ్యాలను ఘనీభవించిన సౌందర్యంలా చూపించారు. ఆ తరువాతదంతా సముద్రంలో పడవలో జాలరిలో కిటకిటలాడుతున్న ఆత్మవిశ్వాసం, విజయకాంక్షాను.



కథారచయిత ఎర్‌నెస్ట్ హెమింగ్వే

అతను వయసుమీద ఉన్నపుడు గట్టివాడని అందరికీ తెలుసు. ఇపుడు వయసు అతని మీద పడడంతో అతనిమీద అతనికీ, ఇంకో చిన్న కుర్రాడికీ తప్ప మిగతా వాళ్ళకి గురిలేదు. ఎలాగేనా ఓ పెద్దచేపని పట్టి తేవాలని బయల్దేరాడు. అతని ఎరకి


దర్శకుడు జాన్ స్టర్జెస్

ఒక పెద్దచేప పడింది. కాని దానికీ బోలెడంత ఆత్మవిశ్వాసం, మొండితనం, బతకాలన్న ఆశాను. అందుకని అది 'పైకి తేలకుండా' గుట్టుగా గుంభనగా సముద్రం అడుగున ఉంటూనే సమరం సాగించింది. అతను దానివెంట అలాగే మొండిగా మూడు రాత్రింబవళ్లలోకి, సముద్రం మీద చాలాదూరంలోకి చొచ్చుకు వెళ్ళిపోయాడు. ఎవరుచేప? ఎవరు ఎర? అన్న ప్రమాదంలో మునిగే పర్యంతం వెళ్లాడు. చివరకి చేప ప్రాణం ఒడ్డి ఓడిపోయినా చచ్చి సాధించబోయింది. తిరుగు ప్రయాణంలో, అదే సొరచేపల నాకర్షించిన ఎరచేపగా తయారైంది. ముసలిజాలరి, తన విజయఫలాన్ని సొరచేపలు కబళిస్తూ వుండగా, కడంటిన ప్రాణాన్ని ఆశను కూడదీసుకుని కాళ్లా చేతులా పెద్ద సొరచేపల మందతో పోరాడి వాటిని తరుమగొట్టాడు. చివరికి మిగిలింది అతని విజయం తాలూకు అస్థిపంజరమే అయినా మొత్తానికి అది విజయమే. ముసలివాడిలో శక్తి సామర్థ్యాలను చూపి మిగతావారిని సంభ్రమ చకితులను చేసిన విజయమే.




సముద్రంలో మూడురోజులు పోరాడి, మానవుడికి పరాజయంలేదని ధైర్యం చెప్పే మహావాక్యాన్ని, గట్టున తెచ్చి పడేసిన ఘనత అతనికే దక్కింది.

కాని, ఆ ముక్క అతనికే దక్కింది.

కాని, ఆ ముక్క అతనే చెప్పుకోవడం ఏమంత అద్భుతంగా ఉండదు. పలకని స్వరంలా, అర్థోక్తిలా, ధ్వనిలా ఎదటివాడిలో

రావలసిన ఊహ వచ్చేవిధంగా విషయాన్ని చెప్పడం కళాత్మకమైన శిల్పం లక్షణం. ట్రేసీ ఎంతబాగా నటించినా, స్టర్జెస్ ఎంత జాగ్రత్తగా చిత్రించినా ఆ భావం మనలో కలగదన్న భయం చేతనో, ట్రేసీ ఎరతాడు బిగలాగే హడావుడిలో ఉన్నపుడూ, విశ్రాంతి తీసుకున్నపుడూ అతని కథను నేపథ్యంలో నుంచి మనకి వివరిస్తూ వచ్చిన ఆసామి కాల్షీటు యివ్వకనో, దర్శకుడే "మానవుడు మరణించవచ్చుగాక, పరాజయం మాత్రం పొందడు" అనే నీతిమాటలని, ఈ కథకు ముడి సరుకే తప్ప 'ఆలోచన' ఏమాత్రం కాని జాలరి నోటినే అనిపించేశాడు. దారుణం!

*(ఆంధ్ర-వారపత్రిక - 1959)*

# ముళ్ళపూడి వెంకటరమణ సాహితీ సర్వస్వం

| | రూ. |
|---|---|
| **మొదటి సంపుటం: కథారమణీయం-I** | 150/- |
| సీతాకళ్యాణం, ఇద్దరమ్మాయిలూ-ముగ్గురబ్బాయిలూ, భగ్నవీణలూ-భాష్పకణాలూ, జనతా ఎక్స్‌ప్రెస్, సన్యాభంగం, రాజకీయ బేతాళ పంచవింశతి - ఇతర కథలు. | |
| **రెండవ సంపుటం: కథారమణీయం-II** | 150/- |
| కానుక, రాధాగోపాలం, లహరి, ఏకలవ్యుడు, ఋణానందలహరి, ఆకలీ-ఆనందరావు, జలప్రళయం, కృతజ్ఞత, సాక్షి, విమానం కథ - ఇతర కథలు. | |
| **మూడవ సంపుటం: బాలరమణీయం - బుడుగు** | 80/- |
| **నాల్గవ సంపుటం: కదంబరమణీయం-I** | 150/- |
| నవ్వితే నవ్వండి, పీఠికలు, వ్యాసాలూ, ఇతర రచనలు. | |
| **ఐదవ సంపుటం: కదంబ రమణీయం-II** | 150/- |
| గిరీశం లెక్చర్లు, శ్రీకృష్ణలీలలు, వ్యాసాలు, ఇతర రచనలు. | |
| **ఆరవ సంపుటం: సినీ రమణీయం-I** | 150/- |
| విక్రమార్కుని మార్కు సింహాసనం కథలు, చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు, స్వదేశీ-విదేశీ చిత్రాలు సమీక్షలు. | |
| **ఏడవ సంపుటం: సినీరమణీయం-II** | 150/- |
| కథానాయకుని కథ (అక్కినేని నాగేశ్వరరావు జీవితచరిత్ర), చలనచిత్ర ప్రముఖులపై వ్యాసాలు. | |

## త్వరలో...

**ఎనిమిదవ సంపుటం: అనువాదరమణీయం**

ఎనభై రోజుల్లో భూప్రదక్షిణం, పిటి 109.

# విక్రమార్కుని మార్కు సింహాసనం కథలు




సాగుతున్న చిత్రంలాగే చూడవచ్చిన జనం కూడా జోగుతున్నారు. గాలి విసురుకు సినిమా డేరా, అందులో తెరాకూడా ఊగుతున్నాయి.

తెరమీద మాళవరాజుకుమారుడు వేట కెళ్ళి విల్లెక్కుపెట్టి బాణం వేశాడు. అది సూటిగా అమెరికావెళ్ళి అక్కడి అడవిలోని పులికి తగిలేసరికి ఆ దెబ్బకి ఆఫ్రికాలోని సింహం భయంకరంగా గర్జించింది. దాంతో ఆ చుట్టుపక్కల జింకలూ, జిరాఫీలూ, ఇండియాలోని కుందేళ్ళూ, మళ్ళీ ఆఫ్రికాలోని సింహాలూ, కారెనుములూ కంగారుపడి పరుగెత్తాయి.

అంతలోకే ఆమెరికాలో కారుమబ్బులు అలముకున్నాయి. ఇందాకళ ఆఫ్రికన్ సింహం తమని కాపీకొట్టినట్టు గర్జించిందన్న కసికొద్దీ ఈ పర్జన్యాలు సింహంలా గర్జించి ఊరుకున్నాయి.

"డైరెక్టరు పప్పులో కాలేశాడు" అన్నాడు వరహాలరాజు తక్షణం గంభీరంగా చూసి.

అతగాడి జతగాడు ఏం అని అడగలేదు. ఎందుకంటే రాజుకెంత తెలుసో ఇతనికీ అంత తెలుసు. అడగడం చిన్నతనం. అయినా అతనికేం తెలీదని రాజుకి గట్టి నమ్మకం. మొహమాట పడుతున్నాడనుకుని జాలితలచి కిటుకు చెప్పేశాడు హడావుడిగా. "సింహం మేహంలా అరచింది"

"తెలుసులేవోయ్ మింఘుం సేహంలాకూడా అర్చింది. నేను ఫస్టుసారే కనిపెట్టేశానులే" అన్నాడు అతని మిత్రుడు అంతకన్న చురుకుగా.

రాజు మాటాడలేదు. శ్రద్ధగా సినిమా చూస్తూ 'హీరో యాక్షను' ఒక్కటే ష్టడీ చేస్తున్నాడు.

ఈ చిత్రం అతను చూడ్డం ఇంకా ఒకసారికూడా పూర్తికాలేదు. అతనెపుడూ మొదటిసారి హీరోని చూసేసి, తరువాతసారి విలన్నీ, రేలంగినీ ష్టడీచేసి, మూడోసారినుంచి, మ్యూజిక్కు, సంభాషణలు సంతృప్తికరంగా, రసవంతంగా ఉన్నాయోలేదో, డైరెక్షను చప్పగా ఉందో లేదో, సౌండు ఫరవాలేదో అవునో పరిశీలిస్తాడు. అప్పుడప్పుడు మాత్రం చిన్న విమర్శలు చేస్తాడు.

ఈసారి మాత్రం కూడావచ్చిన మిత్రుడు ముత్యం కొంచెం చిన్న యాక్టర్లని కూడా ఓకంట కనిపెట్టాలని పోరి మరీ టిక్కెట్టు కొన్నాడు. హీరోయాక్టింగు కిటుకులన్నీ తెలిసిపోయినా సినిమావాళ్ళు ఓ పట్టాన నమ్మరుట. ముందర చిన్నవేషాలు వేసే తీరాలంటారుట అందుకని.

"ఇదో గురూ ఇపుడీసీనులో ఓ 'ఎక్స్ట్రా' గాడొస్తాడు చూడు నా రంగా... యేమి యాక్షను చేశాడురా నాయనా! వాడెవడో తెలుసా? ఇదివరకు ద్వారపూడి సంతదగ్గిర లాట్రీ నడిపేవాడూ-వాడే. హఠాత్తుగా పరారైపోయి మళ్ళీ యిక్కడ కనపడ్డాడు. ఇట్టె దూరిపోయాడురా? చిత్రం" అన్నాడు ముత్యం.

మేఘగర్జన మళ్ళీ వినపడింది.

"వాలొస్తోల్ది" అన్నాడు రాజు బద్ధకల్గా ఆవలిస్తూ.

"నీ బొంద. అది బైటవాన. నిజం పిడుగు. తరువాత సీనులోగాని సినిమాలో వానరాదులే. ఇప్పుడే మనవాడు వస్తాడు. వచ్చి భయపడ్డట్టు ఫేసుమీద ఓ ఎక్స్ప్రెషను పెట్టేసి ఒక యాక్షన్ చేస్తాడు చూడు నా రంగా-"

ఇంతలోకే తెరమీదకి చిన్న హాస్యగాడు వచ్చేసి ఆఫ్రికా సింహగర్జన విని భయపడ్డట్టు "ఫేసుమీద ఓ ఎక్స్ప్రెషన్" పెట్టేసి ఊహు యాక్షన్ చేసెయ్యడం మొదలుపెట్టాడు.

"ఓవరాక్షన్ కదూ?" అన్నాడు రాజు గంభీరంగా.

"హూఁ నీకేం తెల్సుగురూ. ఒక్కోసారి ఓవర్ చెయ్యకపోతే లాభం లేదట. మన్నసలు ఎవడూ చూడ్డు. ఇపుడు మనం చూసేవాళ్ళమా చెప్పు. అందుకే మన ఆచారి యాక్షనుమీద రాసిన బుక్కులో ఏం రాశాడు?

> చవట వేషమైన, జడ్డివేషమ్మైన,
> నవధి తక్కువైన, నతివయున్న
> టట్టటాటటాట టాటటాటాటటా
> డోసు మీరవచ్చు డోకురాదు."

అని గర్వంగా చుట్టూ పరకాయించాడు ముత్యం.

హాలులో ఉన్న మిగతా యాభై యిద్దరూ సినిమా చూస్తున్నందువల్ల ముత్యాన్ని ఎవరూ చూడలేదు.

అందరూ మత్తుగా జోగుతున్నారు. రాజులాంటి నిశిత విమర్శకులూ, కాదలచుకున్న హీరోలూ మాత్రం ఓపిగ్గా చూస్తున్నారు.

రాజు పరిభాష ప్రకారం "తెరమీద కొసరుతారడు" తెగ నటించేస్తున్నాడు.

తెరమీద మబ్బులూ డేరామీద మబ్బులూ కూడా గర్జిస్తున్నాయి... గాలి రివ్వున వీస్తోంది... పెద్ద పిడుగు పడింది .... తెరమీద నటుడు హఠాత్తుగా కాలు తొట్రుపడి, కొండమీంచి తూలి, తెరలోంచి ఊడి దభేలున నేల టిక్కెట్టు జనాభా మధ్యపడ్డాడు.

ఒక్కసారిగా మహారాజ పోషకుల మధ్య కలకలం చెలరేగింది. "సినిమావోడు ఊడి పడిపోనాడేస్" అన్న కేకలు చెలరేగిపోయాయి.

రాజు, ముత్తెం, తదితరులూ ఆ చిన్నవాడిని చుట్టుముట్టారు.

అతడు మెల్లిగా కళ్ళుతెరిచి, లేచి చుట్టూ చూసి, చట్ట విరిగేలా ఆశ్చర్యపోయి, మళ్ళీ లేచి 'నేనెక్కడున్నాను?' అన్నాడు.

"మొవ్వారం టెంటు సినిమాలో" అన్నారెవరో సగౌరవంగా.

"ఇది కోడంబాకం కాదా? మాంబళం కాదా. సీ ఫ్లోరు కాదా" అన్నాడు నటుడు.

బోధపడక ఎవరూ జవాబివ్వలేదు.

"మనమాటే కాదేస్ ... మనమాటా కాదు, ... మన బాసా కాదనిపిస్తది ... అసలాదు మడిసి కాదు గందా. సినిమా బొమ్మమరి. అందులోనే ఉంటేనే ఊసులు సోగ్గా ఉంటాయి. ఊడిపడితే యింకేటుంటది. పాణమా పాడా" అన్నాడొక ముసలయ్య మెల్లిగా.

"అణ్ణి ముట్టుకునేవు బుల్లోడా. సినిమా ఎల్ట్రీకరింటు షాకిత్తాది," అన్నాడెవరో.

ఇలా అయితే లాభం లేదనుకున్నాడు రాజు. వెంటనే ఓ సోడా తెప్పించి ఇచ్చాడు పడిపోయిన నటుడికి, 'అయ్యా మీ పేరేమిటి? తమరు నటులా, బొమ్మలా?' అన్నాడు.

"దుక్కలా నిలబడుంటే బొమ్మంటావేమిటోయ్ బైతులాగ. నేను వర్ధమాన నటుణ్ణి. నాపేర్ "శ్రీకుమార్" అన్నాడు - నటుడు డేరా పై కప్పువేపు ఫోటోజెనిక్‌గా చూస్తూ.

"ఓ! మీరా," అన్నాడు రాజు శ్రీకుమార్ ప్రొఫైల్ గుర్తుపట్టి. "ఇలా వచ్చారేం?"

"మహాశయా! మీరిప్పుడు ఎనిమిది సినిమాలలో నటిస్తున్నారని నేనూ, కాదని రాజూ వాదించుకుంటున్నాము. మీరెవరితో ఏకీభవిస్తారెడిటర్జీ?" అన్నాడు అప్పటికి పరిస్థితిని అర్థం చేసుకుని పుంజుకున్న ముత్యం.

"జ్ఞాపకంలేదు" అన్నాడు శ్రీకుమార్ తలకాయని ప్రొఫైలులోంచి ఫుల్‌ఫ్యాకు 'పాన్' చేస్తూ.

"మా ముత్యానికి సినిమాలలో చేరాలని ఉబలాటం అండి. మీరెలాగా వచ్చారు కాబట్టి కాస్తవీణ్ణి మీతో తీసుకెళ్ళి-"

"అబ్బే నాదేముంది కాని, మా రాజు ఎన్.టి. రామారావుని ఫస్టుగా ఇమిటేటు చేసిపారేస్తాడండి. వీణ్ణి తీసికెళ్ళి అయనకు చూపిస్తే ఎగిరి గంతేసి బుక్ చేస్తారు." అన్నాడు ముత్యం వినమ్రత ఉట్టిపడేలా.

"బాగుంది కాని, నేను ఇప్పుడు అర్జెంటుగా మెద్రాసెళ్ళాలంటే రైలు ఛార్జీలు కూడా లేవుగదా. అసలంతకన్న అర్జెంటు ఇపుడీ ఫిలింలో ఖాళీ నింపకపోతే రేపు షో ఎలా? ప్రొడ్యూస రేమనుకుంటాడు? రైలు ఛార్జీల్లేకుండా మెద్రాసు నుంచి ఈ వూరొచ్చి ఇక్కడ చల్లగా జారిపోయాననుకుంటాడు. తప్పుకదూ? అసలదీకాక నాకీ వెధవ పల్లెటూళ్ళో ఏం తోచటంలేదు. తక్షణం మళ్ళీ ఫిలిములోకి వెళ్ళిపోవాలి. ఎలా?" అన్నాడు శ్రీకుమార్ గుక్క తిప్పుకోకుండా.

అందరూ ముగ్ధులైపోయారు అతని వాగ్ధాటికి.

'మరి ఎలా ఎక్కుతారు' అన్నాడు ముత్యం.

'దానికేముంది సినిమా మళ్ళీవేస్తేసరి, ఈయన ఊడిపోయినచోట ఖాళీ వుంటుందిగా. అది రాగానే గబుక్కుని ఎక్కిపోతాడు. అంతే. అసలు సినిమాలు అలాగే తీస్తారులే. మహాబలిపురంలో షూటింగుతీసి స్టుడియోలో యాక్టర్లని మళ్ళీ వేరే షూటింగుతీసి ఆనక రెండూ కలిపేస్తారు. ఉందిలే పద్ధతి" అన్నాడు రాజు మళ్ళీ గంభీరంగానే.

"ఒరేయి ఈయన ఎలాగ వచ్చాడు. సన్మానంచేసి రేపు పంపేద్దాం" అన్నాడు ముత్యం.

"లాభంలేదు" అన్నాడు శ్రీకుమార్.

చివరికి మళ్ళీ సినిమా వేశారు.

తెరమీద మబ్బులూ, డేరా అవతల మబ్బులూ కూడా ఉరుముతున్నాయి... గాలి రివ్వున వీస్తోంది... శ్రీకుమార్ స్టేజీమీద రెడీగా నిల్చున్నాడు. రాజూ, ముత్యం, పక్క నిలబడ్డారు.

తెరమీద శ్రీకుమార్ నటించిన "కాళీచోటు" వచ్చేసింది.

బయట పెద్ద పిడుగుపడింది... ఆ హడావుడిలో శ్రీకుమార్ తెరమీద ఖాళీలోకి దూకాడు. ముత్యం, రాజూ అతన్ని అందులోకి తోసేసి చేతులు దులుపుకు చక్కావచ్చి యథాస్థానంలో కూర్చున్నారు.

"బలేగా ఎక్కిపోయాడురా. మనం కూడా వాడితోపాటే దూరిపోతే బాగుండేది. మెద్రాసులో ఎవడి చుట్టూరా తిరక్కుండానే హీరోలై పోయే వాళ్ళం" అన్నాడు రాజు, జరిగిన గమ్మత్తు మత్తులో అర్ధనిమీలితనేత్రుడై.

"అరటిక్కెట్టు కొనుక్కు రావలసింది అలా సగం కళ్ళు మూసుగు చూసేకాడికి. వెధవబడాయీ నువ్వూను. ఈలోగా నీ బోడిపోజుని ఎవడూ ఫోటో తియ్యడులే. తీసినా చీకట్లో అది షూట్‌కాదు. పూర్తిగా కళ్ళు తెర్చిచూడు" అని మందలించాడు ముత్యం.

తెరమీద తుఫాను చల్లారింది. తరువాత దృశ్యంలో తెల్లారింది...

...తెల్లారింది. కవికన్న మిన్న అన్న పేరు తెచ్చుకోవాలన్న ఉత్సాహంతో సూర్యభగవానుడు కాంతికిరణాలను మూలమూలకి ప్రసరించి చూస్తున్నాడు. బద్ధకిష్టులను నిద్రలేపుతున్నాడు. ఒక కొంటి కిరణం శివాలయం అవతల ఉన్న పెంకుటింటి వీధరుగుమీది తడక వసారాలోకి ప్రవేశించింది. అక్కడ రాజు బద్ధకంగా నిద్రపోతున్నాడు. తడకని తాకి దాని అవతలవున్న 'తారామండలాన్ని' ఛేదించి లోపలికొచ్చిన ఆ కిరణం రాజు కుడికంటి రెప్పమీద సూటిగా దిగి ఘాటుగా పొడిచింది. లే లే అంది.

రాజు ఆవులించి, మెల్లిగా కళ్ళుతెరచి, తడకమీద అంటించుకున్న 'తెరవేలుపు'ల వదనారవిందాలు చూచి ఆనందించి, మళ్ళీ, కళ్ళుమూసుకుని, అరచేతిలో 'నర్గీస్' చుట్టుకుని కళ్ళకద్దుకుని, కళ్ళుతెరచి ఫోటోజెనిక్‌గా ఆవలించి, 'హాయ్‌రాజ్' అనుకున్నాడు.

అతని దృష్టి తడకమీద నిలచింది. ఊహలు రెక్కలు విప్పి ఎగిరాయి. రాజకపూర్ ఇపుడు టీ తాగుతూ ఉంటాడు. దిలీప్‌కుమార్ దిగాలుగాచూస్తూ ఏ కిటికీ వెనకనించో ఫోటో తీయించుకుంటూ ఉంటాడు. నర్గీస్ బొమ్మలతో ఆడుకుంటూ ఉంటుంది. నాగేశ్వరరావు ఈపాటికల్లా మేకప్ చేసుకొని సెట్‌మీదకి వెళ్ళి ఉంటాడు. యన్. టి. రామారావు మాంఛి టీ తాగి స్టుడియోకి వెళ్తుంటాడు. రేలంగి ఆసినీ బండపడ అని ఎవరో ఒకర్ని ఏడిపిస్తూ ఉంటాడు. జమున శరత్ పుస్తకం చదువుతూ ఉంటుంది. ఎస్. వరలక్ష్మి పువ్వులు కోస్తూ ఉంటుంది. అంజలి డాన్సు నేర్చుకుంటూ ఉంటుంది. భానుమతి త్యాగరాజ కీర్తనలు పాడుకుంటూ ఉంటుంది. సావిత్రి కథల బుక్కు చదువుతూ ఉంటుంది. హాబ్బ... బలే వుంటుంది. సినిమా స్టార్‌లైఫ్ అనుకున్నాడు రాజు ఇంగ్లీషులో.

'కాస్తలో తప్పిపోయిందిగదా ఛాన్సు' అనుకున్నాడు కాసేపాగి. ఆ ఊహ రాగానే ఉలిక్కిపడి లేచి కూచున్నాడు.

రాత్రి సినిమాలోంచి ఎవడో ఊడి పడిపోయాడుగదా. అప్పుడు మళ్ళీ సినిమావేసి వాడు ఊడిపోయినచోటు రాగానే గబుక్కున అందులోకి ఎక్కించేశారు గదా. చిత్రంగా ఉందే - అలా ఎలా ఊడిపోతారు. ఒకవేళ ఊడినా మళ్ళీ ఎలా ఎక్కుతారు? ఇంపాసిబుల్. కలేమో? అనుకున్నాడు రాజు.

అతనికి హఠాత్తుగా అనుమానం వచ్చింది.

అసలు తను రాత్రి సినిమాకెళ్ళాడా? అని.

సినిమా కెళ్ళినట్టూ అక్కడే గారడీ జరిగినట్టూ కలొచ్చిందా? అసలు రెండూ జరిగాయా? రెండు జరగలేదా. మతి ఉందా పోయిందా?

"ఒరే అబ్బీ నీకు మతుందా పోయిందా? రైలుకి వేళైంది అలా నల్లమందు భాయిలా కూచుంటావేం. లే లే" అన్నాడు రాజు జతగాడు ముత్తెం లోపలికొచ్చి.

"ఎక్కడికి?" అన్నాడు రాజు.

"బావుందిరా అబ్బీ మెడ్రాసెళ్తానన్నావు గదరా? సైకిలమ్మేశావు. అప్పుచేశావు. ఇంతాచేసి ప్లాను మార్చావా?" అన్నాడు ముత్యం.

"అబ్బే లేదు లేదు. ఔనుగాని మనం రాత్రి ఏ సినిమాకెళ్ళాం?" అన్నాడు రాజు.

"ఇంక లాభంలేదు. నువు మెడ్రాసెళ్ళకు, విశాఖపట్నం టిక్కెట్టు కొను. అలా అయితే మీ తాతకి చెప్పే వెళ్ళొచ్చు" అన్నాడు ముత్యం నవ్వుతూ.

"అయితే రాత్రి మనం ఎక్కడున్నాం?"

"ఏమిటోయ్ ఏం డిటెక్టింగు మొదలెట్టావేమిటి యాక్టింగు వదిలేసి. లేలే, మీ తాత పొలంనించి వచ్చేస్తే కథ అడ్డం తిరుగుతుంది." అన్నాడు ముత్యం హడావుడిగా.

రాత్రి జరిగింది కలా? కల్లా? అన్నాడు రాజు లేస్తూ.

"డైలాగు అనడానికి బాగుంది గాని రెండూ ఒకటే. అదే సినిమాలో వస్తే రచయిత పప్పులో కాలేశాడు అంటావు నువ్వే, నడు నడు."

రాజు ఇంక మాట్లాడలేదు.

గబగబా మొహం కడుక్కుని, తరవాత అన్నం తినేసి ఓ చిన్నపెట్టెలో సినిమా పత్రికలూ, తను రాసిన సినిమా కథలూ, సినేరియోలూ, విమర్శలూ, పాటలూ, పాటల పుస్తకాలూ అన్నీ పదిలంగా సర్దేసుకుని, ఇపుడే వస్తాను బామ్మా అని చెప్పి రైలు స్టేషనుకు దారితీశాడు.

దారిలో జంకుతూనే, రాత్రిసంగతి మళ్ళీ కదలేశాడు. అది కలో, నిజమో బోధపడ లేదతనికి ఇంకా.

"ఒరేయ్ రాజా నువ్వింకా పెద్దస్టారువి కాకుండానే ఇలాటి బడాయిలు పోతోకు నాకు ఒళ్ళు మండుతుంది. నువ్వు గొప్పవాడివై పత్రికలవాళ్ళు ఇంటర్వ్యూ చేసినపుడు మరుపూ గిరుపూ చెలాయించు. ఇపుడు కాదు." అన్నాడు ముత్యం.

రైలు కదిలే వేళైంది.

"జాగర్త రాజా ఎలా నెగ్గుకొస్తావో - మెడ్రాసంటే పట్టపగలు టోకరా యిస్తారట. మూరు మార్కెట్టులో ఏమీ కొనకు. రిక్షావాళ్ళతో మాట్లాడకు. అరవం గబగబ నేర్చుకో, సర్టిఫికెట్లు జాగర్త." అని హెచ్చరించాడు ముత్యం.

రాజుకి కంటనీరు తిరిగింది.

"కొంచెం భయంగానే ఉంది గురూ. నిన్ను రమ్మంటే రానంటావు ఎలా."
ముత్యం మాట్లాడలేదు. ఆలోచిస్తూ నిలబడిపోయాడు. గార్డు ఈల వేశాడు.

హఠాత్తుగా ముత్యం తెగించి ఒక నిర్ణయం చేశాడు.

"గురూ. పోతే పోయిందిగాని, 'వానపాము' నాటకంలో కూడా హీరో రోలు నువ్వే వేశానని చెప్పేయి డైరెక్టర్లతో. అది కూడ కలిపితే అరడజను నాటకాలు అవుతాయి." అన్నాడు.

రాజుకి నోటమాట రాలేదు ఆశ్చర్య సంభ్రమాలవల్ల. ఐనా ప్రయత్నించాడు. "ఇంత త్యాగం చేస్తున్నావా గురూ! నీ కీర్తి శాశ్వతంగా-"

"గురూ అది హెవీ డైలాగు. సోషల్సులో బాగుండదు. ఇలాటివి అక్కడ రాసేవు. ఒద్దంటారు జాగర్త... నీకు ఛాన్సు రాగానే నాకు టెలిగ్రాం ఇస్తావుగా. వస్తాను" అన్నాడు ముత్యం.

"తప్పకుండా నిన్ను- నా ప్రాణమిత్రుడిని-" అన్నాడు రాజు గద్గద స్వరంతో.

ఈ ఘట్టంలో కదలొచ్చునో, కూడదో తేల్చుకోలేక ఒక్క క్షణం తటపటాయించి, తనుకూడా బొంగురు గొంతుకతో మూలిగి, ముందుకు నడిచింది రైలు.






"మేమగునో - జీవిత మేమగునో - నా జీవితమేమగునో ఈ నా జీవిత మేమగునో" అనే పాటని ఆరంభించాడు వరహాలరాజు.

రైలు 'టకటక'ల తాళం ఆ పాటకి వాటంగా పడటంలేదు. రాజు కింకోపాట గుర్తుకు రావటంలేదు.

"ఆదిలోనే అదేదో పాదమా" అనుకున్నాడు. ఈ అపశకునానికి కొంత నొచ్చుకుని, గిట్టనివాళ్ళు చాదస్తాలంటారుగాని, ఇలాటి శకునాలు గట్రా నిజమని సినిమా ప్రపంచంలో అంతా నమ్ముతారని రాజు నమ్మకం. అతనికి ఇటువంటి విశ్వాసాలు చిన్నప్పటినుంచీ ఉన్నాయి.

"ఉండకేం చేస్తాయి. ఏ హీరోగానో, డైరెక్టరుగానో, ప్రొడ్యూసర్‌గానో కీర్తిప్రతిష్ఠలు సంపాదించుకోవాలని దేముడు రాసిపడేసాడు కాబట్టే మనకీ నమ్మకాలమీద గురి ఉంది" అనేవాడు అతని నేస్తం ముత్యం.

"మరే పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది గదా" అనేవాడు రాజు.

"గురో! బ్రిలియంట్ డైలాగ్ పడేశావు. దీన్నే ఏదో అద్దాంతర సన్యాసం అనో ఏదో అంటారుట" అని ఎగిరి గంతేసేవాడు ముత్యం.

అంతా బాగానే ఉంది కాని, ఇప్పుడు పాడిన పాటకి రైలు నడక తాళం సరిపడకపోవడం, గింజుకున్నా ఇంకోపాట గుర్తుకు రాకపోవడం ఏమిటి చెప్మా అని మథనపడసాగాడు రాజు.

"చిటపట చినుకులు" అనే పాట సరిపోతుంది అని సూచించినట్టుగా, పక్కాయన దాన్ని లయబద్ధంగా పాడసాగాడు

రాజు మొహం విప్పారింది.

"మందేవూరండి?" అన్నాడు ఆప్యాయంగా పలకరించి.

"మాది బొంబాయి. మీదేవూరో నాకు తెలీదు" అన్నాడాయన రైలులోకి దూసుకువచ్చిన పైరుగాలికి చెదిరిపోతున్న మీసాలను కొనగోరుతో సరిచేసుకుంటూ.

"ఓం మాది మెడ్రాసులెండి." అన్నాడు రాజు గంభీరంగా చూస్తూ.

"ఏం చేస్తూ ఉంటారు."

"హీరో... మీరో?" అన్నాడు రాజు.

"ఎడిషనల్ డైలాగ్... అంటే అదనపు సంభాషణ అని అర్థం" అన్నాడు ఎదటాయన.

"మా ఫిలిం ఫీల్డుకి కొత్తే అనుకుంటాను."

"మీదేమిటి మా బొంబాయి ఫీల్డుకీ కొత్తే. హాలీవుడ్‌లోనే మా ఎడిషనల్ డైలాగు రైటర్లు ఉంటారు. ఇండియా బాగా వెనకబడ్డ దేశం గదా... అంటే బాక్‌వర్డ్‌కంట్రీ అన్నమాట. బొంబాయిలో నేను చాలామందితో నన్ను పెట్టుకోమని చెప్పిచూశా. విన్నారు కాదు. అన్ని డైలాగులు రాసినవాడే కావలిస్తే అదనపు డైలాగులూ రాస్తాడులే అన్నారు. పైగా వాళ్ళకి హిందీ రాసిపెట్టాలిట, నేను ఇంగ్లీషుకి చస్తే ఒక్క మెట్టు దిగనన్నాను."

"భలేవారండి... నేనూ అంతే. మామూలు వేషాలూ సైడుహీరోలాటివి బోల్డు దొరుకుతాయి మా ఫీల్డులో. ఛస్తే హీరో రోలుకి తక్కువదేం పుచ్చుకోనని శపథం నాకు" అన్నాడు రాజు గంభీరంగా.

"బెష్టు. మీరెందులో నటిస్తున్నారండి "మిస్సమ్మలో ఉన్నారా?"

రాజు వినమ్రతను అభినయించి మందహాసం చేశాడు.

"లేనండి. ఎన్.టి. రామారావు, ఏ నాగేశ్వరరావు, యస్.వి. రంగారావు, రేలంగి, సావిత్రి, జమున మొదలగువారు నటించిన ఈ చిత్రానికి శ్రీ ఎల్.వి. ప్రసాద్ దర్శకత్వం నిర్వహించారు. నెక్స్ట్ పేరా. దీనికి రచయిత చక్రపాణి, సంగీత దర్శకత్వం ఎస్. రాజేశ్వరరావు ఛాయా గ్రహణం బేర్ట్‌లే. స్టుడియో వాహిని. ఇంకో నెక్స్ట్ పేరా నిర్మాతలు: నాగిరెడ్డి అండ్ చక్రపాణి. అదండి. అందులో నేను లేను."

"ఐ.సీ. అదేపాయెగాని, పోనీ మీరెందులో ఉన్నారుట?"

"చెప్పాను గదండి. ఇంకా ఎవరితోనూ కాంట్రాక్టు సైన్ చెయ్యలేదు. బుక్ కాబడలేదు. ఫోటోలూ అవీ పంపించానండి. చాలామందికి ఉత్తరాలు రాశాను. ఇపుడు వెళ్ళి ఇక మాట్లాడాలి."

"ఓ అదా మీరు యింక వెళ్ళి ప్రయత్నిస్తారన్న మాట. చెప్పారు గాదూ. హీరోగారూ సిగరెట్టు పుచ్చుకోండి మాట్లాడుదాం"

"మీరో? అన్నట్టు మీపేరో? చెప్పారు కారు"

"నాపేరు నరసన్నలెండి. బొంబాయిలో ఉన్నప్పుడు ఇంకోపేరు ఉండేది కాని, ఇపుడు మెద్రాసులో ఎందుకని వదిలేశాను. చూశారూ! మీరూ డైలాగులూ బాగా రాస్తారు." అన్నాడు నరసన్న నవ్వుతూ.

"మరేండి. ఏదో అలవాటైపోయింది. నేను ఎప్పుడు సంభాషణలు చేసినా రాసినా సంతృప్తికరంగానే ఉంటాయండి. సౌండు ఫర్వాలేదు."

"వెరిగుడ్ మెద్రాసులో మీ బస ఎక్కడ? ఎవర్ని అడుగుతారు?"

"బసకేం తొందరొచ్చెసార్. సరాసరి, స్టారుస్టారింటికి కారుమీద వెళ్ళి ఫేసు చూపించేసి వేషం ఇప్పించి కొత్త వదనారవిందాలకు - అదే... వేషం ఇమ్మంటాను... ఆనక వాళ్ళే బస చూపిస్తారు."

"బస్, బస్, భలేవాడివయ్యా, అలా వెళ్ళి అడిగేస్తే, ఇలా వెళ్ళిపో అనేస్తారు. నీకసలు టెక్నిక్ తెలీదన్నమాట. అన్‌ఫిట్, యూస్లెస్, హోప్‌లెస్, బిగ్‌మెస్! సినిమాలో చేరేవాడికి ఎన్నో అర్హతలు అవసరం. వాటిలో ఒకటో నెంబరుకూడా నీకు తెలిసినట్టు లేదు. ఒక చిన్న కథ చెబుతాను విను.

"శ్రీకరంబును, తారల కాకరంబును, పేదలకు భీకరంబును నగు బొంబాయి నగరం బొండు గలదు..."

"మేష్టారూ చిన్నసంగతి... మామూలుగా లైట్ తెలుగులో చెప్పలేరాండి." అన్నాడు రాజు ఇంకో సిగరెట్టు ముట్టించి.

"భేషుగ్గా చెప్తా. ఏం లేదు. అనగనగా బొంబాయి అనే ఊరు. ఊరేమిటి నా బొంద. మహానగరం. పెద్ద సిటీ.

నేను కొత్తగా ఆ ఊరు వెళ్ళినపుడు నాకెవరూ తెలీదు. చేత అటే డబ్బులేదు. అయితేనేం, దారుణమైన తెలివితేటలున్నాయి. వెధవది అదేమిటో చిన్నప్పట్నించీ అంతేలే. అయితేనే ఎవడో నీవంటి వాడే టోకరా యిచ్చేసి, పెట్టీ బేడా పట్టుకు చెక్కేశాడు. ఆనక నావంటివాడే నామీద జాలిపడి, ఆదుకుని పాపం నాదగ్గిరే టోకరా తిన్నాడు.

వాడి ధర్మమా అని బొంబాయిలోకూడా నేను చెలామణి అవుతానన్న ధైర్యం కలిగింది.

వాడే కబుర్లు చెబుతూ, ఇక్కడలేని విద్య ఎక్కణ్ణించో మనం తెచ్చామని టముకు వేయిస్తే మనదే రాజ్యం అవుతుందన్నాడు. ఎప్పుడూ అంతేననుకో అబ్బాయి. నేను దిలీప్‌కుమార్‌లా నటించి పారేస్తానంటే, వాడున్నాడుగా మళ్ళీ నువ్వెందుకంటారు. అదే ఆర్సన్ వెల్స్ పేరుచెబితే, అమాంతం ఎగిరి గంతెయ్యకపోయినా ముందర తూలనాడరు.

నా జుట్టు కట్టిన టోకరాసురుడు ఇలాంటి ప్లానే వేసి, ఆ గుట్టు నాకు చెప్పాడు.

తక్షణం నేను వాడిదగ్గరే నా పెన్ను తాకట్టు పెట్టి పదిరూపాయలు అప్పుచ్చుకున్నాను. అందులో రూపాయి బయానాయిచ్చి ఓ చోట గ్రీటింగు కార్డులు ప్రింటు కొట్టించి, శాంపులు కాపీలిమ్మని ముందస్తుగా నాలుగు పుచ్చుకు చక్కావచ్చాను. గ్రీటింగ్ కార్డు అంటే తెలుసుగా. మన పేరు, డిగ్రీ గిగ్రీ ప్రింటు చేస్తారులే. ఏం? సుబ్బరమైన లాండ్రీవాడి దగ్గిరకెళ్ళి ఓ జత గుడ్డలు అద్దెకు తెచ్చుకుని, అవి జమాయించి, ఓ చిన్న పేపరాఫీసు కెళ్ళాను.

అక్కడ నేనూ ఒకాయన కలిసి కాఫీ తాగేశాక, నేను హాలీవుడ్ రిటర్న్ అనే అబద్ధాన్ని ఆరణాలకి అమ్మేశాను.

ఆయన దగ్గిర పలుకుబడి ఉందిట. దానికింద చాలామంది పడి ఉంటారట. ఆయన నన్ను చూసి నిజమే కామోసనుకొని, పేపరాయనకి నన్ను గురించి బాహా చెప్పేసి, రెండు ముక్కలు రాయించేశాడు.

మూడోనాటికి ఆ పత్రిక వచ్చేసింది. నేను వెళ్ళదలుచుకున్న డైరెక్టర్ ప్రొడ్యూసరింటికి స్వయంగా ఓ కాపీ పంపించాను.

ఆ సాయంత్రం కార్డు పంపించి, నేటి సినిమాఫీల్డులో అడిషనల్ డైలాగు రైటింగు (అనగా అదనపు సంభాషణ రచన) ఎంత అవసరమో దంచికొట్టి ఉపన్యసించేశాను.

నమ్మేడో లేదో తెలీదుగాని, వాళ్ళింటో ఓ గది ఖాళీ చేయించి, అక్కడ ఉండమన్నాడు. నేను హఠాత్తుగా కొన్ని చిక్కుల్లో పడ్డట్టు చెప్పాను. నా సామాను, నా పర్సు ఓడలో వస్తున్నాయనీ, నేను విమానంలో ముందస్తుగా వచ్చేశాననీ... నమ్మక ఛస్తాడా అబద్ధం చెబితే గోడకట్టినట్లు చెప్పమన్నారు. నేను లావుపాటి గోడకట్టినట్టు చెప్పేశానులే.

సరే ఆయన్తో ఆ స్టుడియోకీ ఈ కంపెనీకీ తిరగడంలో నలుగుర్నీ కలుసుకున్నాను.

చెప్పొద్దూ, నాకు చిన్నప్పట్నించీ ఎంత దారుణమైన తెలివితేటలున్నాయో అంత దారుణమైన చురుకుదనం, చొరవా కూడా ఉన్నాయి. అందుకని ఏ దిలీప్‌కుమారో ఎదురవగానే "క్యా దిలీప్ భయ్యా తబీయత్ కైసే," అనేసేవాణ్ణి భుజం చరిచి. నేనెవడో తెలీక అతగాడు విస్తుపోయేసరికి, నా కూడా ఉన్నాయన పరిచయం చేసి ఎడిషనల్ డైలాగ్ రైటర్ అనేవాడు.

'ఫ్రమ్ హాలీవుడ్' అని ఠక్కున చెప్పేసేవాణ్ణి నేను. ఎందుకనోగాని ఆయన మటుకు ఎందరికి పరిచయం చేసినా హాలీవుడ్ సంగతి మర్చిపోయేవాడు.

మొత్తానికి ఇలా చాలామందితో నాకు పరిచయం కలిగింది. చూశావా నా నేర్పు! ఛాన్సు అడగడానికి ఇదో మంచిపద్ధతి అన్నమాట. నీకు ఇంత బుర్ర ఉందా?

(రాజు అడ్డంగా తల తాటించి లేదు అన్నాడు.) నరసన్న కథ సాగించాడు.

ఇంక మా యింటాయన కారుడ్రైవరు రుమాల్‌సింగ్, దర్వాన్ జమాల్, గుమాస్తా పెరుమాళ్, సెక్రటరీలు పరమానంద్, రామలాల్‌లు మరీ ఫ్రెండ్లయి పోయారనుకో, నేనంటే ఎంతో గౌరవం. షీలాదేవి అని ఇంకో వంటావిడ వుండేది. ఆవిడ ఇంగ్లాండ్ రిటర్న్‌ట. ఇంగ్లీషు వంటలు స్పెషలైజ్ చేసింది.

వాళ్ళందరికీ కూడా దారుణమైన ప్రభుభక్తిలే. ఎంతో నే చెప్పలేను.

డ్రైవరు రుమాల్‌సింగ్ ఉన్నాడా. రాత్రి పదైనా సరే పధ్నాలుగైనా సరే, అలా వుండిపోయేవాడు యజమానికి కారు కావాల్సుంటుందని.

'వెళ్ళి ముద్దమింగి రావయ్యా' అని హిందీలో చెప్పేవాడనుకో.

అచ్చుకాని వేదాంతపుస్తకాలు బొచ్చెడన్ని రాసి కూర్చున్న తత్త్వ శాస్త్రజ్ఞుడులా దిగులుమొహం పెట్టి "నా జీవితలక్ష్యం మీ కారు తోలుతూ దాని సేవ చేయడమే ఈ రుమాల్‌సింగ్ అంతకన్న కోరేదింకోటి లేదు" అనేవాడు హఠాత్తుగా– ఉంటే ఆకాశం, లేకపోతే ఇంటి వాసాలవంక చూస్తూ. అలాగే జమాల్, అట్లాగే పెరుమాళ్. అహోరాత్రులు పనిచేసి కళ్ళెర్రగా చేసుకునేవారు. ఏమలా ఉన్నావంటే 'జీవితమే విచిత్రమైనది' అనేవారు గంభీరంగా.

ఆషానిరాషల మధ్య అల్లాడుతూ, అనంతంగా అవస్థలు పడుతూ (ఇవన్నీ హిందీలో అనేవారనుకో) అంటూ ఏదో సోదిలాటిది చాలా చెప్పేవారు.

ఒక్కోసారి మేమందరం 'లాన్'లో కూచుని కబుర్లు చెప్పుకుంటూ ఉంటామా.

దర్వాన్ భారంగా అడుగులు వేస్తూ వచ్చి తలవంచుకుని నిలబడేవాడు. ఏమిటి సంగతి అంటే ఓ కథ చెప్పేవాడు.

గేటు దగ్గరికి ఏడేళ్ళ పసివాడూ, పదిహేనేళ్ళ బాలాకుమార్తె వచ్చి కన్నీళ్ళతో సినిమాఛాన్సు అడిగి, లేదనిపించుకుని ఎలా విచారంగా వెళ్ళిపోయేవారో, మా తాలూకు హృదయాలు కరిగిపోయేలా చెప్పి మళ్ళీ తలవంచుకుని భారంగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయేవాడు గేటులోకి.

తక్షణం సెక్రటరీ రామలాల్ "బ్యూటిఫుల్ సీక్వెన్సు కదూ" అని ముగ్ధుడైపోయి అలా శూన్యంలోకి చూసేవాడు.

"యస్ వెరీ..." అంటూ సెక్రటరీ పరమానంద్ కూడా డిటో పని చేసేవాడు.

అంతట్లోకి "జిందగీ యహీ హై" అన్న డైలాగు ఒక గద్గద కంఠంలోంచి ఇవతలకి వచ్చేది. అది ఇంగ్లాండ్ రిటర్న్‌డ్ కుక్ షీలాదేవి తాలూకు దన్నమాట.

విశేషం ఏమిటంటే, ఈ పనివాళ్ళు ఆరుగురూ ఎంతో అన్యోన్యంగా ఉండేవారు.

ఒక్కొక్కసారి వాళ్ళని చూస్తే "మసిపూసిన మాణిక్యాలు" అనే నవలపేరు జ్ఞాపకం వచ్చేది. కష్టాల్లో ఉన్న పంచపాండవులూ, ద్రౌపదీ గుర్తుకు వచ్చేవారు. తప్పే అనుకో. ఇంకోటి. మా ప్రొడ్యూసరు బావమరిది ఎప్పుడూ వంటింట్లోనే

తారట్లాడుతూ ఉండేవాడు. షీలాదేవి కిటికీ లోంచి బయటచూస్తూ నిలబడి జిందగీ జిందగీ అంటూ ఉండేది.

ఆవిడ కీచకుడి గురించి ఎవరికీ ఫిర్యాదు చేసినట్టు కనబడలేదనుకో.

అలాంటి ఏర్పాట్లు జరిగితే ప్రొడ్యూసరు బావమరిదిగారి వీపు చిట్లిపోయేదిగదా. సదరు పనే జరిగితే, చిట్లిపోయిన వీపు బొమ్మలూ కథా కమామీషూ తెల్లారే సరికల్లా అక్కడి సినిమా పత్రికలో కెక్కిపోయేవి. కదా.

చెప్పొచ్చిందేమిటంటే, వాళ్ళ మాటా తీరుతెన్నులూ, ఆ ఫేసులమీద ఎక్స్‌ప్రెషన్‌లు చూచి నేను చాలా కదిలిపోయాను. అంటే మూవ్ అయిపోయానన్నమాట.

ఏమిటీ స్వామిభక్తి? ఈ కళానురక్తి? ఈ ఐకమత్యం? వీళ్ళంతా ఒక్కరేనా? వేర్వేరా? అని ఎంతో పరిశోధన చేశాను.

అడపా తడపా మా ప్రొడ్యూసరుతో అనేసేవాణ్ణికూడా- "నేనిలా కదిలిపోతున్నానూ, వీళ్ళొక్కొకళ్ళూ మహానటులూ, మీ పిక్చరులో ఛాన్సులివ్వరాదా?" అని.

ఇలా అనగా ఓ రోజున రుమాల్‌సింగు విన్నాడు. ఆనక నన్ను ఒకణ్ణిచేసి ఓచోట కుచోపెట్టేసి దిలీప్‌కుమార్‌నీ, ప్రేమ్‌నాథ్‌నీ, రాజకపూర్‌నీ మించిపోయేలా నటించి చూపించి వదిలాడు. యజమానికి రికమెండు చేయమని కోరుతూ ఓ పాతిక నా చేతులో పెట్టాడు.

మర్నాడు తెల్లారేసరికి, నాదగ్గిర రెండువందలయాభై చేరాయనుకో.

ఇప్పుడు నువ్వు ఊహించగలవా వాళ్ళెవరో, ఎంతటి ఘనులో? ఎలాటి మునులో మనలో?"

"బహుశా శాపంవల్ల ఛాన్సు దొరకని మహానటులు అయివుంటారు. ఆకలిబాధకు తాళలేక చివరికి కళామతల్లికి నమస్కరించి ఇలా డ్రైవర్లుగా, వంటవాళ్ళుగా, గుమాస్తాలుగా కుదురుకుని ఉంటారు." అన్నాడు వరహాల రాజు బరువెక్కిన హృదయంతో.

"లాభంలేదు. నీది బ్రహ్మాండమైన బుర్ర కాదనుకుంటా, విను.

వాళ్ళారుగురిదీ ఒకే ఊరుట. అందులో ముగ్గురు చుట్టాలట. కాస్త పొలం పుట్రా, ఇల్లు వాకిలీ ఉన్నాయి గాని, సినిమాలో చేరాలని ఈవూరు వచ్చారు.

వాళ్ళకి తోచిన ఉత్తమ పద్ధతి ఇది. అడగాల్సిన వాళ్ళందర్నీ ముఖాముఖిని అడిగేసి లేదనిపించుకుని ఆఖరుకు ఈనదగ్గిర ఇలాచేరి దారుణంగా నటించి తమ ప్రతిభను చూపించేస్తున్నారన్నమాట. అన్నం తింటున్నా, కారులో వెళ్తున్నా, ఇంట్లో కూర్చున్నా ఆ నిర్మాత ఈ గొప్ప నటుల ప్రతిభను గుర్తించడం తప్పనిసరి - అని వాళ్ళు నమ్మారు. ఏదో ఒక రోజున గభీమని బుక్ చేసి ఊరుకుంటాడని ఆశపడ్డారు.

వాళ్ళ కథలు విన్నాక నా హృదయం మళ్ళీ కరిగిపోయింది. అలాగే చెబుతాను అన్నాను. కాని ఈ లోగా, నాకే ముప్పు ముంచుకొచ్చింది.

నేను టోకరా ఇచ్చిన ఆసామి మెల్లిగా నా ఆచూకి కనిపెట్టి, మా ప్రొడ్యూసరికి ఆకాశరామన్న ఉత్తరం రాసేశాడు. ఇలా నీ కొంపలో చేరి నీతో తిరిగేవాడు హాలీవుడ్ వెళ్ళలేదూ. నీకు షోకైన టోకరా ఇచ్చాడు సుమీ అని.

ఇది ఆయన కంటపడేలోగానే, సెక్రటరీ నాకు చూపించాడు; నేను మళ్ళీ నిజం చెప్పినా ఆయన ఇంక నమ్మడన్న నమ్మకం కొద్దీ, చేతిలో రెండొందలు చేరాయన్న ధీమాకొద్దీ నేను ఆ యింట్లోంచి "ఫేడౌట్" అయిపోయాను.

అది వేరే కథ అనుకో. అని కథ ముగించాడు నరసన్న.

"చెప్పొచ్చింది ఆ యింట్లో జమాల్, రుమాల్, పెరుమాళ్ అండ్‌కోల తెలివితేటలు, నేర్పు గమనించావా? వాళ్ళు ఏనాటికేనా చిన్న వేషమేనా సాధిస్తే అది ఈ నేర్పువల్ల వచ్చిన ఫలితమే అవుతుంది. నీకు అంతటి దారుణ తెలివితేటలు ఉన్నాయా వరహాలరాజూ? ఇంత బ్రహ్మాండమైన ఊహ నీకు తట్టుతుందా భావి హీరో?" అన్నాడు నరసన్న ఎడిషనల్ డైలాగు రైటరు ప్రజ్ఞను ఉపయోగించి.

"లేదు; తట్టదు." అన్నాడు రాజు వినయభయసంభ్రమాశ్చర్య చకితుడై.

"అయితే లాభంలేదు. రైలుదిగి ఇంటికెళ్ళిపో తక్షణం" అన్నాడు నరసన్న.

"రైలు పరుగెడుతోందే ఎలాగ?" అన్నాడు రాజు కిటికీలోంచి తొంగిచూసి.

❀ ❀ ❀ ❀

"దిగలేవా?.. ఒక కథ చెబుతాను విను" అన్నాడు నరసన్న నవ్వుతూ.

...ఇలాగే ఓసారి తంజావూరునుంచి చలనచిత్ర రాజధానికి ఒక రైలు పరిగెడుతోంది. అందులో ఒక ప్రముఖ దర్శకుడు ఉన్నాడు. ఒక "మామూలు ముఖ" నటుడు కూడా ఉన్నాడు. చెప్పలేము గదా ఏ ముఖం వెనక ఎంతటి మహానటుడున్నాడో."

"మరేండి ఉప్పుకప్పురంబు నొక్క పోలికనుండు అన్నాడు వెనకటి కొక మహాకవి" అన్నాడు రాజు ఠకీమని.

"భేష్ నువ్వు మామూలు డైలాగులేకాదు. ఎడిషనల్ డైలాగులు కూడా రాయడానికి పనికొస్తావు. నే చెప్పలే? నీకా శక్తి ఉన్నట్టుందని?"

"థాంక్యూసార్. చిన్నప్పట్నించీ డైలాగులంటే నాకు చాలా యిష్టం. అవే నా జీవిత లక్ష్యమండి. అవిలేందే బతకలేనండి... ఒకోసారి అర్ధరాత్రి గబుక్కున డైలాగులు రాసేస్తానండి. ఏమిటో... మావూళ్ళో నాగయ్యగారు ఊహూ మెచ్చుకునేవారు. మీరు డైలాగులు రాయాలండీ. అసలందుకే పుట్టారండీ అని" అన్నాడు రాజు వినమ్రత ఉట్టి పడేలా.

"ఎవరూ? నేనా" అన్నాడు నరసన్న తుళ్ళిపడి.

"కాదు. నేనండి"

"నాన్సెన్స్. నేనెందుకు పుట్టినట్టు, మరి?"

"మీరు అడిషనలు డైలాగు రాస్తానన్నారుగా?"

"గ్రాండ్! నీది బలే చురుకైనబుద్ధి సుమా. అసలు యివాళ సినేరియాలు రాసే వాళ్ళెంతమందికి ఇంత దారుణమైన చురుకుతనం ఉందీ అంటా?"

"ఒక్కడిగ్గూడా లేదుటండీ మా ఊళ్ళో నాగయ్యగారు చెప్పారు. అందరూ ఉత్తి మప్పులుటండి. నువొక్కడివే జీనియసువోయ్ అన్నారండి."

"ఎవరు నేనా" అన్నాడు నరసన్న మళ్ళీ తుళ్ళిపడి.

"కాదు నేనండి" అన్నాడు రాజు వినయవేషం వేసుకుని.

"మరి నేనెవణ్ణిట?"

"మీరు అడిషనల్ డైలాగు రైటరన్నారు కదండీ. ఇంకోటి, నాగయ్యగారు మీకు తెలీదుగా, అందుకని ఆయన చెప్పేవి నన్ను గురించేండి."

"ఐనాసరే, నేను కూడా జీనియస్‌నే."

"పోన్లెండి మనిద్దరం జీనియసులమే."

"రైరో, అలా సర్దుకుపోవాలి. గుత్త తీసుకుంటే ఎలా? మనిద్దరం జీనియసులమే. చూట్టానికి వేరే వేరేగా ఉన్నా అసలు జీనియసులమే. ఇందాక డైలాగు చెప్పావు ఏమిటదీ, ఉప్పు గురించి. దాన్ని తిరగేస్తే మనం."

"మరేండి."

"అన్నట్లు ఆ ఉప్పుడైలాగు మనకన్నా ముందరే ఎవడో రాశాడన్నావు ఎవడు వాడు?"

"వాడండి.... వాడిపేరు పోతన్న అండి"

"ఐ సీ. ఇదివరకు ఎన్నిపిక్చర్లకి రాశాడు?... ... ఇదెందులో పెట్టాడు? బావుంది. లిరికల్ బ్యూటీ వుంది. అందుకే అడిగాను. రేపు నేను తెలుగు పిక్చరుకిరాస్తే వాడుదామని." అన్నాడు నరసన్న గంభీరంగా.

"ఆయన ఏ పిక్చరుకీ రాసినట్టే లేదండి. కాని, ఓ పిక్చర్‌లో వేశాడు. దానిపేరు కూడా పోతన్నే అనుకుంటా."

"ఐసీ" అన్నాడు నరసన్న.

ఈ సంగతి ఆయనకి నచ్చలేదని రాజుకి అనుమానం వేసింది.

"వేమన్న అనుకుంటానండి" అన్నారు గబుక్కున ఉత్సాహంగా.

"వేమన్న కానీ ఇంకేమన్నాకానీ, ఐవిల్ యూజ్ ది డైలాగ్, నేను దీనిని వాడుతాను. ఇది బాగుంది. నువ్వేమన్నాసరే."

"నేనేం అంటానండి. నేను హీరోఛాన్సు దొరక్కపోతే, డైలాగులు రాద్దామనుకున్నాను. ఈలోగా వాడనులెండి."

"అన్నట్లు ఛాన్సుల గురించి కదూ మాట్లాడుకున్నాం? వడివేలు కథ చెప్పబోయాను...



# వడివేలు కథ

అదే ఒకరోజున రైలు పరుగెడుతోంది మెద్రాసుకి. అందులో ఒక పెద్ద డైరెక్టరు ఉన్నాడు. మన కధకి సదుపాయంగా వుంటుందని సెకండు క్లాసులోనే ఎక్కారు. అందులోనే ఈ వడివేలూ ఎక్కాడు. అతడు రైలు గుమాస్తా. ప్యాసులూ అవీ దొరుకుతాయి. నాటకాల్లో దారుణంగా నటించేస్తూంటే చూసి అతని స్నేహితులంతా, మెద్రాసుపోయి సినిమాల్లో చేరిపోరా బాబూ అని పోరారు. అందుకని నెల్లాళ్ళు సెలవు పెట్టి, పెళ్ళానికి నచ్చచెప్పి, ప్యాసు పుచ్చుకు రైలెక్కాడు.

డైరెక్టరు అతన్ని చూసి అనుమానపడి ఇది సెకండుక్లాసు అన్నాడు.

ఔను తెలుసు అని అరవంలో అని, కాస్త టెక్కునభినయించి ఎక్కిపోయాడు వడివేలు. సరే రైలు కదిలింది.

కదుల్తూ వుండగా ఎవరో వచ్చి డైరెక్టర్ని పలకరించి ఈ పిక్చరు ఐపోగానే మళ్ళారండి అనిచెప్పి వెళ్ళిపోయారు.

'మీరు డైరెక్టర్లా' అన్నాడు వడివేలు హడలిపోయి.

'కాదు. నేను ఒకణ్ణే డైరెక్టర్ని' అన్నాడు డైరెక్టరు కొంచెం ఈసడింపుగా.

తక్షణం పురాణం విప్పేసి, తన కథ చెప్పేసి దాని పొడుగునా, నవరసాలూ - ముఖ్యంగా హాస్యం అభినయించి అవతల పారేశాడు వడివేలు.

"మీరే నాకు దిక్కు" అన్నాడు.

టెక్కు సంగతి మర్చిపోని డైరెక్టరు "లాభం లేదప్పా, నా దగ్గిర క్యూలో కొన్ని వందలమంది ఉన్నారు." అన్నాడు.

వడివేలు పట్టుదల చలించలేదు. సీట్లోంచి లేచిపోయాడు. ఉద్రేకంగా జీవితం గురించి, కళ గురించి, ట్రాజిడీ కామిడీ అంటూ బోల్డు అభిప్రాయాలు ప్రకటిస్తూ ఎంతో నటించాడు ఎన్నో యాంగిల్సులో.

అయినా లాభంలేదన్నాడు డైరెక్టరు.

"నేను పొద్దుట్నుంచి అన్నం తిన్లేదు. మీరు ఛాన్సిచ్చేదాకా తినను. చచ్చినాసరే" అన్నాడు వడివేలు.

"నేనెందుకు ఛస్తాను. నేను ఛావను. కావలిస్తే నువ్వే చావు" అన్నాడు డైరెక్టరు విసుగులోనే ఒఖ 'బ్రిలియంట్ టచ్' పడేస్తూ.

వడివేలుకు అఖండమైన అయిడియా వచ్చేసింది.

"చావమన్నారు కదూ. ఛస్తానులెండి. అమాంతం రైలు దూకేస్తాను. ఆనక తెలుస్తుంది. మీరే తోసేశారనుకుంటారు అంతాను" అన్నాడు.

"లేదని చెబుతాగా"

వడివేలు నంబియార్‌లా నవ్వాడు.

"ఇదేం సినిమా అనుకున్నారా ఆఖర్ని మంచివాళ్ళే కేసు గెలవడానికి, లైఫ్... రియల్ లైఫ్, మీకు తెలీదు కాబోలు ఈ సూటుకేసులో టెంథౌజండ్ రూపీస్ - పదివేల రూపాయలున్నాయి. నేను రైలు దూకి చచ్చాక, ఈ పెట్టి తెరిచినవాళ్ళేమనుకుంటారు? ఆ డబ్బు కాజెయ్యడానికే మీరు తోసేశారనుకుంటారు. మీకు నల్లకళ్ళజోడు. మేక గడ్డం, నోట్లో పైపూ లేకపోయినా సరే మీరే విలనంటారు... దూకేస్తున్నా వన్ టూ త్రీ" అన్నాడు వడివేలు.

డైరెక్టరు హడలిపోయి దారి కొచ్చాడు. రాకపోతే నిజంగా దూకేవాడినే అన్నాడు వడివేలు.

ఛాన్సు ఇస్తానని మాట యిచ్చాడు డైరెక్టరు. నిజంగా ఇచ్చాడు కూడాను.

కాని గమ్మత్తు ఏమిటో తెలుసా!

ఆ పెట్టెలో పదివేల రూపాయలూ లేవు. ఒకవేల రూపాయలు కూడా లేవు.

రెండువీసెల పత్రికలూ, నాలుగైదు కాళీ సీసాలు ఉన్నాయి.

జేబులో డబ్బయిపోతే, చటుక్కున వాటిని అమ్మితే రెండ్రూపాయలు వస్తాయిగదా. అప్పుడు ఇంటికి టెలిగ్రామిచ్చి, "ఓ కాఫీ తాగి పాట పాడుతూ బెంగెట్టుకోడానికేనా సదుపాయం ఉంటుంది. ముందు జాగర్తన్నమాట. నువ్వూ జ్ఞాపకం వుంచుకో. న్యూస్ పేపర్లు బంగారు నగలవంటివి. ఆపదలో ఆదుకొనును.

ఇపుడు చెప్పు వరహాలరాజూ. నీకాధైర్యం ఉందా? కనీసం అలా బుకాయించి నెగ్గే ప్రజ్ఞ ఉందా? నీకా ఉపాయం తట్టి ఉండేదా? అన్నాడు నరసన్న కథ ముగిస్తూ

గుడ్లప్పగించి వింటున్న వరహాలరాజు అడ్డంగా తల తాటించాడు.

'అయితే లాభంలేదు' అన్నాడు నరసన్న.

❀ ❀ ❀ ❀

వరహాలరాజు మొహం ముత్యం అంత అయిపోయింది.

దిగాలుగా తల వంచుకున్నాడు.

సినిమాలో ఇలాటి సీనువస్తే నేపథ్యగీతం రావాలి.

నా, ఇంతేనా, జీవిత మింతేనా, ఈ జీవిత మింతేనా అని మాధవపెద్ది సత్యం, కొండొకచో ఎం.ఎస్. రామారావు, రాజు పరిభాషలో "ధణుతెగర గొట్టేలా" పాడాలి.

వరహాలరాజు తలవంచుకుని చాలా సేపు చూశాడు గాని అతనికి అలాటి సదుపాయం జరగలేదు. ఇక తప్పదని తనే పెదిమలు కదలేద్దామనుకుంటున్నాడు.

అంతలోకీ హఠాత్తుగా "ఇంతేలే – జీవిత మింతేలే – ఈ జీవిత మింతేలే – ఈ నీ జీవిత మింతేలే" అన్న పాట – లేక మాట, కాస్త కఠినంగా వినబడింది.

"ఛీ వరస తప్పింది. గొంతు బొంగురుపోయింది" అనుకుని పొడిదగ్గుతో సర్దుకున్నాడు రాజు.

అయినా ఆ పాట వినబడింది! తల ఎత్తాడతడు.

ఆత్మహత్యకి ప్రయత్నిస్తున్న హీరోయిన్‌ని ఆపడానికి వచ్చే సినిమా సాధువులా నవ్వుతున్నాడు నరసన్న. అతని పెదిమలు కదులుతున్నాయి.

'ఓహో ఈయనా పాడుతున్నాడు. ఇంకా నేనే ననుకున్నాను నయం' అనుకున్నాడు రాజు. అనుకుని, "ఓ మీరా!" అన్నాడు.

"మీరా కాదండి. మీ ఘంటసాలదే అనుకుంటా... తెలుగు సాంగు" అన్నాడు నరసన్న రాజుని అపార్థం చేసుకుని.

"మీరా ఎవరూ!" అన్నాడు రాజు.

"మీరా అంటే ఎం.ఎస్. సుబ్బలక్ష్మి కదండి. బ్యూటిఫుల్‌గా పాడింది. నేను పాడింది అదిగాదులెండి. టెలుగూ నేపథ్యపు సాంగు. మీకు తెలిసుండాలే. మీ ఫేసుమీద చాలా ఫీలింగు కనపడితే పాడాను."

రాజు సిగ్గు పడిపోయాడు. "ఎప్పుడూ అంతేనండి. నా ఫేసుమీద మంచి ఫీలింగులు ఉంటాయి... ఇప్పుడు పాడింది మీరన్న మాట."

"నా పేరు మీరన్న కాదు నరసన్న.... మీకు దిగులుగా ఉంటే ఉంది కాని, అలా పరాగ్గా మాటాడి నా పేరు మార్చకండి" అన్నాడు నరసన్న కొంచెం చిరాగ్గా.

"మీరు నన్నర్థం చేసుకోవటం లేదు నరసన్నా."

"ఏవయ్యోయ్! ఎక్కడేనా బావగాని వంగతోట దగ్గర కాదన్నారు "

ఈ సినిమా డైలాగులు బాగానే ఉన్నాయి కాని నాకు టోకరా యివ్వడానికి వాడకు. మళ్ళీ చెబుతున్నా స్పష్టంగా. ఇందాక నేపథ్యపు సాంగు పాడింది మీరాకాదు; మారన్నాకాదు. నేను. నా పేరు నరసన్న. బోధపడిందా?"

"పడిందండి..."

"సరే ఇంక అలా ఏడుస్తున్నపోజు మార్చెయ్యి. ఎందుకలా బెంగ పడడం?"

"మీరు చెప్పిన కథలు వింటే, భయం వేస్తోంది. దబాయించడం కొంచెం కూడా చేతకాదు గదా, ఈ 'పాపం పసివాడు.' ఎలా ఛాన్సు సంపాదించగలడా అని ఏడుపొస్తోంది." అన్నాడు రాజు వినమ్రుడై నవ్వుతూ.

నరసన్న పకపక నవ్వేసి, రాజు భుజంమీద చరిచాడు.

"మరేం ఫరవాలేదు. తప్పక పైకొస్తావు. ఏడుపొస్తోంది. అన్నమాటని నవ్వుతూ సినిమాటిక్‌గా, స్టయిలిష్‌గా చెప్పగలిగావంటే నువ్వేమన్నా సాధించగలవు. నొసలు నిజం చెబితే నోరు అబద్ధం చెప్పాలన్నారు. ఆ సదుపాయం కోసమే దేముడు మనకి నోరు సప్లయి చేశాడు కదా. నోరు నిజం చెబుతే నొసలబద్ధమాడాలి. నీకీ విద్య వచ్చింది. వత్సా! భయపడకు. ఇంక ప్రపంచతంత్రం కాస్త నేర్చేసుకుంటే నీకు ఢోకా ఉండదు" అన్నారు నరసన్న గంభీరంగా.

రాజు నొసలే ప్రశ్న అడిగాయి అదేమిటని.





# ప్రపంచతంత్రం

పంచతంత్రంలో వలెనే ప్రపంచదంత్రమును నైదుభాగమ్ములు అన్నాడు నరసన్న.

"మళ్ళీ నా మీద కోపం వచ్చినట్టుంది. మనిద్దరికీ అరగని తిరగలి భాషలో పడ్డారు" అన్నాడు రాజు.

"ఫరవాలేదు... ఏం. ఈ అయిదూ ఏమిటంటే - ఒకటి నోటితో మెచ్చుకుంటున్నా నొసలతో వెక్కిరించి 'ఆత్మగౌరవం' నిలుపుకుంటూ, పబ్బం గడుపుకోవడం.

రెండు: నోటా నొసటాకూడా దారుణంగా మెచ్చేసుగోవడం.

రెండిటా- అనగా ద్వికరణ శుద్ధిగా అసహ్యించుకుని ఆ సంగతి చెప్పడం.

'త్రికరణశుద్ధి' అన్నమాట గురించి పట్టించుకోకూడదు. మనసా వాచా ఒక పద్ధతిలో నడుచుకున్నా, క్రియచేత స్వతంత్ర విధానాలు అనుసరించడం.

ఐదవదీ ఆఖరుదీ ఏమిటంటే శత సహస్రాధిక ముఖాలు గల టోకరా కళను కూలంకషంగా వంటబట్టించుకుని, జీవితానికి పట్టించి కథ నడపడం. టోకరా అంటే చెడ్డపని అనుకోకు. అవసరాన్ని బట్టి ఆ మహావిద్యని వాడితే తప్పులేదు,

అబద్ధం ఆడడానికి లైసెన్సు యిచ్చిన ఛాన్సులు ఎన్ని ఉన్నాయో జ్ఞాపకం ఉందా... వారిజాక్షులందు వైవాహికములందూ అంటూ ఎవడో ఒక లిరికల్ డైలాగు రాశాడు చూడు. అది రాసుకొచ్చి కంఠతా పట్టెయ్. ఒంటికి మంచిది.

ఏం? ఇప్పుడు ప్రపంచతంత్రం అనే హెడ్డింగుకింద ఒక టోకరాసురుడి కథ చెబుతాను విను" అన్నాడు నరసన్న.





# టోకరాసురోపాఖ్యానము

"పూర్వము హాలీవుడ్డు అనే గ్రామంలో హరనాధ్‌బాబా అనే అసహాయ శూరుడుండేవాడు..."

"అదేమిటి మేష్టారూ - హాలీవుడ్‌లో హరనాధ్‌బాబా యెలా ఉంటాడండి? మీ బొందలా ఉంది."

"ఎందుకుండడు. యతికోసం చచ్చినట్టు పుచ్చిన కుక్కలా ఉంటాడు. ఏదో ఇంక తెలుగు పిక్చర్‌లకి డైలాగులు రాయాలికదా. అలవాటైపోయింది. పోన్లే. హాలీవుడ్‌లో హారిసన్ అనే వాడున్నాడు."

"ఇంకా వున్నాడాండి."

"ఇప్పటి సంగతి కాదు. పదిహేనేళ్ళ క్రితం ఉన్నాడుట. దరిమిలా ఉండటం మానేశాడేమో తెలీదు." అన్నాడు నరసన్న.

"వాడేం చేసేవాడంటే - " అని కొనసాగించాడు.

అంతలోనే స్టేషన్ వచ్చింది.

"చూడు బ్రదర్, నీ పేరేమిటి?" అన్నాడు నరసన్న కథను ఆపి.

"రాజు" అన్నాడు రాజు.

"భేష్ రైలాగ్గానే వెళ్ళి మనిద్దరికీ కాస్త టిఫినూ, కాఫీ, ఓ పెట్టి సిగరెట్లు కొట్టుకొచ్చేయి. నేనో రూపాయిస్తాలే... అలా చూస్తావేం. కథని మాంఛి రసపట్టులో ఆపేశానని నిరుత్సాహంగా ఉందా?"

"మీరింకా మొదలెట్టలేదుగా" అనుకుంటూ, "ఔను మరే" అంటూ నవ్వాడు రాజు.

రైలాగింది. రాజు మరచెంబు పట్టుకువెళ్ళాడు కాఫీ కోసం.

బీదలకు అంబలి దానం చేస్తున్నవాడి తరహాలో అక్కడి హోటేలు వాళ్ళు చాలా రీవిగా, చిరాగ్గా సరుకులమ్ముతున్నారు.

తను తిని, గురూజీకి ఫలహారం కట్టించేవరకు రైలు కూతకూసింది. ఉరకలూ పరుగులుగా వచ్చి పెట్టెలో కెక్కిపోయాడు రాజు.

నరసన్న లేడు!

ఏడీ నరసన్న! అని ఆశ్చర్యపడ్డాడు రాజు.

"అన్నా నరసన్నా లేవా ఇక లేవా" అనే పాట పాడబోయి, ఈలోగా వచ్చేస్తాడేమోనని ఓ క్షణం తటపటాయించాడు రాజు.

"మీ బాబాయిగారు అర్జెంటుగా రైలుదిగి వెళ్ళారండి ఎవరో ఫ్రెండు కనబడితేను" అన్నాడు అసింటా కూర్చున్న రైల్వే బైరాగి లాలనగా నవ్వుతూ.

"మా బాబాయెవడు? మధ్య నువ్వెవరు?" అంటూనే అప్రయత్నంగా వంగి బల్ల కిందికి తొంగిచూశాడు రాజు.

పెట్టె గల్లంతు!

"హారినీ!" అన్నాడు రాజు హడావుడిగా.

"ఆయన మీ బాబాయి కాదా? నే అనుకున్నాలెండి. ఆ హడావుడి చూసి. పాపం మీ పెట్టి తీసుకుపోయి ఆయనది వదిలేశాడు కాబోలు. ఆ పక్కకి చూడండి." అన్నాడు బైరాగి.

దానికి తాళం గీళం లేవు. రాజు ఆ పెట్టె తెరిచాడు.

సుమారు రెండువీశల న్యూస్ పేపర్లూ, రెండు మూడు ఖాళీసీసాలు అందులో ఉన్నాయి.

రాజుకి నోట మాట రాలేదు. 'కథన్నా పూర్తిగా చెప్తివి గాదు నరసన్నా' అన్నాడు మెల్లిగా.

'ఆయన చెబుతున్న కథ ఏమిటండీ?' అన్నాడు రైల్వే బైరాగి.

"టోకరాసురోపాఖ్యానంట" అంది రాజు నోరు; నీకెందుకు అన్నాయి అతని నొసలు.

"అదే ఇది" అన్నాడు బైరాగి బీడీ ముట్టిస్తూ.

"వీడి దుంపతెగ! వీడి కెప్పుడూ ఒక్కలాటి వేషాలే దొరకా... టోకరా కథలు చెబుతూ చెబుతూ నాకే టోపీవేసి మస్కాకొట్టాడే..... ఆ పెట్టినిండా ఫిలింస్టోరీలూ, డైలాగులూ, స్టిల్సూ, సినిమాటోగ్రఫీ– అన్నిటికన్న ముఖ్యం త్రీధౌజండ్ సాంగ్సూ ఉన్నాయికదా, ఇప్పుడెలా?" అన్నాడు రాజు మెల్లిగా.

"అవన్నీ మీరు రాసినవే! ఓరి బాబో" అన్నాడు రైల్వే బైరాగి అద్భుతరసాన్ని నటించి.

"ఔనండి నేను చాలా బ్రిలియంట్ ఫెలోని లెండి.... అన్నీ నేనే రాశాను.... మావద్ద అన్ని రకముల సాంగ్సూ దొరుకును.... ఏడిచేవి, నవ్వేవి, జోలపాటలూ, నేపథ్యపాటలూ అన్నీ హోల్ మొత్తం త్రీథౌజండ్ ఉన్నాయండి. ఈ దొంగపీనుగ వాటితో గబుక్కున, నాకన్న ముందర గొప్పవాడై ఊరుకుంటాడు... ఇంత పచ్చిదొంగ అనుకోలేదు రైల్వేబైరాగిగారూ.... వీణ్ణేమనాలో తెలీటం లేదు స్వామీ" అన్నాడు వరహాలరాజు హృదయ విదారకంగారుగా.

రైల్వేబైరాగి ఒక్కక్షణం ఆలోచించారు. తనకు తోచిన మాటలు సూచించటానికి.

"పుస్తకాల్లో రాసుకునే మాటలే చాలనేపక్షంలో, దొంగ పీనుగ, కంత్రీవెధవ, పచ్చికేడీ, దండువెధవ, ఇంగ్లీషులో రాస్కెల్, ఇంకా దుర్మార్గుడు, క్రూరుడు, మరీఘాటుగా తిట్టాలంటే అప్పులవాడూ, టిక్కెట్టు కలెక్టరు అనవచ్చును." అన్నాడు రైల్వే బైరాగి గుక్క తిప్పుకోకుండా.

గుక్క తిప్పుకోడానికి తెరిపి చేసుకోగానే.

"అయ్యా ఒక్క చిన్న మంగుళూరు బీడీ - అణాకాన్రకం ఇవ్వండి" అన్నాడు.

రాజుకి బైరాగి సలహా నచ్చలేదు.

"థాంక్యూ, మీ డైలాగు బాగానే ఉంది గాని ఘాటుగా లేదు. మాటమాటకీ నూటొక్క అర్థాలుండాలి. సినిమా డైలాగులు మీరు వినలేదు కావును. ముఖ్యంగా ఆక్షేపు డైలాగులుకి, ఉండేవి రెండర్థాలే అయినా ఎంత బ్రహ్మాండంగా ఉంటాయని!" అన్నాడు రాజు.

"నీకు నాలుగు చేతులున్నాయిస్మీ" అంటూ భక్తుడు చెబుతుంటే వింటూ నిల్చున్న విష్ణుమూర్తిలా నవ్వాడు రైల్వేబైరాగి.

"ఎందుకు నాయనా! మానిన గాయాలని మరచిన ఆశయాలని రేపుతావు" అన్నాడు మందహాసం చేస్తూ. అది కాస్తా అతగాడి గడ్డంలో చిక్కడిపోయినందువల్ల రాజుకి కనపడలేదు. కాని ఇతగాడూ ఇంకో కథ చెప్పి ఇంకేమన్నా ఎత్తుకుపోతాడేమోనని భయం వేసింది. అందుకని మాట్లాడకుండా, బైరాగులతో నాకేమిటన్న పోజును అభినయించి, తల అటువేపు తిప్పాడు.

"హుం అన్నీ పోతే పోయాయిగానీ ఎడ్రసులుపోతే ఎలాగ?...." అని గొణుక్కున్నాడు ఉండబట్టలేక.

"ఎవరెడ్రసులు బాబూ - బీడీ ఇచ్చావు గాదు" అన్నాడు బైరాగి కాస్త దగ్గిరగా జరిగి ముందుకు ఒరిగి.

రాజుకి దుఃఖం తిక్కకోపం జమిలిగా ముంచుకొచ్చాయి.

"ఎవరెడ్రసు లేమిటయ్యా, సినిమాస్టార్ల ఎడ్రసులు. ఒకటా రెండా? వందా? యాభయా? వందా యాభయీ.... చచ్చిచెడి సంపాదించాను."

"దానికేముంది నాయనా. ఏ సినిమా పత్రిక్కొన్నా కొల్లలుగా దొరుకుతాయి. ఈపాటిదానికే ఏటికీ బెంగ? ఒక్క బీడీ ఇచ్చావు గాదు" అన్నాడు.

రాజు ఉలిక్కిపడ్డాడు. "మీరు సాంగు రైటరాండి కొంపతీసి?" అన్నాడు.

బైరాగి బాధగా నవ్వాడు. "వద్దన్నానా నాన్నా? నా మానిన ఆశయాలూ, నే మరచిన గాయాలూ... మళ్ళీ"

"సార్.... తప్పు చెబుతున్నారండి మానిన గాయాలూ మరచిన ఆశయాలూ అనాలి.... ఇంకోటి. నన్నడిగితే ఆశయాల్లో శకారం తీసి పారేస్తే బెష్టు. గాయాలూ, ఆయాలూ అని స్మూతుగా ఉంటుంది" అన్నాడు రాజు.

బైరాగి 'బాధను అణచుకొనుట' అభినయించి 'విషయమును మార్చి ప్రయత్నించుట'ను నటించి "ఆ ఎడ్రసులు దొరకవన్నారు చూడండి... ఎక్కడన్నా దొరుకుతాయిగా.... నా బీడీ డైలాగులు మీరు వింటం లేదు" అన్నాడు.

"లేదులెండిసార్.... మీరు చెప్పే పుస్తకాల్లో సినిమావాళ్ళ పేరు ఉంటుంది కాని ఎడ్రసులు సరిగ్గా ఉండవు. అంతెందుకు నాకు తెలిసిన ఒక అసిస్టెంటు డైరెక్టరు పేరేసి, అడ్రస్ కేరాఫ్ కోడంబాకం హైరోడ్డు అని రాసి ఊరుకున్నారు..."

"అంతేలెండి! మీకు తెలిసిన ఆ అసిస్టెంటు ఆ రూటులోనే తిరుగుతూ ఉంటాడు. పెర్మనెంటు అడ్రసన్నమాట" అన్నాడు బైరాగి ముక్కుపుటాలు ఎగరేస్తూ.

"హో.... అలాగండి. నాకు తెలీదులెండి. నేను ఒక్కో పత్రికకి ఒక్కొక్క స్టారు అడ్రసు అడుగుతూ రాసి జవాబు తెప్పించి అవన్నీ పోగేశాను లెండి. ఎలాగైనా ఎడ్రస్ లేకుండా మెడ్రాసు వెళ్ళడం ఎందుకని-"

బైరాగి మాట్లాడలేదు. నిమిషం రైలు టాపువైపు చూస్తూ ఇంకా ఆలోచించాడు. ఆనక రాజు మొహం 'లెవెల్'కి దింపి "ఎవరెడ్రసులు కావాలి మీకు?" అన్నాడు గంభీరంగా.

రాజు బాధగా నవ్వాడు.

"మీరేం ఆర్చేవారా, తీర్చేవారా స్వామీ?" అన్నాడు.

"వాళ్ళిద్దరూ ఎవరో నాకు తెలీదుగాని మీరు నా మానిన గాయాలు, మరచిన ఆ(శ)యాలు రేపారు. ఇంకెందుకు? చెబుతున్నా నేనొహ కారక్టర్ యాక్టర్ని లెండి" అన్నాడు బైరాగి బాధగా తలవంచుకుని.

"ఛా!.... నాకు తెలీదుసుమండీ, కల్లోకూడా అనుకోలేదు. అయితే మీరూ మెడ్రాసే నన్నమాట.... సినిమాల్లోనే చేరుతారా?"

"కాపోతే పెరంబూరు కోచి ఫ్యాక్టరీలో చేరతానండీ? మీరు మరీ ఇదిగాని... ... బీడీ ఇచ్చారు గాదు."

"అయితే మీకు అందరి ఎడ్రసులూ తెలుసునన్నమాట-"

బి.ఎ. ప్యాసైన వాణ్ణి ఎ.బి.సి.డీలు వచ్చునా అంటూ చిన్న పిల్లాడు అడిగే ప్రశ్నకి, జవాబులా నవ్వాడు బైరాగి. ఎ. నాగేశ్వరరావు 38 సారంగపాణి స్ట్రీటు. టీనగర్, ఎన్.టి. రామారావు, 63 బజుల్లారోడ్డు, టీనగర్... అంటూ ఏబీసిడీల వంతుగా ఏకబిగిన ఏకరువు పెట్టాడు.

రాజుకి అతనిమీద ఎనలేని భక్తి తాత్పర్యాలు కలిగాయి.

"నివురుగప్పిన నిప్పులా" - అన్నాడు ఆనందగాద్గదిక స్వరంతో.

"వెదకబోయిన తీగలా - బీడీలేదా?" అన్నాడు బైరాగి ఉత్సాహంగా.

"సార్ తీగ డైలాగులు వద్దండి. ఇందాక నా పెట్టి ఎత్తుకుపోయిన వాడితో మాటాడుతూ ఇదే అన్నాను. ఇప్పటికి రెండు తీగలు తగిలాయి వెతక్కుండానే. వాటిలో చిక్కడి బోల్తాకొట్టాను."

"అలా భయపడితే ఎలా? సినిమాలో చేరి పైకి రావాలంటే ఎంత ధైర్యం ఉండాలి, ఎంత శక్తి ఉండాలి."

"అదేం ఫరవాలేదు సార్. ఒక్కోసారి భయపడ్డ వాళ్ళకీ, ఎవరూ తెలీని చిన్నవాళ్ళకీ ఛాన్సులు వస్తాయిలెండి. దేవికారాణి కంటబడేదాకా దిలీప్‌కుమార్ పళ్ళదుకాణం నడిపేవాడట. ఆవిడ అతను మంచి నటుడవుతాడని పసిగట్టి, సిఫార్సుచేసి సినిమాఛాన్సు ఇప్పించిందట. అలాగే, లైట్‌బాయ్‌గా ప్రవేశించి తారాపధాన బ్రహ్మాండమైన కీర్తిప్రతిష్ఠ లార్జించి పెద్దయాక్టర్ ప్రొడ్యూసర్ డైరెక్టరయిన రాజ్‌కపూర్-"

"హుం... ఈ కథలు అందరికీ తెలుసు. వాళ్ళకి తెలివితేటలూ అదృష్టమూ కూడా కలిసొచ్చాయి. వుత్త తెలివితేటలతో ఛాన్సులు సంపాదించిన సూరదాస్ కథ చెబుతా విను" అన్నాడు బైరాగి.






సూరదాస్ మొదట సూరత్‌లో ఒక దుకాణంమీద రైటరుగా ఉండేవాడు. హఠాత్తుగా పరారై బొంబాయిలో తేలి, అక్కడో ఇంగ్లీషు హోటలులో వెయిటరుగా చేరాడు. నీలాగే డైలాగులూ, సాంగులూ, కథలూ రాసేవాడు తీరికవేళలో. ఇలా ఉంటూ ఉండగా రోజూ ఆ హోటలుకి కాఫీ తాగవచ్చే ఒక డిస్ట్రిబ్యూటరు కొడుకుతో పరిచయం కలిగింది. అదెలాగంటావేమో. ఇంగ్లీషు హోటేలు కదూ మరి. అందుకని అక్కడ వెయిటర్‌లంటే మామూలు సర్వర్లులా సామాన్యులు కారు. మాన్యులు. డైలాగు గుర్తుంచుకో బాగుంటుంది. ఏం. కాఫీ తాగబోయేవారికి కూడా వాళ్ళంటే ఒకరకమైన భయభక్తులుండేవి. బేడ కాఫీ తాగి, పావలా 'టిప్' అంటే బహుమానం ఇచ్చి అణా ఎత్తు సలాం పుచ్చుకు మురిసిపోతారులే. కాఫీ బాగుండకపోయినా ఫర్వాలేదనుకో. ఈ హోటేలుకి లాలారాం అనే డిస్ట్రిబ్యూటరు కొడుకు రోజూ వచ్చేవాడు. అతను ఫలానా అని సూరదాసు పసికట్టేశాడు. అక్కణ్ణించి అతనికి సకల మర్యాదలూ చేయడం మొదలెట్టేడు. కాఫీ అడిగిన 30 నిముషాలకల్లా కలిపి తెచ్చిచ్చేవాడు. పావలా టిప్ ఇస్తే రూపాయెత్తు సలాంపెట్టి "ఆప్‌కే గులాం జనాబ్." అన్నంత పని చేసేవాడు.

లాలారాం కొడుక్కి ఆనందం పట్టశక్యం కాక, వత్సా వరమడుగు అన్నాడు హిందీలో.

"సినిమా ఛాన్సు" అన్నాడు సూరదాసు దర్జాగా.

"అది తప్పు" అన్నముక్క అనడం పొరపాటున మర్చిపోయిన ఆ డిస్ట్రిబ్యూటరుడు నాలిక్కరుచుకుని, ఇది వీడి అదృష్టంలే అనుకుని, సరే రేపురా మాపురా అని కొన్నాళ్ళు తిప్పి, చివరకు ఒకరోజున తండ్రి ఎదుట నిలబెట్టి తనమాట నిలబెట్టుకున్నాడు.

ఇంగ్లీషు హోటలు వారికిచ్చే వాగ్దానాలు ఆవశ్యం నిలబెట్టుకోవలసినవి గదా!

సరే, లాలారాంగారు ఆవేళ మంచి హుషారుగా ఉన్నారు. సూరదాసును చూస్తూనే ఏం కావాలన్నారు.

"సినిమా ఛాన్సు" అన్నాడు సూరదాసు ముక్తసరిగా.

"ఎందులో? యాక్టింగా, రాయడమా, ఫోటోగ్రఫీయా, డైరెక్షనా? ఏమిటి?" అన్నాడు లాలారాం.

"ఏదేనా సరేండి. అన్నీ చెయ్యగల్ను అందుకే చెప్పలేదు" అన్నాడు సూరదాసు ఠీవిగా.

లాలారాంగారు మురిసిపోయాడు ఈ ఆసామి తెలివితేటలకు. ఫలాన అని చెబితే 'అయ్యో అందులో కాళీలేదు' అని చెప్పి తప్పించుకోవడం లాలారాంకు అలవాటు. ఆ సంగతి సూరదాసుకు తెలుసు.

"ఇన్నాళ్ళకి తెలివైనవాడిని చూశాను, నీకేమివ్వడానికి నాకభ్యంతరం లేదుగాని, కొత్తవాడివి కాబట్టి కొన్నాళ్ళు కథలూ, డైలాగులూ, పాటలూ రాయి." అన్నాడు లాలారాం.

"పోనీ డైరెక్షను చెయ్యమనరాదూ నాన్నా?" అన్నాడు పక్కనే ఉన్న అతని కుమారుడు.

"ఏదేనా ఒకటే అనుకో. నాకభ్యంతరం లేదుగాని, డైరెక్టరుకి ఇంకొంచెం ఒడ్డూ పొడుగూ ఉండాలి" అన్నాడు లాలారాం.

ఆ తరువాత నాలుగైదు ప్రశ్నలు వేశాడు నిగ్గు తేల్చుకోడానికి.

"సూర్‌దాస్ జీ! రామాయణం చదివారా?"

"విన్నానండి. చిన్నప్పుడు మా బామ్మ ఆ కథంతా చెప్పేసింది. ఆనక, ఇంక చదవడం ఎందుకని ఒరిజనల్ చదవలేదండి."

"వెరీగుడ్ చాలు. బాల్యం నుండీ రామాయణం అంటే అభిమాన గ్రంథం అన్నమాట. మీరు డైరెక్టరయ్యాక ఈ పాయింటుకి పబ్లిసిటీ ఇద్దాం. ఇండియన్ కల్చర్ ఇపుడు ఫాషన్ లెండి!.... సరే వాల్మీకి రాసినది యింకేమన్నా చదివారా?"

"ఏవో చాలా చదివానండి గుర్తులేదు."

"ఫరవాలేదు. మీరు ఇపుడు సినిమా రైటరు. జాగ్రత్తగా ఈ ప్రశ్నకు జవాబివ్వండి. రామాయణం ఎండింగులో ఏమౌతుంది? సీత దొరుకుతుందా?"

సూర్‌దాస్ ఆలోచించాడు. "ఏం చెప్పగలమండి మీరు ఇలా హఠాత్తుగా అడిగితే. స్క్రిప్టునిబట్టి ఉంటుంది."

"ఒక్కొక్క జపాన్ చిత్రాన్ని లేక ఇటాలియన్ చిత్రాన్ని ఎన్ని ఇండియన్ ఫిలిములకి వాడొచ్చు?"

"కనీసం ఆరు కథల్లోకి లాగొచ్చునండి" అన్నాడు సూర్‌దాస్ వినమ్రత వుట్టిపడేలా.

"వండ్రఫుల్" అని ఎగిరి గంతెయ్యబోయాడు లాలారాం. మనిషి లావైనందువల్ల అది సాధ్యపడలేదు.

"ఒక సీనులో హీరోయిన్ తల్లిని లాగి లెంపకాయ కొడుతుందనుకో. అప్పుడేం జరగాలి?"

"ఘోరున ఏడుస్తూ మీదపడి కౌగలించుకోవాలండి. అదయిపోయాక పాట పాడొచ్చు."

"బ్యూటీ.... సోషల్ పిక్చర్‌లో క్లెయిమాక్సు సీనులో తప్పకుండా రావాల్సిన డైలాగు ఏమిటి?

"రైరో... అండి."

"సెబ్బాస్... అన్నట్టు అబ్బాస్ ఎవరు?"

"'రాహి' సినిమాకి స్టోరీ రాసినవాడు"

"మళ్ళీ సెబ్బాస్ అంటున్నాను. అని నిన్ను తక్షణం బుక్ చేస్తున్నాను. నేను డిస్ట్రిబ్యూట్‌చేసే పిక్చర్లలో మూడింటికి నువ్వే రైటరువి. స్టోరీలాలోచించు" అన్నాడు లాలారాం.

"విన్నావా. నువ్వంత నేర్పుగా చాకచక్యంగా మాట్లాడి మాట నిలబెట్టగలవా? రాముడికథ ఎండింగు ముందస్తుగా చెప్పలేమన్న నగ్నసత్యం నీకూ తట్టి ఉండేదా?" అన్నాడు రైల్వే బైరాగి.

రాజు అడ్డంగా తల తాటించాడు.

"అయితే లాభంలేదు.... ఒక బీడీ ఇయ్యి" అన్నాడు బైరాగి బాధగా.

తెల్లగా తెల్లవారే వరకు రైలు గూడూరు చేరబోయింది. రాజు కిటికీమీదికి ఒరిగి నిద్రబోతున్నాడు. పట్టశక్యంకానంత ప్రేమ పెల్లుబికిన ప్రియురాలిలాగా చల్లటిగాలి, వరహాలరాజు చెంపలను ప్రగాఢంగా అదుముతున్నట్టు నిమిరి మరీ దూసుకుపోతోంది. రైలింజనులోంచి ఎగిరివస్తున్న నిప్పురవ్వలు ప్రేయసి నఖక్షతాలలాగా చెంపమీద చురుకు చురుకు మంటున్నాయి.

సదరు సదుపాయాలవల్ల చురుకైన రాజు బుద్ధి, నిద్రలో చిన్న సైజు 'డ్రీం సీక్వెన్స్' తయారుచేసింది. గుర్తు తెలీని హీరోయిన్‌తో, కంఠతాపట్టి కాపీకొట్టిన హిందీ ట్యూనులో డ్యూయెట్ పాడుతూ టాపులేని హాలులో గొల్ల స్తంభాలాటలా పరుగెడుతున్నాడు రాజు.

మూడు నిముషాలు కాగానే హిందీ ట్యూను అయిపోయినందువల్ల డాన్సు, దానిమూలాని ఆ కలాకూడా మెల్లిగా ఫేడౌట్ అయి కరిగిపోయాయి. అక్కడితో

రైలుగాలికి చల్లటి, మెత్తటితనం పోయి చలిగాలి గుణం అబ్బినట్టయింది. మెల్లిగా మత్తుగా కళ్ళు తెరుద్దామనుకుంటున్నాడు.

తెల్లవారెను, కోడికూసెను, అంటూ మాయామాళవగౌళరాగంలో బైరాగి పాడుతున్న పాట బాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌గా అమరింది. బాగుందనుకొని అది పూర్తికావచ్చేదాక ఆగి కళ్ళు తెరిచాడు రాజు.

రైల్వేబైరాగి నవ్వాడు రైల్వేబైరాగిలాగ.

"మీరున్నారా!గురూ" అన్నాడు రాజు కొంచెం ఆశ్చర్యపడి.

బైరాగి చిన్నబుచ్చుకున్నాడు.

"ఉండక, పోయేం చేస్తానయ్యా, ఎత్తుకుపోడానికి నీ దగ్గరున్నవి ఎత్తెడు న్యూసుపేపర్లేగా" అన్నాడు కాస్తంత ఎత్తిపొడుపుగా.

"రెండు కాళీసీసాలు కూడా ఉన్నాయండి. పాతపేపర్లూ, కాళీసీసాలూ బంగారు ఉంగరాలవంటివి. ఆపదలో ఆదుకొనును అని చెప్పాడు వాటిని నాకు వదిలివేసిన టోకరా రాక్షసుడు" అన్నాడు రాజు పెంకెగా.

"అయితే నేనూ అలాంటి వాడిననుకున్నావా.... మొహం చూస్తే తెలీటంలే."

"పోతన్న రాసిన ఉప్పుడైలాగు వినలేదా ఏమిటి మీరు. ఉప్పు కప్పురంబు నొక్కపోలికనుండు అని రాశాడులెండి. మీ యిద్దరూ ఒక్క పోలికన వుంటే బుద్ధులు వేరు వేరనుకోవచ్చు. పోలికలు వేరు కాబట్టి ఇప్పుడు బుద్ధులు ఒకటేనన్నమాట. అతను టోకరా ఇచ్చాడు; మీరు యిస్తారు గ్యారంటీ. అందుకే అడిగాను" అన్నాడు రాజు.

రైల్వే బైరాగి కొయ్యబారిపోయి "ఓరిబాబోయ్ ఎంత దారుణమైన సూక్ష్మబుద్ధి. నువ్వు నిజంగా డైరెక్టరు కావలసినవాడివి–బాబూ" అన్నాడు.

"ఎవడు చూడొచ్చాడు. అయితే అవనూ అవుతాను. ఇందాక అలా అన్నందుకు కోప్పడకండీ. నేను ఇంకా మెద్రాసయినా చేరకుండా సినిమాపేరుచెప్పి ఒక టోకరా తిన్నాను. అలాటివే మూడు విన్నాను.... సినిమా ఇంత డేంజరస్ అనుకోలేదు."

బైరాగి చనువుగా రాజు జేబులో సిగరెట్టు తీసుకొని ముట్టించి గంభీరంగా నవ్వాడు.

"పొరబడుతున్నావు. నీవు టోకరా తిన్నది సినిమాలవల్లగాదు. పోతే ఆ నరసన్న సినిమావాడూ కాదు. దొంగలు ఎక్కడేనా ఉంటారు. ఎప్పుడేనా ఉంటారు. వాడు రైలుదొంగ. నాకు తెలుసు. బాగుండదు, వాడికూటికి నేనెందుకు అడ్డు రావాలని ఊరుకున్నాను. చూడు, నీలాటి వెర్రిబాగులాడి మొహం చూస్తే దొంగలకి ఎంతో ముచ్చటేస్తుంది. నీక్కావలసిన కబుర్లు చెప్పి, వాళ్ళక్కావలసిన సరుకు తీసుకు చక్కాపోతారు. అంతేతప్ప, నువ్వు సినిమాలో చేరుతున్నావని తెలిసి ఎవరో స్పెషల్ డ్యూటీ వేసుకురాలేదు అని గంభీరంగా ఉపన్యసిస్తున్నాను" అన్నాడు బైరాగి.

"ఎవడు?"

"గుర్తులేదు, బహుశా నేనే అని వుంటాను. ఏం? వేయేలగాని, నిన్ను చూస్తే నాకు ఎందుకో దయగలిగింది. నేను హృషీకేశం పోతున్నాను ఎలాగాను. పోతూ పోతూ నీకు కాస్త హెల్పుచేద్దామని... ఒక్క కథ చెబుతా విను...." అన్నాడు బైరాగి.

రైలు గూడూరులో ఆగింది. "మొహం కడుక్కుని రెండు మాత్తర్లేసుకుని కాస్త కషాయం సేవించి వద్దాం పద. ఆనక స్థిమితంగా చెబుతాను మంచి కథ" అన్నాడు బైరాగి.

గూడూరు రైల్వేహోటలు మాత్తర్లు ఆయనకి సయించలేదు. ఎలాగో అవి తినేసి, కాస్త ఉప్మాకూడా పుచ్చుకుని, కషాయం ఉరఫ్ కాఫీ త్రాగి, బీడీలకట్ట కొనిపించుకుని వచ్చి కూర్చున్నాడు.

"చెప్పండి గురూ" అన్నాడు రాజు ఉత్సాహంగా.

గురువు కథ చెప్పాడు బీడీ ముట్టించి.






ఇదీ నా సొంతంకాదు. ఎవరో ఎవరికో చెప్పగా ఎక్కడో ఎప్పుడో విన్న బాపతు.

ఒక చలనచిత్ర నట పితామహుడిని, మరొక కాబోయే నటుడు పలకరించి, నమస్కరించి, "స్వామీ శక్తివున్నా చెల్లనివారూ, లేకపోయినా చెల్లదలచుకున్నవారూ, ఫెళ్ళుమంటూ వెలగాలంటే, ఏం చెయ్యాలి స్వామీ?" అని పృచ్ఛచేశాడు.

వత్సా వినుమని ఒక కథ చెప్పాడా వృద్ధుడు. ఈ ప్రపంచంలో డబ్బా అనేది చాల గొప్పది. విజయసాధనకు ఉత్తమ పరికరం. 'డబ్బా' మూడు విధములు. సొంతడబ్బా, పరడబ్బా, పరస్పరడబ్బా.

వీటిలో సొంతడబ్బా కొంతమందికే చెల్లుతుంది. రెండోది మనకి పనికిరాదు. మూడోది బెష్టు.

దానివల్ల ఏక్ దమ్మున ఇద్దరేసి వృద్ధిలోకి వస్తారు. కొండొకచో ఒకడు ముందర పై కెక్కిపోయి, అక్కడనించి రెండోవాణ్ణి జుట్టట్టుకు పైకి లాగేస్తాడు. (కొండొకచో నెత్తిన కాలేసి తొక్కేస్తాడనుకో) ఫలానా ఆయనకి దారుణమైన తెలివి తేటలున్నాయి అని ఒకడు మొదలెడితే, ఆ ఫలానావాడు 'అదుగో ఆ ఒకడు లేదూ...

వాడు అలా ఉన్నాడు గాని నివురుగప్పిన నిప్పు, మసిపూసిన మాణిక్యం' అని ప్రచారం చేస్తాడు. అదీ ఏర్పాటు.

పోతే రెండో మార్గం ఉందే, పరడబ్బా. అది ఒక విధంగా సొంత డబ్బాకి రూపాంతరం. పరడబ్బా అంటే, ఇంకోడు గొప్పవాడూ అని మనం పబ్లికున ఒప్పుకోవడమే అన్న అర్థం సరేసరి అనుకో. అలాకాక మనం ఘనులమంటూ 'ప్రతి ఇంకోడూ' కోడై కుయ్యడం అని కూడా ఒక అర్థం వస్తుందిగా. రామచామి అనే మ్యూజిక్ డైరెక్టరు, ఈ రెండో అర్థం ప్రకారం, చూస్తూవుండగా కళ్ళఎదుట, పట్టపగలు గొప్పవాడై ఊరుకున్నాడు.

పాపం అతడు ముందర, నీలాగే వేషం వేద్దామని వచ్చాడు. అది కుదరక, డైరెక్షన్ చేస్తానన్నాడు. పోనీ ఫోటోగ్రఫీ అన్నాడు. ఆఖరికి కథలూ, డైలాగులూ రాయ సిద్ధపడ్డాడు. నటనలోను, రాయడంలోను అతనికి కాస్తో కూస్తో ప్రవేశం ఉంది. కొంత అనుభవం ఉంది. అయినా అతన్ని గురించి డబ్బావాయించి ఓహో అనేవాడు లేక, అర్ధణాకి చెల్లలేదు అతని శక్తి.

ఒక్కొక్క శాఖలో ఛాన్సుకోసం వందేసి మందిని అడిగి లేదనిపించు కోవడంతో, ఒక్కొక్క శాఖకి ఉద్వాసన చెబుతూ వచ్చాడు. చివరికి, సంగీత దర్శకత్వం ఒకటే మిగిలింది. అందులోకూడా లాకేత్వం ఎదురైతే అతని గతి ఏమయేటట్టూ?

ప్లేబాక్ పాటలు పాడతానని ప్రయత్నించవోయ్ అన్నాడు అతని మిత్రుడు.

మనకి పాటలు రావుగదయ్యా అన్నాడు రామచామి.

చిక్కే. అయితే మ్యూజిక్ డైరక్షన్ కోసం ట్రయి చెయ్యి. అది సులభం కూడా. కిటుకులు నాలుగూ చటుక్కున తెలుసుకు అవీ ఇవీ కాపీకొట్టి కాలక్షేపం చెయ్యొచ్చు. కాస్తపేరొచ్చి గొప్పవాడి వయేసరికి సంగీతం కూడా చచ్చినట్టు వచ్చేస్తుంది. అని సలహాచెప్పాడు ఆ స్నేహితుడు.

అడిగి లేదనిపించుకుంటే, ఆ దెబ్బతో అతని కథ ఆఖరైపోతుంది. అందుకని చాలా జాగ్రత్తగా ఆలోచించాడు.

అప్పటికి అతనికి ఎకరంబాతిక సెంట్ల భూమి ఉంది. ఆపై పాతిక సెంట్లూ తెగనమ్మి, ఒకళ్ళిద్దరు జతగాళ్ళతో కలిసి చిన్న ఫిలిం కంపెనీ లేపాడు. పావలా అర్ధణా పెట్టుబడితో పదిలక్షల ఆర్భాటం చేసేసరికి, 'వీడిదగ్గర చచ్చుసంభావన పాతికవేలు ఉంటుందిలే.' అనుకుని పదివేలున్న ఒక పెద్దమనిషి అందులో చేరాడు.

సరే రామచామి మ్యూజిక్ డైరెక్టరు, ఆ పెద్దమనిషి ఫిలిం డైరెక్టరూను. మిగతా కంపెనీలకి ఈ రామచామి సంగతి తెలిసింది.

ఓహో కాబోలనుకున్నారు.

అక్కడినుంచి రామచామి తన ప్లాను ఆచరణలో పెట్టాడు:

రామచామిది భారీవిగ్రహం. తెలుగు సినిమా అంత – ఆమాటకొస్తే దాదాపు అరవ సినిమా డైలాగంత పొడుగ్గా ఉండేవారు. కాగా సగటు భారతీయ హీరోయిన్ అంత లావుగా ఉండేవాడు.

చక్కగా పొద్దునే స్నానంచేసి, విభూది పిండికట్లు దిద్ది, అర్ధరూపాయంత కుంఖం బొట్టుపెట్టి, గజంబద్ద మింగేసినట్లు నిటారుగా నిలబడేవారు.

ఏం? ఇలా తెల్లారేసరికల్ల ముస్తాబై, కంపెనీ వానులో కూర్చునేవాడు. అతని శిష్యబృందం పదిహేనుమంది.

వాళ్ళంతా చూడడానికి శిష్యుల్లా ఉన్నా నిజానికి గురువులన్నమాట. రామచామికి ఒకడు వణకడం నేర్పాడు. ఆ వణకడాన్ని సంగీతపు గమకంగా మార్చడం నేర్పాడు మరొకడు. రాగాల పేర్లన్నీ రాసిచ్చి బట్టీ వేయించాడు మరొకడు. వాయిద్యాల పేళ్ళూ, వాటి చప్పుళ్ళ గుర్తులూ తెలియచెప్పాడు మరొకడు. హిందీ, అమెరికన్, లాటిన్ అమెరికన్ రికార్డులను తర్జుమా చేయడంలో సుళువు బలువులు బోధించాడు మరొకడు (ప్రొడ్యూసరు డైరెక్టరు అవాల్సినవాడు)

ఇలా వర్తక రహస్యాలు బాగా నేర్చుకుని, ఆనక సంగీతంకూడా నేర్చేసుకుని నిజంగానే కొంత సాధించాడు రామచామి.

"జి. ఎన్. బి., ఎమ్మే పాసయాక, పాతికేళ్ళు పైబడి పనికిరాడనిపించుకున్నాక సరిగమలు మొదలెట్టాడు. తెలుసా?"–

మొదలగు పెద్దవాళ్ల కథలను పారాయణం చేసేవాడు, నిరాశ చుట్టుముట్టినపుడు.

ఇదంతా ఇలా ఉండగా మరోప్రక్క అసలు ప్లాను అమలుజరిగేది.

చక్కహా పొద్దున్నే ముస్తాబై శిష్యబృందాన్ని వెంటేసుకుని నాలుగైదు కంపెనీల కెళ్ళేవాడు కుశలం అడిగే నెపంతో.

అరవై డబ్భై అడుగుల పొడుగనిపించే ఈ ఆసామి, అతని వెనక పదిహేనుగురు శిష్యులూ బిలబిల్లాడుతూ వచ్చేస్తే, ఎవడుమటుకు మర్యాద చేయడు?

"వణకంసార్ వాంగో" అనేవారు.

"బణకం బళకం" అనేవాడు రామచామి తాంబూలపు నోటితో ముద్దగా ముద్దుగా.

అంటూనే 'తరన్నా రన్నా' అని ఆలపించి చుట్టూ చూసేవాడు. తక్షణం శిష్యులు పదిహేనుగురూ 'ఓహో! సెబ్బాస్! సెమ్మంగుడిదానె! వెహు ప్రమాదమాకిది' (ప్రమాదమా ఇరికిది అని తాత్పర్యం) అంటూ హాహాకారాలు చేసేవారు.

అవి పూర్తికాకుండానే రామచామి మళ్ళీ 'దారలారలాల లారలాలలా' అని శ్పానిష్ ట్యూన్ ముక్క విసిరేవాడు. మళ్ళీ సముద్రపు హోరులాగ ఒక కెరటం విరిగిన చప్పుడు పూర్తి కాకుండానే మరోదాని హోరు మొదలయేది. ఆ దెబ్బకి ఇతర కంపెనీల నిర్మాతల చెవులు హోరెత్తిపోయి, మనసులు దారుణంగా ఉప్పొంగిపోయి, మాకంటే మాకని బుక్ చేసుకున్నారు.

ఆర్నెల్లు గిర్రున తిరిగేసరికి రామచామి పెద్దసైజు మ్యూజిక్ డైరెక్టరయిపోయాడు.

ఆ సరికి, అతను చాలా కష్టపడి సాధనచేసి నిజంగానే సంగీతం నేర్చుకున్నాడు కూడా.

అయితేనేం. తీరాచూస్తే అది పనికిరాలేదు. అందరు ప్రొడ్యూసర్లూ, హిందీవీ, చేతనైతే విదేశవాళీ ట్యూన్‌లూ మక్కీకిమక్కీ పాటించాలనేవారే. అది వేరే సంగతి అనుకో.

రామచామి, కొన్నాళ్ళు అలా ఉన్నాక చిరాకేసి, అప్పటికి సంపాదించిన పలుకుబడితో తనకు ఇష్టమైన నటనాశాఖలో ప్రవేశించి మళ్ళీ పైకొచ్చాడు.

పోతే, తను గొప్పవాడవడానికి కావలసినంత డబ్బా వాయించి సాయంచేసిన శిష్యపరమాణువులకి ఛాన్సులిప్పించి వాళ్ళకి దారి చూపాడు. నమ్మిచెడినవారు లేరు అన్నారు వెనకటికి.

....అదీ కథ అని ముగించాడు ఆ అనుభవజ్ఞుడు" అని కథ ముగించాడు రైల్వే బైరాగి.



"బాబూ నీకు ఇంతటి ధైర్యం తెగింపు ఉన్నాయా? విద్య నేర్చుకోకుండా అందులో ప్రవీణుడనని దబాయించి డబ్బా వాయించి నెట్టుకొచ్చే పట్టుదలా తెగింపూ ఉన్నాయా?" అన్నాడు.

అడ్డంగా తల తాటించాడు రాజు.

"అయితే లాభంలేదు" అన్నాడు బైరాగి. రాజు దిగాలుపడిపోయాడు.

"అయినా భయపడకు. నేను చెప్పినట్లు చేస్తే వృద్ధికొచ్చేస్తావు. నా చేతికో ఐదు రూపాయిలియ్యి. బేసిన్ బ్రిడ్జి స్టేషనులో రైలాగ్గానే స్టేషన్ వెనుక ఒక యింటికివెళ్ళి ఓ పూలదండ కొని తెస్తాను. లేపోతే పూలేనా కొంటాను. రైల్లో దండ కడదాం. సెంట్రలు రాగానే అది వేసుకు దిగు. నీకు స్వాగతం ఇచ్చే సినిమావాళ్ళు, 'ఫలానా వాడివి నువ్వే' అని గ్రహించడానికి కూడా గుర్తు ఉండాలి కదా. అదే ఈ దండ అన్నమాట. తే డబ్బు!" అంటూ బైరాగి అతన్ని లేవదీశాడు.

బేసిన్‌బ్రిడ్జి స్టేషనులో బైరాగి రైలు దిగాడు గాని, ఎంచేతనో మళ్ళీ ఎక్కలేదు.

అందుకని వరహాలరాజు బిక్కమొహం వేసుకుని ఒక్కడే మద్రాసు సెంట్రల్ రైల్వేస్టేషనులో రెండో నెంబరు ప్లాటుఫారం మీద కుడికాలు మోపాడు దేముడిని తలచుకుని.

చుట్టూ పరకాయించి చూశాడు తనకోసం ఎవరన్నా ఎదురొచ్చారేమోనని.

పదినిమిషాల తర్వాత అతనికి బుర్ర పనిచేసింది. తనకి సినిమావాళ్ళు స్వాగతం ఇవ్వబోతున్నారని తను ఉత్తినే బైరాగికి అబద్ధం చెప్పాడన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. మర్చిపోయి, అది నిజమే అనుకున్నందుకు, అనుకుని నిరుత్సాహపడ్డందుకూ, నవ్వుకుని, ధైర్యం తెచ్చుకుని నరసన్న తనకు వదిలిపెట్టిన పెట్టిని (చిత్తు కాగితాలు సహా) చేతబట్టి, ముందరకు అడుగుపెట్టాడు వరహాలరాజు.



# దంతయాత్ర

మద్రాసు సెంట్రల్ రైల్వే స్టేషనులోని రెండో నెంబరు ప్లాటుఫారం మీద నిలిచి సాహసంతో కుడికాలు ఎత్తిన వరహాలరాజు ధైర్యంగా, ధీమాగా గారిగా ఆ కాలును నేలమీద మోపాడు. నేలకీ అరికాలికీ మధ్య ఒకానొక బలసిన కొండ అరటిపండు తాలూకు దళసరి తొక్క ఉండడంవల్ల, ధైర్యంగా, ధీమాగా రెండో అడుగు వేయబోయిన రాజు ప్రయత్నానికి ద్వితీయవిఘ్నం లాటిది వాటిల్లింది అయినా, ఆ ప్రయత్నం అవసరం లేకుండా ఆ కుడికాలు మీదనే ఎక్కి అతడు చాలా అర్జెంటుగా ఐదారు గజాల దూరం వెళ్ళిపోయాడు, పెట్టిసహా. ఆ స్పీడుని అలాగే ఉండనిస్తే కాస్సేపటిలో బస్సు అవసరంకూడా లేకుండా కోడంబాక్కం చేరుకునేవాడేగాని, మధ్యలో ఒకాయన తెలిసినట్టు కనబడడంతో ఆయన భుజం పట్టుకుని హలో అని ఆగాడు. ఆయన బోల్డు ఉన్నందువల్ల ఇతడే బోల్తాపడిలేచి, సారీ అని ఆ మొహం చూసి అట్టె ఆశ్చర్యపడి మళ్ళీలేచి, హొయ్యా బాబోయ్ అన్నాడు.

ఎదుటిమనిషి విస్తుపోయాడు. "సార్... మీరు... యు... ఐయామ్ ఎ సినిమా... ఆవాళ్ళ రోజునే... యీ... మీ..." అన్నాడు రాజు కర్త కర్మ క్రియలను వరుస ప్రకారం పేర్చి ఖాళీలు భర్తీ చెయ్యడం వాయిదావేసి!

"వాట్‌సార్... వాట్ యు.... వాట్‌మీ? యార్‌నీ? ఎన్నా ఇదెల్లాం?" అన్నాడు లావుపాటి ఆసామి చిరాకులోనే కాస్త జాలి రంగరించి.

చాలాసేపటికి లేచారు. ఈ లోగా అన్ని స్టుడియోలకీ ఈ కబురు పాకిపోయింది. ఈ లోగానే ఎమర్జెన్సీ మీటింగు జరిగిపోయింది. కోపం వచ్చిన హీరోగారి సెక్రటరీ అధ్యక్షత వహించారు.

ఈ ఫలానా కవిగాడు ఇంత ధైర్యంగా జవాబెలా ఇచ్చాడు? వాడు రాసిన కథ, మాటలూ వాడి బాబుగాడి సొత్తనుకున్నాడా?... అసలు విడికిన్ని దమ్ములెక్కడివి? అని చర్చ జరిపారు. అందరూ గంభీరోపన్యసించి పారేశారు. సినిమా రైటరుగా చేరి ఏడాది దాటినా వీడికింత స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, ధైర్యం, తనూ మనిషే, మొగాడేనన్న పిచ్చి నమ్మకం ఎలా ఉండిపోయాయా అని ఎడతెగకుండా ఆలోచించారు. తెగలేదు... ఎంతకీ తెలియలేదు వాడిగుట్టు... మీటింగు వాయిదావేసి, షూటింగు కాన్సెల్ చేసి, స్పెషల్ డిటెక్టివులచేత మూడు అహరాత్రాలు పరిశోధన జరిపించారు.

వాళ్లు నీడలా వాడి వెంటబడ్డారు. దురాశలా వాడిలో దూరి కూర్చున్నారు. మూడోనాటికల్లా వాడి గుండె నిబ్బరం గుట్టు కనిపెట్టేశారు. తక్షణం ఇంకో ఎమర్జెన్సీ మీటింగు చేసి ఓ రహస్య తీర్మానం చేశారు. మర్నాడే బహిరంగ విచారణ జరిపారన్నమాట. ఇందాక నే చెప్పినట్టు ఆ రైటరుని మధ్యనించోపెట్టి అంతా చుట్టూరా నిలబడి వాడినేరం జాబితా చదివారు.

తరవాత కిరాయి జడ్జి గంభీరంగా నిల్చుని అతనికి అందరూ కలిసి విధించిన శిక్షను పైకి చదివాడు.

అదేమిటని అడగవే?... అది వినగానే అందరూ హాహాకారాలు చేశారు. ఆ రైటరుగోల చెప్పనక్కరలేదు.

"ఆ శిక్షమటుకు వద్దు... అది తప్ప ఇంకేదైనా సరే" అని కాళ్ళా వేళ్ళా పడి మొరపెట్టుకున్నాడు...

'ఏమిటండీ ఆ శిక్ష' అన్నాడు రాజు ఉండబట్టలేక.

సుబ్బారావు బాధగా నవ్వి ఒక నిముషం మౌనం పాటించాడు.

"అదా?... మూడునెలలపాటు స్టూడియో కాంటీనులో కాఫీ ముప్పూటలా పూటకి కప్పు చొప్పున ఈ ముద్దాయి త్రాగవలెను" అని శిక్షవేశారు. డిటెక్టివులు కనిపెట్టిన గుట్టు అదే. ఆ రైటరు ఇంటిదగ్గర్నించి వేరే కాఫీ తెప్పించుకుంటున్నాట్ట. స్టూడియో కాఫీ చుక్కగూడా ముట్టుకోడంలేదుట... అదే ఈ ధైర్యానికి కారణం... ఇంకేముంది వారంరోజులు తాగితేచాలు... నువ్వు ఇక్కడ కాఫీ తాగుతానంటే నాకు ఈ గాథ గుర్తుకొచ్చింది. కావాలాబేడ? ఇంద" అన్నాడు సుబ్బారావు.

"అయ్యబాబోయ్... వద్దండి" అన్నాడు రాజు.

సుబ్బారావు జాలిగా నవ్వాడు. "అయితే లాభంలేదు బ్రదర్... నువ్వు సినిమాలకి పనికిరావు నీ ధైర్యం, గట్రా దాచుకోవాలంటే" అన్నాడు.

❀ ❀ ❀



# వాడే వీడు

డ్యూయెట్ సీనులో 'హీరోయిన్ పాట వినుట'ను నటిస్తున్న హీరోలాంటి మొహం పెట్టాడు రాజు. "సొంత అయిడియాలూ, కరేజీ ఉంచుకుంటానంటే ఇందులో పనికి రానన్నమాట" అన్నాడు అమాయకంగా.

"కరేజీలేదు కాబేజీలేదు. అవన్నీ జాన్తానై. అవ్వా కావాలి. బువ్వాకావాలంటే ఎలాగ" అంటూ సుబ్బారావు వెళ్ళిపోయాడు.

"డబ్బు–లక్షలు, వెళ్ళు చంపు– వద్దు కీర్తి" అంటూ గావుకేకలు పెట్టే సినిమా ఆత్మలాగ, రాజు కడుపులో కామేశ్వరరావు ఇవతలకొచ్చేసి ఎదుటపడి పవర్‌ఫుల్‌గా చీవాట్లెయ్యడం మొదలెట్టాడు. "బుద్ధిలేదా బ్రదర్... కాఫీకి డబ్బులు అడిగికూడా వద్దంటావా... ఏడూ నీ కర్మం" అంటూ. ఆపాటి పనికికూడా ఏపాటి ఓపిక లేక పోయింది రాజుకు.

సినిమా కథ, పానుపు సీనుమీదనుంచి కానుపు సీనుమీదకి 'కరిగి' పోయినంత చప్పున రాజు మనసు కలల అలలమీంచి జారి కల్లల కొల్లల మధ్యపడింది. ఆ కల్లలే నిజమని ఎలా నమ్మడం? కాని కల్లలు కావడానికి ముందు కలలని తెలుసుగా? అయితే మటుకు? కలలూ కల్లలేగా? అన్నీ కావు. తెల్లారుగట్ల కలలు నిజం అవుతాయట. మరి ఈ సినిమా కలలలో రాత్తిరి వచ్చిన వేమిటో తెల్లవారగట్లొచ్చిన వేమిటో ఎలా తెలీడం? తెల్లవార్లూ వచ్చిన వాటిసంగతెలా? కలలు తెల్లవార్లూ రావు. కాసేపే వస్తాయి. వచ్చినా తెల్లవార్లూ వచ్చినట్టనిపిస్తాయి. అంచేత ఇప్పుడేం చెయ్యడం? ఝూం మని రైలెక్కెయ్యడం.

టిక్కెట్టుకి డబ్బులేవి? లేవు. కాబట్టి రాబర్డు బ్రూసులా ఏడుసార్లు ట్రై చెయ్యాలి. భోజరాజులా 32 సార్లు ప్రయత్నించాలి. ఇప్పటికి ఆరు కథలయ్యాయి. ఆరుగురూ "భోజరాజా యూజ్‌లెస్" అన్నారు.

తనూ, మనసూ ఇలా డైలాగులిచ్చి పుచ్చుకొని మంచీ చెడ్డా మాట్లాడుకున్నాక మెల్లిగా బయల్దేరబోయాడు రాజు.

అంతలోకే అంతటా చిన్నరకం చీకట్లు కమ్మాయి. నీడపడింది. మబ్బేస్తోంది కామోసని పైకి చూశాడు రాజు. అలాంటి ఏర్పాటు కనబడలేదు. కోపంవచ్చిన బాక్సాఫీస్ డైరెక్టరులా సూర్యుడు మండిపడుతున్నాడు. ఎలక్షన్ పొలిటీషియన్‌లా ఎండ కుడి ఎడమా లేకుండా పేల్తోంది.

మరి ఈ చీకట్లేమిటి? ఈ నీడ ఏమిటి? అని తలదించాడు రాజు. మిస్టరీ విచ్చిపోయింది. ఈ ప్రకృతి విచిత్రానికి కారణం ఎదురుగా వస్తోంది. అది చాలా పెద్ద కారణం. లావుపాటి, పొడుగుపాటి కారణం.

స్క్రిప్టు మొహం చూడకుండా సెట్‌మీద కొచ్చిన డైరెక్టరు భావాలను గజిబిజిగానూ, ఆర్సన్ వెల్స్ 'ఫ్రేం' కాంపోజిషన్‌లా భయంకరంగానూ, ఆహిరి రాగంలో రిషభగాంధారాలలా నల్లగానూ, జూదరి బాకీలలా దట్టంగా ఉన్న ఒక పేద్ద గేరాజుత్తు కనబడింది. దానికింద రెండు రూపాయలంత ఎర్రటి కుంకం బొట్టు పెట్టుకున్న చిన్న నుదురు. దానికింద శివతాండవానికి పెట్టిన ఎర్రని ఫ్లడ్ లైట్లలాంటి కళ్ళు, చాలా ఏపుగా ఎత్తుగా వున్న శాల్తీమీద ఎక్కి వస్తున్నాయి. అంబారీ వేసిన ఏనుగలాంటి ఆ భారీ విగ్రహమే వరహాలరాజుకి ఈ భ్రమకలిగించింది. బాలనాగమ్మ సినిమాలో డా॥ గో॥ సుబ్బారావుగారి వేషం వెయ్యొచ్చు ఈ ఆసామి అనుకున్నాడు రాజు. అనుకుని, కాస్త వారకి జరిగి పక్కకి ఒరిగి సగౌరవంగా దారి ఇచ్చాడు.

అంతలోనే కొంచెం అసింటా ఉన్న స్టూడియో గేటులోంచి ఓ పెద్ద వాను వచ్చింది. దాన్నిండా రంగురంగుల అమ్మాయిలున్నారు. కవాలీ పాటలో కోరస్‌లా, నానా గోలగాఉంది కారులో. ఆ కారు హఠాత్తుగా ఆగింది. అందులోంచి ఒక అమ్మడు దిగింది.

హాలీవుడ్‌వాళ్లు ఆమెనుచూస్తే మేరిలిన్ మన్రో ఎందుకు పొమ్మంటారు. ఇటాలియన్‌లు సోఫియా లారెన్‌కు సాటి తెస్తారు. బ్రిటిష్ వాళ్లు 'సౌతిండియన్ 'లక్ష్మీనరసు'కు బ్రిటిష్ జవాబు' అని పెద్ద హెడ్డింగులు పెట్టి వాటికింద జేన్‌మాన్స్ ఫీల్డ్, దయానా డార్స్‌ల బొమ్మలు లంగోటీలు కట్టుకున్నవీ, – కుట్టుకున్నవీ అచ్చువేసి హడావుడి చేస్తారు. అయితేనేం, సౌతిండియనుల లక్ష్మీనరసును హాలీవుడ్ కాదుగదా, దేశవాళీ హాలీవుడ్‌లో కూడా సినిమా దృష్ట్యా ఏ ఎవరూ ఇంకా చూడలేదు. చూసినవాళ్ళకి ఆమె నచ్చలేదు. ఇంకోలా ఆమె నచ్చిందని అన్నవాళ్ళు ఆమెకు నచ్చలేదు.

అందువల్ల నరసు ఎక్స్‌ట్రా వేషాలే వేస్తోంది. ఆమెను నటీమణిని చేస్తానని ఒట్టేసి పిల్చుకొచ్చిన ఒక ప్రొడ్యూసరు బ్రదరిల్లా, 'అదనీమణి'ని చేసి ఎక్స్‌ట్రా

సప్లయర్ కాతాదార్లజాబితాలో వేయించాడు తరవాత, నరసు వాళ్ళమ్మని పిలిపించుకుని, తేనాంపేటలో చిన్న కొంప అద్దెకు తీసుకుని కాపరం పెట్టింది. నా అన్నవాడు, మొగదిక్కు లేకుండా ఉండడం మంచిది కాదని రంగన్న అనేవాడిని చేరదీసింది.

ఒకప్పుడు తేలికగా తూలికగా ఫ్రెడ్ ఆస్టెయిర్‌లా, శివరావులా ఉంటూవచ్చిన నరసు క్రమంగా స్థిమితపడి మేరిలిన్‌లా తయారైంది.

ఆమె చేరదీసిన రంగన్న చాలా పెద్దవాడు. తెలుగుసినిమా అంత పొడుగువాడు. దాదాపు ఇండియన్ ఫిలిం హీరోయిన్ అంత లావూ ఉంటాడు. అతని భావాలుకూడా చాలా పెద్దవి అయినా, ఇంకోచోటు దొరక్క నరుసుతోనే కాలక్షేపం చేస్తున్నాడు – సినిమా తీయడానికి మెల్లగా ప్రయత్నిస్తూ, ఆర్జన అనేది ఏమీ లేకపోయినా నరుసు తెచ్చేదాంతోనే జాగర్త పడుతున్నాడు. ఎంత జాగర్త చేసినా, 'దాహం' పుచ్చుకోవడంలో కొంత కరిగిపోతోంది. ప్రొడక్షనంటే మాటలా? చాలా డబ్బు కావాలి. అందుకని రంగన్న నరసు డబ్బులో కొంచెం ఎక్కువ జాగ్రత్త చేయడం మొదలు పెట్టాడు. ఫైనాన్షల్ సెక్రటరీ తనే కాబట్టి, నరసు వేషాలకి సినిమా కంపెనీలూ, ఎక్స్ట్రా సప్లయిర్లూ ఇచ్చే డబ్బు అతనే వసూలు చేస్తాడు. తనను నమ్ముకున్న మనిషి కాబట్టి నరసు జమా ఖర్చులు బేరీజు వెయ్యదు. తిండి గింజలూ గట్రా పడేస్తూ వుండేవాడు. ఎప్పుడన్నా 'మావా ఓ పావలా ఇద్దూ. గాజులు వేయించుకోవాలి' అంటుంది.

"యెర్రిపిల్ల... ఇంద పూలుకూడా కొనుక్కో" అని అర్ధరూపాయిచ్చేస్తాడు రంగన్న. నరసు మురిసి పోతుంది మామ ప్రేమకు. కాని ఈమధ్య మానేసింది మురిసిపోవడం. ఎందుకంటే రంగన్నకి రాత్రిళ్ళు కూడా రాచకార్యాలు ఎక్కువై పోయాయి. "ప్రొడక్షన్ తీత్తన్నాను పిల్లోవ్, ఇపుడు కరుచులూ అయిన్నీ అడగ మాక!" అన్నాడు. ఓసారి హుషారుగా, ఒక జూనియర్ నటుడిచేత కథా గట్రా రాయించి పట్టుకొచ్చాడు ఓ రోజున. మర్నాడు రాత్రి ఆ రచయితనే పట్టుకొచ్చాడు. అతను డబ్బు అడుగుతున్నాడు. ఇతడు "ఆగవయ్యా గురో. మనిద్దరం ముంగల ఈ స్రిప్టుమీన ఈ మాపిటికి కూకుందారి. స్ట్రీటుమెంటూ గట్రా అయితేనే గందా నీకు ఎడమాన్సు ఇచ్చేది" అని విసుక్కున్నాడు.

ఆ 'నటయిత', "ఆకలేస్తూవుంటే ఇవన్నీ ఎవడు చేస్తాడయ్యా" అని విసుక్కున్నాడు. కాసేపు ఇద్దరూ గింజుకున్నాక రంగన్న నరసుని పిలిచాడు.

"నరసూ నేనిపుడే టీ ఒట్టుకొత్తానుగాని, ఈలోగా నువు ఈరితో డిస్కషింగు సేత్తాఉండు. ఈరోయిను పారుటు మీన కూకుని మాటాడుతూ ఉండండి, నీదేలే ఆ యేసం" అని చెప్పి హడావుడిగా వెళ్ళాడు.

చిరాగ్గానే నరసు కూర్చుంది ఆ గదిలో.

రైటరు కథ గురించి కబుర్లు చెప్పడం మానేసి, గుటకలు మింగుతూ గుడ్లు మిటకరించి చూస్తూ దగ్గిరిగా జరుగుతున్నాడు.

మావ ఎంతకీ రాడేం అని విసుక్కుంది నరసు.

"వారు ఈ పూటకి రారు... నీతో చెప్పలేదా నరుసూ?..." అన్నాడు ఆ ఆసామి వెకిలిగా ఇకిలించి నరసు భుజంమీద తేలిగ్గా వేళ్ళు మోపుతూ. ఇదివరకైతే ఊరుకునేది గాని, ఇప్పుడు ఆకలి బాధలేదు. ఒక మొగాణ్ని నమ్ముకుని వాడి చాటున పడుండ దలచుకుంది. అందుకని ఒళ్ళు మండింది. 'నీ జిమ్మడ... యెదవ సచ్చినోడా! ఎన్ని గుండె(ప్లా నీకు' అంటూ లాగి లెంపకాయ కొట్టింది నరుసు.

"నాకేం తెలుసు. ఎడ్వాన్సు అడిగితే, ఇలా సర్దుబాటు చేసుకుందాం... నీకిష్టమేనూ అని చెప్పాడు మీవాడు... నాకు దిక్కులేక పోలేదు" అన్నాడు అతను లేచి నిలబడి.

ఆ రాత్రి రంగన్న రాలేదు. మర్నాడుకూడా రాలేదు. "మొగసచ్చినోళ్ళని నమ్మమని వొవురు సొప్పారు" అంది నరుసు తల్లి ఆ మర్నాడు.

వారం తిరిగినా రంగన్న జాడ తెలియరాలేదు. నరసుకి దిగులు పట్టుకుంది. తరవాత చిరాకు కలిగింది.

"యదవనాయాల" అనుకుంది.

మర్నాడు డబ్బుకి ఇరకాటం అయింది. ఎక్స్ట్రా సప్లయర్ దగ్గర కెళ్ళి తనకు రావలసిన దాంట్లో కొంతేనా సర్దమంది.

"మీవాడు పట్టిగెళ్ళాడు గదా... నీకు చెప్పలేదా... చెడిందా కథ?" అన్నాడు అతను ఓరకంటచూసి నవ్వుతూ.

నరసుగుండె గతుక్కుమంది. గిరుక్కన తిరిగి ఇవతల కొచ్చేసింది. తనకు డబ్బు రావలసున్న నాలుగైదు కంపెనీలకెళ్ళి కనుక్కునేసరికి, రంగన్న అన్నిచోట్లా ఇలాగే చేశాడని తేలింది.

"నువ్వే ఇమ్మంటివిగా అతగాడికి? ఊదరగొడితే ఇచ్చేశాం.... నీకు చెప్పలేదేం? చెడిందా కథ?" అన్నారు వాళ్ళు జాలిపడుతూ.

"కొంప ముంచేశాడు యదవనాయాల" అనుకుంది నరసు.

దారిలో సుబ్బులు ఎదురైంది.

"రంగన్న సొంత కంపెనీ ఎడుతున్నాడంటగా?... ఏం గిరాకీ?... పిట్టనిగినా పట్టారేం?" అంది ఒక రకంగా.

"నా బొంద .... ఆడు నా కొంప ముంచిపోయాడు... సినిమా తీత్తాడంట సినిమా, ఈడిబతుక్కదొకటే తక్కువ... .... యదవానియదవ" అని తిట్టుకుంది నరసు.

"పోన్లే పీడా విరగడైంది. మన మానాన మనం బతుకుదారి..." అంది వాళ్ళమ్మ ఆ రాత్రి పన్నెండింటికి వండి, తిడిపెడుతూ.

పదిరోజుల తరవాత ఇపుడు నరసు కంట పడ్డాడు రంగన్న. స్టుడియో వానులోంచి చూస్తూనే ఆపించి కిందికి దూకింది నరసు.

రంగన్న అడుగు చురుగ్గా వెయ్యబోయాడు నరసుకూడా పరుగెత్తబోయి, ఎదట రాజునిచూసి "అన్నా! ఆ యెదవ నాయాల్ని ఆపు. " అని ఒక్క కేకవేసింది

రాజు చేతుల్తో ఆలోచించి, రంగన్నను అటకాయించాడు.

"ఏరా... ... ఏటి? డబ్బేదీ?. .. సిగ్గులేదూ?" అంటూ దమాయించింది నరసు.

రంగన్న కోపం అంతా అడ్డుతగిలిన రాజుమీదికి తిరిగింది.... ఎందుకు ఆపావంటూ తన్నబోయాడు.

"నా డబ్బు కక్కు... ...." అంది నరసు ఏడుపూ, కోపం దిగమింగుతూ.

"పొడక్షన్ తీశాక యిత్తాలే... ఇప్పుడు కానీనేదు" అన్నాడు రంగన్న.

అతను తొడుక్కున్న గ్లాస్కో చొక్కా జేబులో ఐదురూపాయల నోట్ల దొంతర కనబడుతూనే వుంది.

"అదేం? అదికాదు డబ్బు" అన్నాడు రాజు

"ఛప్ నోర్ముయ్"

"మూస్తానా మూసి చూపిస్తానా? అన్నా నువ్వు ముంగలా డబ్బు తీసుకో చెప్తా.. " అంటూ నరసు గబుక్కున రంగన్న రెక్కలు వెనక్కి విరిచి పట్టుకుంది రాజు మళ్ళీ చేతుల్తోనే ఆలోచించాడు. తక్షణం ఆ డబ్బు లాక్కున్నాడు.

"పట్టబగలు ఇట్లా దోచుకు బతుకుదామనే?"

అంటూ రంకెవేసి, నరసు పట్టు విడిపించుకుని రాజు మీదికి విరుచుకు పడ్డాడు లావుపాటి రంగన్న.

రాజు ఈసారికూడా చేతుల్తోనే ఆలోచించాడు.

రిపబ్లిక్ స్టంటు సినిమాలు చూస్తున్నప్పటినుంచి వాటిలో ముష్టి ప్రయోగాలుచేసి చూడాలని అతను ఎంతో ముచ్చట పడుతున్నాడు. ఇవాళ అనుకోకుండా ఛాన్సు వచ్చింది

లావుపాటి రంగన్న డొక్కలో ఒక్క పోటు పొడిచాడు. ఎముక దెబ్బేమో అది బాగానే అనింది. 'అమ్మో' అన్నాడు రంగన్న. వుత్సాహంతో, కుడి పిడికిటితో రంగన్న ఎడమదవడకింద పొడిచినట్లు కొట్టాడు రాజు. – ఆ దెబ్బకి పెదిమ కరచుకున్నాడు రంగన్న. రాజు హుషారుకొద్దీ అలవాటు లేని వాటంలో ఎడమచేతదెబ్బ కొట్టపోయి గురితప్పి తూలాడు. రక్తం కళ్ళచూసిన రంగన్న రెచ్చిపోయి, రాజు మళ్ళీ కోలుకోకుండా అదే పనిగా బాదేశాడు.

నరసు కేకలు మొదలెట్టింది. జనం పోగవుతున్నారు.

'సూడానె వేరు కడలె' అని పాడుతూ వేరుశనక్కాయల బండివాడు ఉత్సాహంగా వచ్చి ఆగాడు. వాణ్ణిచూసి డబ్బా లాటరీవాడొకడు దుకాణం పెడదామని సరదాపడ్డాడు. పెడితే, వ్యాపారం బాగానే జరిగేది కాని జనాన్ని చూసి, రంగన్న బెదిరి గబగబా పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

దెబ్బలకి స్పృహతప్పి పడిపోయిన రాజుని చూస్తే నరసుకి ఏడుపు పెల్లుబికి వచ్చేసింది.

"ముక్కూ మొగం కూడా తెల్దు... నామూలాన ఇంత దెబ్బతిన్నాడు" అని నొచ్చుకుంటూ, గబుక్కున కూలబడి రాజు తలను ఒళ్ళో పెట్టుకుని చెంగుతో విసురుతూ "ఒరు సోడా కొండా అన్నా" అంది చుట్టూ ఉన్న ప్రేక్షకులను చూసి.






"నేనెక్కడున్నాను?" అన్నాడు రాజు ఓ గంట పోయాక, నరుసు ఇంట్లో కళ్ళు తెరచి.

అరగంట క్రితమే అతనికి తెలివి వచ్చింది. కాని అప్పుడు టాక్సీలో నరసు భుజాని కానుకుని కూర్చున్నాడు. టాక్సీ వేగంగా పోతోంది. అలాంటప్పుడు 'ఎక్కడున్నాను' డైలాగు అనటం బాగుండదు. ఇంతవరకు సినిమాల చరిత్రలో ఎవరూ అలా అనలేదు. జవాబుమాత్రం ఎలా చెబుతారు గనక. అందుకని మళ్ళీ కళ్ళు మూసుకుని ఊరుకున్నాడు.

కారుదిగి, చాపమీద ఏదో ఒక చూరుకింద పడుకున్నాననుకున్నాక ఆ ప్రశ్న వేశాడు.

"యింటో... మా యింటోనండి..." అంది నరసు మెల్లిగా.

ఇల్లు అనగా నేమి? అన్నట్టు చుట్టూ పరకాయించి చూశాడు రాజు తల కదపకుండానే. తల అసలు కదిలేలా లేదు. దిమ్మెత్తిపోయి, అసలులేనట్టు వుంది.

నరసు, అతనివైపు దీనంగా చూస్తోంది. దారేపోయే ఈ కుర్రాడు తన మూలానే ఇన్ని దెబ్బలు తిన్నాడు గదా అని బాధపట్టుకుంది ఆమెకు. క్షమించమన్నట్టు చూసింది. ఒక్కక్షణం ఆగి, 'నా పేరు లక్ష్మీన్నరసు' అంది అదే క్షమాపణ అనిపించేలా. రాజుకి ఆ రెండు మాటలలోనే 'నన్ను క్షమించండి రాజ్' అన్న భావం కనబడి పోయింది.

"ఫరవాలేదు....." అన్నాడు.

అతనికి పేరు నచ్చింది కామోసు అనుకుంది నరసు. ఆమె చెంపలలో కెంపులు వెలిగి తళుక్కుమని జారిపోయాయి. సిగ్గుపడి చెంపకి చారెడున్న ఆమె నల్లటి కళ్ళు వాలిపోయి వాటిని వెతకబోయాయి. జారి, పాలిపోయిన ఆ కెంపులు తమ చాయనే ఉన్న పెదిమల చాయలకువెళ్ళి కొనలలో నించి తొంగి చూడబోయాయి.

'తప్పు' అంది సూటిగా ఉన్న ముక్కు.

తెల్లటి మునిపంట ఆమె ఆ పెదిమనదిమిపట్టి, పెంకె కెంపుల జతను అందులో పెట్టింది. రాజు సదరు కార్యక్రమాన్ని కలర్‌బై టెక్నికలర్‌లో చూసి ముగ్ధుడైపోయాడు.

అమ్మాయిల చిరునవ్వులకు అర్థాలు తీసుకు సంతోషించడం అతనికి బాగా అలవాటులేదు. చేతకాదు.

కాని, 'బాగుంది' అనుకున్నాడు టూకీగా.

'నా పేరు రాజు' అన్నాడు ముక్తసరిగా.

'నా పేరు నరసు మీదేవూరు?' అంది నరసు సిగ్గుపడుతూ. రాజు చెప్పాడు.

"ఇక్కడే ఉంటున్నారా?"

'మరే'

'ఏం చేస్తున్నారు?'

'హీరో'

'హీరో!'

'మరే. హీరో రోలు'

'ఎందులో?'

రాజు తికమకపడ్డాడు. ఎందులో అంటే ఎవరు మటుకు చెప్పగలరు? తనువచ్చి ఇరవై నాలుగ్గంటలన్నా కాందే.

'ఇంకా తెలీదు. ఇవాళే వచ్చాను' అన్నాడు.

నరసుకి తెలిసిపోయింది. నవ్వింది. 'చిట్టితండ్రీ అదా కథా?' అనుకుని.

శుభమా అని ఊళ్ళోదిగిన రోజునే తనమూలాన తన్నులుతిన్న ఈ కుర్రాడిని చూస్తే నరసుకి ఎక్కడలేని అభిమానం పుట్టుకొచ్చింది.

"ఎక్కడ బస?.... డబ్బు తెచ్చుకున్నారా?...." అంది.

'ట్వెంటీ' అన్నాడు రాజు గంభీరంగా కటకటాలలోంచి చూస్తూ.

'అయ్యబాబోయ్! ఇరవై వేలే!!! జాగర్త బాబూ' అంది నరసు ఎగిరి గంతేసి

'నో... నో. .. నో....!' అన్నాడు రాజు కొంచెం ఠీవిగానే.

"ఓ.... వందలా!" అంది నరసు కొంత స్తిమితపడి. "అయినా జాగర్తగా ఉండాలి. రెండువేలన్నమాట"

రాజుకి కోపం వచ్చింది. "కొంచెంకూడా గంభీరంగా ఉండలేదీ పిల్ల. అన్నీ తెలుగులో చెప్పెయ్యాలంటుందెలా" అనుకున్నాడు. అబద్ధం చెప్పడం ఇష్టంలేదు.

'వందలు కాదు... పదులుకూడా కాదు... ఒకట్లు. అంతే అన్నాడు' కొంచెం చిరాగ్గా.

'ఓ....' అంది నరసు నవ్వాపుకుంటూ.

'అవీ లేవు, ఫీజు కట్టేశాను' అన్నాడు రాజు ఇంకా కోపం తెచ్చుకుని.

'ఫీ... జు! ఏం ఫీజు? ఎవరికిక్కటేశావ్...' అంది తుళ్ళిపడి.

'ఉందిలే.... హీరో ఛాన్సుకి.... ఆయన రమ్మన్నాడు నేను వెళ్ళాలి' అన్నాడు రాజు.

"ఎక్కడ కెళ్ళేది... కాసేపు నిదరోయి... ఇంత తినెల్లచ్చు. కల్లు తిరిగి పడితే ఏటి దిక్కు...?' అంది కాస్త భయపెడుతూ; అతను వెళ్తాడని భయపడుతూ.

"మరి వెళ్ళక పోతే ఎలా... హీరో రోలు ఊరికినే వస్తుందా?" అన్నాడు రాజు.

"నీ కెట్టావస్తదయ్యా... ఎవడిస్తాడంట. నీ కెవరు తెల్సు?"

"ఇంకా ఎవరూ తెలీదనుకో... ఎంతసేపేం తెలీడం. నేనందరికీ ఉత్తరాలు రాశానుగా వస్తున్నానని?" అన్నాడు రాజు ధీమాగా.

'నీ బొందలే...' అని నాలిక్కరుచుకుంది నరసు. జాలేసింది. తొలిరోజుల్లో తను అనుకున్నట్లే ఆశపడ్డట్టే ఉంది కథ. తనతో తీసికెళ్ళి వేషాలిప్పిస్తే మంచిదేమో.... రెండ్రోలు కో సారేనా తిండి దొరుకుతుంది అనుకొంది. ఇలాంటి వాడికి సాయం చేస్తేనే నయం. చూట్టానికి బాగున్నాడు. మంచివాడిలా, బుద్ధిమంతుడిలా ఉన్నాడు. లేపోతే ఎవడన్నా వరసగా ఇన్నిసార్లు నిజం చెప్పాడా!"

'ఏమిటి ఆలోచిస్తున్నావ్' అన్నాడు రాజు లేచి కూర్చుని.

'నీ గురించే... నాకు నాలుగైదు కంపెనీలవోళ్ళు తెలుసు. నా యెంటరా... ఏసా లిప్పిస్తా... రెండో మూడో ఇత్తారు. కమీషను తెగ్గోసుకున్నా కూడు గడుస్తదిలే. ఆనక అదిట్టం ఉంటే నివ్వే పెద్దోడివౌతావు ఎవుడు సూశాడు. అంది నరసు.

'ఛీఛీ... చివరికి ఎక్స్ట్రావేషా లెయ్యమంటావా? ఎవరనుకున్నావు నేను..... ఆరు డ్రామాల్లో హీరో వేశాను..... ప్రాణం పోయినాసరే హీరో రోలుకి తక్కువ ఏదీ పుచ్చుకోను' అన్నాడు రాజు కొంచెం కోపంగా.

నరసు నవ్వాపుకుంది. 'పోన్లో అలాగే ఈరో రోలే ఏద్దుగాని.... ముంగల చిన్న చిన్న చీనుల్లో యాసం ఎయ్యాలి.... నేనో, మా సుబ్బులో, ఊర్మిలో ఎవరో నీ పక్కని ఈరోయినుంటారు' అంది

రాజు గంభీరంగా తల తాటించాడు. నరసుమీద జాలేసింది. ఏమనడానికి తోచలేదు.

'వెర్రిబాగుల పిల్లా' అన్నాడు ఆలోచించి. "అమాయకురాలా. కఠినంగా మాట్లాడానని బాధపడద్దు. నేను నీతోటిగాని, నీ సుబ్బులుతోడిగాని, ఆఖరికి అదెవరూ ఆ యూర్మిళతోటిగాని నటించను... నీ యాశనిరాశ చేయుచున్నందుకు క్షమించు లక్ష్మిన్నరసూ" అన్నాడు.

"కొత్తలో నాయంటోళ్ళతో కాపోతే, అంజలీదేవికి ఈరో ఏత్తా వేమిటి?"

"యస్... ఇఫ్... నాట్ సావిత్రి.... ఆర్ జానకి" అన్నాడు రాజు.

"ఆర్. జానకి అని ఎవరూ లేరు. సావుకారు జానకి వుంది" అంది నరసు

'నీ కింగ్లీషు అస్సలు రాదన్నమాట' అన్నాడు రాజు.

'మద్దిన ఇంగిలీసు గొడవెందుకు'. . అంది నరసు చిరాగ్గా.

'అయామ్ సారీ'

'మళ్లీ అదేకూతా... ఇక్కడెవ్వరికీ బయ్యం లేదు. యాసం ఎయికపోతే మానెయ్యి నాకేం మద్దిని!'

'అదికాదు నరసూ... నేను హీరో వెయ్యాలని వచ్చాను. ఫిఫ్టీన్ రుపీస్ ప్రొడ్యూసరు బ్రదరిల్లాకి ఫీజుకూడా ఇచ్చానా, ఆ కారెట్రు వదిలేస్తే ఎలా చెప్పు.... అందులో మరి ఏ సావిత్రో ఎవరో వుంటారా... అంతే కాని.... నువ్వు నచ్చలేదని కాదు.... ఆమాట కొస్తే నువ్వు ఏంజల్లా ఉన్నావు. నీ అంత మంచిపిల్లని ఎక్కడా చూళ్ళేదు" అన్నాడు.

నరసు కోపం ఇట్టే కరిగిపోయింది. "పోన్లేరాజా... అదే పోయే. ఈరో వేసాలే ఏద్దుగానిలే.... అవి దొరక్కపోతే, అనక చిన్నేసాలెయ్యి. నే నిప్పిస్తాను. ఎయ్యో ఒకటి దొరికేదాకా మాతోపాటే గంజో అంబలో తాగతాఉండు. డబ్బులు కూడా లేనట్టున్నాయి." అంది.

అతికష్టం మీద సరేనన్నాడు రాజు.

అమ్మయ్య అంది నరసు. రాత్రి భోజనాలై పడుకున్నాక, కమ్మటికల అల్లుకు చూడబోతూ ఉండగా పక్కగదిలోంచి లీలగా రెండు డైలాగులు వినిపించాయి రాజుకి.

"నీకేం ఒళ్ళూ పై తెలుత్తున్నట్టు లేదే. ఈ యెదవెవడు - ఈణ్ణెందుకు తెచ్చినట్టు. పొద్దున్నే లేసి పొమ్మను" అంటోంది నరసు తల్లి.

'అమ్మోవ్.... ఇట్టం వుండే ఉండు లేపోతే ఎల్లుగాని, నామాట కాదనమోక. నా అన్న మొగోడు లేపోతే, ఈడ పరువుగా బతకలేం. నాకు పరువు కావాల. ఈ యబ్బాయి మంచోడు. చెప్పినట్టింటాడు.... మంచేనా సెడేనా అతన్ని నమ్ముకుని ఆ

నీడని బతకదల్చుకున్నా. యెదవేశాలేయక... ఇపుడే సెపుతున్నా ఆయన ఈయింటి కల్లుడు. అదంతే. ఎల్లుండే, మంచిమాట చేసుకుని, నాలుగు డబ్బులు చూసుకుని తిరపతెల్తున్నా.... ఏ మారాజు నడిగినా ఇత్తాడు పదిరూపాయలు. ఇట్టముంటే వచ్చి దీవించు-అంటే ఒకటే మాట, అడ్డమైన వెధవల్నీ నమ్మి గడ్డితింటం నాకిట్టంలేదు. ఈ బుల్లోడు ఇంక మనోడు. ఆడు మన్నీ మనం అణ్ణీ నమ్ముకుని పడుండాల్సిందే. అంతే ఒకటే మాట. ఇకనుంచి ఇట్టంవచ్చిన కూతలు కుయమోక. ఆడే నేను నేనే ఆడు అనుకో అంతే ఒకటే మాట...."

రాజుకి సంగతేమిటో తెలీటం లేదు. తన గురించే వాదించుకుంటున్నా రనిపించింది. ఏమిటో ఎందుకో అనుకున్నాడు. అసలీ నరుసెవరు; తనెవరు అనుకున్నాడు. నరసు మంచిపిల్ల అనుకున్నాడు. బావుంది అనుకున్నాడు. 'చాలా' అంది మనసు. మరే అన్నాడు... రాజు. పెళ్ళాడరాదూ? అంది మనసు. ఛీ పో నువ్వు మరీ బడాయి అన్నాడు రాజు. ఏడిశావు నీకిష్టమేలే అంది మనసు. ఏం లేదులే నేను హీరో వెయ్యాలి... అయితేనేం పెద్ద పెద్ద సినిమా వాళ్ళందరూ సుబ్బరంగా పెళ్ళాడి కాపరాలు చెయ్యటం లేదూ? అంది మనసు. ఔననుకో అన్నాడు రాజు. అనుకో ఏమిటి నీ తలకాయ. పెళ్ళాడితే అదృష్టం కలిసొస్తుంది కూడా. నలుగురూ గౌరవిస్తారు అంది మనసు. పాయింటే అన్నాడు రాజు.

అంతలో పక్కగదిలోంచి ఏడుపులాంటి ఎక్కిళ్ళు వినబడ్డాయి. మొగుణ్ణికొట్టి మొగసాలెక్కినట్టు నన్ను తిట్టి పైగా ఏడుపెందుకు? అంటోంది ముసలికంఠం.

'కాదు... ఏడుపుకాదు' అంటోంది నరసు.

'చూడు ఏడుస్తోంది' అంది రాజు మనసు.

'ఎందుకో తెలుసులే.... ఊరుకోబెడతా చూడు' అంటూ లేచాడు రాజు. లేచి గది గుమ్మంలోకెళ్ళాడు.

వసారాలో స్తంభానికి చేరబడి ఉన్న నరసు దేదీప్యమానంగా వెలిగిపోతూంది. ఆ వెలుగులో మసిబారిన హరికెన్ లాంతరూ మాసిపోయిన ముసలమ్మా మసగ్గా కనబడ్డారు.

రాజుని ఆదరించి అన్నం పెట్టిన నరసు మధురమైన పరిమళాలు గుబాళిస్తోంది. ఆమె సిగలో మల్లెచెండు పరిమళాలు అందులో కలిసి, ఆ ప్రజ్ఞ సొంతానికి జమకట్టుకోబోతున్నాయి.

గుమ్మంలో నిలిచిన రాజు, గొంతు సరిచేసుకున్నాడు మెల్లిగా. నరసు గబుక్కున తలయెత్తి చూసింది రాజువంక. ఆమె నుదుట ఎర్రటి బొట్టు కెంపులా వెలిగింది. మాకన్నానా అన్నాయి ఆ క్షణాన ఆమె చెంపల్లో వెలిగిన కెంపులు.

రాజు సాహసించి, తెగించి త్యాగం చేశాడు:

'ఏడవకు నరసూ ఏడవకు.... ఇందాక ఊరికినే అలా అన్నాను... నీతో నిజంగానే హీరోవేషం వేస్తాలే.... ఏడవకు' అన్నాడు లాలనగా.

'అబ్బే ఏడవటంలేదు' అంది నరసు రుద్ధ కంఠంతో. 'ఒద్దు ఏడవకు' అన్నాడు రాజు కూడా రుద్ధ కంఠంతోనే.

తొమ్మిదింటికి తెల్లవారింది. రాజులేచి చేతిలో 'శ్రీరాజ్' చుట్టుకుని కళ్ళు కడ్డుకున్నాడు. వంటింట్లో నరసు కనబడింది. చాలా అందంగా ఉంది. నీలిరంగు చీర కట్టుకుంది దానికో ఛాయ తక్కువచేసి అదేరంగు రవిక తొడుక్కుంది. చీరెమీద జరీపోగులు సినీమాపాటలలో భావంలా, అస్తినాస్తి సందేహం కలిగిస్తూ మెరుస్తున్నాయి.

అప్రయత్నంగా తన అవతారాన్ని చూసుకున్నాడు రాజు. ప్రేమ ఘట్టంలో డ్యూయెట్ లాగ, దాని తరువాత డైలాగులాగ మాసి మట్టిగొట్టిన తన లాగూ చొక్కా చూస్తే తనకే చిరాకేసింది.

నరసు చూడకుండా అమాంతం మాయమై పోదామని ముచ్చట పడ్డాడు గాని జరిగింది కాదు. ఈలోగా నరసు చూడనేచూసింది. ప్రేమతో నవ్వింది. 'ముగం కడుక్కు స్నానం చేసిరా, కాఫీ తాగుదురాగాని' అంది.

రాజు సిగ్గుపడి ముడుచుకు పోయాడు. స్నానం గీనం కానిచ్చి, తలా గిలా దువ్వుకున్నా, మాసిన గడ్డం, బట్టలు మూలాన రోజూలా రాజు ప్రకాశించలేకపోయాడు.

కాఫీ తాగగానే సిగరెట్టు పెట్టి పట్టుకొచ్చి ఇచ్చింది నరసు.

ఈ అభిమానం, ఆదరణ, మర్యాద చూడగా రాజుకి మతిపోయింది. అణువణువూ కృతజ్ఞతతో నిండిపోయింది. ఏంచేస్తే తన కృతజ్ఞత తెలుస్తుందో బోధపడలేదు. నుదురు మీద ముంగురులు తిరుగుతున్నా బాగుండును. వాటిని సవరించి కొంత రుణం తీర్చుకోవచ్చు. తిలకం కాస్త వంకరగా ఉన్నా బాగుండును. దిద్ది కొంత రుణం తీర్చుకోవచ్చును. లిప్‌స్టిక్ చెరిగినా, పౌడరు ఓచోట పేరుకున్నట్టున్నా, బాగుండును సర్దవచ్చును. పాదాలు బోసిగా ఉన్నట్టనిపించినా బాగుండు పారాణి తీర్చి అలంకరించవచ్చు. పట్టాలున్న మూలాన వాటికా అవకాశం లేకపోయింది.

అయితే ఇలా దారుణంగా ఇంత కృతజ్ఞతా అజ్ఞాతంగా ఉండిపోయి వృధా కావలసిందేనా? దేవుడు లేడా? ఉంటే ఈ స్థితిని గమనించడా?

ఉన్నాడు. అందుకనే నరసు సిగముడిలో తురుముకున్న మూడు పూలలో నడిమధ్య నున్నది, పట్టుతప్పి, వాలి, రాలిపోయే ప్రమాదకర పరిస్థితిలో పడి, 'వాలిసోలితి నోయి సోలి రాలెదనోయి' అని సోలో పాడింది.

భయపడకుము అంటూ రాజు ఆ పుష్పానికి అభయమిచ్చి, ఆదుకుని, దాన్ని సిగలో సరిగా అమర్చాడు–'అరె, ఈ పువ్వు రాలిపోయేలా ఉంది' అని జనాంతికంగా ప్రకటించి.

నరసు నవ్వింది.

తరించినట్లనిపించింది రాజు ప్రాణానికి. ఇంక టపాకట్టేసి పారుగు లోకం వెళ్ళిపోయినా ఫరవాలేదనిపించింది. అయితే అపుడే లాంగుజర్నీ ఎందుకులే అని నవ్వుకున్నాడు.

"అలా వెళ్ళొస్తా!" అన్నాడు లేచి నిలబడి.

"యాడకెల్లేది. ఈ పూట నాకు సూటింగులేదు. మద్దినాల నాతో స్టూడియోకి ఒద్దుగాని" అంది నరసు.

"అదికాదు నిన్న పేపరాఫీసులో పెట్టే, సంచీ పెట్టొచ్చాను. అందులో గుడ్డలున్నాయి. తెచ్చుకుంటాను. ఇవి మరీ మాసి పోయ్యాయి" అన్నాడు రాజు.

'సర్లే తొందరగా వచ్చేయ్' అంది నరసు.

"వెళ్ళొస్తాను సీతా." అన్నాడు రాజు వినయంగా.

"ఒహోహో. బలేవోడి లాగున్నావే. ఆగాగు!" అంది నరసు పకపక నవ్వుతూ.

లేచి, ఓ చిన్న కాగితం, పెన్సిలు ముక్క తీసి రాజు కిచ్చింది.

'రాయి! నా పేర్రాయి' అందులో నర్సు. యం. లక్ష్మినర్సు యడ్రస్ - అంటూ చెప్పింది.

'అయామ్ సారీ..... సీత అనుకున్నా' అన్నాడు రాజు.

'నయ్యంగదా ముంగలే సెప్పావు యీ మాట. అనక తిరిగొచ్చి సీత ఇల్లేద అంటే, ఈడ ఎవరూ సెప్పేవోళ్ళుగాదు. మల్లా ఇంకెక్కడకో బోయి మెత్తగా తన్నుల్దిందువు' అంది నరసు పకపక నవ్వి ఆ చీటీ రాజు జేబులో పెడుతూ.






కనుక్కుని, వెతుక్కుని పేపరాఫీసు కెళ్ళాడు రాజు.

నలుగురైదుగురు కూర్చుని కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

తనని నిన్న ఆదరించి నాయనెవరో గుర్తు తెలీక తటపటాయిస్తూ ఆ గది గుమ్మంలో నిలబడిపోయాడు రాజు.

"నా కివాళా రేపు కూడా షూటింగులేదు. సుబ్బరంగా రెష్టు తీసుకో అమ్మా అన్నాడు ప్రొడ్యూసరు" అంటున్నాడొకాయన కాళ్ళు ముడుచుకు కూర్చుంటూ.

రాజు తుళ్ళిపడి అటు చూశాడు. అమ్మా అన్నాడంటాడేమిటి, అమ్మా బొమ్మాను అనుకుని. చూస్తే ఆయన మొగాడే, మరి ఆ ప్రొడ్యూసరెవరో వీణ్ణి రెష్టు తీసుకో అమ్మా అని ఎందుకన్నాడు? చూస్తే పచ్చి మొగాడుగదా. బుగ్గమీసాలు గేరా జుట్టూ వాడూనూ. అయితే ఒక వేళ బాలనటుడేమోలే అని సర్ది చెప్పుకున్నాడు.

'నాగ్గూడా లేదుగా షూటింగు - ఎల్లుండే నా డాన్సుంది. లైటింగూ అదీ అయేసరికి అవతలెల్లుండవుతుంది. దానికీ భవుశా వెళ్ళను. స్పెషల్గా సిలుకు లంగా కుట్టించమంటే కుదర్దు పొమ్మన్నాడు డాన్సు డైరెక్టరు. నేనెందు కెళ్ళాలేం?' అన్నాడు ఇంకో ఆయన. ఆ శాల్తీకి బుగ్గ మీసాలున్నాయి జహంగీరులా.

రాజుకి గుండె గుభేలుమంది. ఏమిటి మిష్టరీ? ఆడాళ్ళంతా మొగ వేషాల్లో ఉన్నారా? ఇక్కడ షూటింగవు తోందా?....

"నన్నడిగితే మానెయ్యమంటాను. పట్టుపడితే వదలకూడదు. నేను మానెయ్యలే?. కిందటన్నెల పిక్చరు మొదలెట్టినపుడు, సెకండు హీరోయినిమ్మని అడిగాను. లేకపోతే, ఒక డాన్సు వుండే రోలన్నా కావాలన్నాను... అది కుదరదూ, కోయవాడి రెండో కూతురే వెయ్యమన్నాడు నన్ను. అక్కర్లేదు పొమ్మన్నాను" అన్నాడు తృతీయుడు.

"ఓ యబ్బో నీ కబుర్లకేం లేహోయ్. అది కుదరదన్నవాడివి మొన్న... వో చిన్నత్తవేషం కావాలని అడగలేదూ? నాకు పోటీగా" అన్నది నాలుగో శాల్తీ.

రాజు బుఱ్ఱ పనిచెయ్యడం మానేసింది. ఉన్నా ఊడినా ఒకటేనన్న భావంతో గుడ్లు ఊడి పడబోయాయి.

సన్నగా సలాకలా వున్న ఇంకో ఆయన హాండిల్ బార్ మీసం సర్దుకుని, "మేష్టార్లూ మీసంగతికేం గాని మొన్న సుబ్బన్నగారూ నేనూ ఓ అమ్మణ్ణి ఆశీర్వదించాం.... నా రంగా ఏమిపిల్ల అనుకున్నారు. మన డిష్కవరీలెండి. మనకి తెలిసిన పత్రికల్లో ఒకటి రెండు వారాల్లో బొమ్మ అదీ వేయిస్తున్నాం - అబ్బ రెండుకళ్ళూ చాలవనుకోండి. అందుకే ఆశీర్వచనం రేటులో ఫిఫ్టీ పెర్సంటు డిస్కౌంటు' అన్నాడు తన్మయానందంతో.

'ఎవరదీ' అన్నాడు సెకండు హీరోయిను వేషం కోసం ముచ్చట పడ్డాయన.

'కళ్ళు కలువల్లు. ముక్కు నవ్వు పువ్వు. నుదురు 'రిఫ్లెక్టర్' ఆ మెరుపూ ఆ తళుకూ నే చెప్పలేను.'

'ఒద్దులెండి. అయినా ఆ షోకులు మేకపులలో వచ్చేస్తాయి. ఒడ్డు పొడుగు ఉండాలి ఏపుగా ఉండాలి.' అన్నాడు పట్టు పరికిణీ కుట్టించమని డైరెక్టరుతో పోట్లాడి నాయన.

'వేరే చెప్పాలా మేష్టారూ... అచ్చు ప్రబంధ నాయికే.' అన్నాడు ఆమెను డిస్కవర్ చేసిన కొలంబస్ మధురస్మృతిపథంలో షికారు బయల్దేరుతూ. అందరూ ఒక్కనిమిషం మౌనం పాటించారు; తాపసూచకంగా, కొందరు సంతాపసూచకంగా.

'అయితే ఒక్క విషయం' అన్నాడు కొలంబస్ కొంటెగా చూస్తూ.

ఏమిటది అన్నాయి ఎనిమిది కళ్ళు; ఒక్కలోపం ఉన్నా చాలునన్న ఆశతో.

'ఆ పిల్లకి నడుం లేదు' అన్నాడు కొలంబస్.

'లేదు?' అన్నాయి ఎనిమిది గొంతుకలు.

'లేదు'

'అస్సలు?'

'బొత్తిగా'

'నిజం?'

'నిజం.'

'ఓరి బాబోయ్!' అన్నాయి గొంతుకలు

'అ.... మరేవిటనుకున్నారు. నడుం లేదు. అస్సలు లేదంటే నమ్మండి మేస్టార్లూ' అన్నాడు కొలంబస్.

'అంటే రెండు సెపరేట్ ఒళ్ళులు అన్నమాట' అంది ఒక గొంతుక అపనమ్మకం ధ్వనిస్తూనే.

'ఒళ్ళులు అన్న శబ్దంలేదు. అలాటి బహువచనం ఎక్కడ కనబడదు మీకు' అన్నాడు కొలంబస్.

'మీ గ్రామరు తగలేసిరి, ఛస్తుంటే సంధి మంత్రంలా అడిగిందానికి జవాబు చెప్పవయ్యా' అన్నాడు తర్డ్ హీరోయిన్.

కొలంబస్ నిస్సహాయుడై పోయినట్లు చూసి, ఒక్కసారి విరగబడి నవ్వేసి 'హరి మీ యిళ్ళులు బంగారంగానూ!... లేదంటే లేదనా అర్థం.... పిచ్చివారా... వురినే చమత్కారాని కన్నాను... లేదంటే, ఉందా లేదా అనిపించేటంత సన్నగా ఉందన్న మాట. మిగతా బాడీ మీద కంపేర్ అండ్ కాంట్రాస్ట్‌గా' అని మళ్ళా పగలబడి నవ్వేశాడు ఆయన.

సభికులకు అటే నచ్చలేదు ఈ వివరణ. అనుమానంగా కోపంగా చూశారు.

"ఏవయ్యోయ్! నాటకాలాడబోక మా కాడ. కిందట్నెల నన్ను 'దీవించి' బొమ్మేయించడానికి తాంబూలం పుచ్చుకున్నప్పుడు ఏం చెప్పావు. ఆర్నెల్లదాకా ఇంకెవర్నీ దీవించి కాంపిటీసను రానివ్వను అని ఒట్టెయ్యలే ? ఇపుడు మళ్ళీ ఇదేం కథ?"–

అని ఒకాయన అనబోయాడు.

అలాంటిదేదో జరుగుతుందని కొలంబస్‌కు తెలుసు. తక్షణమే రాజు అతనికి కంటికి కనబడ్డాడు. కనపడగానే జ్ఞాపకం వచ్చాడు కూడా.

"హల్లో బ్రదర్, ఎప్పుడొచ్చావ్? రా. కూర్చో అలా నిలబడిపోయావేం?... ఖమాన్...." అన్నాడు రాజుతో అర్జెంటు రాజకార్యాలున్నట్టు.

రాజు తుళ్ళిపడి, మేలుకుని, ఈ హఠాత్సన్మానానికి ఆశ్చర్యపడి లేచి, 'యస్సార్ అయామె స్టూడియో సార్.... యువారె బాక్స్ యందు మై బాగ్ సార్... యస్టర్డే అయామే బీటింగ్..." అంటూ సాధ్యమైనంత తేట తెల్లంగా సుళువైన టెలిగ్రామ్య భాషలో తన భావాలను బట్వాడా చేయడానికి ఉపక్రమించాడు.

"ఫష్ట్ కం అండ్ చెయిర్ డౌన్ ఇన్ ది సిట్" అన్నాడు కొలంబస్ నవ్వుతూ.

తక్షణం సభికులు లేచి, నిరసనగా ముక్కుపుటా లెగరేసి, వెళ్ళిపోయారు.

రాజొక కుర్చీలో కూలబడి తన కథ చెప్పాడు తెలుగులో.

రాజు ఆత్మకథ మొదలు పెట్టబోయేవరకు కొలంబస్ తుళ్ళిపడి హోల్డాన్ అన్నాడు. "బాబ్బాయి నీ పుణ్యం ఉంటుంది. నీ కథలో నన్ను తోమి తోమి వదలి పెట్టకు. కన్నీళ్ళ స్టాకు లేదు. ఈ సారిక నన్నొదిలేయ్" అన్నాడు.

"వాట్‌సార్ నిన్న నాకు కాఫీకూడా ఇచ్చి అంత ఆదరించి మాట్లాడారే.... అయ్యో అని విచారించారే - ఫరవాలేదని ధైర్యం చెప్పారే - పెట్టే, సంచి ఇక్కడ పెట్టుకోవచ్చు నన్నారే - ఇవాళ ఇంతకోపం ఎందుకు నామీద ఎడిటరుగారూ? బైది బై డైలాగెలా వుంది?" అన్నాడు రాజు బాధగా.

"హారినీయిల్లు బంగారంగానూ. ఇందాకట్నుంచి నా మాటలు విని నేనే ఎడిటర్ననుకున్నావా? ఛంపేశావు. వారు వేరు. ఇప్పుడే వస్తారు. నేను ఉత్త ఫ్రెండుని ఊరికినే వచ్చానన్నమాట. ఇంకానయం ముందరే చెప్పావు. నేను ఒక ప్రొడ్యూసరు బ్రదరిల్లాని. ఇంకో ఎగ్జిబిటర్ మేనల్లుడిని. వెరీ పవర్‌ఫుల్ మాన్‌ని. ఏమనుకున్నావో- పోతే డైలాగు బ్రిలియంట్‌గా లేదు" అన్నాడు కొలంబస్.

"అయ్య బాబోయ్! నిజంగానే? అయామె యంగ్‌మెన్ సార్. అయి వాంటె జాయింటు ఫిలింఫీల్డు అయామె హీరో ఫర్ సిక్స్ డ్రామాస్...."

"టెలుగులో కంటిన్యూ చెయ్యి. అదర్‌వైస్ సమ్ రీడర్స్ విల్‌నాట్ అండర్‌స్టాండ్యూ" అన్నాడు కొలంబస్.

"రైతోసార్. నేను చలన చిత్రములలో చేర నభిలషించుచున్న ఆంధ్ర యువకుడిని, ప్రతిభావంతుడిని, బోల్డు ఉత్సాహం ఉంది"

"వెరీగుడ్. ఉత్సాహంకాక ఇంకేమిటి ఉన్నాయి?"

"ఆశయాలూ ఆదర్శాలూ, ఓ రేకుపెట్టి, ఎం. శ్రీరాములు అండ్ బ్రదర్ వారి సంచీ, (మా వద్ద ఎక్సర్‌సైజు బుక్కులు: ఎక్కముల బుక్కులు, పెన్సిల్లు, రబ్బర్లు, సకలాంధ్ర వాచక పుస్తకములు మేలైన డిటెక్టివు నవలలు మొదలగునవి సరసమైనధరలకి దొరకబడును. ఇట్లు-) ఉన్నాయండి. సంచీలో ఓ చొక్కాలాగు, కొంచెం లిట్రేచరు ఉందండి."

"వెర్రీగుడ్. పెట్టిలో ఏముంది."

"పెట్టెలోనాండి పెట్టెలో నవల్సులూ, స్క్రీనుప్లేలూ, సినిమా సాంగ్సులూ అవీ వున్నాయండి" అన్నాడు రాజు బోల్డు సిగ్గుపడుతూ.

"ఎన్ని వీశెలు?" అన్నాడు కొలంబస్ సిగరెట్ ముట్టిస్తూ నిర్లక్ష్యంగా.

రాజుకు కోపం వచ్చింది. 'కళని వీసెల్లో తూచే నిష్కళులనుకో లేదు మీరు' అన్నాడు గంభీరంగా ఇంటిపైకప్పు వంక చూస్తూ.

"బాగుంది బ్రదర్ ఒక్కపెట్టే అన్నావు కాబట్టి వీశె అన్నాను. నా సొమ్మేం పోయె మణుగులనమంటే అలాగే అంటాను. పుట్లు అనమన్నా నాకు అభ్యంతరంలేదు. అవేవో పందుములు, గరిసెలు, ఇంకా తులాలూ, ఫలాలూ, ఏబులాలూ, పేలాలూ, అమృతలాలూ ఇలా ఏ లెక్కన తూయించడానికీ కూడా నేను పేచీ పెట్టను" అన్నాడు.

'అసలు కళని ఎవరేనా తూస్తారేవిటంటీ'

'లేకపోతే డబ్బులెలా గిడతాయి. అమ్ముకోవూ?'

'బాగుంది సార్. అలా అమ్ముకునేటట్లయితే అంత కష్టపడి రాయటం ఎందుకు?'

'ఎందుకేమిటి? తెల్లకాయితాలు అమ్మాలంటే కష్టం కదా? గవర్నమెంటు వాళ్ళు ముందర లైసెన్సు అదీ పుచ్చుకోమంటారు. వాటిమీద ఏదో ఒటి రాసిపడేస్తే ఆ బెడదలుండవు. అదృష్టం వుంటే ఏ వహీదా రెహమానో చదువుతుంది. ఆనక నీమీద 'ప్యాసా' తియ్యొచ్చు."

రాజుకి బోధపడలేదు. అందుకని తనకు తెలిసిన పద్ధతిలోనే చెప్పదలచినది చెప్పడానికి ఉపక్రమించాడు. ఇపుడవన్నీ చెప్పకపోతే, ఆనక "చేయిజారినపిట్ట చిక్కిపోయెనే" అని డైలాగు అనుకుంటూ క్లోజప్‌లో విచారపడాల్సొస్తుందని అతనికి తెలుసు.

అందుకని పుంజుకుని, "నావద్ద సినిమాకి మొత్తం నాలుగొందల యాభై సబ్జెక్టులు రెడీగా ఉన్నాయిసార్. చూడరాదా?" అన్నాడు ఆశగా, సూటిగా.

"అయ్యబాబోయ్. అయితే నువ్వోరైటు. వీసెల్లో తూచలేం; అడుగుల్లో కొలవలేం. ఉజ్జాయింపుని వీసెడు కథ మూడుమైళ్ళ పొడుగుంటుంది గద. ఆ లెక్కన నీ దగ్గిర ఓ పదిపుట్ల కథలుంటే ఎన్నిమైళ్ళు? చెప్పు. ఖమాన్. వీశకి మూడుమైళ్ళు. పుట్టికెన్ని?.... ముందర పుట్టికెన్ని వీశెలో చెప్పు.... ఊఁ చెప్పవేం? పుట్టి కెన్నిమైళ్ళు మైలుకెన్ని వీశెలు, వీశె కెన్ని గంటలు? ఇవికూడా తెలీపోతే యువారన్‌ఫిట్..." అన్నాడు కొలంబస్.

'సారీ సార్. తెలీదండి'

'హుఁ ... ఇలాటి వాళ్ళంతా రైటర్లవుతున్నారు... బ్రదర్. ఓటే కొండగుర్తు. ఈ ప్రపంచంలో నీకు తెలియందేదీ లేదు. నీకు తెలీందేమైనా ఉందేమో ఒకవేళ ఆ సంగతి నీకు తెలీదేమో అని ఎవడైనా అంటే అదీ తెలుసని వాదించు. ఝామ్మని దబాయించు' అన్నాడు కొలంబస్.

'సబ్జెట్లు చూస్తారాండి... ' అన్నాడు రాజు ఆయన ఉపన్యాసం కానిచ్చి.

'ఏమి సబ్జెట్లోయ్? సబ్జెట్లూ పెసరట్లూను. పుట్లకొద్దీ ఉంటే నేనెక్కడ చూడను. టైము లేదు... నో టైము!.'

"ఇందాకళనే చెబుతూ ఉంటే, మీరూ అంతా వినలేదండి. ఆ నాలుగొందల యాభై నేనింకా రాయలేనివండి. రాయాలి. ఊరికినే హెడ్డింగులు రాశానన్నమాట. వింటారా?" అంటూనే, గబగబ పక్క గదిలోకెళ్ళి ఓ మూల ఉన్న తన పెట్టితీసి, 'అయ్యో బాబోయ్! ' అని పరుగెత్తుకొచ్చాడు రాజు.

"పెద్ద టోకరాండి. నా పెట్టె ఎవడో కొట్టేసి వాడిది నాకు తోసేసాడండి రైల్లో. మర్చిపోయాను ఇప్పుడెలాగ? నా లిట్రేచరు..."

"నీ లిట్రేచరు పోతే మరేం ఫరవాలేదులే. ఆ కొత్త పెట్టిలో ఏముందో చూడు. అందులోనైనా కాస్త పనికొచ్చే కాయితం ముక్కలుండచ్చు నోట్లు లాటివి."

"ఏం లేవండి. సుమారు రెండు వీశల న్యూసుపేపర్లు, రెండు కాళీసీసాలు ఉన్నాయండి. బెంగుళూరు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీలలో పాతపేపర్లు వీసె ఎలాకొనేదీ రాసిన అట్ట ఓటి ఉందండి... అయితేనేం ఫరవాలేదు. నా లిట్రేచరు నాకు కంఠతావే. చెప్పనాండి?"

"ఊ కానీ, ఏం చేస్తాం నీదయ." అన్నాడు కొలంబస్.

"శుక్లాంబరధరం విష్ణుం" చదువుకుని పుంజుకున్నాడు రాజు రాబోయే చిత్రాల జాబితా – "అతుకుల బ్రతుకులు, బతుకుల అతుకులు, బతుకులలో గతుకులు, శిథిలగృహం, శ్మశానవాటిక, సుందరి ఎ.మ్మే. బన్‌రొట్టి, నాన్‌రొట్టి, (ఈ రెండూ క్యామిడీల్లెండి) బావా మరదళ్ళు, వానా వడగళ్ళు, జోడెడ్లబళ్ళు, ఆశ, (మూడక్షరాలవి, లక్కీపేర్లు చెప్పనాండి?) నిరాశ, దురాశ, పేరాశ, కులాసా, దిలాసా, (ఈ రెండూ హ్యూమరికల్) పలాసా, మసాలా (ఇవి ఫైటికల్‌వి) లలాలా (మ్యూజికల్) సీత, లీల, బాల, గోల, రాధ, బాధ, బరి, శబరి, కబరి, అంబారి, లంబాడి, (ఇక్కణ్ణించి నాలుగువండి) మా మావయ్య, మీ అత్తయ్య, శేషశాయి, హాయి హాయి, ఇరుగిల్లు, పొరుగిల్లు, గల్లుగల్లు, దుర్యోధనుడు, దుర్మార్గుడు, సన్మార్గుడు, ధర్మరాజు, బెజవాడ, మెడ్రాస్, గుడివాడ జంక్షన్, (ఇది డిటెక్టివు పిక్చర్లకి హెడ్డింగులనుకోండి... మీదయ అన్నాడు కొలంబస్) తరువాత కాంచనమాల, యాటంబాంబ్, శిలీముఖం, సగం సగం, నువ్వూ నేనూ...."

"అట్టె అట్టె హోల్డాన్.... శిలీముఖం అంటే ఏమిటి బ్రదర్" అని అడ్డు తగిలాడు కొలంబస్.

రాజు అరక్షణం ఆగాడు. "తెలీదండి ఏదో ఓటి. మనకెందుకు పోనిస్తురూ, ఏం... సోషల్స్... సుధా, మధూ, నిర్మలా మోహన్–"

"ఆగవయ్యాంటే... శిలీముఖం సంగతి చెప్పవేం? అర్థం చెప్పూ"

'హెడ్డింగులకి అర్థం ఏమిటిసార్ నాబొంద... కథకి కాళ్ళూ చేతులా అన్నట్టు దీనికి అర్థమా పర్థమా.. క్యాచీగా ఉండాలి అంతే'

'మీబొంద... వెతికితే అర్థం పర్థం అన్నీ ఉంటాయి. శిలీమొహం అంటే... శిలి అనేవాడి మొహం అన్నమాట. బాగా దానాలూ అవీ చేశారు. వీడూ దభీచీ అనే ఇంకోడూ. అసలు వారిద్దర్దీ జాయింటు స్టోరీ. నువ్వు విడదియ్యడం బాగానే ఉందనుకో. రెండు పిక్చర్లకి పనికొస్తుంది. ఏం ఆ శిలి అనేవాడి ముహంతో ఓ శ్టాట్యూటు కట్టారు. దాని కథ అన్న మాట తెలిసిందా?"

"తెలిసింది కానండి తప్పేమోనండి. మీరు చెప్పిన వాడి పేరు శిబి అనుకుంటా!"

'లాభంలేదు. మోస్ట్ అన్‌ఫిట్. అర్ధణాకి చెల్లవు. ఎప్పుడూ అలా నీ కంటే పెద్దవాళ్ళ మాట రైటు కాదేమో అనకు. రైరోఅనడమే. పెద్దవాళ్ళు సిలి అంటే సిలే. శిబి అంటే శిబే. అయినా శిబేమిటి నా బొందలా ఉంది. సిలే అయుంటుంది వాడిపేరు.

"నీ హెడ్డింగులు వింటే ఓటి జ్ఞాపకం వస్తుంది అబ్బాయ్. ఓ కథ చెబుతా విను" అన్నాడు కొలంబస్.

❀ ❀ ❀ ❀

నువ్వింకా ఉత్త హెడ్డింగులే రాశావు. మా ఫ్రెండు శేషగిరి కట్టలికట్టలు కథలు రాశాడు సినిమాలకని.... ముఖ్యంగా పౌరాణికాలమీద స్పెషలిస్టు అన్నమాట. సీతారాముల దగ్గిర్నుంచి సాయిబాబా దాకా ఎంతమంది దేవతలూ రాక్షసులూ ఆడా మగా ఉన్నారో అందరి కథలూ విడివిడిగా జమిలిగా సమిష్టిగా తయారుచేసిన వాటికి ట్రీటుమెంటు రాసి అట్టే పెట్టించాడు. ఎవరన్నా ప్రొడ్యూసరు అర్ధరాత్రప్పుడు ఓ సబ్జెక్టు కావాలంటే రెడీ అనేవాడు గిరి. అయితేనేం ఎవడూ వీడికి కానీయిచ్చిన పాపాన పోలేదు. కథ వీడిదగ్గిర పుచ్చుకోడం చూస్తాననడం, చూసి, దాన్ని ఇంకో పెద్దరైటరెవడికోయిచ్చి రాయించుకోడం... గిరిగాడు బోరెత్తి నెత్తి మొత్తుకోడం.... నాన్సెన్స్. శూర్పణక ఖథ వాడి బాబు ముల్లా అని వాళ్ళు తిట్టడం.... ఇదీ వరస....

ఒకసారి గిరిగాడు జటాయువు కథ సినిమాకి బెస్టుగా ఉంటుందనుకున్నాడు. అనుకోడమేమిటి ఇద్దరు ముగ్గురు బ్రోకరు ఫ్రెండ్లకి మెల్లిగా ఈ సంగతి చెప్పి, రాత్రి తెల్లవార్లూ కూచుని తను కథ రాసి పారేశాడు. జటాయువు కథ తెలుసుగా, వాడి అన్న సంపాతి అని ఓడున్నాడు. ఇద్దరూ ఒకర్తినే ప్రేమించారన్నమాట. వాళ్ళ నాన్న బీదపక్షి. అంటే ముసలాడు. బలం లేదన్న మాట. మరి డేగలకి బలమేగదా ఆస్తి. సరే ఆ ముసలాడు ఓ చెట్టు కొమ్మమీద కంబళి కప్పుకుని దగ్గుతూ కూర్చుండగా బిగినవుతుందన్న మాట.

"డేగలు కంబళీ కప్పుకుంటాయండి?" అన్నాడు రాజు జంకుతూనే.

"ఎందుక్కప్పుకోవు. అయితే, చేనేత కంబళ్ళు కప్పుకుంటాయి. అలాని డిస్ట్రిబ్యూటరు కూడా చెప్పాడు. ఆనక రైటర్ని అడిగితే, ఆయన రైట్ అని చెప్పాడు. ఒరిజినల్ రామాయణంలో ఓ శ్లోకంలో బిట్వీన్ ది లైన్సు - అంటే రెండు లైన్లమధ్యన ఉందిట."

"ఏదీ? చేనేత కంబళీయాండి? అంత పల్చగా నేసేవారా?" అన్నాడు రాజు ఉత్సాహంతో, ఆశ్చర్యంతో.

"నా బొంద. జటాయువులు కంబళ్ళు కప్పుకుంటాయీ అన్న సంగతి ఉంది. సరే కథ విను. ఆ జటాయు తండ్రి అలా ఇంట్రవెల్ దాకా దగ్గుతూ బతికుంటాడు. ఈ లోగా జటాయూ, సంపాతీ ఆ పిల్లడేగ కోసం పవర్‌ఫుల్ డైలాగుల్లో చడామడా తిట్టుకుంటాయనుకో, అప్పుడే ఆకాశంలోకి ఎగిరి ఇద్దరూ రెక్కల్తో యుద్ధం చేస్తాయి. రెక్కల యుద్ధం..... కనీవినీ ఎరుగని రెండు గండభేరుండాలు నోటిలో కాగడాలు పట్టుకుని రెక్కలతో కొట్టుకున్న అద్భుత భయానక రౌద్ర దృశ్యాలనుచూడుడు - అలాని రాసుకోవచ్చు పోస్టర్లమీద - ఏం. వాళ్ళు కొట్టుకున్నాక సంపాతికి రెక్కలు తెగిపోతాయి. అక్కడ శాడ్ సాంగు.... ఇదిచూసి ఆ పిల్ల మనసు విరిగిపోతుంది.

'హ్యాపీ లైఫ్! నా మూలాన బ్రదర్స్ ఫైట్ చేశారు. వన్‌ఫైలోకి రెక్కలు తెగిపోయాయి. పూర్‌బర్డ్' అనుకుని ఓ పాటపాడి, బాగా పైకెగిరి రెక్కలు ఆడించడం మానేసి, కిందపడడం మొదలెట్టింది.

ఆ గండభేరుండం కింద పడిందా? (ఇక్కడకూడా చేనేత ప్రాపగాండా పెడితే జనాభాని బాగా ఆకర్షించొచ్చు) జటాయువేనా ఆమెని పెళ్ళాడాడా? వాడిరెక్కలు ఏమయ్యాయి? జటాయు సీతని రక్షిస్తాడా? సీతకి రాముడు కనబడతాడా? వెండితెరమీద చూడుడు.

"తరవాతి కథ చెప్పడానికి వీల్లేదనుకో. అక్కడే కీలకం అంతా ఉంటుంది. అది కాస్తా చెప్పేస్తే, ఆ కథని ఎవడేనా కొట్టెయ్యొచ్చు. అందుకని బేరం ఖరారని నమ్మకం కుదిరితేగాని ఎవరూ వివరంగా కథ చెప్పరు" అన్నాడు కొలంబస్.

"మరి నాకు మతిపోతోంది. ఎలాగ" అన్నాడు రాజు.

"పోతేపోనీ మరేం ఫర్వాలేదు. మిగతా కథ విను. అంటే జటాయు కథ కాదు. అది రాసిన గిరిగాడి కథ. వాడు జాగ్రత్తగానే ఉంచుకున్నాడు. వాడి బ్రోకరు ఫ్రెండు, పెద్ద పెద్ద స్టార్ల దగ్గిరా, ప్రొడ్యూసర్ల దగ్గిరా చూచాయగా ఆ కథ చెప్పి, దీన్ని ఫలానావాడు రాస్తున్నట్టూ అద్భుతమైన బాక్సాఫీసు ట్రీటుమెంటు చేస్తున్నట్టూ, ఆ మాట అతిరహస్యమైనట్టూ, తనకే ఎలాగో తెలిసినట్టూ, నట్టుతూ మెల్లి మెల్లిగా స్కూ ఇస్తూ వచ్చేవాడు. ఒకానొక పెద్దస్టారు అది విని బాగుందనడం జరిగింది. తక్షణం ఆ బ్రోకరుడు ఓ ప్రొడ్యూసరు దగ్గిర కెళ్ళాడు.

"ఫలానా బాక్సాఫీస్ స్టార్‌కి ఫలానా కథమీద దారుణమైన మోజు ఉంది. ఈ సంగతి యింకా ఎవరికీ తెలీదు. మీరు కనక ఆ కథ విని కొనుక్కుంటే, ఆ స్టారుని సులభంగా బుక్ చేసుకోవచ్చు." అని చెవిలో చెప్పాడు.

ఆ ప్రొడ్యూసరు ఎంత లావువాడైనా యధాశక్తి ఎగిరి, చిన్న గంతువెయ్యడం సహజంకదా. సిఫార్సు తెచ్చుకోకుండా, పెళ్ళాం బిడ్డల్ని వెంటబెట్టుకువెళ్ళి ఆ స్టార్‌ను తన చిత్రంలో వేషం వెయ్యమని బ్రతిమాల నవసరం లేకుండా, కేవలం ఒక్క కథ కొనడంవల్ల చులాగ్గా బుక్ చేయడానికి వీలవుతోంది గదా మరి.

సరే, అబ్బీ ఆ కథ ఎవరిదోయ్? అన్నాడు. భలానా శేషగిరిరావు రాస్తున్నారు అని చెప్పాడు బ్రోకరు. రైతో అని ప్రొడ్యూసరు బయల్దేరి వెళ్ళాడు. గిరిని అడిగాడు. గిరి ఎంతో సంతోషించాడు. డబ్బు అదీ మాట్లాడుకున్నారు.

అంతలోకే చిన్న చిక్కొచ్చి పడింది. సదరు ఏర్పాట్లు చేసిపెట్టిన బ్రోకరు సగానికి సగం వాటా యివ్వమన్నాడు గిరిని. నేనింతగా కాన్వాసు చెయ్యకపోతే నీకు దిక్కేమిటి అని పోట్లాడాడు.

"అరే, నాకు ఆ ప్రొడ్యూసరు ఇచ్చిన డబ్బు చాలా కొంచెం కదా. దాన్ని రెండెట్టి భాగించడానికి వీల్లేదే. ఎలా?" అన్నాడు గిరి.

"ఎందుకు వీలుండదు? నా ప్రోపగాండా అప్పనంగా వస్తుందనుకున్నావేం పాపం" అని దబాయించాడు బ్రోకరు.

"అయ్యో, నీ కివ్వడానికి నాకేం అభ్యంతరం లేదు. కాని ఆయన నా కిప్పుడిచ్చినది చాలా కొంచెం కదా. దానిని సగం సగం వాటా వెయ్యడానికి అస్సలు వీల్లేదు. 'ఇప్పుడిది లాంఛనంగా తీసుకోండి. పిక్చరు రిలీజయ్యాక మిగతాది మీకిస్తానూ' అలాఅని చెప్పాడు ప్రొడ్యూసరు గారు. వృద్ధిలోకి రాదలచుకుంటే ఈ ఛాన్సు వదులుకోవద్దని బెదిరించాడు. అందుకని ఒప్పుకున్నాను" అని మొత్తుకున్నాడు గిరి.

"అదంతా నా కనవసరం. రిలీజయ్యాక వాడేమిస్తాడు. నువ్వేం పుచ్చుకుంటావు. ఇస్తే గిస్తే అదంతా నువ్వే ఉంచుకో. ఇప్పుడిచ్చింది మటుకు చెరిసగం వాటా వెయ్యాల్సిందే. వీల్లేదండానికి వీల్లేదు. ఎంతిచ్చాడో తియ్యి ఇవతలకి" అన్నాడు బ్రోకరు. అప్పుడు నేను అక్కడే ఉన్నానులే. అప్పటిదాకా గిరిని తిడుతున్నాను. ఇప్పుడు వీడి పోట్లాట చూస్తే నవ్వాగటంలేదు. ఆఖరికి ఆ గిరికికూడా నవ్వొచ్చేసింది అంత దుఃఖంలోను.

"ఇంద తీసుకో. ఇదే నా తొలి సినిమా ఆర్జన. బావుంటే, చాతనైతే దీన్ని భాగించు రెండు తోటి" అంటూ, గూట్లోపెట్టిన తాంబూలంలోని 'అడ్వాన్సు' తీసి గదిమధ్య పడేశాడు.

'అయ్య బాబోయ్' అన్నాడు బ్రోకరు కొయ్యబారిపోయి. ఎందుచేతనో తెలుసా?

"భవుశా చెక్కు రాసిచ్చుంటాడు ప్రొడ్యూసరు" అన్నాడు రాజు దగ్గిరున్న తెలివితేటలన్నీ వాడేసి.

"నీబొంద. అయామ్ సారీ... మీ బొందలు. ఆ ప్రొడ్యూసరుగారు తాంబూలంలో పెట్టి ఇచ్చింది కాష్. హార్డ్‌కాష్. 1902 సంవత్సరపు గుండు గల రాజుగారి రాగికానీ" అన్నాడు కొలంబస్.

రాజుకి అర్థంకాలేదు. ఆనక, 'వెళ్ళొస్తా బ్రదర్' అంది అతని మతి.

'1902 వ సంవత్సరపు గుండు ఏమిటండీ! పేటెంటు చేసిన ఫాషనా?" అన్నాడు ఇంకేం తోచక.

"ఆ కాలమానం గుండుకు విశేషణం కాదు. కాణీకి, గుండు, కాణీమీద రాజుగారి బొమ్మకి సంబంధించినది. సదరు గుండుగల రాజుగారి బొమ్మగల కాణీ అన్నమాట. కల్తీలేని కాణి. దాన్ని రెండు వాటాలు వెయ్యడం ఎలా?"

'మరేండి, మూడు వెయ్యొచ్చేమొ.'

'దమ్మిడీలు దొరకట్లేదుగా. దొరికితే, ఓ దమ్మిడీ కమీషను ఇచ్చి, రెండు తీసుకుని చెరోటి పంచుకోవచ్చు. సర్లే అదెందుకు. వీలైతే మాత్రం ఏం చేసుకుంటాడు గనక.'

ఆ బ్రోకరు నాలుగు తిట్టి, నీపని చెప్తానుండు అని బెదిరించి వెళ్ళిపోయాడు. నమ్మునమ్మకపో బ్రదర్. మూడోనాటికల్లా "జటాయువు పెళ్ళి" అనే పిక్చరు తీస్తున్నట్లు యింకో ప్రొడ్యూసరు ప్రకటించాడు.

వీడికెల్లా తట్టిందిరా ఈ అయిడియా అని నేను వాకబు చేద్దును గదా. జరిగిందేమిటో తెలుసా? మా గిరిదగ్గర కథ తీసుకున్న ప్రొడ్యూసరు దాన్ని ఇంకో రైటరుకి చూపించి, డైలాగులూ గట్రా రాయమని బేరమాడి పుష్కలంగా డబ్బిచ్చాట్ట. తీరామోసి ఆ రైటరు తన ఆప్తమిత్రుడైన ఇంకో ప్రొడ్యూసరుకి దాన్ని అమ్మేశాట్ట. 'అదేంపనయ్యా' అంటే 'జటాయువు నీ సొంతం ఖదా! దాన్ని నా యిష్టం వచ్చినవానికి అమ్ముకుంటాను. ఆవటా" అన్నాట్ట ఆ పెద్దరైటరు. ఇటు గిరిగాడి గోలకి అంతులేదు. వీడూ, వీడితోపాటు మొదట వాణ్ణి మోసంచేసిన ప్రొడ్యూసరూ కలిసి జాయింటయిపోయి డ్యూయట్ ఆరంభించారు. ఆ రెండోపార్టీ వాళ్ళు అట్నించి గోలపెడ్తున్నారు. ఇంతట్లోకీ చల్లగా ఓరోజున "జటాయువుపెళ్ళి" అనేది ఎక్స్‌ఫిలింసువారి నెక్స్‌టుపిక్చరు అంటూ ప్రకటన వచ్చేసింది. ఆ పని చేసిన ప్రొడ్యూసరు అమాయకుడే. కానీ ఈ మా గిరీ వాళ్ళు చేసిన గోల తాలూకు పుకారు షికారెళ్ళి అతనికి సోకింది. అతను తక్షణం ఇంకో రైటర్ని కుదుర్చుకుని తను విన్న కథ యావత్తు చెప్పి, ఓ పెద్ద హోటల్లో ఉంచి తాళంపెట్టి, రెండు గంటల సేపులో ఆ కథకి టెంపరరీ ట్రీట్‌మెంట్ రాయించేశాడు. దాన్ని పట్టుకుని మొట్టమొదట – ఆ ఖదమీద మోజుపడ్డ స్టార్ తెలుసుగా – అక్కడికెళ్ళి చూపించాడు. ఆ స్టారుకి ఈ భాగోతం ఏం తెలుసు? కథ బాగుందని, డబ్బు బాగా వస్తుందని కాంట్రాక్టుమీద సంతకం పెట్టెయ్యడం జరిగింది. వెంటనే ఆ ప్రొడ్యూసరు ఆ కథని, ఆ సబ్జెక్టునీ, రిజిష్టరు చేయించేసుకుని ప్రకటన వేశాడు. ఇంకేముంది గొహోవింద"

"పిట్ట తగవు పిట్ట తగవు పిల్లి తీర్చెను. విన్నావా. ఆ కథ ఎక్కడ పుట్టింది? ఏ కంపెనీ మెట్టింది? చిత్రంగా లేదూ? నువ్వేమిటో సవాలక్ష హెడ్డింగులు వర్ణించావు ఇపుడు. ఇవన్నీ నీవేనని గేరంటీ ఏమిటి? ఇవి దక్కించుకు గట్టెక్కే ప్రజ్ఞఉందా?" అన్నాడు కొలంబస్ కథ ముగిస్తూ.

"జాగర్తగా ఉంటానండి. అసలిలాటి పరిస్థితి రానియ్యనండి" అన్నాడు రాజు ధైర్యంగా.

"అయితే ఇది చెప్పు. నువ్వు గిరిగాడి పరిస్థితిలో ఉంటే ఏం చేస్తావు? ఆ సబ్జెక్టుని ఎలా రక్షించుకుంటావు?" అన్నాడు కొలంబస్.

"దాని విషయంలో చేసేదేముంది? నీళ్ళొదులుకోడమేనండి... సుబ్బరంగా ఓ సోషలు కథ రాసుకుంటా"

"యూజ్‌లెస్. పనికిరావు. సోషల్ స్టోరీ ఎవడిక్కావాలి? క్యాస్టుమ్ పిక్చరు గురించి మాట్లాడుతూ ఉంటే?...

సరే విను, గిరి ఏం చేశాడో తెలుసా? ఈ గోలమూలానా వాడిపేరు నలుగురికీ తెలిసిందిగా మరి. అందుకని జటాయువు సినిమా తీస్తానన్నవాడంటే బాగా కోపం ఉన్న ఇంకోడి దగ్గిరికెళ్ళి సంగతంతా వివరంగా చెప్పి, వాళ్ళు తనదగ్గిర చెక్కేసింది అసలు కథకాదనీ, అది వేరనీ తన కథలో హీరో సంపాతే కాని జటాయువు కాదనీ చెప్పాడు. అసలు వాల్మీకి అయిడియా కూడా అదేనుట. అయ్యా

వాల్మీకిగారూ మీ జటాయువు స్టోరీ పిక్చరు తీస్తాంగాని హీరో ఎవర్ని వెయ్యమంటారూ అని గనక అడిగితే, పిచ్చివాళ్ళలారా సంపాతినే హీరోగా పెట్టుకోండి. పిక్చరు హిట్టవుతుంది అని చెప్పేవాడే వాల్మీకి అని చెప్పాడు గిరి. అందుకని సంపాతి హీరోగా ట్రీటుమెంటు ఉందనీ అది మొదలెడితే బెష్టనీ నచ్చచెప్పాడు. అదృష్టం కూడా కలిసొచ్చిన మూలాన ఆ ప్రొడ్యూసరు రైటో అనేశాడు. అంతే ఈసారి గుట్టుచప్పుడు లేకుండా, 'జటాయు' పిక్చర్లో హీరోనే వీళ్ళ 'సంపాతి' పిక్చరుకి కూడా ఎక్కువ డబ్బుమీద బుక్‌చేసి, వరసగా 20 కాల్‌షీట్‌లు కుదిర్చేసుకుని 20 రోజుల్లోనూ సగం పిక్చరు లాగి అవతల పారేశారు. ఇంక అవతలివాళ్లకి అప్పుడు తెలిసింది సంగతి. వాళ్లింకా షూటింగే మొదలెట్టలేదు. అపుడు పోటీగా తీసినా లాభంలేదని మానుకున్నారు. తక్షణం వీళ్ళు 'సంపాతి' పేరు మార్చి 'జటాయువు' అనే పెట్టుకున్నారన్నమాట. ఆ వేషం వేసిన పక్షి జర్మనీలో ట్రైనింగ్ అయి వచ్చిందిలే. భలే చురుగ్గా యాక్టుచేసి పారేసింది. దాని పోర్షను మిగతా దెప్పుడు పూర్తి చేస్తారో నాకు తెలీదు. అదీ కథ. రాజా నీకిలాంటి చురుకుతనం, నేర్పు ఉన్నాయా?" అన్నాడు కొలంబస్.

'లేవండి' అన్నాడు వరహాలరాజు నీరసంగా.

"అయితే లాభంలేదు. నువ్వు సినిమాలో చేరడానికి పనికిరావు" అన్నాడు కొలంబస్.

రాజు దిగాలుపడిపోయాడు. కొలంబస్ జాలిపడిపోయాడు. కాస్సేపటికి తను లేచి, మెల్లిగా రాజునికూడా లేవదీసి, 'ఏం చేస్తాం, అయాం సారీ" అన్నాడు.

"మరేండి. నేనుకూడా సారీయే... ఏం చేస్తాం. డబ్బేనా లేదు. నేనే ఓ ఫిలింతీసి నాకు వేషం ఇచ్చుకుందును" అన్నాడు రాజు చాలా సేపు ఆలోచించి.

"లాభంలేదు. ఇప్పుడలా అనుకుంటావుగాని, అప్పుడు మనస్పొపదు. పిక్చరు దెబ్బ తింటుందని భయపడతావు. ఒకటే గుర్తుంచుకో అబ్బాయి. రికమెండు చేసినపుడు ఎవడినైనా సరే ఆఖరికి మనని మనం రికమెండు చేసుకున్నాసరే, సొంత పిక్చరు విషయంలో మటుకు వాటికి కొంతకూడా లొంగకూడదు. రిస్కు. పెద్ద ప్రమాదం. అంచేత ఇంకోడి సినిమాలో ఇలాటి సిఫార్సులు ఇవ్వడం, పట్టికెళ్ళడం మంచిది. ఫరవాలేదు" అన్నాడు కొలంబస్.

"అదీ రైటేనండి."

"రైటుకాక?... సర్లే. స్టుడియోకి పోదాం వస్తావా?" అన్నాడు కొలంబస్ తామిద్దరికీ అక్కడ అర్జెంటు పనున్నట్టు.

"తీసికెళ్తారా?" అన్నాడు రాజు ఉత్సాహంగా.

"స్టూడియో నాది కాదుగా... అంచేత ఫరవాలేదు. రా – " అంటూ కొంటెగా నవ్వాడు కొలంబస్.

ఇద్దరూ బయల్దేరారు.

"అన్నట్టు మీ పేరేమిటి సార్?" అన్నాడు రాజు హఠాత్తుగా.

"ఏదైతేనేంలే ఈ కథ రాస్తున్నవాడు కొలంబస్ అంటున్నాడుగా. వాడిమాటే కానీ"

"సరేండి కొలంబస్సుగారూ-"

"ఇదిగో. నువ్వు మళ్ళీ చిలవలూ పలవలూ పెడతావెందుకు - బస్సూ కారూ అంటూను. కొలంబస్ అను."

"సరే సార్. నా పేరూ అలాగే చేశాడండి. వరహాలరాజు. యమ్మెస్ యస్ వరహాలరాజు గదా. ఇంటిపేరూ అవన్నీ తీసేసి ఉత్తి రాజు అని రాస్తున్నాడు. పొగరు."

"నా కన్న నయమేకదోయ్. నీది చక్కహా తెలుగు నేము. రేప్పొద్దున బుక్కయాకా..."

"రేప్పొద్దున్న బుక్కవుతానాండి? ఎందులో... హీరోయినెవరు? డబుల్ వర్షన్‌లోకూడా మేమిద్దరమేనా? ముందర మూజిక్కెవరో చెప్పండి. నాకు యం. సత్యం శాంగు బ్యాగ్రౌండు పెడితే బాగుంటుంది. మరేమో-"

"గురో! హోల్డాన్....నా డైలాగు పూర్తికానియ్యి. రేప్పొద్దున్న నువ్వు బుక్కులయితే గియితే, ఆ పిక్చరు వస్తే గిస్తే అప్పటి సంగతి. అప్పుడు పబ్లిసిటీకి నీ పేరు బాగుంటుందీ అని నా అయిడియా. డాష్ పిక్చర్సు వారి ఎక్స్ చిత్రంలో ఫలానాదేవి, ఉత్తిరాజూ నాయికానాయకులుగా నటిస్తున్నారు, అలాని రాసుకోవచ్చు-"

"సార్ వన్ మినిట్. నేను చెప్పింది 'ఉత్తిరాజు' కాదండి. రాస్తున్నవాడు నా పేరుని కత్తిరించేసి, ఉత్తినే 'రాజు' అని మాత్రం అని రాస్తున్నాడు అని చెప్పానండి. ఉత్తిరాజు అయితే నాలుగక్షరాలు గదండీ. ఇంకో రెండు కలిపితే వరహాలరాజు అనే రాయొచ్చుగా. అంచేత...."

"పోనీ రాజే అనుకో. అదిమటుకు బాగులేదూ? చక్కగా రెండక్షరాలు... రాజు. రాజు.. ఆ మాటకొస్తే రాజ్. బాగాలేదా?"

"మరేండి లక్కీనేమ్‌కూడా..." అన్నాడు రాజు మనసులో తన హృదయాధినేతను తలచుకొని.

❀ ❀ ❀ ❀

స్టూడియో లోపల ప్రవేశించడానికి, క్రితం రోజున రాజు చాలా అవస్థపడ్డాడు. ఇపుడు కొలంబస్‌తో కలిసి సునాయాసంగా వెళ్ళిపోతున్నందుకు పరమానంద భరితుడైపోయి, ఆశ్చర్యపడి లేచి నానా హడావుడీ చేయవలసింది. కాని, 'రాజ్' నామస్మరణలోపడి ఆ మైకంలో ఉన్నమూలాన, అతనికి ఆ సంగతి తెలియనేలేదు. స్టూడియోలో అతని వెనుక నాలుగైదు చోట్లకి గిరగిర తిరిగాడు. ఎందులోకీ వెళ్ళలేదు. ఒక్కచోట ఇద్దరూ ఆగారు. కొలంబస్ ఎవరితోనో ఏదో

మాట్లాడాడు. అంతలో రాజుకి ఒక అద్భుతం కనబడింది. కొలంబస్ తనవైపు తిరగ్గానే "సార్" అన్నాడు.

కొలంబస్ నవ్వాడు ప్రేమతో. "వత్సా నీకుతోచిన సందేహం నాకు తెలుసు కాని ఒక కథ జ్ఞాపకాని కొచ్చింది చెబుతాను. ముందర అది విను" అన్నాడు.

❀ ❀ ❀ ❀

"కొంతకాలం పూర్వం అచ్చం నీలాంటివాణ్ణే బొంబాయిలో ఓ స్టూడియోకి తీసుకెళ్ళాను.

అవీయివీ చూశాక, అన్నీ అడిగి తెలుసుకున్నాక, ఇలాగే ఓచోట ఆగాం. హఠాత్తుగా అతనికి చిత్రమైన ఊహ పోయింది. "సార్ – ఇది సవరాలకొట్టా ఇక్కడ విగ్గులుంటాయా అన్నాడు. అయామ్సారీ ఇది భవుశా గ్రీను రూము కాబోలు అన్నాడు రావు – వాడిపేరు రావులే – అంచేత... అన్నాడు రావు.

గ్రీనురూమేమిటి మేకప్‌రూము అనాలి అని చెప్పాను నేను. మీకు తెలీదు సార్ గ్రీనురూమనే అంతా అంటారు. నేను బోల్డు నాటకాలు వేశాను అన్నాడు. నేను బోల్డు సినిమాలు తీశాను. దీన్ని మేకప్‌రూమే అంటారు అన్నాను నేను. వాడు ఓడిపోయి, సర్లెండి, మొత్తానికిది గ్రీనురూమన్న మాట అని తేల్చేశాడు.

"నీ దుంపతెగా ఇంతాచేసి అదా నువ్వనేది. అయితే శుద్ధ తప్పు. ఇది గ్రీనురూమూ కాదు. ఏంకాదు" అంటూ ఆశ్చర్యపోయి, వచ్చాక, "ఇది రికార్డింగు రూము" అని చెప్పాను. "ఇక్కడ సవరాలూ ఉండవు. విగ్గులూ ఉండవు. ఇక్కడ శాంగులు రికార్డు చేస్తారు. కావలిస్తే విను" అన్నాను. అప్పుడే లీలగా వినపడ్డాయనుకో పాటలు.

వాడిక్కోపం వచ్చింది. 'వాట్‌సార్, మరీ అంత పల్లెటూరి బైతుకింద జమ రాసేస్తున్నారు నన్ను. ఇది మేకప్‌రూము కాకపోతే, ఇక్కడ ఈ పీచు అంతా ఏమిటండీ? ఏవిటదండీ? ఏవిటదంతా' అన్నాడు కోపంగా.

"ఏమిటిదంతా అంటే ఏమిటి? ఏముందిక్కడ నాకేం కనపడదేం?" అన్నాను.

"ఎందుక్కనబడదు? నా కళ్లు పెట్టుకు చూడండి" అన్నాడు.

సరేనని వాడికళ్లతో చూశాను.

అంతే చట్టవిరిగేలా ఆశ్చర్యపడ్డా నన్నమాట. అక్కడంతా బోలెడంత జుట్టు. పెద్దపెద్ద గేరాలూ, క్రాపింగులు, కొప్పులూ, అవన్నీని. కొంత నల్లటిజుట్టు, సవరాలకి సరిపోతుంది. కొంత పండినజుట్టు, కారెక్టరు యాక్టర్ల గడ్డాలకీ, విగ్గులకీ బాగుంటుంది. ఏమిటా ఇది అని దివ్యదృష్టితో చూశాను.

('వాడికళ్ళతో అన్నాడుగా' అన్నాడు రాజు )

ఏడిశాడు వాడి కళ్ళేం పనికొస్తాయి బోడికళ్ళు. (బైదిబై డైలాగెలా వుంది?).... ఇది మూలకారణం తెలుసుకోడానికి క్కావలసిన దృష్టి అన్నమాట. సరే దాంతో చూస్తే ఏం కనబళ్ళేదు. వాట్ అనుకుని తెలివితేటలు తీసి ఉపయోగించాను.

(ఉన్నాయాండి! అన్నాడు రాజు వినయంగా)

కొంచెంసేపట్లోనే మిష్టరీ విడిపోయింది. తక్షణం వాడికా సంగతి చెప్పి అక్కణ్ణించి తగిలేశాను.

ఇంతకీ ఆ పరమసత్యం ఏమిటనుకున్నావు. అది నిజంగా రికార్డింగు రూమే! అక్కడ నిజంగా వంద విగ్గులకు సరిపడే జుట్టూ ఉంది. ఈ రెండూ ఎలా చేరాయి?"

అని ప్రాసిక్యూషన్ లాయరులా అడిగి, ఆగి తాపీగా సిగరెట్టు ముట్టించాడు కొలంబస్.

చెబుతాడేమోనని ఓపిగ్గా చూశాడు రాజు. కానీ, కొలంబస్ ఆ నటన బావుందన్న దురభిప్రాయంతో స్వామి వివేకానందస్వామికిమల్లే చేతులు గట్టుకొని, ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తున్నాడు.

"చెప్పండి మరీ" అన్నాడు రాజు. కొలంబస్ చెప్పలేదు. అందుకని రాజు ఆలోచించాడు, ఆ పని అలవాటు లేకపోయినా.

"భవుశా, ఈ రికార్డింగు రూము పెట్టడానికి ముందు, గ్రీనురూము కట్టివుంటారు ముందస్తుగా" అన్నాడు.

"నీ తలకాయ. తప్పు. ఆ మధ్య భూమి చల్లారి, దానిమీద జీవకోటి పుట్టిన ప్పట్నించీ ఇక్కడ రికార్డింగు రూమే ఉంది తప్ప మేకప్పురూము లేదు. ఉన్నప్పటికనీ ఇలా ఎవడూ విగ్గు జుట్టుని జల్లడు. ఇదేం మాటలా, బోల్డు ఖరీదు. పిక్చరు తియ్యడానికే బోల్డు అవుతూంటే, విగ్గులు తెచ్చి చింపేసి, ఆ జుట్టు వెదచల్లడానికి కూడా ఎవడు ఖర్చుపెడతాడు. హాబీ మంచిదేనేమోగాని, నాకు తెలిసినంత వరకూ– నాకు చాలా తెలుసు– ఈ ఫీల్డులో అలాంటి హాబీలు ఎవరికీ లేవు." అని గంభీరంగా ఆగిపోయాడు కొలంబస్.

"పోన్లే. సంగతేమిటో చెప్పవయ్యా నా ప్రాణం తీస్తున్నావు. నీ పోజూ నువ్వూనూ" అన్నాడు రాజు.

"సంగతి చాలా విషాదకరమైనది. పెద్ద ట్రాజడీ థీము. దీనికి తర్టీసిక్స్ వయోలిన్స్‌తో నాదనామ క్రియలో ప్యూర్ కర్ణాటిక్ మ్యూజిక్ బాక్‌గ్రౌండు కావాలి"

"మేష్టారూ మీరు తొరగా తెమల్చకపోతే లాభంలేదు. ఇక్కడ చోటు అయిపోతోంది. నలిగి పోతున్నాను నేను" అన్నాడు రాజు విసుగ్గా.

"చోటైపోతే పక్క పేజీలో కథ రాసిన మేష్టార్ని కాస్త అడుగుదాం. సంగతేమిటంటే ఇది పెద్ద ట్రాజడీ. ఈ జుట్టంతా సంగీత కళారాధకులది."

❀ ❀ ❀ ❀

"నిజంగా! ఎవరన్నా డెక్కేశారా, లేపోతే, మొక్కుబడుందా" అన్నాడు రాజు.

'ఆ రెండూ కాదు. వాళ్ళ జుట్టు వాళ్ళే పీక్కున్నారు.'

"ఏం ఏంచేత?.... ఇంకోటి మేష్టారూ మీ బుద్ధి పోనిచ్చుకున్నారు కాదు. మీరు ఇలా ముక్కలు ముక్కలుగా చెప్పి, ముక్కముక్కకీ పోజుపెట్టి, తెలుగు సినిమాలా సాగిపోవడం బాగులేదు. మీగ్గాదూ చెప్పేది?"

"సర్లే విను - ఇక్కడ కోట్ల కొద్దీ పాటలు రికార్డు అయ్యాయి గదా. బాక్సాఫీసు సూత్రాలు అని ఉంటాయి చూడు. అవి బిగించేవారు జనానికి. 'వాటికోసం అని' వాటి మూలంగా, ఇంగ్లీషు, స్పానిష్, ఇటాలియన్, ఇండియన్, ఇంకా ఏవో బోల్డుదేశాలున్నాయి. ఆ రకరకాల సంగీతాన్ని తెచ్చి మన దాంతో కలిపి కాచి గిరగిరతిప్పి సాగదీసేవాళ్లు. ఇలా చేస్తేనే పాటలు హిట్‌లు అవుతాయి గదా మరి. అయినా కొందరు సంగీతం వచ్చినవాళ్ళు ముందర ఒద్దు మొర్రో అని తేలిగ్గా మొత్తుకున్నారు. ఆనక భరించలేక జుట్టు పీక్కుని కుప్పలు పోశారు. ఆ పాటలు కట్టిన వాళ్ళుకూడా అంతే అనుకో. ఇష్టంలేక పోయినా ఆ పనిచేసి, ఆనక, జుట్టు పీక్కొని కుప్పలు పోసి పోయేవాళ్ళు. కొందరు సంకర సంగీతానికి అంకిత మిచ్చారు. కొందరు అపశ్రుతులకి అంకితం ఇచ్చారు. తరువాత మానేశారనుకో అలవాటైపోయి. ఇదే అది. - దీనిలో కొంత ప్రేక్షకుల విరాళం.... బంగీలో పంపిస్తారు. తెలిసినవాళ్ళు తెచ్చి పడేశారు" అన్నాడు కొలంబస్.

'తెలిసిందండి' అన్నాడు రాజు.

"ఔనుగాని బ్రదరూ ఒక్క సందేహం. ఇందాక నువ్వేదో అడగబోయావు. నీకీ కథ చెప్పాను. ఏమిటదీ. నీకూ ఈ సందేహమే వచ్చిందా. నీకూ ఈ విగ్గులు కనబడ్డాయా?" అన్నాడు కొలంబస్.

"ఔనండీ"... అన్నాడు రాజు సిగ్గుపడుతూ.

"యూజ్ - లెస్ - అయితే నువ్వు పనికిరావు. ఇలాటివి నీకు కనబడకూడదు, కనబడితే నువ్వు బాక్సాఫీస్‌కి ఆమడ దూరాన ఉన్నావన్న మాట. ఇందులో చేరలేవు. చేరినా బాక్సాఫీస్సాంగు బతికినన్నాళ్ళు కూడా నిలబడలేవు" అన్నాడు కొలంబస్.

రాజూ, కొలంబస్ అలా కొంచెం దూరం నడిచేసరికి సన్నగా, పొడుగ్గా, వయోలిన్‌లా సొగసుగా ఉన్న చిన్నవాడొకడు ఎదురై 'హలో సార్' అన్నాడు కొలంబస్‌ని చూసి.

"ఏం బ్రదర్ కులాసానా?"

"ఆహాఁ మీ దయవల్ల. రాత్రి పి. యన్. పి. వాళ్ళ ఫిల్ము కత్తిరించాను. ఇంకో గంటలో ప్రొజెక్షనుంది. ఈలోగా ఓసారి చూదాం వస్తారా" అన్నాడు.

"ప్రొజెక్షనా?.... ఎన్ని రీళ్ళేం?"

"నాలుగు"

"బావుంటుందా?"

"నా మటుకు నాకు బాగుంది."

"ఫిలిం కాదోయ్, నేను చూడటం. వాళ్ళేమనుకుంటారో అని."

"అదా. ఫర్వాలేదు రండి. మీ బావ వాళ్ళకి బాగా తెలుసు. ఆయన్తో పనుందిట కూడాట."

"అందుకని నన్ను దువ్వుతున్నావా ముందు" అన్నాడు కొలంబస్.

"సార్! దువ్వటం చేతనైతే ఈపాటికి ప్రొడ్యూసర్ డైరక్టర్ని అయి ఊరుకుందును.... ఊరికే పిలిచాను."

అంతవరకూ వింతగా చూస్తున్న రాజు, అపుడు కొలంబస్కి గుర్తుకొచ్చాడు.

"ఓ, అయామ్ సారీ... ఈయన రాజుగారు. రాజూ! వీరు బాబీగారు అసలు పేరు - నాకు గుర్తులేదు. మేమంతా ఎడిటర్ బాబి అంటాంలే. బ్రిలియంట్ ఫెలో. ఎడిటరన్నమాట" అన్నాడు కొలంబస్ పరిచయం చేస్తూ.

"నమస్కారం" అన్నాడు బాబి.

"నమస్తే సార్... అయితే ఎడిటర్జీ, ఎన్. టి. రామారావుకన్న నాగేశ్వరరావు ఆర్నెల్లు పెద్దవాడని నేనూ, కాదని నా మిత్రుడు ముత్యం వాదించుకుంటున్నాం. మీరెవరితో ఏకీభవిస్తారెడిటర్జీ?" అన్నాడు రాజు.

"బ్రదర్ మిస్టేక్, గ్రేట్ మిస్టేక్. పొరబడితివి. ఈ ఎడిటరు పేరు. ఈయన ఫిలిం పత్రికల ఎడిటరు కాదు. ఉత్తి ఫిలిం ఎడిటరు. ఇక్కడ తయారయే సినిమాల్లో కొంత చెత్త కత్తిరించి మిగతా దాంతో కథలాంటిది చేసి ఇస్తాడన్నమాట. ప్రొడ్యూసరు నీకు వరమిచ్చినా, ఈయనకి గిట్టకపోతే నీకు మామూలుగా దిక్కుండదు. అమాంతం కత్తిరించి అవతల పారేస్తాడంతే, అదీ సంగతి" అన్నాడు కొలంబస్.

"ఓ, తెలిసింది సార్. ఎడిటర్ అంటే జంబులింగం, తిలక్, మాణిక్యం వీళ్ళందరూ కదూ. తెలుసునండి, దర్శకులుగా గూడా ప్రసిద్ధికెక్కిన చలనచిత్ర ఎడిటర్లెవరూ అని మేం అడిగితే సి.హెచ్.నారాయణమూర్తి, తిలక్ అని రిప్లయికూడా వచ్చిందండి–సార్ ఎడిటరుగారూ యక్స్కూజ్మీ. ఏమనుకోకు సుమీ? అయామే మిస్టేక్... అయితే చలనచిత్ర నటీనటుల భవిష్యత్తు మీ చేతులో ఉంటుంది. అంతే నంటారా?"

"మీ యిష్టం. అనమంటే అంటాను." అన్నాడు ఎడిటర్ అతని కేసి చిత్రంగా చూసి.

"పోనీ ఓసారి అందురూ. మీ సొమ్మేం పోయె. ఔనుగాని ఎడిటరుగారూ దువ్వడమనగా నేమిసార్. కొంచెం వివరంగా సెలవిస్తారా?"

"ఆ? ఏమిటి?" అన్నాడు ఎడిటరు బాబి ఉలిక్కిపడి.

ప్రొడ్యూసరు డైరెక్టరు అయిపోడానికి దువ్వడం రావాలని.... అయామె బ్రిలియంట్ యంగ్మాన్... దారుణమైన తెలివితేటలున్నాయని మా ఊళ్ళో అందరూ అంటారండి. ఇది నేర్చుకుని ప్రొడ్యూసరు డైరెక్టరయి పోదామని.... అంతకన్న ఇంకేం లేదు."

"అది చాలు. ఊహ మంచిదేకాని, మీరడిగిన ప్రశ్నకి జవాబు బాగా లేదు కాని, అదుగో ఆ లావుపాటి ఆసామిని చూశారా. ఆయన క్రాపింగు అసలు దువ్వుకోలేదు గదా ఆయన అలా మలుపు తిరిగి వచ్చేలోగా ఏం జరుగుతుందో చూడండి" అన్నాడు బాబీ.

అంతలోకే, ఆ లావుపాటి ఆయనకి ఇద్దరు ఎదురై నమస్కారం పెట్టి, ఏదో చెప్పారు. ఆయన తల తాటించాడు అలాగా అని. వాళ్ళో అరనిమిషం మాట్లాడి వంగి వంగి దండాలుపెట్టి వెళ్ళిపోయారు. చూస్తూ వుండగా, ఆయన క్రాపు దానంతటదే సర్దుకుని, నున్నగా దువ్వబడి ముస్తాబై పోయింది. ఆయన మొహం, హీరోయిను పాట అయిపోయినపుడు వెలిగే హీరో వదనంలా ప్రకాశించింది.

"అదీ దువ్వడం అంటే, మళ్ళీ వాళ్ళ చేతుల్లో దువ్వెన వుందా? లేదు. వాళ్ళయన తలకాయను చేత్తో ముట్టుకున్నారా? లేదు. చూశారా? అయినా ఆయన చింపిరిజిత్తు దానంతటదే దువ్వబడింది. అదీ సంగతి. రండి టైమైంది" అన్నాడు ఎడిటరు బాబీ.

❀ ❀ ❀ ❀

థియేటర్‌లో ఆ నాలుగు రీళ్ళూ వేస్తున్నారు.

మొదటి సీనులో నిర్మల బి.య్యే. అనిపించే రకం అమ్మాయి వయ్యారంగా ఉయ్యాల ఊగుతోంది పెద్ద హాలులో.

"ఆమె రామయ్య అనే రైతు కూతురు. నిర్మల బి.య్యే." అన్నాడు బాబీ.

"జమీందారు గారింటికొచ్చింది కాబోలు" అన్నాడు రాజు.

"అబ్బే, వాళ్ళిల్లే. జమీందారు ఇల్లు సెట్టు ఇంకా చిన్నది." అన్నాడు బాబీ.

"మరి బీదరైతుకి అంత పెద్ద ఇల్లుంటుందా?" అన్నాడు రాజు.

"ఉష్" అంటూ రాజు మోచేయి గిల్లాడు కొలంబస్.

"ఏం ఎందుకుండదు? రైతులు మాత్రం మనుజులు కారా. వారికి మాత్రం మేడలు లేవా... సార్! దేశంలో ఇలాంటి భావాలు ఉన్నంతకాలం ఈ దేశం బాగుపడదు." అన్నాడు బాబీ. ఇంకో క్షణం ఆగాక 'అసలింకోటిలెండి. ఇది ఫస్టుసెట్. అందుకని బెస్టుసెట్ వేయించారు. ఆవేళ షూటింగ్‌కి జెమిందారు రోలువేసే ఆయన రాలేదు. అందుకని ఈ సెట్‌ని పేదరైతు రామయ్య ఇల్లు లాగా వాడుకున్నారు. అఫ్‌కోర్సు తరువాత కొంచెం మనకి ట్రబులొచ్చిందనుకోండి. డిస్ట్రిబ్యూటర్స్ వేళకి డబ్బు పంపలేదు. అంతలోనే హీరోయిను, హీరో యిద్దరూ కాల్షీటు ఇచ్చారు. వరసగా త్రీడేసు. ఆ మూడు రోజులూ వాడుకోపోతే, మళ్ళీ మూణ్ణెల్లదాకా కలిసిరారు. అందుకని సూక్ష్మంలో మోక్షంగా చిన్న సెట్టు వేయించేశారు, జమీందారు ఇంటికి. అంటే కాస్త డబ్బు జాగర్తగా వాడే జమీందారన్నమాట. ఇంక ఆ బీదరైతు చూస్తే వాడి అంతస్తుకి తగని మూడంతస్తుల మేడ సెట్‌మీద కాపురం ఉంటున్నాడు గదా చూడండి. ఎంత దుబారా మనిషో. ఈ

రోజున దేశంలో బీదవాళ్ళే ఎక్కువ డబ్బు ఖర్చు పెడుతున్నారు. ఓమూల ప్రణాళికకు పొదుపుచేసి మిగల్చండని ప్రభుత్వం గోలపెడుతుంటే వీళ్ళు ఇలా ఖర్చు పెట్టడం తగునా .... అందుకే ఈరెండు సెట్టింగులూ జక్స్టాపోజుచేసి సిక్స్‌మినిట్ సాంగు పిక్చరైజ్‌చేస్తాం. ప్రబోధం అన్నమాట.. బీదరైతుల్లారా! మూడంతస్తుల మేడలకోసం డబ్బు దండగ చెయ్యకండి. కావలిస్తే ఈ పిక్చరులో జమీందారు కొంప, రైతు భవంతి చూసి బుద్ధి తెచ్చుకోండి, అని చెప్పి హిట్‌లు కొడతాం. ఆపాట ఏరువాక ట్రైపులో రాయిస్తున్నాంలెండి. హిట్ అవుతుంది. తెలిసిందా?"

"లేదుసార్ ఏమీ తెలీలేదు నాకు" అన్నాడు రాజు.

"ఒంటికి మంచిది. మరేం ఫర్వాలేదు" అన్నాడు కొలంబస్.

అంతలోకీ లైట్లు వెలిగాయి.

'అరె సినిమా అయిపోయిందే. మనవేం చూళ్ళేదు. ఇంత చిన్న పిక్చరేంటి' అన్నాడు రాజు.

'సారీ, కబుర్ల గొడవలో చూళ్ళేదు. ఆపరేటరు నాలుగు రీళ్ళు తీసేశాడు కాబోలు. మళ్ళీ వేయిద్దాం ఉండండి" అన్నాడు బాబీ.

"ఓ రాజా! అదీ సంగతి. అంచేత ఈ తెలివితేటలు నీదగ్గరున్నాయా? ఆ కథలో వాళ్ళలా నువ్వు అటువంటి సమస్యను అలా ఎదుర్కొనగలవా?" అన్నాడు కొలంబస్ గంభీరంగా అటూ ఇటూ చూసి.

'ఇంకా అన్నిలేవు సార్" అన్నాడు రాజు విచారపడి లేస్తూ.

"అయితే యూస్‌లెస్ లాభంలేదు" అన్నాడు కొలంబస్.

"అదేవిటి సార్. మొదట్లోనే లాభంలేదనేస్తే ఎలాగండి."

"రైటేననుకో. ఓ పిక్చరు ఫ్లాపు అయి దెబ్బతింటేనే గాని, అనకూడదు. అది నీ అయిడియాలే" అన్నాడు కొలంబస్.

"అవునుగాని సార్. అడగడం మర్చిపోయాను. ఇప్పుడు మనం చూసిన పిక్చరు పేరేమిటి సార్?"

"బ్రదర్! ఇది బావులేదు. ఒక్క డైలాగులో రెండుసార్లు 'సార్'లు వాడేవు. నువ్వెందుకు పనికివస్తావు?"

"నేనాండి!" అని ఉత్సాహంతో లేచిపోయాడు రాజు. "నేను హీరో, హీరోయిను, రేలంగి, రంగారావు, తంగవేలు వేషములు, గుమ్మడి, పెరుమాళ్ళు లాంటివి, సూర్యకాంతం, వంగరలగా నటించబడును. ఇంకా డ్యూయట్లు పాడి, రాసి పెట్టబడ గలను. డైలాగులులేని రోలు ఇచ్చినా ముహంనిండా ఫీలింగులు పెట్టేసి అమోహముగా నటించి పెట్టబడును."

"రైటో–ఎరక్క అన్నానయ్యా. ఆ మాట" అని విసుక్కున్నాడు కొలంబస్.

రాజు మనసు చివుక్కువుంది. నొచ్చుకున్నాడు. కాస్సేపాగి, నవ్వుట నభినయించి, 'అయితే ఈ పిక్చరు పేరు చెప్పారు గారు' అన్నాడు వినయంగా.

కొలంబస్‌కి జాలేసింది.

తారక మంత్రం ఉపదేశిస్తున్న సన్యాసిలా మందహాసం చేసి, వాత్సల్యంతో రాజు వీపు తట్టాడు.

"నాయనా రాజా. ఎంత అమాయకుండవు... ఆలకించు. మనం దేముళ్ళని రాముడనీ, కృష్ణుడనీ, అల్లా అనీ, ఇల్లా అనీ పిలుచుకుంటాం పేరు వేరుగాని, దేముళ్ళందరు లేరు. ఈశ్వరు డొకడే. అతనికే అనేక రూపాలు, అనేక నామాలు. అతను మన సినిమాల్లాగే ఆదిమధ్యాంతరహితుడు. నాయనా రాజూ! మన సినిమాలలో ఈ ఈశ్వరదర్శన రహస్యం దాంకుని వుందన్నమాట. ఇదీ సరిగ్గా అంతే. "సుబ్బలక్ష్మి" అంటావు ఓ సినిమాని. "సూరజ్" అంటావు మరోదాన్ని 'మురేఖ న భూలో' అంటావు ఒక సోషల్‌ని. అలాగే బంగారుపువ్వు, వెండిబిడి, అట్టబుట్ట, చెమ్మచెక్క ఇలా సవాలక్ష పేర్లు. కాని, సినిమాలో? అవన్నీ ఒకటేగదా. వాటికి భాషా, ప్రాంతం అనే భేదాలు లేవుగదా. నిన్నా రేపూ అనే తేడాలు లేవుగదా. మొదలూ, తుదీ, తలా తోకా అనే పట్టింపులు లేవుగదా. నువు ఓ పిక్చరు మాటినీ ఆట చూస్తావు. రెండో ఆట ఇంకోచోట చూడు. మాటనీ ఆటలో ఆఖరిసీనుతో ఇది మొదలవుతుంది. దాని మొదటిసీనుతో ఆపుజేస్తారు. నాలుగురీళ్ళు సుఖపడితే ఆరురీళ్ళ వేడి కన్నీళ్ళు. మధ్యమధ్య నాలుగురీళ్ళ హాస్యపు చన్నీళ్ళు. ఇంకో రెండు రీళ్ళలో కథ ఆపుచేసి, జనాన్నవతలికి వదిలిపెట్టేస్తారు. ఇంతేగదా నాయనా" అన్నాడు కొలంబస్.

"ఇంతే ఏమిటండి, నా బొంద. నాకు పోర్షను ఇవ్వకుండా శివాజీగణేశనంత డైలాగు మాట్లాడారు" అన్నాడు రాజు విసుగ్గా.

"సరిగ్గా ఇంతే బ్రదర్. ఎడిటింగు అంటే ఇదే. నీకు ఉందనుకుంటున్న పోర్షను పిక్చరు విడుదల అయేదాకా ఉందని గారంటీ లేదు. సినిమాలో నీ గూబ గుయ్యిమనేలా ఎవడో కొట్టాడనుకో ఎవరో పెద్దస్టారు నీ తాలూకూ బాధను క్లోజప్‌లో నటిస్తాడు. నిన్నెవడో తిట్టాడనుకో పెద్దవాళ్ళెవరో కోపం నటిస్తారు. ఆఖరికి నీ కాలు జారిందనుకో నీ బదులు ఇంకెవరో పడతారు. వీటినే 'ఫిట్టింగులు' అనబడునులే. ఇందాక అడిగావుగా అందుకు చెప్పాను. అలా కోడిలా చూడకు నాకేసి–" అన్నాడు కొలంబస్.

రాజు, భయపడ్డ కోడిలా చూస్తున్న మాట నిజమే. కాని, ఆ చూపుల చివర కొలంబస్ లేడు. అవి అతన్ని దాటిపోయాయి. మాంఛి కష్టాల ఘట్టంలోవున్న కారెక్టర్ యాక్టర్‌లా రాజు నిర్వికార వదనుడై, నిశ్చేష్టుడై, నిర్విణ్ణుడై చూస్తున్నాడు.

రాజు ఆలోచనలో పడిపోయాడు. కొలంబస్ అతని భుజం తట్టి లేవదీశాడు. లేస్తూనే కళ్ళు నులుపుకొని "సారీ" అన్నాడు రాజు.

'ఏం గిరాకి, ఏమిటంత దీర్ఘాలోచన?' అన్నాడు కొలంబస్.

'అబ్బే ఆలోచన కాదు. అది మనకసలు అలవాటు లేదు. మీరే ఏదో చెప్తానన్నారుగా మరో కథని.'

"ఆ ముక్క నే నననందే. రమణ కాబోలు. వాడేనా పొరబాటున మరోసారి పైకథ అనబోయి, పై మరో కథ అన్నాడు గావును ఔను గాని-"

చూస్తూవుండగా రాజు బిర్రబిగుసుకుపోయాడు. తెలుగు సినిమాలో కష్టాలు భరిస్తూ చీవాట్ల డైలాగులు వింటున్న మంచిపాత్రలా ముక్కుపుటాలు పూరించాడు. మోర పైకెత్తాడు. ఆనక ఊపిరి బిగపట్టాడు. లాంగ్‌షాట్‌లోంచి చూస్తే రవివర్మ విశ్వామిత్రుడి ఫక్కీలో తయారయ్యాడు.

'అదేం అలా అయిపోతున్నావు? ఫిట్లొస్తాయా' అన్నాడు కొలంబస్. రాజు మాట్లాడలేదు. తక్షణం, సూక్ష్మబుద్ధి కొలంబస్ క్షణంలో నలువంకలా పరకాయించి, పాతిక ముప్ఫైగజాల దూరాన మేనక ఉందని పసిగట్టాడు.

ఆ మేనక, ఫుల్‌కాస్ట్యూమ్‌లో వుంది. ఏ పిక్చరులోదో తెలీదుగాని, జనరల్ అప్సరస అనుకుంటే ఇబ్బందిలేదు.

కొలంబస్ ఆప్యాయంగా, ఆమె వంకచూసి చిరునవ్వు విసిరాడు. మేనక రుసరుసలాడి, "నువ్వుకాదు నీ పక్కవాడిని ఇటు చూడమను" అన్న భావానికి అభినయం పట్టింది.

'వీడా'. అని ప్రతిసంజ్ఞ చేశాడు కొలంబస్.

ఔను మరే అంది మేనక తల.

'నిన్నట' అన్నాడు కొలంబస్ రాజువంకచూసి, 'నిన్నే' అన్నాడు ఇంకో క్షణం ఆగి. నీ దుంపతెగ! అసాధ్యుడిలా ఉన్నావే. ఊళ్ళోదిగి 24 గంటలన్నా కాలేదుగాని, అప్పుడే పిల్లని పట్టడం, విడవడం, బడాయిపోడం దాకా వచ్చేశావే. ఓ దుష్యంతుడా! భరతుడు కనబడడేల?" అన్నాడు ఆనక.

'గురూ' అన్నాడు రాజు అపాదమస్తకం తలత్ మహమ్మద్ కంఠంలా వణికిపోతూ.

"మలేరియానా?" అన్నాడు కొలంబస్.

"కాదు. లక్ష్మిన్నరసు. ఎగ్రస్ట్రా. షి ఈజ్ వాంటింగ్ టు హీరోయిన్ మీ. అంచేత డోంటు సీ. అటువేపు చూడకండి" అని ప్రాధేయపడ్డాడు రాజు.

కొలంబస్ దూరాన వున్న మేనక, లేక శకుంతల వేపు చూశాడు; రాజుని క్లోజప్‌లో పరిశీలించాడు. 'హోరి పిడుగా, మొత్తానికి కథకుడివే సినిమా కథంత పనిచేశావు,' అన్నాడు వుత్సాహంగా.

'నో సార్. కథకుడు కాదండి నేను. అయామ్ వాంటింగు టు హీరో-"

'సర్లేవయ్యా, నిన్ను బెల్లించి ఇపుడెవడూ రైటరుగా బుక్ చేసెయ్యడులే. గ్రంథ సాంగుడివేనూ అంటున్నా.'

'గ్రంథ సాంగ్సు ఎప్పుడూ రాయలేదండి. రాయగలననుకోండి.'

'భేష్ అలాగే. ఇప్పటికీ చర్చ నిక్కడ వదిలెయ్యి. ఆ అమ్మడెవరో పిలుస్తోంది గాని వెళ్ళి మాట్లాడు.'

'నోనోనోనో. ఇపుడొద్దండి డేంజర్. ఆ అమ్మాయి. మంచిపిల్లే. కాని, పాపం నాతో హీరోయిన్ వేస్తానంటుంది, నేనుచూస్తే పాపం – ముందరే ఇంత చిన్నవాళ్ళని ఎలా ఎంకరేజి చేస్తాను? అయామే హీరో ఆఫ్ సిక్స్ డ్రామాస్. భయపడుతుంది కదా. స్టార్ వాల్యూ కూడా లేదు. ముందర ఏ అంజలీ, సావిత్రీ, వైజయంతిమాలా వాళ్ళతోనో నాలుగైదు పిక్చర్లు వేశాక చూస్తానన్నాను. లక్ష్మీన్నరసు ఇపుడే వెయ్యమంటుంది. యూ వోన్లీ టెల్మీ. మీరేచెప్పండి నాకు. హౌకెనై యేబుల్. నేనెలా–"

"నామాట విని నువ్వు మీ ఊరి డేరా హాలులో ట్రాన్స్లేటరుగా చేరిపోరాదూ?" అన్నాడు కొలంబస్ సిగరెట్ ముట్టిస్తూ.

"నో సార్. కాదండి"

'స్టాప్–ఆగు–ఆ పిల్ల సంగతి చూస్తావా లేదా? నేనే చూద్దునుగాని, కొంచెం భయంగా ఉంది. ఆ స్టూడియో కంకణాలతో కొడుతుందని.... అవి పాడైపోతాయి గదా అందుకు.'

'డోంటంటే డోంటేనండి. మనతో ఒకటేమాట. మనం ఇట్నించిలా పోదాం రాండి' అన్నాడు రాజు వెనక్కి తిరిగి కొలంబస్ చెయ్యిపట్టుకు లాగుతూ.

❀ ❀ ❀ ❀

"పిలుత్తూంటే నీగ్గాదు? యాడకి లగెత్తుండావ్" అని కంచుగంట మోగింది రాజు చెవులో.

జంకుతూనే వెనక్కి తిరిగాడు రాజు 'దటీజ్‌నాట్. అదికాదు నర్సూ' అంటూ సంజాయిషీ ఆరంభించాడు దగ్గిర కొచ్చేసింది గదా అని.

"ఇదిగో బుల్లోడా? అలాటి ఎంగిలి కూతలు కుయిమోక నాకాడ. అడిగిందానికి జవాబియ్యి. గంటనించి జెబ్బలొడి పొయ్యేలా పిలత్తావుంటే, వల్లకుంతావేందీ అంట" అంది నరసు దమాయింపుగా.

రాజుకి ముచ్చెమటలూ పోసేశాయి. అల్లంతదూరాన అంజలీదేవి, నాగేశ్వర్రావు, రేలంగీ, ఇంకా ఎవరెవరో వేషాల్లో నడిచి వెళ్తున్నారు. ఆటోగ్రాపుల పుస్తకం ఉంటే, అందరి సంతకాలూ సంపాయించేదుం గదా అనుకున్నాడు. అంతలో గుండె గుభేలుమంది. వాళ్ళు ఇటే చూస్తున్నట్లున్నారు.

'అయ్యబాబోయ్ ఇంకేమైనా వుందా. వాళ్ళు చూసి గుర్తు పట్టేస్తే' – అనుకున్నాడు.

మరో స్టూడియోలోంచి సావిత్రీ, ఎన్. టి. రామారావూ వస్తున్నారు.

ఓరి బాబోయ్ వీళ్ళిటూ, వాళ్ళటూ. ఎలాగా! లక్ష్మీన్నరసో, తనో, ఇద్దరూనో అమాంతం మాయమైపోతే బాగుండునని ఆశపడ్డాడు రాజు. తెరవేలుపులు ఎడనించీ పెడనించీ దగ్గిరకొచ్చేస్తున్నారు. రాజుకి ఉపాయం తోచలేదు. కొలంబస్, కిరాతార్జునీయంలో వరాహంలా – 'ఇతడికి రెండు తలలా' అనిపించేటంత వేగంగా

ఇటూ అటూ, అటూ ఇటూ చూస్తూ ఆ గ్రూపుకీ, ఈ గ్రూపుకీ నమస్తేలు విసురుతున్నాడు ఏ ఒకటేనా తగలకపోతుందా అని.

రాజుకి మతిపోతోంది. 'క్లైమాక్సు సీనులో బ్యాగ్రౌండ్ మూజిక్కులా' చెవులు హోరుమంటున్నాయి. "ఇంకేముంది. అంజలీ, సావిత్రీ వాళ్ళూ నన్ను ఇక్కడ – ఇలా యీ ఎగ్రస్టాతో చూసేస్తే, తరవాత హీరోయిను వెయ్యనంటారు. వాళ్ళు హీరోయిను వెయ్యకపోతే నేను ఎన్ని హీరో రోళ్ళు వేసి ఏం లాభం మనసా!" అనుకున్నాడు. అందుకని తక్షణం రంగు ఫిరాయించేశాడు.

'హు ఆర్ యూ – లక్ష్మీన్నరసూ? వాటీజ్ యువర్ నేమ్? నీ పేరేమిటి?' అన్నాడు వీలైనంత గట్టిగా, గంభీరంగా చుట్టుపక్కల అందర్నీ ఆశ్చర్య పరచేటంత బెట్టుగా.

'ఏందీ?... ఏందీ. నీపేరేటా.. వారినీ. బలేవోడివే – నీ సిగ్గు సట్టు బండలుగాను' అంది నరసు విరగబడి నవ్వుతూ.

'వాళ్ళు', వీళ్ళవంక చూడకుండానే ఇందాకా రాకుండానే పదిగజాల అవతల ఉన్న ద్వారంలోంచి అటే వెళ్ళి పోయారు, తీరా.

కొలంబస్ కూడా స్థిమితపడి సర్దుకుని, అలవాటు ప్రకారం టెక్కు నటించి వీళ్ళ లోకంలోకి వచ్చాడు.

రాగానే అతని కంటికి ఆనింది పంచకల్యాణి గుర్రంలా ఉన్న లక్ష్మీనరసు.

'సో! పేరు లక్ష్మీనరసు అన్నమాట' అన్నాడు చనువుగా.

'మాటాలేదు గీటాలేదు.... నాపేరు ఏదో ఓటి. నాతోటి నీకేటి మద్దిన.' అంది నరసు రుసరుస లాడుతూ.

'ఓరబ్బో. గుర్రం కట్టెయ్ మరి. ఎవరితో మాట్లాడుతున్నావ్ తెలుసా! అయామె ప్రొడ్యూసర్స్ బ్రదరిల్లా' అన్నాడు కొలంబస్ కొంచెం కోపంగా.

"ఒస్సీ... నాకు తెల్దేటి నీ బెదరిల్లాతనం. ఒగ్గేయి కోతలు ..... అవునుగాని రాజా! మద్దినాల కూడుదిని నాతో సూటింగ్ కొత్తానన్నావు.. అదే పోవడమా. ఇంకా తిన్నావా లేదా. ఇలాటోల్లతో తిరిగితే ఏటి లాభం. కూడా గుడ్డా" అంది.

'నన్ను మన్నించు నరసూ' అన్నాడు రాజు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ.

ఈలోగా కొలంబస్ ఇకిలించి, మెళ్ళో ఒంటిపేట రోల్డుగోల్డు గొలుసు షోగ్గా మెలిపెట్టి తిప్పుకున్నాడు. బంగారపు ముందరిపన్ను, ఈ గొలుసు రూపంలో ధైర్య సాహసాలను ప్రదర్శించి, జేబులోంచి పదిహేను రూపాయల వాక్స్వాతంత్ర్యాన్ని తీసి, లెక్కవేసినట్టు చూసి, పొడిదగ్గు దగ్గి, నరసుకు దగ్గిరగా జరిగి "అయితే లక్ష్మీ ఇవాళ కాల్‌షీట్ ఎక్కడ? – అదే ఏ పిక్చర్లో" అన్నాడు అప్యాయంగా భుజంమీద చేయివేయబోతూ.

రాజుకి అతని తరహా నచ్చలేదు. కాస్త మొహమాటం, కొంచెం భయం వేసినా తెగించి, 'యూ సీ, కొలంబస్‌గారూ. అయామ్ – నేను. నేనూ నరసూ – అయి మీనూ – మీరలా ముట్టుకోకండి.' అని నసుగుతున్నాడు.

నరసుకి అంతకన్నా నచ్చలేదు కొలంబస్ చొరవ. అందుకని, కొలంబస్‌కు సంబంధించినంత వరకూ, రాజ్యాంగంలో వాక్స్వాతంత్ర్యానికి సంబంధించిన సెక్షను పావుగంటదాకా పనిచేయడానికి వీల్లేనంత పవర్‌ఫుల్‌గా పుర్రచేత్తో జవాబిచ్చి, "మాపిటేలకేనా కొంపచేరు" అని రాజుని పురమాయించి చరచర నడిచి వెళ్ళిపోయింది.

❀ ❀ ❀ ❀

'చురుకుపాలు ఒక్కరవ్వ ఎక్కువవున్నట్టుంది?' అన్నాడు కొలంబస్ పావుగంట తరువాత తేరుకుని.

'యస్సార్' అన్నాడు రాజు దిగ్భ్రాంతుడై.

'ఏమి యస్సారు మీబొంద! గూబ గుయ్యిమంది సార్! పై పెచ్చు పరువుపోతేను. ఎవరెవరు చూశారో ఏమిటో' అన్నాడు కొలంబస్ చుట్టూ కలయజూసి.

'నో సార్' అన్నాడు రాజు కంగారుపడి.

కొలంబస్‌కి ఒళ్ళు మండిపోయింది. 'షటప్' అన్నాడు దూకుడుగా.

'ఆల్‌రైట్' అన్నాడు రాజు బిక్కమొహం పెట్టేసి.

ఒక నిముషం ఎవరూ మాట్లాడలేదు.

'కాఫీ తాగుదాం పద' అన్నాడు కొలంబస్.

కూలబడి మంచినీళ్ళు తాగాక, 'ఇంతకీ అమ్మాయి ఎవరు మీ చుట్టాలా?' అన్నాడు కొలంబస్.

రాజు మొహంలో చిన్నసైజు దీపంలాంటిదేదో వెలిగి ఆరిపోయింది. ఆలోచించాడు. తటపటాయించాడు. చివరికి తెగించి 'ఔను సార్' అనేశాడు తలవంచుకుని ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

'ఏమిటలా సిగ్గుపడి పోతున్నావు. కొంపతీసి ప్రేమించావా ఏమిటి?" అన్నాడు కొలంబస్ ఉత్సాహంగా.

'ఔను సార్. యస్.' అనేసరికి, నవ్వు అతని పెదిమల సరిహద్దు దాటిపోయింది. బలవంతాన ఆపుకుంటున్నాడు. ఆనందాన్ని, ఉత్సాహాన్ని అదుపు చెయ్యలేక భుజాలు నానా అవస్థా పడుతున్నాయి.

'అలా భుజాలెగరెయ్యకు. జడ్డివాడనుకుంటారు ఎవరైనా.... పెళ్లాడుతున్నావా? లేకపోతే టెంపరరీ లవ్వేనా?'

'పెర్మనంటే నండి'

'ఎప్పట్నించి'

'నిజం చెప్పాలంటే ఇందాకనించే నండి. మిమ్మల్ని ఇలా చేత్తో అనలేదూ–'

'ఇలా అనడం ఏమిటి నీ తలకాయ. చెంప చెళ్ళుమంది. గూబగుయ్యి మంది–' అన్నాడు కొలంబస్ చెంప తడుముకుంటూ. రెండు గుక్కలు కాఫీ

తాగేదాకా కొలంబస్ మళ్ళీ ప్రసన్నుడు కాలేదు. అయ్యాక, రాజు భుజం తట్టి, 'అయితే, మరి యిందాక ఆ పిల్లని పలకరించడానికి ఎందుకు సిగ్గుపడ్డావు?.... ఎవరన్నా చూస్తే పరువు పోతుందని భయమా?' అన్నాడు.

రాజు సిగ్గుపడ్డాడు. "యస్సార్ అయామె హీరో బికాజ్... అందుకనండి. కానీ అది ఇపుడే వేస్తానంటుంది నాతోటి. నేను చూస్తే సావిత్రి వాళ్ళతో తప్ప హీరో వెయ్యను గదా. దానికి చెప్తే తెలీదు. షి డోంట్నో బట్ హౌ.... అదంటే నాకు ఇష్టమే కాని, బట్ హౌ కెన్నై పాసిబుల్ హియర్. దటీజ్ బికాజ్. . అంచేత అదీ కథ!" అన్నాడు రాజు వుద్రేకంగా.

'బ్రదర్ నువ్విక్కడ తప్పబుట్టావు. అమెరికన్ పిక్చర్లలో వెయ్యాల్సిన వాడివి సర్లేగాని, డబ్బేమాత్రం వుంది?'

'ఇక్కడ జేబులో ఏం లేదండి. కొంచెం ఉంటే పొద్దున్న ఫీజు కట్టేశానండి. మరి నా పెట్టీ బేడా పేపరాఫీసులో ఒదిలేశాను గదండి.'

'వెరిగుడ్! ఒక్కడుగు వెళ్ళొద్దాం రా చెబుతా నా దగ్గిర చెక్కుంది రేపుగాని మారదు.' అంటూ లేచాడు కొలంబస్ ఐదు నిముషాలలో ఇద్దరూ ఇవతలి కొచ్చారు. కొలంబస్ దర్జాగా టాక్సీని పిలిచాడు.

❀ ❀ ❀ ❀

పేపరాఫీసులో ఎవరూ లేరు. కుర్రాడు కునికిపాట్లు పడుతున్నాడు.

కొలంబస్, రాజు లోపలికెళ్ళారు. 'అన్నట్లు మర్చిపోయానండి – ఈ పెట్టె నాదికాదు. రైల్లో మారిపోయి ఎవరిదో నాకు వచ్చేసింది.' అన్నాడు రాజు.

"నిజం! లక్కీ ఫెలో బహుశా దీన్నిండా నీ కదృష్టం ఉంటే – "

"దీన్నిండా పాత పేపర్లున్నాయను కుంటా"

'నాన్సెన్స్. అదృష్టం ఉంటే, అవి నోట్లకట్టలై పోవచ్చు. బంగారు నగలు కావచ్చు.'

"లేకపోతే?"

'నీ కర్మం. ఆడదాని శవం ఉండొచ్చు. చావుబాజా, గావుకేక, కాయ్‌రాజా నవలల్లో శవాలన్నీ పేర్చి ఉండొచ్చు. తెరు తెరు" అన్నాడు కొలంబస్ ఆశగా లొట్టలు వేస్తూ.

తాళం చెవి అక్కరలేకుండానే పెట్టెమూత వచ్చేసింది. దాన్నిండా కాళీస్థలం, అందులో ఓమూల ఓ పచ్చ బేడకాసు ఉన్నాయి.

రాజు కొంచెం ఆశ్చర్యపోయాడు బేడకాసు దొరికినందుకు. కొలంబస్ కొయ్యబారిపోయాడు బేడే ఉన్నందుకు; టాక్సీవాడు బయట ఉన్నాడని గుర్తుకురాగానే.

ఒక క్షణానికి తెప్పరిల్లి, "హారినీ ఇదేనా! 'పెట్టేబేడా' పేపరాఫీసులో ఉన్నాయన్నావు" అంటూ విరగబడి నవ్వసాగాడు.

కొంతసేపటికి రాజుకు కూడా అందులో షోకు తెలిసింది. "మరే! పెట్టే బేడా అంటూ పెట్టి పైకెత్తి అడించి బేడచేసే చప్పుడు వింటూ ఎంతో సంతోషంగా నవ్వాడు.

'ఇడియట్' అన్నాడు కొలంబస్ నవ్వాపుకుని కళ్ళ నీరు తుడుచుకుంటూ.

'నక్క మాటలను<br>వినని గాడిదకు<br>డొక్క బద్దలై పోలేదా?

(-పంచతంత్రం)

'కిం కర్తవ్యమ్' అనుకున్నాడు కొలంబస్. ఓ క్షణం ఆలోచించి, 'భజగోవిందం' పాట తెలుసా, భ్రాజమానం?' అన్నాడు రాజు భుజం తట్టి.

'గ్నాపకం లేదండి'

'భేష్. దార్లో కొస్తున్నావు. ఏది అడిగినా, 'రాదు' అనరాదు. గుర్తులేదు అనాలి, అన్నపాఠం వంటబట్టిందన్నమాట. సినిమాకి పనికొస్తావు ఫరవాలేదు... సరేగాని టాక్సీ డ్రైవరు సంగతేమిటి?'

"టాక్సీ డ్రైవరు చిత్రములో దేవానందూ వాని యొక్క భార్య కల్పనా, బ్రాకెట్టు కార్తిక్ బ్రాకెట్టు ఆనందూ నటించిన ఈ చిత్రానికి –'

'ఆగు. అదికాదు. మన గుమ్మంలో మనకోసం కాసుక్కూచున్న యొక్క టాక్సీ డ్రైవరు సంగతి. వాడికి డబ్బివ్వకపోతే తోలు ఒలిచేస్తాడు.'

'ఎవరిదండి?' అన్నాడు రాజు.

"నీదే"

"అయ్యబాబోయ్ అలాగా?... డబ్బు లివ్వకపోతే మనని ఇంక ఎక్కనివ్వడా?"

"నిక్షేపంలా ఎక్కనిస్తాడు కాని మళ్ళీ దిగనివ్వడు."

'మీ బావగారు ప్రొడ్యూసరుగారు కదాండి. అక్కడి కెళ్ళమని, గట్టిగా అరుద్దాం... డబ్బులిస్తారు. అప్పుడేమో–'

'ఊహ మంచిదే. కాని, మా బావకి నేను కనబడితే నా గ్గాడా డొక్కచీల్చి డోలు కట్టిస్తాడు. పొద్దుట ఆయన ఓ చెక్కిచ్చాడు. తీరా అది మార్చేసరికి ఒక... ఒక ఆడఫ్రెండు అప్పు తీసుకుంది."

'అలాగాండి... మరి మీ బావకి చెప్పేస్తే...? ఆవిడ మళ్ళా యిచ్చేస్తుందని.'

'ఆవిడ మళ్ళా ఇవ్వదుగా. అప్పు తీసేసుకుంది'

'ఓహో అదాండి. మీరే ముందస్తుగా బాకీ అన్నమాట. భలేవారే.'

'షటప్.'

'యస్సార్'

   

ఐదు నిమిషాలయ్యేసరికి బయట కారు హారన్ మోగడం మొదలెట్టింది. ఇంకో నిమిషానికి టాక్సీడ్రైవరు తల తొంగిచూసి తప్పుకుంది.

'బ్రదర్ లాభంలేదు... లే' అన్నాడు కొలంబస్ నిట్టూర్చి.

'వెళ్తే ఎలాగండి. వాడు తోలు ఒలిచేస్తాడన్నారు గదా!'

'ఔను దానికేం చేస్తాం వాడిష్టం.'

'అంటే, నన్నేగా వాడు-'

'మరే నిన్నే.'

'అయ్యబాబోయ్. ఎలాగండి ఐవిల్ హోల్డు యువర్ లెగ్స్. మీకాళ్ళు పట్టుకుంటాను. దీజార్ నాట్ యువర్ హాండ్స్. ఇవి మీ చేతులు కావు' అన్నాడు రాజు బెంబేలెత్తి పోయి.

'నావి కాకపోతే నీవా... షటప్.'

"యస్సార్."

తనమీద కాస్సేపు జాలిపడ్డాక రాజు మీద పడ్డాడు కొలంబస్. ఆనక తనులేచి, రాజును లెమ్మని భుజం తట్టాడు. లేచి పెట్టెపట్టుకు బయల్దేరమన్నాడు మళ్ళీ "ఒద్దులే... నేనే పట్టుకుంటాను. నీకింకా చేతకాదు. చిన్న నటుడివేగా" అంటూ తనే పెట్టె పట్టుకుని రెండడుగులు వేసి, మళ్ళీ వెనక్కొచ్చి, పెట్టెతెరచి, అందులో విచ్చబేడ తీసి జేబులో పడేసుకు, పెట్టెమూసి బయల్దేరాడు. రాజు వెనకే భయపడుతూ వస్తున్నాడు.

గుమ్మంలో టాక్సీ డ్రైవరు ఎదురై "ఎన్నా సార్" అన్నాడు విసుగ్గా.

కొలంబస్ ధీమాగా నవ్వాడు. "వెయిటింగ్ ఛార్జెస్ ఇస్తాను లేవోయ్ డబ్బుతో పనిమూలాన లేటైంది" అంటూ;

కొలంబస్ చాలాబరువైన పెట్టె మోస్తున్నాడని డ్రైవరుకి అనిపించింది.

'ఇబిడీ తళ్ళుంగె' అన్నాడు ఆ పెట్టెని అందుకోబోయి.

'హ్హామ్మమ్మ, నువ్వొద్దు, వేండా, నాన్ మొయ్యరే. నేనే మోస్తాం. లే!' అంటూ బరువు మొయ్యడాన్ని అభినయించి, కారులో కూర్చున్నాడు.

"ఫో నేరా ఫో" అన్నాడు. కొంతసేపటికి దీపాలు వెలిగాయి.

❀ ❀ ❀ ❀

'అంగె నిల్లు' అన్నాడు కొలంబస్ ఓ ఇల్లు చూపించి. ఆయింటి దగ్గిర బండి ఆగింది.

'ఇరు' అన్నాడు కొలంబస్ కారుదిగుతూ. రాజు ఎడంచేత్తో అవలీలగా ఆ పెట్టె తీసెయ్య బోయాడు.

కొలంబస్ ఛళ్ళున అతని చేతిమీద ఓటివేశాడు. 'ఆ పెట్టెని ముట్టుకోవద్దన్నానా, డబ్బా మరోటా! బరువు. ప్రతిచోటకీ దాన్నేం మోస్తావు' అని మందలించాడు.

'అందులో – ' గొణగ బోయాడు రాజు.

'మరేం ఫర్వాలేదు. ఈ బండి నాకు తెలుసులే' అంటూ చరచర రాజుని ఈడ్చుకుపోయి ఓ యింట్లో ప్రవేశించాడు కొలంబస్

లోపల ఎవరో మీసాలతనూ, ఇతనూ 'టార్జాన్ యండ్ ది జంగిల్ టౌన్'లో జానీ విసిముల్లర్ కన్న, తరవాత టార్జానులు వేసిన లెక్స్ బార్కర్ ఎంతగొప్పవాడూ అన్న విషయమై పదినిముషాలు గుసగుసలాడుకున్నాక 'ఎడిటర్జీ'ని అడక్కుండానే ఏకీభవించేశారు.

'ఇట్నించి అవతల వీధిలోకి దారుందా' అన్నాడు కొలంబస్.

'ఓ' అన్నాడు గూటంలా ఉన్న ఆ మీసాల అతను.

'కమ్' అన్నాడు కొలంబస్

రాజూ అతనూ పెరటి గుమ్మంలోంచి ప్రక్కవీధిలోకి వెళ్ళిపోయారు.

'పెట్టో?' అన్నాడు రాజు.

'పెట్టి వాడికీ, బేడ మనకీ' అంటూ నవ్వాడు కొలంబస్.

❀ ❀ ❀ ❀

టాక్సీవాడు 45 నిమిషాలు కూర్చున్నాడు. బీడీలు అన్నీ అయిపోయాయి. లేచి, వెనక సీట్లో పెట్టె వంక నిశితంగా చూశాడు.

మళ్ళీ కొలంబస్ ప్రవేశించిన ఇంటివైపు చూశాడు.

పెట్టి తెరిచి చూస్తే బాగుండదు.

చూసేదేముంది. తెలుస్తూనే వుందిగా అనుకుని, మెల్లిగా టాక్సీని పదిగజాల దూరం తోసుకుపోయి అక్కడ లోపల కెక్కి ఇంజన్ స్టార్టు చేసి తుర్రుమన్నాడు.

'మురాల్ పసింగో... అప్పడీ కూద, నాల్పత్తంజి నిమిషం నా మరియాద గత్తానె ఇరిందె. ఇదుకు మేలె ఎవనాలె ముడియం. ఇదు పోరుం... ఇదు నమ అదిష్టం' అనుకున్నాడు వెనక సీటులో పెట్టెకేసి ఆప్యాయంగా చూస్తూ.

❀ ❀ ❀ ❀

రాజూ, కొలంబస్ మళ్ళీ కాఫీ హోటల్లో దూరారు.

"ఏం? దిగులుగా వున్నావు? జీవితం బాగులేదు!" అన్నాడు కొలంబస్ తన విజయానికి మురిసిపోతూ.

"ఏంలేదు. ఇందాకట్నించి ఆలోచిస్తున్నాను. పాపం లక్ష్మీన్నరసుని అలా అవమానం చేసేశానే అని. ఎంత కృతఘ్నుడిని అనుకుంటుందో! నేనే, ఎమ్మెస్ రామారావునైతే పెద్ద బాగ్రౌండ్ సాంగ్ పాడేవాణ్ణి. ఇంక అసలిలా చెయ్యను. అది చెప్పినట్టే వింటాను ఇద్దరం కలిసే గొప్పవాళ్ళం అవుతాం – " అన్నాడు రాజు.

కొలంబస్ జాలిగా నవ్వాడు. 'బ్రదర్ వుట్టి భ్రమ. అదెందుకు నిన్నెందుకు చేరదీసిందో నీకు తెలీదు కాని, రేప్పొద్దున్న అదికనక రెండు పిక్చర్లలో హీరోయిను

అయితే, మొట్టమొదట మెడపట్టి గెంటించేది నిన్నే. టోకరా ఇచ్చేది నీకే. అనుభవం మీద చెబుతున్నాను ఎప్పుడూ ఇంకోళ్ళతో కలిసి పైకి రావాలని ఆశపడకు. పైకెక్కే వాడి పక్కన నించుంటే వాడెప్పుడూ నీనెత్తిని కాలు పెట్టి ఇంకో మెట్టెక్కాలని చూస్తాడు. అవసరంవస్తే అందుకు సందేహించడు. సినిమాలేకాదు, ఎక్కడేనా అంతే. ఇంతెందుకు ఓ కథ చెప్తాను విను.

చాలాకాలం క్రితం రాజారావు, రామారావు అని ఇద్దరు బావమరుదులుండేవారు. ఇద్దరూ నెల్లాళ్ళు అటూ ఇటూగా హాలీవుడ్ వచ్చారు సినిమాలో చేరాలని. రాజారావు చిన్నచిన్న వేషాలు సంపాదించడం మొదలెట్టినా, రామారావు ఇంకా వీధులవెంట తిరిగే స్థితిలోనే ఉంటూ వచ్చాడు చాలా రోజులు. నిజానికి ఇతను ప్రజ్ఞావంతుడు. కథలూ, పద్యాలూ, పాటలూ అవి రాయడంలో కాస్త చెయ్యి తిరిగినవాడు. నాటకాలు వేసి, నటనలో కూడా అనుభవం సంపాదించాడు. వీటికన్న ముఖ్యం, అతని తెలివి తేటలు అందువల్లనే అలా అవస్థ పడేవాడనుకో.

రాజారావుకి బతుకుతెరువు తెలుసు. ఎవరో డిస్ట్రిబ్యూటర్లని, మంచిచేసుకొని వాళ్ళవాడుగా ఉంటూ వేషాలు సంపాదించేవాడు. సాధారణంగా సినిమాలో కథ ఆరంభం కావడానికి మొదట్లోనే చచ్చిపోయేవాళ్ళ వేషాలు దొరికేవి. అలా ఉండగా ఒక తమిల్ పిక్చర్ డబ్ చేసే బేరం వచ్చింది. డిస్ట్రిబ్యూటర్లకి గౌరవ – 'అడ్డమైనవాడూ' అయిన రాజారావు ఆ బేరాన్ని సంపాదించాడు. రచన, డబ్బింగు, డైరెక్షను, డైలాగులు చదవడం గట్రా అన్నీ తనే చేసేటట్లు ఒప్పందం. మీరు రాసినవేమన్నా ఉంటే చూపించ మన్నారు వాళ్ళు. మనవాడికి పొట్టకోసి సెర్చిలైటేసి వెతికితే అక్షరం ముక్క కనబడదాయె. ఇప్పుడే వస్తానుండండి అని చెప్పి, రామారావు రూముకి వెళ్ళి, అతగాడు రాసిన పుస్తకాలూ అవి పట్టుకొచ్చి చూపించాడు. వాటిమీద టి ఆర్. రావు అని పేరు ఉంది. రామారావు ఇంటిపేరు 'టి' వారులే అందుకని అలా వేయించుకున్నాడు. చిక్కూ, రాజారావు లక్కూ ఎక్కడంటే, రాజారావు ఇంటిపేరుకి కూడా 'టి' అనే అక్షరంతో మొదలవుతుంది. అందుకని, వీడూ టి. ఆర్. రావు అవుతాడు గదా. సరే కాంట్రాక్టు రాసుకున్నారు. ఇప్పుడు డైలాగులు రాసేవాడెవడు? పరాయివాడికి తెలిస్తే చిక్కని, అతను రామారావునే కూర్చోబెట్టి పని ఇస్తాను చేస్తావా అన్నాడు. రామారావు సందేహించాడు.

అతని మేలుకోరిన ఒక పెద్దమనిషి, సినిమా అనుభవాలతో తలపండిన వాడు ఒప్పుకోవద్దని సలహా ఇచ్చాడు.

'అబ్బాయి! నువ్వూ పైకిరావలసి వాడివి. నీ ఫ్రెండు రాజారావు అలాటివాడే. అందువల్ల మీ యిద్దరూ జాయింట్‌గా పైకిరాలేదు. ఎవడో ఒకడు ఇంకోడి నెత్తిన కాలుపెట్టి పైకెక్కాలి. అతనికి పని ఏమీ తెలీకపోయినా, అంతా తనేచేస్తానని బేరం ఒప్పుకున్నాడు, కాబట్టి ప్రజ్ఞాశాలి. నీకు పనితెలిసినా, సందేహిస్తున్నావు. కాబట్టి

నువ్వు లోకవ్యవహారంలో పరమ వాజమ్మవి. అంచేత మీ కాంబినేషన్ నీకు మంచిదికాదు". అని నూరిపోశాడు.

కాని రాజారావు బలవంతం చేసినందువల్ల రామారావు, ఆ సలహాలు పట్టించుకోకుండా, పనిచేయడానికి ఒప్పేసుకున్నాడు.

ఇంక చెప్పేదేముంది. రాజారావు నానా హడావుడీచేసి పెద్దరికం చెలాయించేవాడు.

ఇతన్ని గది కదలొద్దని శాసించి, సినిమాకి డైలాగులూ, పాటలూ అన్నీ రాయించేసుకున్నాడు. ఇదికాక, ఇంకా అడ్డమైన చాకిరీ చేయించుకుని ప్రొడక్షన్ ఖర్చులన్నీ జేబులో వేసుకునేవాడు. డబ్బింగులో మూడు కారెక్టర్లకి రామారావు చేత డైలాగులు చెప్పించాడు. ఎడిటింగ్ పనికి తన తరఫు మనిషిగా కూర్చోబెట్టి రాత్రిళ్ళుకూడా పనిచేయించాడు. ఎంత లోకువగా వాడుకున్నాడంటే, ఆఖరికి డబ్బింగులో, తను కోపదారి డైలాగులు బాగా చెప్పడానికితగ్గ వేడిమూడ్ రావడానికి రామారావుని నిలబెట్టి ఉత్తపుణ్యానికి తిట్టిపోసేవాడు. ఇంకా ఏం చెప్పను బ్రదర్. తల్చుకుంటే గ్లిసరిన్ లేకుండా కళ్ళ నీళ్ళొస్తాయి. చివరకి ఏమైందను కున్నావు?

పిక్చరు టైటిల్సులో డైలాగులు రాసినవాడు టి. ఆర్. రావు అని వేయించాడు, "అదేమిటి, టి. రామారావు అని వెయ్యరాదా, ఇంకెక్కడికన్నా వెళ్తే యిది చూసి అయినా ఛాన్సిస్తారూ" అని అడిగాడు రామారావు.

"ఫరవాలేదు బ్రదర్ అలాగే ఉంచు. నా పేరు టి. రాజారావు. అంటే ఇద్దరికీ పనికొస్తుంది. నీదని నువ్వను, నాదని నేనంటా" అన్నాడు రాజారావు.

'సరే డబ్బన్నా పారెయ్యి రూముకి అద్దె కట్టాలి' అన్నాడు రామారావు.

'ఎంత?'

'పదిహేను'

"వెరీగుడ్, పాతిక తీసుకో. బోయినానిక్కూడా ఉంటుంది. గుడ్‌లక్" అనేసి లేచిపోయాడు రాజారావు.

❀ ❀ ❀ ❀

'19 వేల అడుగుల ఫిలిముకి డైలాగులూ, పాటలూ రాసి, మూడు పెద్ద కారెక్టర్ల డబ్బింగుకి డైలాగులు చెప్పి, మూణ్ణెల్లు అహో రాత్రాలూ అడ్డమైన చాకిరీ చేసినందుకు ఇదా ఫలితం' అని పెద్దడైలాగు రాసి చదువుకుని మరీ ఏడిచాడు రామారావు.

ఆపైన, అతను పనివెతుక్కుంటూ అక్కడా అక్కడా, ఫలానా పిక్చరుకి డైలాగులు రాసిన టి. ఆర్రావుని అని చెప్పుకునేవాడు.

కాని ఎవరూ నమ్మలేదు. రాజారావు పేరుకొట్టేస్తున్నా డనుకున్నారు. ఓ రోజున రాజారావే తనకి తెలిసిన నలుగుర్లోనూ పెట్టి కడిగేశాడు ఇతన్ని. తప్పు కాదూ ఇలాటి దొంగపనులు చేస్తావా అని.

చూశావా ఆనాడు అతనికి సలహా ఇచ్చిన అనుభవజ్ఞుడి మాటవింటే ఇంత అవస్థ వచ్చేదా? ఇపుడు భవిష్యత్తుకూడా లేకుండా పోయింది? అని కథ ముగించాడు కొలంబస్.

రాజు బరువుగా నిట్టూర్చాడు.

"అన్నట్టు ఇంకో తమాషా విను. ఇది జరిగిన ఆర్నెల్లకి ఒక సింహళభాష పిక్చరు డబ్బింగు అవుతోందని వార్త వచ్చింది. మాటలూ పాటలు రాస్తున్న వాడిపేరు టి. ఆర్. రావు అని తెలిసింది. రాజారావు అని రామారావు అనుకున్నాడు. రామారావు పైకొస్తున్నాడేమోనని రాజారావు హడలిపోయాడు. ఇంతకీ ఈ మిష్టరీ ఏమిటంటావు? ఆ టి. ఆర్. రావు ఎవరంటావు?"

రాజు ఓ నిముషం ఆలోచించి బహుశా రాజారావేనేమో అన్నాడు

'నీ బొంద. కాదని చెప్పానుగా ఈ టి. ఆర్. రావు పేరు రంగారావు!... ... .... యూస్‌లెస్ బ్రదర్. నువ్వు పనికిరావు. ఈ మాత్రం కనిబెట్టకపోతే ఏంలాభం?' అన్నాడు కొలంబస్.

కొలంబసూ, రాజూ హోటల్లోంచి ఇవతలకు వచ్చి నాలుగు అడుగులు వేసేవరకు, వారిని వరుసుకుంటూవచ్చి ఓ పెద్ద పాతకారు ఆగింది.

'బ్బబబ... బ్బావ' అన్నాడు కొకొక్కొలంబస్.

'య్యొయ్యొ య్యొక్కు' అన్నాడు కకక్కారులోని బబబ్బావ.

కొలంబస్ మారుమాట లేకుండా కారులోకి పోయి పడ్డాడు. తారుదారి మీద కారు జారిపోయింది.

రాజుకి ఒక నిముషందాకా ఏమీ తెలియలేదు. ఒక ఫిలిములో కారెక్టరు ఇంకో ఫిలిం సెట్‌లోకి వస్తే. దాని తాల్లూకు డైరెక్టరు చివాట్లేసి మళ్ళీ అసలు కథలోకి లాక్కుపోయినంత మామూలుగా, కొలంబస్ వెళ్ళిపోయాడు. ఇలాటి ప్రమాదాలు మామూలే ననడానికి ఏ సినిమా చూసినా నిదర్శనం కనిపిస్తుందిగదా.





# శిఖరారోహణము

హొరైజన్‌లోకి వెళిపోతున్న హీరోకిమల్లే, భారంగా అడుగులు వేసుకుంటూ, తలవంచుకు వెళ్ళిపోసాగాడు రాజు; నేపథ్యగీతం పాడుకుంటూ. అలా పోగాపోగా మెడ నొప్పెట్టి తల ఎత్తాడు. ఎదురుగా ఓ పెద్ద గేటు కనబడింది. ఆ గేటు బార్లాతీసి వుంది. దగ్గరకు వెళ్ళేసరికి దానిమీద ఓ చిన్నబోర్డు కట్టి వుంది. అందుమీద `Please keep the gate closed' అని రాసివుంది.

(గేటుమూసి మరీ వెళ్ళండి అని తాత్పర్యం)

రాజు అది చదివాడు. తక్షణం ఆపని చేయబోయాడు.

'స్వాతంత్ర్యము నా జన్మహక్కు'ని అనే పాట గుర్తుకు వచ్చింది.

ఎంత డబ్బుంటే మాత్రం, వీడెవడో చెబితే నేను చెయ్యడం ఏమిటి అనుకున్నాడు ఆగిపోయి. దారంట పోయేవాళ్ళకి ఇలా పనులు చెప్పడం తప్పుకాదూ?

ఇంకో క్షణం తరవాత బయల్దేర బోయి మళ్ళీ ఆగిపోయాడు. వెయ్యకపోతే అదేం ముప్పో! అసలు బాగుండదేమో... మానర్స్‌లేవు అంటారు. కల్చర్ సున్న అనుకుంటారు. మెడ్రాసు వచ్చినపుడు మొవ్వారం వాడిలా ఉండడం బాగుండదు.

వేసేద్దాం అనుకున్నాడు గేటు తలుపుమీద చెయ్యివేసి.

వద్దుస్మీ అంది మనసు.

ఫరవాలేదులే అన్నాడు రాజు.

❀ ❀ ❀ ❀

'వాడెవడో ఇడియటల్లా వున్నాడే కాని వాట్ గ్రేట్ యాక్టర్! సందిగ్ధావస్థని గ్రాండ్‌గా పోర్ట్రే చేస్తున్నాడు' అన్నాడు ఆ యింటి పోర్టికోలో నిల్చున్న ప్రొడ్యూసరు.

ఆయనకి ఎడా పెడా నిల్చున్న సినీ వందిమాగధులు నవ్వాడు.

"హామ్లెట్ వేసిన లారెన్స్ ఒలీవియర్ 'టుబి ఆర్ నాట్టుబీ' సీనులో వీడికన్న ఏం పొడిచేశాడు.... ఈ మహానటుణ్ణి 'ది ఒలీవియర్ ఆఫ్ ఇండియా' అంటే తప్పేముంది. ఆ పోజు... ఆ నటన ఎంత కొత్తగా ఉంది. నాకు బాగా నచ్చింది సార్... నేను మీకు ఎపుడూ చెపుతూ ఉంటాను. కొత్తనటులలో య్యమ టేలంట్లు ఉంటాయని. నామాటే రైటైంది. నేనే నెగ్గాను" అన్నాడు వందిమాగధులు.

"యాటదీ?.... యవుడనుకున్నారు ఆ యబ్బాయి. మీ యిట్టం వచ్చినట్టు కూత్తన్నారు పాస్ పీసంతా" అంది ఆ వెనుకనే నిల్చున్న లక్ష్మీనరసు కోపంగా.

"నోనో. మిస్ నర్సూ. అతను మంచి యాక్టరని చెబుతున్నాను వారికి. అంతే" అన్నాడు వందిమాగధులు.

'నివ్వేం సెప్పనక్కల్లే... అదంతా నా యవ్వారం' అంది నరసు.

'అతన్నిట్టా పిలవ్వయ్యా' అన్నాడు - ప్రొడ్యూసరు.

వందిమాగధులు పిలిచాడు.

రాజు కొంచెం కంగారు పడ్డాడు. జంకుతూనే దగ్గరికి వచ్చాడు.

"అబ్బే... నేనేం చెయ్యలేదండి. అయామే గేట్ ఈజ్ బోర్డు... ఊరికినే బోర్డుని గేటేస్తున్నా," అన్నాడు.

'ఏమిటీ?' అన్నాడు ప్రొడ్యూసరు.

"గార్డుని బేటేస్తున్నానండి అదికాదు మూటిని గేసేస్తున్నా" అన్నాడు రాజు తన అభిప్రాయాన్ని సాధ్యమైనంత స్పష్టంగా వివరిస్తూ.

'కంగారు గొద్దు' అన్నాడు ప్రొడ్యూసరు జాలిగా నవ్వుతూ.

"యస్సార్. హేస్టీ యానిమల్' అన్నాడు వందిమాగధులు.

ఈలోగా రాజు స్థిమిత పడ్డాడు. ఇందాకటికన్న మంచి వాక్యాలు ఆలోచించాడు.

"సారీ సార్!... అయామ్ గేసింగ్ ది క్లోట్" అనేశాడు ధైర్యంగా నవ్వి.

ప్రొడ్యూసరుకి అభిమానం పెల్లుబికింది. 'వెరీగుడ్. వండ్రఫుల్ ఎక్స్‌ప్రెషన్.....నువ్వు డైలాగులు రాయొచ్చు. నీ అయిడియా పసిగట్టేశాననుకో. గేటు మూసేస్తున్నానూ అంటావు అంతేగా?'

రాజు హృదయంలో కృతజ్ఞత పరవళ్ళు తొక్కింది.

"యస్సార్. మరేండి-అదేండి. మూసు గేటే-అహ. గేసు మీసేటిత్తున్నాను."

హఠాత్తుగా ఆగిపోయాడు రాజు-అందరూ తన వంకే చిత్రంగా చూస్తున్నారని గమనించి.

అంతవరకు అతనికి కనబడకుండా ఆ లావుపాటి ప్రొడ్యూసరు చాటున ఉండి, నవ్వాపుకుంటున్న లక్ష్మీన్నరసుకి జాలేసింది.

"రాజా నువ్వింక మాటాడకు. కూచో చెప్తా...." అని "బాబాయ్, ఈడే నా మొగోడు నే సెప్పినోడు" అంటూ ప్రొడ్యూసరుకి రహస్యం చెప్పింది.

నాగేశ్వర్రావుని పిక్చర్‌కి బుక్ చేయగలిగినంత సంతోషం వేసింది ఆయనకి.

"నువ్వేమిటి నేను చెప్పినవాడు. భేష్" అన్నాడు ఎంతో సంతోషంతో. రాజు నరసుని చూడగానే సిగ్గుపడిపోయాడు.

'నువ్విక్కడి కెలా వచ్చావు' అన్నాడు సినేరియా జీర్ణం కాక. డైరెక్టరు పప్పులో కాలేశాడు అని పాఠకులు చివాట్లేసే ఘట్టాలు ఇలాటివే.

అయినా, లక్ష్మీన్నరసు తను అక్కడి కెందుకు వచ్చిందో, తనకి డబ్బుగల బాబాయి ఎలా దొరికాడో చెప్పదలుచుకోలేదు. చెప్పేందుకు ఏమీ లేదు. అందుకని నవ్వేసింది.

బాబాయి ఉరఫ్ ప్రొడ్యూసరు గారు ఒహోహో అన్నారు హుషారుగా. "ఫరవాలేదు గట్టివాడే... అమ్మాయి! నా మాట విను రాత్రికే బొంబాయి మెయిలు ఎక్కేసెయ్యండి; తెల్లారేసరికి కొండెక్కి పెళ్ళాడేసి, రేపు సాయంత్రానికి చక్కారావచ్చు. ఓ రెండొందలకి చెక్కు రాసిస్తానుండు' అంటూ లోపలి కెళ్ళాడు.

'అక్కర్లేదయ్యా. నా కాడ శానా డబ్బుండాదిలే' అంది నరసు.

❀ ❀ ❀ ❀

"వాట్? వాటీజ్ దీస్" అన్నాడు రాజు; గదిలోంచి మిగతా పాత్రలు ఫేడౌటు అయిపోయి, తనూ నరసూ మిగలగానే.

'వాటో నేదు వీటూ నేదు బాబాయి సెప్పింది ఇనుకోనేదేటి? మనిద్దరం పెళ్ళి చేసుకుందారి. ఆనక సినిమాలో ఈరో ఈరోయిను ఏసాలేద్దారిలే. మీ బామ్మకి ఉత్తరం ఆనక రాద్దారిలే" అంది నరసు.

"నో నో నరసూ నో నో. త్రీ టైమ్సు నో నో. నేను ఈ ఊరుకొచ్చి రెండ్రోజులులైంది. రెండ్రోజుల్లోనూ బోల్డుమంది బోల్డు కథలు చెప్పారు. నేను యూస్‌లెస్ పనికి రానని కూడా చెప్పారు. ఇక్కడన్నీ టోకరాలు. నేను మా వూరు వెళ్ళిపోతా. మా బామ్మ కోసం బెంగెట్టుకున్నా. మాకు నాన్నావాళ్ళు లేరుగదా. ఒకత్తే ఉంటుంది పాపం. అందుకని వెళ్ళి పోతాను" అన్నాడు సోఫా లోంచి లేవబోయి.

నరసు విరగబడి నవ్వి అతన్ని మళ్ళీ కూలేసింది.

"చూడు రాజా నువ్వు ఏ మూర్తాన నా కంటబడ్డావో నీమీద నాకు మనసైంది. నా కోసం సావు దెబ్బలు కూడా తిన్నావు. ఇంత మంచోడిని నిన్ను ఒగ్గనే ఒగ్గను. ఒకటే మాట" అంది.

"బట్ అయామ్ యూస్‌లెస్-"

"అయ్యన్నీ నాకాడ సదవమోక. ఊళ్ళోకొచ్చిన కాణ్ణించి నివ్వు దగుల్బాజీల ఎంట తిరిగి, అంతా అంతే ననుకుంటున్నావు కాని, ఈడ ఎంతెంత కథలున్నాయో నీకు తెల్దు. ఇప్పిడే వత్తానుండు" అంటూ నరసు లేచి అవతలగది గుమ్మం దగ్గరకెళ్ళి 'బాబాయ్! ఈ బుల్లోడు మనువూ గినువూ వొద్దని ఎల్లిపోతున్నాడు సూడు' అంది.

బాబాయి గర్జిస్తూ హాల్లో కొచ్చాడు. "ఏవిటీ వెళ్తాడూ. ఎక్కడికిట. అవటా లెల్లుండి షూటింగు ఉంది. ఎల్లుండి రిహార్సలు. మీ యిద్దరికీ వేషాలున్నాయి. వేళకి రాకపోతే ఎలాగ? నువ్వేం హీరోవనుకున్నావా లేటుగా రాడానికీ ఎగెయ్యడానికీను, కొత్తవాడివి. టైముకు రాకపోతే యావజ్జీవ ఖైదు వేస్తారు," అన్నాడు.

రాజు బిక్కచచ్చిపోయి, నోరావలించి, గుడ్లప్పగించి చూస్తూ కూర్చుండి పోయాడు.

"తెలిసిందా ఇంకా వెళ్ళిపోతానంటావా?" అంది నరసు.

"వెళ్ళిపోతానంటే యావజ్జీవ ఖైదు అయిపోయాక వదిలేస్తారా పోనీ" అన్నాడు రాజు ఆశ వదలక.

ప్రొడ్యూసరుగారు హిందీ సినీ విలన్‌లా నవ్వి చుట్ట ముట్టించాడు.

"ఫూల్! నీకు తెలివితేటలున్నాయి గదా! అవి కొంచెం వాడి చూడు, నువ్వు చేసే నేరానికి నిజంగా ఏం చేస్తారో ఆలోచించి నువ్వే చెప్పు. యావజ్జీవ ఖైదు పూర్తి అయ్యాక వదిలి పెడతారంటావా?" అన్నాడాయన.

ఇష్టం లేకపోయినా ఆలోచించాడు రాజు.

"వదల్రండి.... భవుశా ఉరిశిక్ష వేస్తారు. నాకు తెలుసనుకోండి. ఆఫ్ కోర్సు. నేను ఓ స్టోరీ - 'ప్రేమపిట్టలు' అనే దాంట్లో ఇల్లాగే ఎండింగు రాశాను" అన్నాడు కొంచెం ధైర్యం తెచ్చుకొని.

ప్రొడ్యూసరు గారు ఆనందంతో ఉప్పొంగిపోయి, చప్పట్లు కొట్టాడు.

"శభాష్ బేటా శెబాష్... నీకు కొంత బుర్ర వుందనుకున్నాను గాని బొత్తిగా ఇంత బుర్రుందనుకోలేదు. నువ్వసలు డైరెక్టరు కావలసినవాడివి. ఈ ఐడియా ఎవరికీ చెప్పక. నెక్స్ట్‌పిక్చర్‌లో వాడేదాం. ఇంకేం క్వాలిఫికేషను లేకపోయినా ఇదొక్కటే చాలు సినిమాకి. మిగతావి చప్పునే వంటబడతాయిలే. ఈలోగా మా నరసుని పెళ్ళాడి చిన్న వేషాలేస్తూ ఉండు. మా పిక్చరులోనే వున్నాయి రెండు. ఎల్లుండే స్టుడియోకి రండి. ముందు తిరుపతెళ్ళండి" అంటూ ఆయన గదిలోకి వెళ్ళిపోయాడు.

రాజుకి హఠాత్తుగా ఓ కొత్త అయిడియా తట్టింది. తనకు నిజంగానే సినిమాల్లో వేషం దొరుకుతుందన్న మాట. ఎల్లుండే షూటింగుట. ఓరి బాబోయ్. వండ్రఫుల్ రోయ్! అనుకున్నాడు

అనుకుని ఎగరబోయాడు. నరసు దగ్గరగా జరిగి అతన్ని స్థిమితపరచింది

"నిజమే కాదూ" అన్నాడు నరసు మొహాన్ని క్లోజప్‌లో చూస్తూ.

'కాదూ?' అంది నరసు.

'ఔను' అన్నాడు రాజు.

చెంపమీద చెంప సూపరింపోజు అవుతున్న మత్తులో, 'ఇలా కలా ఇలా' అన్నాడు రాజు.

'వల' అంది నరసు అతని మెడ చుట్టూ చేతులు వేస్తూ.



---

పి. ఎస్.

ఐదారు పేరాలపైన నరసు రాజాని సముదాయించే సీనులో 'మన పెళ్ళయాక మీ బామ్మకు ఉత్తరం రాదాం' అంది. రాజుకి నాన్న లేడనీ, బామ్మే ఉందనీ నరసుకు ఎలా తెలుసు? రాజుకి ఈ సంగతి తెలిస్తే, రమణగాడు పప్పులో కాలేశాడు. అని సినిమా పేపర్లో ఏకేసేవాడా? కాడు. అయినా రాజు పుట్టుపూర్వాలూ అతని డబ్బు లక్షన్నరకీ కాపలాగా ఒక్క బామ్మ మటుకే బతికుందన్న కిటుకూ లక్ష్మినర్సుకి తెలుసని (వాళ్ళ బాబాయిద్వారా) రమణకి తెలుసు.




“సార్. వరహాలరాజూ సార్....”

‘ఎవరది’ అన్నాడు సోఫామీద తల వాల్చి కన్నులరమోడ్చి కూర్చున్న వరహాలరాజు; నరసు మీదమించి చూపుతీసి, వచ్చిన పెద్దమనిషికేసి తిప్పడానికి ప్రయత్నిస్తూ. ఎంత ప్రయత్నించినా, నున్నటి మెత్తటి పట్టుచీర మీద అది ఆమె మెడదాకా జరిగి తిరిగి జారి పడిపోతోంది, నరసు బద్ధకంగా నవ్వి మెల్లిగా మునివేళ్ళతో అతని గడ్డం పట్టుకుని తల పై కెత్తి అటు వైపు తిప్పింది.

“థ్యాంక్యూ డాళింగ్” అన్నాడు రాజు ముక్కుపుటాలు ఎగరేసి అటు చూడబోయి.

రాజు ఆ వచ్చిన మనిషికేసి వింతగా చూశాడు.

“మల్లీ ఇటు సూడమాక జారిపడేవు” అంది నరసు కేరుతూ నవ్వి.

“యస్? ఎవరు మీరు? సినిమా ఛాన్సు కోసం వచ్చారా? సారీ. నో ఛాన్సు. న్యూ టాలంట్లకి సినిమా స్కోపు లేదు.

“మీ కొత్తవాళ్ళతో రిస్కు. డబ్బు గిట్టదు. అవస్థ. ఒళ్ళొంచి పనిచేస్కోరాదూ. పెతివాడూ సినిమాలో చేరతాననకపోతే. మా ప్రాణాలు పీకి లాబం ఏమిటి.... వాట్

నర్సూ - యామై రైట్స్?.... అందరూ సినిమా తీస్తే చూసేవాడెవడు? హహ్హాహ్హా" అన్నాడు.

"నూసు పేపరాడో యేటో సిత్తరంగా సూత్తన్నాడు మనకాసి. కసింత ఒల్లు దెగ్గిరెట్టుక మాటాడు బుల్లోడా!" అంది నరసు మెల్లిగా.

రాజు నిటారుగా లేచి కూచున్నాడు.

"సిడౌన్ సర్. రాఫిలిం ట్రబుల్, తరవాత, అయి వాంట్ పీసు డోంట్ వాంట్ వార్ సార్... నా అభిమాన రచయిత వరహాలరాజు. అభిమాన ప్రొడ్యూసరు కూడా వరహాలరాజేనండి. అభిమాన నటి, ఇగో, మా నరసు. డైరెక్టరు ఇంకా లేదు. అభిమాన సాంగ్సు రైటరేమో వి. రాజు... ఇంకా, ఇంకేం కావాలి. గ్రేటెస్టు యాక్టర్ల పేర్లు... ఇపుడే కాదులెండి. రేపు రండి. కాంట్రాక్టులు రేపు సంతకాలవుతాయి అపుడు టెలిఫోను కొడతాను... రాసుకోరేం ఇవన్నీ? పెన్నూ కాయితం తెచ్చుకోలేదా? ఏవి నూసు పేపరయ్యా నీది."

ఆ వచ్చిన పెద్దమనిషి వెనక్కి చూశాడు. ఎవరూ లేరు.

'మీరు తిడుతున్నది నన్నే!?' అన్నాడు.

'నిన్నే. నువు పేపర్లవాడివి కదా!?'

'కాదు'

'అయితే నేనూ కాదు'

'మీరు పేపరు వాడని నేను అనలేదండి'

'అది కాదు. నేను ఇందాకనించీ నీతో మాటాట్టం లేదూ అంటున్నా.'

'మరి ఎవరితో మాటాడుతున్నారు?'

'ఎవరితోనూ లేదు. అసలు మాటాట్టమే లేదు. నేను నిదరోతున్నాను. అయామే స్లీపింగ్.'

'అందుకే వచ్చానండి మిమ్ముల్ని లేపుదామని'

'ఎవరు నువ్వు? అలారం టైంపీసువా. స్టుడియో గంటవా? తూతూ బాకావా? హూవార్ యూ? ఇక్కడ నీ కేం పని?' అని కోప్పడ్డాడు రాజు.

'క్షమించండి నేను అసిస్టెంటు డైరెక్టర్ని. 'పై వారం మరోకథలో' వాణ్ణి. రెణ్ణెల్లనుంచి మీకోసం చూసి, చూసి, ఇవతలికి వచ్చేశాను మిమ్మల్ని తీసుకు వెళ్దామని. యువర్ స్టోరీ ఈజ్ నాట్ మూవింగ్. తమరి కథ కదలటం లేదు. నా పేరు రాయుడు.' అని సవినయంగా మనవి చేశాడు రాయుడు.

'దానికీ నీకూ సంబంధం ఏమిటి చెప్పు. లేపోతే డొక్క చీల్చేస్తా' అన్నాడు రాజు ఉద్రేకంగా.

నరసు కంగారుపడి, 'ఇదేటిది మద్దిన? ఆడెవడో నే నెరగను నే నెవడో-'

"అబ్బెబ్బే నీ సంగతి గాదు నర్సూ. దానికీ నీకూ అంటే, నా కథ కదలడానికీ, వాడిపేరు రాయుడు అవడానికీ సంబంధం ఏమిటీ అంటున్నా. అంతే."

రాయుడు వినయంగా నవ్వాడు. "క్షమించండి సార్. నాకూ మీ కథకీ ఇంతవరకూ సంబంధం లేదు. నేను కొత్తకథలో వాణ్ణి అని చెప్పాను గదండి. నాకు ఇందులో ఫోర్షను లేకపోయినా, జరగటల్లేదని, నేనే తెగించి వచ్చాను. తమరు దయచెయ్యాలి. షూటింగ్‌కి అన్నీ సిద్ధం చేశాం. ఆర్టిస్టులు సెట్ మీదికి వచ్చేసి తమరి కోసం కాసుకున్నారు." అన్నాడు రాయుడు.

రాజు అద్దం దగ్గరకి ఆశ్చర్యపోయి, తల దువ్వుకు వచ్చాడు.

"అయితే నా కథ ఎందుక్కదల్లేదు? ఎన్నాళ్ళ నించి? ఇపుడు నే నెవర్ని?" అన్నాడు సిగరెట్టు ముట్టించి.

రాయుడు మనవి చేశాడు. "రెణ్ణెల్ల క్రితం కాబోలు తమరు ఈ సోఫాలో కూర్చుని ఇది కలా ఇలా అన్నారు. "కాదు వల" అంటూ ఈ అమ్మడుగారు తమరి కంఠం చుట్టూ చేతులు వేశారు. ఆ దరిమెనా తమరికి బోలెడు ఆస్తి ఉందనీ తమరు ప్రొడ్యూసరు అనీ ఈ కథ రాస్తున్న రమణగారు హింటుకొట్టి పబ్లిసిటీ ఇచ్చారు."

"తరువాత? తరువాత?" అన్నాడు రాజు.

"తరవాతాండి. తరవాత, అంతే. మీ గుట్టు తెలిసి పోవడంతో, మీ దగ్గిర ఎంత డబ్బుందో అంత తెలివితేటల్లో, కరేజీ, ఇంకా బోల్డు టాలంట్లూ ఉన్నాయని మేం పసిగట్టేశాం అండి. మీ సిల్కు షర్టులూ, వాచీలూ, జోళ్ళూ కుట్టించాం. మీ ఫాషన్ చాలా బాగుందని, మిమ్మల్ని ఇమిటేట్ చేసి మీలానే మేమూ కుట్టించుకున్నామండి. ఎలాగేనా మీ అంత ఫాషను మాకెలావస్తుంది లెండి. మీరు హాలీవుడ్డూ, స్విజ్జర్లాండూ, సోమాలీ లాండూ అన్నీ టూరుచేసి, అక్కడి సినిమా ఇండస్ట్రీనీ ఫాషన్‌లనీ చూసి స్టడీ చేసి వచ్చినవారు గదా... తరువాతేమో ఐదారుగురు యూరపియన్ యాక్టర్లు - ఆడ యాక్టర్లన్నమాట. వాళ్ళందరూ మిమ్మల్ని పెళ్ళిచేసుకుంటా మన్నారండి. మీరేమో లక్ష్మీనరసుగారిని తప్ప ఇంకోళ్ళని పెళ్ళాడనని చెప్పి వాళ్ళని డైవర్సు చేసేశారట."

'ఓరి బాబోయ్. అంత గొప్పవాణ్ణా నేను, విన్నావా నర్సూ'

'ఓరి బాబోయ్ అని ఇంకో రెండు సార్లు కూడా అనుకోవచ్చండి మీరు. మేవందరం మీకు వినబడేలా అంటూనే ఉన్నాం వచ్చేకథలో. మీరు అక్కడికి రాక వినబళ్ళేదు'.

"ఎందుకు రాలేదు నేను. కారు లేదా నాకు? డ్రైవరు సెలవు పెట్టాడా. కాల్‌షీటు ఇవ్వనన్నాడా?" అన్నాడు రాజు కోపంగా.

"అది కాదండి ఆ రమణ తోలుకెళ్ళారు. మిమ్మల్ని-"

"ఏడీ వాడు? ఎక్కడున్నాడు..."

"అవతలి కథలో ఉన్నారండి. మిమ్మల్ని కేకేసుకు రమ్మన్నారు."

"ఏం పొగరు?"

"మరేండి వారికి ఒళ్ళు పొగరెత్తింది స్వల్పంగా! కానీ గట్టిగా అనమోకండి. ఆయనేగద మీకు డబ్బూ గట్రా సప్లయి చేశాడు."

"ఏడిశాడు వాడి బొంద... ఐనా మనలో మనమాట, ఎంతేం?"

"లక్షన్నర ఉంటుందని హింటు కొట్టాడండి."

"ఓరి బాబోయ్"

"మరేనండి ఓరి బాబోయ్. ఆ దరిమేనా తవరికి ఇంటలి'జెంట్సు' టెయిలరింగ్ షాపులో గుడ్డలూ అవీ కుట్టించాం. ప్రొడక్షను పెట్టించి, బల్ల, ఫాను, బెల్లు, మరతలుపు కొని తెచ్చాం. మీ రిపుడు పెద్ద ప్రొడ్యూసరు."

"ఓరి బాబోయ్. పెద్ద డైరెక్టర్ని కానా?"

'పెద్ద డైరెక్టర్లు కూడానండి'

'పెద్ద యాక్టర్ని?'

'మరేండి పెద్ద యాక్టర్ని కూడా'

"ఇంకా, పెద్ద యాక్ట్రస్సుని - అదొద్దులే. ఇంకా పెద్ద ఏమేంగా ఉండొచ్చు?"

'అన్నీనండి పెద్ద రైటరు, లైటరు, టైలరు, వైటరు, డ్రైవరు, రైదరు, రీదరు, డీలరు, లీడరు ఏదిపడితే అదేనండి.'

'స్టార్ వాల్యూ చాలా ఉందా!'

'బోల్డు'

'అయితే, నేను రేటు పెంచొచ్చుగా.,

'ఒద్దండి - యాక్టర్లు వాళ్ళంతట వాళ్ళే పెంచేశారు-'

'నాన్సెన్స్ - వాళ్ళు పెద్దవాళ్లైతే, రేటు ఎలా పెంచుతారో, నేను ప్రొడ్యూసర్ను ఐనకొద్దీ, వాళ్ళరేటు అలాగే దించుతాను. చిన్న ప్రొడ్యూసరు లక్షవేలిస్తే పెద్దవాడు యాభై వేలియ్యాలి - అంతేనా?'

'అంతేనండి కాని, నెస్టు పిక్చరుతో అలా బేరం చేద్దాం. ఇపుడు వాళ్ళ రేట్లకే అందర్నీ బుక్ చేసేశాం అందుకని వదిలెయ్యండి. అదేనా డిస్ట్రిబ్యూటరు ఇచ్చుకుంటాడు. మన సొమ్మేం పోయె. వాళ్ళని కూడా బాగుపడనియ్యండి.'

"వెరిగుడ్. పడనీ ఈసారికి. అయితే ఇపుడు మనం పిక్చరు తీస్తున్నాం కదూ! పేరేమిటి?"

'ప్రొడక్షన్ నెంబరు వన్ సార్!'

'స్టోరీ ఏమిటి'

రాయుడు, రాజు కళ్ళలోకి పరిశీలనగా చూసి, ఫక్కున నవ్వాడు. "పిచ్చరు తియ్యకుండా స్టోరీ ఏమిటండీ, మీరు మరీ విట్టీగా మాటాడుతారు, భలేవారే" అనేసరికి నవ్వు పెల్లుబికి పోయింది. విరగబడి నవ్వసాగాడు.

'కట్' అన్నాడు రాజు కోపంగా.

'లైట్సాఫ్' అని గావుకేక పెట్టాడు అసిస్టెంట్ డైరెక్టరు రాయుడు అలవాటు కొద్దీ.

కునికిపాట్లు పడుతున్న నర్సు తుళ్ళిపడింది.

"అబ్బ! యంత కేకేసినావు. నీ జిమ్మడ. సచ్చినోడా" అని గొణుక్కుంది.

రాజు సిగ్గుపడి పోయాడు తన తెలివితక్కువకి. "సారీ బ్రదర్ ఇపుడే నిద్దర్లేచాను. అందులోనూ రాత్రి సెకండ్ షో కెళ్ళాను. కాసిని అయిడియాల కోసం... ఏదో మాటజారింది... అసలు నా అయిడియా ఊరికే శాంగ్సుబుక్స్‌కి స్టోరీ రాశారా అని. అంతేగాని, పిక్చరు తియ్యకుండా స్టోరీ తయారుకాదని, ఆ మాత్రం తెలీదూ!" – అన్నాడు ముసి ముసి నవ్వులు నవ్వుతూ.

రాయుడు స్థిమిత పడ్డాడు. 'చెప్పేన్లెండి... కాని ఓటి చెబుతా. మిమ్మల్ని పూర్వాశ్రమంలో అందరూ యూస్‌లెస్ అన్నారందుకే. అనుభవం లేదు గదా.'

"పూర్వాశ్రమమా? అదేమిటి? వా డెవడు?" అన్నాడు రాజు.

"పూర్వం మీరు ఎవరండీ... ఉత్థి న్యూ టాలంటే గదా. కొత్త యువకులు. అప్పుడు మీదగ్గ రేమున్నాయి (రేకు) పెట్టే, (సత్తు) బేడా, ఓ జత చొక్కాయి లాగు. ఆశలూ, కాసిని ఆశయాలు, వేస్టు పేపర్లూ అంతేగా. రమణ చెప్పాకనే గదా మీ మెరిటు మాకు తెలిసింది. అపుడే గదా. హారినీ ఇంత 'గొప్ప' వాణ్ణి అలా అన్నామే అని నాలిక్కరుచుకున్నాం... సర్లెండి కాని, స్టుడియోకి బయల్దేరండి ఆర్టిస్టులంతా కాసుకుని ఉంటారు."

రాజు గంభీరంగా ఇంకో సిగరెట్టు ముట్టించి, 'కానీ. రిహార్సలు పూర్తి అయ్యేసరికి అక్కడికి చేరుకోలేమా' అన్నాడు.

రాయుడు ఉలిక్కిపడి, తల పై కెత్తి చూసి పగలబడి నవ్వాడు. "ఏమన్నారు... రిహార్సల్సా? .. రిహార్సల్సేనా మీ రన్నది?... సార్. మీరు చెప్పినట్లు ఈ రెండు అయిడియాలు, ఏది స్టోరీ, సినిమా పేపర్లకి యిస్తే, రిహార్సలు, రెండూ అయిడియాలు కళ్ళకద్దుకు బాక్సులు కట్టి, లేదా బానర్లు ఇచ్చి పబ్లిసిటీ యిస్తారు అన్ని దేశాల్లోకూడా. నాకు పదో పరకో దొరుకుతుంది. ఇవ్వమంటారా?"

'ఎలా రాయొచ్చో శాంపులు చెప్తా' అని గబ గబ న్యూసు రాశాడు రాయుడు; హెడ్డింగు; నేటి నిర్మాతల స్థితి; దానికిందనే ఇంకో హెడ్డింగు. ఒక అమాయక నిర్మాత బూజు భావాలు. దానికింద ఈనాడు ఫిలిం ఫీల్డులోకి చాలా మంది ప్రొడ్యూసర్లు ఎంటరయి పోతున్నారు. వీరికి ఫిలిమ్మేకింగు గురించి ఏ. బి. సి. డీలు కూడా తెలీవని డేర్ చేసి చెప్పొచ్చు. (అప్పచ్చిలాగ. ఇది హ్యూమరులెండి) రీసెంటుగా ఏస్ ప్రొడ్యూసరు 'డాష్' గారు ఇచ్చిన స్టేటుమెంటులో అయిడియాలు చిత్తగించండి.

"ఈ నిర్మాత మాతృడికి, పిక్చరు కంప్లీటు కాకుండానే స్టోరీ ప్రిపే (తయా) రవాలిట. కనీసం పిక్చరు ఏ సబ్జెట్టు, (పెసరట్టులాగా) గురించో రఫ్ అయిడియాఏనా ఉండాల్ట. (డాల్డాలాగా).

"ఇంతే కాదు. షూటింగ్ స్టార్ట్ కాడానికి ముందు రిహార్సల్సు అనేవి వేస్తారని ఈ వెర్రిబాగుల నిర్మాత ఇన్నొసెంట్ అయిడియా – ఇలా బూజు పట్టిన భావాల వారు (అవాల్లాగా) నేటి మన నిర్మాతలు.

"ఎలా ఉందండి ఈ అయిడియా?" అన్నాడు రాయుడు ఒగురుస్తూ.

'ఏడిసినట్టుంది ఇది గనక ఎవడికేనా తెలిసిందో, నా కంపెనీలోనే కాదు, ఏ కంపెనీలోనూ నీకు పుట్టగతుల్లేకుండా చేస్తా. కబర్దార్' అన్నాడు వరహాలరాజు కసిగా. అని 'కావలిస్తే ఆ అయిదో పదో నేనే యిస్తా తీసుకో' అని బ్రాకెట్‌లో చెప్పి, ఇంగ్లీషులో నవ్వాడు. 'ఐదో పదో కాదండీ పదో పరకో దొరుకుతుందనుకున్నాను.' అని సరిదిద్దాడు రాయుడు.

తరువాత ఇద్దరూ మరోసారి వచ్చే కథలోకి బయల్దేరారు.

రాజు వెడలె రవి తేజుము లలరగ, రాయుడు వెను వెంటను నడవగ.

"కారు లేకపోవడం బాగాలేదోయ్" అన్నాడు రాజు నాలుగడుగులు వేసి.

'మరేండి ఏం బాగులేదు. కొనేసెయ్యండి.'

'ఏమిటి అస్సలింకా కారే కొనలేదా నేను? ప్రొడక్షను పెట్టినా కారు కొనకపోవడం ఏమిటోయ్!'

'మరేండి' అన్నాడు రాయుడు ముభావంగా.

'మాబు చేస్తారేమోనని భయంగా ఉందోయ్' అని భయపడ్డాడు రాజు పెద్దవీధిలోకి రాగానే.

'ఏమిటండీ?'

'మాబు–అదే జనం నన్ను ముట్టడించేసి ఆటోగ్రాఫులు అవీ కావాలంటారేమోనని... వెధవది. సినిమాలో ఉంటే ఇదే చిక్కు. స్వేచ్ఛావాయువులూ గట్రా పీల్చలేం. ఎక్కడి కెళ్ళినా–'

'టాక్సీలో పోదామాండి' అన్నాడు రాయుడు హఠాత్తుగా.

'పోదాం కాని నాకు సిగ్గు సుమీ. వెధవది టాక్సీ ఎక్కి సొంత ప్రొడక్షనుకి వెళ్ళడమా. షేం షేం డ్రిల్ల అంటారు... అదే బెంగ.'

'ఏం చేస్తాం కిష్టాస్ ఫాదర్ సైజు వాడు గాడిద కాళ్ళు పట్టుకున్నాట్ట లోగడ.'

'ఇప్పుడు మనం టాక్సీ కాళ్ళు పట్టుకోవాలా?'

'ఇప్పుడు అక్కర్లేదండి. దిగేటప్పుడు డబ్బుల్లేకపోతే. దానికి చాలా టైముంటుంది' అని పకపక నవ్వాడు రాయుడు.

రాజుకి నవ్వు రాలేదు. ఎందుకు రాలేదన్నట్టు చూశాడు రాయుడు.

"నీకేం తెలుసోయ్ డబ్బయిపోయిన ప్రొడ్యూసరు అవస్థ. మీకు అంతా నవ్వులాటగానే ఉంటుంది. మా సమస్యలు వేరు.'

ఓరి బాబోయ్, అన్నాడు రాయుడు మెల్లిగా.

ఇద్దరూ బస్టాండు దగ్గరకు చేరి టాక్సీ కోసం నిల్చున్నారు.

రాయుడు దీర్ఘాలోచనలో బోర్లా పడిపోయాడు. రాజు సిగరెట్టు ముట్టించి దిక్కులు చూస్తూ నిలబడ్డాడు. ప్రజాభిప్రాయం వినబడింది కొంచెం అసింటా.

'బ్రదర్ గోదాలోకి కొత్తగొడ్డు దిగిందంట విన్నావా!' అన్నాడు ఒక ప్రజ. అతని పేరు గురువు. కాబట్టి రెండో వాడి పేరు లఘువు అయితీరాలి.

'ఏమి కథ' అన్నాడు లఘువు గుడ్లు మిటకరించి గుటకలు వేస్తూ.

"ఏమిటేమిటి? మోస్టు వండ్రఫుల్ గొడ్డన్నమాట. పేరు రాజుట. శుద్ధ క్రాకు. వాడికి పిక్చర్ ఫినిష్ కాకుండా - ఆమాటకొస్తే మొదలేనాపెట్టకుండా కథ దేనిగురించో చెప్పాలిట. ప్రాణాలు తీసేస్తున్నాట్టలే అసిస్టెంటు డైరెక్టర్లనీ వాళ్ళనీని"

'ఏమి చిత్రం. నువ్వు మరీబడాయి. ఎప్పుడూ ఇలాంటి నీలివార్తలే మోసుకొస్తావు. బుర్రున్న వాడెవడైనా నమ్ముతాడా!' అన్నాడు లఘువు తిప్పుకుంటూ.

గురువు నిట్టూర్చాడు. "రైటే బ్రదర్. నమ్మడం కష్టమే. కాని అలా లఘువుగా కొట్టెయ్యకు. కావాలంటే ఇంకోటి చెబుతాను. రిహార్సలు వెయ్యమంటాట్ట. ఇది చాలా?"

'హరహరా' అన్నాడు లఘువు చెవులు మూసుకుని.

'రాయుడూ విన్నావా?' అడిగాడు రాజు.

'విన్నా.'

'మన్నా?'

'ఔనన్నా.'

'అన్నన్నా. ఎంత చిత్రం. ఎలా తెలిసింది అప్పుడే? ఇప్పుడేగా? మనం అనుకున్నాం.'

"డేగలేదు. కాకీలేదు సార్. దాని సంగతి అంతే. పుకార్ల స్పీడు అలాగే ఉంటుంది."

రోడ్డుమీద అటూ ఇటూ పోయే కార్లలో వాళ్ళంతా, వీళ్ళవంకే చూసి ఫక్కున నవ్వుకుంటున్నారు.

'ఊరంతా తెలిసి పోయిందే.'

'అట్టుడికినట్టుడికి పోతోంది.'

'హా చంద్రమతీ' 'ఏదిగతీ?'

బై ది బై ఎవరావిడ, యద్రసేమి'

❀ ❀ ❀ ❀

'టాక్సీరాలేదు. బస్సెక్కుదామండి.'

'కానీ.'

'కానీ ఏమిటి మళ్ళీ. ఏం సందేహం?'

'అబ్బే సరే కానిమ్మన్నాను,'

'ఎందుకు మీ దగ్గిర లేవా కాన్లు?'

'నీక్కావాలా?'

'నాక్కాదు. మీక్కావాలేమోనని కానిమ్మంటున్నారు గదా.'

'అదా. మరీబడాయి నువ్వు. ఏం తెలీనట్టే.'

'ఒట్టు'

'బస్సొచ్చింది ఎక్కు.'

❀ ❀ ❀ ❀

'ఇక్కడే దిగండి. ఈ కాణ్ణించి అరమైలు నడవాలి.'

'వాలి అంటే గుర్తొచ్చింది. వాలి సుగ్రీవ సబ్జట్టు ఎలా ఉంటుందోయ్ రాయుడూ?'

'బ్రహ్మాండంగా ఉంటుందండి. కాని చాలా డబ్బవుతుంది. సెట్టింగులూ, కాస్ట్యూములూ, పెద్ద ఆర్టిస్టులూ కావాలి.'

'దానికేముంది. వాలికి వాడి ఆలికీ బాక్సాపీస్ స్టార్లని పెడదాం. మిగతా రోల్సుకి, చిన్నవాళ్ళనీ, కొత్తవాళ్ళనీ వేసుకుందాం. రోలుకో వంద ఎడ్వాన్సు పుచ్చుకోవచ్చు. బ్లాక్‌లో 50 అడుగుదాం' అన్నాడు రాజు ఉత్సాహంగా.

'నాకు ఆశ్చర్యంతో ఏం మాటాడ్డానికీ తోచటంలేదు సార్, అంచేత నేనేం మాట్లాణ్ను. మీరు చెప్పుకుపొండి' అన్నాడు రాయుడు ఆశ్చర్యంతో.

రాజు సంబరపడిపోయాడు. 'చెప్పేందుకేముంది. మనం ఎంతసేపూ, ఆర్టుకి అన్యాయం చెయ్యకుండా, జాగ్రత్తగా వాలి కథను వాల్మీకి రాసినట్టు తీసిపారేస్తే, పిక్చరులో సెట్లూ, గిట్లూ, స్టార్లూ, గీర్లూ, లేకపోయినా, చచ్చినట్టూ హిట్టయి ఊరుకుంటుంది. సింపుల్' అన్నాడు.

రాయుడు ఈ సారి తేలుకుట్టినట్టు తుళ్ళిపడ్డాడు.

'వాట్‌సార్. మీరు మరీ బొత్తిగా ఇంత అమాయకులు అనుకోలేదు. వాల్మీకీ వాళ్లు ఫిలిం కథలకన్న డ్రామెటిక్‌గా రాస్తారని వాదించే గుంపులో కలిసిపోతే, మీకు భవిష్యత్తు లేదు. అసలు వాళ్ళకి ట్రీటుమెంటూ అదీ ఎలా తెలుస్తుందండి. అప్పటికి ఫ్రాయిడ్ పుట్టనేలేదు. సైకాలజీ అనేమాటే వినుండరు వాళ్ళు. అదీ తెలీపోతే, ట్రీటుమెంటేం చేస్తారు. వాళ్ళని తప్పట్టడం లేదు సుమండీ. మీకు స్టుడియోలో ఇద్దరు ముగ్గుర్ని పరిచయం చేస్తాను. వాళ్ళు చెప్తారు మీకు వాలి కథ ఎలా తియ్యాలో. అంతేగాని సొంతంగా మీరు ఇందులో దిక్కండి. దెబ్బతినేస్తారు. ఇదేం ఆర్టా మజాకానా. ఇలా అన్నానని కోప్పడకండి. మీ తమ్ముళ్ళాంటి వాణ్ని. మీరు నన్ను పైకి తేవాలి. అసలు ఐ లవ్ ఆర్ట్. వెధవది ఆదేమిటో చిన్నప్పణ్ణించీ అంతేనుట నేను. పువ్వుపుట్టగానే పరిమళిస్తుందనుకో వచ్చునుకోండి. అయితేమటుకు నేను మరీ అన్యాయంట. చదవరా నాయనా అని మా నాయనా ఆయన నాయనా జాయింటుగా గోలెత్తినా, నేను ఆర్టోయ్ అని పొద్దస్తమానమూ ఒహటే గోలట. దానికోసమే మా

వూళ్ళో నిరుద్యోగం, ఈ వూళ్ళో మా ఫ్రెండు రాలీ సైకిలూ త్యాగం చేసి ఇలా బతికున్నాను. నాకే డబ్బుంటేనా, పెద్ద డైరెక్టర్నయి పోయేవాణ్ణి" అన్నాడు రాయుడు ఆయాసపడుతూ.

"మరేం ఫరవాలేదు. ఇప్పుడౌదువుగాని 'వాలిసుగ్రీవ' పిక్చరు నీకే యిస్తాను. డోంట్‌వర్రీ. ఆర్టంటే పడి చచ్చే వాళ్ళంటే పడి చచ్చే వాళ్ళలో నేనొకణ్ణి."

"బావుందండి మీరు ఒక్కరు కాకపోతే ఇద్దరెలా అవుతారు వచ్చేశామండి స్టుడియోకి. ఇక్కడ ఇద్దరు ముగ్గుర్ని పరిచయం చేస్తాను" అన్నాడు రాయుడు.

❀ ❀ ❀ ❀

"అయామే గ్రేట్ షోమన్" అన్నాడు ఇద్దరు ముగ్గురు.

'నాది పూర్తిగా ఎంటర్టెయిన్‌మెంటాలిటీ అండి. ప్రజల పావలా అర్ధణాకి, మొహం మొత్తిపోయి, మోము తీపెక్కేదాకా ఎంటర్టెయిన్మ్యెంటె పెట్టేస్తాను. అయామే జీనియస్ అని నా అసిస్టెంట్లూ, బంట్లూ అంతా అంటారు. నా వెనకేకాదు. ఎదటకూడా ఆ ముక్కే నిర్భయంగా చెప్పేస్తారు ఎండ్ ఐ లైక్ ఫ్రాంక్‌నెస్. నిర్మొహమాటంగా కుండ బద్దలు కొట్టినట్లు నిజం మాట్లాడే వాళ్ళంటే ప్రాణం పెడతాను,' అన్నాడు ఇద్దరు ముగ్గురు ఇంకో క్షణం ఆగి.

"సరే అయితే మీరు వాలిసుగ్రీవ ఎంటర్టెయిన్‌మెంటాలిటిగా ఫిలిం తీస్తారా" అని నిర్మొహమాటంగా మొహంపెట్టి అడిగేశాడు రాజు.

'తీస్తాను' అని అంతకన్న నిర్మొహమాటంగా చెప్పేశాడు ఇద్దరు ముగ్గురు.

'నాకు నిర్మొహమాటం అంటే చాలా యిష్టం. పడిచస్తాను' అన్నాడు రాజు.

'నేనూ అంతే... మనిద్దరికీ స్పిరుచువల్‌గా అంటే ఆధ్యాత్మికంగా ఏకాభిప్రాయం కుదిరిందన్న మాట. ఇంక అన్ని అభిప్రాయాలూ ఒకటే. అంచేత మనము తీసే పిక్చరు –'

రాజు మెల్లిగా రాయుడు వేపు జరిగి – 'ఏమిటంటాడు?' అన్నాడు.

ఇద్దరు ముగ్గురు ఆ మాట విన్నాడు. విని నవ్వాడు. 'స్పేర్ టైములో – అంటే తీరిక వేళల్లో నేను అబిసీనియన్ ఫిలాసఫీ చదువుతాను లెండి. అది నా హాబీ.'

'అయ్య బాబోయ్' అన్నాడు రాజు.

'ఔనండి. నేనసలే ఇంటలెక్చువల్‌ని. దానికి తోడు మాడష్టీ జాస్తి. నాకు ట్రాజడీ మృత్యువు. చీకటి, శ్మశానం, ఆకుజోళ్ళు, చాలా యిష్టం. ఈ సంగతి 'సినిమార్ పేపర్' నించి నన్ను ఇంట్రవ్యూ చెయ్యవచ్చినతను కూడా చెప్పాడు. ఈ ఐదు సబ్జెక్టుల మీద నేను డబుల్ డబుల్ వాల్యూమ్ క్యాలికో బైండు బుక్సులు రాస్తున్నాను. భవుశా బిమల్‌రాయ్‌కి వాటిలో ఓ దాన్ని, శాంతారాంకి వాటిలో ఇంకోదాన్ని, ఫిలిం తియ్యమని ఇస్తానని తెలుస్తోంది. వరల్డ్‌రైట్సు నా రూములోనే ఉంటాయనుకోండి. ఇందాక నేం చెప్తున్నానూ?... మర్చిపోయాను ఐ ఫర్గాట్. నాకిదో జబ్బుండి. ఈ ఫర్గాటింగు... నాకు మరుపు ఉందన్న మాట కూడా

మర్చిపోతాను. అప్పుడప్పుడు హాయ్... హవ్వ.. ఆబలింతలు - బిద్ధ డొస్తోల్దికాబోళు... హాయ్."

"మీరు వాలి సుగ్రీవ తీస్తానన్నారు" అన్నాడు రాజు - దొరికిన ఛాన్సు వదల కూడదని.

'హమ్మయ్య వాలి సుగ్రీవకదూ, యస్. అది నా స్పెషల్ సబ్జెక్టు మీరు యెవర్నడిగినా నా దగ్గరకే పంపిస్తారు. ఓటోక్లాసులోంచే అది ఫిలిం తీస్తాననేవాణ్నట....బాయ్. ప్రొడ్యూసరుగారు డబ్బులిస్తారుగానీ, గెట్ గుడ్ కాఫీ, ఓ గోల్డ్‌ఫ్లాక్ పెట్టికూడా... వాలి కథలో తమాషా ఏమిటంటే.... మీదగ్గిరో సిగరెట్టుందా... వాడికీ రావణుడికీ ఒక కామన్ పోలిక ... ఏమిటిది... చార్మినారా, ఐ లవిట్ నాకు బలే యిష్టం... చార్మినారుకీ, రావణుడికీ, అయి మీన్ వాలికీ, పోలికేమంటే, - ఒక సైకాలజీ వుందండి మీరు ఎప్పుడేనా చూశారో లేదోగాని ఇప్పుడు రావణుడున్నాడా చిన్నప్పట్నించీ హి వాజ్ లవింగ్ దట్ గర్ల్ సీతా. ఆమాట కొస్తే పూర్వజన్మ నించీ అనాలి అంటే, సీత ప్రీవియస్ బర్త్ అన్నమాట, ఏం అలాంటపుడు అతను ఎంత బాధపడతాడు? వాడూ హ్యూమన్ బీయింగే. మానవ మాత్రుడే. వాడిలోను బ్లడ్ పరుగెడుతోంది. అయినపుడు దిస్ యంగ్ డెవిల్ అనే రామా - ఈ రాములవారు వచ్చి ఆ పిల్లని చటుక్కున పెళ్ళాడేశాడు ఏం?"

"వాలి కథ" అన్నాడు రాజు భయపడుతూ.

'వస్తున్నా అయాయ్ కమింగ్. ఇదంతా వాలి సైకాలజీయేగా... అంచేత నాచురల్లీ రావణా గాట్ యాంగ్రీ... సో, హి స్టోల్ సీతా. ఆ పిల్లని దొంగిలించాడు. వాలి కేసు కూడా దాదాపు యింతే. దీనికి పార్లల్‌గా ఉంది. ఇతను కూడా చిన్నప్పట్నించి, రుమని లవ్‌చేసి ఉండాలి. అందుకని పొలిటికల్‌గా, రాజకీయంగా, అల్లకల్లోలాలూ అపార్థాలూ వచ్చినపుడు, హి మేడ్ గుడ్. బ్రదర్‌ని తరిమివేసి రుమని కాజేశాడు. రాముడొచ్చినపుడు సుగ్రీవుడు అడగ్గానే ఎందుకు సాయం చేస్తానన్నాడు? జస్ట్ ఫర్ దిస్ రీజన్. ఇదే కారణం. తన భార్యని రావణుడు ఎత్తుకుపోయాడు గదా. అలాగే, సుగ్రీవుడి వైఫుని వాలి చెక్కేశాడు. అదీ ఇంకోటి. రాముడు వాలిని చంపగానే మనం ఆ సీను కట్‌చేసి రావణాసురుడి సభని చూపించాలి. ఇలా ఈ బాణం తగిలి వాలి నేల కూలగానే అక్కడ రావణాసురుడి చేతిలో వైన్ గ్లాసో ఏదో జారి పడి పోవాలన్న మాట. పెద్ద బాగ్రౌండ్ మూజిక్. సిక్స్‌టీ డ్రమ్స్, థర్టీఫోర్ వైలిన్సూను. కామెరా సీతమీదకి పాన్. మళ్ళీ రావణుడి మీదికి కట్. టిల్ట్‌షాట్, క్లోజప్, 'ఏమిటీ యపశకునము' అని డైలాగు. బ్రీఫ్‌గా, పవర్‌ఫుల్‌గా, ఈ ఇన్సిడెంటు రావణుడి భవిష్యత్తుమీద ఫోర్కాస్టులాటిదన్నమాట. దీన్ని మనం బాగా ఎక్స్‌ప్లాయిట్ చేస్తే షాట్సు పడిపోతాయంతే. మన రామాయణం అపూర్వం, అనుత్తరం అయిపోతుంది." అని ఆగాడు ఇద్దరు ముగ్గురు రాజుకు మాట్లాడ్డానికి ఛాన్సు ఇచ్చి.

ఒక నిముషంలో రాజు కోలుకున్నాడు. "మరి మనం తీస్తున్నది వాలి సుగ్రీవ కథ కదండి. వాలి బ్రదర్‌కి పోర్షన్ ఉన్నట్టు లేదే... మీరు చెప్పేది రామాయణం ట్రీట్‌మెంటులా వుంది."

ఇద్దరు ముగ్గురు జాలిగా నవ్వి రాజు భుజం తట్టాడు. 'మరేం భయపడకండి. వాలి కథే తియ్యాలని మనకి శాసనం ఏమిటి. ఎవడా శాసించే వెధవ. డొక్కచీల్చి డోలుకట్టి ఆర్కెస్ట్రాలో పెట్టిస్తాను. అంతగా మనం తీసేది చివరికి రామాయణంగా తయారైతే పేరు మార్చేద్దాం. రామాయణం అనే పిలుద్దాం. వాటీజీ దేర్. వాటీజినే నేమ్? నాకు పేర్లలో నమ్మకంలేదు. అయామ్ ది గ్రేటెస్ట్ షోమాన్. నా అసిస్టెంట్లన్నట్లు, ఆల్మోస్ట్ ఎ జీనియస్. పూర్తిగా జీనియస్నని పబ్లీకున ఒప్పేసు గోపోడానికి కారణం మాడెస్టీయేనంటే నమ్మండి. నిర్మొహమాటం అంటే ఉన్న అభిమానంకొద్దీ ఈ కాస్తేనా చెబుతున్నాను... ఇప్పుడు చూడండి నేను వాలికథ మొదలుపెట్టి రామాయణంలోకి జారిపోయానంటే, ఎంత పరాకో మీరే చూసుకోండి. ఎవడేనా అలా చేస్తాడా అని. అసలు రామాయణానికీ వాలిసుగ్రీవులకీ ఏమైనా సంబంధం ఉందా. అదేమిటి? వీళ్ళెవరు? అయినా నేను పరాకున ఇందులోకి జారిపోయేనంటే, జీనియసువల్ల వచ్చేనష్టం మీరు గ్రహించగలరు."

"అదేమిటిసార్ అలా అంటారు. వాలి సుగ్రీవులకీ రామాయణానికీ సంబంధం లేకపోతే ఇంకేముందండి" అన్నాడు రాజు కొంచెం తటపటాయించి,

ఇద్దరు ముగ్గురు మళ్ళీ భళ్ళున నవ్వాడు. 'అదటయ్యా మాట! సంబంధం లేదంటే లేదనా. అన్నిట్లో అందరకీ ఎప్పుడూ ఏదో ఓ సంబంధం ఉంటూనే వుంటుంది. రామాయణానికీ భారతానికీ వుంది; దానికీ హామ్లెట్కి వున్నది. దానికీ ఇంకా ఏదిపడితే దానికీ సంబంధం ఉంది. రేపు మనం వాలి స్టోరీని తీసినపుడు ఫ్లాష్బాక్లో భారతయుద్ధం, హామ్లెట్లో ఘోష్టుసీను చూపిస్తామా లేదా."

'చూపిస్తామనుకోండి' అన్నాడు రాజు భయపడుతూ గుటకవేసి.

'ఇంకేం. అలాటప్పుడు. మరి వాటికి సంబంధం లేదనగలమా?'

'అనలేమనుకోండి' అన్నాడు రాజు నసుగుతూ. 'అయినా రామాయణాన్ని 'ఆది కావ్యం' అంటారని మా మేష్టారు అన్నాడు.'

'హోస్, అదా నువుచెప్పేది అది రైటైతే కావచ్చు. అంటే, రామాయణం ఫస్టున అయినట్టుంది. కానీ భారతమే ముందు జరిగినట్టు నాకుగుర్తు. ఇంక హామ్లెట్టంటావా అది చాలా పాతది. వీటికన్న ముందరదని మొన్న ఒక సీమ దొర కూడా చెప్పాడు. ప్రింటు కావడానికి చాలా రోజులు ముందర్నించీ, దాన్ని డ్రామా ఆడేవారుగదా. అయినా మనం ఓ పని చెయ్యొచ్చు. పెద్ద బాక్సాఫీస్ అయిడియా. ప్రొడక్షనుతోపాటు మనం ఓ పేపరు మొదలెడదాం. అందులో ఓ కాంట్రవర్సీ, వాద ప్రతివాదన వేదిక అని దానికి హెడ్డింగు 'ఏది ముందు? హామ్లెటా, రామాయణవా. ది మహాభారటావా? ఏది ముందు జరిగింది! ఏది ఫస్టున పబ్లిషు అయింది. అని నోటీసు వేదాం. ఇందులో బయటపడే ట్రూతుని మా మహత్తర పౌరాంఘిక చిత్రము వాలిసుగ్రీవలో చేర్చుతాము అని కూడా బెదిరిద్దాము. అక్కడితో జనం దీనిమీద కొట్టుకు ఛస్తారు. ప్రజలుట్టి వెర్రి వెధవలు. గొర్రెల మంద సైకాలజీ. ఇటు మాంచి పబ్లిసిటీ; పిక్చరు గారంటీ హిట్టు. సరేనా?"

'సరేండి' అన్నాడు రాజు బిక్కమొహంపెట్టి.

'ఫ్మీరు డల్‌గా ఉన్నారు. ఏది ఓ హండ్రెడు ఇలా పారెయ్యండి.'

'నో సార్. హండ్రెడ్ ఈజే బాంక్ అయామె చెక్. టుమారో మార్నింగ్ కాష్' అన్నాడు రాజు.

"వెరీగుడ్. సో ఈ పిక్చరు నాకిస్తారుగా" అన్నాడు ఇద్దరుముగ్గురు.

'ఎంత మాటండి' అన్నాడు రాజు నవ్వి.

'మీరు చాలా అన్యాయం చేశారు. డైరెక్షను నాకే ఇస్తానని ముందర చెప్పి, తీరా వాడికి మాటిచ్చారు' అన్నాడు అసిస్టెంట్ డైరెక్టరు రాయుడు కోపంగా, బాధగా.

'మాటేగదోయ్' అన్నాడు రాజు ఆరుబయట గాలి పీల్చి హమ్మయ్య అనుకుంటూ.

'ఏమోనండి మా మామయ్య పోయెం గ్నాపకం వస్తోంది. 'క్షణ క్షణముల్ ప్రభు దివ్యచిత్తముల్' అని అన్నాడు రాయుడు దిగులుగా.

❀ ❀ ❀



# ప్రొడక్షన్

"ఏవండోయ్! వరహాలరాజుగారూ?"

"ఎవరదీ! ఇలా కొంచెం దగ్గిర్నా క్లోజప్పులోకీ రండి."

"నమస్కారమండి. నేను... గుర్తులేనూ? రాయుణ్ణి భవదీయుణ్ణి."

"గ్నాపకం రాలేదు. కొంచెం ఫ్లాషుబాకులో మాట్లాడి మీ వెనుకటి కథ చెప్పండి' అన్నాడు రాజు నల్లకళ్ళజోడులోంచి గంభీరంగా చూస్తూ.

రాయుడు వినయంగా నవ్వాడు. చెప్పడానికి నేను రెడీయే కానండి, వెనకటి కథంతా చెప్తే ఇప్పుడు కథకి చోటుచాలదని భయం. రవణగారు ఊరుకోరు.

"వారుట్టి దగాకోరులా ఉన్నారే. ఎక్కడా దొరకదు. బాక్సాపీసు ఫిలిం రైటర్లకన్న అన్యాయం. నేను డబ్బుల్లేక లాట్రీ కొడ్తుంటే అప్పుడంతా రాసి, తీరా ప్రొడ్యూసరన్నయ్యేసరికి పబ్లిసిటీ ఇవ్వాలని పరారీ అయిపోయాడు... డోంట్‌కేర్. నీ కథ చెప్పు. నువ్వెవరు?"

"నేను రాయుణ్ణి గదండీ. మీరూ నేనూ నాలుగైదు కథల నుంచి కలసి తిరుగుతున్నాం. ఒక్క టీ తాగి, ఒక్క సిగరెట్టు కాల్చుకున్న వాళ్ళం..."

"హోహో తెలిసింది. నువ్వు రాయుడివన్నమాట - ఆ సంగతి చెప్పవేం."

"చెప్పానండి"

"చెబితే చెప్పావుగాని ఇప్పుడేం చెయ్యడం వాటీజ్ మై నెక్స్ట్‌స్టెప్"

'రవణగార్ని కనుక్కు రానాండి?'

"య్యస్... కాదు కాదు ఛస్: వాడెవడు మధ్య నేనేం చెయ్యాలో చెప్పేందుకు. నా యిష్టం వచ్చినట్లు చేస్తాను. వెంటనే పిక్చరు తీస్తాను. స్టుడియోకి నడు" అన్నాడు రాజు రవణమీద కోపంకొద్దీ.

రాయుడు మటుకు సై అనలేదు. కొంచెం గౌరవంగా, కాస్త జాలిగా నవ్వాడు. "సార్! రవణ వద్దన్నా సరే, సరేనన్నాసరే: మీరు మాత్రం యిప్పుడు పిక్చరు తీయలేరు."

"షటప్. అయామే లాక్ రుపీస్. ఎందుకు తియ్యలేను."

"బట్ యువార్ నాటే రా ఫిలిం కోటా... మీ దగ్గర లక్షల లక్షల డబ్బైవేల రూపాయలున్నా ఫిలిం తియ్యలేరు. ఇప్పుడు రాఫిలిం దొరకటంలేదు. అందుకనే కదా కిందటిసారి నాల్నెల్ల ముందర మీరు స్టుడియో షూటింగు కెళ్ళి గల్లంతయి పోయారు. ఆవాళ ఫిలిం లేక కాల్షీటు కాన్సిలైంది. అప్పట్నించే ఇంకా ఫిలిం తియ్యలేదేం మరి... మీరే ఆలోచించండి."

రాజు ఆశ్చర్యపడి లేచాక నిజమేనా అన్నాడు. రాయుడి జవాబు వినకుండానే అంచేతేనన్నమాట నేను కనబట్టంలేదు అన్నాడు. మరిప్పుడెలా అన్నాడు.

రాయుడు ఎలా అని ప్రతిధ్వనించాడు.

"పోనీ రవణ నడిగితే, రాఫిలిం కోటా యిప్పించమని?"

"ఆయన బొంద. ఆయనేం యిప్పిస్తాడు."

రాజు ఆలోచనలో మునిగిపోయి తేలాడు.

"వాడి సొమ్మేం పోయింది? కథలో ఉత్తుత్తి సినిమా కోసమే కదా ఈ కోటా" అన్నాడు తెలివిగా.

"ఉత్తుత్తి సినిమాల కోసం కోటాలా, గిరాకీ కూడా చాల ఎక్కువగా ఉందండి. కొందరు నిజం సినిమాలు తియ్యడానికి ఉత్తుత్తి కోటాలు దొరుకుతున్నాయి. మనలా ఉత్తుత్తి సినిమాలు తీసేవాళ్ళకేమో."

"షటప్... నేనెవరనుకున్నావు. అయామే లాక్ రూపీస్ బిగ్ ప్రొడ్యూసర్ డైరెక్టర్ యాక్టర్. నాకు బోల్డు గ్లామరుంది!"

'మరేండి. మీకు సినిమా మీద చాలా గ్లామరుంది.'

❀ ❀ ❀ ❀

"ఉర్గి కాకి గోల"

'ఎవరది!' అన్నారు రాజూ రాయుడూ జాయింటుగా తుళ్ళిపడి. ఒకళ నొకళ్ళు చూసుకోడం అయ్యాక చుట్టూరా చూశారు. ఎవరూ కనబళ్ళేదు. "ఎవరది మన్ని కాకిగోల అంటా. నువ్వా?" అన్నాడు రాజు మెల్లిగా.

"కాదు మీరా?"

"కాదు ఎవరో–"

"ఎవరూ కనబట్టం లేదండీ కానీ"

"రవణగాడు కాదుగదా?"

"కాదు వాడలా అనడు లెండి. కాని - ఎవరో చెప్పనా? ఈ కథ చదువుతున్న వారనుకుంటా"

"నిజమే?"

"ఒట్టూ"

❀ ❀ ❀ ❀

రాజు హఠాత్తుగా గాంభీర్యం పులుముకున్నాడు. కాలరు సర్దుకున్నాడు. కళ్ళజోడు తీసి తుడిచి మళ్ళీ పెట్టుకున్నాడు. షోగ్గా పొడిదగ్గు దగ్గాడు. రీవి నటించాడు. ఆ దారే వస్తున్న అద్దెకారు నాపాడు. మాట్లాడకుండా ఎక్కిపోయాడు. "స్టార్టు" అన్నాడు ముక్తసరిగా.

"ఎంగె" అన్నాడు టాక్సీవాడు.

'ఇమ్మీడియట్లీ' అన్నాడు రాజు ధారీగా.

'అది సర్దాంబా... య్యేంగే అని కేట్టా, అది చొల్ల మాటేంగరియే.'

'స్టుడియో' అన్నాడు రాజు టూకీగా కోపంగా.

'ఇద్దో పరక్కరేం.'

రాజు స్టుడియో హాలులో కూర్చున్నాడు.

"నెంబరు టూ ఫ్లోరు, కుడివాటాలోట మన షూటింగు. పదండి" అన్నాడు రాయుడు వైనం కనుక్కొచ్చి.

వరహాలరాజు ఎంతో సంతోషంతో పొంగిపోతున్నాడు.

"చూడగా చూడగా నేను సినిమా వాళ్ళలో కలిసి పోయినట్టే ఉందే" అన్నాడు.

"కాకా మరేమిటండీ ఫిలింప్రొడ్యూసరు అయి ఉండి కూడా ఆశ్చర్యం ఏమిటండీ మరీ బడాయి. ఏదో ముతక సామెతవతుగా ఉంది మీరన్నది."

❀ ❀ ❀ ❀

సెట్‌మీద చీకటి నిశ్శబ్దంగా ఉంది. ఒకరిద్దరు కునికిపాట్లు పడుతున్నారు. ఒక స్థూలబాల, మేకప్‌మన్ కొసరికొసరి వేసిన పిసరంత రంగును జాకెట్

మిర్రర్‌లో సరిచూసి దిద్దుకుంటోంది. 'మా తాత చచ్చిపోయి నాకు డబ్బురాగానే' తీసే నెక్స్ట్ పిక్చరులో తను ఆమెను ఎంత పైకి తీసుకురాబోతున్నాడో, మెల్లిగా చెబుతున్నాడు ఒక ప్రొడక్షన్ అసిస్టెంట్. ఏడిశావు పోదూ అంటోంది ఆమె హేళనగా. 'కొయ్ నా రంగా' అని ఆ గిరీశాన్ని వెక్కిరిస్తున్నాడు ఒక అసిస్టెంట్ డైరెక్టరు. ఓ మూలనున్న ఈ ముగ్గురూ మినహా మిగతా వాళ్ళంతా దిగాలుగా చూస్తున్నారు దశదిశలా.

సెట్ మధ్యన, కామెరా నీడన, ఓ కుర్చీలో ఒక గేరాజుత్తు పెద్దమనిషి సన్నగా, నల్లగా, దిగులుగా కూర్చున్నాడు. ఏపుగా పండిన జొన్నచేలో, కంకుల బరువుకి తల వాల్చిన మొక్కలా, అయిడియాల భారంతో దాదాపు నడ్డి వరకూ ఆయన వంగి పోయాడు. మోకాళ్ళమీద మోచేతులాన్చి ఎడమ అరచేతిలో మొహం దాచేసుకుని, కుడిచేతి వేళ్ళతో ఒత్తు జుత్తును లాలిస్తున్నాడు.

రాజూ రాయుడూ సభామందిరమధ్యానికి వచ్చారు జోళ్ళు చప్పుడు చేసుకుంటూ. సభలో ఉన్నవారంతా హడలిపోయి వింతగా చూశారు వారివంక. హాలాహలం మింగబోతున్న శివుడిని దేవతలు అలా చూసి వుండరు. శిబిచక్రవర్తి పావురంకోసం అని తక్కెడలో ఎక్కుతున్నపుడు ఆయన ఫాన్‌లు అలా చూసిఉండరు. సిడ్నీకార్టన్ తన ప్రియురాలి సౌఖ్యం కోసం గిలటిన్‌లో తలపెట్ట తలపడినపుడు ప్రేక్షకులు అలాచూసి ఉండరు. అయితే పైవాళ్ళు ఓ గొప్పకార్యంకోసం ఇంత త్యాగం చేశారు. మరి వీళ్ళు? వీళ్ళు దేనికోసం ఇంత త్యాగం చేస్తున్నారు? ఇంతటి సాహసం ఏల? అని పరిపరివిధాల తర్కించుకున్నారు. డైరెక్టరుగారికి కోపం వస్తే వాళ్ళకి పుట్టగతులుండవే అని పరితపించారు. ఇలా ఉండగా, దీనికి తోడుగా రాజు పేట్రేగిపోయి, కాళిదాసు తాలూకు 'రాభణాసురుడు' డైలాగు లాటిది ఒకటి అనేశాడు.

మొదట అతనూ ఓర్పు చూపాడు, కుర్చీలో ఆయన తనకి మర్యాద చేస్తాడేమోనని. ఆయన ఎంతకీ కదలకపోయే సరికి శ్రద్ధగా చూశాడు. తెలివైనవాడు కాబట్టి ఓహో అనుకున్నాడు కారణం ఊహించేసి.

"ఎపుడు పోయారు?" అన్నాడు గట్టిగా.

రాయుడికి పై ప్రాణాలు పైకి పోయాయి. లోపలికి అరికాళ్ళదాకా దిగిపోయాయి.

"ష్. ఎంతమాట అనేశారు. ఆయనే డైరెక్టరుగారు. మూడ్‌లో ఉన్నారు. ఇప్పుడే ఆయనకి అయిడియాలు అవుతున్నాయి." అన్నాడు రాయుడు భయభక్తులతో.

అంతలోకి డైరెక్టరే తలెత్తారు. 'ఎవర్రా నువ్వు' అంది ఆయన మంద్రగ్రీవం.

"నేనండి. ప్రొడ్యూసర్నండి. తమరి యజమానిని" అన్నాడు రాజు వినయంగా.

"ఓ కూర్చో. మాటాడకు" అన్నాడు డైరెక్టరుగారు.

రాజు కూర్చున్నాడు. 'యాక్టర్లు ఎవరెవరండీ... మూజిక్కు ఎవరండీ. శాంగ్సులు ఎవరండి' అన్నాడు ఉత్సాహంగా.

'సైలెన్స్' అని గావుకేక పెట్టాడు డైరెక్టరుగారు. సైలెన్స్ చక్కావచ్చి చేతులు కట్టుకు నిల్చుంది.

డైరెక్టరుగారు రాజు మీదికి అభిమానం రంగేసిన నవ్వు విసిరారు. రాజు దానికి కృతజ్ఞత పులిమి ఆయనకి మళ్ళీ యిచ్చేశాడు.

'యాక్టర్లు ఇపుడుపుడే రారు. రాత్రి ఏడింటికి వస్తారు. మ్యూజిక్ రెడీ అయినట్టే... ఎవర్రా అక్కడ మ్యూజిక్కు ఇలాతెండి.' అన్నాడు డైరెక్టరు.

సన్నటి నల్లటి కుర్రాడొకరు ఓ అట్టపెట్టి తెచ్చి అందిచ్చి నిల్చున్నాడు.

"ఇతనేనా మూజిక్ డైరెక్టరు?" అన్నాడు రాజు.

"అబ్బే నేను కాదండి. నాకేం తెలీదు." అన్నాడు కుర్రాడు తుళ్ళిపడి.

డైరెక్టరు నవ్వాడు. 'మ్మనం' అన్నాడు సగర్వంగా.

'మీకు మూజికు డైరెక్షనింగుకూడా వచ్చా?'

'మీకురాదా?' అని ఉరిమాడు డైరెక్టరు.

"వచ్చుననుకోండి...!" అన్నాడు రాజు గుటకమింగి.

"మరింకే అలాడుగుతారు. ఇదిగో ఇందులో పన్నెండు పాటలున్నాయి. పదకొండే అనుకోండి. పదకొండేదేమో, పిక్చర్లో నాలుగోది అన్నమాట. అది సిక్స్‌మినిట్ సాంగులెండి."

రాజు ఆశ్చర్యపోయాడు. "ఎంత ఆశ్చర్యం! నేను నిన్న ప్రొడ్యూసరు అయ్యాను. యివాల్టికే మూజికల్ రికార్డింగు ఫినిషింగైయి పోయిందంటే - భలేగా వుందికదూ."

"కాదు మరీ - రికార్డింగేమిటి. ఈ సాంగ్సన్నీ హిట్ అయిన సాంగ్సే. అందుకే అందరు ప్రొడ్యూసర్లూ, నా సెలక్షనంటే, పడిఛస్తారు."

"ఏదీ చూణ్ణివ్వండి" అన్నాడు రాజు అట్టపెట్టి అందుకుంటూ.

'వన్ మినిట్' అన్నాడు డైరెక్టరు ఆ పెట్టి మూత అదిమిపట్టి; 'ఇందులో ఎవరెవరుంటారు గెస్ చెయ్యండి' అన్నాడు.

రాజుకి అర్థం కాలేదు. 'ఎవరంటాడేమిటి. ఇందులో మనుషులుంటారా?' అన్నాడు రాయుడితో మెల్లిగా.

'ఆయన్నే చెప్పమను' అన్నాడు రాయుడు నవ్వి.

డైరెక్టరు అట్టహాసం చేశాడు "హోపీన్నయ్యార్; న్వౌషాద్, రామచంద్ర-ఆఫ్‌కోర్సు శంక రెండ్ జైకిషనూ, బర్మన్. బిశ్వాస్, సరే అందులో సాంగుకోసం త్రిపాఠీ, అక్కడి కేమయింది ఇండియన్ బాక్సాఫీసు మ్యూజిక్ డైరెక్టర్స్ ఏడుగుర్నీ మన పిక్చరుకి బుక్ చేశాం అన్నమాట. చూస్కోమరి తడాఖా."

"ఓరి నాయనో! వాళ్ళలో ఒక్కొక్కడినే మనం భరించలేమని పేపర్లో రాశారే; ఏడుగుర్నే. ఇంకేమన్నా ఉందా. మనం పిక్చరు తీస్తున్నామా? దివాళా ఎత్తుతున్నామా? వాళ్ళ సోడాలికే రోజుకి ఇరవై రూపాయి లవుతాయిట. - సోడాలతో నీళ్లోసుకుంటార్ట. - మంచినీళ్ళు అలవాటు లేక బాదంకీరూ గట్రా తాగుతారట. ఏర్కండిషన్ లేకపోతే గదంతా అయిస్క్రీం పోయిస్తారట"

"మరేం ఫరవాలేదు. అధైర్యపడకుడు. నేను రోజుకి పది రూపాయలు దాటకుండా చూస్తాను." అన్నాడు హఠాత్తుగా వచ్చిన ఒక నడికారు మీసాలాయన చాలా ఉత్సాహంగా.

"వీరెవరు!"

(వాడిపేరు 'సశేష' గిరి. ఉద్యోగం ప్రొడక్షన్ మేనేజరు గిరీ. ఎలాటి ఖర్చులోనైనా డబ్బు కాస్తో, కూస్తో 'శేషం' వేస్తాడని వినికిడి.)

'వీరెవరు?'

'వీరిపేరు శేషగిరి. ప్రొడక్షన్ మేనేజరు' అన్నాడు డైరెక్టరు.

అని, డబ్బు పొదుపుచెయ్యాలని ఊహూ ఉత్సాహ పడిపోతున్న సశేషగిరివంక చూసి, 'గిరిగారూ! మీరేమీ పొదుపు చెయ్యక్కర్లే. అదేదో నే చూస్తా రాజుగారూ! మీరెవర్నీ నమ్మకండి. ప్రొడక్షన్ మానేజర్లని పెట్టుకోడం దురుసునోటి అప్పులాళ్ళ తిట్లు భోంచెయ్యడానికేనని గుర్తుంచుకోండి" అని ధైర్యం చెప్పాడు డైరెక్టరుగారు.

"సరే యిప్పుడు ఏం చేద్దాం. మూజిక్కు సంగతి చెప్పండి" అన్నాడు రాజు విసుగెత్తి.

డైరెక్టరుగారు గ్రామఫోను తెప్పించారు. అట్ట పెట్టి విప్పి ఒక్కొక్క ప్లేటే పెట్టించారు.

గ్రామఫోను పెడుతున్నాయన, ఒక్కొక్కపాటకీ ముందు దానిపేరూ మ్యూజిక్ డైరెక్టరుపేరూ చెప్పి పెడుతున్నాడు. ఇది శాడ్ సాంగ్, ఇది గ్లాడ్ సాంగ్, ఇది మాడ్‌సాంగ్, ఇది మూడ్ సాంగ్ అని తీర్పు చెబుతున్నారు డైరెక్టరుగారు.

'అయితే యిపుడు మనం హిందీ పిక్చరు తీస్తున్నామన్న మాట. హారినీ' అన్నాడు రాజు తెలివితేటలన్నీ వాడేసి.

"నో నో టెలుగే. ఇది హిట్టయితే ఏకంగా టమిల్, హిందీలలో తీసిపారేద్దాం... ఇపుడు మీరు వింటున్నవి అన్నీ హిందీ హిట్‌సాంగ్స్. వీటిని అన్నిటినీ మనం ఎడిట్‌చేసి తెలుగు చేస్తున్నాం ఇగో ఈయనే ఇవి ఎడిట్ చేసే అయన" అన్నాడు డైరెక్టరుగారు.

గ్రామఫోను పెడుతున్న పెద్దమనిషి గంభీరంగా రాజుకి దండంపెట్టాడు.

'మ్యూజిక్ డైరెక్టరో మరి?' అన్నాడు రాజు.

"మ్యూజిక్ డైరెక్టరు అంటూ వేరే లేరు. వాళ్ళు చాలా అడుగుతారు; చెప్పినట్టు అందరూ వినరు. మనకు మూజికు ఎడిటరే ఉంటాడు. డైరెక్షను మనదే" అన్నారు డైరెక్టరుగారు. దగ్గిరే ఉన్న కుర్రాడు అయన గుండెమీద టీవిగా కొట్టాడు.

రాజు బుర్రలో ఓ ఆలోచన మెరిసింది. ఏదో అనబోయి తగ్గాడు .... తటపటాయించాడు. తెగించి, లేచి "డైరెక్టరుగారూ ఓ చిన్నమాట. అసింటా రండి" అన్నాడు.

డైరెక్టరు కదల్లేదు. చుట్టూ చూసి హూంకరించాడు. అంతా దూరంగా వెళ్ళారు. 'చెప్పండి' అన్నాడాయన.

ఈ అయిడియా చూసిన రాజు ఆశ్చర్యానికి అంతులేదు. ఆనందానికి హద్దులేదు. 'ఎలాగేనా డైరెక్టరంటే డైరెక్టరే' అన్నాడు.

"కాపోతే డైరెక్టరంటే ప్రొడ్యూసరెలా అవుతుంది?"

"అదికాదు సార్. మీకెంత బ్రహ్మాండ అయిడియా వచ్చింది! మ్మనం అసింటా వెళ్దాం అంటే, మిగతావాళ్ళని దూరంగా పంపేసి, మనం కదలకుండానే అసింటా వెళ్ళినట్టు చేశారు. అయిడియా కాదూ ఇది మరీ!"

'అదా' అన్నాడు డైరెక్టరుగారు ఇలాంటివి చాలా సహజమన్నట్టు.

రాజు, ఆయన దగ్గరగా జరిగాడు.

"చూడు గురూ! ఈ పిక్చరులో శాంగ్సు తెలుగులోనే ఉంటాయి గదా! అవి మన్ని రాయనిస్తారూ! అయామే గుడ్ సాంగ్ రైటర్" అన్నాడు రాజు మెల్లిగా.

డైరెక్టరుగారు ఫెళఫెళ నవ్వేశారు. కొంచెం అసింటా ఉన్న స్టుడియో కొండ గుహ 'ఎళవెళ' అని ప్రతిధ్వనించింది.

'భలేవాడివయ్యా! ఈ పిక్చరు నీది, నువ్వే ప్రొడ్యూసరువి. పాటలు రాయాలనుకుంటే, నిన్ను అడ్డేవాడెవడు. దర్జాగా రాసెయ్ కాని ఒకటే చిక్కు నువ్వు పెద్దరైటరని నాకు తెలీదే. పసిగట్టలేకపోయా. అందుకని ఏంచేశానంటే భావమరిది లేడూ' –

'మీకు బామ్మర్ది ఉన్నాడా?'

'ఉన్నాడులే. వెధవ ఫోర్తుఫారం తప్పి అడ్డగాడిదలా తిరుగుతూంటే – తప్పితేనేం గాని, వాడికి యమ టేస్టుందిలే – సరే ఈ లైనులో పెడదామని ఓ డజను పాటల పుస్తకాలు వాడి ముందర పడేసి పాటలు రాయి వెధవాయా అన్నాను. తీరాచూస్తే వాడన్నీ హిట్ సాంగ్సు రాసేశాడు! దారుణం కదూ? అన్నీ బ్రహ్మాండంగా ఉన్నాయి. ముందరేమో, పాటకి వంద ఇప్పిద్దామనుకున్న వాణ్నల్లా సంతోషం కొద్దీ పాటకి నాలుగొందలు యిప్పిస్తానన్నాను. వాడ ిబిల్లు చూస్తారు గదూ అన్నట్టు... ఇదో రాజుగారూ... ఒకటి చెబుతా. మనం కవులనెపుడూ బాధపెట్టకూడదు. అది చాలా మహాపాపం. కాని సినిమావాళ్ళంతా అంతే. అన్నిటికీ తగలేస్తారుగాని కవిదగ్గర కొచ్చేసరికి బేరం ఆడతారు, పొదుపు చేస్తారు. వందిచ్చి పదొందలికి బిల్లు రాయించుకుని, స్టార్లకిచ్చిన బ్లాకు డబ్బుని సర్దుకుంటారు. దానికికూడా తిప్పితిప్పి ఏడిపిస్తారు. ఇది నా కిష్టం లేదు అంచేత మీరు ముందర కవిగాడికి ఇవ్వండి. పాటలన్నీ భేషైనవి."

రాజు ఈ గంభీరోపన్యాసానికి ఉప్పొంగిపోయాడు. అతనికి చాలా గర్వం కలిగింది. మంది ఆదర్శకంపెనీ అన్నాడు. తప్పకుండా కవికి ఇచ్చేదామన్నాడు. "కాని ఇంకొక్క రిక్వెస్టు సార్, నేను శాంగ్సు రాయకపోతే పాయేగాని, రాసిన వాటిలో ఎక్కడేనా 'అర్ణవము' అనే మాట పెట్టించండి. అది భలే వరదులెండి. నాకు చాలా యిష్టం. ఎప్పట్నించో అది పెట్టి పాటరాయాలనీ, అది పెట్టి పిక్చరు తియ్యాలనీ కలలు గాంచుతున్నాను" అని ప్రాధేయ పడ్డాడు.

ప్రొడ్యూసరు ముచ్చట చెల్లించాలని డైరెక్టరుకూడా ముచ్చటపడ్డాడు. అసలు అలాటి పెద్దమాటలు ఓ డజనేనా ఉండాలన్నాడు. ఉంటే డిస్ట్రిబ్యూటర్సుకూడా తొరగా డబ్బివ్వచ్చును అన్నాడు. వెంటనే ఫ్లోరు అవతల గాలి పీలుస్తున్న తన బావమరిదిని పిలిపించాడు.

'ఈనే కవిగారు!' అని పరిచయం చేశాడు. 'ఏరా అబ్బీ!' 'అర్ణవం'ట అదెక్కడేనా పెట్టావా పాటల్లో' అన్నాడు.

'లేదు బావా ఏమిటది?'

"నీ బొంద ఎందుకు పెట్టలే? బుద్ధిలేదూ? అర్ణవం అన్నమాట లేకుండా పాటలు రాసినవాడివి నువ్వెందుకు పనికొస్తావు? అసలు అది లేకుండా ఎవడన్నా పాటలు రాస్తాడా అని. వెంటనే పెట్టు" అని గర్జించాడు.

"పెడతాను బావా కాని అలాటి మాట లేదు. ఉన్నా ఇందులో పనికిరాదు" అన్నాడు బావమరిది ధైర్యంగా, ఓ పక్క గజగజ వణికిపోతూ.

"ఛవ్ ప్రొడ్యూసరుగారి కన్నా తెలుసా నీకు?"

జేబులోంచి కాయితాలు తీసి గబగబ చూసి, 'అయినా ఎక్కడా పట్టదు బావా. అన్నీ టైటుగా ఉన్నాయి. చోటూ లేదు సందర్భమూ కుదరదు' అన్నాడు బావమరిది జంకుతూనే.

'పెట్టమంటే నీగ్గాదూ... సూపరింపోజు చెయ్యి చోటు లేపోతే.... మీ కవిగాళ్ళతో ఇదే చిక్కు. చెబితే వినరు. తిడితే కనరు. స్వతంత్రం మింగేస్తున్నారు ప్రొడ్యూసర్లని గోల' అని మండిపడ్డారు డైరెక్టరుగారు.

బావమరిది ముందు బిక్కమొహం పెట్టి ఆనక దుఃఖ సముద్రంలో మునిగి పోయాడు.

ఇదంతా చూసి, రాజుకి ఏడుపొచ్చేసింది. భయం వేసింది.

'ఛీ! నా మూలాన కదా కుటుంబకలహం వచ్చింది. అర్ణవం కోసం కుటుంబం ఛ్చిద్రం అయిపోతే నా హృదయభాండం భరించలేదు. సార్! అర్ణవం మానెయ్యండి' అన్నాడు భోరున ఏడుస్తూ, స్టుడియో ఆకాశంలోకి చూస్తూ.

డైరెక్టరుగారికి ఈ సీను చూసేసరికి గుండె దుఃఖం పొంగి పొరలిపోయింది. అప్పుడు ముగ్గురూ ఏడిచేశారు. డైరెక్టరుగారూ, ప్రొడ్యూసరూ, కవీను.

కాసేపు ఏడిచాక, 'అర్ణవం ఎలాగో అలా పెట్టేయ్' - అన్నాడు డైరెక్టరు కళ్ళు తుడుచుకుంటూ.

'పెట్టేస్తాను బావా.' అన్నాడు బావమరిది ఎక్కిళ్ళు ఆపుకుంటూ.

'ఒద్దు' అన్నాడు రాజు ముక్కు చీదుకుంటూ.

పెడతాం అన్నారు వాళ్ళు; వద్దంటారు రాజు.

రాజు ఎంత వద్దన్నా, అని ఏడిచినా వినకుండా నిర్దాక్షిణ్యంగా డైరెక్టరూ, కవీ కలిసి ఓ శాడ్ సాంగులో రెండుమాటలు కొట్టేసి అక్కడ అర్ణవం అనే మాట పెట్టేశారు.

అప్పుడు, "నా ఆత్మ శాంతించింది. నా జీవితాశయం తీరింది. పాటకూడా చూడండి. ఎంత బావుందో! అర్ణవానికి అర్థం అభివృద్ధి అని ఈజీగా తెలిసిపోతోంది. ఓ కొత్తమాట ప్రజలకు చెప్పేస్తున్నాం. కొన్ని లక్షల కోట్ల మంది భారతీయులు ఈ పిచ్చరు చూసి, ఈ పాటవిని, కష్టపడి పని చేసి, అర్ణవాన్ని సాధిస్తారు" అన్నాడు రాజు ఆనంద బాష్పాలు కారుస్తూ.

"ఔను" అన్నారు డైరెక్టరూ కవీకూడా ఆనంద బాష్పలే కారుస్తూ.

❀ ❀ ❀ ❀

ఈ ముగ్గుర్నీ లాంగ్‌షాట్‌లో చూసిన ఒక వర్ధమాన నటుడి బుర్ర చురుకుగా పనిచేసింది. ఓహో అనుకున్నాడు.

తక్షణం అతని గుండె కరిగిపోయింది. అదంతా పైకి తన్ని కళ్ళలోంచి నీరై కారడం మొదలెట్టింది. చొరవచేసి, అతను గబగబ వాళ్ళ దగ్గరకు వచ్చాడు.

ముగ్గుర్లో దర్జాగా ఉన్న డైరెక్టరుగారికే దండంపెట్టి గద్గదస్వరంతో 'సార్' అన్నాడు. ఆ ముగ్గురూ ఇతనివంక చూశారు.

"సార్! మీ రధైర్య పడకండి. ఈ కష్టం మీకు రావాల్సింది కాదు. మీరే ఏడిస్తే, మాలాంటివాళ్ళం ఏంకాను. పోయినవాళ్ళతో మనమూ పోగలమా! పోలేము. వారు లేరు. మనకిక లేరు. ఉన్నా రారు నాకు దుఖ్ఖం వచ్చేస్తోంది. ఇవి సత్య కన్నీళ్ళే... గ్లిసరిన్ మీద ఒట్టు. మీ కుటుంబానికి నా సానుభూతి; వారి ఆత్మకి శాంతి కలుగుగాక" అన్నాడు. అని వినయంగా నవ్వాడు.

డైరెక్టరుకీ, రాజుకీ, కవికీ నోట మాటలేదు. తెల్లబోయి విన్నారు.

"ఎవరోయ్ ఆ వారు. ఎవరిమాట నువు చెప్పేది" అన్నాడు డైరెక్టరు.

వర్ధమానుడి గుండె గుభేలుమంది. 'ఎవరూ పోలేదా!' అన్నాడు మెల్లిగా, జంకుతూ.

"గెతౌట్ ఇడ్డియట్" అని గావు కేక పెట్టాడు డైరెక్టరు;

❀ ❀ ❀ ❀

"మన వాళ్ళెవరూ పోలేదు గాబట్టి తిట్టిపోశాం అనుకో. కాని నిజంగా మనం దుఃఖంలోనే ఉంటే, ఈపాటికి ఇందాకటి వాడు మన పిక్చరులో ఏ హీరోనో హీరోయినో ఎటలీస్టు ఎక్స్ట్రానో అయిపోయేవాడు గదా. పొరబాటైపోయింది. కాని వాడు ఎంత తెలివైనవాడో చూశారా? ఎంత చొరవో చూశారా" అన్నాడు రాయుడు ఆ రాత్రి నిద్రబోయే వేళ.

"ఔనౌను. భలే ఇంటలిజెంట్‌వాడు చాలా మంచివాడు" అన్నాడు రాజు.

"మరి అలాటి సూక్ష్మబుద్ధీ, అలాటి చొరవా, సాహసం, మీలో సహామేనా ఉన్నాయా? మీరు ఇంకోళ్ళ చుట్టాల కోసం పబ్లీకున అంత నాచురల్‌గా యాడవగలరా?" అన్నాడు రాయుడు ఆవలిస్తూ.

"ఉహు"

"దెన్ యూస్లెస్. మీరు ఫిలిం ఫీల్డుకే పనికిరారు. వారసత్వం కలిసి ప్రొడ్యూసరు అయారు గాబట్టి సరిపోయింది కాని" - అన్నాడు రాయుడు.

రాజు ఆవలించి 'హాయ్ రాజ్' అనుకుని పడుకుని, అందమైన కలలు చూడడానికి నాందిగా కళ్ళు మూసుకుని, పగటి కలలు తయారుచేయడం మొదలు పెడుతున్నాడు. శ్రావ్యగానంలో అపశ్రుతిలా, చిక్కటి వెచ్చటి చీకటిలో హఠాత్తుగా వెల్తురు పేలింది. ఆ ధాటికి అతని మేదలు అదిరి కలలు విరిగిపోయాయి. తుళ్ళిపడి 'ఎవరూ' అన్నాడు.

"నేనండి... అమ్మగోరు మిమ్మల్ని పిలత్తన్నారు. సాయం పడుకోడానికి. బయ్యంగా ఉందంట" అంది పనిపిల్ల సాధ్యమయినంత నవ్వకుండా.

"సాయం! నేనా?... ఏ అమ్మగారూ" అన్నాడు రాజు.

రాయుడు కూడా మేలుకున్నాడు. "ఏ అమ్మగారైతే మీ కేమండి. ఆడది.... అబల! నిస్సహాయురాలు, చీకటిలో ఒంటరిగా చలి భరించలేక సాయం పిలిస్తే వెళ్ళనంటారు.... ఇదేం న్యాయం... మీకు ఎద లేదా? దయ లేదా? లేపోతే రాదా? లేదా నే వెళ్ళేదా?" అన్నాడు అతను వీరావేశంతో.

రాజు విసుక్కున్నాడు "నువ్వు కాస్త ఆగవయ్యా... ఎవరో పరాయి ఆడది కామోసు. ఏయ్ పిల్లా.... ఇపుడు నిదరొాస్తోందిటా, కావలిస్తే పొద్దున్న వస్తారుటా, అందాకా ఆంజనేయ దండకం చదువుకో అని చెప్పు. కావలిస్తే రాయుడు వస్తాడు. నువ్వు కూడా వుండు ఇంకా భయమయితే." అన్నాడు.

ఆ పిల్ల మళ్ళీ చక్కా వచ్చి "దవడ పల్లు ఊడగొడతా రంటండి" అంది.

"ఎవరివీ" అన్నాడు రాజు బద్ధకంగా.

"కనుక్కొాత్తా నుండండి" అంది పిల్ల.

అప్పటికి రాజు ఉలికిపడి 'ఏయ్' అని గర్జించి ఆ పిల్లని ఆపాడు.

'ఎవరే మీ అమ్మగారు?'

'అక్కడ దాకా వచ్చారన్నమాట అయ్యగారు. పిల్లాడోవ్! ఈ యెదవేసాలన్నీ నా కా దెయ్యమోక' అని కొత్త కంఠం వినబడింది.

'ఎవరీ ఆకాశవాణి' అని విస్తుబోయి తలెత్తి చూశాడు రాజు.

ఎదురుగా గుమ్మం మీద చీకటి ఇవతలగా వెల్తురుకు అవతలగా, రెండింటికీ సరిహద్దుగా నిల్చుంది లక్ష్మినరసు. ఐశ్వర్యానికి ఔదార్యంలా ఉన్న నల్లంచు తెల్లచీర కట్టుకుంది. చేతకానిదాని అబద్ధంలా పచ్చగానూ ఎదటి మనిషి ప్రజ్ఞని అణగ ద్రొక్కేవాడి ప్రయత్నంలా నల్లగానూ ఉన్న ఆర్గండీ రవిక తొడిగింది. అమాయకత్వంలా తెల్లగా ఉన్న కళ్ళకి నల్లటి కాటుక పెట్టుకుంది. కాటుక చక్రాల మధ్య రెండు దీపాలు వెలిగించింది. అవి మరీ హైపవర్ లాంపులు కాకపోయినా కాటిక మధ్య ఉన్నందువల్ల రాజుకి దివ్యజ్యోతుల్లా కనిపించాయి. పాండ్స్ క్రీంతో నిగ నిగలాడుతున్న ఆమె ముఖానికి మరీ బంగారంతో పోటీచేసే స్తోమతు లేకపోయినా, వెనకాల ఉన్న చిక్కటి చీకటి, వెల్తురు మూలాన ఆ చీకటికో చాయ తక్కువైనా నల్లగా మెరుస్తున్న జుట్టూ కలసి యధాశక్తి ఆ ముఖాన్ని ఆకర్షణీయంగా చేస్తున్నాయి. మొత్తానికి, ఆడదాని తెలివితేటల మీద అట్టే నమ్మకం లేని బ్రహ్మచారి, ఓ మోస్తరుగా వేసిన అసంపూర్ణ వర్ణచిత్రంలా ఉంది నరసు.

'నువ్వా' అన్నాడు రాజు.

'గాపకం వచ్చానా?'

'లేదు. సారీ... ఎక్కడో చూసినట్టుంది గాని-'

'హ్వోరి నాయనో! అప్పుడే కల్లు నెత్తిమీన కెక్కినాయే... లచ్చిన్నరుసునే మరిచి పోనావు... ఆ?' అని గదమాయించింది నరసు.

రాజుకి అంతా గుర్తుకొచ్చింది. నరసుని మరిచిపోయినందుకు ఒళ్ళు చచ్చిపోయి నట్టయింది.

'నన్ను క్షమించు నరసూ నన్ను క్షమించు. ఏదో ప్రొడక్షన్ హడావుడిలో మర్చిపోయాను. మనం అసలు తిరపతి వెళ్ళి పెళ్ళిచేసుకోవలసింది కదూ... మీ బాబాయి కూడా-అన్నట్టు మీ బాబాయేరి?'

'వత్తాడు... సూటింగు కెల్లేడులే గాని....దా. ఆల్లో కూకుందారి. నువ్వేవేం సేసినావో అంతా సెప్పాలి దా' అంటూ ముందుకు వచ్చి రాజుని లేవదీసి తీసుకుపోయింది నరసు.

రాయుడు తెల్లబోయాడు. 'హ్వోరి బాబోయ్! మన వాడికి హీరోయిను కూడా ఉందే' అనుకుని.

'నాకు భయం వేస్తోంది. నీకు సాయం ఉండనా' అన్నాడు అందంబటే ఉన్న పనిపిల్లను చూసి.

'పల్లు రాలగొడతాను... ఈసారి ఒవురియో కనుక్కురా నక్కరలేదు బుల్లోడా' అని గిరుక్కున తిరిగి చక్కాబోయింది ఆ పిల్ల.

   

హాల్లో సోఫా మీద నరసు తల్లో పూల పరిమళం మధ్య, పల్చటి చీకటి మధ్య కూర్చుని గత రెండు రోజులూ తా నెక్కడెక్కడి కెళ్ళేడో, ఏవేం చేశాడో చెప్పాడు రాజు. చెబుతున్న కొద్దీ తన కథ అతనికే వింతగా కనపడుతోంది. అక్కడక్కడ అది తన కథ కానే కాదన్న అనుమానం వేసింది. అనుమానం కలిగినపుడల్లా ఈ సిరి, ఈ నరసు తనకు దక్కకుండా అంతర్ధానం కావచ్చునన్న అధైర్యం పట్టుకుంది.

నే నెవరు?... (రాజుని) నా కీ డబ్బెక్కడిది .... (లక్షన్నర ఆస్తి ఉందిటగా)... ఎవరు చెప్పారు? (లక్ష్మిన్నరసు బాబాయి). వాడెవడు?...

'వా డెవడు. అసలు మీ బాబాయెవ్వరు? నరసూ' అని అడిగాడు రాజు. ఆ ప్రశ్న చీకట్లో చాలా సేపు తారట్లాడింది.

'ఎవరైతేనేంలే' అంది నరసు అతని జుట్టును సముదాయిస్తూ.

రాజుకి ఆ ప్రశ్నకి జవాబు తెలుసుకోవాలన్న పట్టుదల సడలిపోతోంది. నరసు మెత్తని చేతులు సముదాయిస్తూ ఉంటే, ఆమె మెత్తని మాట ఉపశ్రుతిగా వినిపిస్తూంటే మెల్లిగా కళ్లు మూసుకుని తనకి యిష్టమైన కలలు అల్లుకోవడానికి మళ్ళీ మొదలు పెడుతున్నాడు.

"బాబాయి అంటే మా బాబేలే..." అంటోంది నరసు ..

బాబాయికి ఇదివరకు చాలా డబ్బుండేది. నాటకాల వాళ్ళతో తిరిగేవాడు. నరసు తల్లి ముత్యాలును చూసి ఒకప్పుడు సరదాపడ్డాడు. నాటకాల్లో వేషాలేయించి సినిమాల్లోకి ఎక్కించేస్తా ననేవాడు. ఈ వైనం ముత్యాలు తమ్ముడికి తెలిసింది. ముత్యాల్ని పెళ్ళాడకపోతే, ఇతని డొక్క చీల్చి డోలు కట్టించి, ఇలాంటి 'యదవ నాయాళ్ళ' కథలను ఆ డోలు మీదే దండోరా వేయించాలని ప్రోగ్రాం వేసుకున్నాడు ముత్యాలు అన్నదమ్ముడు.

దాన్ని గనక పెళ్ళాడితే ఆస్తి ఇవ్వనని ఇతగాడి తండ్రీ, నూతిలో దూకుతానని తల్లీ ప్రకటించారు. తల్లిదండ్రుల కార్యక్రమాలకన్నా, బావమరిదిదే కొంచెం ఎక్కువ యిబ్బందిగా ఉన్నందువల్ల నరసు తండ్రి, అప్పట్లో ముత్యాలును వెంటబెట్టుకు చెన్నపట్నం వచ్చేశాడు. ఐదేళ్లు నానా అవస్థా పడ్డారిద్దరూ. ఆనక తండ్రి హరీమన్నాడు. తల్లి ఇంకో నెల్లాళ్ళకి కళ్ళు మూసింది. అప్పుడు ఇతగాడు స్వగ్రామం వెళ్ళి ఇల్లూ, వాకిలీ ఆస్తి చిక్కబట్టుకుని, పూటుగా డబ్బు చేతబట్టుకు చక్కా వచ్చాడు. దరిద్రంతో ఉండగా, ముత్యాలు చాలామంది మాటలు నిజమని... నమ్మేస్తోందని అనుమానం కలిగినందువల్ల ఆమెమీద అతని ప్రేమ దినదిన ప్రవర్ధమానంగా పెరగలేదు. చేతికి డబ్బు వచ్చేసరికి అతగాడికి ముత్యాలు మీద మనసు పూర్తిగా విరిగిపోయింది. బుద్ధిలేదు విశ్వాసంలేదు అని తనకి తానే నచ్చచెప్పుకుని, చెన్నపట్నంలో రైలు దిగేసరికి మనసు ఖరారు చేసుకుని అతను యింటికి వెళ్ళకుండా ఇంకో పేటలో సుబ్బరమైన ఇల్లు తీసుకుని సినిమా తీసే వ్యాపారంలో దిగాడు. ఐదేళ్ళ దరిద్రం వల్ల, కష్టాలూ అవమానాలూ పడినమీదట రాటుదేలాడేమో, డబ్బు వచ్చిన మీదట తెలివిగా మనుషుల్ని వుపయోగించుకోవడం, అవసరం

లేనివాళ్ళని వదుల్చుకోడం నేర్చుకున్నాడు. అతడు కొత్తింట్లో దిగిన నెల్లాళ్ళకి, ముత్యాలు అతని ఎడ్రసు సంపాదించి, వెళ్ళి మొత్తుకుంది. అప్పటికి నరసు నాలుగేళ్ళ పిల్ల.

ఆమె దుఃఖాన్ని వ్యాఖ్యానించడానికి 60 వయొలిన్‌లూ, 600 క్లారియోనెట్‌లూ కూడా చాలవు. లక్షమంది ఎమ్మెస్ రామారావులూ ఆనరు.

'పిల్ల మొకం సూడు' అని కాళ్ళా వేళ్ళా పడి ఏడ్చింది.

'చూశాకనే ఈ నిర్ణయానికి వచ్చాను. అది నా కూతురు కాదు.... నీకూ నాకూ ఋణం తీరిపోయింది...' అని దులిపేశాడు.

ముత్యాలుకు రోత పుట్టింది.

ఆ స్థితిలో మళ్ళీ తన తమ్ముణ్ణి పిలిపించి మొగుడికి ఒళ్ళు హూనం చేయించాలని ఊహపోయినా ఛీ ఎందుకులే అనుకునేటంత అసహ్యం వేసింది.

తరవాత ముత్యాలు మనసు రాయి చేసుకుని పిల్లని పెంచడమే తనకి ముఖ్యం అని నచ్చచెప్పుకుని, అందుకోసం తనకు చేతనైన పద్ధతిలో జీవితాన్ని వినియోగించుకుంది.

ఆమెని కాదని కాలదన్నిన అబ్బికి కూడా రోజులు అంత బాగా కలిసిరాలేదు. అతడు వాటా కలిసిన సినిమా దివాళా తీసింది. అయితే తలకాయలు యధాశక్తి మార్చి ఎలాగో అలా ఓ మేడా కారూ నిలుపుకునే తెలివితేటలు మాత్రం గడించాడు.

ముత్యాలు ముసలిదై, నరసు పెద్దదైంది.

ఓ రోజున సినిమాలో వేషానికి నరసు కావాలని ఒక షాఫరుద్దీన్ వచ్చి ఆమెను కంపెనీకి తీసుకెళ్లాడు.

నరసు తొలిసారిగా తండ్రితో మాట్లాడింది అక్కడే. అంతకుముందు చాలాసార్లు ముత్యాలు అతన్ని దూరం నించి చూపించి అదిగో ఆయనే నీ బాబు అని చెప్పింది. కానీ దగ్గిర కెళ్ళి పలకరించ నివ్వలేదు. ఈసారి అనుకోకుండా ఈ దౌర్భాగ్యపు సన్నివేశం తటస్థపడగానే... నరసు నిలువెత్తున లేచిపోయి, అతన్ని తిట్టిపోసి, ఆనక తనెవరో చెప్పేసింది. తండ్రి దాదాపుగా కూతురు కాళ్ళ మీద పడ్డంత పని చేశాడు. 'నేను మహాపాపిని. నాకు ప్రాయశ్చిత్తం లేదు.' అని కూడా అన్నాడు.

నరసు 'మా యమ్మని మళ్లీ తెచ్చి యింటో బెట్టుకో' అని ప్రాయశ్చిత్తం సూచించినా అతనికి నచ్చలేదు...

ముత్యాలుకీ నచ్చలేదు. "కాళ్ళిరగ్గొడతాను... ఆడు ఈడకొచ్చినా, నువ్వాడకెల్లినట్టు తెలిసినా" అంది కోపంగా.

'ఆడు ఈడకి' రాకపోయినా నరసు మటుకు అడపా తడపా వెళ్ళి పలకరించి వచ్చేది. కొన్నాళ్ళు, ఎవరేనా వున్నపుడు నరసుని పలకరించడానికి భయపడేవాడు తండ్రి. 'బాబాయ్ అని పిలు' అని సలహా కూడా యిచ్చాడు. మెల్లిగా ధైర్యం

తెచ్చుకొని ఆప్యాయంగా చూసుకునేవాడు కూతుర్ని ఒకటి రెండు పత్రికలు ఈ 'కథ'ను సీరియల్‌గా రాయబోయాయి.

'డొక్క చీల్చేస్తాను' అని తన బావమరిది కట్టిన డైలాగుని ఆ పేపరువాళ్ళ ముందర వల్లించి వెళ్ళాడతడు. ఇది చూచి నరసు భయపడింది. 'ఫరవాలేదమ్మా' అన్నాడు తండ్రి. ఫరవా వస్తే అడపా దడపా డబ్బిచ్చేవాడు. ముత్యాలు ఒప్పుకోలేదు

'యదవేసా లెయిమోక. డబ్బిత్తే చేదా యేం. వద్దంటానికి మనవేం సినిమాలో యేసాలం అనుకున్నావా' అని నరసు తల్లిని కోప్పడింది.

ఈ నరసు ఆర్జన ఆరంభించాక హయాం ఆమెకే ఇచ్చేసింది ముత్యాలు; గొణిగే హక్కు మినహా. వారంరోజులనాడు నరసు, వరహాలరాజుకి ఆశ్రయం ఇచ్చిందని వినగానే, బాబాయి మండిపడ్డాడు. ఆనక వాణ్ణొదిలెయ్ అన్నాడు. నరసు వినలేదు. తన కథలాగే కూతురు బతుకూ భయంకరంగా అవుతుందని భయపడి 'ఎల్లుండి తిరపతెళ్ళి పెళ్ళాడెయ్యండి' అన్నాడు. తన విషయంలో ముత్యాలు చేసిన పొరబాటు కూతురు విషయంలో జరక్కుండా ఉండాలని....

మగతలో ఉన్న రాజుకి ఈ కథ లీలగా వినిపించి, లీలగానే అర్థం అయింది. తనకి డబ్బెలా వచ్చిందీ అన్న అతని మొదటి ప్రశ్న ఇంకా చీకట్లోనే తారట్లాడుతోంది. అది తేలక అతను మధన పడుతున్నాడు. ఇపుడు నరసు కథ విన్నాక భయం కూడా వేసింది. జీవితం ఇంత గంద్రగోళంగా ఉంటుందని అతనికి నమ్మకం కలగకపోయినా అనుమానం వేస్తోంది. తన సిలుకు చొక్కా, పరుసూ, నరసూ, కారూ, సినిమా, డైరెక్షనూ అన్నీ పోతాయేమోని భయం వేసింది.

నరసు దగ్గరగా ఉండడం ఆమె చెయ్యి తన చెంపమీద నిమురుతూ ఉండడం మాత్రమే అతనికి నచ్చాయి. చుట్టూరా వెచ్చని చీకటి కొంచెం ధైర్యం కలిగిస్తోంది. ఇంకా తెల్లారాలిగదా. ఈలోగా ఏం జరగదు. అందాకా ఫరవాలేదు అనుకుని, మళ్ళీ పగటికలల ఉత్పత్తికి ఉపక్రమిస్తున్నాడు.

❀ ❀ ❀ ❀

హఠాత్తుగా ఆ చిక్కటి వెచ్చటి చీకట్లో-

చెరువులో రాయిలా, నిశ్శబ్దంలో గావుకేకలా, దాంపత్యంలో ద్రోహంలా, అబద్ధంలో నిజంలా, దరిద్రంలో డర్బీస్వీప్‌లా, ఆశలో నిరాశలా, మబ్బులో మెరుపులా, వీణాగానంలో తీగె తెగడంలా, మామూలు పత్రికలో యుద్ధప్రకటనవార్తలా, మృత్యువులో జీవితంలా, స్నేహంలో వంచనలా, ప్రభుత్వంలో ఓ కుట్రలా, ఈ ఉపమానాల గంద్రగోళంగా వెకిలిగా వింతగా భయంకరంగా సహజంగా అద్భుతంగా హఠాత్తుగా ఆ గది లోపలి చీకటి లోపలి అతని ప్రశ్నకి జవాబులా నూరు కొవ్వొత్తుల వెల్తురు బద్దలయేసరికి రాజుకి ఒళ్ళు ఝల్లుమంది. గుండె గుభేలుమంది. నరసు తుళ్ళిపడి లేచి, చీరె సర్దుకుని నిలబడి 'ఎవరదీ' అంది.

ఖయస్, లైలాలు కూర్చుని కమ్మగా కబుర్లు చెప్పుకుంటూ ఉండగా ముక్కామల కృష్ణమూర్తి 'యింతలేసి' కళ్ళు చేసుకుని, కొరడా ఛెళ్ళు మనిపిస్తూ వచ్చిపడినప్పుడు ప్రేమికుల గుండెలు ఏమయ్యాయో, వాళ్ళు ఎంత ఆశ్చర్యపడ్డారో, ఆ ఘట్టంలో వాళ్ళ భావాల మీద సుబ్బరామన్‌గారు ఎన్ని వాయిద్యాలతో ఎలాటి స్వరాలతో సానుభూతి పలికించారో వరహాలరాజుకీ, లక్ష్మన్నరసుకీ గుర్తుండి ఉండదు. కానీ, ఆ క్షణంలో – ఘనీభవించిపోయిన ఆ క్షణంతోపాటు వారూ కొయ్యబారిపోయారు. లైలా మజ్నూ చూడకపోయినా పైన చెప్పిన ఘట్టాన్ని అనుభవించి ఉంటారు.

ఈ వాక్యాలన్నీ మన సినిమాలలో జరగబోయే ప్రమాదానికి సూచనగా ముందే వినిపించే సంగీతంలా ఉన్నా ముక్కామల కృష్ణమూర్తి వరహాలరాజుని కొట్టే ప్రమాదం మటుకు లేదు.

ఆ గదిలోకి వచ్చిన మనిషి నరసు బాబాయి. అతని చేతిలో కొరడాలేదు. దీపం వెలగగానే లేచి నించుని 'ఎవరూ' అన్న నరసు వెంటనే కొయ్యబారి పోలేదు. 'సువ్వా బాబాయ్' అంది అంత వరకూ మగతలో వున్న రాజు కూడా మెల్లిగా కళ్ళు తెరచి, రెపరెప లాడించి 'మీరా' అన్నాడు

"షటప్. రాస్కెల్. గెరౌట్, చీట్" అన్నాడు బాబాయి తక్కువ మాటలలో ఎక్కువ భావాలు పొదిగి.

రాజు నవ్వాడు. తన వెనక ఎవరో ఉన్నట్టున్నారన్న దురభిప్రాయంతో, వెనకనున్న మనిషిని వెనకేసుకొస్తూ 'కోప్పడకండి సార్. పూర్ ఫెలో' అన్నాడు పెద్ద మనిషిగా.

'షటప్! గెతౌట్' అన్నాడు బాబాయి మళ్ళీ. తెలుగు సినిమా కారులుతీసిన కథనే తీసినట్టు, వేసిన అయిడియానే వేసినట్టు, ఆయనా కొత్త మాటలు తట్టక పాతవే వాడాడు. పాతకథల సినిమాల లాగే అవీ కొంత పనిచేశాయి.

'ఎవరూ నన్నా?' అన్నాడు సూక్ష్మబుద్ధి రాజు చటుక్కున్న వెనక్కి తిరిగి చూసుకుని.

చంద్రలేఖలో సెట్టింగులలా భారీ ఎత్తున వున్న ఒక పెద్దమనిషీ, సన్నగా పొట్టిగా, చూట్టానికి చుంచులా కనిపించు ఇంకో బుల్లిమనిషీ బాబాయి వెనకాల బాక్ గ్రౌండ్ మ్యూజిక్ లా నిల్చుని వున్నారు. కోపంలో మునిగి తేల్తున్న బాబాయికి భాష అందటంలేదని వాళ్ళకు తట్టగానే ఇద్దరూ పుంజుకున్నారు.

"ఆ ఆమా ఉణ్ణెత్తాన్... ఏన్ కదు? ఉణ్ణయ్ నంబి తణ్ పెణ్ణయ్ కుడుక్కనిత్తమాణ నంబ అణ్ణావుక్కు వంజనె సెయ్యలామంద్ర యోజనై ఎణ్ణత్తిల్ ఇణ్ణేరముం వైత్తిక్కొండిరింద కుట్రవాలియే! ఉణ్ణెయ్‌త్తాన్ ఏన్ కుడాదు?" అన్నాడు పెద్దవాడు గుక్కపట్టి.

"అమ్ ఏన్ కుడాదు?" అని వంత పాడాడు చిన్నవాడు క్రింది షడ్జమం నించి పై షడ్జమానికి షికారెళ్ళొచ్చి.

నరసు ఝుడుసుకుంది. రాజు ఆమె వీపు తట్టాడు.

"అల్ల" అని మళ్ళీ పుంజుకున్నాడు పెద్దవాడు. "అల్లే... ఇరండు లక్షం రూబానోటు, ఉరుండురిండియాహ వీట్టిల్ ఇరిందిరిక్కరదంద్రు, మూంద్రు నాళాహ మోసం పణ్ణి పెణ్ణోడ అణ్ణావిణ్ పణత్తయం వాంగ ప్పార్త - యన్ సిన్న కణ్ణే.... ఉణ్ణయ్‌త్తాన్! ఏన్ కూడాదు?" అన్నాడు.

"ఆమ్... ఏన్ కూడాదు" అన్నాడు చిన్నవాడు.

నరసు రెండు చెవులూ మూసుకుని 'బాబోయ్ వాళ్ళని ఆగమను బాబాయ్' అంది అప్పటికి బాబాయి కోపంలోంచి తేరుకుని, మానవుడి స్థాయిని అందేసుకున్నాడు. అయితే తనకూడా వచ్చిన మిత్రులు పుంజుకుంటే, వాళ్ళని ఆపడం ఓ పట్టాన తెమలదని తెలుసు. వాళ్ళు శివాజీ గణేశన్ భక్తులు. గణేశన్, ఎం. జి. ఆర్. నిత్యజీవితంలో కూడా అలా గుక్క తిప్పుకోకుండా రీలు పొడుగు డైలాగులు మాట్లాడుతారని వాళ్ళకి గట్టి నమ్మకం. అందుకని అవి సాధకం చేసుకు మరీ వచ్చారు చెన్నపట్నం. నరసు బాబాయి తీయబోయే డబుల్ వర్షన్ పిక్చరులో తమిళచిత్రంలో వాళ్ళు వేషాలు వేసే ప్రమాదం ఏర్పడింది. రెండు జిల్లాల డిస్ట్రిబ్యూటర్లు వీళ్ళుంటే డబ్బిస్తామన్నారు.

"లాభం లేదు తల్లీ - వాళ్ళు ఆగరు...."

"అల్లె...." అంటున్నాడు పెద్దవాడు మళ్ళీ.

వాళ్ళ గోల అణచడానికి బాబాయి కూడా అరిచాడు "వీళ్ళు ఆగరమ్మాయ్" అని.

లక్ష్మినరసుకి ఒళ్ళు మండిపోయింది. చెంగు బిగించింది. దగ్గిరున్న పళ్ళెం తీసి విసిరింది. దెబ్బ తగిలిన అరనిమిషానికి డైలాగు పూర్తి చేసి ఆగి, "అప్పా - కణ్మణీ ఎణ్ణయే అడిత్తాయే!" అన్నాడు.

"నోరుముయ్, మళ్ళీ మాటాడితే మక్కె లిరగదంతా యదవగోల యదవగోలాని" అంది నరసు.

"అయితే ఏమిటంటారు వాళ్ళు మావగారూ?" అన్నాడు రాజు సిగరెట్లు తీస్తూ.

"ఛప్ గెతౌట్" అన్నాడు బాబాయి.

ఆయనకింకా కోపం పోలేదనడానికి భాషణలో పునరుక్తి దోషం నిదర్శనం.

"నీ గురించే. నువ్వేదో టోకరా ఇచ్చినా వంటన్నారు. రెండులక్షల డబ్బు యింటి కాదుందని అబద్ధాలు సెప్పి, మా బాబాయిని మోసం సేసినావంట. నన్నూ, మా బాబాయికాడ డబ్బునీ తీసుకు లగెత్తాలని సూత్తన్నావంట.... అంతేనా బాబాయ్!" అంది నరసు.

"ఔను, దొంగవెధవ... మోసకారి. దగాకోరు. నాకే టోకరా యిస్తాడూ. ఎవడనుకున్నాడో సుబ్బన్నంటే" అన్నాడు బాబాయి.

   

"థాంక్యూ సార్" అన్నాడు రవణ.

సుబ్బన్న వెనక్కి చూసి "నువ్వెవడవోయి" అన్నాడు విసుగ్గా.

"మీరు ముందర ఆశ్చర్యపోవాలండి. అర్థరాత్రిపూట ఎలా ఎందుకు వచ్చావు అని, తరవాత నా చిరునామా అడగాలి... పోన్లెండి నా పేరు రవణ. ఈ కథ రాస్తున్నాను. మీ పేరు తెలీక బాబాయి అనీ, నరసు నాన్న అనీ రాయలేక అవస్థ పడుతున్నాను. పేరుచెప్పారు అందుకు థాంక్సు" అన్నాడు రవణ.

"సంతోషించాం గాని గెటవుట్."

"సార్. మీకు యింత ఉపకారం చేస్తున్నా కృతజ్ఞత చూపకుండా పొమ్మంటున్నారు గదూ!" అని వెళ్ళిపోయాడు రవణ.

కృతజ్ఞత అన్న మాట వినగానే సుబ్బన్న వీరభద్రుడై పోయాడు. (అందుకే ఫేడౌట్ అయిపోయాడు.)

సుబ్బన్న ఒక్కసారిగా వరహాలరాజు మీదికి విరుచుకు పడ్డాడు.

"ఇంకా యేం నించున్నావురా? లక్షన్నర ఆస్తి వుందనీ, ఫిలిం తీస్తాననీ బుకాయించి తిష్ట వేస్తావూ? డబ్బు తింటావు? విశ్వాసం లేకుండా. నీ గుట్టు తెలిసిపోయిందిలే. బికారివెధవా. దగాకోర్. ఫో" అన్నాడు.

"ఏదో ఒకటి తేల్చుకోండి. అతను దగాకోరు అయితే బికారి వెధవగా ఎలా ఉండగలడు?" అన్నాడు రవణ నేపథ్యంలోంచి.

నరసుకి కూడా తండ్రి తరహా నచ్చలేదు. ఆమె మనసుకి కష్టం వేసింది.

"అలా తిట్టకు బాబాయి. ఆడు నా మొగోడు..." అంది.

"నీకూ వాడికీ రుణం తీరిపోయింది. వాడితో మాటాడితే చంపేస్తా... బయటికి పోరా" అంటూ రాజు మెడ మీద చెయ్యేసి గెంటేశాడు సుబ్బన్న.

ఈ గొడవకి అప్పుడే నిద్రలేచి వచ్చి అంతా చూస్తున్న రాయుడికి ఢీ కొట్టాడు తూలిపడ్డ రాజు.

ఆప్తమిత్రుడిని చూడగానే దుఃఖం పొంగివచ్చింది రాజుకి. "చూశావా రాయుడూ. మావగారు ఎంత అన్యాయం చేస్తున్నారో" అన్నాడు.

రాయుడు తమాషాగా నవ్వి "సార్, మీరు పొరబడుతున్నారు. నన్ను ఫ్రెండో ఎవరో అనుకుని సారీ. ....నా పేరు అంజనేయులు" అన్నాడు మర్యాదగానే.

రాజు తుళ్ళిపడి మిత్రుడి మొహంలోకి తేరిపార చూశాడు.

"నా మిత్రుడే! రాయుడే ఈ మాటన్నది!" అన్నాడు.

"కాదయ్యా, అంజనేయుల్నంటూ ఉంటే!" అన్నాడు రాయుడు.

నరసు రాజు దగ్గిరికి వెళ్ళబోయింది.

రాజు 'నరసూ' అన్నాడు. నరసు 'రాజూ' అంది.

సుబ్బన్న హూంకరించి, ఒక గెంతువేసి రాయుడినీ రాజునీ కూడా కలిపి తలుపవతలికి తోసేసి, తలుపేసి హూంకరించాడు మళ్ళీ.

బయట హోరున వాన కురుస్తోంది.

రాజూ, రాయుడూ వరండాలో ఓ మూల కూర్చున్నారు.

'నిజంగానే నీకు డబ్బులేదా రాజూ?' అన్నాడు రాయుడు.

'ఉంది' అంది ఆకాశవాణి రవణ గొంతు వేషం వేసుకుని.

"ఉందట. లేకేం" అన్నాడు రాజు.

"చూశారా రాజుగారూ.. ఇదే ప్రపంచం. విశ్వాసం ఉండదు" అన్నాడు రాయుడు సగౌరవంగా.

రాజు మాటాడలేదు.

"యస్సార్. కృతజ్ఞత అనేది ఎక్కడా లేదు. చూడండి. మీ ప్రేయసి నరసు... మీ మావగారు... వీళ్ళంతా తమరు పరమ దరిద్రులని తెలియగానే ఎలా వదిలేశారో... కృతజ్ఞత అంటే ఓ కధ జ్ఞాపకం వచ్చింది... పాపం జమన్‌లాల్ టోక్రానీ, దిల్రుబాలా ఇంకా నా కళ్ళముందు మెదుల్తూనే ఉన్నారు... నే నప్పుడు బొంబాయిలో ఉండేవాణ్ణి. టోక్రానీ సింధీవాడు లెండి..."

# మూషికోదంతము



రాయుడు దిబ్రులబాల రోక్రానీల విషాద గాథ మొదలు పెట్టేవరకు ఎదురుగా గేటుదగ్గర కారు ఒకటి ఆగింది. డ్రైవరు ఇవతలికి వచ్చి గేటు తీసి, బండి తోలుకుని లోపలికి వస్తున్నాడు.

"లేవండి సార్, లేచి నుంచుని ఈ సిగరెట్టు కాలుస్తూ పోజులో నిలబడండి చెప్తా" అన్నాడు రాయుడు హఠాత్తుగా లేచి నిలబడి. రాజుకి బుర్ర పనిచేసేలోగానే శరీరం రాయుడి ఉత్తర్వును అమలు జరిపింది. అంతలోకీ కారు పోర్టికోలో ఆగింది. అందులోంచి నల్లటి గుండ్రటి శాల్తీ దిగి, అడ్డకట్టు లుంగీ ఓ సారి సరి చేసుకుని "అణ్ణా ఇల్లెయో?" అంది తెల్లగా నవ్వి.

రాయుడు వెంటనే జవాబివ్వలేదు. "ఎవరు సుబ్బన్నగారేనా? లేరు. బెంగుళూరెళ్ళారు" అన్నాడు ఎటో చూస్తూ. రాజేదో అనబోయి రాయుడు గిల్లగానే ఆగిపోయి, తెల్లబోయాడు. ఆ వైనం చీకట్లో ప్రేక్షకులకు కొట్టొచ్చినట్టు కనబడనందువల్ల, రాయుడు పచ్చి అబద్ధాలు ఆడుతున్నట్టు పసిగట్టడానికి వీలు లేకపోయింది.

ఆ వచ్చిన పెద్దమనిషి నొచ్చుకున్నాడు. "అ... చ్చొ... చ్చొ... చుప్పణా ఉంట్రని దానే వస్తిణీ. నేటికి షో ఉణ్ణని నాన్నా చెప్పి ఉంట్నె. పద్దుకొండు గంటకు బండి తెస్తునని కూడా చెప్తినే. యేమి ఇది. నిండా అక్రమంగా ఉందే" అన్నాడు జనాంతికంగారుగా.

రాయుడు గొంతు సరిచేసు కున్నాడు.

"అదేనండి చెప్పారు. అర్జెంటు పనిగా బెంగ్లూరు..." అన్నాడు. తరవాత 'మీరు రాజన్‌గారు' అని ఆరోపించాడు. ఆయన ఫస్టు పిక్చరు పెద్ద హిట్టయిందని ఉద్ఘాటించాడు. దారుణమైన హిట్టు అని పునరుద్ఘాటించాడు. ఇపుడు కాష్ట్యూము పిక్చరు తీశారు అని వెల్లడించాడు. ఇది గారంటీ హిట్టవుతుందని హామీ ఇచ్చాడు. భయపడద్దనీ ఉద్ఘోషించాడు. ఆ తరవాత వీరు రాజుగారు. ప్రొద్యూసరు. పై పెచ్చు సుబ్బన్నగారికి అల్లుళ్ళు" అని పరిచయం చేశాడు రాజుని.

"రొంబ సందోషం. అది సరిదా... అప్పొ తాంగళ్ యార్?" అన్నాడు రాజన్‌గారు ఆనందవర్ధనుడై.

రాయుడు సిగ్గుపడ్డాడు. "యేవిటో మన్నిగురించి మనం చెప్పుకోకూడదుగాని మనం కారెక్టరార్టర్లం, విలన్లం లెండి. రెండు మూడు హిట్ పిక్చర్లలో చిన్నవేషాలు కూడా వేశాం" అన్నాడు.

మళ్ళీ పాత సమస్య వచ్చింది రాజన్‌కి. సుబ్బన్నగారు లేరు గాబట్టి ఏంచెయ్యాలి అని.

వారి అల్లుడుగారిది చాలా మంచి చెయ్యి అని వెల్లడి చేశాడు రాయుడు. రాజు తక్షణం సిగరెట్టు పారేసి చేతులు వెనక దాచుకున్నాడు. రాయుడు బలవంతాన వాటిని ముందరికిలాగి రాజన్ చేతిలో పెట్టాడు. ఆనక, రాజు హస్తవాసిపడి హిట్టయి ఊరుకున్న హిందీ, మలయాళ, తమిళ పిక్చర్ల జాబితా ఒప్పగించాడు.

రాజన్ పరమానంద భరితుడైపోయి, రాజుని కౌగలించుకొని, "మీరు వచ్చిదా కావలె సార్. పిక్చరు చూచిదా కావలె. మాకు మీ బ్లెస్సింగ్సు ఇచ్చిదా కావలె" అని అతన్ని లాక్కుపోయి కార్లో కూచోపెట్టి తను ఎక్కాడు. ఆనక ఏదో తోచి, "సార్ మీరుకూడ వస్తురా" అంటూ వరండాలోకి చూసి అన్నాడు.

"నేను వచ్చిదా కావలె. రాజు ఎక్కడ పోతే అక్కడ ఉండిదా కావలె" అన్నాడు రాయుడు కారు సీటు అవతల మూలలోంచి.

రాజన్, ఈ చురుకుదనం చూసి ఆశ్చర్యపడి లేవడం మరిచిపోయి కునికిపాట్లు పడసాగాడు.

రాజుకి నోటమాట రాలేదు.

కారు నేరుగా... స్టుడియోలో, ప్రివ్యూ థియేటర్ దగ్గిర ఆగింది. ఆరుబయట కుర్చీలు వేసి ఉన్నాయి. ఇద్దరు కుఱ్ఱాళ్ళు బీడీ కాలుస్తున్నారు, రాజన్ కారు దిగుతూనే రాజునీ, రాయుణ్ణీ కూర్చోమని, కుఱ్ఱాళ్ళని ఎటో పంపి, తను మరోవైపు వెళ్ళాడు హడావుడిగా.

"ఏమిటిదంతా బ్రదర్" అన్నాడు రాజు దగ్గర్లో ఎవరూ లేకుండా చూసి.

"మీకు తెలీదాండి. ఇంకా తెలీలేదా?" అన్నాడు రాయుడు ఆశ్చర్యంగా.

"వెధవేషాలెయ్యక చెప్పు" అన్నాడు రాజు ముక్తసరిగా.

రాయుడు జాలిపడ్డాడు.

"మీరు లాభంలేదు సార్ సినీఫీల్డుకి.. ఇవన్నీ తెలీపోతే రేప్పొద్దున్న పెద్ద ప్రొడ్యూసరెలా అవుతారు?... ఇప్పుడు మన్ని తీసుకొచ్చేదే రాజన్‌గారూ. ఈయన టమిల్ ప్రొడ్యూసరన్నమాట. ఈయన మొదటి పిక్చరు తీసినప్పుడు ఓ తమాషా అయింది. అవాళా ఇలాగే మే 13తారీకు పన్నెండింటికి రాహుకాలం లేదని ఈయన షో వేసుకుంటున్నాడు. ఇక్కడ అలా వేస్తారులే. డిస్ట్రిబ్యూటరూ, స్టార్లూ వాళ్ళవాళ్ళూ చూడడానికని. ఏం. అవాళ మీ మామగారు సుబ్బన్నగారు ఇక్కడే తిరుగుతున్నారు, ఎవరన్నా కారులో లిఫ్టిచ్చి మాంబళంలో దిగబెడతారేమోనని, ఆయన కారు చెడిపోయింది. సరే ఇంతలోకి రాజన్ ఆయన్ని పలకరించాడు. ఓ నాలుగు గంటలాగితే తను దిగబెడతానన్నాడు. అప్పటికి వీళ్ళకి కొంచెం పరిచయం ఉంది. సరే, సరేనన్నాడు మీ మావగారు. అయితే వచ్చి మా ఫిలిం చూడండి అని పిలిచాడు రాజన్. ఫిలిం మొదలెడుతుండగా ఎలకోటి తెర దగ్గర్నుంచి పరిగెట్టి వెళ్ళింది. అప్పుడు మీ మావగారు ఎగిరి గంతేసి, 'మీ పిక్చరు హిట్టవుతుంది రాజన్‌గారూ. ఈ స్టుడియో ఎలక చాల లక్కీఎలక, షో వేసినపుడు గాని, రికార్డింగు టైములో గాని ఇది కనిపిస్తే ఆ పిక్చరు హిట్టేనూ' అని చెప్పాడు. రాజన్‌కీ ఆ సంగతి కొద్దిగా తెలుసు.

ఆయన పొంగిపోయాడు ఆనందంతో. 'నిజమేనండీ జుప్పణ్ణాగారూ! మా పిక్చరు ఫస్టుసాంగు రికార్డింగు టైములో కూడా ఈ ఎలికిదా వచ్చిందీ' అని చెప్పాడు.

అప్పుడు సుబ్బన్నగారు నవ్వి. "ఈ ఎలక రావాలని ఎందరో తపస్సు చేస్తారండీ రాజన్‌గారూ. – టేకు పాడైనా సరే ఇది ఒక్కసారి కనిపిస్తే లక్షలు కుమ్మరిస్తారండీ బాబూ. మీరు గొప్ప అదృష్టవంతులు బాబోయ్! కాబట్టే వచ్చిందండి అన్నాడు. అంతలోకీ–"

❀ ❀ ❀ ❀

అంతలోకీ ఒక రాజకుమారుడు అలా వెళ్తున్నాడు. ఎవరో ఎక్కడినించో ఓ మంగళహారతి పళ్ళెం పట్టుకు వచ్చారు. అతడు హారతి కళ్ళ కద్దుకుని, మూడు గుంజీలు తీసి ప్రసాదం పుచ్చుకుని, కారెక్కి వెళ్ళిపోయాడు.

అదేమిటన్నాడు గుడ్లప్పగించి చూస్తున్న రాజు.

"వాళ్ళో పిక్చరు తీస్తున్నారులే. ఇవాళ క్లయిమాక్సుసీను తీశారు. అందులో దేవుణ్ణి కోప్పడం అదీ ఉంటుంది. ఎందుకేనా మంచిదని షూటింగు ముందరా, అయిపోయాకా రెండు పూజలుచేసి హారతి పుచ్చుకు మరీ తిడతారులే... నీకు తెలీదా? తరవాత ఈ ఫిలిం డబ్బాల సెట్టు ఒకటి తిరుపతి వెళ్తుంది. అక్కడ స్పెషలు పూజా, హారతీ అయ్యాకనే పిచ్చరు రిలీజు చేస్తారు. దేవుడితో గొడవ గదా. వీళ్లు తిట్టినట్టు దేవుడు లేకపోతే ఫరవాలేదు గాని, ఉంటే పగబట్టి పిచ్చరు హిట్టవకుండా చెయ్యొచ్చు గదా. అంచేత" అన్నాడు రాయుడు గంభీరంగా.

"హొరా" అన్నాడు రాజు.

"హొరాలేదు కలకత్తాలేదు. వినండిసార్. ఏం చివరికి రాజన్ సంగతి ఏమైందో తెలుసా, ఆ పిచ్చరు సిల్వర్ జూబిలీలు చేసుకుంది. అప్పట్నించి రాజన్‌కి ఆ స్టుడియో ఎలకన్నా, మీ మావగారన్నా మహాగురి. ఆ పిచ్చరుకి మే 13 న అర్ధరాత్రి షో యిచ్చారుగదా. అది హిట్టయింది. అందుకని ఈ పిచ్చరుకీ మే 13నే అర్ధరాత్రే ఇస్తున్నారు. అవాళ సుబ్బన్నగారు ఆ పిచ్చరుచూసి రాజన్ కారులో పానగల్ పార్కు దాకా వెళ్ళారు. ఇవాళా అలా చేద్దామనే ఇతను ఇందాకా వచ్చాడు. మీరు ఆయన అల్లుడని, మీ హాండుకూడా లక్కీదని చెప్పబట్టి మన్ని పిల్చాడన్నమాట."

"మరి ఎలకో"

"ఎలక వస్తుంది. మీ మావగారు లేకపోతే, ఎలకా రాపోతే ఇవాళ షో అసలు వెయ్యరంతే... చూళ్ళే ఇప్పుడు రాజన్ గబగబా పరిగెత్తాడు. ఎందుకని?" అన్నాడు రాయుడు.

'ఏమో.'

'ఎబ్బే లాభంలేదు. ఉల్లిపాయ పకోడీలు చల్లితే ఎలక ఎక్కడున్నా వస్తుందని ఆయనకి ఆశ. అందుకని పకోడీలు తెప్పించడానికి పరిగెత్తాడు. ఈ మాత్రం తెలీదా?" అన్నాడు రాయుడు హేళనగా.

'తెలీదు' అన్నాడు రాజు.

"అయితే మీరు లాభంలేదు."

రాజు ఆబలిళ్చి, "ళ్ళిద్దడొస్తోల్‌ది" అన్నాడు.

రాయుడు నవ్వాడు లాలనగా. "హాయ్... అమ్మయ్య... అలా ఆబలిళ్చి గల్డి... హాయ్... చూస్తే హేవేళా ఆళుకుంటాడు రాజన్‌గారు" అన్నాడు.

కానీ రాజన్‌గారు ఆ క్షణాన వీళ్ళని చూడకుండానే వీళ్ళగురించి . చాలా అనుకుంటున్నాడు. సాధ్యమైనంత త్వరలో చూడాలని ఉవ్విళ్ళూరుతున్నాడు. 'మట్టపప్పిసింగో' అంటున్నాడు పళ్ళు గిట్టగరచుకుని కోపం అదుపుచేసుకుంటూ. చూశాక ఏం చేస్తాడో ఆయన క్లూ యివ్వటంలేదు గాని, ఆయనవెంట దూకుడుగా అంగలేస్తూ వస్తున్న సుబ్బన్నగారుమటుకు భారీఎత్తున కార్యక్రమాలను ప్రకటిస్తున్నాడు.

రాజునీ రాయుణ్ణీ జాయింటుగా తాళ్ళతో కట్టేసి, హైపవర్ దీపాల కింద పడుకోబెట్టి స్విచ్చి నొక్కడం, రెండు మూడు గజాల తమిళ డైలాగును వాళ్ళ చెవి దగ్గర చదివింపించడం తరవాత చావగొట్టి చెవులు మూసి మూర్ఛపోకుండా చూడడం ఆయన తాత్కాలిక కార్యక్రమావళిలో తొలి అంశాలు. ఇవికాస్త అటూ యిటూ మారినా ఇద్దరు వెధవాయిలకీ చెరి అడజను చెంబుల స్టుడియో కాఫీ పట్టిం చెయ్యాలి అన్న శిక్షలో మాత్రం అరకప్పు కూడా తగ్గించనని ఆయన శపథం పట్టాడు.

దొంగ వెధవలు అన్నాడు. ఓ క్షణం ఆగకుండానే దగాకోరులు అన్నాడు. నన్ను మోసం చెయడం గాక నా పేరుతో మిమ్మల్నీ మోసం చేస్తారా రాజన్ సార్! అన్నాడు.

రాజన్ ఒగురుస్తున్నాడు ఉద్రేకంతో. "ఆమా సార్.. వాడి మూంజి బాగనే లేదు. నాకు మొదుట్నే పట్టలేదు ఏమ్రా వీడి మూతి దొంగపిల్లకాయ మాదిరిగా ఉండాది. చుప్పణ్ణాఖారూ వీట్లే లేదంటా దేమ్రా. నంబకిట్ట కతె పుడుస్తున్నాడా అని నిండా యోచన సేస్తిని... య్యేమొ ఒక సమయం అట్టదా ఉండవచ్చు. అట్లని ఎంచిదా ఈ తొంగక్కిల్లాడి పిల్లకాయల్ని బండిలో పెట్టి తోలుకు వస్తే, కర్మ అడ కడవుళే. అద్దోపారు... కూచుకుని ఉండారు. కొర్రంగు పస్సంగో... చుప్పణ్ణాసార్! మీరు పోతూనే ఒద ఒద అని కొట్టి ఊడ్చండి. తిర్రట్టి ర్రాస్కెల్. అయ్యోగ్యప్పయె." అంటూ ఉత్సాహంగా అడుగేసి, 50 అడుగుల దూరాన ఉన్న రాజునీ, రాయుణ్ణీ చూపించాడు.

❀ ❀ ❀ ❀

చదువరీ! రాయుణ్ణీ రాజునీ గెంటేసి తలుపేసుకున్న సుబ్బన్నకి ఆ రోజు రాత్రి... స్టుడియోలో రాజన్ తమిళ చిత్రం షో వుందని తెలుసు. ఎటొచ్చీ, వచ్చి వెళ్ళాడని మటుకు తెలీదు. సుబ్బన్న ఒక గంటసేపు చూసి, కారు తీసుకుని తనే బయల్దేరాడు రాజన్ ఏ కారణం వల్ల రాలేదో అనుకుని – తీరా స్టుడియో కెళ్ళే సరికి ఉల్లిపాయ పకోడీలు పురమాయించడానికి గేటుదాకా వెళ్ళిన రాజన్ కనబడ్డాడు. ఇద్దరూ యథాశక్తి తెల్లబోయి మళ్ళీ యథాప్రకారం నల్లబడ్డాక, "మీరు బెంగ్లూరు బోతిరని, మీ అల్లుడిని తోలుకొస్తిని. నిండా మంచివేళ మీరే వస్తిరి." అన్నాడు రాజన్ సంతోషంగా.

సుబ్బన్న భగ్గుమన్నాడు. వేడి ఆరాక తనకు తోచిన కొద్ది మాటలలో రాజూ రాయుడూ తనకు టోకరాయిచ్చిన రాక్షసులని వెల్లడించాడు. అపుడు ఆ యిద్దర్నీ తన్నడానికని ఈ ఇద్దరూ దూకుడుగా ప్రీవ్యూ థియేటర్‌కు బయల్దేరి వచ్చారని చదువరికీ రవణకీ తెలుసుగాని, కుర్చీలో కూర్చున్న రాజూ, రాయుడూ కల్లోగూడా అనుకోలేదు; కునికిపాట్లు పడుతున్నప్పటికిన్నీ. అందువల్ల సుబ్బన్న రాజన్ ల కార్యక్రమం జయప్రదంగా నెరవేరింది.

❀ ❀ ❀ ❀

రాత్రి రెండయింది.

కోడంబాకం హైరోడ్డుమీద ఇద్దరు పాంథులు మెల్లిగా నడుచుకుంటు కుంటూ ఒకళ్ళనొకళ్ళు ఓదార్చుకుంటూ వెళ్తున్నారు. ఈలపాట వినబడటం లేదు. కాబట్టి వారు షికారె ళ్తున్నారని పొరబడలేము. దగ్గర కెళ్ళి, సెర్చిలైటు, లేపోతే టార్చిలైటు వెలిగించితే, వాళ్ళిద్దరిలో ఒకడు వరహాల రాజు అనీ, రెండోవాడు రాయుడు అనీ సూక్ష్మబుద్ధులు చప్పునే పసిగట్టగలరు.

రాజు దవడలు రెండూ పొంగి వుండడం, రాయుడు మొహం ఉబ్బి ఉండడం చూసి వాళ్ళిద్దరూ గ్లాక్సో బేబీలకి ఎన్‌లార్‌జ్‌డ్ ఎడిషన్స్ అనుకోదలచుకున్నా, ఆ ఊహ కొద్ది వీళ్ళు దేశవాళీ సినిమాలో హీరో వేషాలకి రంగున సరిపోతారనుకో దలచుకున్నా, కమిలిపోయిన రాజు కుడికన్ను నలుపు చూసి అది బ్యూటీస్పాట్ అని దురభిప్రాయ పడదలచుకొన్నా సదరు వ్యక్తులు అలా అనుకోడానికి ముందు చట్టవిరిగేలా పొరపడి అందుకు ముందు తప్పులో కాలువేయాలి.

❀ ❀ ❀ ❀

'కాళ్ళు పీకుతున్నాయి' అన్నాడు రాజు.

"హు. నాకు జీవితమే పీకుతోంది' అన్నాడు రాయుడు నీరసంగా.

రాజు మాటాడలేదు.

రిక్షా ఎక్కుదామని ఊహ పోయింది రాయుడికి.

డబ్బుల్లేవని జ్ఞాపకం వచ్చింది రాజుకి.

రిక్షాని తిన్నగా సుబ్బన్నగారింటికి పట్టించి - ఆయన ఇపుడు స్టుడియోలో ఉన్నాడు కాబట్టి - లక్షిన్నరసుని డబ్బు లడగవచ్చన్న ఉపాయం తట్టింది రాయుడికి.

కాని ఆవేళకి సుబ్బన్న తిరిగివచ్చివుంటే, 'మళ్ళీ ఇక్కడికి తయారయ్యారా' అని మళ్ళీ చితగ్గొట్ట వచ్చునని అనుమానం కలిగింది రాజుకి.

లక్ష్మిన్నరసు అడ్డుబడదా? ధర్మపత్నిగదా! అని ఆశపడ్డాడు రాయుడు.

ఏమో ఎలాగేనా 'ఫీమేల్సు' గదా అని నిరాశ పడ్డాడు రాజు.

రాయుడు మాట్లాడలేదు.

❀ ❀ ❀ ❀

'కాళ్ళు పీకుతున్నాయి' అన్నాడు రాజు.

'జీవితమే పీకుతోంది' అన్నాడు రాయుడు.

రాజుకి కోపం వచ్చింది.

'ఇందాకోసారి చెప్పావు. ఇంకా ఎన్నిసార్లు వెధవ డైలాగూ వెధవ నువ్వూను' అన్నాడు.

రాయుడు బాధగా నవ్వాడు.

'హు. - మహా హీరో ఛాన్సిచ్చిన ప్రొడ్యూసర్లా మాట్లాడావే నా డైలాగు గురించి! నేను గట్టిగా ఓటిచెప్తే గుమ్మైపోతావు మళ్ళీ... విను....

కార్లో కావాలని మన్ని తీసుకొచ్చి క్రైమాకింద కొట్టి కేవలం వెధవలుగాకట్టి కనికరం లేకుండా కాళ్ళు పీకుతున్నా, కాలం ఎంతయిందో గమనించకుండా, కడుపులో కరకర మంటున్నా కాఫీయేనా లేకుండా, కాలదన్ని-"

"ఆపెయ్... కట్... స్టాప్... హోల్డాన్... క్లోజ్ ప్లీజ్" అన్నాడు రాజు కఠినంగా.

"నాకేం ఓపిక లేదండి. మీరు తిట్టారనే..."

"ఆమాత్రం తిట్టకూడదా. నీకు యజమాన్ని గదా. కోప్పడ్డానన్న కసికొద్దీ అలా కకారపు కర్కశపు, కర్నాటకపు డైలాగులతో నన్ను ఖడల కొడతావా క్రూరుడా నీకు కృతజ్ఞత లేదా?" అన్నాడు రాజు కోపంగా.

రాయుడు దిగులుగా నవ్వాడు. ఉన్న ఒక్క బీడీముక్కా పారేసుకుని హా విధిలీల! అనుకున్న బైరాగిలా!

"అనండిసార్. అనండి. ఆఖరికి మీకుగూడా కృతజ్ఞత లేదండి. హు. ఆ నరసూ, దాని బాబాయీ మీకు డబ్బులేదని పుకార్రాగానే వదిలేశారు. మీ చెయ్యి మంచిదని షో చూపటానికి కార్లో తీసికెళ్ళిన రాజన్, మీరు వెధవలు అని తెలిగానే ఈ అర్ధరాత్రిపూట మిమ్మల్ని వెళ్ళగొట్టి కోదంబాక్కం రోడ్డు పొడుగు కొలవమన్నాడు. వాళ్ళని మీరు తిట్టలేదు. పై పెచ్చు నన్నంటున్నారు విశ్వాసం లేదని. ఇలాగే ఉంటుంది లోకం. అన్నట్టు ఇందాక రోక్రానీ కథచెబుతూ ఉండగానే కదూ ఈ రాజన్‌గాడొచ్చి గొడవ పెడత? వినండి చెబుతా..."





రో క్రానీ మారువేషంలో ఉన్న మహానుభావుడు. త్యాగమూర్తి. కేవలం ఒక స్నేహితుడి కిచ్చిన మాటకోసం, అతనిపట్ల విశ్వాసం కొద్దీ ఒక సైతానులాటి సెక్స్ర్టాకు ఆశ్రయం యిచ్చి అయినవారికీ కానివారికీ కూడా చెడ్డవాడై ఉద్యోగం పోగొట్టుకుని, భవిష్యత్తు నాశనం చేసుకొని ఇప్పుడు స్వగ్రామంలో డాల్మోట్ అమ్ముకు బ్రతుకుతున్నాడు.

నేను బొంబాయిలో హీరో నవుదామని వెళ్ళినపుడు రోక్రానీ ఒక మంచి గుడ్డలకంపెనీలో గుమాస్తా చేస్తున్నాడు. నేను వాళ్ళ యింట్లో అద్దెకుండేవాణ్ణి. పని లేక రోక్రానీతో పాటు, కొట్టుమీదే కూర్చుంటూండేవాణ్ణి. ఆ కొట్టు యజమానికి ఒక చిన్న ఫిలిం డిస్ట్రిబ్యూషన్ కంపెనీలో బుల్లివాటా ఉండేది. ఆ సంబంధాన్ని బట్టి సినిమావాళ్ళు కొందరు ఆ కొట్టులోనే గుడ్డలు కొనేవాళ్ళు. కొన్ని కంపెనీలలో వేషాలకి కావలసిన గుడ్డలన్నీ అక్కడే బేరం అయ్యేవి. అసలందుకే అతను డిస్ట్రిబ్యూషన్ వ్యాపారంలో వాటా కలపడం అనుకోండి. సరే ఆ కొట్టుకి గిరిధర్లాల్ అని ఒక కాబోయే ప్రొడ్యూసరూ, అతని నెస్టు పిచ్చర్లో హీరోయిను వేసే

దిలు్రబాలా తరచు వస్తూ ఉండేవాళ్ళు. దిల్రుబాల అసలు పేరు సీతానీలెండి. సింధీ పిల్ల. చిదిమి దీపం పెట్టొచ్చు. అంతచక్కని చుక్క. దానికి పూర్వాశ్రమంలో ఒక్క మొగుడు నలుగురు పిల్లలూ వుండేవాళ్ళు. గిరిలాల్ తన షాడో ఫిలింయూనిట్‌కి తారలు కావాలని ఎడ్వర్టయిజ్‌మెంటు చేస్తే ఈ పిల్ల అప్లికేషను వేసి చక్కావచ్చింది. ఆ వెనకాలే మొగుడూ, పిల్లలూ వచ్చారు. చాలా గొడవైంది లెండి. మా కాపరంలో చిచ్చు పెడతావా అని గిరిలాల్‌తో పోట్లాడాడు ఆ వెర్రిబాగుల మొగుడు. పిల్లలు ఏడిచారు. అతను ఏడిచాడు. నాదేముంది తీసుకెళ్ళండి అన్నాడు గిరి. కాని, ఈ సీతానీ కదిల్తేనా? నీ సీతానీ ఎప్పుడో చచ్చిపోయింది. ఫోఫో. నా పేరు దిల్రుబాల అంది. చేసేదిలేక ఓ యేడుపు ఏడిచి వెళ్ళిపోయాడు మొగుడు పిల్లల్ని తీసుకుని. ఆ గొడవలో మా నేస్తం రోక్రానీ పెద్దమనిషి పాత్ర ధరిచి గిరిలాల్‌కి మాట సాయం చేశాడు. అంచేత గిరిలాల్ రోక్రానీకి తన 'షాడో యూనిట్'లో కారెక్టరు వేషం ఇస్తానన్నాడు.

'షాడో యూనిట్ అంటే మీకు తెలీదా? సినిమాలో సోమలింగాలన్నమాట. డబ్బూ గిబ్బూ లేనివాళ్లు అది వస్తే గిస్తే తియ్యబోయే రైటర్లూ, నటులూ, పాటగాళ్ళూ అందులో ఉంటారు. ఇప్పుడు ఈ గిరిలాల్ ఉన్నాడే ఇతను ఓ పెద్ద సినిమా ప్రొడ్యూసర్‌కి సెక్రటరీ. ఎప్పుడో అప్పుడు అతనికి డబ్బు వస్తుంది గదా. అప్పటికి పలుకుబడి రెడీగా ఉంటుంది. అప్పుడు తీసే పిచ్చరుకి ఇప్పట్నించీ అయిదారు కథలు రాయించుకుని ఉంచుకుంటాడు సినిమా కవులు కావాలని తహతహలాడే వాళ్ళచేత. అలాగే కొందరు వర్ధమాన నటులకీ, మ్యూజిక్ డైరెక్టర్లకీ ఆశలు పెడుతూ ఉంటాడు. ఇదన్నమాట 'షాడో యూనిటు.' ఇంగ్లాండులో షాడో కాబినెట్‌లు ఉండవు? అలాగ. ఇలాటి షాడో కంపెనీలు ఫీల్డులో బోల్డు ఉంటాయి. సెక్రటరీలు, ప్రొడక్షను మానేజరు, డిస్ట్రిబ్యూషను ఆఫీసు మేనేజర్లూ, కారూ, షేరు వగైరా. బ్రోకర్లు ఎక్కువగా వీటిని నడుపుతూ ఉంటారు. ఏం? ఇపుడు సీతానీ అనే దిల్రుబాల చేరింది గిరిలాల్ షాడో **యూనిట్‌లో**. ఆమె అసలు ఫిలిం పేరు దిల్రుబా. అయితేనేం. న్యూమరాలజీ ప్రకారం ఓ అక్షరం తక్కువైందిటలే. అలా ఉంటే బెడిసికొట్టి ఊడిచేస్తుంది. అంచేత '**దిల్రుబాల**' అన్నారు.

ఇలా ఉండగా గిరిలాల్ పదివేల రూపాయలదాకా నిలవెయ్యడం పూర్తి అయింది. అప్పటికి దిల్రుబాల రెండు మూడు చిత్రాలలో చిన్ని వేషాలేసి ఫిలింఫీల్డులో కొంత పేరు తెచ్చుకుంది. ఇంక రేపో మాపో ప్రొడక్షన్ కంపెనీ పెట్టాలని గిరిలాల్ సన్నాహాలు చేస్తూ ఉండగా, అతని యజమాని అయిన పెద్ద ప్రొడ్యూసరు విదేశయాత్రకి బయల్దేరి, ఇతన్ని కూడా రమ్మన్నాడు. మున్ముందు ఆయన సాయం అవసరం ఉంటుందన్న ఊహతో, గిరిలాల్ తన కార్యక్రమం ఆపుచేసుకుని, టూరుకు బయల్దేరాడు. కాని అతని గుండెల్లో రాయిపడింది. దిల్రుబాల సంగతేమిటని. దిల్రుబాలకి ఎవరూ లేరు. పైగా సిమానిలో వేషాలేస్తోంది. తీరా తను తిరిగి వచ్చేసరికి ఆవిడగారు తారామణి అయిపోతే తన మొహం

చూస్తుందా? పోనీ కూడా తీసికెళ్ళిందికి వీల్లేదు. ఏం చెయ్యాలో అతనికి పాలుపోలేదు.

దిల్రుబాలకి కూడా ఏమీ పాలుపోలేదు. ఆమెకి గిరిధరలాల్ అంటే చాలా యిష్టం. తను తారాపథం ఎక్కడానికి అతగాడే నిచ్చెనను వేస్తాడనీ ఎక్కాక అక్కడ హుషారుగా షికారు తిరగడానికి కారూ, తారుదారీ వేయిస్తాడనీ ఆమె ఆశలు పెట్టుకుంది. అందువల్ల అతనికి తన మీద నమ్మకం గౌరవం పోకుండా ఉండాలి. తను అలా వున్నప్పటికిని అతనికి తెలుస్తుందా, తెలిసినా నమ్ముతాడా, ఎలా నమ్మించడం అని ఆమె మధనపడింది.

సమకాలికుడి రచన నడకా, సుమకోమలి నడతా కూడా ఎంత తీరుగా వున్నా ఎక్కడో అక్కడ ఎందుకో అందుకు వంక పెట్టించుకోవడం పరిపాటి అని ఒక పెద్ద మనీషి లోకరీతి మీద 'శాన్స్క్రిటీక' చెప్పాడు.

ఈ ముక్కని దిల్రుబాల పుస్తకంలో చదువుకొనక పోయినా, జీవితంలో తెలుసుకుంది. అందువల్ల గిరిధరలాల్ మనసులో తన గురించిన చింత రవంత కూడా లేకుండా ఎలా సాగనంపడమా అని ఆలోచించింది దిల్రుబాల.

ఇటు అతగాడూ ఆమెని ఎవరికి ఒప్పగించడమా అని ఆలోచించాడు. చెడ ఆలోచించాడు.

చివరికి రోక్రానీమీదకి పోయింది అతని బుద్ధి. రోక్రానీని గిరి చాలా కాలంగా ఎరుగును. రోక్రానీ సంసారి. ఇద్దరు పిల్లలు. పైగా అతని జుట్టు నెరిసింది - తనంత కాకపోయినా... పై పెచ్చు రోక్రానీ భార్య గయ్యాళి. దానికితోడు అతడు భయస్థుడు. తనకు అడపా తడపా డబ్బు అవసరమైతే సర్ది, తను ఇచ్చేదాకా ఆ ఊసు ఎత్తకుండా ఊరుకున్న, మహానుభావుడు. అంచేత గిరిధర్లాల్కు ఎంతో విశ్వాసం. తనకి అంత ఉన్నపుడు అందులో సగమేనా అతనికి ఉండదా అని తీర్మానించుకున్నాడు గిరి.

రోక్రానీకి తన సమస్యని వివరించి, ఈమె సంరక్షణ భారం అతని భుజస్కంధాలమీద పెట్టడానికి అట్టేసేపు పట్టలేదు. అంతవరకు పరిచయం స్థాయిలో ఉంటూ వచ్చిన వాళ్ళ సంబంధం అమాంతం స్నేహం అయిపోయింది. గిరి వంటి పలుకుబడి గల ప్రొడ్యూసరు సెక్రటరీ, కాబోయే ప్రొడ్యూసరు తన దగ్గరకు స్వయంగా వచ్చి అడిగినందుకే పొంగిపోయాడు రోక్రానీ. 'మేరా సారా జిందగీ ఆప్కో దేదూంగా గిరిధర్బాబూ' అన్నాడు అతడు ఉద్వేగంతో వణికిపోతూ. "బస్ బస్" అన్నాడు గిరి తృప్తిగా. కాని, రోక్రానీ పొంగు చల్లారక కొంచెం కుడి ఎడమా ఆలోచించాడు. ఇంట్లో బీబీ ఏమంటుందో, బేబీలు ఏమనుకుంటారో అని మూలిగాడు. తన షాపు యజమానికి ఈ సంగతి - ఇలా రోక్రానీ ఒక సినీ నటీమణిని తన యింట్లో ఉంచుకున్నాడని తెలిస్తే ఆయన ఏమంటాడో. నౌకరీ కేం తంటావో. తన వాడలో రోమియోల జోరు ఎక్కువగా ఉంది. వాళ్ళేం చేస్తారో. సినిమాలలో ఒక జాతివాళ్ళు ఓ పాట అందుకుంటే రెండోజాతివాళ్లు - అడ గానీండి

మగ గానీండి రెండో చరణం అందుకుంటారే – అసలు అలా అందుకునేదాకా ప్రాణం విల విల లాడుతుందే మరి ఈ రోమియోలు ఈలలూ అవీ వేస్తే దిల్రుబాల ఇట్నించి పాటలు అందుకుంటే, తను ఏం చెయ్యగలడూ – ఆ పాట వరస పొరుగువాళ్ళకి నచ్చకపోయినా దిల్రుబాల వరస తన భార్య ఇందిరానీకి నచ్చకపోయినా తను ఏం జవాబిస్తాడు?....

గిరిధర్లాల్ ఒక్క చిరునవ్వుతో రోక్రానీ ధర్మసందేహాలన్నీ చెరిగిపారేశాడు. నీ ఉద్యోగానికి నేను తియ్యబోయే పిక్చరులో యియ్యబోయే కారెక్ట రాక్టరు కారెక్టరు అడ్డు అన్నాడు. నీ పరువుకి నా పిక్చరు వల్ల వచ్చే డబ్బు అడ్డు అన్నాడు. నీ బీబీ కోపానికి, దిల్రుబాల అడ్డు అన్నాడు.

అతడు టూరుకి బయల్దేరే రాత్రి, పెంద్రాళే దిల్రుబాలనీ, ఆమె తాలూకు సూటుకేసునీ, మూణ్ణెల్లకీ మూడొందల రూపాయలనీ రోక్రానీకి ఒప్పగించి సెలవు తీసుకున్నాడు.

"నేను తిరిగి రావటానికి మూణ్ణెల్లు పడుతుంది. వస్తూనే సొంత ప్రొడక్షను ఆరంభిస్తాను. ఈలోగా దిల్రుబాల పెరగరాదు. తరగరాదు. ఏవైనా ఛాన్సులొస్తే చిన్నచిన్న వేషాలకే ఒప్పుకో. అదిగనక హఠాత్తుగా పైకొచ్చేసి పెద్ద స్టారు అయిపోయే ప్రమాదం రాకుండా అలాటి వేషాలు దొరక్కుండా చూడు. అది జరిగితే ఇది మన మొహం చూడదు. చూడకపోతే, ఆనక మన ప్రొడక్షన్కి చవగ్గా ఇంత మంచి హీరోయిను దొరకదు. అయ్యో ఆమె అభివృద్ధికి అడ్డుపడడమా అని శంకించకు. నేను వచ్చాక ఎలాగా పైకితెచ్చేస్తాను గదా. అంచేత తప్పులేదు.

"ఏ కంపెనీకీ ఒంటరిగా వెళ్ళనీకు. సెలవేనాపెట్టి వెళ్ళు. దాని కోసం నీకు రెండు వందలు ఇస్తున్నా. రాగానే ఇంకో రెండొందలూ, ఫిలింలో ఫస్టుక్లాసు రోలూ ఇస్తాను."

ఇది రోక్రానీకి గిరిధర్లాల్ నూరిపోసిన నీతి:

తరువాత దిల్రుబాలను కూడా పక్కకి పిలిచి హితబోధ చేశాడు. "బాలా! రోక్రానీని నీ తండ్రిగా, వీలైతే తాతగా చూసుకో. వాళ్ళావిడని మటుకు 'నానీ' అనకు. దీదీ అను చాలు. నేను లేను కాబట్టి కాస్త రంగు బట్టలూ అవీ తగ్గించు. ఎవర్నీ – ముఖ్యంగా సినిమా వాళ్ళని నమ్మకు. స్టుడియోకి వెళ్ళితే రోక్రానీని కూడా తీసికెళ్ళు. పెద్దవేషాలు ఒప్పుకోకు. ఉన్న హీరోయిను వేషం ఆరణాలకే ఒప్పుకుని నువ్వు దక్కించుకున్నాననుకున్నా, హీరోయినులు పావలాకే ఒప్పేసుకుని మూడోనాటికల్లా నిన్ను వెళ్ళగొట్టించేస్తారు. పడ్డశ్రమ వృధా. అలా రెండు ఛాన్సులుపోతే జన్మలో ఇంక పైకిరావు. సెలవ్." అన్నాడు గిరిలాల్.

అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. దిల్రుబాల కళ్ళల్లోకూడా గ్లిసరిన్ లేకుండానే నీళ్లు తిరిగాయి.

"కథ బలీయమని తెలుసూ" అన్నాయి అతని కళ్ళు.

"– తెలుసు నాకు నీ మనసూ" అన్నాయి ఆమె కళ్ళూ

.... తరవాతి చరణం తిరిగేసి పాట పొరబడింది దిల్రుబాల. ఆ మూణ్ణెల్లూ దూరదేశాలలో గిరిలాల్ పడ్డ బెంగ క్షోభ అతని డైరీకే తెలుసు ఇక్కడ దిల్రుబాల సంరక్షకుడు తోక్రానీ పడ్డ క్షోభ అతనికి కూడా పూర్తిగా తెలీదు. దిల్రుబాల అమాయిక. నాయిక కావాలన్న ఊహ ఒక్కదానికే ఆమె చిన్న మనసులో చోటు ఉన్నందువల్ల ఇతర ఆలోచనలకీ బెంగలకీ అందులోకి అడ్మిషన్ లభించలేదు. అసలు దిల్రుబాలకి గిరిలాల్ మాట త్రోసిరాజనాలని ఊహాలేదు. అతను చెప్పినట్టే చేసింది. అతను కాస్త రంగుబట్టలూ అవీ తగ్గించి కట్టుకోమని చెప్పాడు. దిల్రుబాల అలాగే చేసింది. లోగడ ముప్పాతిక గజం పెట్టి కుట్టించుకున్న జాకెట్‌లు అవతల పారేసి, అరగజంతోనే కొత్తవి కుట్టించుకుంది. చీరెలూ, లంగాలూ మరీ ముతకవి ఉంటే, దేశంలో పత్తి ఉత్పత్తి కృషికి అన్యాయం చేయడం అవుతుందని రంగు హంగుల సినీ దేవతా వస్త్రాలు సంపాదించింది. వాటితో రోక్రానీ జలుబు వదిలిపోవడమే కాకుండా మళ్ళీ రావడానికికూడా వీల్లేనంత కట్టుదిట్టం జరిగింది.

అంచేత ఇవన్నీ రోక్రానీ కంటికింపు కావడం బదులు కంటగింపుకు తోవతీశాయి. దాని మూలాన దిల్రుబాలకి అతనిమీద చిరాకు వేసింది. సరే ఓనాడు దిల్రుబాల తోక్రానీ దుకాణానికొచ్చి గుడ్డలు తీయించింది. షాపులో షేరు హోల్డరు మల్లే ఆమె ధాటీగా ఖరీదైన గుడ్డలు తీయించి గజాలూ ఫర్లాంగుల కొద్దీ కోయించి కుప్పపోయిస్తూ ఉంటే రోక్రానీ ఉండబట్టలేకపోయాడు. దిల్రుబాల దగ్గర డబ్బు కొల్లలుగా లేదు. ఆమెను భరించడానికని గిరిధర్‌లాల్ మూణ్ణెల్లకు కలిపి యిచ్చింది మూడొందలే. ఇలా గుడ్డలు కొనేస్తే షాపుయజమాని ఏమంటాడు?

చాలా ఆలోచించి కొంచెం తటపటాయించి, "సీతానీ! డబ్బు లేదని తెలుసుగదా గుడ్డలెందుకలా కోయించేస్తావు?" అన్నాడు లాలనగానే.

దిల్రుబాల పూర్వాశ్రమం పేరు సీతాని అని అతనికి తెలుసు. రేపొద్దున్న ఆమె స్టారు అయినా అంతా దిల్రుబాల అని పిలిస్తే సీతానీ అని పిలవగలపాటి విలవగల వర్గంలో తనుండాలని ఇప్పట్నించీ ఆ పేరు అలవాటు చేస్తున్నాడు.

సీతానీ అనే దిల్రుబాలకి ఒళ్ళు మండిపోయింది. చిన్న పిల్లననుకున్నావా అన్నిటికీ అలా అడ్డు తగులుతావు అంది. డబ్బు లేనందున చిన్నబుచ్చుకోబోతోంది. ఇదే అదను అనుకొని తోక్రాని ఇంకొంచెం పెద్దరికం వహించి ఆమెను మందలించ బోయాడు.

"ఎక్స్‌క్యూజ్ మీ" అంధి లావుపాటి కంఠం ఒకటి. దాని తాలూకు శాల్తీ ఆరడుగుల రెండంగుళాల పొడుగు, అడుగున్నర వెడల్పు, తొమ్మిదంగుళాల దళసరీ ఉంది: నల్లగా ఉంది. అంచేత తెల్లటి సూటులో బసచేసింది. జేబులో చాలా డబ్బుంటుం దనడానికి సూచనగా రెండు బంగారపు పళ్ళు ఉన్నాయి.

'జీ!' అన్నాడు తోక్రానీ, ఏం గుడ్డలు కావాలన్నట్టు చూస్తూ.

'నాక్కాదు ఆవిడ కేం గావాలో ఇవ్వండి' అన్నాడు అతగాడు.

రోడ్రిక్రానీ విస్తుపోయాడు.

"అందమైనవాళ్ళు అందమైన చీరలు ఏరుతున్నపుడు డబ్బు అడ్డురాదదు. నేను సహించలేను." అన్నాడు తెల్లసూటులో నల్లాయన పచ్చగా నవ్వుతూ.

తోక్రానీ ఇంకా తెల్లబోయాడు. అతను తెల్లబోతున్న కొద్దీ దిల్రుబాలకి ఉత్సాహం పొంగిపోతోంది. ఐదేళ్ళ క్రితం కరాచీలో ఉండగా ఒకసారి దిల్రుబాల భర్తతో సినిమాకి వెళ్ళినపుడు ఎవడో ఆమెని చూసి ఎరిగున్నట్లు ఇకిలించాడు. వాడి సాహసానికి అబ్బురపడి దిల్రుబాల సకిలించినట్లు నవ్వింది. చుట్టూ వున్నవాళ్ళు చూసి నవ్వుకున్నారు. దిల్రుబాల మొగుడికి సిగ్గుతో ఒళ్ళు చచ్చిపోయింది. యింటి కొస్తున్నప్పుడు కోపం ఆపుకోలేక ఎవరూ లేని సందులో హఠాత్తుగా ఆగి ఆమెని తిట్టడం మొదలెట్టాడు. దిల్రుబాల మొగుడి చాదస్తానికి నవ్వింది. అతను లెంపకాయ కొట్టాడు. ఆమెకి ఏడుపు బదులు కోపం వచ్చి తిక్కరేగింది. క్షణం తరవాత మొగుడి దెబ్బలతో చెంప మీద చెత్తరేగింది. ఆ స్థితిలో లావుపాటి అల్లావుద్దీన్ అడ్డుపడి మొగుణ్ణి హడలగొట్టాడు. అంతవరకూ రెచ్చిపోతున్న భర్త, అల్లావుద్దీన్ చేయి చేసుకోగానే తెల్లబోయి, 'మగర్ యే మేరీ బీబీ' అంటూ తగ్గిపోతున్నప్పుడు దిల్రుబాలకి కుర్రతనపు కసికొద్దీ వుత్సాహం పొంగిపోయింది.....

తరవాత వారం రోజులూ భర్తను ఓదార్చి, తను ఏడిచి, 'సదా నీ పాదదాసినే' అనే ధైర్యం చెప్పింది. ఎంత చేసినా భర్త మళ్ళీ పాతస్థితికి రాలేదు. పైగా అన్నిటికీ ఆమెను శంకించడం, కొట్టడం మొదలెట్టాడు. అక్కడితో దిల్రుబాలకి క్రమంగా భర్తమీదా, జీవితంమీదా కూడా మోజు విరిగిపోయింది. - ముగ్గురు పిల్లల్ని కన్నప్పటికిన్నీ.

ఈసారి అదే సన్నివేశం తోక్రానీ కొట్టులో జరిగింది. (పిల్లల్ని కనడం కాదని పాఠకులు గ్రహించ ప్రార్థన) తోక్రానీ మొగుడు కాకపోయినా, సంరక్షకుడుగా తనని అవమానిస్తున్నాడు. ఇప్పుడు ఎవడో ఈ హీరో అడ్డుపడి తన శత్రువుని చితగ్గొట్టేలా ఉన్నాడు.

❀ ❀ ❀ ❀

తోక్రానీ 'ఎవరు మీరు?' అన్నాడు.

"నా పేరు రాడ్రిగో. లిస్బన్ ఫిలింస్ గోవా లిమిటెడ్‌కి మేనేజింగు డైరెక్టర్ని."

దిల్రుబాల సంభ్రమాశ్చర్యాలతో అతని వంక చూసింది.

ఎవరీతడు? తనను స్వర్గలోకంలో షికారు తీసిగెళ్ళడానికి కొచ్చిన దేవేంద్రుడా? రాక్షసుడి నుండి రక్షించ వచ్చిన రాజకుమారుడా? కేవలం వస్త్రదానం చేసిపోవచ్చిన లాల్జీయా?

"అయామ్ క్రిస్టోఫర్ రాడ్రిగ్ మదామ్!" అన్నాడు దిల్రుబాల సందేహాలకు జవాబుగా.

"మే దిల్రుబాలా హూ శుక్రియా" అంది దిల్రుబాల 'అందమైన హిందీ హీరోయిన్‌ల నాజూకుపోజులో.' (అందమైన అన్నమాట కొంతవరకూ, పోజుకు కూడా వర్తించగలదని గ్రహించ ప్రార్థన.)

"సునీయే, మెతో ... దటీజ్.... అయిమీన్ - వుయ్‌తో ..... హమ్‌హై - లిస్బన్ ఫిలింస్ ప్రయివేట్ లిమిటెడ్ - వోతో హమారాహీ. హమేక్ బడీ తస్వీర్ ఉతాలేంగే. మేరా మతలబ్ యే హైకీ ఉస్మే దూస్రీ హీరోయిన్ కీ రోల్ - డాల్‌నా - క్యా. పసంద్ హే?" అన్నాడు రాడ్రిగో హడావుడిగా. (లిస్బన్ ఫిలింస్‌వారు ఒక పెద్ద ఇంటర్నేషనల్ ఫిలిం తీస్తున్నారు. అందులో మీకు రెండో హీరోయిను వేషం వెయ్యటం ఇష్టమేనా అని తాత్పర్యం.)

దిల్రుబాల నవ్వింది. "ఇదిగో చూడు పిల్లాడా. నేను సింధీదాన్ని. నువ్వు గోవావాడివి. నీకు ఇంగ్లీషు, నాకు గోవనీసూ, మనిద్దరికీ హిందీ, కనీసం సింధీ కూడా రావు. అంచేత సుబ్బరంగా తెలుగులో మాట్లాడుకుందాం. ఎందుకొచ్చిన రంధి" అంది ఆ నవ్వు.

ఇంతసేపూ, టెన్నిస్‌మాచ్ ప్రేక్షకుడిలా అటూ ఇటూ చూస్తున్న రోక్రానీ యిక ఉండబట్టలేక పోయాడు. "బేటీ సితానీ జరా సునో" అంటూ అడ్డుపడబోయాడు.

"బస్ బస్" అని రాడ్రిగో అతన్ని కొనగోట దుమ్ము దులిపినట్లు ప్రేములోంచి మీటిపారేశాడు. తరవాత అతను, దిల్రుబాలా హడావుడిగా మాట్లాడేసుకున్నారు. ఆ పిల్ల లిస్బన్ ఫిలింస్ వారి నెస్టు పిచ్చరులో సెకండు హీరోయినుకి ఒప్పేసుకుంది. అడ్వాన్సు అతి త్వరలోనే ఇచ్చేస్తానని రాడ్రిగో ఒప్పేసుకున్నాడు. రిహార్సల్ రేపే నన్నాడు. తన ఎడ్రసు కార్డిచ్చి తోక్రానీ వేపు హేళనగా చూసి నవ్వి, టోపీ సర్దుకుని వెళ్ళిపోయాడు.

తక్షణం తోక్రానీ విజృంభించాడు. గిరిధరలాల్ దిల్రుబాలను తనకు ఒప్పగించాడన్నాడు. ఈలోగా ఆమెకు హాని రాకుండా చూసే పూచీ తనదన్నాడు. తన అనుమతి లేకుండా ఆమె ఇలా పై కొచ్చేయడం బాగులేదన్నాడు. రాడ్రిగో వుట్టి పోకిరీవెధవ అని వెల్లడించాడు. పోకిరీ వెధవల్ని నమ్మకూడదని హెచ్చరించాడు. తనకి దిల్రుబాల వరస నచ్చలేదన్నాడు.

'చుప్ రహో బాబా' అంది దిల్రుబాల టూకీగా, విసుగ్గా.

తోక్రానీ చిన్నబుచ్చుకున్నాడు. దుకాణంలో ఇతర గుమాస్తాలు అటు తిరిగి నవ్వుకున్నారు. తోక్రానీ జన్మెత్తి నలభై యేళ్ళు దాటుతున్నా ఎన్నడూ అంత మాట అనలేదు. పడలేదు. ఇన్నాళ్ళకి ఈ వయసులో సినిమా మోజు పుట్టడం, దానికి అపశకునంలా ఇలాటి మాట పడడం జరిగాయి. అన్నిటికన్న ముఖ్యం, ఇపుడు గిరిలాల్‌కు తను యిచ్చిన మాట గంగలో కలిసిపోయేలా ఉంది.

కట్టు తప్పుతున్న ఈ పిల్లని ఎలా అదుపు చెయ్యాలో అతనికి తోచలేదు. అప్పటికి తమాయించుకున్నాడు.

   

ఆ రాత్రి తొమ్మిదింటికి దిల్రుబాల రోక్రానీ ఇంటి కొచ్చింది. దుమ్మెత్తి పోసింది. రోక్రానీ భార్య ఇందిరానీకి ఇదేమీ బోధ పడలేదు. చపాతీల కర్ర చేతపట్టుకున్నా సంగతి తెలియనందువల్ల ఎవర్ని తన్నాలో తేలక ఆవిడ ఎత్తిన చెయ్యి ఎత్తినట్టే ఉంచి చూస్తోంది – 'ఫ్రేము కట్టిన చైతన్యం'లా రోక్రానీ కూతురు, పధ్నాలుగేళ్ళ చిన్నది, పోట్లాటగురించి పట్టించుకోకుండా, తిన్నగా దిల్రుబాల దగ్గరకు వెళ్ళి ఆమె పైటచెంగు ప్రశస్తిచేసి చూసి, తన దుపట్టాతో పోల్చిచూసుకుని దిగులు పడుతోంది. ఇందిరానీకి చెయ్యి దింపేందుకు ఇది ఓ మోస్తరు అవకాశంగా కనిపించి, చపాతీ కర్ర సహా కూతురు నెత్తిన చెయ్యి దింపింది; ఆ పిల్ల మాతృభాషలో ఏడవడం, తల్లీ ఫలానా అని చెప్పుకోడానికి వీల్లేని భాషలో కూతుర్ని తారస్థాయిలో మందలిస్తూ, ఎదురుగుండా వున్న 'బాజారీ' (దిల్రుబాల) ని దుమ్మెత్తి పొయ్యడం, వీళ్ళందర్నీ మించి దిల్రుబాల మూడు భాషలలో రోక్రానీని తిట్టడం, ఇన్ని కలకంఠ స్వరాల మధ్య రెండు సెకండ్లకి మూడుసార్లు చొప్పున రోక్రానీ 'మగర్ సునో' అంటూ ఉండడం, ఇవిగాక ఇంట్లో చిందర వందరగా ఉన్న (ఇంటివాళ్ళ, ఇరుగు పొరుగుల) చిల్లర మల్లర పిల్లల అల్లరి కేకలూ వగైరాలూ పొరుగు వాటాలలోంచి వినిపించే 'గృహమేనా స్వర్గసీమా?' అనేందుకు నిదర్శనాలూ కలిసి, మొత్తంమీద దేశవాళీ అపరాధ చిత్రాల టైటిల్ మ్యూజిక్ అనే భ్రమను కలిగిస్తున్నాయి. బాంబే హారర్ చిత్రాలలో మొదటిసీనులా కనిపిస్తున్నాయి. ఈ భ్రమవల్ల ఎదుటి మేడ బాల్కనీ జనంతో కిటకిటలాడిపోతోంది. కిందని ఎవడో టిక్కెట్లు అమ్మేస్తున్నాడు.

ఇందులో సారాంశం: ఆ సాయంకాలం రోక్రానీ దిల్రుబాల ఇంటికి తాళంమీద తాళంవేసి చక్కావచ్చాడు. దిల్రుబాల మకాం గిరిలాల్ ఇంట్లోనే. రాడ్రిగో ఫిలిం బేరం రాగానే ఆ యింట్లో ఏం అఘాయిత్యాలు జరుగుతాయోనని రోక్రానీ గుండె బేజారై పోయింది. కథ శ్రుతిమించకుండానే దిల్రుబాలని ఇంట్లో తెచ్చిపెట్టుకోవడం మంచి దనుకున్నాడు. చెబితే వినే రకం కాదని ఆ యింటికి తాళంమీద తాళంవేసి చక్కావచ్చాడు.

❀ ❀ ❀ ❀

'తాళం యిచ్చెయి' అంది దిల్రుబాల.

'తాళం నేను వెయ్యలేదు. గిరిలాల్ అప్పులవాళ్ళెవరో వచ్చి, వేసి వెళ్ళారు' అన్నాడు రోక్రానీ.

'బద్దల కొట్టేస్తాను.'

'అలా చేస్తే ఖైదులో పడేస్తారు నిన్ను.'

దిల్రుబాలకి ఏడుపొచ్చింది. 'ఇప్పుడెలా? నా బట్టలూ, నగలూ, లిప్స్టిక్కూ పౌడరూ అక్కడే ఉండిపోయాయే. బట్టలమా టెలా ఉన్నా, తెల్లారితే లిపుస్టిక్కూ అవీ లేకపోతే ఎలా ప్రజల మొహం చూడడం' అని ఏడిచింది.

"నువ్వు గిరిలాల్ వచ్చేదాకా ప్రజల మొహం చూడకపోతే నా తాతలు తరిస్తారు" అన్నాడు రోక్రానీ కసిగా. ఇకనించి దిల్రుబాల తన యింట్లోనే ఉండాలని ఆర్డినెన్స్ జారీచేశాడు భార్య ఆమోదం లభిస్తుందన్న దురభిప్రాయంతో. అసలు దిల్రుబాల - ఇంకో పావుగంట తరవాత వస్తే అతను భార్యకి సంగతి వివరించి ఒప్పించేవాడే. కానీ ఆమె హఠాత్తుగా వచ్చి పడడంతో పౌరుషం ప్రదర్శించక తప్పలేదు.

'చచ్చినా ఈ కొంపలో ఉండను' అంది దిల్రుబాల.

'చచ్చినా నిన్నిక్కడ ఉండనివ్వను' అంది గృహలక్ష్మి ఇందిరానీ.

'ఇది నా యిల్లు' అన్నాడు రోక్రానీ.

'అయితే నెత్తిన కట్టుకు ఊరేగు' అంది ఇందిరానీ.

రోక్రానీ మళ్ళీ జవాబు చెప్పేవాడే గాని, భార్య అన్న రెండు ముక్కలలోనూ ఒత్తు అక్షరాలు పలకడంలో ఊతం కోసం ఆమె అనుకోకుండానే చపాతీల కర్రతో అతని నెత్తిమీద తాళంవేసి, చివర్ని పంక్చువేషన్ కోసం గట్టి ఫుల్‌స్టాప్ పెట్టింది.

అందువల్ల రోక్రానీ వాళ్ళ తండ్రిగారిని పైకి స్మరించుకుని ఉన్నపళంగా కూలబడి పోయాడు. రక్తం కంటజూసే సరికి ఇందిరానీ కెవ్వున కేకేసి కళ్ళుతిరిగి పడిపోయి, మొహాన నీళ్ళు చల్లలేదని మొగుణ్ణి తిట్టిపోసింది. పిల్లలు కూడబలుక్కున్నట్టు ఏడుస్తున్నారు. దిల్రుబాలకి ఏంపాలు పోక ఇందిరానీని సేదతీర్చ బోయేవరకు ఇరుగు పొరుగుల జనం వచ్చి తొంగి చూశారు.

దిల్రుబాల రోక్రానీ నెత్తి బద్దలుకొట్టి, అతని భార్య ఇందిరానీ పీక పిసిగేస్తోందని పుకారు తయారైంది....

రాత్రి పన్నెండింటికి ఈ సందడి సర్దుకుంది; తెల్లవారే సరికి ఇందిరానీ సామాను సర్దుకుంది.

ఈ కొంపలో అదో, మేమో ఉండాలి తేల్చుకో అంది గుమ్మంలోకి బండి వచ్చాక.

"అది ఉండక తప్పదు. నేను లాల్‌జీకి మాట ఇచ్చాను." అన్నాడు రోక్రానీ కిటికీలోంచి ఎదిరింటి కిటికీలోకి చూస్తూ. భార్యతో వాదించి లాభం లేదని తెలుసు. ఇన్నాళ్ళకి తొలిసారిగా ఎదిరించాడు.

తెల తెలవారుతూండగా పుట్టెడు విచారంతో కోపంతో పిల్లలతో పుట్టింటికి బయల్దేరింది. ఇరుగు పొరుగులు నిశ్శబ్దంగా హాహాకారాలూ, మిరియాలూ నూరుతున్నారు.

బండి కదులుతూ ఉండగా అంతవరకూ మాట్లాడకుండా మూలకుర్చీలో కూర్చున్న దిల్రుబాల హఠాత్తుగా తేలు కుట్టినట్టు లేచి, కెవ్వున కేకేసి ఇవతలకి పరుగెత్తు కొచ్చింది. "దీదీ! దీదీ! ఠేరో! ఠేరో"! అంటూ.

బండి ఆగింది. "పచ్చని మీ సంసారంలో చిచ్చు పెట్టడం నాకు గిట్టదు" అంటూ దిల్రుబాల తన కాళ్ళమీద పడుతుందని ఇందిరానీ దురాశ, రోక్రానీ భయమూ పడ్డారు.

దిల్రుబాలకి అంతదూరం ఊహ పోలేదు.

"అద్దం కనిపించలేదు. ఎక్కడ పెట్టావ్ దీదీ" అంది.

ఈ కథ మొదట్నించీ చూస్తున్న బండివాడిక్కూడా కోపం వచ్చింది దిల్రుబాల మాటకి. 'ఛల్' అని బండి ముందుకు తోలేశాడు.

ఇంక చెప్పేందు కేముంది గురూ కేవలం మిత్రుడి కిచ్చిన మాట నిలబెట్టు కోవడానికని తోక్రానీ ఇంత మహాత్యాగం చేసి, దిల్రుబాలని హాలాహలధారిగా భరించాడు. అతని త్యాగం అక్కడితోనే ఆగలేదు. కంపెనీ యజమాని బలవంతాన వుద్యోగం త్యాగం చేయించి ఆ నెలకి జీతం డబ్బులు మూణ్ణెల్ల నోటీసు బదులుగా చివాట్లు, పదిహేనేళ్ళ సర్వీసుకి నెలకి రెండు చొప్పున 30 అభాండాల గ్రాట్యుటీ ముట్టచెప్పాడు. అతని యింటి యిరుగు పొరుగులవాళ్లు లోకల్ సొసైటీలో పెద్దమనిషి స్థానం త్యాగం చేయించారు. మర్నాటికి పలుకుబడి త్యాగం చేయించారు. మూడోనాటికి రోక్రానీ కంట్రకం భరించలేక సిగ్గూలజ్జాకూడా త్యాగం చేశాడు. ఇదంతా దేనికోసం? దిల్రుబాల కోసం. ఆమె గురించి గిరిలాల్‌కు చేసిన వాగ్దానం కోసం... అంతే కాదు ఇంకో పదిరోజులు పోతే అన్నపానాల అవసరం నిర్జించడానికి ఆకలి దప్పికలుకూడా వర్జించవలసి రాగల పరిస్థితి ఆరంభమైంది.

ఇంతకీ కారణమైన దిల్రుబాలకి కృతజ్ఞత ఉందా? బొత్తిగా లేదు. అసలామెను అదుపులో ఉంచడం కష్టమైపోయింది. ఆ వాడలో ఆడంగులంతా ఇతనిమీద కత్తిగట్టారు. కారణం వాళ్ళతాలూకు జీవిత భాగస్వాములంతా దిల్రుబాల కోసం హృదయ కవాటాలు తెరచి, అందులో అర్ధాంగి కోటాపోగా మిగతా (తమ తాలూకు) సగం వాటాలో వాటాలు అమ్మజూపి షేరు ఫ్లోట్ చేయడం. దిల్రుబాలా పేట్రేగిపోతోంది. బాల్కనీలో నుంచి సోలోలు పాడడం, విరహ విన్యాసాలు చేయటం ఎక్కువైపోతోంది. వాడలో ఆడవాళ్ళంతా వీళ్ళని వెళ్ళగొట్టే పరిస్థితి ఏర్పడింది. దీనికి ఫిలింలో ఛాన్సువచ్చినా బాగుండు ననిపించింది తోక్రానీ ప్రాణానికి. పోనీ నాతో చెప్పకుండా వాళ్ళందరితో లేచి పోరాదా అని అడిగేశాడు ఓ రోజున దుఃఖం ఆపుకోలేక. దిల్రుబాల భోరున ఏడిచింది అపస్వరాల ఆర్కెస్ట్రాలా. నీతిలేనంత మాత్రాన నియమం చచ్చిందానుకున్నావా అని తిట్టిపోసింది. ఆ గొడవకి ఆమెని ఓదార్చవచ్చిన పెద్దమనుషుల తండాకి చాయ్‌నాస్తాలు ఇచ్చేసరికి తోక్రానీకి ఐదురూపాయలు ఆరిపోయింది. హరిభగవంతుడా అనుకున్నాడు సింధీలో.

మూడోనాడు దురదృష్టం, అష్టకష్టాలూ మారువేషాలు వేసుకుని చారి & చారి టాలెంట్ హంట్ సర్వీసు (ప్రయివేటు బట్ అన్ లిమిటడ్) అనే రూపంలో వచ్చాయి. సి.సి.టి.హెచ్. అంటే రెండు వేర్వేరు శాల్తీలు. ఒకదాని పేరు ఒ.టి. దురాచారి,

రెండోది ఒ.టి. అనాచారి. తద్దినం (ఈ ఘట్టం ఆరంభమైన ఆ రోజు) పొద్దునే ఈ రెండు చార్లూ వీధిలో పచారు చేస్తూ ఉండగా రోక్రానీ చూశాడు.

'ఎవరు కావాలి' అన్నాడు రోక్రానీ సినిమా వాసన పసిగట్టి.

'వేటాడుతున్నాం టాలంటు కోసం' అన్నారు చారి అండ్ చారి కంపెనీ చారులు.

రోక్రానీ పొంగిపోయాడు. వెదకబోయిన తీగె వీధిలోకే వచ్చెనే అని. "ఇదిగో నేనే టాలంటుని; కనబట్టంలా ఇంకా ఎందుకు తిరుగుతారు. వెదకబోయిన తీగని నేనే" అన్నాడు.

"నువ్వా! తీగవా!! నయమే నవ్విపోతారు" అన్నాడు అనాచారి జాలిగా హేళనగా నవ్వి.

"నేనే హిడెన్ టాలంటుని (అజ్ఞాత ప్రజ్ఞని)" అన్నాడు రోక్రానీ తన మాటలో టీ పోస్తూ (టీ ఉత్సాహము నిచ్చును).

'మీ మొహం' అన్నాడు దురాచారి. 'హిడెన్ టాలంట్లు కొట్టొచ్చినట్లు కనబడాలి. అదే కొండగుర్తు' అన్నాడు అతడు అప్పుడు బాల్కనీలోకి వచ్చి నిలబడ్డ దిల్రుబాల ఉత్తరార్థాన్ని చూస్తూ.

"అదీగాక మేము ఆడ టాలెంట్ కోసమే వెతుకుతున్నాం, మొగటాలెంట్లు అక్కర్లేదు" అన్నాడు అనాచారి.

దురాచారి జేబులోంచి ఓ ఫోటో తీశాడు. చూశాడు. కెవ్వున కేకేసి బాల్కనీ ఎత్తుకి ఎగిరి దిల్రుబాలని క్లోజప్‌లో చూసి, కిందపడి లేచి "అదిగో ఆవిడే మేం వెతుకుతున్న టాలెంటు. ఆ టాలెంటు పేరు దిల్రుబాల!" అన్నాడు.

❀ ❀ ❀ ❀

ఓ గంటలో దిల్రుబాల ముస్తాబై వాళ్ళ ఎదటికి వచ్చింది మేరిలిన్ మన్రోలా తిప్పుకుంటూ.

మేము 'లిస్బన్ ఫిలిం కంపెనీ' తరఫున టాలెంటు హంటుకి వచ్చాం.' అన్నది చారి అండ్ చారి.

'మిమ్మల్ని రాడ్రిగో పంపాడు కదూ' అంది దిల్రుబాల.

'ఔను' అన్నాయి చార్లు.

'పదండి.'

'ఠేరో' అన్నాడు రోక్రానీ. 'నేను ఈవిడ గార్డియన్‌ని. లెస్బీని ఓనర్ గిరిలాల్ వచ్చేలోగా ఫిలిములో బుక్ చెయ్యడానికి–'

వాళ్ళు నవ్వుకుంటూ వెళ్ళిపోతున్నారు కిందకి. 'ఠేరో ఠేరో' అంటూ పరుగెత్తాడు రోక్రానీ.

లిస్బన్ ఫిలింస్ ఆఫీసులో ఇతన్ని ఎవరూ ఖాతరు చెయ్యలేదు.

వాళ్ళూ వాళ్ళూ మాట్లాడేసుకుని ఊహూ కాయితాల మీద రాడ్రిగో సంతకాలు పెట్టేస్తున్నాడు. రాడ్రిగో కథ చెప్పాడు టూకీగా.

అందులో దొరలిద్దరు రాకెట్టులో ప్రపంచయాత్ర చేస్తూ (రాకెట్‌లు బాక్సాఫీసు హిట్లు) ఉంటారుట. భూమ్యాకర్షణకి పైనే వున్నాం గాబట్టి ఫరవాలేదనుకొని, మొలతాడుకి దారాలు పోసి (సైన్సు) రాకెట్ కిటికీలకు కట్టుకుని అంతరిక్షంలో షికారు (ఔట్‌డోర్ దృశ్యాలు) కి బయల్దేరి, భూగోళం రా రమ్మని మరీ మొహమాట పెట్టి ఆకర్షించినందువల్ల (దిల్రుబాల ప్రేమకి సింబలేషన్) హడావుడిగా వచ్చేసి సరాసరి హీరోయిన్ దిల్రుబాల పెరడు సెట్‌మీద తడకల స్నానాల గదిలో (ది విలేజ్ ఎట్మాస్ఫియర్) పెద్ద మ్యూజిక్‌తో పడిపోతారు. దిల్రుబాల కెవ్వున కేకేసి ఇవతలికి వచ్చేసి, సెన్సార్ వాళ్ళు గుర్తుకి రాగానే మళ్ళీ కెవ్వున కేకేసి ఇవతలికివచ్చి ప్యాస్‌పోర్టులు రాకెట్‌లో వుండిపోయాయని గుర్తుకొచ్చి మళ్ళీ లోపలికి పరిగెడతారు. సీన్ ఫేడౌట్....

ఆ తరవాత డైనింగు హాల్లో సెకండు హీరోయిను దిల్రుబాల, మెయిన్ హీరోయినూ దొరలిద్దరితోటీ డబుల్ డూయెట్ పాడి, ఆఖరిసారి పల్లవిలో కోరస్ పాడి కంఠాలూ, దరిమిలా మనసులూ కలిపేసుకుంటారు. .... దెన్ దే కిస్. ఫారినర్సేగా! సెన్సారు పేచీ ఉండదు. ది ఇంటర్నేషనల్ లవ్. వాళ్ళని అంతవరకు ప్రేమిస్తూ, చూట్టానికి హీరోళ్ళలా వున్న మగన్‌భాయ్, జమన్‌లాల్‌లు ఇద్దరూ అసలు విలన్‌లేనని తెలుస్తుంది. అక్కడితో క్లాష్. డ్రామా! కిడ్నాపింగ్, కాసేపు నాపింగ్. మ్యూజిక్ రఫీ... దెన్ హౌరా బ్రిడ్జి మీద తరమడం.... మధ్యలో ఈఫిల్ షవర్ టాట్లు మాంటేజ్. వుయ్ మీన్ ఈఫిల్ టవర్ షాట్‌లు..."

"చివరి కేమవుతుంది?" అంది దిల్రుబాల.

'ఎండింగ్ చెప్పను. సీక్రెట్.... స్టేట్‌బాంకు వాల్టులో దాచాం.... సరేగాని మీకు కథ నచ్చిందా' అన్నాడు రాడ్రిగో.

"ఆహా, చాలా నచ్చింది"

"సెబాస్... డు యు నో... మీకు తెలుసా?.... ఈ కథ విని నలుగురు ఇండియన్ హీరోయినులు ఏడిసినట్టుం దన్నారు. వేషం వేయడానికి ఒప్పుకోలేదు. ఇడియట్సు" అన్నాడు రాడ్రిగో.

తోక్రానీ కళ్ళ ఎదుటే, దొరలూ, దిల్రుబాల, ఫస్టు హీరోయిను వేస్తున్న 'ఇండియన్ ఫ్లవర్' అనే పేరుగల పోర్చుగీసు సెక్స్‌ట్రా రిహార్సలు ప్రారంభించారు. పదినుంచి పన్నెండుదాకా ముద్దులసీనే రిహార్సలు అవుతోంది.

తోక్రానీ కళ్ళు మూసుకుని "మేరీ భగవాన్! మేరే కన్హయ్యా... కహాహా తూం... క్యా కర్తేహో!" అనుకున్నాడు బాధగా.

ఆ తరవాత వారంరోజులలో అతడు పావుగంటకోసారి పై నున్నవాడిని తలచుకుంటూనే ఉన్నాడు. కాని మిత్రుడి పట్ల తన ధర్మాన్నీ దానికి మారుపేరయిన

దిల్రుబాలనీ మటుకు వదిలిపెట్ట లేదు. సినిమా కంపెనీవాళ్ళకీ, ఇంటి దగ్గిర ఇరుగు పొరుగులకు కూడా అతను లోకువైపోయాడు. ఒక్కొక్కసారి దిల్రుబాలతో కారులో వెళ్తూ వుండగా దారిలో ఎవరో కనిపిస్తే వాళ్ళని ఎక్కమని రోష్రానీని దింపేసేవారు. మైళ్ళకొద్దీ నడుచుకుంటూ మళ్ళీ కంపెనీకి వచ్చేవాడు. చూస్తూ వుండగా దిల్రుబాల పెరిగిపోతోంది సైజులోనూ, అదృష్టంలోనూ కూడా. నాలుగైదు మంచి కంపెనీలలో వేషాలు దొరికాయి. డబ్బు చేతికి వచ్చి ఓ కారు కొంది. పెద్దమేడలో ఖరీదైన వాటా అద్దెకు తీసుకుంది.

నెల తిరిగేసరికి, విడి బంగళా తీసుకుంది. దానికో మీసాల గూర్ఖాని పెట్టింది. ఫర్లాంగు పొడుగున్న కారు కొనుక్కుంది. రాత్రిగోకే ఆమె దర్శనం కావటం లేదు. రోష్రానీకి దిక్కేమిటి? అయినా అలా గుమ్మంలో పడివుండేవాడు "బేటీ సీతానీ" అంటూ – ఈ పోరు పడలేక ఓ రోజు వెళ్ళగొట్టింది.

ఎప్పుడో సినిమాలో కారెక్టరాక్టరు వేషం వెయ్యాలని ముచ్చటపడుతున్న రోష్రానీకి జీవితంలోనే ఆ అవకాశం వచ్చింది. నవ్వుకుంటూ, ఏడుస్తూ, కోప్పడుతూ, లేస్తూ తిరగసాగాడు బొంబాయి వీధులలో. చూసే వాళ్ళకి అతని తరహాలో కారక్టరాక్షన్ కనిపించి నవ్వుకునేవారు.

ఇలా మతిపోయినా, రోష్రానీ తన ధర్మాన్ని మరచి పోలేదు. తన ఇల్లూవాకిలీ మర్చిపోయి, దిల్రుబాల బంగళా ఛాయల్లోనే వుంటూ వచ్చాడు. అదీ విశ్వాసం అంటే. ఇది గమనించి దిల్రుబాలని బుక్ చేసిన కొన్ని కంపెనీల వాళ్ళు ఇతనికి చిన్న వేషా లిస్తామన్నారు జాలి కొద్దీ.

హఠాత్తుగా ఓ రోజున గిరిధరలాల్ ఊళ్ళో దిగాడు. టూరు పూర్తి కానేలేదు. అయినా అక్కడికి తెప్పించుకున్న బొంబాయి పేపర్లలో దిల్రుబాల బొమ్మలూ హంగామా చూసి నిర్ఘాంతపోయి, సెక్రటరీ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి చక్కా వచ్చేశాడు – పిట్టకి రెక్కలొచ్చెనే అని దిగులు పడుతూ. తన యింటికి తాళం ఉంది. రోష్రానీ పని చేసే దుకాణానికి వెళ్ళాడు. "వో బడా రోష్రా దేనేవాలా ఆద్మీహై" అంటూ షాపు యజమాని, రోష్రానీ దిల్రుబాలతో కలిసి పెద్దవాడై పోయాడని బోలెడు ఏడిచాడు. రోష్రానీ ఇంటిదగ్గర కెళ్ళి వాకబుచేశాడు గిరిలాల్. పెళ్ళాం బిడ్డల్ని వెళ్ళగొట్టి, ఇల్లు వదిలేసి సినిమా యాక్టరుతో తిరుగుతున్నాడనీ రోష్రానీ ఇప్పుడు చాలా పెద్దవాడనీ కారూ బంగళా ఉన్నాయనీ చెప్పారు – ఇరుగు పొరుగులు.

'మిత్రద్రోహీ' అని హిందీలో అనుకుని దిల్రుబాల బంగళాకి బయల్దేరాడు గిరిలాల్. గుమ్మంలోనే బక్కచిక్కిపోయి, బిక్కమొహం పెట్టుకు బీడీ కాలుస్తున్న రోష్రానీని చూసి, దుమ్మెత్తిపోశాడు గిరిలాల్.

ద్రోహి, కృతఘ్నుడు, వంచకుడు లాంటి మాటలు పొదిగిన వాక్యాలతో రోష్రానీ హృదయాన్ని శతసహస్ర శకలాలుగా చితగ్గొట్టాడు గిరిలాల్.

తరవాత తిన్నగా లోపలి కెళ్లాడు. సినీతార దిల్రుబాల సోఫాలో అలిసిపోయిన పువ్వులా కూర్చుంది. ఐనా ఐదారుగురు లావుపాటి ప్రొడ్యూసర్లను అవలీలగా తిప్పలు

పెట్టేస్తోంది. ఆ సీనులోకి గిరిలాల్ దూకుడుగా ప్రవేశించి, దిల్రుబాల ఓనర్‌లా జబర్దస్తీ చేసి మాటాడబోయి రిటర్న్ టిక్కెట్టు కొనుక్కున్న వాడిలా హడావుడిగా ఇవతలి కొచ్చేశాడు.

మొహం వాచిపోయి వుంది.

అదేం అన్నాడు తోక్రానీ.

"చివాట్లేసింది" అన్నాడు గిరిలాల్ టూకీగా.

(చంద్రమండలానికి వెళ్ళే రాకెట్ పైకిపోతున్నప్పుడు క్రమంగా అవసరం తీరినకొద్దీ, తనను అందాకా మోసుకు వచ్చిన సాకెట్‌లను వదిలేస్తుంది. తారాపథాని కెళ్ళే తారలూ అంతే అందిట దిల్రుబాల తను నటిస్తున్న రాకెట్ కథ చిత్రంలో పాయింట్లు గుర్తుకు తెచ్చుకుని. కాని కిందపడేటపుడు ఎవరూ సాయం ఉండరు అని ఘాటుగా డైలాగు చెప్పి చక్కావచ్చాడు గిరిలాల్)

అప్పుడు ఇద్దరూ జాయింటుగా చేజారిన పిట్టకోసం ఏడిచారు.

తరవాత గిరిలాల్ ఏం చేశాడనీ! అతని కోపం అంతా తోక్రానీ మీదకి తిరిగింది. నేనంటే అగ్గగ్గలాడిపోయే పిల్ల ఇలా పొగరెత్తి నన్నే గసిరి వెళ్ళ గొట్టిందంటే, అందుకు నువ్వే కారణం అన్నాడు దిల్రుబాలని నేనే పైకితెస్తే ఎంత గడించేవాడినో అని వాపోయాడు. ఛీ కృతఘ్నుడా. విశ్వాస హీనుడా – ద్రోహీ, నిన్ను నమ్మినందుకు మంచి టోకరా యిచ్చావు అన్నాడు. ఇంకో క్షణం తరవాత అతనికి పెద్ద ఊహ కలిగింది. దుష్టుడా! అన్నాడు. దుష్టుడా నువ్వింకా మోసం చేస్తున్నావు. దిల్రుబాలా నువ్వూ ఒకటే. నేను పోట్లాడతానని మీరు కుట్ర చేసి ఇలా నాటకం ఆడారు. నీ ముష్టిచొక్కా ఏడుపు మొహం అన్నీ దొంగనాటకాలే. నేను పోగానే మీరు కలిసిపోయి నవ్వుకుంటారు అన్నాడు.

తోక్రానీ కాదు మొర్రో అని మొత్తుకున్నా గిరిలాల్ వినలేదు. ఏం చెప్పినా నమ్మలేదు. వేషం ఇమ్మని కాళ్ళా వేళ్ళా పడినా ఛీ పో అన్నాడు. చివరి కేమయింది తెలుసా? వేషం యివ్వకపోడమే కాదుగదా తనకు తెలిసిన అన్ని కంపెనీలలోనూ తోక్రానీ తనకు ద్రోహం చేశాడనీ చూస్తూ ఉండగా కాపరాలు కూలదోసే దుష్టుడనీ ప్రచారం చేసి అతనికి ఎక్కడా చిన్న వేషంకూడా పుట్టకుండా కట్టుదిట్టం చేశాడు. డెమాక్రసీలో లంచగొండితనం చెల్లినంతకాలం అంతా బాగానే ఉంటుంది. బయటపడితేమటుకు అంతా వెలేస్తారు.

ఇదీ అంతే. అందరూ ఇతన్ని కృతఘ్నుడని ముద్ర వేసి దూరంగా వుంచారు. తోక్రానీ తిరిగి తిరిగి తిండిలేక మాడి, పశ్చాత్తాపంతో స్వగ్రామం వెళ్ళి పెళ్ళాం కాళ్ళ మీద పడి లేచి, మళ్ళీ బొంబాయి రాకుండా, అక్కడే దాల్‌మోటా అమ్ముకు బతుకుతున్నాడు. అదీ కథ. అంచేత ప్రపంచం తీరే అంత. విశ్వాసం కోసం వెతక్కు. అంతకన్న దేశవాళీ చిత్రాలలో కళాఖండాల కోసం వెతకొచ్చు. అంతేకానీ–

   

ఔనుగాని వరహాలరాజూ ఈ కథ విన్నారు గదా ఇందులో మీకు కథ బలీయం అనిపించిందా. స్నేహితుడి కోసం అంత త్యాగం చేసిన రోక్రానీకి ఆ శిక్ష న్యాయమేనా? విధి అలా చేయించిందా కథ అలా చేయించిందా? మీరే రోక్రానీ అయితే పాసార్ది ఈ కథ నెలా వ్రాసేవాడు? చెప్పండి అన్నాడు రాయుడు.

కథ దేముంది. విధివశాత్తూ ఇలా జరిగింది. నేను కాదు ఎవరేనా సరే ఇలాగే అవుతుంది అన్నాడు రాజు రోక్రానీ మీద జాలిపడుతూ. రాయుడు విరగబడి నవ్వాడు.

"అదే తమాషా. అక్కడే మీరు తప్పులో కాలేశారు. ఈ కథ లాష్టుసీనులో గిరిలాల్‌కి వచ్చిన అయిడియా ఏమిటి? రోక్రానీ దిల్రుబాలా ఒకటేననీ, తనని వదిలించుకోడానికే రోక్రానీ ముష్టిచొక్కా, బిక్కమొహం ధరించి దొంగనాటకం ఆడుతున్నాడనీ అన్నాడు కదా. వచ్చిన పేరు ఎలాగా వచ్చింది. నేనైతే, ముందరే ఆ దారిలో కథ నడిపేవాడిని. దిల్రుబాల ఎప్పుడైతే కంట్రోలు తప్పుతోందని అనుమానం కలిగిందో అప్పుడే నేను విజృంభించి, ఆమెని పది కంపెనీలకి స్వయంగా తీసికెళ్ళి బుక్ చేయించి, హడావుడిచేసి నా ఓనర్‌షిప్‌ని గట్టి చేసుకునేవాణ్ణి. ఆమెను బుక్ చెయ్యాలంటే, నాకు కారెక్టరాక్టరు కారెక్టరు ఇచ్చితీరాలని షరతు పెట్టి నేనూ పెద్దవాణ్ణయిపోయేవాణ్ణి. కారూ, పేరూ, డబ్బూ, ఫస్టుక్లాసు హీరోయినూ నా చేతిలో ఉన్నప్పుడు నాకు అడ్డేమిటి. గిరిలాల్‌కీ, పాత వాగ్దానాలకీ నే నేల భయపడవలె....

"చూశారా, అదే తేడా. మీ దగ్గిర ఈ తెలివితేటలు లేవు గాబట్టే మీరు సినిమాకి అన్‌ఫిట్ అన్నాను. ఇహ లాభంలేదు. రైలెక్కెయ్యండి" అన్నాడు రాయుడు.

రాజు 'అంతేనా' అని దిగాలుపడి దిగజారిపోయాడు.

కాళ్ళూ చేతులూ, దిగజారిపోయిన ఆశలూ ఈడ్చుకుంటూ ఇద్దరూ మెల్లిగా సుబ్బన్న బంగాళాకు చేరేవరకు వర్షం ప్రారంభమైంది.

"సుబ్బన్నగారు కోపంగా ఉంటారు. ఇపుడు లేపొద్దు. పొద్దున్న మాటాడదాం. అందాకా ఈ వరండాలో చలిగాలి పీలుస్తూ షవర్‌బాతూ రెస్టూ తీసుకుందాం" అన్నాడు రాయుడు. రాజు మాటాడలేదు. చలికి వణికి పోతున్నాడు.

రాయుడు మెల్లిగా వెచ్చని కబుర్లతో కల పన్ని అందులో బంగళా కట్టి అందులో రాజును పడుకోబెట్టి, తను దాని తాలూకు గెస్ట్‌హౌస్‌లోకి వెళ్ళి తలుపేసుకు పడుకున్నాడు.






తెల తెల వారుతూ ఉండగా రాజుని ఎవరో గట్టిగా కుదిపి లేపి పద పదమని వంటగదిలోకి తీసుకెళ్ళారు. కలత నిద్రలో కంగారులో ఏం జరిగిందో తెలీక తెల్లబోతున్న రాజుకి "రాజా! నా రాజా" అని ఓదారుస్తున్న నరసు ఆప్యాయమైన కంఠం, వెచ్చని స్పర్శ అనుభవానికి రావడంతో దుఃఖం పెల్లుబికి పోయింది. "బామ్మా యింటి కొచ్చేస్తా" అని బావురు మన్నాడు.

లక్ష్మీన్నరసు అతని వీపుతట్టింది. జరిగింది మర్చిపొమ్మంది. గట్టిగా ఏడవకు బాబాయి లేస్తాడంది. ఆ సందర్భం పురస్కరించుకొని బాబాయి మీద పచ్చి తెలుగులో నిశిత విమర్శ చేసింది.

"ఇయ్యాల కొక్కరోజు - మాపిటేలదాకా యాడన్నా పల్లకుండా పడుండు. నేను ఈ యెదవ మాలోకంలోంచి వచ్చేత్తా. రేపు మనం తిరపతెల్లి మనువాడదారి. ఆనక కలో గంజో కాఫీయో టీయో తాగి బతుకుదారి. నీకు డబ్బు లేదుగందాని వదిలి పొయ్యేటంత యదవరకం కాదు నేను" అంది ఉద్వేగంతో.

రాజు పూర్తిగా మేలుకున్నాడు. అతనికింకా దిగులు కలిగింది.

"అయ్యో వద్దు నర్సూ నాలాంటి దిక్కులేనివానికై నీయొక్క డబ్బుగల బాబాయితో సంబంధాలు తెంచుకుని నాతో కలిసి అవస్థలుపడకు. ఇది సినిమాకాదు జీవితం. ఏ. వీ. యం వారిదికాదు. నిజం జీవితం." అన్నాడు బాధగా.

నరసు అమాంతం అతన్ని కౌగలించుకు ముద్దుపెట్టుకుంది.

అంతవరకు పోర్షన్ లేనివాడిలా దిక్కులు చూస్తున్న రాయుడు తుళ్లి పడ్డాడు. "వాటీజ్ దిస్ వార్నింగ్‌లెస్ కిస్: ఇంకా నయం సెన్సారు వాళ్ళు చూళ్ళేదు" అన్నాడు.

రాజు ఈ లోకంలో లేదు. డ్రీం సీక్వెన్సులో తిరుగుతున్నాడు.

అందుకని నరసు, రాయుడికే కర్తవ్యం ఉపదేశించింది. బాబాయి లేవకుండా బయటికి పొమ్మంది. గబగబ కాఫీ కాచి ఇచ్చింది. ఐదు రూపాయలు రాజు జేబులో పెట్టింది.

"అల్లల్లా తిరిగి సందేళకి మన పాతింటికిరా" అంది.

అంతలో రాయుడు హాల్లోకి వెళ్ళివచ్చి "సినిమా కెల్తాం సినిమా కెల్తాం" అన్నాడు. హాల్లో అతనికి, సుబ్బన్నకి వచ్చిన ఇన్విటేషన్ కార్డులు రెండు దొరికాయి.

"ఏం పిక్చరు" అంది నరసు.

"యమ పిచ్చరులే. ఇంతవరకు యిట్లాంటిది రాలేదు" అన్నాడు రాయుడు.

అన్ని కాలాలకీ, అన్ని దేశాలకీ సరిపడే కథ అది. ఒక టమిల్ ఫోక్‌లోర్ హీరో ఒక టెలూగూ సోషల్ హీరోయిన్‌ని లవ్‌చేసి, కన్నడ పౌరాణిక విలన్‌తో పోరాడి రాక్ ఎండ్ రోల్ డాన్సు చేస్తాడు ఇందులో" అని ఆ పిక్చరు ప్రొడ్యూసర్లు డిస్ట్రిబ్యూటర్లు అనుకుంటూ ఉండగా రాయుడు విన్నాడు.

రాజుని వంటింట్లో దాచి, రాయుడు బజారుకెళ్లి అరగంటలో షార్క్‌స్కిన్ శ్లాక్ షర్టులు రెండూ, గాబర్డిన్ లాగులు రెండూ అద్దెకి తెచ్చేశాడు.

రాజుకి అవి తొడిగి, నడవడం నేర్పి, పది నిమిషాలు పెరటి దోవన వీధిలోకి తీసుకొని వచ్చాడు.

తొణుకూ బెణుకూ లేకుండా అజ్ఞలు ఇస్తూ ఉన్న రాయుడు హఠాత్తుగా చాలా గొప్పవాడిలా కనిపించాడు రాజుకే. అతని మీద చాలా గౌరవం నమ్మకం కలిగాయి.

"నువ్వు గొప్ప ప్రొడ్యూసరు అవుతావు" అని రాయుడు ధైర్యం చెబుతూ ఉంటే, మన సినిమాలలో చీకటిగా ఉండాల్సిన సీనులో వెలుగు కిరణాలలా నిరాశతో నిండాల్సిన అతని మనసులో చాలా ఆశలు మిలమిల్లాడాయి.

హోటలులో పూటుగా టిఫిను లగాయించి, ఆంధ్రాకిళ్ళీ బిగించి, బస్సెక్కే వరకూ రాయుడు దివ్య తేజంలో ధగధగ లాడిపోతున్నాడు. (ఏ డిస్ట్రిబ్యూటరు వల్లనో ముటావల్లనో) అభిశప్తుడైన ఏ తెరవేలుపో, కాడిలాకియర్ కాబోయి మానేసి పదకొండో నెంబరు బస్సులో తిరుగుతున్నాడనుకున్నారు చూచినవారు.

ఫిలిం ఫీల్డుకే ప్రివ్యూ థియేటర్ అయిన పారగన్ సినిమాకి బస్ స్టాండునుండి ఉత్సాహంగా దూకుడుగా అంగలు వేస్తున్న రాయుడిని పలకరించడానికి కూడా గుండెలు చాలలేదు రాజుకి.

బారులు బారులుగా పోతున్న కారులలో జనం చాలామంది ఇతని కేసి చూసి చేయి ఊపుతున్నారు. కారు రిపేరిలో ఉన్నందువల్ల షికారుగా నడుస్తున్న వాడిలా కనిపించాడు రాయుడు. వందనాలు అందుకొంటున్న కొద్దీ అతని తేజస్సు కొత్త స్టుడీబేకర్ దీపాలలా కళ్ళు మిరుమిట్లు కొలుపుతోంది. సినిమా మూడో రీలులో బాలనటి హఠాత్తుగా స్థూలనటి సైజుకి పెరిగినట్టు అతని ఒడ్డుపొడుగూకూడా పెరిగినట్టు కనిపించింది రాజుకి.

మరోవంక అతనికి కలల్లోమాత్రం పరిచయం ఉన్న హీరోలూ, హీరోయిన్‌లూ, విలన్‌లూ, కార్లలో దూసుకు వెళ్ళిపోతుంటే కళ్ళు తిరిగి పోతున్నాయి.

అల్లంత దూరాన సినిమా గేటుదగ్గిర చేరిన జనసమూహం చూసే సరికి ఇంకా తిరిగిపోయాయి. వాటికితోడు ఉదయపు ఎదురెండ, పొద్దుటి పెసరట్టులో నూనెపైత్యం కూడబలుక్కుని ప్రముఖపాత్ర నిర్వహించడంతో పైత్యం ఎక్కువై కళ్ళు బైర్లుగమ్మి సినిమాగేటుకి ఎదురువేపు రోడ్డు వారన కూలబడి పోయాడు రాజు.

రాయుడు ఈసారి కంగారు పడలేదు రాత్రి అనుభవం వల్ల.

'లేవయ్యా. లే. ముందుకు రావలసిన వాడివి ఇలా అయితే ఎలా' అన్నాడు రాజుకి అడ్డు నిలబడి కార్లవార్లకి కులాసాగా కనిపిస్తూ. ఐదు నిమిషాలయినా రాజు లేవలేదు. రాయుడు వెనక్కితిరిగి చూస్తే ఏడుస్తున్నాడు. ముచ్చెమటలు పోసేశాయి. రెండు చేతులతోను కళ్ళు మూసేసు కున్నాడు.

"నేను రాలేను" అన్నాడు.

రాయుడు అతని జుట్టు నిమిరాడు వాత్సల్యంతో. "రాజా! ఎందుకీ విచారం... భయపడకండి. లెండి. రండి. నేనున్నానుగా" అని అభయమిచ్చాడు.

రాజు దీనంగా చూశాడు రాయుడివంక. తల అడ్డంగా తాటించాడు. "ఇందరు గొప్పవాళ్ళు – వణుకుతున్నాయి నా కాళ్ళు" అన్నాడు.

"మరేం ఫర్వాలేదు. మీరూ గొప్పవారే. నేనుచెప్పలా. మీ అంతట మీరే అనాలి. ఇంకో గంటలో అనేస్తారు... పదండి ఈలోగా జంకకండి. మిమ్మల్ని ఈ గొప్పవాళ్ళ మధ్యనించి నడిపి బాల్కనీ సోఫాలో కూలేసే పూచీ నాది. అంతవరకు మీరు నా డ్రైవింగులో వున్న కారు స్టీరింగులు అనుకోండి. లేదా నేను తొడుక్కున్న చొక్కాలు అనుకోండి. మిగతాదంతా నేను చూసుకుంటా మీరు కళ్ళుమూసుకు నడవండి. నడవడమే మీ పని. ఆ పని చేసెయ్యండి. ఆనక ఏమవుతుందని బెంగవద్దు. అది నేను చూస్తాను. పదండి మీరు గొప్పవారు" అన్నాడు రాయుడు.

పెద్దమనిషి ఇన్నిసార్లు చెబుతున్నాడు గదా అని రాజు ఆమాట నమ్మేసి దానిమీద నిలబడ్డాడు మెల్లిగా. కాని హఠాత్తుగా మళ్ళీ దిగులు కమ్ముకొచ్చింది.

"గురో లాభం లేదు. నన్ను రమ్మనక. అంతమంది పెద్దవాళ్ళు దీన్నిండా వున్నారు. ఇది కళ. అదేమో మన దగ్గర లేదనుకో. నేను అన్‌ఫిట్. రాను. నేను రేపు

గొప్ప ప్రొడ్యూసర్ని అయిపోతే ఇంకేమన్నా ఉందా? వీళ్ళు నాకన్నా చిన్నవాళ్ళయిపోరూ? వీళ్ళందరికీ నేను అగ్నెలిచ్చి పని చేయించాలి. భయపెట్టాలి. ఆర్టుకి సర్వీసు చేయించాలి. ఓరి బాబోయ్ నావల్లకాదు. చచ్చినా ఒప్పుకోను. నా కళ్ళు తిరిగిపోతున్నాయి బాబోయ్" అన్నాడు.

అని కళ్ళు తెరిచేసరికి ఎదురుగా గేటుమీద 30 అడుగుల ఎత్తున నిలబడ్డ హీరోయిను బొమ్మ ఔట్ ఆఫ్ ఫోకస్‌లో కెళ్ళి మసకబారి మళ్ళీ మెల్లిగా రూపు దేలింది. కళామతల్లి రాజుకి కనిపించింది.

ఆమె సినీ - దేవతా వస్త్రాలు కట్టుకుంది. 'పుల్లద్రాక్ష'లు పొదిగిన కిరీటం ధరించింది. రెండు చేతుల్లో రెండు గిన్నెలున్నాయి. ఒక దానిమీద కళ అని రాసి ఉంది. రెండోదానిమీద బాక్సాఫీస్ అని ఉంది వాలఖిల్యుల పరిమాణంలో (అచ్చ తెలుగులో లిల్లిపుట్ లన్నమాట) ఉన్న మనుషులు గిన్నెలచుట్టు సందడిగా తిరుగుతున్నారు. కొందరు కళ ఉన్న గిన్నెవేపు మరికొందరు బాక్సాఫీసు పాత్రవేపూ వెళ్తున్నారు. కొందరు కళవేపు పోతున్న వారిని బాక్సాఫీసు పగ్గాలతో వెనక్కి లాగుతున్నారు. కొందరు తొందరలో ఎవరి కాలో తగిలి మూర్ఛపడుతున్నారు. బండలా పడి ఉన్న కొందరు ఎవరి కాలో తగిలి దిగ్గునలేచి పరుగెడుతున్నారు. నవ్వుతున్నారు. నవ్వుకుంటున్నారు. కొందరు పొట్టివాళ్ళు పొడుగువాళ్ళ మీదకి పొట్టివాళ్ళ నిచ్చెనలు వేసి ఎక్కుతున్నారు. కొందరు పొట్టివాళ్ళు పొడుగు నటిస్తున్నారు. వాళ్ళను చూసి ఎవరో చప్పట్లు కొడుతున్నారు. వాళ్ళని ఎవరో వెక్కిరిస్తున్నారు కొందరు అటువాళ్ళని ఇటులాగుతున్నారు. పునాదులులేచి ఒక తెల్లగోడమీద గొలుసులు బొమ్మలు ఆడబోయిన బొమ్మల్ని చిటుకు చిటుకు కుడుతున్నాయి. కొన్నిటిని ముద్దెట్టు కొంటున్నాయి. కొన్నిటిని హైపోడెర్మిక్ సిరెంజి షాట్‌లు ఇచ్చి మత్తెక్కిస్తున్నాయి. బోలెడు జనం ఆ గోడకేసి చూసి నవ్వుతున్నారు. వెక్కిరిస్తూన్నారు. కొందరు అందుమీదకి ఎగబాక చూస్తున్నారు. కొందరు జారిపడుతున్నారు. అందు కెవరో ఏడుస్తున్నారు. వాళ్ళనెవరో రూపాయ కిరాయకి ఓదారుస్తున్నారు. ఈ రహస్యాన్నెవరో అరుస్తున్నారు. వాళ్ళనెవరో కరుస్తున్నారు. ఎవరో కొందరికి వళ్ళు మూస్తున్నారు. ఇంకొందరి కళ్ళు మూస్తున్నారు. జీవితం ఆక్సిడైజ్ కావడానికి ఇంధనమైన ధనం మహాత్మ్యాన్ని తెలిపే ఉద్గ్రంథం చెక్కుబుక్కును శ్రద్ధగా చదువుకుంటున్న ఒక సినీమార్కు ద్రౌపది దరిజేరిన ఒక దుశ్శాసనుడు పైట దిగలాగేస్తున్నాడు. మరో చండశాసనుడు అది వల్లకాదని ఎగలాగుతున్నాడు. ఆవిడ ఇదేం పట్టించుకోకుండా బుద్ధిగా బుక్కు చదువుకోంటోంది.

ఈ సమ్మోహనకరమైన మనోహరమైన బీభత్సమైన భయంకరమైన చలచ్చిత్ర విశ్వరూపంచూసి దిగ్భ్రమచెంది, రెండు చేతులు పైకెత్తి నమస్కారంపెట్టి, మైకంకమ్మి పడిపోతున్న రాజుని, రాయుడు పట్టుకున్నాడు. ఆ సన్నివేశానికి మంద్రస్వరంలో వ్యాఖ్యానించాడు రాయుడు.

"రాజా! అదే జనులపాలిట ఆకర్షణ, వికర్షణ, ఆనందదాయిని, అనారోగ్యకారిణి, జీవనప్రదాయిని, కళావని, రసధుని, ప్రకాశని, నాశని, శని, అని, ఖని అయిన చలనచిత్ర పరిశ్రమ విచిత్ర చిత్రం దర్శించి తరించు. ఓ రాజా! ప్రపంచంలో అన్ని రంగాలలో ఉన్న చైతన్యం యావత్తు ఇక్కడ పుంజీభవించింది. జీవననాడి ఇక్కడ ఉదృతంగా స్పందిస్తుంది. ఇది బొత్తిగా కళా కాదు. ఉత్తి డబ్బుకాదు... జీవితం.... దానికి బెల్జియం అద్దం... పెద్ద అబద్ధం. గొప్ప నిజం, లక్షపొరలు కమ్మిన నిజం. లక్షరూపాలు ధరించగల జీవన ఖనిజం. వెలుగూ నీడ, నిజం అబద్ధం దురాశా నిరాశ, డబ్బూ కళా, సోలో డూయెట్, లాంగ్‌షాట్ క్లోజప్, బుర్రా గుర్రా, కామిడీ ట్రాజిడీ, ఫేడిన్ ఫేడౌట్, శాంతం కోపం, కృతజ్ఞత - ఘ్నత, స్తుతీ - నింద, కుడి ఎడమ, ఎక్జయట్‌మెంటు, సెక్జయట్‌మెంటు, ప్రేమ ద్వేషం, నీతి నాతి, అచ్చులూ హల్లులూ 'అలా' 'వలా' - కలా ఇలా కళా తలా తిలా అన్నీ ఉంటాయి. శ్రీనివాసులూ స్త్రీనివాసరావులూ స్క్రీనివాసమూర్తులూ, ఇంకా అనేక రకాల కచటతపలూ ఉంటారు. భూలోకంమీద మజిలీకొచ్చిన మానవుడు ఈ చాయల కొస్తే మిగతా స్థలాలలోకన్న ఎక్కువ అవతారా లెత్తుతాడు. కష్ట సుఖాలతో, గుణావగుణాలతో సంఘర్షణపడి అతడి హృదయం సానపట్టిన వజ్రం అవుతుంది. మనసు పక్వం అవుతుంది. జీవితం ఆరమగ్గుతుంది. ఇక్కడే జీవనరాగ సుధ రుచి తెలుస్తుంది. జీవనరాగం కనిపిస్తుంది. వినిపిస్తుంది. అనుభవానికి దొరుకుతుంది. మందగించిన చైతన్యానికి చైతన్యం అబ్బుతుంది. ఓ రాజా! ఇక భయపడకు. లే ముందడుగు వేసి మందిలోకి రా... ఇంకో నిమిషం తరవాత వదిలి పొమ్మన్నా పోవు. నీలో భయం బయటపడడానికి భయపడుతుంది. సిగ్గు సిగ్గుపడుతుంది. ప్రతి పనికీ నువ్వు పనికిరావని సన్నాయి నొక్కులునొక్కే నీలోని సంకోచం సంకోచం చెందుతుంది. నీ ఆత్మవిశ్వాసం కాలరెత్తుకు బయటికి వస్తుంది. ఈ తెరవేలుపుల స్వర్గసీమలో ప్రవేశించడానికి మార్గంలో వాతావరణం ఎలాటిదో దాని ప్రభావం ఏమిటో తెలుసుకోడానికి నన్ను స్పుట్నిక్కుగా వాడుకో. నా వెనకాలే రా. షార్క్‌స్కిన్ చొక్కా గాబర్డిన్ లాగూ, రిస్టువాచీ ఉంగరం సర్దుకో. అవే ఈ వాతావరణం నీకు హానిచెయ్యకుండా రక్షించే కవచకుండలాలు. జేబులో పర్సే నీకు షాకు ఎబ్జార్బర్. లే. కాలరెత్తుకో. మొహాన టెక్కు తగిలించుకుని టెక్కెంగా ఎగరేయ్ - చిన్నవాళ్ళు ఎదురైతే హంగుచెయ్యి. పెద్దలయితే తగ్గిపోయి స్నేహం నటించు. పద. రాజా నీకు జయమగుగాక... బైదిబై గేటులో గూర్ఖావాడి దగ్గర జంకకేం!" అంటూ ముందడుగు వేశాడు రాయుడు.

పది నిముషాలలో ఇహలోకాన్ని మర్చిపోయాడు రాజు. ఇంకా సినిమా ఆరంభం కానందువల్ల పెందరాళే వచ్చిన పెద్దలంతా మేడమీద వరండాలో తిరుగుతున్నారు. చిరునవ్వు, సానుభూతి, గర్వం, కృతజ్ఞత, ప్రేమ, పరాకు, చిరాకూ పెదిమలమీద, కళ్ళక్రింద గీతలమీద, ముక్కు పుటాలమీద, మెడమీద, కళ్లలోను, కనురెప్పలమీద, భ్రుకుటిమీదా తగిలించుకుని, ఒళ్ళంతా కళ్ళున్న

దేవరాజారావులమల్లె తిరుగుతున్నారు జనం. అర్ధనారీశ్వరుడి వేషం కట్టే భాగవతుడి ముఖాన తెరలాగే వీళ్ళూ సందర్భోచితంగా భావప్రకటన నిస్తున్నప్పుడు అన్యభావాలను దాచెయ్యడానికని దేవతావస్త్రాలతో నేసిన మేలితెరల పొరలు సిద్ధంగా ఉంచుకున్నారు. జీవిత నాటకంలో మహానటులను ఎన్నికచేసి సన్మానం చెయ్యాలనుకునే వాడి పని అసాధ్యం అనిపించేటంత మెలకువతో - క్షణంలో సగంలో మోస్తర్లు మార్చగల కెలడొస్కోపుల గాజుపూసల చైతన్యంతో హావభావాలను ఆవిష్కరిస్తున్నారు. తెరలు మరీ పల్చన అనిపించినపుడు కొన్ని భావాలను దాచటానికి భాషను ఉపయోగిస్తున్నారు. కొందరు అతిశయోక్తులలాంటి వస్త్రాలు ధరించారు. కొందరు వందిమాగధులను తొడుక్కున్నారు కొందరు వినమ్రతని వల్లెవాటు వేసుకున్నారు. నా కసలు గర్వం లేదన్న గర్వంకొద్దీ కొందరు బనీను తొడుక్కువచ్చేసి వాటి చుట్టూరా "ఇక్కడ చొక్కా వుండాలి నిజానికి" అనీ చూచించే లైన్ స్కెచ్ తొడుక్కున్నారు.

అందులో ఈదుకుపోతూ ఉండగా రాజు హఠాత్తుగా తన భుజం చూసుకుని 'ఇదేమిటిది' అని అంతలోనే "అరే, ఎగిరిపోయాయే" అని ఆశ్చర్యపోయాడు.

"అవి చూపులు, అంతేలే. తూనీగల్లాంటివి. పూలవనంలో తుమ్మెదల్లాంటివి. బొమ్మల కొట్టులో పిల్లాడి లాంటివి. చీరల దుకాణంలో ఆడదాని వంటివి. వంద సినిమాఛాన్సుల మధ్య వర్ధమాన నటుడి వంటివి. అవి ఎక్కడా నిలవలేవు" అన్నాడు రాయుడు మెల్లిగా నవ్వుతూ.

'చూడు రాజా చూడు. చూసి నేర్చుకో. రంగులు కలపడం, మార్చడం నేర్చుకో. పసుపుమీద నీలంవేస్తే ఆకుపచ్చ! నిజంమీద అబద్ధం చరిస్తే కల్చరు అవుతుంది. అదిగో ఆయన చూడు. ఆయనకి మన వెనకాయనంటే మంట. అయినా నవ్వుతున్నాడు భక్తితో... అసూయ మీద ప్రేమ అలికితే బిజినెస్... విను... ఈ పాతాయన ఆ కొత్తాయనని మెచ్చుకుంటున్నాడు. బాధకి చాలీచాలని ఠీవిని కప్పితే దైన్యం. ఎదటివాడి దైన్యం మీద హేళన ఒంపితే హైన్యం. విషాదంమీద చిరునవ్వు తెరవేస్తే కరుణ.

"విను... రాజా... విను. కబుర్లు విను. హలోసార్! మీ ట్యూనుని... గారు కొట్టేసి వాడేసుకుంటున్నారు కేసు పెట్టరాదూ. ఈన కేసుపెట్టి రచ్చకెక్కిస్తే బొంబాయి వాడూ, వాడూ కేసువేస్తే హాలివుడ్ వాడూ కేసులు వేసెయ్యరూ?....

ఆయన ఒక పల్లవి కడితే అది పది పిల్లల్ని పెడుతుంది. హలో. నమస్తేసార్ మీ మాటే. మీ పల్లవి మోతగా ఉందనీ... నమస్కారమండోయ్ కులాసా? హి... హి... చూళ్ళేదు. గుడ్డీవె నమస్తే! మీ మాటే! దయ లేదంటున్నాను. మూడు రోజుల్నుంచీ మిమ్మల్ని చూడాలని.... హలో! కులా..."

రాయుడికి తెలిసినాయన కనిపించాడు. హలో అన్నాడు రాయుడు.

"ఏం బ్రదర్" అన్నాడు రాయుడి నేస్తం ఇతని వంక చూడబోయి. కాని ఆ చూపు చూస్తూవుండగానే రాయుడి భుజంమీంచి ఎగిరి, వెనకాల వున్న ఇంకో

పెద్దాయన కళ్ళమీద వాలింది. రాయుడు తన నేస్తం కోసం చెయి జాచి ముందుకు వెళ్ళబోయాడు. నేస్తం నేరుగా వచ్చి ఇతన్ని ఢీకొని, సారీ అని, వెనకాయన దగ్గరికి వెళ్ళబోయి, ఇంతలోకే ఆయన ఇంకెవరి వేపో చూస్తూ హిప్నొటైజ్ అయి ఎటో పోతున్నందువల్ల వెనక్కి తిరిగి రాయుణ్ణి పలకరించబోయి, మానేసి, ఎవరో తారని చూసి నమస్కారం విసిరి, అది గమ్యస్థానం చేరకుండా మధ్యలో కిందపడినందువల్ల, దాన్ని తీసుకు దులిపి ఇంకెటో విసిరి....

❀ ❀ ❀ ❀

"రాజుగారూ మనం లోపలికి పోదాం పదండి సీట్లుండవు" అన్నాడు రాయుడు.

"హల్లో రాజూ" అంటూ ఎవరో అడ్డుపడ్డారు.

'తిథి' మొదలైన ఆరునాటకాల రచయిత అయిన ముత్యం!

ఇద్దరూ గబగబా ఆశ్చర్యపోయాక ముత్యం తన సంగతి టూకీగా చెప్పాడు.

రాజు వెళ్ళిపోయాక అతనికేం తోచలేదు. పైగా రాజూ వాళ్ళ బామ్మ మంచంపట్టి చిక్కి సగమైపోయింది. ఉత్తరం రాయడానికి ఎడ్రసు తెలీదు. అందుకని ముత్యం తిన్నగా మెడ్రాస్ వచ్చేశాడు. టిక్కెట్టు తనొక్కడికే కొన్నా, అదృష్టం ఎలాగో అతనికూడా వచ్చేసింది. ఆవిడ సిఫార్సువల్ల రాజుని వెదకడంలో తను కలుసుకున్న కొందరు తమిళ సినిమావాళ్ళు అతి ఆరునాటకాలూ కొనేసి డబ్బులిచ్చారు. అన్నీ దబుల్ వర్షన్ పిక్చర్లే. తను ఇలా దారుణంగా గొప్పవాడైపోతూ ఉండగా నిన్న రాత్రి తన ప్రొద్యూసరొకరు తనకి సుబ్బన్నని పరిచయం చేశారు. తను మామూలుగానే వరహాలరాజు సంగతి అడిగేసరికి "నాకు తెలుసు. వెధవ. మోసగాడు. ఇప్పుడే వెళ్ళగొట్టాం" అన్నాడు సుబ్బన్నగారు. "హారీనీ! మూడు లక్షల రూపాయల ఆస్తిపరుడికి ఎంత అవమానం జరిగిందీ" అన్నాడు తను. అంతే ఆ మాటతో సుబ్బన్నగారు మూర్ఛపోయారు. పొద్దున్న లేచిం దగ్గిరనించీ వెతుకున్నారు. ఇందాకళే వాళ్ళమ్మాయి నరసు రాజుకు హాని జరగదని ఒట్టు పెట్టించుకు చెప్పింది - ఇలా రాజూ రాయుడూ పారగన్‌లో ప్రెష్షోకెళ్ళారు అని. అందరూ పరిగెత్తుకొచ్చారు అదీ కథ. ఇదిగో సుబ్బన్నగారు.

రాజు పక్కకి తిరిగి చూశాడు. సుబ్బన్నగారు కటుకూ కటుకూ నాలిక్కొరికేసుకుంటున్నాడు.

"నిన్ను అలా చేసినందుకు పశ్చాత్తాపం. ఒద్దన్నా మానటంలేదు నాలిక కరుచుకోడం" అన్నాడు సుబ్బన్నగారి వందిమాగధులు. అని సుబ్బన్న జెబ్బ పట్టుకున్నాడు లేపోతే ఆయన భోరున ఏడ్చి రాజు కాళ్ళమీద పడిపోయేవాడే.

❀ ❀ ❀



# స్వర్గారోహణ పర్వము

అందరూ లోపల కూర్చున్నాక సుబ్బన్నగారు క్షమాపణ చెప్పుకున్నారు. "వెంఠనే పిచ్చరు తీద్దాం. అల్లుడా నువ్వేం చేస్తావు చెప్పు. హీరో వేస్తావా? నాగేశ్వర్రావుకి ఛాన్సు ఇస్తావా. పోనీ రాస్తావా? నచ్చకపోతే సముద్రాల సీనియర్‌ని ఎంకరేజ్ చేదాం. డైరెక్షను చేస్తావా? వద్దంటే కె.వి. ని పైకి తెద్దాం. కమాన్ చెప్పు." అన్నాడు ఉత్సాహంగా.

"నేను పిచ్చరు తియ్యనండి. మావూరు పోతా" అన్నాడు రాజు వాళ్ళ బామ్మని తలచుకొని.

సుబ్బన్నగారు కొయ్యబారి తేరుకుని "ఛంపేవు అల్లుడా! పిచ్చరు తీసి తీరాలి. నీలాంటి యువరక్తం కావాలి ఫీల్డుకి. నే నప్పుడే నీ ఆసరా చూసుకుని మన కంపెనీకి డిస్ట్రిబ్యూషన్ మాట్లాడేశా. అపుడే ఫస్టు ఇన్‌స్టాలుమెంటు డబ్బు తీసుకొని కొత్తకారుకి ఎడ్వాన్సు కట్టాను. ఇపుడు నువ్వు మతాబా కాల్చేస్తే చచ్చేనే ఆ డబ్బంతా మళ్ళీ ఎక్కడ తేను–" అన్నాడు.

రాజు ఆలోచించి, చివరికి సరే అన్నాడు. కాని ష్టోరీ మా ముత్తెంచేత రాయించాలి అన్నాడు.

"సారీ గురో నాకు టైములేదు. నేను థర్టీన్ ఫిలింస్‌కి రాస్తున్నాను. జూన్ 1984 దాకా ఆగితే నీకు రాస్తాను" అన్నాడు ముత్తెం.

"రేటు అయిదూ ప్లస్ పదహైదు. రెండో అంకె బ్లాకు" అన్నాడు అతని తాలూకు వంది మాగధరావు.

"ఓరి బాబోయ్; చూస్తూ ఉండగా ఎంత వాడివయ్యావు "

"నువ్వు చూళ్ళేదుగా" అన్నాడు ముత్యం బ్రిలియంట్‌గా.

"నాకన్న వెనక–"

"–వచ్చిన కొమ్ములు వాడి" అన్నాడు ముత్తెం మరీ బ్రిలియంట్‌గా.

"సెబ్బాష్" అన్నాడు వంధిమాగధులు ఆనందం పట్టలేక.

❀ ❀ ❀ ❀

ప్రదర్శనం ఆరంభమైంది. సుబ్బన్న, రాజు చెవిలో ప్రొడక్షన్ ప్రోగ్రాం అంతా ఏకరువు బెడుతున్నాడు.

రెండో రీలులోనే హీరో వచ్చాడు. "నా హృదయాన్ని నీకు–" అన్నాడు క్లోజప్‌లో.

"అర్పిస్తున్నాను" అన్నాడు మిడ్ షాట్‌లో. ఎటొచ్చీ ఈ రెండో షాట్ ఉన్న ఫ్రేములో అతని బొమ్మ కనిపించనేలేదు. అతను ఉండవలసినంత మేరా నల్లగా కాళీగావుంది. మిగతా భాగంనిండా హీరోయిను వుంది. ఆ తరవాత కూడా హీరోబొమ్మ కనిపించటం లేదు. అతను వుండే మేర కాళీగానే వుంటోంది.

అదేమిటి అన్నాడు రాజు.

"హీరో, వరసగా ఇరవై కాల్‌షీట్లకు గైరుహాజరై పోయాడు. మిగతావాళ్ళు వచ్చినందువల్ల హీరో చోటుని మాస్క్ చేసి ఫిలిం చేసేశారు" ప్రొడ్యూసరు.

'ఇలా ఎన్ని రీళ్ళుంది' అన్నాడు రాజు.

"పన్నెండూ, అయితేనేం. డబుల్ కాల్‌షీట్లు పెట్టి రెండురోజుల్లో తీసి కలిపేస్తాంలెండి. రిలీజు అవతలెల్లుండిగా. ఆర్టిస్టు పెద్దవాడు. ఇట్టే నటించేస్తాడు" అన్నాడు ప్రొడ్యూసరు.

"అయిడియ" అన్నాడు ముత్యం హఠాత్తుగా.

"రాజూ! మన వూళ్లో ఓసారి ఇలాగే ఫిలింవేస్తూ ఉంటే ఒక యాక్టరు ఊడిపోయాడు. గుర్తులే? వాణ్ణి మనం మళ్ళీ ఆ కాళీలోకి ఎక్కించేశాం... నువ్వు ఈ పిక్చర్లో కాళీ ఎంతుందో అంతే ఉన్నావు కదా?"

'సెబాష్' అన్నాడు వందిమాగధులు.

"జనాను అల్లుడా ప్రొడ్యూసరుగారికి అభ్యంతరం లేకపోతే ఈ కాళీలోకి నువ్వెక్కిపో. నేనూ మన డిస్ట్రిబ్యూటరూ, నీ బలగం అంతా కలిసి నిన్నుపైకి తోసేస్తాం. అందులో ఎక్కిపో" అన్నాడు.

ప్రొడ్యూసరుగారు రెడీయే అన్నారు.

"మరి పదమూడో రీలులోంచి పాతహీరో వస్తాడే. ఎలా కలుస్తుంది" అన్నాడు రాజు.

"దానికేం ఫరవాలేదు. నీకు ఎవడో రుషి శాపంయిచ్చి నువ్వింక నుంచి ఫలానా హీరోలాగా కనిపించుగాక అని శాపం ఇస్తున్నట్టుగా ఓ రెండొందల అడుగుల ఫిలింతీసి పన్నెండో రీలు చివర అతికిస్తే సరి!" అన్నాడు ముత్యం.

"బెస్టు. మామూలుగా హీరోలు రెండేసి రోల్సు వేస్తే, మనదాంటో ఇద్దరు హీరోలు ఒకరోలే వేశారని పబ్లిసిటీ చెయ్యొచ్చు" అన్నాడు ప్రొడ్యూసరు.

ఇకనేం పదండంటే పదండన్నారు. అంతా కలిసి తెరదగ్గిర కెళ్ళారు.

ప్రేమ ఘట్టం జరుగుతోంది. "కొంచెం ఆగండి. నాకు సిగ్గేస్తూంది హీరోయిను గబుక్కున నువ్వెవరనొచ్చు" అన్నాడు రాజు.

తరవాత సీనులో తుపాను. హీరో ఉండాల్సినచోటు బండకి అంటిపెట్టుకుని వణుకుతోంది తెర ఉరిమింది. పిడుగు పడింది. భోరున వాన. హోరునగాలి.

"స్థిమితంగా ఉంది. ఎక్కిపో. గుడ్‌లక్" అన్నాడు ముత్యం.

రాజు బలగం అతన్ని పైకెత్తి హీరోకాళీలోకి తోసేసింది.

చేతులు దులుపుకుని అంతా మళ్ళీ వచ్చి బాల్కనీలో తృప్తిగా కూర్చున్నారు.

తెరమీద హీరో కాళీలో రాజు సద్దుకుని ఝూంమని నటించేస్తున్నాడు.

"మనవాడు గట్టివాడే" అన్నాడు ముత్యం, అన్నాడు సుబ్బన్న, అన్నారు వాళ్ళిద్దరి వందిమాగధులిద్దరూ.

ప్రొడ్యూసరు, అవతలికి వెళ్ళి తన కంపెనీకి టెలిఫోనుచేసి వచ్చాడు.

❀ ❀ ❀ ❀

దూరంగా సినిమాపేటలోని ప్రొడక్షన్ ఆఫీసులో కునికిపాట్లుపడుతూ కూర్చున్న పబ్లిసిటీ అసిస్టెంటు, లేచి ఆవలించి, సిగరెట్టుముట్టించి ఫోనులో ప్రొడ్యూసరు ఇచ్చిన ఆజ్ఞప్రకారం, పత్రికకు పంపడానికి కొత్త హీరో వరహాలరాజు గురించి పాంప్లెట్ తయారుచేయడం మొదలెట్టాడు.

"వెండితెరకు ఎక్స్‌ఫిలింస్ వారు సమర్పించు కొత్త హీరో... గారు (ఊరు....) చలన చిత్రజగతి ప్రగతికే హీరో కాగలవాడు, ఈయన కవి, రచయిత, గాయకుడు, సంగీత దర్శకుడు మొ॥ బహుశా హీరో పనేకాక, తీరిక వేళలో మిగతా కవి, గాయకుడు, డైరెక్టరుల పాత్రలూ నిర్వహించవచ్చు. అసలు బాల్యమునుండి ఈ నవయువ... కి....?. ఉగ్గుపాలతో పెట్టిన విద్య,

ఎక్స్ ఫిలింస్ వారి బ్రహ్మాండమైన తాజా పౌరాంఫిక జానపద చిత్రంలో... గారు సాంఘిక హీరోగా అత్యద్భుతమైన నటన ప్రదర్శిస్తున్నారు. చిత్రం విడుదల అయి కొన్ని సన్మానాలు కాగానే వీరి నటన మహోత్తమంగా ఉన్నదని పలువురు ప్రశంసించ సంసిద్ధంగా ఉన్నారు.

.. గారు యావద్భారత.?. కాగలరనడానికి ఎంథో సందేహము లేదు... ... అని శ్రీయుత . .. గారు అన్నారు. శ్రీయుత.. గారు చాలా గొప్పవారని డా॥... ... గారూ, కొందరు దొరలూ లోగడ చెప్పడం లోకవిదితమే

డా॥ ... గారూ కొందరు దొరలూ కూడా ఎంతో చాలా గొప్పవారని ఎక్స్ఫిలింస్ వారి కొత్త... ... శ్రీ. . గారు చాలాసార్లు అన్నారు!

శ్రీ....గారు నవయువకులు. వీరు బాల్యమునుండే .... .... ....



# రచయిత గురించి



"ఈ భూప్రపంచంలో ఎదుటివాడిలో కృతజ్ఞత ఆశించే కన్నా ఆంధ్రరాజకీయ నాయకుల్లో ఐకమత్యాన్ని ఆశించు... ఆంధ్రుల్లో కార్యశూరత్వాన్ని ఆశించు" అంటూ ఓ కథలో సెటైర్ కొరడాతో తెలుగువాడిని చమడాలొలిచిన వ్యక్తి ముళ్లపూడి వెంకట్రావ్... అతడే తర్వాత్తర్వాత ముళ్లపూడి వెంకటరమణగా మారిన వ్యక్తి. నవ్వడం నవ్వించడం పోయి నవ్వుల పాలైన తెలుగువాడి బతుకుల్లో హాస్యం పన్నీటి జల్లు చిలకరించడం - 1945 లో మొదలెట్టినా - 1950 నుండి దీక్షతో ఆరంభించిన వ్యక్తి ముళ్లపూడి.

తెలుగు సాహిత్యంలోని నక్షత్రకుడి పాత్రను కౌంటర్ చేసే అప్పారావు పాత్రను సృష్టించి, తెలుగువాడు ఆజన్మాంతం తనకు ఋణపడేలా చేసుకున్న వ్యక్తి - ముళ్లపూడి వెంకట "ఋ"మణ.

నిరాశా, నిస్పృహలు, అడ్డంకులు, అవమానాలు, అదలింపులు, బెదిరింపులు, అసూయలూ, అణచివేతల మధ్య తెలుగువాడి జీవన సంఘర్షణ సాగుతుండడం గమనించి హాస్యాన్ని ఊతకర్రగా అందించాడు. వ్యంగ్యం ద్వారా తెలుగువాడి చూపుకు నైశిత్యాన్ని - హాస్యం ద్వారా తెలుగు "వాడి పలుకు" కు నైర్మల్యాన్ని ప్రసాదించాడు. గాంభీర్యం, గడుసుదనం, వాదన, వేదన కలగలిపి, రస హృదయం, సరస హృదయం రంగరించి, జీవన సాగర మథనంలోంచి పుట్టిన అద్భుత గుళికల్లాంటి ఉపమానాలను జతచేసి తన రచనలన్నింటా మానవత్వం జెండా ఎగరేసిన వ్యక్తి ముళ్లపూడి. 1931 జూన్ 28న తూర్పు గోదావరి జిల్లాలో పుట్టిన వీరికి 1945లో బాపుగారితో స్నేహం కలిసింది. పదాలతో చిత్రరచన చేసేవారికి, పదాలకు బొమ్మ కట్టే వారి సాన్నిహిత్యం లభించినట్లైంది. ముళ్లపూడి వారు రచయితగా ఉన్నా, స్క్రిప్టురైటర్‌గా ఉన్నా, పత్రికా రచయితగా పని చేసినా అన్నిటా రమణీయ ముద్రను పసిగట్టగలం. వీరి రచనలకు ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలెన్నో పురస్కారాలందించాయి. ఆయన సృష్టించిన పాత్రలే వారిని ఎవర్‌గ్రీన్ రచయితగా నిలబెడుతున్నాయి. తెలుగువాళ్ళకు గిరీశం ఎలా తెలుసో - బుడుగూ అంతే. నవ్వుతో బాటు రెండు కన్నీటి బొట్లు కూడా రాల్పించేదే నిజమైన హాస్యం. ఆ "హాస్యం ముళ్లపూడి వాడి, వేడి, తాకిడికి ఈడేరిందన్న" మాట అక్షర సత్యం.